# శారదా మంజీరము

[ రజతోత్సవ వ్యాస సంపుటి ]

సంపాదకులు

ఎన్. సి. యస్. వేంకటాచార్యులు

డా. అమరేశం రాజేశ్వరశర్మ, ఎమ్.ఏ.

తొలిపలుకు

శ్రీ పి. వి. నరసింహారావు, బి.యస్‌సి., ఎల్‌ఎల్.బి.

సాహిత్యరత్న

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు

గోలి ఈశ్వరయ్యా

వ్యాపారసంస్థ రజతోత్సవ సందర్భమున

ప్రకాశితము



పీఠికాకర్త

**మాన్య శ్రీ పి. వి. నరసింహారావు**

ఆంధ్రప్రదేశ విద్యాశాఖామాత్యులు

# తొలి పలుకు

శ్రీ గోలి ఈశ్వరయ్య నాకు చిరపరిచితుడు. ఆయన జీవితం స్వయంకృషికి ఉత్తమోదాహరణం. శైశవంలోనే తలిదండ్రులను కోలుపోయినాడు. వారసత్వంగా వచ్చినది ఏమీలేదు. అయినా ఆయన జంటనగరాల ప్రతిష్ఠితపురుషులలో ఒకడుగా ఎన్నికగన్నాడు. చేపట్టిన కాగితాల వ్యాపారంలో ఆయనకు పట్టినది బంగారము, ముట్టినది ముత్యము అయినది. నేడు ఆంధ్రప్రదేశ్ పేపర్ మర్చంట్స్ అసోసియేషన్‌లోనే కాదు— అఖిల భారత పేపర్ మర్చంట్స్ అసోసియేషన్స్ ఫెడరేషన్‌లో కూడా ఆయన ప్రముఖ స్థానంలో ఉన్నాడు. ఆయన వ్యాపారసంస్థరజతోత్సవసందర్భంలో ఈ వ్యాససంపుటి ప్రకాశితమవుతున్నది.

వ్యాపారసంస్థలు రజతోత్సవాలు, స్వర్ణోత్సవాలు చేసుకోడం సామాన్యంగా జరుగుతూనే ఉంటుంది. కాని ఈ విధంగా పండితులను, కవులను అర్థించి ఉత్తమ పరిశోధనాత్మక వ్యాససంపుటి ప్రకటించటం మాత్రం అరుదు. కాగితాల వ్యాపారానికి, వాఙ్మయ సృష్టికి ఉన్న అవినాభావ సంబంధం నిరూపించటమేగాక మునుముందు వ్యాపార సంస్థలవారికి ఒక అనన్యాదృశమైన ఆదర్శాన్ని చూపించినాడు శ్రీ ఈశ్వరయ్య.

ఈ సంపుటిలో ఉత్తమ విద్యాయోగ్యతలుగల విద్వాంసుల పరిశోధనాత్మక వ్యాసాలున్నవి. ఆంధ్రప్రదేశ్ నలుమూలలనుండి లబ్ధప్రతిష్ఠులైన రచయితల ఎన్నిక జరిగింది. సాహిత్యానికి సంబంధించినవేగాక వ్యాకరణానికి, భాషాశాస్త్రానికి సంబంధించిన వ్యాసాలు కూడా ఇందులో ప్రముఖంగా ఉన్నవి. మేలిరకం కాగితం, ముచ్చట గొలిపే ముద్రణ ఈ సంపుటికి ఒక విశిష్టత నాపాదిస్తున్నవి. ఈ సంపుటి విద్వాంసులకు, విద్యాభిమానులకు, గ్రంథాలయాలకు ఉపాదేయంగా ఉన్నది. ఇటువంటి సర్వాంగీణమైన వ్యాససంపుటికి సంపాదకులైన శ్రీ ఎన్. సి. యస్. వేంకటాచార్యులు, డా. అమరేశం రాజేశ్వరశర్మలను, ప్రకాశకులైన శ్రీ గోలి ఈశ్వరయ్యను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇతర వ్యాపార సంస్థలవారు కూడా మునుముందు ఈ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,

పి. వి. నరసింహారావు



శ్రీ గోలి ఈశ్వరయ్య

*హనుమకొండ సిద్ధేశ్వరగుట్ట*
*శాసనమునుండి*

# ఆన్ధ్రాః సన్తి గరీయాంసః

ఆన్ధ్రాః సన్తి గరీయాంసః కాంచనచ్ఛాయ శాలయః
యథా హాటక [నీ] తస్య [కోటరా] రత్న శాలినః.

కేదారా యత్ర శాలీనాం తరఙ్గిత జలాన్తరాః
కృష్ణాఙ్గ చ్ఛాయ హారీతా యథా జలనిధే స్తటాః.

శాలి సంరక్షిణీ హస్త తాళైః కఙ్కణ నాదితైః
త్రాసితాః కిల గచ్ఛన్తి యత్కీరా స్తద్గిరా జితాః.

రసాల సాల హిన్తాల తాల కేతక కేతనే
కాన్తారే యత్ర కాన్తానాం జాతః శృఙ్గార సఙ్గరః.

హాలికస్త్రీ కటాక్షాణాం కాన్తా గలిత చేతనాః
న జానన్తి కృషిం యత్ర కేచి త్కృషికనన్దనాః.

గతాని హాలికస్త్రీణాం శిక్షయన్తి నిజై ర్గతైః
నేత్రాణి నేత్రై ర్హంస్యశ్చ హరిణ్యశ్చ యదన్తరే.

ఏకా హ్యేకశిలాఖ్యాత్ర నగరీ యా గరీయసీ
సాగరాన్తాం ధరాం కృత్స్నాం తులాకాన్త్యా నిరస్యతి.

కళాగిరః కృశాఙ్గీనాం రశనాః కిఙ్కిణీ ఘనాః
యత్రాఙ్గదాని చాఙ్ఘ్రీణాం నిద్రాహాన్త్యై కిల శ్రియః.

చన్ద్రశాలా సంస్థితానాం చన్ద్రాస్యానాం నిరన్తరైః
యత్రాస్యచన్ద్రే గగనే చన్ద్రజ్ఞానం న శక్యతే.

శ్రీ ఎన్. సి. యస్.
వేంకటాచార్యులు

# రజతాక్షరి

ప్రతిభ యున్నచోట స్వాపతేయము సున్న
స్వాపతేయ మున్న ప్రతిభ సున్న
ఉభయ మున్నచోట ఉరుగుణంబులు సున్న
అన్ని యున్న వీశ్వరయ్యయందె.

బాల్యమున తండ్రి కరవైన, వారసత్వ
మేమి లేకున్న, ఈశ్వరుం డీశ్వరుండె
అని రుజువుచేసినాడు స్వయంకృషిమెయి
లక్ష లార్జించి తా పురప్రముఖు డగుచు.

తిరుపతివెంకన్న చరణసన్నిధిని గ
ట్టించినా డితడు కాటేజి యొకటి
శ్రీశైల మల్లీశు శ్రీపాదములమ్రోల
నిలిపినా డితడు భక్తులకు వసతి
వైశ్యహాస్టలు కట్టుబాటులో నొకచేయి
వైచినా డితడు నిర్వ్యాజ రక్తి
అల హృషీకేశమం దాంధ్రాశ్రమమున కం
దించినా డితడు దాతృత్వగరిమ

కంచి వేదాంతగురుని కైంకర్యమందు
పాలుగొనినా ; డితని దానశీల మనుభ
వించనిది జంటనగరాల వెలసినట్టి
ధర్మకార్యంబు లేదన్న తప్పులేదు.

మనసారగ రజతోత్సవ
మున పండితమండనీయమును సంపుటముఁ
ఘనత ప్రకాశింపగ జే
సిన యీశ్వరు కోడ లత్తచే మనిపించుఁ.



రజతోత్సవ సభాధ్యక్షులు

శ్రీ నూకల నరోత్తమరెడ్డి

# అనుక్రమణిక

## వ్యాసములు

# పద్యములు



శారదా మంజీరా విష్కర్తలు

న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు



శ్రీ గోలి ఈశ్వరయ్యగారు శారదామంజీరం సంపాదకులతో

శ్రీ ఎస్ సి ఎస్. వేంకటాచార్యులు, శ్రీ గోలి ఈశ్వరయ్య, డా. అమరేశం రాజేశ్వరశర్మ

# సంపాదకీయం

'పుణ్యై ర్యశో లభ్యతే' అన్నారు పెద్దలు. ఈ జన్మలో చూస్తాం: ఒక వ్యక్తి విషమపరిస్థితుల మధ్య జన్మిస్తాడు. నిచ్చెన మెట్లెక్కినట్టు అలవోకగా సాటివారిలో పైమెట్టు చేరుకుంటాడు. అతడి స్వయంకృషి అందరికీ అచ్చెరువు గొలుపుతుంది. పట్టుదల అతడి సహజాతంగా కనపడుతుంది. అంటే అతడి పూర్వ పుణ్యం విషమాలను సమీకరించి అతణ్ణి వర్చస్వినీ యశస్వినీ చేస్తుందన్న మాట. ఈ విశ్వసత్యపు స్వచ్ఛపటం మీద వ్యక్తమైనది శ్రీ గోలి ఈశ్వరయ్య జీవిత చరిత్ర. స్వచ్ఛ వర్తనకూ పట్టుదలకూ స్వయం కృషికీ వ్యక్తరూపం శ్రీ ఈశ్వరయ్య అనడం స్వభావ చిత్రణం మాత్రమే.

"విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత ?" అన్నాడు వేమన. దీనికి బింబ ప్రతిబింబ న్యాయంగా కనపడుతుంది శ్రీ ఈశ్వరయ్య వ్యాపారం. మర్రిచెట్టు కింద ఏదీ మొలవదంటారు. కాని ఇక్కడ మాత్రం శ్రీ ఈశ్వరయ్య వైశిష్ట్యం 'త్యాగాయ సంభృతార్థానామ్' అన్న కవి కులగురువు సూక్తి ననుసరిస్తున్నది. 'ధర్మచెయ్యి' దాగదు గదా !

ఏవం విధ విశిష్ట లక్షణ లక్షితుడైన శ్రీ ఈశ్వరయ్య వ్యాపారానికి రజతోత్సవం జరగడం ఒక సామాన్య విషయం. స్వర్ణోత్సవ వజ్రోత్సవాలు అహమహమికతో ఎదురుచూస్తున్నవనటం తథ్యం. 'సత్యా ఏతా ఆశిషః సన్తు'.

అన్నిట్లోలాగానే శ్రీ ఈశ్వరయ్య రజతోత్సవ సందర్భంలోనూ ఇతరులకు మార్గదర్శకమైన పంథాను చూపించాడు. కాగితాలకూ కవులకూ ఉన్న అన్యోన్యాశ్రయాన్ని అవినాభావం చేశాడు. అతని

సాహిత్య సేవానురక్తికి ఈ శారదా మంజీరం నిదర్శనం. ఈ రూపంగా శ్రీ ఈశ్వరయ్య విద్వాంసులను, కవులను, చిత్రకారులను భూరి సన్మాన పాత్రులనుగా చేసి శారదా ప్రీతి పాత్రుడు కావడం అతని ధన్యతకు తార్కాణం.

వివిధ కార్యాంతర వ్యగ్రులై యుండి కూడా కోరగానే ఉత్తమ పరిశోధన వ్యాసాలతో ఈ మంజీరం రూపకల్పనలో దివ్య దీధితులు కూర్చిన విద్వాంసులకూ, కవీంద్రులకూ, చిత్రకారులకూ సంపాదకులుగా మేమూ, ప్రకాశకుడుగా శ్రీ ఈశ్వరయ్య హార్దిక కృతజ్ఞతాంజలు లర్పిస్తున్నాము. ఈ సంపుటి నిర్వహణలో దోషా లేమైనా ఉంటే అవి మా పాలు. గుణకోటి సహృదయుల పాలు.

"ఆదిరాజ యశోబింబ । మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్ । తేషా మసన్నిధానేఽపి । న స్వయం పశ్య నశ్యతి" అనే ఆలంకారి కోక్తి శ్రీ ఈశ్వరయ్య ఎడల సత్యం కాగలదని ఆకాంక్షిస్తున్నాము. శ్రీ ఈశ్వరయ్యకూ, ఆయన పుత్రులు రమేశ్, నందకిశోర్, శివకుమారులకూ, బహిఃప్రాణం శ్రీ తేలుకుంట్ల రాములుకూ, ఆయన కుమారుడు కృష్ణమూర్తికీ, వీరి ఆంతరంగికులు శ్రీ గోలి వేంకటేశం, శ్రీ బాలరాజయ్యలకూ శ్రియఃపతి నిత్యకల్యాణం పచ్చతోరణమూ చిరాయురారోగ్యాలూ కాంక్షాధికంగా ప్రసాదించుగాక !

సహజమైన తమ సాహిత్యాభినివేశం వల్ల మేము కోరినంతనే తమ అమూల్య సమయంలో కొంత ఈ సంపుటికి పీఠిక వ్రాయ టానికి వినియోగించి మా కృషిని సఫలంచేసిన మన ప్రియ విద్యా శాఖామాత్యులు మాన్యశ్రీ పి. వి. నరసింహారావుగారికి మేమెంత కృతజ్ఞత చెప్పుకొన్నా తీరదు. శ్రీవారి ఇతోఽధికాభిమానాన్ని సారస్వతేయులు చిరకాలం చూరగొనే సదవకాశం శ్రియఃపతి ప్రసాదించుగాక !

ఇన్ద్ర ! శ్రేష్ఠాని ద్రవిణాని ధేహి
చిత్తిం దక్షస్య సుభగత్వ మస్మే
పోషం రయీణా మరిష్టిం తనూనాం
స్వాద్మానం వాచః సుదినత్వ మహ్నామ్.

ఋగ్వేదం. 2.21.6



సర్వశ్రీ బచ్చులింగయ్య, కొమ్మావీరయ్య, గోలి ఈశ్వరయ్య



శ్రీ గోలి ఈశ్వరయ్య, శ్రీ తెలుకుంట రాములు

శ్రీ అమరేశం
రాజేశ్వరశర్మ

# పుణ్యశ్లోకస్య కీర్తనమ్

ఈనాడు జంటనగరాలలోని వర్తక ముఖ్యుల్లో సముచిత స్థానం సంపాదించు కొన్న శ్రీ గోలి యీశ్వరయ్యగారు గొప్ప శ్రీమంతు లన్నమాట నిజమే కాని ఆగర్భ శ్రీమంతులు మాత్రం కారు. గద్దెమీద గూర్చుండి వ్యవహారాన్నంతటినీ నేడు కను సన్నలమీద సాగిస్తున్న శ్రీ యీశ్వరయ్య గారు యజమానిగా మాత్రమేకాదు సహకారిగా పనిచేసిననాడుకూడ మెప్పు పొందినవారు.

శ్రీ యీశ్వరయ్యగారి అభివృద్ధి వెనుక గొప్ప స్వయంకృషి, ఆత్మవిశ్వాసము, సమ యజ్ఞత ఉన్నవి. అందుకే లక్షలమీద వ్యాపారం సాగిస్తున్నా శ్రీ యీశ్వరయ్య గారిలో గర్వంగానీ, ఆడంబరంగానీ కాన రావు. ఆయన అభివృద్ధికి అదృష్టము తోడు పడినమాట నిజమే కాని అదృష్టాన్నే నమ్ము కొని ఆత్మశక్తిని వినియోగించని అమాయ కుడు కాడు ఆయన. అయినా ఇదంతా తన పురుషార్థమే అనే దైవ వైముఖ్యాన్ని శ్రీ ఈశ్వరయ్యగారిలో చూచాయగా నైనా చూడలేము.

ఈశ్వరయ్యగారి యిల్లు పిల్లపాపలతో సిరిసంపదలతో చూడముచ్చటగా కాన వస్తుంది. వ్యవహారంలో ఈశ్వరయ్యగారి జాతక మెటువంటిదో యింటి విషయంలో గూడా అటువంటిదే. పట్టినది బంగారంగా ముట్టినది ముత్యంగా కొనసాగిన అభివృద్ధి యీశ్వరయ్యగారిది.

ఈశ్వరయ్యగారి పూర్వీకులది హైదరా బాదుకు ఇరవైమైళ్ళ దూరంలోఉన్న 'మేడి చెలమ' అనే గ్రామము. ఈశ్వరయ్యగారి తండ్రి గోలి నరసయ్యగారు ఆ ఊరిలోనే చిన్న వ్యాపారంతో జీవిక సాగిస్తూఉండే వారు. ఈశ్వరయ్యగారి తల్లిపేరు మహాలక్ష్మి. కామాక్షమ్మ, గౌరమ్మ, రంగమ్మ అనే ముగ్గు రక్కల తరువాత కలిగిన పురుష సంతానము ఈశ్వరయ్యగారు. సంపాదన గొప్పది కాక పోయినా నరసయ్యగారు ఊరిలో పదిమంది చేత మంచివాడని పేరుపొంది కాలము గడి పినవాడు. కాని ఆ తండ్రి అండకూడ ఈశ్వ రయ్యగారికి చాలకాలము మిగులలేదు. మూడేండ్లవయసులోనే ప్లేగువ్యాధికి గురిఅయి తల్లితండ్రు లిద్దరూ అకాలమృత్యువు వాత బడితే పెద్దక్క కామాక్షమ్మ కొంత కాలము ఈశ్వరయ్యను పోషించింది. కామాక్షమ్మ కూడా ఎంతోకాలం బతకలేదు. ఆ తరువాత ఈశ్వరయ్యను చిన్నక్క రంగమ్మ తీసికొని పోయి పెంచి పెద్దచేసింది.

రంగమ్మ భర్త శ్రీ కొమ్మా వీరయ్యగారు సికిందరాబాదులో నిజాం రైల్వేలో ఉద్యోగి. ఈశ్వరయ్య అక్క, బావల యింటిలో ఉండి వీధిబడి చదువు ముగించినాడు. పదకొండు

పన్నెండేండ్ల వయసువరకు ఇదీ గోలీ యీశ్వరయ్యగారి జీవితము.

కొమ్మా వీరయ్యగారి బావగారు శ్రీ బచ్చు లింగయ్యగారు. అప్పుడు వారు సికిందరాబాదులో ఒక దుకాణంలో గుమాస్తా. కాని బచ్చు లింగయ్యగారు ఆ దుకాణంలో ఉద్యోగం మానివేయా లనుకొన్నందువల్ల అటు లింగయ్యగారికీ ఇటు ఈశ్వరయ్యగారికీ ఉపయోగకరంగా ఉంటుందని 1929 లో అగ్గిపెట్టెల, కాగితాల దుకాణం శ్రీ కొమ్మా వీరయ్యగారు తన పెట్టుబడితో ప్రారంభించి నారు. ఆ దుకాణంలో భాగస్వామిగా బచ్చు లింగయ్యగారు, సహకారిగా గోలి యీశ్వరయ్యగారు జతగూడినారు. మొదట్లో కొంత కాలం బచ్చు లింగయ్యగారి పర్యవేక్షణలో కొట్టులోని వ్యాపారమంతా యీశ్వరయ్యగారే నిర్వహించవలసివచ్చింది. శ్రీ లింగయ్యగారు రోజూ వచ్చి సలహా లిస్తూండేవారు. ఆయన సలహా ప్రకారం వచ్చినవారికి సరకీయడం, డబ్బు తీసుకోవడం, రసీదులు వ్రాయడం యీ పనంతా యీశ్వరయ్యగారే చూచేవారు. ఈ విధంగా అయిదు ఆరు మాసములు నడిచి నవి. తరువాత బచ్చులింగయ్యగారి ఆధ్వర్యంలో దుకాణం నడవసాగింది. తరువాత ఆ దుకాణంలోనే ఈశ్వరయ్యగారు రెండణాల భాగస్వామియైనారు. మఱి మూడేండ్లలో క్రమంగా ఈశ్వరయ్యగారిది ఆ దుకాణంలో నాలుగణాల భాగమయింది. 1937 నుండి 1945 వఱకు నాలుగణాలభాగంతో బచ్చు లింగయ్యగారితో పాటుగా ఈశ్వరయ్యగారు కొమ్మావీరయ్యగారి దుకాణంలో పనిచేసినారు. 1945లో శ్రీ లింగయ్యగారు, ఈశ్వరయ్యగారు కూడా తమ స్వంతదుకాణములను ప్రారంభించినారు. ఈ విధంగా గోలి యీశ్వరయ్యగారి ప్రస్తుతదుకాణం 19-10-'45 నాడు ఇప్పుడున్న ప్రదేశంలో ప్రారంభమయింది.

కొత్తదుకాణం ప్రారంభించేనాటికి యీశ్వరయ్యగారు "స్వయంరాజా స్వయంమంత్రీ". పొద్దున్నే లేవడం, సైకి లొకటి తీసుకొని, ప్రెస్సులకూ ఆఫీసులకూ పోవడం, కాగితానికి ఆర్డర్లు సంపాదించడం, మధ్యాహ్నం తిరిగివచ్చి ఆ సరకు సప్లయిచేయడం, ఇదీ యీశ్వరయ్యగారి దినచర్య. కాని మూడు నెలల్లోనే యీశ్వరయ్యగారి కార్యభారం కొంత తగ్గింది. తోడల్లుడు శ్రీ తేలుకుంట రాములుగారు ఈశ్వరయ్యగారి వ్యాపారంలో భాగస్వామిగా చేరినారు. ఆయన తేలుకుంట్ల వారి బియ్యపు దుకాణంలో ఉండేవారు. కాని ఈ వ్యాపారంలో మెలకువలన్నీ కొద్దిరోజుల లోనే గ్రహించుకొని వ్యాపారాభివృద్ధికోసం అవిరళకృషి చేసినారు. రాములుగారు దుకాణంలో ఉన్నప్పు డీశ్వరయ్యగారూ, ఈశ్వరయ్యగారు దుకాణంలోఉంటే రాములు గారూ సైకిలుమీద తిరిగి ఆర్డర్లు సంపాదిస్తూ వ్యాపారం సాగిస్తూ వుండేవారు. ఇట్లా ఏడాది సైకిలు సంచారం జరిగింతరువాత మోటారు సైకిలు సంచారం ప్రారంభమయింది. మూడు నాలుగేండ్లలో మోటారుసైకిలు స్థానంలో మోటరుకారు వచ్చింది. కారల్లా కార్లయినవి. వ్యాపారం మూడుపూవులూ ఆరుకాయలూగా దినదినాభివృద్ధిపొందింది. ఈనాడు పాతిక సంవత్సరములు పూర్తియై వారి దుకాణానికి రజతోత్సవము జరుగుతున్నది. ఈశ్వరయ్య



శ్రీ గోలి ఈశ్వరయ్యగారి సికింద్రాబాదు వ్యాపారసంస్థ బృందము

కూర్చున్నవారు (ఎ నుండి కు.): శ్రీ గోలి శివకుమార్, శ్రీ గోలి రమేశ్, శ్రీ గోలి ఈశ్వరయ్య, శ్రీ తేలుకుంట రాములు, శ్రీ తేలుకుంట కృష్ణమూర్తి, శ్రీ గోలి నందకిశోర్.

నిల్చున్నవారు (ఎ నుండి కు.): శ్రీ చీలా రాజయ్య, శ్రీ చర్విరాల లక్ష్మినారాయణ, శ్రీ ప్రసాదరావు, శ్రీ లింగా శంకరయ్య, శ్రీ బి. ఆర్. అయ్యంగార్, శ్రీ గందె బాలరాజయ్య, శ్రీ నేతి కృష్ణ, శ్రీ చుందూరి సత్యనారాయణ, శ్రీ మొర్ల రాజయ్య, శ్రీ మంచాల ప్రభాకర్.

గారి కుమారులు రమేశ్, నందకిశోర్, శివ కుమారులూ రాములుగారి కుమారుడు కృష్ణ మూర్తి భాగస్వాములై తమతండ్రులకు చేదోడువాదోడుగా వ్యాపారంలో తోడుపడు తున్నారు.

సికిందరాబాదులోని దుకాణానికితోడుగా హైదరాబాదులో 22-1-1958 నాడు సిద్ది అంబరు బజారులో మరో కాగితాలదుకాణాన్ని శ్రీఈశ్వరయ్యగారు ప్రారంభించినారు.దీనిలో గోలి యీశ్వరయ్యగారు, తేలుకుంట రాములు గారి భార్య శ్రీమతి శివలక్ష్మిగారు, శ్రీ గోలి వేంకటేశముగారు, భాగస్వాములుగా ఉండిరి. శ్రీ గోలి రమేశ్‌గారు, శ్రీ గందె బాలరాజయ్య గారు వ్యాపారాభివృద్ధికై చేర్చుకోబడినారు. ఈ దుకాణముకూడ దినదినాభి వృద్ధిచెందుతూ ఈశ్వరయ్యగారి హస్తవాసిని చాటుతున్నది.

24-12-1962 నాడు శ్రీ యీశ్వరయ్య శ్రీ బచ్చు లింగయ్యగార్ల ప్రయత్నంవల్ల నే 'భారత్ పేపర్ ఏజన్సీస్' అనే మరోసంస్థ సికిందరాబాదులో వెలసింది. దీనిలో శ్రీయీశ్వ రయ్యగారి భార్య వెంకటలక్ష్మిగారు, శ్రీబచ్చు లింగయ్యగారు, శ్రీ సిద్దంశెట్టి యీశ్వరయ్య గారు, శ్రీ తేలుకుంట రాములుగారి భార్య శివ లక్ష్మిగారు, శ్రీ ఉప్పల రాములుగారు, శ్రీ కొమ్మా వీరయ్యగారు భాగస్వాములు. ఈ సంస్థ ప్రారంభంవల్ల కాగితపు వర్తకులకు సరుకు సరిగా లభించడమేకాక అనవసరమయిన పోటీ తగ్గి అందరికీ తగిన లాభాలు వచ్చే అవకాశం కలిగింది. శ్రీ ఈశ్వరయ్యగారు, శ్రీ లింగయ్యగారు ఇప్పటికీ యీ సంస్థకు సలహాదారులుగా ఉండి అభివృద్ధికోసం కృషిచేస్తున్నారు.

శ్రీ ఈశ్వరయ్య, శ్రీ లింగయ్యగార్ల కృషి ఫలితంగా పేపర్ ట్రేడింగ్ ఏజన్సీస్ అనే ఇంకొక సంస్థ వెలసినది. అది దిన దినాభివృద్ధి పొందుతున్నది.

శ్రీ ఈశ్వరయ్యగారికి కాగితాల వ్యాపా రంలో సిర్‌పూర్ పేపర్ మిల్సువారి అండ దండలు సంపూర్ణంగా లభించినవి. వారికి ఆయన నిరంతరం కృతజ్ఞుడుగా ఉంటు న్నారు.

శ్రీ ఈశ్వరయ్యగారు ధనసంపాదనలో నైపుణ్యంతోపాటుగా గొప్ప మానవత్వం కలవారు. కష్టాలలోఉన్నవారిని తక్కువగా చూడక వారిని దగ్గరకుదీసి సహాయపడే స్వభావం వారిది. వారి భార్య శ్రీమతి వేంకట లక్ష్మిగారు కూడ అటువంటివారే. వేంకట లక్ష్మిగారికి కూడా ఆరేండ్లవయస్సులోనే తల్లిదండ్రులు గతించినారు. ఆమె భర్తకు అనుకూలవతిగా ఉండి ఆయన అభివృద్ధికి తోడుపడిందని చెప్పకతప్పదు శ్రీ ఈశ్వ రయ్యగారు తమ దుకాణంలో గుమాస్తాగా ఉన్న శ్రీ గందె బాలరాజయ్యగారికి హైదరా బాదు దుకాణంలో భాగమిచ్చినారు. ఈ విధంగా అందరూ బాగుపడవలెననేదే యీశ్వ రయ్యగారి ఆకాంక్ష.

ధనమును సంపాదించడమే కాదు; దానిని ఎట్లా ఉచితరీతిని ఖర్చుచేయవలెనో కూడా శ్రీ ఈశ్వరయ్యగారికి బాగా తెలుసు. వారు తాము సుఖజీవనమును గడపడమేకాదు ; మంచి యింటిని నిర్మించుకోవడమేకాదు ; కార్లు కొనుక్కోవడమేకాదు; వాటితోపాటుగా దానధర్మ కార్యములకు గూడా ద్రవ్యాన్ని

వినియోగించడం ఎఱుగుదురు. తిరుపతిలో కొండమీద స్వామిసన్నిధిని భక్తుల నివాస మునకయి యీశ్వరయ్యగారు ఒక "కుటీర" మును నిర్మింపజేసినారు. శ్రీశైలంలో మఱొక కుటీరం నిర్మాణములోవున్నది. హృషీకేశం లోనిఆంధ్రాశ్రమము, హైదరాబాదులోనివైశ్య విద్యార్థివసతిగృహము, కంచిలోని వేదాంత దేశిక కైంకర్యసభ, సికిందరాబాదులోని కన్యకాపరమేశ్వరీదేవాలయమూ, గీతాభవ నమూ మొదలయిన ధార్మిక విద్యాసంస్థల కెన్నింటికో శ్రీ యీశ్వరయ్యగారు చెప్పనగి నంత మొత్తములలో దానములు చేసినారు. సికిందరాబాదులో ప్రతిసంవత్సరము జరుప బడు శ్రీరామ నవరాత్ర మహోత్సవములకు ధనసాహాయ్యము చేయటంతోపాటు ఆ కార్యనిర్వహణ సంఘంలో ఉపాధ్యక్షులుగా ఉండి ఉత్సవములను నడుపుతున్నారు.

శ్రీ యీశ్వరయ్యగారికి సాంఘిక రాజ కీయ కార్యక్రమాలలోను ఆసక్తి లేకపోలేదు. స్వర్గీయ శ్రీ బి. వి. గురుమూర్తిగారికి ఈశ్వ రయ్యగారు చాల సన్నిహితులు. శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, శ్రీ రామానందతీర్థ మున్నగు నాయకులకు సన్నిహితులుగా శ్రీ ఈశ్వరయ్యగారు చాలకాలమునుండి కాంగ్రెసులో క్రియాశీలి సభ్యులుగా ఉన్నారు.

శ్రీ ఈశ్వరయ్యగారు కొంతకాలం ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు ప్రధాన కార్యదర్శిగాను, వైశ్యహాస్టల్ ట్రస్టుబోర్డు మెంబరుగాను సేవచేసినారు. ఆంధ్రప్రదేశ్ పేపర్ మర్చంట్సు అసోసియేషన్‌కు స్థాపక సభ్యులుగానేగాక, ప్రధాన కార్యదర్శిగాను, అధ్యక్షులుగాను కూడ ఉన్నారు. మద్రాసు పేపర్ మర్చంట్సు అసోసియేషన్‌లో సభ్యు లుగా ఉండటమేగాక Federation of Paper Traders' Associations of India కార్యనిర్వాహకవర్గ సభ్యులుగాఉండి కాగితం వ్యాపారరంగంలో ప్రముఖపాత్ర వహించి నారు. ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామర్సు, మద్రాసులోనేగాక ఫెడరేషన్ ఆఫ్ ఆంధ్ర ప్రదేశ్ చేంబర్ ఆఫ్ కామర్సు అండ్ ఇండ స్ట్రీస్‌లో గూడ సభ్యులుగా ఉండి వ్యాపారం లోతులు కొలిచిన ప్రముఖుడుగా ప్రఖ్యాతి వహించినారు.

సికిందరాబాదు వేంకటేశ్వర దేవాల యము, నాలాబజారు నరసింహస్వామిదేవాల యము కార్యనిర్వాహకవర్గములలో సభ్యు లుగా ఉండి ఆ దేవాలయముల అభివృద్ధికి సాయపడుతున్నారు.

ఏ మంచి పనికైనా యీశ్వరయ్యగారు నడుముకట్టుకొని ముందుంటారనడానికి కామ కోటి పీఠాధిపతులు సికిందరాబాదుకు వేంచేసి నప్పుడు శ్రీ యీశ్వరయ్యగారు చూపిన చొరవే సాక్షి.

ఈనాడు దేశంలో రజతోత్సవాలు చేసికో నున్న వ్యాపార సంస్థలకు మార్గదర్శకంగా ఉండేటట్లు ఈ శారదా మంజీరం సంతరింప జేసి మాతృభాషపట్ల తమ కర్తవ్యాన్ని నిర్వ హించడం శ్రీ యీశ్వరయ్యగారి ఉచితజ్ఞతకు మరో నిదర్శనం.

శ్రీ ఈశ్వరయ్యగారి స్వయంకృషి, దానివలన వారికి కలిగిన అభివృద్ధి దేశీయు లకు మార్గదర్శకములు కాదగినవి.



శ్రీ గోలి ఈశ్వరయ్యగారి హైదరాబాదు వ్యాపారసంస్థ బృందము

కూర్చున్నవారు (ఎ. నుండి కు.) : శ్రీ గోలి వెంకటేశం, శ్రీ గోలి రమేశ్, శ్రీ గోలి ఈశ్వరయ్య, శ్రీ తేలుకుంట రాములు, శ్రీ గందె బాలరాజయ్య.

నిల్చున్నవారు (ఎ. నుండి కు.) : శ్రీ చీలా రాజయ్య, శ్రీ గోలి నాగేశ, శ్రీ పబ్బా రాజయ్య, శ్రీ కాటి వసంత్

డా. దివాకర్ల వేంకటావధాని

# తిక్కన - ధర్మాద్వైతము

విద్వత్సంస్తవనీయ భవ్యకవితా
వేశుండు, విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు, సంయమి ప్రకర సం
భావ్యానుభావుండు, కృ
ష్ణద్వైపాయనుఁ, డర్థి లోకహిత
నిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు
లేఖ్యంబైన యామ్నాయమున్

అను విరాటపర్వారంభమునందలి పద్యమున తిక్కనసోమయాజి కృష్ణద్వైపాయనమహాముని జగద్ధితమునకై భారతమను పేరుగల లేఖ్యమైన యామ్నాయమును ధర్మాద్వైతస్థితితో రచించెనని వ్రాసియుండెను. భారతమునకుఁ బంచమవేద మనుపేరున్నది. ఋగాదులగు చతుర్వేదములు. శ్రుతులు. అవి యపౌరుషేయములని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. పరబ్రహ్మవ్యంజితములైన వేదమంత్రములను ఋషిపుంగవులు దర్శించిరి. అందుచేతనే వారికి మంత్రద్రష్ట లను నామ మేర్పడినది. తరువాత నామంత్రములు గురుశిష్యపరంపరగా లోకమున వ్యాపించినవి. గురువులైన ఋషులచేఁ బ్రోక్తములైన మంత్రములను శిష్యులు విని వల్లించిరి. అందుచేతనే యవి శ్రుతులైనవి. వానిని వ్రాసి పఠించు నాచారము పూర్వము లేకుండెను. వేదములు ముద్రితములై పుస్తకరూపమున నందుపాటులో నున్నను వానిని గురుముఖమున విని వల్లించుటయే యిప్పటికిని బరిపాటిగా నున్నది. ఈ సంప్రదాయమునకు స్వరపరిరక్షణము ప్రధానకారణమై యుండును. గ్రంథస్థములైన మంత్రములను బఠించి వల్లించుట కారంభించినచో స్వరదోషములు పెక్కుప్పతిల్లుట కవకాశ మున్నది. వేదమంత్రములను లిఖించి గ్రంథస్థముల నొనరించుట పూర్వము దోషముగాఁ బరిగణింపఁబడుచుండెను. అందుచేఁ జతుర్వేదములలేఖ్యములైనవి. వేదవ్యాసుఁడు వేదార్థోపబృంహణార్థమే వేదనిక్షిప్తములైన ధర్మనీతితత్త్వాదులను సర్వజనసుబోధములు కావించుటకై జగద్ధితబుద్ధితో మహాభారతమును రచించెను. భాషాస్వరూపములం దించుకభేదమున్నను బరమార్థప్రదర్శనమున వేదములకును భారతమునకును భేదము కానరాదు. అది పంచమవేదమనఁబడుట కదియే కారణము. అది వేదములవలె నలేఖ్యమైనది కాదు. స్వరనియమము లేకపోవుటచే నందలిశ్లోకములను యథేష్టముగా లిఖించి యెవ్వరైనఁ జదువుకొనుట కవకాశమున్నది. ఈకారణముచేతనే తిక్కన దానిని లేఖ్యంబైన యామ్నాయ మని యుగ్గడించెను.

కృష్ణద్వైపాయనుఁడు భారతాఖ్యమగు పంచమామ్నాయమును ధర్మాద్వైతస్థితితో రచించెనని తిక్కనసోమయాజి యభిప్రాయము. ధర్మశబ్దమునకు మతము, ఆచారము, విధి, ఔచిత్యము, స్వభావము, పురుషార్థములలో నాద్యర్థము మున్నగు ననేకార్థము లున్నవి. అద్వైతపదము సాధారణముగా జీవబ్రహ్మైక్యమను నర్థమున వాడఁబడుచున్నది. దానికి సమస్వభావముకలది, అభిన్నమైనది, సాటిలేనిది, ప్రధానమైనది అనునర్థములు కూడ నున్నవి. ఈయర్థములనుబట్టి వ్యాసుఁడు ధర్మాభిన్నమైన లేక ధర్మప్రధానమైన స్థితితో భారతామ్నాయమును రచించెనని తిక్కన భావించినట్లు మన మూహింపవచ్చురు. వ్యాసుఁడు భారతమునఁ బ్రతిపాదించిన ధర్మము వైదికధర్మము. ఆధర్మమును సర్వసుబోధము కావింపవలెనను

ప్రధానోద్దేశముతోడనే యతఁడు భారతమును రచించెను. వేదమంత్రములందలి భాష యతిప్రాచీనమైనది. కాలక్రమమున నది ప్రత్యేకముగాఁ గృషి చేసిన పండితులకుఁదప్ప సామాన్యులకు దుర్బోధమగుట తటస్థించెను. అందుచే వా రితరమార్గములఁ బడిపోవుట కవకాశ మున్నది. ఆయవకాశమును బరిహరించి వేదధర్మమును సర్వజనసుబోధ మొనరించుటకై వ్యాసుఁడు తనకాలమునఁ బ్రచారమున నుండినసంస్కృతభాషలో భారతమును రచించెను. ఈవిధముగా భాషావిషయమునేకాక వేదప్రతిపాదితములైన ధర్మనీతితత్త్వములను సుబోధమొనరించువిషయమునఁగూడ నాతఁడు మిక్కిలి శ్రద్ధ వహించెను. ధర్మనీతితత్త్వములను యథాతథముగాఁ దెల్పినచో శుష్కములైనవానిని బ్రజలు పఠింతురో పఠింపరో యను నుద్దేశమున వానినాతఁడు కథోపాఖ్యానముల ద్వారా వెల్లడిచేసియుండెను. భారతమునందలి ప్రతికథయు నుపాఖ్యానమును ధర్మమునో నీతినో తత్త్వమునో బోధించుచునే యుండును. అందుచేతనే నన్నయ వ్యాసుని భారతమును ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్ర మందురనియు, నది ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తిని గలిగించుననియు, కమనీయధర్మార్థకామమోక్షములకు నత్యంత సాధనమైన దనియు, నైహికాముష్మిక శ్రేయఃప్రాప్తినిమిత్త మనియు వర్ణించియుండెను. అందు రసధ్వని రీత్యలంకారాదులగు నుత్తమకవితాగుణములు కూడ విరివిగా నున్నమాట సత్యమే. వ్యాసుఁడు క్రాంతదర్శియుఁ దపఃప్రతిభాసంపన్నుఁడు నైన మహర్షి యగుటచే నవన్నియు నాతనిరచనమున నప్రయత్నముగనే యావహిల్లినవి. ధర్మప్రబోధవిషయమునమాత్ర మాతఁడు ప్రత్యేకశ్రద్ధ వహించెను. అది శాస్త్రకావ్యమును మోక్షశాస్త్రము నగుట కదియే కారణము. అందుచేతనే తిక్కన వ్యాసుఁడు ధర్మప్రధానముగా భారతమును రచించియుండెనని చెప్పియుండెను.

తిక్కన కృష్ణద్వైపాయనుఁడు ధర్మాద్వైతస్థితితో భారతమును రచించెనని చెప్పెను గాని తానట్లు రచించియుండినట్లెచ్చటను వచించియుండలేదు. కాని పండితు లాతనిరచనకుఁగూడ ధర్మాద్వైతభావము నారోపించుచుందురు. దానికిఁ గవిత్రయమువారికి వ్యాసునియెడఁ గల భక్తిగౌరవాతిశయమే కారణము. వారు మహాభారతము నాంధ్రీకరించుపట్ల దేశకాలానుగుణముగా నందుఁ గొన్ని మార్పుచేర్పులు ప్రవేశపెట్టినను దాని ప్రధానతత్త్వమునకుమాత్ర మెచ్చటను భంగము కలిగించియుండలేదు. పంపఁడు కన్నడమున విక్రమార్జున విజయ మనుపేర భారతమును వ్రాయుచుఁ దాను జైనమతావలంబి యగుటచేఁ దదనుగుణముగా నందుఁ గొన్నిమార్పులు కావించియుండెను. అంతేకాక యతఁడు కథావిధానమున సైతము కొన్ని మార్పు లుద్దేశపూర్వకముగాఁ బ్రవేశపెట్టియుండెను. కవిత్రయమువారు తెలుఁగుభారతమున నించుక స్వాతంత్ర్యము వహించిన సన్నివేశములు కొన్ని లేకపోలేదు కాని వారు మూలతత్త్వము నెచ్చటను అన్యథాకరించి యుండలేదు. "కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడు"నట్లుగా రచన సాగించుటయందు నన్నయ యెంత శ్రద్ధ వహించెనో తిక్కన యెఱ్ఱనలుకూడ నంతే శ్రద్ధ వహించిరి. అందుచేఁ బరమార్థప్రకటనమున నాంధ్రసంస్కృతభారతములు రెండును అత్యంతసదృశములు. ఆదృష్టితో జూచినచో వ్యాసుఁడు ధర్మాద్వైతస్థితితో భారతమును రచించినప్పుడు కవిత్రయమువారును దాని నట్లే రచించినట్లగును తిక్కన యావిషయమును స్పష్టముగాఁ జెప్పియుండుటచే విమర్శకు లాగుణము నాతనియెడగూడ నారోపించుచున్నారు.

సంస్కృతభారతమును బఠించునప్పు డందలి ప్రతిపర్వమునందేకాక ప్రతిభాగమునందును వ్యాసుని పౌరాణిక నైతికదృష్టియు, ధర్మప్రబోధన ప్రవణతయుఁ బ్రత్యక్షమగుచుండును. కవిత్రయమువారికి, అందును ముఖ్యముగా తిక్కనకుఁ గావ్యకళాదృష్టి యధికముగా నున్నమాట యథార్థమే యైనను ఆతఁడు ధర్మ నీతి తత్త్వ విష




మృగమదముచెంత కుంకుమరేఖగా రాధ మురళీమనోహరుని పరవశమ్మొనరించె,
అతనిగానామృతంబాని మేనును మరచి ఆమె ఆతనిలోన ఐక్యమైనటు దోచె.

"బలరామాచార్య"

యములం దశ్రద్ధపహించినవాఁడు కాఁడు భారతము

వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదై నచోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.

అని హృదయపూర్వకముగా విశ్వసించినవాడు. అతడు భీష్మపర్వమున భగవద్గీతను సంక్షేపించినను ఆసంక్షేపమునందే గీతాసారము నంతను వడియఁ గట్టి పఠితలకుఁ జూఁ అయిచ్చినవాఁడు. నీతులను బ్రవచింపవలసినప్పుడు వాని నాతఁడు సూటిగను సంక్షేపముగను శక్తిమంతముగను జెప్పి పఠితల హృదయమునకు హత్తుకొనున ట్లొనరించియున్నాఁడు. ఉద్యోగపర్వమునందలి విదురనీతి మున్నగునవి యిందుకు నిదర్శనములు. ఇంక శాంత్యనుశాసనపర్వములం దాతఁడు రాజధర్మము, మోక్షధర్మము, వర్ణాశ్రమధర్మములు, దండనీతి, మున్నగువానిని బ్రత్యేకముగను సంవాదముల రూపమునను విశదీకరించినవిధాన మత్యంత హృద్యముగా నుండును. "వ్యాసమునీంద్ర సారకరుణాతిశయంబున భారతార్థ ముద్భాసితమైనయట్టి నుత భాగ్యునకున్ సకలాగమార్థ సంవాసన మావహిల్లు" నని యాతని దృఢవిశ్వాసము, అందుచేఁ గృష్ణ ద్వైపాయనునివలెనే తిక్కనయు భారతమును ధర్మాద్వైత స్థితితోనే రచించె నని భావించుటలో దోషము లేదు. అతని జీవితమును తత్కాల పరిస్థితులను బరిశీలింప నాతఁడు భారతరచనముననే కాక యన్యవిషయము లందును ధర్మాద్వైత స్థితిని బాటించినట్లు తేటతెల్లమగును. ఆవిషయ మిప్పుడు విశదీకరింపబడును.

క్రీ. శ. 12 వ శతాబ్దిలో నాంధ్రదేశపు మత సాంఘిక పరిస్థితులయందు విపరీతములైన కొన్ని నూతన పరిస్థితు లేర్పడెను. ఆ శతాబ్దియందే పశ్చిమచాళుక్యరాజ్యమును బాలించుచుండిన బిజ్జలునకు మంత్రియు బండారియు నై యుండిన బసవేశ్వరుఁడు వీరశైవమతమును స్థాపించి భక్తి యొక్క టున్నచో మోక్షము కరతలామలక మగు ననియు, వర్ణభేదములవలన నెట్టి ప్రయోజనమును లేదనియుఁ బ్రచారము సాగించెను. అతఁడు వేద ప్రామాణ్యము నంగీకరించి యుండలేదు. ఆతని సిద్ధాంతములు కన్నడదేశమందలి ప్రజల నెక్కువగా నాకర్షించెను. మహామేధావియు మహిమానుభావసంపన్నుఁడు నైన యాతని మహత్త్వము రాజ్యమునం దెల్లెడ వ్యాపించి వీరశైవ మతమున కెనలేని ప్రచారము కలిగించెను. క్రమముగా నా మతము కన్నడ దేశమునుండి పరిసర ప్రాంతములకుఁ గూడ వ్యాపించెను. ఆంధ్రదేశమునందలి పలువురు సామాన్యజనులేకాక కవులును బండితులును గూడ నామతము నవలంబించి తమ కవితాపాండితీ ప్రతిభల నన్నిటిని దత్ప్రచారమునకై వినియోగింపఁ దొడంగిరి. అట్టి వారిలో శివతత్త్వసార కర్తయైన మల్లికార్జున పండితారాధ్యుఁడును బసవపురాణ పండితారాధ్య చరిత్రలను రచించి వీరశైవ మతమునకు గురుపీఠమని ప్రఖ్యాతి చెందిన పాల్కురికి సోమనాథుఁడును ముఖ్యులు. వారు తమ రచనలచే వీరశైవమతమునకుఁ గల్గించిన ప్రచార మింతింత యనరాదు. వేదప్రామాణ్యము నంగీకరింపని వీరశైవ మట్లు వ్యాప్తిచెందుట చేతనే పంచమవేద మని ప్రసిద్ధిచెందినదియు, వైదికధర్మ ప్రచార ప్రవణమును, నన్నయమహాకవిచే నారంభింపఁబడినదియు నగు భారతాంధ్రీకరణమును గొనసాగించుట కెవ్వరును బ్రయత్నించి యుండ లేదు.

వీరశైవమత మావిధముగాఁ బ్రచారము పొందుచుండ వైష్ణవమతానుయాయులుకూడ నూరకుండక స్వమత ప్రచారమునకై తీవ్రప్రయత్నములు చేయ దొడంగిరి. వైష్ణవమతము నైతము వీరశైవమువలె భక్తిప్రధాన మై నట్టిదే. దానిని స్థాపించినవారు భగవద్రామానుజాచార్యులవారు. వారుక్రీ.శ.1018వ సంవత్సరము ప్రాంతమున ద్రావిడ దేశమందలి శ్రీపెరుంబూదూ రనుగ్రామమున జన్మించి, కాంచీ నగరమున వేదాంతవిద్యారహస్యముల నభ్యసించి

శంకరభగవత్పాదుల యద్వైతమతమును ఖండించుచు విశిష్టాద్వైత మనుపేర నూతనవైష్ణవసిద్ధాంతమును నెలకొల్పిరి. కేవలజ్ఞానము మోక్షప్రాప్తికి సాధనము కాఁజాలదనియు, భక్తి సంపదవలన దానిని సులభముగా సాధింపవచ్చు ననియు వారి మతమునందలి సారాంశము. ఆకాలమున ద్రావిడదేశము నేలుచుండిన కులోత్తుంగచోడదేవుఁడు (రాజరాజనరేంద్రుని కుమారుఁడు) శైవమతాభిమానము కలవాఁడగుటచే శ్రీమద్రామానుజుని నూతనసిద్ధాంతము నాదరింవక పోవుటయే కాక యాతని దండించుటకుఁగూడఁ బ్రయత్నించెను. రామానుజుఁడు రాజదండమునకు వెఱచి ద్రావిడదేశము ను విడిచి హోయసాలరాజ్యమునకుఁ బాఱిపోయెను. కులోత్తుంగచోడుని మరణానంతరము చోళసామ్రాజ్యమునకుఁ జక్రవర్తియైన విక్రమచోడుఁడు వైష్ణవమతమున సానుభూతి వహించి రామానుజుని దనరాజ్యమున కాహ్వానించెను. రామానుజుఁడు శంకరాచార్యులవలెనే స్వసిద్ధాంతానుగుణముగాఁ బ్రస్థానత్రయమునకు భాష్యములు రచించి విశిష్టాద్వైతమునకు విశేషప్రచారము కలిగించెను. అతని రచనల వలనను ఇతరభాగవతోత్తముల ప్రచారప్రబోధముల వలనను వైష్ణవమతము ద్రావిడదేశమందును ఆంధ్రదేశ దక్షిణభాగమందును విరివిగా వ్యాపించెను. పల్నాటివీరులలో నగ్రేసరుఁడైన బ్రహ్మనాయకుఁడు వైష్ణవమతము నవలంబించి పల్నాటివిష్ణు వని ప్రఖ్యాతి గాంచెను. అతఁడు వర్ణవిభేదము లేకుండ నెల్లరను గలసి భుజించుట కనువైన 'చాపకూడు' విధానము నేర్పఱిచి యారోజులలో సంఘసంస్కారమునకై చాల కృషి కావించె నని చెప్పుదురు. తిక్కనసోమయాజి తాతయైన భాస్కరమంత్రి పూర్వరామాయణమును రచించె ననియు దానిని బూర్తిచేయు నుద్దేశముతోడనే తిక్కన నిర్వచనోత్తరరామాయణము వ్రాసెననియుఁ బ్రతీతి. మంత్రి భాస్కరుఁడు కొంచె మించుమించుగా బసవేశ్వరునికి సమకాలికుఁడై యుండును. బసవేశ్వరుని ప్రభావము వలన వీరశైవ మాంధ్రమునఁ గూడ వ్యాపించుట చూచి భాస్కరమంత్రి దానికిఁ బ్రతియోగముగా శ్రీ మ న్నా రా య ణా వ తా ర భూతుఁడైన శ్రీరాముని చరిత్రమును వివరించు రామాయణమును రచించుటకుఁ బూనెనని యూహింపవచ్చును.

వీరశైవవైష్ణవమతములందుఁ గొన్ని సమాన లక్షణములున్నను వానికిఁ గొంత భేదముకూడ లేకపోలేదు. ఆరెండును భక్తిప్రధానములగుటయు, వర్ణవిభేదమును బాటింపకుండుటయు నిజమే. కాని యుపాస్యదైవమువిషయమున వానికి భేదము కలదు. వీరశైవులు విభూతిరుద్రాక్షాలంకృతుఁడును బన్నగభూషణుఁడు నైనశివుని భజింప వైష్ణవులు తులసీవనమాలాలంకృతుఁడును బన్నగశయానుఁడు నైన శ్రీమన్నారాయణుని భజింతురు. వీరశైవులు వేదప్రామాణ్యము నంగీకరింపరు. వైష్ణవులకు వేదములతో విరోధము లేదు. వీరశైవులకు శైవేతరులన్న మిక్కుటమైన ద్వేషము వైష్ణవులకుఁ గూడ స్వమతపక్షపాత ముండును గాని మతాంతరద్వేష మంతగా ముదిరి యుండదు. ఇట్లే యాచారవ్యవహారములం దా రెండు మతములకును మఱికొన్ని భేదములు కానిపించును. ఈభేదములను బురస్కరించుకొని వారొండొరులను ద్వేషించుకొనుటయుఁ గలదు. పాల్కురికి సోమనాథుఁడు శైవేతరులు పండించిన పంటలనుగాని గూరగాయలనుగాని భక్షించెడివాఁడు కాఁ డని చెప్పుదురు. పండితారాధ్యుఁడు శివతత్త్వసారమున

> కా దప్పుగొనఁగ, న ప్పిఁ
> గా, దీఁ గొనఁ గాదు, గాదు కనఁ, దమలో నా
> హ్లాదమునఁ బలుకఁ గాదు మ
> హాదేవ పరాఙ్ముఖాత్ములగు పతితులతోన్ 263

మున్నుగా వ్రాసిన కొన్ని పద్యములను జూడ వీరశైవులకు శైవేతరులయెడఁ గలద్వేషమెంత యధికమో విశదము కాఁగలదు. ఈవిధముగా నారోజులలో వీరశైవులును వైష్ణవులును "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" యను సమభావమును విడిచి యొండొరుల దర్శన స్పర్శన భాష

ణములనుగూడఁ బరిహరించుచుండిరి. నామములు భిన్నములైనను దైవము లభిన్నములే యను సత్యమును వారు పూర్తిగా విస్మరించిరి. హిందూ మతమునకే సంబంధించిన రెండుమతశాఖలకుఁ జెందిన భక్తు లిట్లు పరస్పరద్వేషవైరములకు గుఱియై యొండొరులను హింసించుటకుఁ గూడ వెఱవకుండుట విశాలహృదయులును ఉదారచిత్తులు నైన మహనీయుల కపారమైన వేదన కలిగించియుండును. అట్లు వేదనకు గుఱియై యారెండుమతములవారికిని సామరస్యము కలిగించుటకై యత్నింపవలె నని తీవ్రమైన కృషి సాగించిన వారిలో మహాకవియు, విద్వద్వరేణ్యుఁడును మంత్రిమాణిక్యము నైన తిక్కనసోమయాజి యొకఁడు.

తిక్కన తాను దొలుత రచించిన నిర్వచనోత్తర రామాయణమును దనప్రభువును మిత్రుఁడు నైన మనుమసిద్ధిభూపాలుని కంకితముగావించెను. అందాతఁడు తన్నుగూర్చి "మహేశ్వరాంఘ్రి కమలధ్యానైకశీలుండ" నని వ్రాసికొని యుండెను. దీనినిబట్టి యాతఁ డప్పుడు శివభక్తుఁడై యుండెనని వ్యక్తమగుచున్నది. కాని యీశివభక్తి యన్యమతసహనము లేనిదియు, ద్వేషావేశపూరితము నగువీరశైవమునకు సంబంధించినది కాదు. అందుచేతనే యాతఁడు విష్ణ్వవతారమైన రామునిచరితమును వర్ణించు నిర్వచనోత్తరరామాయణమును వ్రాయుట సంభవ మయ్యెను. ఆతఁ డప్పుడు శివుని విష్ణువునుగూడ గొల్చుచుండినను "తథాపి భక్తిస్తరుణేందుశేఖరే"యనునట్లాతనిమనస్సు శివునియెడ మొగ్గుచూపు చుండియుండును. క్రమముగా నాతని మనస్తత్త్వమునఁ బరిణామము కలిగెను. అతఁడు వేదవేదాంతవిదుఁడును సమదర్శియు నైనపండిత ప్రకాండుఁ డగుటచే "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" యను వేదవాక్యము ననుసరించి నామములందుఁ బార్థక్య మున్నను భగవత్తత్త్వ మేకైకమే యని గ్రహింపఁజాలెను. తనకాలమునందలి విపరీత మతపరిస్థితు లాభావమున నతనికి మఱింత యభినివేశము నాపాదించెను. అతఁడు శివకేశవాద్వైతమును బాటించి హరిహరనాథదేవుని త్రికరణశుద్ధితోఁ గొల్చుచుండెను. ఆదేవునియందలి భక్తి ప్రేరేఁప నాతఁ డాకాలమున నీక్రిందిశ్లోకమును రచించి యుండెను.

కి మస్థిమాలాం కిము కౌస్తుభంవా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం ?
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు ? వద ప్రభో ! మే.

శివుఁ డస్థిమాలాధరుఁడు, విష్ణువు కౌస్తుభమాణిక్య విభూషితుఁడు. శివుఁడు కాలకూటవిషమును భక్షించెను, విష్ణువు కృష్ణావతారమున యశోదచనుబాలు త్రావెను. హరిహరనాథుఁ, డేకీకృతశివకేశవమూర్తి కావున నా యిరుతెఱఁగుల యలంకారముల సొగసును, ఆహారముల రుచిని ఎఱుంగును. అందుచే తిక్కన "ఈరెం డలంకారములలో నీకు బహుమానపాత్రమైన దేది? ఈ రెం డాహారములలో నీకు రుచికరమైన దేది?" యని యా యద్వైతమూర్తి నడుగుచున్నాఁడు. చిన్నదైనను ఈశ్లోకమునందు ఆదేవతాద్వయమునకుఁ గల యభేదము చక్కఁగా వ్యంజిత మగుచున్నది.

ఈ హరిహరనాథుఁడు తిక్కనభావనాకల్పితుఁడా లేక యాపేరుగల దేవుఁ డారోజులలో నెచ్చటనైన జనారాధితుఁడై వెలయుచుండెనా యను విషయమున నభిప్రాయభేదము లున్నవి. తిక్కన హరిహరనాథునికి వాడిన "అనహంకార నిరూఢ భావనారాధ్యుఁడు" "నైర్గుణ్య సముద్భాసి రహస్యానుభావుఁడు" "హృదయకమల మధురూపుఁడు" "వ్యాసాది మునీంద్ర భావ్యుఁడు" మున్నగు విశేషణములనుబట్టి కొంద ఱాతఁడు కేవలభావనాకల్పిత మూర్తి యని భావించుచున్నారు. కొందఱు తిక్కన కాలమున నెల్లూరున హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు, ప్రస్తుతము రంగనాథస్వామి దేవాలయమున్న ప్రదేశమే పూర్వ మది యుండిన ప్రదేశ మనియుఁ జెప్పుచున్నారు. మఱికొంద ఱప్పుడు పెన్నానది రెండు పాయలుగాఁ బ్రవహించు

చుండె ననియు, నందు నెల్లూరునకు దక్షిణమున నుండిన పాయకు దక్షిణపుటొడ్డున హరిహరనాథ దేవాలయ ముండె ననుటకుఁ దచ్ఛిథిలచిహ్నము లిప్పటికిని గోచరించు చుండుటయే తార్కాణమనియు నుడువుచున్నారు. పదునైదవ శతాబ్ది యందు జీవించిన బైచరాజు వేంకటనాథుఁడు తన పంచతంత్రమును హరిహరనాథునికే యంకితముచేసియుండుటచే నాతని కాలము వఱకును హరిహరనాథదేవాలయ ముండెనని కొందఱి నమ్మకము. తిక్కన మహాభారతమును హరిహరనాథదేవాలయముననే కూర్చుండి రచించెననుటకు విరాటపర్వాదియందుఁ గల "ఈదృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక యారాధన విశేషం బగుటంజేసి" యను నతనివాక్యమే నిదర్శన మని కీ.శే. చాగంటి శేషయ్యగారు భావించుచున్నారు. మఱియు సప్తగోదావరసంగమమున నొక హరిహరాథ దేవాలయ ముండెడి దని ద్రాక్షారామమునందలి యొక శాసనము వలనఁ దెలియుచున్నదని వారే చెప్పుచున్నారు. దీనినిబట్టి యాకాలమున నెల్లూరుననే హరిహరనాథదేవాలయ మొకటుండెననియో నెల్లూరునఁ గాక పోయినను స్థలాంతరమం దాపేరుగల దేవుఁడు వెలసి యారాధింపబడుచుండెననియో భావించుట యుక్తముగాఁ దోఁచుచున్నది.

తిక్కన తనకాలమున శైవవైష్ణవమతావలంబుల నడుమఁ జెలరేఁగుచుండిన వైరద్వేషవికారములను గాంచి విషణ్ణుఁడై, వాని నడంచి సామరస్యమును సంధించు టెట్లా యని తీవ్రముగా నాలోచించి, పంచమవేదమైన మహాభారతము నాంధ్రీకరణమును గొనసాగించుట యందుకుఁ దోడ్పడఁ జాలునని నిశ్చయించెను. మహాభారతము శివ విష్ణు మత్స్య కూర్మాది పురాణములవలెఁ బ్రత్యేకదైవతములకును, ప్రత్యేకమతములకును సంబంధించిన పాక్షికగ్రంథముగాక సర్వధర్మ సమన్వయ సంధాన దక్షమైన యుదాత్తేతిహాస మగుటయు, వేద విక్షిప్తములైన సర్వధర్మములను గథోపాఖ్యానముల ద్వారా రసవంతముగాఁ బ్రబోధించున దగుటయు నందుకుఁ గారణము. అతఁ డట్లు రచనాకౌతుకమును బూని "ఈప్రబంధమండలి కధినాథునిగా నేపురుషునిఁ బేర్కొనువాఁడనొ యనుతలంపు కూరినమదితో" నిద్రించుచుండ నతనిజనకుఁడైన కొమ్మన కలలోఁ గనిపించి "కిమస్థి మాలేత్యాదిగా నీవు తొల్లి రచించిన శ్లోకమును గాఢాదరమున నవధరించి భక్తవత్సలుఁ డగు హరిహరనాథదేవుఁడు నీదెస దయాళుఁడై యుండుటచే నిన్నుఁ గృతార్థుఁ గావింప వీఁడుగో విజయంచేయుచున్నాఁ" డని పలికెను. తిక్కన సంభ్రమసంభరితహృదయుఁడయి యాదేవు నాలోకించి, సాష్టాంగ దండప్రణామ మాచరించి, లేచి నిలఁబడెను. అంత నాదేవుఁడు చిఱునవ్వునవ్వుచు నతని భక్తిప్రపత్తులను బొగడి "నీవు పారాశర్యకృతమైన పంచమవేదము నాంధ్రీకరింపఁబూనుటకెంతయు సంతసించి కృతిపతిత్వ మర్థించుటకై వచ్చితి" నని పలికెను. తిక్కన యతనికిఁ బునఃపునఃప్రణామము లాచరించి "దేవా! నిగ్రహానుగ్రహసమర్థుఁడవైన నీవు నాచే నిన్ను బొగడించుకొన నెంచుటలో నచ్చెరువు లేదు. నీకరుణకతమున నే నిట్లు పదస్థితుఁడ నైతిని. ఇంక జన్మాంతర దుఃఖములు తొలఁగున ట్లొనరించి నన్ను సుఖాత్ముఁ గావింపు" మని ప్రార్థించెను అంత నాజగన్నాథుఁడు "జననమరణరూపమైన సంసారమునుండి తొలంగు తెరువు కను వెలుంగు నీ కిచ్చితి" నని పలికి యంతర్హితుఁ డయ్యెను. తిక్కన సంతోష సంభరితాంతరంగుఁడై మేల్కాంచెను. అతఁ డీస్వప్న వృత్తాంతమును విరాటపర్వారంభమున నత్యంత హృద్యముగ వర్ణించి యున్నాఁడు. తరువాత నతఁడు భారతరచనకుఁ బూని దానిని స్వప్నమున నాదేవదేవుఁడు కోరిన ట్లతనికే యంకితము కావించెను.

తిక్కన కవిమాత్రుఁడు కాఁడు; కారణజన్ముఁడు. హరిహరనాథదేవాంకితమైన యాతనిభారతము పరస్పర ద్వేషకలుషితమై యుండిన యాంధ్ర ప్రజానీకమునకుఁ గనువిప్పై యథార్థభగవత్తత్త్వమును

ప్రత్యక్షము చేసియుండు ననుటలో సందేహము లేదు. హరిహరమగు రూపము దాల్చి 'విష్ణురూపాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనుల సమగ్ర హించు పరతత్త్వ మేక మద్వితీయ మని యాతఁ డెలుఁగెత్తి చాటెను. ఆంధ్రసరస్వతి కభినవాలంకార మైన యాతని భారతము చొచ్చిన చోట్లనెల్ల నాతని శివకేశవాద్వైత సిద్ధాంతము కూడఁ జోటు చేసి కొనెను. ఈవిధముగా నాతఁడు తన భారతరచనచే ధర్మాద్వైతస్థితిని ప్రతిష్ఠించెను. ఇచ్చట ధర్మ మనఁగా మతము. అద్వైత మనఁగా నభిన్నము. మతములు నామములచే భిన్నములైనను దత్త్వముచే నభిన్నములే యని చాటుటయే యాతఁడు ప్రతిష్ఠించిన ధర్మాద్వైతస్థితికిఁ బ్రయోజనము.

తిక్కన భారతమువలె నతని ధర్మాద్వైత తత్త్వమును దరువాతికవుల నెందఱినో ప్రభావితులఁ గావించెను. సర్వజ్ఞుఁడును సంవిధానచక్రవర్తియు నైన నాచనసోమనాథుఁడు తన యుత్తర హరివంశమును హరిహరనాథుని కంకితము చేయుటకుఁ దిక్కన ధర్మాద్వైత సిద్ధాంతమే మూలకారణము. అట్లే బైచరాజు వేంకటనాథుఁడు తన పంచతంత్రమును, కొఱవిగోపరాజు తన సింహాసనద్వాత్రింశికను హరిహరనాథుని కంకితము కావించుటలోఁ గూడ తిక్కన మార్గదర్శిత్వము కానవచ్చును. ఆంధ్రభారతము నిల్చునంతకాలము తిక్కనగారి ధర్మాద్వైతసిద్ధాంతముకూడ నాంధ్రజనత నుత్తేజిత మొనరించుచునే యుండును.

తిక్కన భాషాపరముగాఁ గూడ ధర్మాద్వైతమును సాధించెను. అతని కుభయకవిమిత్రుఁ డను బిరుద మున్నది. ఈబిరుదము నందలి 'యుభయ కవు లెవ్వరు? వారు సంస్కృతాంధ్రకవు లని సాధారణముగాఁ జెప్పుకొనవచ్చును. "నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడ" నని తిక్కన నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పుకొని యుండెను. ఆతఁడు గీర్వాణభాషలో రచించిన కావ్యము లెవ్వియో మనకుఁ దెలియదు. నన్నయభట్టు భారతారంభమున మంగళశ్లోకమును సంస్కృతమున వ్రాసియుండుటచేఁ గాఁబోలుఁ దిక్కన నిర్వచనోత్తరరామాయణమును సంస్కృతశ్లోకరూపమైన యాశీర్వాదముతో నారంభించెను, అతఁడు హరిహరనాథదేవుని స్తుతించుచు రచించిన "కిమస్థిమాలా" మిత్యాది శ్లోకము సుప్రసిద్ధమైనదే. ఇంతకుమించి యాతఁడు కావించిన సంస్కృతరచనలేమియు మనకు లభించుటలేదు. సంగమవంశమునకుఁ జెందిన కంపరాయలభార్య గంగాదేవి తనభర్తవిజయములను వర్ణించుచు రచించిన మధురావిజయ మను సంస్కృతకావ్యమున సంస్కృతకవులను ప్రశంసించుచు వారిలోఁ దిక్కననుగూడఁ జేర్చెను. ఆమె యాతఁడు రచించిన గ్రంథము లేమియుఁ బేర్కొని యుండలేదు. ఆమె తెలుఁగుదేశమునఁ బుట్టిన సంస్కృతకవయిత్రి. తెలుఁగున తిక్కన మహాకవిత్వము రచించిన విషయ మెఱింగిన దగుటచే నామె యాతనిఁ బ్రశంసించి యుండవచ్చును, కాని యప్పు డామె యతనిని సంస్కృతకవుల వరుసలోఁ జేర్చి యుండదు. బహుశః ఆమె తిక్కన రచించిన సంస్కృతకృతిని దేనినో చదివియుండును. ఒకవేళ అతఁడు సంస్కృతమునఁ బ్రత్యేకకావ్య మేదియు రచించి యుండకున్నను పైని పేర్కొనఁబడిన యారెండు శ్లోకములే యాతని సంస్కృతకవితా కౌశలమును బ్రకటించుటకుఁ జాలును. అందుచే నతని యుభయ కవిమిత్రత కెట్టి లోపమును రాఁజాలదు.

తిక్కన యుభయకవిమిత్రబిరుదమున కాతఁడు మార్గదేశి విధానములు రెండింటికిఁ జెందిన కవుల కును మిత్రుఁడను నర్థమునుగూడఁ జెప్పవచ్చును. మార్గకవు లనఁగా సంస్కృతకవులనియు దేశికవు లనఁగా దేశభాషా కవులనియుఁ గొందఱు భావింతురు. అప్పు డుభయకవిమిత్రుఁ డనఁగా సంస్కృతాంధ్రకవిమిత్రుఁ డనియే భావము. కాని యొక్క యాంధ్రముననే మార్గకవులును దేశికవులును ఉండ వచ్చు నని కొందఱు భావించుచున్నారు. సంస్కృత లాక్షణికులు కాని, కవులు కాని కవిత్వమున మార్గదేశిభేదములను బాటించినట్లు కనఁబడదు. సంగీత

శాస్త్రగ్రంథకర్తలు సంగీతమును మార్గమని దేశి యని రెండుతెఱంగులుగా విభజించి యుండిరి.

మార్గో దేశీతి తద్ద్వేధా
తత్ర మార్గ స్స ఉచ్యతే
యో మార్గితో విరిఞ్చాద్యైః
ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురత శ్శంభో
ర్నియతోఽభ్యుదయప్రదః
దేశే దేశే జనానాం య
ద్రుచ్యా హృదయ రఞ్జకమ్
గీతం చ వాదనం నృత్తం
తద్దేశీ త్యభిధీయతే

యని సంగీతరత్నాకరము మార్గదేశిసంగీతములను నిర్వచించి యున్నది. దీనినిబట్టి బ్రహ్మాదులచే మార్గితమై యీశ్వరుని సమక్షమున భరతాదులచేఁ బ్రదర్శింపఁబడినది మార్గ మనియు, నాయాదేశము లందు జనులకు రుచిచే హృదయరంజకమగునది దేశి యనియుఁ దెలియుచున్నది. ఆ గ్రంథముననే కామచార ప్రవర్తిత్వమును దేశానుగుణ ప్రవృత్తి యు దేశిరాగముల లక్షణమనియు, నియమ సాహిత్యమును సర్వదేశ సమానరూపశాలిత్వమును మార్గ రాగముల లక్షణ మనియుఁ జెప్పఁబడినది. పండితులై నవారు దేశిసంగీతమునువలె నియమ సహిత మును శాస్త్రబద్ధము నైన మార్గసంగీతమును గూడ నాస్వాదించి యానందింపఁజాలుదురు. సామాన్య జనులు శాస్త్రజ్ఞానహీనులగుటచే హృదయరంజక మైన దేశిసంగీతమునువలె బుద్ధిరంజకమైన మార్గ సంగీతము నాస్వాదింపఁజాలరు. శాస్త్రకర్తలు పలువురు దేశిసంగీతమునకు జనలోకహృదయరంజకత్వమును ముఖ్య లక్షణముగాఁ జెప్పియున్నారు, దశరూపకకర్త నాట్యలక్షణములను జెప్పుచుఁ బ్రసంగవశమున నృత్యనృత్తములను గూడ నిర్వచించి యందాద్యము మార్గమనియు రెండవది దేశి యనియు వివరించెను. ప్రభావ్యాఖ్య 'దేవై ర్మృగితత్వా న్నృత్యస్య మార్గ ఇతి ప్రసిద్ధిః, తత్తద్దేశ సంబద్ధత్వా న్నృత్తస్య దేశీతి ప్రసిద్ధిః" అని వాని యర్థమును స్పష్టపఱిచెను.

సంగీతవిషయమునఁ గవవచ్చు పై మార్గదేశిభేద ములను భాషల కన్వయించి చూచినప్పుడు సంస్కృతభాషమార్గవిధానముకును, ఆంధ్రకర్నాట కాదిభాషలు దేశివిధానమునకును జెందునని స్ఫురించును. ఇంకఁ గవిత్వమునందలి మార్గదేశిభేదము లను బరిశీలించునప్పు డొక్కభాషనే కాక ఛందోఽలంకార రీతి వస్తు రస పాత్రాదుల నన్నిటిని దృష్టియం దుంచుకొనవలయును. సంస్కృతపద బహుళమై లక్షణయుక్తమైన భాషయు, సంస్కృత కావ్య ప్రయుక్తములై యందుండి తెచ్చుకొనఁబడిన శార్దూలాది వృత్తములును, ధీరోదాత్తాది నాయక వృత్తములతోఁ గూడి పురాణాదులయందుఁ బ్రసిద్ధ మైన వస్తువును, సంస్కృత లక్షణగ్రంథములందు వివరింపఁబడిన రస ధ్వని రీతి గుణాలంకారాదులగు నితర లక్షణములును గల కవిత్వము మార్గవిధాన మునకును, దీర్ఘసమాసరహితమై దేశీయపద ప్రచురమై వ్యవహార సిద్ధప్రయోగములతో గూడిన భాషయు, దేశీయములైన సీసము, ద్విపద, తరువోజ, రగడ, అక్కర మొదలైన పద్యములును, పురాణప్రసిద్ధము కాక స్థానిక ప్రాధాన్యముతోఁ గూడిన వస్తువును, సామాన్యజనరంజకములైన యితర కవితా లక్షణములును గల కవిత్వము దేశి విధానమునకును జెందు నని సామాన్యముగా నిర్దేశింపవచ్చును. దీనినిబట్టి యేభాషలోనైనఁ బై రెండు తెఱంగులకుఁ జెందిన కవిత్వమును ఉండుట కవకాశ మున్నది.

పూర్వాంధ్రమహాకవులలో నన్నయను మార్గ కవిత్వమునకును, పాల్కురికి సోమనాథుని దేశికవిత్వమునకును మార్గదర్శులుగాఁ బేర్కొనవచ్చును. ఇది ప్రాధాన్యవ్యపదేశముచేఁ జెప్పినమాట. ఇరువురియందు రెండు విధానములును గోచరించుట కవకాశమున్నది. కాని నన్నయలో మార్గపుఁబోలును సోమనాథునిలో దేశిపాలును అధికముగా నున్నవనుట నిర్వివాదము. సోమనాథుఁడు తనప్రధానకావ్యము

లను ద్విపదచ్ఛందమున రచించెను. అతఁడు జాను తెనుఁగునందును దేశీవిధానమునందును ఎక్కువ యభిమానము ప్రదర్శించెను. తన కావ్యములందు వ్యవహార సిద్ధములైన ప్రయోగములు పెక్కు గావించెను. ఈవిధముగా నారోజులలోఁ గవిత్వమున మార్గదేశీపద్ధతుల విభేదము స్పష్టముగా గోచరించును. తిక్కన తనభారతరచనలో నారెండు విధానములకును అద్భుతమైన సామరస్యము కల్పించెను. అతఁడు రసపాత్రపోషణాదులందు మార్గపద్ధతినే యనుసరించినను గొన్నివర్ణనములందును భాషాప్రయోగమునందును అపూర్వమైన దేశితనము బ్రదర్శించెను. విరాటపర్వమున నుత్తరాభిమన్యులవివాహమును వర్ణించుచు తిక్కన తననాఁటి దేశీయసంప్రదాయముల నెన్నిటినో యందుఁ జొప్పించెను. ఇంక తెలుఁగుభాష కాతఁడు కలిగించినపెంపుసొంపులు వర్ణనాతీతములైనవి. అతఁ "డాంధ్రావళి మోదముం బొరయునట్లుగ" రచన సాగింతు నని విరాటపర్వారంభమునఁ జెప్పియుండెను. ఆంధ్రావళి యనుపదము పండితులనే కాక సామాన్యులైన తెలుఁగుప్రజలనుగూడ సూచించును. సామాన్యులుసైత మర్థముచేసికొని యానందము పొందవలె ననిన నాతఁడు సంస్కృతసమాసములను గాక తెలుఁగుపదముల నెక్కువగా వాడవలయును. తిక్కన భారతమున సాధ్యమైనంతవఱకుఁ దెలుఁగు పదములను వాడుటకే ప్రయత్నించి యాభాషకున్న శక్తిని అందచందములను నిరూపించెను. క్లిష్టములు దురవగాహములు నైన ధార్మికతాత్త్విక విషయములనుగూడ విశదముగా వ్యక్తీకరించుశక్తి తెలుఁగుభాషకుఁ గలదని ప్రయోగాత్మకముగాఁ జూపినవాఁ డతఁడే. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు జానుతెనుఁగు, దేశితెనుఁగు వాడుదు మని వాచ్యముగాఁ జెప్పిరే కాని తమరచనలలో సంస్కృత పదములను గూడ ధారాళముగా వాడియే యుండిరి. నిజమైన దేశిమార్గము తిక్కనరచనయం దధికముగా గోచరించును. దేశి, మార్గము అనునవి భాషయొక్క ధర్మములు. ఆధర్మములు రెండింటికిఁ దనరచనలో అద్వైతమును అనఁగా సామరస్యమును కలిగించుటకుఁ బ్రయత్నించి కృతార్థుఁడైనవాఁడు తిక్కన. అతఁడు సంఘటించిన ధర్మాద్వైతసంధానమున నిది యొకభాగము.

తిక్కన జీవితమందుఁగూడ ధర్మాద్వైతస్థితి కానిపించును. వైదిక లౌకిక ధర్మములు రెండింట నాఱితేఱియుండుట కొట్టరువువంశస్థుల విశిష్టత. వారు లౌకికకార్యములం దెంత ప్రజ్ఞాశాలులో వైదికకర్మకలాపములందుఁగూడ నంత నిష్ఠ గలవారు. "వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచునే" తిక్కన మనుమసిద్ధియాస్థానమున మంత్రిత్వము కొనసాగించెను, కేతన దశకుమారచరిత్రమున తిక్కన కర్మప్రవణతను విశేషముగా వర్ణించెను. అతఁడు దశకుమారచరిత్ర కృతిగ్రహణమునాఁటి కింకను యజ్ఞమాచరించి యుండకపోవచ్చును. తరువాత యజ్ఞముచేసి సోమయాజియై మనోవాక్కాయములందుఁ బవిత్రతను సంతరించుకొని పంచమవేదరచనకుఁ బూనుకొనెను అతఁడు మంత్రిపుంగవుడుగాఁ బ్రదర్శించిన రాజనీతియు స్వామిభక్తియు జగద్విదితములైనట్టివి. అక్కన బయ్యనలను దాయాదులు తిక్కరాజుమరణానంతరము నెల్లూరురాజ్యము నాక్రమించి మనుమసిద్ధిని రాజ్యభ్రష్టు నొనరింపఁగా తిక్కన ఓరుగంటి కేగి, కాకతి గణపతిదేవచక్రవర్తిని దర్శించి, యాతని దనవాక్చాతుర్యముచేతను బాండితీప్రతిభలచేతను మెప్పించి, యాతనిచేఁ ధనప్రభువును సింహాసనమందుఁ బునఃప్రతిష్ఠితునిఁ గావించెను. ఈ విషయమున నాతఁడు ప్రదర్శించినరాజనీతివైశారద్యమప్రతిమానమైనది. అతఁడు లౌకికకార్యధురంధరత్వమున తిక్కనామాత్యుఁడు; వైదికకార్యకరణపరాయణత్వమున తిక్కనసోమయాజి. ఇందొకటి లౌకికధర్మము. రెండవది వైదికధర్మము, పరస్పర విరుద్ధములైన యీధర్మములకుఁ దనజీవితమున సామరస్యము కల్పించి తిక్కన ధర్మాద్వైతస్థితిని బోషించెను. అతడు సహజముగా నద్వైతతత్త్వము

నెఱింగి యామార్గమున జీవితము సఫలము కావించు కొన్న మహనీయుడు.

తిక్కన భారతరచనమున నాంతరముగాఁ గల్పించినధర్మాద్వైతమును గొంత కలదు. అందుఁ జాలభాగము వ్యాసోపజ్ఞక మైనట్టిదే. భారతమునఁ బెక్కుచోట్ల హింసాహింసలు, సత్యాసత్యములు మున్నగు విరుద్ధధర్మముల స్వరూపము వివరింపఁ బడినది. చీఁకటివెలుఁగులకువలె వానికి సామరస్యము కల్పించుట దుష్కరము. కొన్నిచోట్ల ధర్మాధర్మ తత్త్వనిరూపణ మతిసూక్ష్మమై బహు గహనముగా నుండును. కొన్ని పరిస్థితులలో హింసయే యహింస యగును; అసత్యమే సత్య మగును. "భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యమ" ఇత్యాది పద్యములను బరికించినచో నీవిషయములు తేటతెల్ల మగును. ఇట్టి ధర్మ సూక్ష్మములను విశదీకరించు నుపాఖ్యానములు శాంత్యానుశాసనికపర్వములలోఁ గొన్ని కలవు. అవి సామాన్యదృష్టికి విరుద్ధములుగాఁ దోఁచు ధర్మములకు సామరస్యమో అభేదమో కల్పించుచు విస్మయజనకములుగా నుండును. ఇట్టికథలను నిపుణముగా రచించినవాఁ డగుటచేఁగూడ తిక్కనయందు ధర్మాద్వైతపరాయణత ప్రకటీకృత మగుచున్నది.

"కవిత్వము సంధ్యావందనమునకు బావగా" రని శ్రీతిరుపతివేంకటకవులు శ్రవణానందమున వ్రాసియున్నారు. కవితాప్రియులు కర్మఠులై యుండుట యెచ్చటనో కాని సమకూడదు. తిక్కన సోమయాజి యెంత కవితాప్రియంభావుకుఁడో యంత కర్మనిష్ఠుఁడు. అతఁడు ధర్మాద్వైతస్థితి కవలంబ మైన మహాభారతము నతిసమర్థతతో ననువదించుటయే కాక కవితామతజీవితాదులగు పలురంగములందుఁగూడ నట్టి స్థితిని సాధించి, పూర్ణజీవితము పుచ్చి, యాంధ్రుల కారాధ్యదైవ మైనాఁడు.



కీ. శే. కొమ్మా రంగమ్మగారు

డా. బూదరాజు రాధాకృష్ణ

# ధ్వని లిపి సంబంధం

§ 1.0 లిపి ధ్వని సంకేతం. లేఖనం లిపి సంఘటన పద్ధతి. ఏ కారణంవల్లనో ఈ రెంటికీ విలక్షణమైన నిగూఢగౌరవం లోకంలోవచ్చింది. లిపి అంటే ప్రజలకు భయభక్తులున్నాయి. అనేక జాతుల వారు లిపి దేవదత్తమనే భావించారు. మెసపటోమియన్లు నిసబ (Nisaba) అనే దేవత లిపినిర్మాత అని విశ్వసించారు. జేబిలోనియన్లు దేవతల రాయసకాడైన నబూ (Nabu) లిపికారకుడనుకొన్నారు. థోత్ (Thoth) అనే దైవం లిపిని సృష్టించినట్లు ఈజిప్టువారి నమ్మకం. చైనీయుల్లో కొందరు లిపి నిర్మాత వర్తకవాణిజ్యాలను కనిపెట్టిన ఫోహి (Fohi) అని, మరికొందరు చతుర్నేత్రభూత ముఖంగల త్సాంగ్‌ఛిన్ (Ts'angchin) అని నమ్ముతారు. ముస్లిములు లిపికర్త అల్లా అని, హిందువులు బ్రహ్మ అని విశ్వసిస్తారు. బ్రహ్మ ఏర్పరచిన లిపి 'బ్రాహ్మీలిపి' అని నమ్మకం. మానవనిర్మితమే అనేవాళ్ళు లేకపోలేదు. రూన్ (rune) లిపిని ఓడిన్ (Odin) నిర్మించాడని, ఐరిష్‌లిపిని ఆగ్మియోస్ (Ogmios) కనిపెట్టాడని లోకవార్త. సిక్వోయా (Siquoah) అనే వ్యక్తి అమెరికా సంయుక్తరాష్ట్రాల్లోని ఉత్తర కెరోలినా ప్రాంతంలో వాడుకలోఉన్న షిరోకీ (Chirokee) భాషను 1821లో లిపిబద్ధం చేశాడట. అతడే 1824లో ఈ లిపిలోని 200 సంకేతాలను 85కు సంక్షేపించి ఆధునీకీకరించాడట. జె. ఇవాన్స్ (Evans) అనే ఆంగ్లేయ మతప్రచారకుడు కెనడాలోని క్రీ (Cree) ఇండియన్ల భాషకేకాక ఆ పరిసరాల్లోని ఆల్గాన్‌క్విన్ (Algonquin) భాషలకు 44 రేఖాగణితరూపాలతో (geometric forms) లిపినిర్మాణం చేశాడు. ఆగ్నేయ చైనాలోని మియావో (Miao) భాషలకు ఇటీవలనే మత ప్రచారకులు లిపి నిచ్చారు. 1848కి కొంచెం ముందుకాలంలో సిరాలియోన్ (Sierraleone), లైబీరియాల్లోని వాయ్ (Vai) నీగ్రోలకు బుకెలె (Bukele) అనే వ్యక్తి ఒక లిపిని సృష్టించాడు. అలాగే కిసిమి కమల (Kisimi Kamala) అనే వ్యక్తి మెండె (Mende) వర్ణమాలను నిర్మించగా కేమరూన్లలోని బాముం (Bamums of Camaroons) ప్రజలకు న్జోయా (Njoya) అనే కులపెద్ద 1900 ప్రాంతంలో లిపిని ప్రసాదించాడు. సొమాలీభాషకు ఇస్మాన్ లూసఫ్ (Isman Lusuf) అనే వాడు లిపికర్త కాగా, సైబీరియాలోని ఛుక్చి (Chukchi) తెగవారికి తెనెవిల్ (Tenevil) అనే గొర్రెలకాపరి లిపిని కల్పించాడని, ఫ్రెంచిగినీ లైబీరియాల్లోని తోమా (Toma) జాతివ్యక్తి విదో (Wido) ఒక లిపికర్త అని చెబుతారు. ఇలాంటివే ఇటీవలి ఉదాహరణలు అనేకమున్నాయి. ఇవన్నీ లిపి మానవనిర్మిత మనటానికి నిదర్శనలు.

§ 1.1 లిపి నిర్మాతలు దేవతలయినా మానవులయినా అదంటే భయభక్తులుచూపటం అనాది సిద్ధంగా ఉంది. ఏవేవో చక్రాలని కొన్ని 'మంత్రాక్షరాలు' ఒక ప్రత్యేక పద్ధతిలో రాస్తే వాటికి అతీత శక్తు లున్నాయని మనమంతా నమ్ముతున్నాము. తాయెత్తుల్లో మంత్రాక్షరాలు రాయించి చుట్టచుట్టి రక్షగా కట్టుకుంటున్నాము. చదువురానివాళ్ళు కూడా రాత ఉన్న రాళ్ళను భయభక్తులతో పూజిస్తూ, ఇతరులను తాకనీక, శాసనపరిశోధకులను బాధించినట్లు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'నా నెల్లూరు మండలయాత్ర'లో పేర్కొన్నారు. 'Abracadabra' వంటి ధ్వని లిపుల్లో దివ్యశక్తులున్నాయని

ఇంగ్లీషువా రంటారు. ఈ మంత్రాల తాయెత్తుల ఆచారం బేబిలోనియన్ల నాటినుంచీ ఉన్నది. యూదులు మంత్రాక్షరాలు రాసిన వస్త్రాలు ధరించి ప్రార్థనలు చేస్తారు; తలవాకిలి దగ్గర అలాంటి అక్షరాలు చెక్కిన రేకులు తగిలిస్తారు. కొరాన్‌లోని పద్యాలు రాసిన తాయెత్తులు ముస్లిములు ధరిస్తారు. రోగిని ప్రార్థనపుస్తకం కాగితాలతో విసిరినా, ఆ కాగితం ఉండచేసి రోగిచేత మింగించినా, త్వరలో కోలుకుంటాడని క్రైస్తవులు నమ్ముతారు. ఇవన్నీ భక్తుల మార్గాలు. లౌక్యులుచేసే ఘనకార్యాలు కొన్ని ఉన్నాయి. ఒక దేశాన్ని జయించిన రాజులు అక్కడి ప్రజల లిఖిత సారస్వతాన్ని ధ్వంసం చేస్తారు. ఈ లిపిబద్ధ నిక్షేపాలతోబాటు పూర్వ చరిత్ర సంస్కృతులను గురించిన జ్ఞాపకాలు నశిస్తాయి కాబట్టి, అధీన ప్రజలు కాలక్రమాన పురాతన వైభవాలను మరిచిపోయి దాసానుదాసులవుతారని వారి నమ్మకం. 1520 లో మెక్సికోను జయించిన కార్టెజ్ (Cortez) అజ్టెక్ సాహిత్యాన్ని ధ్వంసం చేశాడు. నాజీలు తమ సిద్ధాంతాలకు విరుద్ధమైన సాహిత్యాన్ని నిర్మూలిస్తే, యుద్ధానంతరం మిత్రరాజ్యాలవారు బదులుతీర్చుకున్నారు. చరిత్రలో ఇలాటి సంఘటనలు వేనవేలు. భాషను ధ్వంసం చేయటం అసాధ్యం కాబట్టి దానికి ఇంచుమించు ప్రతిరూపమైన లిపిబద్ధ సాహిత్యాన్ని నాశనం చేయటం ప్రత్యామ్నాయమార్గం.ఇదీ వీలుగానప్పుడు మాతృభాషా సాహిత్యాలను అధ్యయనంచేయటం మానిపించిగాని, నిరసించిగాని అన్యభాషాదాసులను సృష్టించటం మరో మార్గం. వీటినిబట్టి మానవులకూ వారి భాషలకూ ఉన్న అన్యోన్యసంబంధాన్ని, ఆ భాషకు దాని 'లిపి' రూపమిచ్చే శక్తినీ గుర్తించవచ్చు.

§ 2.0 ఒక భాషకు ఒకే లిపి ఉండాలనిగాని ఏకకాలంలో భిన్నలిపులు ఉండగూడదనిగాని నియమం లేదు. మచ్చుకు ఇంగ్లీషునే తీసుకుందాం. నాలుగురకాల లిపి భేదాలను బడుల్లో నేర్పినా వాటిలో రెండురకాలు ముద్రణకోసం, రెండు చేతిరాతకోసం, ఉద్దేశింపబడినాయి. ఇవి చాలక త్వరగా రాయటంకోసం 'స్టెనోగ్రఫీ' వచ్చింది. బెల్ నిర్మించిన గోచరలిపి (Visible speech) ఒకటి ఉంది. ఇలానే మరికొన్ని. జపానీయులు మూడు రకాల లిపులు వాడుతూ ప్రస్తుతం నాలుగోది తయారుచేసుకుంటున్నారు. సంస్కృతానికి దేవనాగర లిపి కాక ప్రత్యేక లిపులున్న దేశభాషలెన్ని ఉన్నాయో అన్ని లిపులూ ఉన్నట్లే; తెలుగు అక్షరాల్లో సంస్కృతభాషను రాస్తాంగదా మరి. ఒక భాషను దానికి సహజమైన లిపిలోగాక ఇతరభాషల లిపుల్లో రాయటాన్ని ప్రతిలేఖనం (transliteration) అంటారు. అన్ని భాషలనూ ధ్వని ప్రధానమైన ఏదో ఒక ప్రత్యేకలిపిలో రాయటాన్ని పరివర్తితలేఖనం (transcription) అంటారు. మొత్తం మీద మనం భిన్నలక్షణాలుగల భిన్న భాషల ధ్వనిసంకేతాలను 'లిపు'లనే పిలుస్తున్నా, వాటిలో స్వభావ తారతమ్యాలు అనేకమున్నాయి. చారిత్రక పరిణామక్రమాలూ చాలా ఉన్నాయి.

§ 3.0 భిన్నలిపుల పరిణామక్రమాలను చూస్తే వాటి స్వభావతారతమ్యాలు కూడా తెలుస్తాయి. ప్రాచీన మానవుడు తాను చూచిన వస్తువుల, ప్రాణుల, ఆకారాలను చిత్రీకరిద్దామనే సహజస్ఫురణతో (instinct) చేసిన ప్రయత్నాల ఫలితంగా లిపికి ప్రాథమికరూపం ఏర్పడివుండవచ్చు. అంటే, ఒక వస్తువుకు తానుగీసిన రేఖాచిత్రం, ఆ వస్తువును ఏయేధ్వనులతో భాషారూపాన వ్యవహరిస్తున్నాడో ఆ ధ్వనులకుకూడా సంకేతంగా గ్రహించి ఉండవచ్చు. పులిబొమ్మకూ పకార, ఉకార, లకార, ఇకార ధ్వనుల సమాహారానికీ సంబంధం ముడివేస్తే, ఆ బొమ్మ ఆ ధ్వనులకు నిశ్చిత సంకేతమయిందన్నమాట. చిత్రలిపి(Picture-writing) ఈ విధంగా ఏర్పడి ఉండవచ్చు. నిజానికి ఇది లిపీకాదు-చిత్రమూ కాదు. ఇది కేవలం ధ్వనికి సంకేతం కాదు; పదసంకేతం కావచ్చు. ఇందులో చిత్రలేఖనంలోని కళాదృష్టిలేదు; కేవలం ఉపయోగదృష్టి మాత్రమే ఉంది. సరైన లిపిలో నిర్ణీత

సంఖ్యలో సంకేతా లుంటాయి. వస్తుసంఖ్య అసంఖ్యాకం కాబట్టి ఇందులో నిశ్చితత్వం లేదు. పైగా మూర్త వస్తువులకే (concretes) గాని అమూర్త పదార్థాలకు (ab.tracts) ఏకప్రతికృతి నిర్ణయం అసాధ్యంకాబట్టి చిత్రలిపి అసంపూర్ణమూ అసంగతమూ అవుతుంది. కాలక్రమాన ఈ లోపా లను పరిహరించే మార్గాలు దొరికేయి. మూర్త వస్తు చిత్రీకరణలో నిర్ణీతమైన రేఖలు నియమిత పద్ధతిలోనే గీసే ఏర్పాటు జరిగింది. అమెరికన్ ఇండియన్లు, ఈజిప్షియన్లు, చైనీయులు పూర్వం వాడిన లిపుల్లో మూర్తవస్తువుల కన్నిటికీ నియ మిత సంకేతాలు తయారయ్యాయి. ఆ తరవాత లేఖన సామగ్రినిబట్టి లేఖ్యవస్తువునుబట్టి లిపి స్వరూపం భిన్నదేశాల్లో భిన్నవిధాలుగా మారటమే కాక ఒకేదేశంలోని లిపికూడా భిన్నరూపాలను సంతరించుకోవలసి వచ్చింది. ప్రాచీన మెసపొటేమి యాలో కోలగా ఉండే హ్రస్వదీర్ఘ రేఖలతో రేఖాలిపి (cuneiforms) ఏర్పడింది. ఇందుకు ప్రధాన కారణం బంకమట్టి బిళ్ళలమీద రాయవలసిరావటం. ప్రాచీన ఈజిప్షియన్లు పెపైరస్ (papyrus) అనే పీచువంటి పదార్థంమీద ఈకలతో రాయటంవల్ల రూపసంకేత లిపి (Heiroglyphics) ఏర్పడింది. లాటిన్ ఇంగ్లీషు లిపులు దీనినుంచే ఏర్పడ్డాయి. అయితే ఈ లేఖనమంతా మూర్తవస్తు చిత్రీకరణమే. అమూర్తవస్తు విషయంలో మొదట మొదట ఆ పదార్థానికి ఒక కొండగుర్తులాంటి సంకేతాన్ని ఏర్పాటు చేసుకోగా, కాలగతిలో ఆ గుర్తే భాషలో ఆ పదార్థానికున్న పేరుతో ముడిపడిపోయింది. ఈ విధంగా చిత్రేతర సంకేతాలకుకూడా లిపికల్పన జరిగింది. ఈ స్థితిలో వచ్చిన ప్రధానపరిణామం 'పదాలకు సంకేతాలు ఏర్పడటం'. భాషలోని ప్రతి పదానికీ ప్రత్యేక సంకేతాలున్న ఈ లిపికి భావలిపి (ideograph) అనే పాడుపేరు వచ్చింది. ఇప్పటి వారు దీన్ని పదలేఖనం (word-writing) అని గాని పదలిపి (logograph) అని గాని వ్యవహ రిస్తున్నారు. చిత్రీకరణకు సాధ్యంకాని వాటికి పదలిపి, సాధ్యమయ్యే వాటికి రూపసంకేతలిపి-ఈ విధంగా భిన్నాధారాల మిశ్రణంవల్ల కొత్తలిపు లేర్పడ్డాయి. మచ్చుకు 'లక్ష'ను సూచించటానికి ఈజిప్షియన్లు 'చిరుకప్ప' బొమ్మ గీచేవారు-బహుశా అవి అసంఖ్యాకంగా ఉంటాయి కాబట్టి. 'మంచి' అనే భావాన్ని సూచించటానికి చైనీయులు 'స్త్రీ' బొమ్మ 'బిడ్డ' బొమ్మల కలయికను వాడేవారు. మన అంకెలు ఈ రకం సంకేతాలే. ఫలితంలో ఒక్కొక్క పదానికి ఒక్కొక్క సంకేతం చొప్పున వేలసంకేతాలను నేర్చుకోవటం కష్టమేగదా. పదస్వరూపం కూడా భాషకొక తీరుగా ఉంటుంది. పెద్దమాటలు (సమా సాలు) ఉన్న భాషలవారు చిన్నచిన్న పదాల సంకేతాలను చేర్చి పెద్దమాటలకు చిహ్నాలు కల్పించ వలసి వచ్చింది. ఈ కలయికల్లో కొన్ని సంకేతాలు పునఃపునరుపయోగంవల్ల క్రమంగా 'ధ్వని' సంకే తాలుగా పరిణమించాయి. ఈ మార్పులో లిపికి పదసంకేతత్వంపోయి ధ్వనిసంకేతత్వం వచ్చింది. దీనిపర్యవసానమే అక్షరమాల (phonograph). దీనికర్తలు ప్రాచీన మెసపొటేమియన్లు. ఈ లిపి లక్షణాలే వారినుంచి ప్రాచీన సుమేరియన్లకు, వారి నుంచి బేబిలోనియన్లకు, వారినుంచి ప్రాక్ప్రతీచీ భాషలవారికీ సంక్రమించాయి. ప్రాచీన పర్షియన్లు ఒక్కొ అక్షరానికి (syllable) ఒక్కొనియమిత సంకేతం ఏర్పరుచుకున్నారు. ఆ తరవాత అక్షర మాలానిర్మాణం సులభతర మయింది. సిప్రస్ దీవిలోని ప్రాచీన గ్రీకులు 65 సంకేతాలతో అక్షర మాలను నిర్మించుకొన్నారు. జపాన్‌వారు చైనీయుల పదలిపికి కటకన (Katakana), హిరగన (Hiragana) అనే రెండు రకాల అక్షర మాలలను చేర్చి వాడుతున్నారు. ఇంతకుముందు లిపిలేని భాషలవారికి కొత్తగా లిపిని ఏర్పరిచేటప్పుడు అక్షరమాలాబోధనమే సులభంగా ఉందని భాషా వేత్తలు కనుక్కున్నారు. క్రీ. పూ. 1500 ప్రాంతంలో అచ్చులు లేని 21 సంకేతాల లిపిని సెమిటిక్ ప్రజలు సాధించారు. వారి భాషలోఅచ్చులు అంతముఖ్యం కాదు. కాబట్టి వారికి ఆ లిపి సరి

పోయింది. సెమిటిక్ లిపి రెండు శాఖలుగా చీలింది. ఉత్తర సెమిటిక్ లిపి సంప్రదాయం ఫోనీషియన్లకు, హీబ్రూలకు, ఆర్మీనియన్లకు సంక్రమించింది. ఆర్మీనియన్ విధానమే నేటి హీబ్రూ, సిరియన్, అరబిక్ లిపులకు మూలరూపం. ఫోనియన్ విధానం చాలావరకూ ఆర్మీనియన్ పద్ధతి కొంతవరకూ దేవనాగరికి మూలరూపాలు. అచ్చుల గుర్తింపు ప్రధానమైన భారతీయ భాషలకు ఈ రెండు పద్ధతులూ అవసరమైనాయి. అక్షరమాలా నిర్మాణాన్ని మహోత్తమదశకు తెచ్చినవారుభారతీయులు. హల్మాత్రాన్ని సూచించటానికి, కేవలం అచ్చులనే నిరూపించటానికి, ప్రత్యేక సంకేతాలను ఏర్పరచుకున్న దేవనాగరి ధ్వనిలిపి (Phonetic script) గా పరిణమించింది. ఫోనీషియన్ లిపి నేర్చిన గ్రీకులు పెద్దమార్పులే చేశారు. భాషలోఉన్న అచ్చులన్నిటికీ ప్రత్యేకసంజ్ఞలు ఏర్పరచలేకపోయినా, అచ్చులకూ హల్లులకూ ప్రత్యేక సంకేతాలను కల్పించారు. అయితే అచ్చుల హ్రస్వదీర్ఘ తలను గుర్తించలేదుగాని ఊనికను (accent), విరామచిహ్నాదులను (punctuation and markers of sentence modulation) సృష్టించారు. భాషలోని ప్రతివొక్క ధ్వనికీ ప్రత్యేక సంకేతం లేకపోయినా, ఉన్నంతలో అర్థభేదకధ్వను లయిన వర్ణాలను (phonemes) సంకేతించటంవల్ల ప్రాచీనగ్రీకులు అధునాతన వర్ణలిపికి (phonemic or alphabetic writing) మూలకారకులైనారు. ధ్వనికొక ప్రత్యేకచిహ్నం మనేది ఇందులోని సిద్ధాంతం.

§ 4.0 ధ్వని వర్ణభేదాలను శాస్త్రీయంగా పరిశీలించకపోతే లిపి స్వభావభేదాన్ని నిర్ణయించటం సాధ్యపడదు. ఆ తరవాతగాని భాషకూ లిపికీ ఉన్న సంబంధం తేటపడదు. మానవులు తమ అభిప్రాయాలను ఇతరులకు తెలియబరచటానికి చేసే కొన్ని నిర్ణీత ధ్వనుల సమాహారం భాష. ఆ ధ్వనులను పలికే తీరును ఉచ్చారణ అంటారు. ఒక్కొక్క భాషలో నియమితధ్వనులు కొన్ని మాత్రమే ఉంటాయి. ఒక భాషలోని ధ్వనులన్నీ అన్ని పరిసరాల్లోనూ (environments) వాడుకలో ఉండవు; తెలుగులో పదాదిని ఙ, ఞ, ణ, ళ, ధ్వనులు లేనట్లు. భాషలోని ఒక్కో ధ్వనికి ఇతరధ్వను లన్నిటితో కలిసిన అన్నిరకాల కలయికలూ ఉండవు; తెలుగులో ల్మ ర్క మొదలైనవి పదాదిన లేనట్లు. వాడుకలో ఉన్న ధ్వనులన్నీ అర్థభేదాన్ని కలిగించేవి కావు. చ చే లు, ర ఱ లు, రాతలో ప్రత్యేక రూపంలో ఉన్నా, వాటికి ప్రత్యేకోచ్చారణలు ఉన్నాయని వ్యాకరణాలు నిర్దేశించినా, నేటి తెలుగులో వాటికి భేదంలేనట్లు ఒకదానికి బదులు మరోదాన్ని పలికినందువల్ల అర్థభేదం కలగటం లేదు. ఒక్కో వ్యక్తి ఎన్నిరకాల ధ్వనులను పుట్టించగలడో, తన మాతృభాషలో మాట్లాడేటప్పుడు వాటిలో ఎన్నిటిని భిన్న సందర్భాల్లో పలుకుతాడో, ఎవరూ లెక్కించినట్లు లేదు. కానీ కొన్ని ధ్వనులను ఒకదానికి బదులు మరోదాన్ని పలికినప్పుడుగాని, కొన్నిటిని చేర్చినందువల్లగాని, తొలిగించినందువల్లగాని, అర్థాలు మారిపోతాయని అందరికీ తెలుసు. ఉదా. కనుక, కానుక; అరి, హరి; పానకం, పాకం. ఈ విధంగా అర్థభేదం కలిగించగల ధ్వనులను భాషాశాస్త్రంలో వర్ణాలు (phonemes) అంటారు. పై ఉదాహరణలనుబట్టి అ, ఆ; హ; న; అనేవి తెలుగులో ప్రత్యేక వర్ణాలు. ఈ వర్ణాలను మార్చినందువల్ల ఉన్న అర్థం పోవటంగాని, లేనిది రావటంగాని, ఏ అర్థమూ లేకపోవటంగాని జరుగుతుంది. అందువల్ల భాషలో ఇవి ప్రాథమికాలు; వ్యాకరణశాస్త్రంలో కనిష్ఠప్రమాణాలు (minimal units). ఆయా వర్ణాలను పలకటంలో కొద్దిపాటి భేదాలుండవచ్చు. అవన్నీ ధ్వనులు (phones) మాత్రమే. అవి అర్థాలు మార్చవు. కొన్ని వర్ణాలు ఒక పదంగాను, కొన్ని పదాలు ఒక వాక్యంగాను, అనేక వాక్యాలు భాషగానూ మనం భావిస్తాం. ఒక భాషలోని వర్ణసముదాయానికి నాగరకులు ఏర్పరచుకున్న రేఖాత్మక సంకేతాన్ని (graphic symbol) లిపి (script) అంటారు. లిపిలో ప్రత్యేకవర్ణాలకు ప్రత్యేక సంకేతాలుండటం అవసరం. అర్థభేదమో

లోపమో నివారించటానికి భిన్నవర్ణాలను చేర్చి పదాలను, భిన్నపదాలను సంఘటించి వాక్యాలను, నిర్మించుకున్నట్లే భిన్న సంకేతాలతో భాషను లిపిబద్ధంగా లిఖిస్తాము. (ఈ వాక్యాలనుబట్టి భాషలో మొదట ధ్వనులు, ఆ తరవాత వర్ణాలు, ఆ మీదట పదాలు, ఆ పైన వాక్యాలూ ఏర్పడ్డాయని అనుకోరాదు. ఇదంతా వ్యాకర్తలు కొన్ని ప్రయోజనాల కోసం చేసిన కృత్రిమ విభాగమే). ఇలాంటి లిపి సంఘటనకే లేఖనవిధానం (orthographic practice) అని పేరు. భాషలు ఎప్పుడు పుట్టింవాయో కచ్చితంగా చెప్పలేముగాని అవి పుట్టిన తరవాత వేల సంవత్సరాలకు లిపులు పుట్టాయని గట్టిగా చెప్పగలం. ప్రపంచంలోని కొన్నివేల భాషలకు ప్రత్యేక లిపులు లేవు. ప్రత్యేక లిపులున్న భాషలు రెండు రకాలు: 1. పండువేల సంవత్సరాల చారిత్రక పరిణామంలో బహుకాలం క్రితమే లిపిబద్ధమైనవి. 2. ఇటీవల లిపిబద్ధమైనవి. ఇక్కడ 'బద్ధ' మనే మాట ముఖ్యమయింది. (ఇది ఇంగ్లీషులోని 'reduced to writing' అనే పదబంధం వంటిది). ఒక భాషకు లిపి ఏర్పడ్డ తరవాత దాని సహజ పరిణామం కట్టుబడకపోయినా కుంటుబడుతుంది కాబట్టి, భాషలోని కొన్ని ప్రధాన ధ్వనులకే గాని అన్నిటికీ లిపిలో స్థానముండదు కాబట్టి, ఒకనాటి భాషలోని ధ్వనులకు స్థానముండి సరికొత్తగా వాడుకలోకి వచ్చిన ధ్వనులకు లిపిలో అంత సులభ ప్రవేశం దొరకదుకాబట్టి, అంతో ఇంతో భాషాస్వరూపాన్ని లిపి వికృతీకరిస్తుంది కాబట్టి, 'బద్ధ' శబ్దం ఎంతో ఉచితమయింది. మన భావాలను పరోక్షంలోనో భవిష్యత్తులోనో ఇతరులకు కొంతవరకైనా తెలియజేయటానికే కాక, మనపూర్వచరిత్ర సంస్కృతులను భాషలో వచ్చిన చారిత్రక పరిణామాలను గూడా తెలుసుకోటానికి కూడా 'లిపి' తోడ్పడుతుంది. ఒక భాషకు లిపి ఏర్పడ్డ కొంతకాలానికి అవి పరస్పరం ప్రభావితంచేసుకుంటాయి. ఈ పరస్పర ప్రభావాలనుంచి మనం అనేక విశేషాలను తెలుసుకోగలం.

§ 4.1 ధ్వనిశాస్త్రజ్ఞులు (Phoneticians), లిపిశాస్త్రజ్ఞులు (Epigraphists and Palaeographists) ఆయా విషయాలపై రాసిన గ్రంథాలనేకం ఉన్నాయి. కాని, ధ్వని లిపిసంబంధాలను శాస్త్రీయదృష్టితో పరిశీలించిన భాషాశాస్త్రజ్ఞులు (Linguists) గాని, లేఖనశాస్త్రజ్ఞులుగాని (Grammatologists) గాని రాసిన ప్రత్యేక గ్రంథాల సంఖ్య చాలా తక్కువ. తెలుగులో పద్దమూరి గోపాలకృష్ణయ్యగారు రాసిన 'ధ్వని లిపిపరిణామం' అనే ప్రత్యేక గ్రంథ మున్నది. అయితే అది పరిమిత ప్రయోజనాల నుద్దేశించి చేసిన రచన. ప్రాచీనాంధ్ర శాసనాల్లో కావ్యాల్లో లక్షణగ్రంథాల్లో లభించే ప్రమాణాలు ఆధారంగా (లిపిబద్ధమైన ఆధారాల ద్వారా) భాషా పరిణామాన్ని వ్యావహారిక వాదదృష్టితో నిరూపించటమే ఆ గ్రంథ ప్రయోజనం. అందుకు గ్రంథకర్త అవలంబించిన పద్ధతుల్లో కొన్ని ఆధునికాలు; చాలావరకు సంప్రదాయ మార్గానుసారాలు. భాషా లిపుల అన్యోన్య ప్రభావాలను నిరూపించటానికి అందులో విశేషప్రయత్నం జరగలేదు. బహు శ్రమఫలితంగా ఈవిషయం మీద ఒక ప్రామాణిక గ్రంథం రావలసిన అవసరమెంతో ఉంది. ఈ వ్యాసంలో సుదీర్ఘచర్చలకు తావులేదు. సంక్షిప్తంగా ఆధునిక పరిశీలన మార్గాలను సోపపత్తికంగా నిర్దేశించటమే ఇప్పటి కర్తవ్యం.

§ 5.0 ఒక్కొక్క వర్ణానికి ఒక్కొక్కసంకేతమున్న వర్ణమాల ఏర్పడ్డ తరవాత ఏ భాషయినా దానితో బద్ధం చేయబడ్డప్పుగాని, లిపి స్థిరపడ్డమీదట లేఖన సంప్రదాయాలేర్పడి లిపిలో లేనిలోపాలను తెచ్చిపెడతాయి. మానవుడిలో సహజంగా ఉన్న సనాతనత్వం ఇందుకు దారితీస్తుంది. లేఖకుడు రాసువాడే ధ్వనివర్ణాలు దీటైన లిపిగా లేదో నిర్ణయించుకోడు. తనపూర్వులు రాసినతీరునే అనుసరిస్తుంటాడు. 'గతానుగతికో లోకో న లోకః పారమార్థికః'. తన భాషలో, ఉచ్చారణలో, వచ్చినమార్పులను గమనించడు. ఈ కారణంవల్ల ఒకజాతికి లేఖన

మర్యాదలు వ్యవస్థితం కాగానే పదాల వర్ణక్రమం (spelling)తో బాటు కోశవ్యాకరణాల్లోని రూపాలు కూడా లిఖిత సారస్వతంలో సమయబద్ధమై పోతాయి. ఈ విధానంలో కాలక్రమాన లిఖిత సారస్వతానికీ వ్యక్తిగతమైన ఉచ్చారణకూ మధ్య అగాధాలు ఏర్పడతాయి. అంటే, భాష మారినంతగా లేఖనం మారదు. మచ్చుకు, లాటిన్ వర్ణమాలలోని 'c' కకారానికి సంకేతంగా ఉండేది. ఆంగ్లేయులూ, ఐరిష్‌వాళ్ళూ, లాటిన్ వర్ణమాలను స్వాయత్తం చేసుకోగానే పై సంకేతాన్ని కకారలేఖనానికి ఉపయోగించారు. ఫలితంగా ప్రాచీనాంగ్లంలో నేటి 'cow' అనే మాటను 'cu' అని రాసినట్లే 'ship' అనే మాటను 'scip' అని రాసేవారు. భాషాపరిణామంలో కొన్ని ధ్వనులు ఉచ్చారణలో తొలిగిపోయినా సంప్రదాయధోరణి వల్ల అవిలేఖనంలో నిలిచిపోతాయి. తెలుగులో ఒకనాడు ప్రత్యేకవర్ణంగా ఉన్న 'ఱ'కారం, ఏడోశతాబ్దికే వ్యవహారభ్రష్టమైనా పదమూడోశతాబ్ది చివరి వరకూ లేఖనంలో నిలిచింది. ఋ, ౠ, ఌ, ౡ లను తెలుగులోకి ఎరువుగా తెచ్చుకొనేటప్పటికే వాటి ఉచ్చారణ సంస్కృతంలోనే రి/రు, రీ/రూ, లు, లూ గా మారింది. కానీ తెలుగు లిపిలోనూ లేఖనంలోనూ వాటికింకా స్థాన ముండనే ఉంది. 'సప్తరుషులు' అనే తిక్కన ప్రయోగాన్ని, 'క్లుప్త'మనే అనంతుడి ప్రయోగాన్ని, 'ఌ వర్ణస్య ద్వాదశ తస్యదీర్ఘాభావాత్'అనే సూత్రాన్ని,'ఋఌ వర్ణంబులు రలతుల్యంబు'లనే శాస్త్రాన్ని, ఇక్కడ అనుసంధించుకోవాలి. ఇంగ్లీషులో ధ్వనిశూన్యాక్షరాలు (silent letters) ఇంకా రాతలో నిలిచిఉండటం ఇలాటిదే. 'know, gnat, knight' వంటివి ఇందుకు ఉదాహరణలు. తెలుగులో 'వ్రాత, క్రొత్త' వంటివి కూడా ఇదేరకానివి. ఇంగ్లీషు 'స్పెల్లింగులు' గందరగోళంగా ఉంటాయని అందరితో బాటు మనమూ ఆక్షేపిస్తున్నామని జ్ఞాపకం తెచ్చుకోవాలి. (అయితే మన వ్యవస్థ ఆంగ్ల వ్యవస్థకన్నా కొంచెం మెరుగు). అసలు ఉచ్చారణలో 'స్పెలిజ్' అని ఉండగా ద్విత్వలకారగకారాలు లేఖనంలో నిలిచాయి. ఈ స్థితిని పురస్కరించుకొని డాక్టర్ క్రౌన్ (Crown) అనే బహుగ్రంథకర్త పదిహేడో శతాబ్దంలో పుస్తకానికి ఒక రీతిలో తనపేరు 'cron, croon, croun, crone, croone, croune' మొదలైన విధాలుగా రాసేవాడట. లారెన్స్ ఆఫ్ అరేబియా సంజ్ఞావాచకాలను తడవకొకతీరుగా రాసి 'ఏదో విధంగా పేర్లు రాస్తున్నాను, ఈ విధానాలెంత అసందర్భమైనవో ప్రదర్శించటానికి' ("I spell my names anyhow, to show what rot the systems are") అనేవాడట. ఇంగ్లీషు నేర్చిన విదేశీయు డొకడు 'Fish' (ఫిష్) అనే ధ్వనిక్రమంగల తనపేరుతో సంతకం చేస్తూ 'GHOUTIUGH' అని రాశాడట. 'gh' అనే దాన్ని 'tough' లోని 'f' ధ్వనితోను, 'o' ను 'women' లోని 'i' ధ్వనితోను, 'ti' ని 'station' లోని షకారధ్వనితోను, 'ugh'ను 'dough' లోని ధ్వని శూన్యతతోనూ సరిపెట్టుకోమన్నాడట. ఇలాంటి అపక్రమాలు మనకూ లేకపోలేదు. 'వ్రాశాడు, వ్రాశేడు, వ్రాసాడు, వ్రాసేడు, రాశాడు, రాసేడు,' మొదలైనవి. అంటే లేఖన సంప్రదాయాల ఫలితంగా ఒకే సంకేతం భిన్నవర్ణ స్ఫోరకంగాను, భిన్న సంకేతాలు ఏకధ్వని సూచకంగాను పర్యవసిస్తాయి. మాటవరసకు ఇంగ్లీషులోని 'o' అనే సంకేతం "hope, pot, log, nothing, worm, women" అనే వాటిలో భిన్నవర్ణాలకు ప్రత్యామ్నాయం. 's' వర్ణానికి 'sing' లో 's' అనేది, 'rice' లో 'c' అనేది, 'crescent' లో 'sc' అనేవి, 'schism' లో 'sch' అనేవి భిన్న సంకేతాలు. తమిళంలో పరుషాక్షరాలే సరళాలకు గూడా సంకేతంగా ఉంటాయి. తెలుగులో ఐ, అయ్-లు; ఔ, అవ్-లు ప్రత్యామ్నాయ సంకేతాలు. 'ం' (అనుస్వారం) అనే ఒకే సంకేతం ఙ, ఞ, ణ, న, మ-లకు ప్రత్యామ్నాయంగా కావ్యభాషలోను, శాసనభాషలో మరికొన్ని ఇతరవర్ణాలకున్నూ చిహ్నంగా ఉంటున్నది.

§ 5.1 సంప్రదాయ మెంత బలవత్తరమైనా, కొన్ని సంకేతాలు వర్ణమాలనుంచి తొలిగిపోవటం కొన్ని కొత్తగా వచ్చి చేరటం జరగక తప్పదు. తెలుగులో ఒకనాడున్న 'ఱ' కారం పూర్తిగానూ వలపలగిలక (ఽ) చాలావరకూ తొలిగిపోయాయి. దంత్యచజలకు (నిజానికి ఇప్పుడివి దంతమూలీయాలు) లేఖనంలో ౘ, ౙ, అనే చిహ్నాలు ఇటీవల ముద్రణం వచ్చిన తరవాత వచ్చిచేరినవే. ఒకనాటి లాటిన్ వర్ణక్రమంలో 21 సంకేతాలు మాత్రమే ఉండేవి. లాటిన్ నిత్యవ్యవహారంలో ఉంటుండగానే 'y, z' అనేవి చేరాయి. బహుశా గ్రీకునుంచి తెచ్చుకున్న ఎరువుమాటలను రాయటంకోసం ఇవి చేర్చుకున్నారు. 'ʒ, ρ' అనే సంకేతాలు పూర్వకాలపు ఇంగ్లీషులో ఉన్నా నేటి లిపినుంచి తొలిగిపోయాయి. వీటిని నిలుపుకోవటంతోబాటు మరి కొన్నిటిని చేరిస్తేగాని ఆంగ్లవర్ణక్రమం సువ్యవస్థితంకాదు. యూరప్ భాషలవాళ్ళు ఆంగ్లేయులంత సంప్రదాయదాసులు కారు. నార్వీజియన్ లిపిలో 'æ, ф, a' అనేవి కొత్తగా చేరాయి. స్పానిష్‌లో '≂, ll, rr' అనేవి కలిశాయి. అన్ని లిపుల్లోను మధ్యయుగాల్లోలేని విరామాదిచిహ్నాలు (punctuation marks) కొత్తగా చేరాయి. తాటాకు పుస్తకాలను శాసనాలనూ చదివేవారు '।, ॥' అనేవి తప్ప మరే వర్ణేతరచిహ్నాలూ మన లిపుల్లో లేవని గ్రహించి ఉంటారు. గణితాది శాస్త్రాలవల్ల, ఆధునిక జీవనావసరాలవల్ల, అనేక నూతన సంకేతాలు అవిచ్ఛిన్నంగా వచ్చి చేరాయి – చేరుతున్నాయి. వీటిలో చాలాభాగం ఇంగ్లీషువారి ప్రసాదమే. ముద్రణ యంత్రాన్ని కనుక్కోవటమేగాక ముద్రిత గ్రంథాలను అసంఖ్యాకంగా ప్రచురిస్తున్నదికూడా వారేకాబట్టి పఠనపాఠన సౌకర్యంకోసం వారే వీటిలో అనేక చిహ్నాలను కనిపెట్టవలసి వచ్చింది. ఇవన్నీ లిపిలో భాగాలు కాకపోయినా లేఖనంలో భాగాలు కాక తప్పదు.

§ 5.2 లేఖన సంప్రదాయాలు వ్యవస్థితమైన తరవాత లేఖకులు సృష్టించే వర్ణక్రమాలు కొన్ని ఉంటాయి. భాషాలేఖనాలను ప్రమాణీకరించే మహాయజ్ఞంలో వీరుకూడా కొన్నిసమిధలు ఆహుతిస్తారు. ఇంగ్లీషులోని 'debt, doubt, subtle' వంటి పదాల్లోని 'b' (బకారం) ప్రాచీనాంగ్లంలోగాని, దాని మూలభాష ప్రాచీన ఫ్రెంచిలోగాని, ఎన్నడూ లేదు. 'debitum, dubito, subtilis' అనే బహుపురాణకాలంనాటి లాటిన్ మూలాలను ఊహించిన లేఖకులు 'b' ని తెచ్చిపెట్టారు. ఇలాటివి అనేకం. తెలుగులో కుసుమాయుధుడి కొరవి శాసనంలో 'ముట్చెలినను' అనే ప్రయోగముంది. 'ముచ్చిలు' శబ్దానికి పూర్వరూపంలో రేఫస్థానంలో టకారం ఉంటే అది ప్రామాణిక మవుతుందని లేఖకుడు ఊహించి ఉండవచ్చు. ఇతర ద్రావిడ భాషలతో పోల్చిచూస్తే 'ముచ్చిలు' శబ్దంతప్ప రేఫయుక్త శబ్దమేలేదు. అంటే మన పూర్వలేఖకుల ప్రమాణీకరణ ప్రయత్నాలవల్ల లేని లక్షణాలు లిపి ద్వారా భాషకు సంక్రమిస్తున్నా యన్నమాట. అందువల్ల సంప్రదాయ లేఖనాల్లోని బహుముఖాల అవిమర్శక ప్రయత్నాలవల్ల పూర్వలేఖనాలను చదవటం కష్టసాధ్యమవుతున్నది. రాతలో కనిపించిన ప్రతిసంకేతాన్నీ యథాతథంగా ఏదోఒకవర్ణానికి చిహ్నమని అంగీకరించటం ప్రమాదకరం. తరవాతి ప్రకరణాల్లో తెలుగు శాసనరూపాల ద్వారా ఈ విషయాన్ని ప్రపంచిస్తాను. అన్ని సందర్భాల్లో శాసన లిపి ఆనాటి భాషకు యథార్థ ప్రతిబింబ మనుకోవటం సాహసమే. కానీ, లేఖకుల భ్రమప్రమాదాలను పరిశీలించినప్పుడు కొన్ని అసాధారణ లిపి సంఘటనల ద్వారా ఆనాటి ఉచ్చారణాదులను గుర్తించటం సాధ్యమే. ప్రాచీనాంగ్ల లిఖిత ప్రతులను పరిశీలిస్తే ఇలాటివి కొన్ని తెలుస్తాయి. క్రీ. శ. 9–11 శతాబ్దాల మధ్యకాలపు లిఖిత ప్రతుల్లో పదాంత న, మ, కారాలూ ఊనికలేని అచ్చులూ మార్పేమీ పొందనట్లు స్థూలదృష్టికి కనిపిస్తాయి. కాని అక్కడక్కడ లేఖకులుపడ్డ పొరపాట్లవల్ల పదోశతాబ్దికి అనేకాచ్చులు ఎకారంగా మారాయని, పదాంత న, మకారాలు వ్యవహారభ్రష్ట

పైనాయని తెలుస్తుంది. మచ్చుకు, మామూలుగా ఉండవలసిన 'worda' కు బదులు 'worde' అని, 'fremman'కు బదులు 'fremme' అని, 'godum' కు బదులు 'gode' అని ఉండటంవల్ల పైనిర్ణయం సాధ్యమయింది. సంప్రదాయ వ్యాకరణాలూ పండితులూ తెలుగులో హల్సంధి నంగీకరించరు. మనం 'భారతదేశ' మని రాస్తున్నామే గాని 'భారద్దేశ' మనే పలుకుతున్నాం. 'శ్రీమన్మహామండలిక కాకతి గణపద్దేవ మహారాజు' అనే శాసన లేఖనం శిలాక్షరన్యాయంలో ఈ నాటి మన ఉచ్చారణ పన్నెండో శతాబ్దికే ఉందని ఋజువు చేస్తున్నది. ఈ మార్పు ఎక్కడ బయలుదేరిందో కూడా సూచిస్తున్నది. లేఖకుల ప్రమాణీకరణ ప్రయత్నాల వల్ల భాషలో లేని లక్షణాలు ప్రమాదవశాన బయట పడతాయి. దీనికి విలోమ లేఖనం (inverse spelling) అని పేరు. క్రీ. శ. 7-9 శతాబ్దాల మధ్యకాలపు శాసనాల్లో 'కుమ్మటి, వఱదియ (వరదయ్య), కాశ్యపగోత్తునికి, వచ్చినవాఱు' వంటి రూపాలు కనిపిస్తాయి. ఆనాటికే సాధుశకటరేఫ భేదం భాషలో పోయిందనటానికి ఇవి నిదర్శనలు.

§ 60 లిఖిత భాషా పరిశీలనలో వచ్చే పెద్ద చిక్కుల్లో రాతకు ఉపయోగించిన సాధనాలవల్ల కలిగినవే ఎక్కువ. తామ్ర శిలాశాసనాల్లోని లిపి చాలావరకు మార్పులేకుండా తొలిరూపుతోనే కనిపిస్తుంది. తాళపత్రాలు మూడు శతాబ్దాల పైకాలం చెడిపోకుండా ఉండటం అరుదు. ఒకనాటి కావ్యానికి తరతరాలుగా ప్రతికల్పనలూ పుత్రికలూ వెలువడటం సహజం. నన్నయ రాసిన తాళపత్రా లిప్పుడు దొరకవు. భిన్నకాలాల మధ్య లిపిలో, లేఖన సంప్రదాయంలో, భాషలో ఎన్నో మార్పులు వచ్చి ఉంటాయి. భిన్న ప్రతుల్లో భిన్నపాఠాలు కనిపించటానికి ఇదో ప్రధానకారణం. లేఖకులు కాళిదాస కవిత్వంలో తమ పైత్యాలు కలిపి ఉంటారు. ఉక్త లేఖన దోషాలనుబట్టి పాఠభేదాలు రాగా వాటిలో ఏది సమంజసమో నిర్ణయించటంలో 'పరిష్కరించటం'లో పండిత విమర్శకులు స్వకీయాభిప్రాయాలను చొప్పిస్తారు. భాషాపచారమని గిడుగు రామమూర్తిగారు ప్రతిఘటించిన 'సంస్కరణ' మిదే. కాని, ఎందరు గిడుగులు ప్రయత్నించినా ఎన్ని పిడుగులు వర్షించినా మూలపాఠాన్ని పునరుద్ధరించటం (reconstitution) ఏవో కొన్ని సందర్భాల్లో తప్ప మొత్తంమీద సాధ్యపడదు. శిలాశాసనాల విషయంలోనైనా వాటినిధ్వంసంచేయటం సాధ్యమే. మార్చటం కేవలం అసాధ్యం కాదుగాని (ఈ మహా కార్యాన్ని సాధించారని కొందరినిగురించి చెబుతుంటారు) దుస్సాధమనక తప్పదు. వీటి విషయంలో చాలావరకు సంపాదకుల, లేఖకుల పొరపాట్లను గమనిస్తే చాలు. ప్రాచీన భాషా లక్షణాలు లిపి ముఖంగా తెలుస్తాయి. తాళపత్రాలవంటి నశ్వర వస్తువుల మీది లేఖనం విషయంలో వర్ణక్రమ పరివర్తనం (re-spelling) జరిగి ఉండవచ్చు. భిన్న లిపుల వాడుకవల్ల భాషాలక్షణాలు మరుగు పడవచ్చు. ఎంతో శ్రమిస్తే తప్ప— లేదా ఎంత శ్రమించినా ప్రయాసతప్ప— ప్రయోజనం లేక పోవచ్చు. లిఖిత భాషా లక్షణాలను కొన్ని సమయాల్లో ఛందః పద్ధతులు, అనుప్రాస రచనలూ బహిర్గతం చేస్తుంటాయి. తెలుగులో ముద్రణ సౌకర్యాలు రాకపూర్వం అరసున్నా అనే సంకేతం లేదు. శాసనాల్లోగాని, తాళపత్రాల్లోగాని 'ఁ' ఎక్కడా కనిపించదు. దానిక్కూడా పూర్ణబిందువే (ం) లిపి సంకేతంగా ఉండేది. అప్పకవి 'సగము జాబిల్లి' ఏ సగమో అతనికే తెలియాలి. కొంతకాలం తరవాత ద్విరుక్త హల్లులకు ముందున్న బిందువు పూర్ణమని అద్విరుక్తాలకు ముందున్నది ఖండమని ఒక లేఖన సంప్రదాయం (ఇది ఏనాడూ ఆచరణలో నియమితంగా లేదు) ఏర్పడినా, మొదట మొదట (12వ శతాబ్దికి ముందు) అలాటి నిర్ణయమేమీ లేదు. వచనంలో ఖండబిందు వెక్కడ ఉండేదో, పూర్ణ మెక్కడ ఉండేదో ఊహించటానికి లిపి తోడ్పడదు గాని పద్య శాసనాల విషయంలో ఛందోరీతులను బట్టి అరసున్నా ఉన్నచోట్లను కొంతవరకు గుర్తించటం వీలుపడుతుంది. అయితే ఛందశ్శాస్త్రంలో—

గణయతిప్రాసాదుల విషయంలో— శాసనకాలం నుంచి ఛందోగ్రంథాల కాలంవరకూ మార్పులు రాలేదనిగాని వచ్చివుండవనిగాని ఊహించుకోవాలి. మార్పులేవైనా ఉండివుంటే నిర్ణయం అసంగతమవుతుంది. ఇలాంటి సందర్భాల్లో ఛందోఽనుకూలంగా పూర్వలిపినీ భాషనూ ఏ విధంగా మార్చుకొన్నా శాస్త్రవిరుద్ధమే. అలా మార్చి సవాలక్ష 'వృత్తగంధి' వచనాలను సృష్టించుకుంటూ పోతే అనేకంగా తప్పుడు నిర్ణయాలు వస్తాయి. ఇదికూడా పాఠసంస్కరణవంటి పాపమే. ఇంగ్లీషువంటి భాషలో అంత్యానుప్రాసలను (end-rhymes) బట్టి లిపిద్వారా ధ్వనిస్వరూపాన్ని గుర్తించవచ్చు. ఇలాంటి సహాయక పరిస్థితులు మరికొన్ని ఉన్నాయి. ప్రాచీన జర్మన్ భాషలో శబ్దాలంకార వృత్తులను పాటిస్తూ ఒకే హల్లుతో మొదలయ్యే జంటపదాలను వాడేవారు. లిపిలో మార్పుఉన్నా, ఆ రెంటి ప్రథమ వర్ణోచ్చారణం ఒకటిగానేభావించి తెలిసినమాట ఉచ్చారణను బట్టి వ్యవహారభ్రష్టమైన పదాది ధ్వనిని అరసున్నానుపునరుద్ధరించినట్లే పునరుద్ధరించవచ్చు. ఇదే విధంగా సాయపడే మరొకటి ప్రతిలేఖనం. ఒక భాషలోని పదాలను మరో భాషలోని లిపిలో రాసినప్పుడు ఆ లిపి స్వభాషాలక్షణాలను ప్రతిబింబిస్తుంది. క్రీస్తుశకారంభకాలంలో సీజర్(Caesar) చక్రవర్తిపేరును గ్రీకు లిపిలో కైజర్ (Kaisar) అని రాశారు. గ్రీకులో ఉన్న కకారం, ఆనాటి లాటిన్ లిపిలోని 'C' కకారమేనని సూచిస్తుంది. ప్రాచీన చైనీయులు బౌద్ధవాఙ్మయంలోని భారతీయ నామధేయాలను స్వభాషా లిపిబద్ధం చేసినప్పుడు అప్పటి చైనీస్ ధ్వని స్వభావాలను ప్రతిఫలించారు. కొన్ని సమయాల్లో లాక్షణికులు సమకాల ధ్వని లిపి సంబంధాలను వివరిస్తే అవి ఎంతో ఉపయోగపడతాయి. కాని అలాటి గ్రంథాల సంఖ్య చాలా తక్కువ.

§ 6.1 ఇతర భాషలు నేర్చిన విద్వాంసులు ప్రతిలేఖనం ద్వారా కొన్ని మార్పులు తెచ్చి పెడతారు. స్పెయిన్‌లో అరబిక్ ప్రభావం బాగా ఉన్న రోజుల్లో అక్కడి యూదులు అరబిక్ మాట్లాడుతూ హీబ్రూ లిపిలో అరబిక్ సాహిత్యాన్ని సృష్టించారు. మరో వైపున పరాజితులైన అరబ్బులు స్పానిష్ భాషను మాతృభాషగా అంగీకరించి జగత్ప్రసిద్ధమైన ఆల్యీమియాదో (aljimiado) సాహిత్యాన్ని అరబిక్ లిపిలో కల్పించారు. మెడిటెరేనియన్ ప్రాంతాల్లో లాడినో (Ladino) అనే స్పానిష్ మాండలికాన్ని, తూర్పు యూరప్‌లో యిడ్డిష్ (Yiddish) అనే జర్మన్ మాండలికాన్ని, మాట్లాడే యూదులు తమ సాహిత్యాన్ని హీబ్రూ లిపిలోనే రాశారు. పోలిష్‌తార్తారులు వైట్ రష్యన్, పోలిష్ భాషల్లో సాహిత్య సృష్టిచేసి అరబిక్ లిపిలోనే రాశేవారు. మనదేశంలోని ఉర్దూభాషకు పర్షియన్ రూపంలోని అరబిక్ లిపిని, హిందీకి దేవనాగరినీ వాడుతున్నా కలగలుపువల్ల తయారైన హిందూస్థానీని ఏ లిపిలో రాసినా పెద్ద ఇబ్బంది రాదు. కాకపోతే ఫలితంలో హిందీ లిపిలో మరికొన్ని లేఖన చిహ్నాలు (diacritics) వచ్చి చేరాయి. పంజాబీకి 'గురుముఖీ', నాగరీ లిపులు రెండూ వాడుకలోఉన్నాయి. తమిళులు'వట్టెళుత్తు'కు తోడుగా సంస్కృత భాషారూపాలకోసం 'గ్రంథాక్షరి'ని నిర్మించుకున్నారు. సంస్కృత పదాల ప్రతిలేఖనం కోసం తెలుగు లిపిలో మహాప్రాణాలకూ క్ష, జ్ఞ, లకూ ఋ ౠ ఌ ౡ ః లకూ లిపి ఏర్పడ్డది. ఈ విధంగా భాషకోసం లిపికి, లిపికోసం భాషకు, ఇచ్చిపుచ్చుకోలు సంబంధాలు తప్పటంలేదు. లిపిద్వారా ఇతర భాషలు నేర్చి వాటి ఉచ్చారణ తెలియని పండితులు మొదట లిపిలో, తద్వారా భాషలో లేనిపోని మార్పులు తెచ్చిపెడుతుంటారు. ఉదాహరణకు, స్పానిష్‌లోని 'Mexico' అనే లేఖనానికి ఉచ్చారణ మొదట్లో 'మెషికో' అని ఉండేది; ఆధునికోచ్చారణ 'మెఖికో'. ఇంగ్లీషువారు 'x' అనే లిపికి 'ks' (క్స) అనే ఉచ్చారముందని భ్రమించి 'మెక్సికో' అని చదవటం మొదలుపెట్టారు. వారిని చూసి మనమూ అలాగే రాస్తూ చదువుతూ ఉన్నాము. సంస్కృత వ్యాకరణాలు

'క్ష' అనేది కకార షకార సంయోగమన్నాయి (క్ష). అయినా లిపిలో 'క్ష, క్ష' లకు భేదం వచ్చిందంటే బహుశా సంస్కృతోచ్చారణలో కూడా భేదం వచ్చి ఉండవచ్చు. 'రిక్షా' (< జపానీస్. (జిన్) రికిషా) వంటి చోట్లకూడా 'రిక్ష' అనే ఉచ్చారణ కూడా వినవస్తుందంటే భాషమీద లిపిప్రభావ మెంతో తెలుసుకోవచ్చు. వీటికి అర్థం లిపివల్ల భాషలో కొత్త పలుకుబడి వచ్చిందని. ఇలాటి వనేకం. అక్షరాస్యతతోబాటు విదేశోచ్చారణాన్ని గురించి కొద్దిగా తెలుసుకున్నవాళ్ళు మరికొన్ని మార్పులు తెచ్చి పెడుతుంటారు. ఫ్రెంచిలో చాలా మాటల్లో పదాంత హల్లులు ఉచ్చారణలో లోపించటం విన్న కొందరు 'tête-à-tête' అనే ఫ్రెంచి పదబంధాన్ని ఇంగ్లిషులో 'తెయ్తతే' అని మార్చి ఉచ్చరిస్తారు— రాతలో మార్పుచేయకపోయినా ఇది క్రమంగా భాషలో స్థిరపడుతున్నది. నిజానికి ఫ్రెంచిలో దీని ఉచ్చారణ 'తేత్ అ తేత్' అని.

§ 6.2. లిపి పరిశీలనద్వారా ఒక్కొక్కసారి ధ్వని పరిణామ కాలాదులను చూచాయగా నిరూపించవచ్చు. మచ్చుకు క్రీ. శ. 7–9 శతాబ్దాల తెలుగు శాసనాల్లో చిన్నయసూరి చెప్పిన 'అక్కటాదుల' వంటివి అనేకం లేఖనంలో కనిపిస్తాయి— 'ఇచిన, వచిన' మొదలైనవి. కొండకుబి భాషలో ఈనాటికీ అలాటి ఉచ్చారణ ఉంది. అందులో ద్విరుక్త-అద్విరుక్తాలు అర్థభేదకాలు కావు. అందువల్ల తెలుగు శాసన కాలాన్ని బట్టి కొండకుబి లక్షణాల కాలాన్ని నిర్ణయించవచ్చు. ఆ కాలంలో అది తెలుగునుంచి వేరుపడి ప్రత్యేకభాషగా పరిణమించిందని ఊహించనూవచ్చు. ఇంతకుముందు పేర్కొన్న 'Caesar, Kaisar' అనే వాటిలోని గ్రీకువర్ణక్రమాన్నీ ఆ లిపికాలాన్నీ అనుసరించి లాటిన్‌లో అప్పటికి తాలవ్యీకరణం జరగలేదని చెప్పవచ్చు. 7–8 శతాబ్దాల తెలుగు శాసనాల్లో నాలుగైదుచోట్ల 'కేసిన, కేసిరి' వంటి రూపాలు లేఖనంలో కనిపిస్తాయి. పక్కపక్కనే 'చేసిన, చేసిరి' వంటివి అసంఖ్యాకంగా కనిపిస్తాయి. అప్పటికి మూడునాలుగు వందల సంవత్సరాల క్రితమే తెలుగులో తాలవ్యీకరణ మారంభమైనా లేఖన సంప్రదాయంలో పూర్వ రూపాలు అంటిపట్టుకొని ఉన్నాయి. 'కేసిన' వంటి రూపాలు లేఖనంనుంచి పూర్తిగా తొలిగిపొయ్యేదాకా (8 వ శతాబ్దందాకా) పై ఉచ్చారణ మాండలికంగా ఉండివుంటుందని ఊహించవచ్చు.

§ 6.3. భాషలో భిన్నమాండలి కోచ్చారణలున్నపుడు వాటిలోనుంచి ఒకటోరెండో లిపిబద్ధమవుతాయి. ఆ వెంటనే వ్యవహార గౌరవంకన్నా లిపిబద్ధతాగౌరవం అధికమై ఆరూపమో, రూపాలో ప్రామాణ్యం పొందుతాయి. 'ఇసుక, ఉసుక' మొదలైన రూపాలనేకం ఉండగా 'ఇసుక, ఇసుము' లిపిబద్ధమై ప్రామాణికమైనాయి. ఇటీవల మరికొన్ని రూపాలు లేఖనంలో ప్రవేశించినా వాటికి మరికొంత కాలం గడిచేదాకా ప్రామాణ్యం కలగదు. పరుషాది సరళాదిగా ఉండే జంటమాటలనేకం (గుంట, కుంట, మొదలైనవి) నిజానికి భిన్నకాలాలవి; భిన్నమాండలికాలవి. ఇవి లిపిబద్ధమై వ్యవహారగతం కాగా 'బొక్క, పొక్క' వంటి జంటలో మొదటిది మాత్రమే లేఖన వ్యాపారంవల్ల స్థిరపడ్డది. శిష్ట వ్యవహారంలోని 'సెనగల' కన్నా పామర వ్యవహారంలోని 'చెనగలు' (సంస్కృత 'చణక' శబ్దభవం) మూలరూపానికి సన్నిహితమయినా లిపివల్ల మొదటిదే సాధురూప మనిపించుకుంటున్నది. ఇలాటి సందర్భాల్లో ప్రామాణ్యానికీ తదభావానికీ దారి తీసింది లేఖనవ్యవహారమే. చదువుకున్నవాళ్ళు లిపిని బట్టి, లిఖిత నిఘంటు వ్యాకరణాదులనుబట్టి, ఉచ్చారణాదులను ప్రామాణ్యబుద్ధితో స్వీకరిస్తుంటారు కాబట్టి మొదటిసారి ఏకారణంచేతనో లిపిబద్ధమైన రూపం తరవాతి కాలాలవారికి ప్రామాణిక మనిపిస్తుంది. భాషమీద లిపి ప్రదర్శించే ప్రభావాల్లో ఇదొకటి ప్రధానమయింది. నిత్యవ్యవహారంనుంచి భ్రష్టమైన రూపాలుకూడా లిపిలేఖనాలవల్ల స్మరణకు వస్తూ కాలాంతరంలో పునరుపయుక్తంకావటం జరుగుతునే ఉంటుంది. 'Smooth, paramour, behest' వంటి ప్రాచీనపదాలను పద్దెనిమిదో శతాబ్ది

లోని ఆంగ్లకవులు వాడుకలోకి మళ్ళీ తెచ్చిపెట్టారు. మనకవులు ఇప్పటికీ వాడే పడికట్టుమాటలు కొన్ని 'వెస, రహి, మునుకొని, పింపిళ్లు కూయంగ' వంటివి నిజానికి 'ప్రాతబడ్డ మాటలే'. కేవలం లేఖన వ్యవహారమే అవి వ్యర్థపదాలుగా నయినా భాషలో నిలవటానికి కారణం. కొన్ని సమయాల్లో పూర్వ కవి ప్రయోగాలకు లిఖితరూపాలనే గాని వాటి ఉచ్చారణ విధానంగాని అర్థంగాని స్పష్టంగా తెలియని నవీనమహాకవులు అశ్రుతపూర్వ పదాలను (ghost words) సృష్టిస్తుంటారు. మచ్చుకు, ఛాసర్ రచించిన "in derring do that longeth to a knight" (=in daring to do...) అనే పదబంధాన్ని మరోవిధంగా అర్థం చేసుకున్న స్పెన్సర్ మహాకవి 'derring-do' అనే సమాసం ఉండేదని, దానిఅర్థం 'brave actions' అని భ్రమించి, తాను ప్రయోగించాడు! ఇలాంటి చమత్కారం ఇటీవలిది ఒకటి గిడుగు రామమూర్తిగారికి చిన్నయసూరి నీతిచంద్రికలోనే దొరికింది. (పాపం అది సూరికృతంకాదు; పరిష్కర్తల పునస్సృష్టి. 'చేసుకున్నవాడికి చేసుకున్నంత!'). 1920లో మదరాసు విశ్వవిద్యాలయంవారు అచ్చువేసిన నీతిచంద్రిక మిత్రభేదంలో "కాసరముల మీసరముగాఁ జించుచు" అనే పదబంధం కనిపించగా గిడుగువారికి దానిభావం బోధపడక బహుఫండిత పరిశీలన చేయించారు. ఈ వాక్యభాగానికి సరైన అర్థంకుదరని పండితులు పూర్వప్రతులను తిరగవేసి గాలించగా "కాసరముల మీసరము గాసించుచు" అనే మూలపాఠం దొరికింది ! 'గాసించు' అనే క్రియ ఉందని గ్రహించని పరిష్కర్తలు 'గా' అన్నది తుమర్థకమని ఊహించారు. 'సించుచు' అని ('లంగూడి'ని లాగా) విభజించగా 'చించుచు' అనే సాధురూపాని కది గ్రామ్య రూపంగా భాసించింది. సక్రమంగా ద్రుతసంధిచేసి పరిష్కృత పాఠాన్ని ప్రచురించారు. ఫలితంలో అశ్రుతపూర్వమైన 'మీసరముగా' అనే విశేషణ సృష్టిచేసి చేతులు కడుక్కున్నారు. ఇంత పరిశోధనకు తీరికా, ఓపికా లేని సామాన్యపండితులు ఈ వాక్యక్రమాన్ని లేఖనంద్వారా భాషలో ప్రవేశపెట్టి ధన్యులవుతారు. 'నేని, నెగయు' వంటి రూపాలు భాషలో ఈ విధంగా ప్రవేశించినవే.

§ 6.4 'పాఠపరిష్కరణ, పాఠసంస్కరణం' వంటి మాటలు మనకు గడచినఒకటిన్నర శతాబ్దంగా వినబడుతున్నాయి. లాక్షణిక వాక్యాలను వేద ప్రమాణంగా భావించి, తప్పు లనిపించిన రూపాలను దిద్దివేయటమే మనవాళ్ళు చేసిన, చేస్తున్న పరిష్కరణ సంస్కరణలు. లిపిగత లోపాదులను గమనించి ప్రాచీన వర్ణస్వరూపాన్ని గ్రహించటం కనీసం తెలుగు దేశంలో ఇప్పుడిప్పుడే ఆరంభమవుతున్నది. ఆ విధమైన శాస్త్రీయ పరిశీలనచేసి లేఖన సంప్రదాయాదులవల్ల మరుగుపడ్డ రహస్యాలను బహిర్గతం చేసే నియమబద్ధ అధ్యయనానికి పాఠవిమర్శనం (textual criticism) అని పేరు. ఒకటి రెండు విశేషాలను ఈ పద్ధతిలో ప్రస్తావవశాన నిరూపించటం మంచిదనిపిస్తుంది. మన వ్యాకరణాలు దంత్య చజలను గురించి చెబుతున్నాయి. అవి చెప్పే మాటలు మనకు పరోక్షనిదర్శనాలు. శాసనాల్లో కనిపించే 'మొడత్స' (* మొడచే-కు బదులు), 'పుత్సుకొని' (*పుచ్చుకొని–కి బదులు), 'పత్సలు' (*పచ్చలు-కు బదులు)వంటివి ప్రత్యక్షనిదర్శనలు. ఈ మూడు సందర్భాల్లోను 'చే' కారాన్ని తకార సకార సంయోగం ద్వారా నాటి లేఖకులు నిరూపించారు. ఆ రెండు ధ్వనులూ దంత్యాలుకాబట్టి*చకారం దంత్యమని భావించవచ్చు. అంటే మనపూర్వ వ్యాకరణాల వర్ణన నిజమేనన్నమాట. ఇప్పటి వ్యవహారంలో చకారం దంతమూలీయమే గాని దంత్యం కాదు. ఉచ్చారణ నిరూపణం చేసే స్థానకరణ ప్రయత్నాల్లో మొదటిదాని విషయంలో ప్రాచీన నవీన ధ్వనులకు భేదముందని ఇది నిరూపిస్తుంది. ఇవి నిరూపించే మరోముఖ్య విషయం ఈ రూపలేఖన కాలానికి తెలుగులిపిలో దంత్య చకారసూచనకు ప్రత్యేకమైన లేఖన చిహ్నం (diacritic) ఏర్పడలేదని. ఇంగ్లీషులోని 'జ'

ధ్వనికి తుల్యమైన ధ్వనినేటి తెలుగులోనూ ఉంది. ఇప్పటికింకా సర్వజన సమ్మతమైన లేఖనచిహ్నంగాని లిపిగాని దానికి ఏర్పడలేదు. అయినా కొన్ని శాసన స్థరూపాలూ కావ్యప్రయోగాలూ ఆ వర్ణం ఉనికిని క్రీ. శ. పదకొండో శతాబ్దంనుంచీ నిరూపిస్తాయి. 'దివ్య, దివ్వె' అనే జంటలో ఒకదానిలోని యకారం మరోదానిలోని ఎత్వం 'ఱ' సూచకాలంటే వ్యాకరణ సూత్రాలనుచూపి చాలామంది ఒప్పుకోరు. అలాటిదే 'నూన్య, నూనె' అనే జంటకూడా. 'యెశోనిధి, జెవము, శెంఖు, యనక, సమర్పించను, చేశను, దేవంమ్మంగారి చాతను, శావ (=సేవ), మొదలైన విడివిడి మాటలనూ 'పళ్యం, పళ్యాలు, పళ్యెం, పళ్యాలు; గొఱెలు, గొఱ్యలు', వంటి జంటలనూ శ్రీనాథుడి 'కళ్ళైనగట్టించి' వంటి ప్రయోగాలనూ చూసిన తరవాత వారే కొంత సందేహంలో పడవచ్చు. 'చన్నయాచార్యుఁ డాచార్య చక్రవర్తి', 'చాటంత మబ్బుదోఁచె', 'చాతకంబుల దయచాత', 'చఱకగువింటి బల్మిఁ బెలుచఞ', మొదలైన కవి ప్రయోగాలను (అందులోనూ చివరిది అహోబల పండితుడిది) చూసి గతుక్కుమని ఒప్పుకోవలసి వస్తుంది. లిపిస్వరూపం ఎలాఉన్నా పూర్వవర్ణ పునరుద్ధరణం సాధ్యమనటానికి ఇది ఒక నిరూపణ. ఇలాంటి ఆధారాలమీద, భాషాచరిత్రమీద, గురి ఉంచి చేసింది పాఠవిమర్శనం. లాక్షణికభాషణల మీద, పరోక్షతార్కిక హేతువులమీద ఆధారపడి చేసే సంస్కరణవల్ల భాషా లిపి సంబంధం మరుగున పడిపోతుంది.

§ 7.0 ప్రాచీన లేఖనాలవల్లనే గాక ఆధునిక-ఉచ్చారణంలో భేదమున్నప్పుడల్లా లిపినే ప్రమాణంగా తీసుకొని ఉచ్చారణను నిర్ణయించటం సర్వసాధారణ లోకపద్ధతి. వ్యవహారంలో భిన్నరూపాలున్నప్పుడు లిపికి సన్నిహితంగా ఉన్నదే ప్రామాణికమనే భావం ఈనాటికీ ప్రబలంగానే ఉంది. నాగరకత, విద్యాసౌకర్యాలు అభివృద్ధమవుతున్న కాలంలో స్థానిక మాండలికాది అప్రామాణిక భాషారూపాలను వాడే జనం లక్షల సంఖ్యలో ప్రామాణిక వాగ్రూపాన్ని నేర్చుకోవలసి వస్తుంది. ప్రామాణిక భాషాలక్షణాలు తమకు పరిచితం కావు కాబట్టి లిపినే ప్రమాణంగా తీసుకొని వాటిని నేర్చుకునేవారి సంఖ్య విపరీతంగా పెరిగి పోతుంది. ఈ సమయంలో సామాన్యమైన భాషాపరిజ్ఞానంగల ఉపాధ్యాయులు (వీరి సంఖ్య ఎప్పుడూ అధికమే) ప్రామాణిక భాష నేర్చుకొనే విద్యార్థులకు లక్షణ నిర్ణేత లవుతారు. కాని, వారిలో అత్యధిక భాగం ప్రామాణిక భాషారూపాలను సహజంగా వాడేవారు కాదు. కాబట్టి తాముగూడా లిపినే ఉచ్చారణ నిరూపకంగా భావించి భాషోద్ధరణ చేస్తారు. ఈ ప్రభావాలవల్ల సరికొత్త శక్తితో లిపి భాషను మార్చే ప్రయత్నం చేస్తుంది. ఫలితంలో లిప్యుచ్చారణ (spelling pronunciation) భాషలో పర్యాప్తంగా వ్యాపిస్తుంది. లిపికీ ఉచ్చారణకూ సంబంధం తక్కువగా ఉండే—లేఖన సంప్రదాయాలు వర్ణక్రమలోపాలూ మొదలైనవి కారణంగా వ్యవహారదూరమైన లిపిని వాడే—భాషల్లో ఈ విపరీతం పెచ్చరిల్లి పోతుంది. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషల్లో ఈ దుస్థితి అధికం; భిన్నప్రాంతీయ, వర్గ, మాండలికాలనుంచి ప్రామాణిక భాష ఏర్పడ్డ జర్మన్ భాషవంటి వాటిలో అత్యధికం. వర్ణధ్వని సంబంధం అంత ఘోరంగా లేని తెలుగువంటి భాషల్లో ఈ ప్రమాదం తక్కువేగాని అసలు లేనిది కాదు. 1701 నాటి John Jone's Practical Phonography ప్రకారం. 'ensue, assure, sugar' వంటి పదాల్లోని 's' ను షకారంగానే ఉచ్చరించాలి. ఇప్పటి సకారోచ్చారణకు లిపే కారణం. 'often, fasten' వంటి మాటల్లోని 't' (=టకారం) ప్రాచీన కాలంలో ఉచ్చారణలో ఉండేది. మధ్యకాలంలో పోయింది. ఇప్పుడింకా కొందరు లిపిబద్ధమనే హేతువును పురస్కరించుకొని టకారం పలుకుతున్నారు. భారతీయుల ఆంగ్లోచ్చారణ చాలావరకు లిపిమీద ఆధారపడ్డదే. 'జడ్జి, బ్రిడ్జి; లాంగ్, రాంగ్' వంటి మాటల్లో ఆంగ్లోచ్చారంలో లేని పదమధ్య డకారం, పదాంత గకారం మనకు సంక్రమించాయి. పత్రికల్లో ఆధునిక

సాహిత్యంలో లిపి లోపకారణంగా 'చెప్పారు, చెప్పేరు' అనే రెండు రూపాలు కొంతకాలంగా కనిపిస్తున్నాయి. 'ఆ' ధ్వనికి లిపి లేనందువల్ల ఈ జంట రూపాల్లో ఏదో ఒకదాన్ని మొదట రాస్తుండే వాళ్ళే, 'చెప్పేరు' అనే దానికి వ్యవహారంలో భూతార్థంగాక భవిష్యదర్థమే ఉందని గ్రహించి క్రమంగా పరిహరించటం మొదలు పెట్టారు. తమ ప్రాంతీయ మాండలికంలో 'ఆ' తో కూడిన ఉచ్చారణ లేనివారు 'చెప్పారు' లోని మధ్యాచ్చు 'ఆ'గా భావించి ఉచ్చరిస్తున్నారు. లిప్యుచ్చారమంటే ఇలాటిదే.

§ 7.1 లేఖనంలో తొందరగాగాని, సంక్షిప్తంగాగాని, సూచనగాగాని, రాయటంకోసం సంగ్రహణ పద్ధతి (Abbreviating method) ఆధుని కావసరాల దృష్ట్యా ప్రవేశించింది. Page అనటానికి 'p.' (పే.) అని, professor అనటానికి 'prof.' అని, Bachelor of Arts అనటానికి 'B.A.' అని— ఇలా వందలకొద్ది సంగ్రహ సంకేతాలు వాడుకలోకి వస్తున్నాయి. భాషనుబట్టి లిపిలోని పదాది సంకేతాలను కలిపి 'radar, UNESCO' లాటి శబ్దాలను సృష్టిస్తున్నారు. మొదట లేఖన సౌకర్యంగా వచ్చిన ఈ పద్ధతి ఇప్పుడు భాషా భాగంగా పరిణమిస్తున్నది. 'వాడు మెట్రిక్ (matriculation) పరీక్షకు కూచున్నాడు; మూడు కిలోల (kilograms) పంచదార కావాలి; ఈ రోజు హెపా (HEPA = History, Economics & Politics Association) సమావేశముంది'— ఈలాటిది లిపిద్వారా భాషలో ప్రవేశించిన నూతన పదజాలం.

§ 7.2 మాట్లాడుతున్నప్పుడు విభిన్న ధ్వని విశేషచ్ఛాయలద్వారా, ఊనికద్వారా, అంగభంగిమల ద్వారా, ఇతర భాషేతర పద్ధతుల ద్వారా, మనం లిపిబద్ధం చేయలేని అనేకవిషయాలు భాషను శక్తిమంతం చేస్తాయి. లేఖనంలోనూ ఇలాటి శక్తులు కొన్ని ఉన్నాయి. వాటిని ఎంతో ప్రయత్నం చేసినా నోటి మాటల ద్వారా వ్యక్తంచేయటం బహుశా కష్టమే. మాటవరసకు, $4 \times (8 - 5 + 11)$; $4 \times (8 - 5) + 11$; $4 \times 8 - (5 + 11)$ అనే వాటిని సంక్షిప్త వాక్యాల్లో భేద బోధకంగా చెప్పి చూడండి. కనీసం ఇక్కడ భాషతో భావాలతో లిపికి సంబంధమైనా ఉంది. ఈ సంబంధం కూడా లేనివి కొన్ని లేఖన సంప్రదాయంలో ప్రవేశిస్తాయి. ఉదాహరణకు, ఇంగ్లీషులోని 'capital letters' అనేవి; ఇటాలిక్ అచ్చువేయమనటానికి రాతలో కింద గీటులు గీయటం మొదలైనవి. న్యాయశాస్త్ర దృష్టిలో భాషాలిపులకు సాధారణంగా భేదం లేదు; ఎక్కడయినా పెద్ద భేదం ఉన్నట్లుంటే లిపికే ప్రామాణ్యం. రామయ్య సోమయ్యలు అగ్రిమెంటు రాసుకున్నారంటారు. వారిద్దరూ పరస్పరానుమతితో ఇష్టపూర్వకంగా చేసుకున్న నిర్ణయాల 'లిపిబద్ధ' రూపమేగదా అది. అది నిర్ణయమెలా అవుతుంది– తార్కికంగా ఆలోచిస్తే? ఇంతకన్నా చిత్రమైనది వ్యక్తి నామానికి దాని ఉచ్చారణకూ కాక దాన్ని రాసే 'తీరు'కే న్యాయశాస్త్రం ప్రామాణ్యమివ్వటం (సంతకానికి 'వ్రాలు' చేర్చిందే చెల్లదనుకోటం). 'ఎల్లయ్య, యెల్లయ్య, యల్లయ్య' అనే వాటిలో ఆ వ్యక్తి వాడుకలో ఉన్న వర్ణక్రమం మాత్రమే నియతోపయోగంవల్ల అతని పేరుకు చిహ్నమవుతుంది. ఇంగ్లీషులో ఈ లక్షణం మరీ ముఖ్యం. 'Smith, Smythe' అనే రెండుపేర్ల ఉచ్చారణా ఒకటే అయినా వాళ్ళిద్దరూ వేరువేరు వ్యక్తులే. ఆ యిద్దరిలో ప్రతి ఒక్కడూ ఏదో ఒక రీతిగానే పేరు రాసుకోవాలి. గమ్మత్తేమంటే 'స్మిత్, స్మైద్' అనే భిన్నోచ్చారణగల 'Smythe' అనేవాడు ఏకవ్యక్తి కిందనే లెక్క— లిపిలో భేదం లేదుకాబట్టి! ఇలాటి సూక్ష్మభేదాలను తర్కించటానికి ఇక్కడ స్థలం చాలదు.

§ 8.0 మొత్తం మీద ధ్వని లిపి సంబంధాల్లో ప్రధానాంశాలను కొన్నిటిని మాత్రమే ఇక్కడ నిర్దేశించాను. వీటినిబట్టి బహుళ ప్రచారంలో ఉన్న పరస్పర విరుద్ధమైన రెండు పండితాభిప్రాయాలూ ప్రామాదికమేనని తెలుస్తుంది: 1. ఉచ్చరిత భాషా

ప్రభావం లిఖిత భాషమీదగాని లేఖనంమీదగాని ఉండదు. 2. ఉచ్చారణలో ఉన్న ప్రతి ఒక్క లక్షణాన్నీ లిపిబద్ధం చేయాలి. పై వాదాల్లో మొదటి దాన్ని 'గ్రాంథిక' వాదులూ రెండోదాన్ని 'వ్యావహారిక' వాదుల్లో కొందరూ అజాగ్రత్తగా వాడుతున్నారు. భాషలోని ధ్వని రూపలక్షణాలన్నిటినీ లిపిబద్ధం చేయటానికి కొందరు ప్రయత్నించారు– IPA (International Phonetic Alphabet), 'Analphabetic Notation' వంటివి. ఇవి సామాన్యప్రజలకుగాని, దైనందినోపయోగానికిగాని అక్కరలేదు. శాస్త్ర పరిశోధకులకు మాత్రమే ఇవి ప్రయోజనకారులు. లిపిలో కొన్ని లోపాలున్నాయని, అందువల్ల వచ్చే సమస్యలను పరిష్కరించుకోవాలనేది నిర్వివాదాంశం. తెలుగులో 'జ, f' ధ్వనులకు నియమిత సంకేతాలను కొత్తగా కల్పించుకోవాలి. 'ఋ, ౠ, ఌ, ౡ, ఁ' వంటివి కొన్ని పోవాలి. ఆయా విషయాలను నిర్ణయించుకొనే ముందు భాషను వర్ణనాత్మకంగా పరిశీలించాలి. నేటి తెలుగు లిపికీ ఉచ్చారణకూగల సంబంధాలను పరీక్షించాలి. సంధి విధానాలకూ లిపికీగల పారస్పర్యాన్ని పరిశోధించాలి. ఆధునికావసరాలను దృష్టిలో పెట్టుకోవాలి. ఆయా విషయాలను విపులంగా సోపపత్తికంగా చర్చించటానికి ఇది సమయంకాదు– స్థానమూ కాదు.

§ 9.0 ఇంతవరకూ ధ్వని లిపి సంబంధాలను గురించిన సిద్ధాంత చర్చ క్లుప్తంగాచేశాను. అక్కడక్కడ తెలుగు ఉదాహరణలను కూడా దిక్ప్రదర్శనగా ఇచ్చాను. భాషాధ్యయనం చేసేటప్పుడు ఆయా సిద్ధాంతాల పరిచయం ఎంతగా ఉపయోగపడుతుందో స్థూలంగానయినా ప్రదర్శించటం తరవాతి కర్తవ్యం. ఇక్కడ ప్రాచీనాంధ్ర శాసనాల్లోని లిపి లేఖనాలకు సంబంధించిన కొన్ని ప్రధాన సమస్యలను చర్చిస్తూ అవసరాన్నిబట్టి ఇతరోదాహరణలు ఇస్తుంటాను. శాసన ప్రమాణం వేద ప్రమాణమని, లిఖిత రూపం దోషాతీతమని భావించటం లేదు. అలాగే అవి దోషభూయిష్ఠాలని గూడా భావించటం లేదు. నిత్య వ్యవహారంలో ఎన్నో తప్పులు మాట్లాడుతుంటాం; అలాగే రాస్తూ ఉంటాం. అయితే మనకు తప్పు అనిపించేవి అసంఖ్యాకంగా ఉంటే కొంచెం ఆలోచించి ఆ మాట అనటం సబబు. 'పదుగురాడుమాట', పదిమంది రాసినరాత, ఏదో ఒక భాషా లక్షణానికో లేఖన సంప్రదాయానికో చెందివుంటుంది. అలాటిదేమీ లేదని రుజువుకానంతవరకూ అది దోషమనగూడదు. ఈ దృష్టి ప్రధానంగా ఇక్కడ చర్చిస్తాను. ఇక్కడ ఉదాహరించే శాసనపదాలను అవి దొరికే శాసనాలను సాహిత్య అకాడెమీవారు ప్రచురిస్తున్న 'ప్రాచీనాంధ్ర శాసనాలు' అనే గ్రంథంలో చూడవచ్చు. 'గ్రంథవిస్తరభీతి' ఇలా చేయిస్తున్నది.

§ 10.0 పూర్వాంధ్ర శాసనాల్లోను (చాలావరకు లిఖిత ప్రతుల్లోను) షకారేతర ద్విరుక్త హల్లు తర్వాత పాక్షికంగా వలపలగిలకను (ఙ) రాసే ఆచారం ఉండేది. 'ర్ప' అనటానికి బదులు 'పఙ' అనిగాని 'ప్పఙ' అనిగాని రాసేవారు. ఇందువల్ల భాషలోవచ్చిన మార్పేమీ లేదు. ఈ సంప్రదాయం అనాదిసిద్ధంగా దేవనాగరిలో కూడా ఉన్నది కాబట్టి తెలుగువారి కిది ఎరువుగా వచ్చిందన్నమాట. ఉదా. తూపుఙన, విషఙఋ, ఆచంద్రాకఙము, ప్రవతిఙల్ల అనేచోట్ల హల్లు అద్విరుక్తం; పెగ్గఙడ, కాత్తిఙయ అచ్చవ్వఙ– అనేచోట్ల ద్విరుక్తం. ఈ సంప్రదాయం అచ్చువచ్చిన తరవాత క్రమంగా పోవటం మొదలయింది. ఇప్పటికీ అక్కడక్కడ పూర్వ గ్రంథాలను ఈ విధంగా అచ్చువేస్తునే ఉన్నారు. ఈ ఆచారంవల్ల భాషలోకి కొన్ని పొరపాట్లు దొరిలాయనవచ్చు. అందరూ చదివే ఈ పద్య భాగాన్ని గమనించండి: "....సప్పఙంబు పడగ నీడను, గప్ప వసించిన విధంబు గదరా సుమతీ." వలపలగిలకను కవి రాసివుంటే రేఫశ్లిష్టప్రాస అని సమర్థించుకొని సంతృప్తిపడాలి. ఈ రకం ప్రాస విధానానికి లేఖన విధానమే నిజమయిన కారణమై ఉండవచ్చు. అనలిది కవి పొరపాటే కావచ్చు.

ఇదే విధమైన మరో సంప్రదాయం బిందువు తరవాత పరుషసరళాలను వైకల్పికంగా ద్విరుక్తం

చేయటం. ఇది సంస్కృత సంప్రదాయం కాదు. దొరికినంతలో ఇందుకు ప్రథమోదాహరణలు క్రీ.శ. 9-10 శతాబ్దాలనుంచి మాత్రమే కనిపిస్తున్నాయి; అంగ్గడి, గుంట్ట, అంక్కు, రక్షించ్చు, మొదలైనవి. ఈ విధానం తాళపత్ర గ్రంథాల్లోనూ నిన్నమొన్నటి వరకూ కనిపిస్తుండేవి: చిత్తగించ్చవలెను, లక్ష్మీకాంత్తము, మొదలైనవి. ప్రయోగాలనుబట్టి ఇది తెలుగులో స్వతంత్రంగా వచ్చిన సంప్రదాయ మనవచ్చు.

§ 11.0 వ్యక్తిగత సంస్కార భేదంవల్ల కొన్ని సంకేతాలను చేర్చి, కొన్ని తొలగించి, రాయటం వచ్చింది. 'అఇన, నెఇ, బోఇని' వంటి రూపాల్లో పదమధ్య యశ్రుతి లిపిబద్ధం కాలేదు. ఈ నాటికీ సరిగా చదువురానివారి రాతల్లో ఇటువంటివి కనిపిస్తుంటాయి. 'యలక్ష్మయు, వృద్దిని, వుమ్మయును' మొదలయిన రూపాల్లో ఉచ్చారణలో ఉన్న పదాది యవలు లిపిబద్ధమైనాయి. అప్పటికింకా సంప్రదాయ వ్యాకరణాలు లేవేమో, లేఖకులు బతికిపోయారు! చిన్నయసూరి నిషేధించిన పదాది యవలు అతనికి వెయ్యేళ్లక్రితమే వాడుకలో ఉండేవని ఇవి రుజువు చేస్తాయి. మొత్తానికి ఈరకం రాతలు అత్యల్పసంఖ్యాకాలు.

§ 11.1 లేఖన సంప్రదాయాలవల్లగాని, భాషోచ్చారణను లిపిలో ప్రతిబింబించే సంకల్పంవల్లగాని, ఒకేధ్వనికి—లేదా వర్ణానికి—భిన్నసంకేతాలు కనిపిస్తాయి. వీటిలో అప్పటినుంచి ఇప్పటివరకూ పర్యాప్తంగా వాడుకలో ఉన్నది వర్గానునాసికాలకు బదులు అనుస్వారం లిఖించటం. ఈ విషయాన్ని తరవాత పరీక్షిస్తాను. ఒకే ధ్వనికి ప్రత్యామ్నాయ సంకేతాలయిన 'అయ్, ఐ'లను యథేచ్ఛగా వాడటం ఇటువంటిదే. (ఇది 'ఐ, ఔ'లు తెలుగులో ప్రత్యేక వర్ణాలు కావటానికి తోడ్పడతాయి వీటిని లిపినుంచి తొలిగించినా వచ్చే ఇబ్బంది లేదు) ఉదా. పై, పయి; వైదుమ్బు, వయ్దుమ్బు, మొదలైనవి. వీటిలో చివరిది ఇప్పటి మనవాడుకకు కొంచెం ఎబ్బెట్టుగా ఉంటుంది. ఈ రెండూ మామూలువేగాని మూర్ధన్య స్పర్శవర్ణాలయిన ట, డ, లకు బదులుగా శకటరేఫ రాయటం మనకు విరుద్ధంగానే తోచవచ్చు. ఉదా. ఇట్టు, ఇఱ్ఱు; కీడ్లు, కీఱ్ఱు; వాణ్డు, వాఱ్ఱు. ఈ జంటలను పరిశీలిస్తే టడలకు అకారం ప్రత్యామ్నాయ సంకేతమని, ఇందులో అర్థభేదకత లేదని తెలుస్తుంది. ఇందుకు కారణాలను ఊహిస్తే శకటరేఫకు దంతమూలీయోచ్చారణ పోయి మూర్ధన్యోచ్చారణమయినా వచ్చిఉండాలి; లేదా కంపితత్వం పోయి స్పర్శోచ్చారణమయినా వచ్చి ఉండాలి. ఈ ఉచ్చారణభేదం అప్పట్లో మాండలికంగా నైనా ఉండి ఉంటుంది. ఉచ్చారణభేదం లేదుకాబట్టి లిపిలో లేఖకుడు భేదం చూపలేదు.

§ 12.0 పైన చెప్పినవి నిజానికి శాసనపరీక్షకులూ లేఖకులూ కల్పించే వర్ణక్రమ సమస్యలు (Spelling problems) కావు. అవి ప్రధానంగా నాలుగు కారణాలవల్ల వచ్చేవి: 1. లిపిగతలోపాలు 2. లేఖ్యవస్తులోపం 3. సంపాదక ప్రమాదం 4 లేఖకప్రమాదం. వీటిని ఒక్కొక్కటిగా పరిశీలిస్తాను.

§ 12.1 లిపిగత లోపాలవల్ల వచ్చిన సమస్యల్లో ప్రధానమయింది అర్ధానుస్వారానికి ప్రత్యేక లిపిచిహ్నం లేకపోవటం; పైపెచ్చు పూర్ణానుస్వార చిహ్నాన్నే ఇందుకుకూడా వాడటం. సంప్రదాయ పండితులు ఒక లేఖన సంప్రదాయం ఖండపూర్ణ బిందుస్థానాలను స్పష్టంచేస్తుందని వాదిస్తారు. 'వృత్తగంధి' వచనాలుకాక కేవలం పద్యశాసనాలేనని సర్వజనాంగీకారం పొందిన పద్యశాసనాల నుంచి ఇక్కడ కొన్నిప్రయోగాలను ఉద్ధరిస్తాను. ఇందువల్ల పైవిశ్వాసం నిపుణపరీక్షితంకాదని నిరూపించటంతోపాటు ఛందస్సంప్రదాయాలవల్ల ధ్వనిస్వరూపనిర్ణయం ఎలా సాధ్యమో ఏకసమయంలో తేలిపోతుంది.

A (i) అద్విరుక్త హల్లుల ముందున్న బిందువు పూర్ణమేనని నిరూపించేవి :

పఙ్డురంగు

దండువు, లోహాసనం బెక్కి, బింక ముడిచె
నృపాంకుశ....ఎత్తించె నమితతేజుండు
మత్తేభమంద గమన
ముందటం, అంతకును, కాలంబును

(ii) ఇదే పరిస్థితిలో బిందువుకు ప్రత్యామ్నాయంగా వర్గానునాసికమే ఉన్నవి :
భూపాలకుణ్డు
సేవితుణ్డు, సముణ్డు
బెణ్డు
ఒణ్డు
ఒన్ద, ఉణ్డ

B (i) అద్విరుక్త హల్లుకు ముందున్న బిందువు ఖండమని నిరూపించేవి :
పండరంగుం బఱ్చిన
వేంగి నాణ్టిం
ఎఱుంగ, బెడంగును
భూమిదేవింబోల్
వేంగి, అనంగం జనిన, మెచ్చుతోడం దమకు

(ii) ఇదే పరిస్థితిలో ఖండబిందువుకు ప్రత్యామ్నాయంగా వర్గానునాసికమే ఉన్నవి:
నాణ్టిం (= నాఁటిఁ)
బలుణ్డు, సుతుణ్డు, మల్లణ్డు (= బలుఁడు, సుతుఁడు, మల్లఁడు)
చరనుణ్డు (= చరనుఁడు)

C. అర్ధానుస్వారం ఉండటం అసాధ్యమైన చోట్ల బిందువు తరవాత ద్విరుక్త హల్లు ఉన్నవి :
సామంత్త పదువతో
గంగ్గ, పురుడించ్చు
ఎత్తించ్చె

D. బిందువు తరవాత ద్విరుక్తహల్లే ఉన్నా అర్ధానుస్వారమే ఉండవలసినది :
కాంగ్గ

E. బిందుస్థానంలో వర్గానునాసికాన్ని రాసినా ఖండబిందువే ఉండవలసినవి :
మీన్దు, ఏఙ్గ, తోణ్ట

అనేక ఇతరసందర్భాల్లో ఛందస్సహాయం లేనందునా, ఉన్నా గణస్వరూపం నియతం కానందునా, పూర్ణఖండ బిందువుల్లో ఏదైనా ఉండదగిన ప్రయోగాలు అనేకం ఉన్నాయి. అవి ప్రస్తుతం నిరుపయోగం. పై ప్రయోగాలనుబట్టి నిశ్చిత లేఖన సంప్రదాయం లేనప్పుడు వచ్చిన సమస్యలను ఛంద స్థితినిబట్టి పరిష్కరించుకొనే మార్గంకూడా నిరూపించవచ్చు. ఇతర సందర్భాల్లో మనం చేయగలిగిం దేమీలేదు.

§ 12.2 శీతవాతాతపాలవల్ల, ప్రజలు చూపే అత్యంత భక్తి శ్రద్ధలవల్లా కాలగతిలో శాసనోపరితలం దెబ్బతిన్నప్పుడు అక్షరక్రమంలో మారుపాటు వస్తుంది. చిన్నచుక్కగా ఉన్న అనుస్వారం రాతిమీది గంట్లలో కలిసిపోవటం చేతనో అస్పష్టంగా ఉన్నందునో ప్రాచీన శాసనాల్లో 'ఎఱుగు, ఏగి, తోట, మీద; ఉత్తరబు, కలశబు, శిష్యుడు' వంటి రూపాలు కనిపిస్తున్నాయి. నిజానికి బిందులోపం భాషలో అప్పటికి కలగలేదనటానికి అసంఖ్యాక ప్రయోగా లున్నాయి. వాటినిబట్టి వీటిలో బిందువును పునరుద్ధరించవచ్చు. కొన్ని మాటల్లో రాతిమీది గంట్లుచూసి బిందువని భ్రమించి సంపాదకులు 'చాంగెయ, మంగి' వంటి రూపాలను, *కట్టెను-కు బదులు 'కట్టెపు' వంటి రూపాలను (పకారంలోని అడుగుభాగం దెబ్బతిని ఉంటుంది) సృష్టించారు. అలాగే బిందువుకింద మరోగంటు ఉండగా దాన్ని విసర్గగా భావించి 'భరనఃబు (*భరణంబు), దొఃగు (*దొంగు)' అనే రూపాలు కల్పించారు.

§ 12.3 లిపిగతలోపాలను పురస్కరించుకొని భాషలో తమకున్న పరిచయ లోపంవల్లనో (చాలామంది ప్రాచీన శాసన పరిశోధకుల మాతృభాష తెలుగుకాదు), పరిచయాధిక్యంవల్లనో కల్పించిన

మాటలు కొన్ని ఉన్నాయి. ఎ, ఒ, లకు హ్రస్వదీర్ఘ భేదం లిపిలో 12, 13 శతాబ్దాలకుగాని సంకేతితం కాలేదు. తెలుగు బాగా రాని సంపాదకులు 'ఎణ్ఠి (ఏణ్ఠి), కెసిరి (కేసిరి), ఎమ్మది (ఏమ్బది), పొతన (పోతన)', వంటి హ్రస్వాది రూపాలనూ ఏరయమ (ఎరయమ), పేనుమణ్డ (పెనుమణ్డ), కోడుకు (కొడుకు) వంటి దీర్ఘాదిరూపాలనూ పరికల్పించారు. *కొట్టంబుల్ అనటానికి బదులు 'కోట్టంబుల్' అని చదివినవారు ఈ శబ్దం సంస్కృత కోష్ఠశబ్దభవమని భావించి ఉంటారు. ఇది స్వపాండిత్యంవల్ల కొత్త రూపాలను కల్పించటం.

తొలిరోజుల్లో బిందువును అక్షరాలమీద రాసే వారు. అది పూర్వాక్షరంమీద ఉండాలో పరాక్షరం మీద ఉండాలో నిర్ణయించుకోలేని సంపాదకులు ఒగోండు (ఒంగోడు), వేగిం (వేంగి), చిబుబురం (చిబుంబూరు)' వంటి రూపాలుండే వనుకున్నారు. పూర్వం ద్విరుక్తహల్లును సూచించటానికి బిందు వును లిఖించే ఆచారం అక్కడక్కడ ఉండేది. అది గమనించని సంపాదకులు'గుడియింని(గుడియిన్ని), తమ్ముంలంమున (తమ్ముంలమ్మున)' మొదలైనవి సరియైన పాఠాలుగా నిర్ణయించారు. ఈ ఆచారం తెలిసిన సంపాదకులు *సంయుక్తుణ్డు అని చద వాల్సిన రూపాన్ని 'సయ్యుక్తుణ్డు' అని చదివారు!

దడలకు, శడలకు, థన్ఠలకు, బటలకు, ప్రాచీన లిపిలో చాలాదగ్గరి పోలికలుండేవి. భాషాపరిచయం అంతగా లేని సంపాదకులు వీటిని ఒకదానికి బదు లుగా మరొకటి చదివి అపూర్వ శబ్దాలను సృష్టిం చారు. *ద్రమ్మలు-కు బదులు 'ద్రమ్మలు' అని చదివిందీ *పిడెన-కు బదులు 'పిదెన'అని చదివిందీ దడల పోలికలనుబట్టి భ్రాంతి పడటంవల్ల. 'తెల్గొన్థ, ముదుగొన్థ' అని చదివింది 'న్ఠ' సంకేతాన్ని 'న్థ'గా భ్రమించటంవల్ల. 'చెటించిన, నూటి అనేవి బటల పోలికలను సరిగా గుర్తించనందువల్ల. శడలను సరిగా గుర్తించ లేక 'ఏడు' అని చదవటానికి బదులు 'ఏశు' అని చదివారు. ఇవన్నీ సంపాదక ప్రమాదాలు.

§ 12.4 **లేఖక ప్రమాదాలు, అనేక విధాలు.** అనుస్వారం వర్గానునాసికాలకు అన్నిటికీ ప్రత్యా మ్నాయ సంకేతమని తెలిసిన లేఖకులు అనుస్వార స్థానంలో ఎక్కడ ఏ అనునాసికవర్ణాన్ని లిఖించాలో తెలియక చేసిన తప్పులు కొన్ని ఉన్నాయి 'చిమ్ఠూర్ (చిన్ఠూర్), సఙ్క్రాన్తి (సఙ్క్రాన్తి), హొమ్మ్కారిదేవికి (హొఙ్కారిదేవికి)' అనేవి ఈ రకానివి. అన్ని సమయాల్లోనూ అనుస్వారానికి బదులుగా వర్గాను నాసికం రాయకూడదని తెలియక చేసిన తప్పు *సంవత్సరంబు అనేదాన్ని 'సఙ్వత్స రంబు' అని రాయటం. అనుస్వారం ఎక్కడ రాయాలో సరిగా తెలియక చేసిన తప్పు నామ ధేయుంబు (నామధేయున్బు), ప్రియతన యుంబు (ప్రియతనయున్బు)అనే చోట్లది. అనుస్వార వర్గాను నాసికాల్లో ఏది రాయాలో స్పష్టంగా తెలియక రెండూ రాసిన తప్పు 'గుంణ్ఠ (గుంఠ, గుణ్ఠ), నాంణ్డు (నాండు, నాణ్డు), పంణ్ఙ్రెంణ్డు (పంద్రెండు, పణ్ద్రెణ్డు, పణ్ద్రెండు, పంద్రెణ్డు)' అనే చోట్ల కని పిస్తుంది. ఈలాటిదే 'ఐ, అయ్' లను రెంటినీ రాయటం; 'బైయ్దమ్బ' (బైదమ్బ, బయ్దమ్బ). ఇవన్నీ అజ్ఞానకృతదోషాలు. ఆంధ్రేతర భాష మాతృభాషగాగల లేఖకుడు స్వభాషాలక్షణాలను తెలుగు లిపిలో చొప్పించటంకూడా ఇటువంటిదే: ఉదా. 'అకున్ (అగున్), తీనికి (దీనికి), తేవుళ్ (దేవుళ్), పిడుకు (పిడుగు), మకన్డు (మగన్డు)' మొదలైనవి.

అజాగరూకతా హేతువువల్ల స్పష్టమైన లేఖక ప్రమాదాలు మరికొన్ని కనిపిస్తాయి. ఇవి మూడు రకాలు: (i) లిపిసంకేతాన్ని రాయకపోవటం: తూప్పున (తూర్పుణన), పెణ్డము (పెణ్డ్లము), బోణ్డు (బోయణ్డు), మన్డు (మగన్డు), మీనవమ్మ హాదేవి (మీనవమ్మ మహాదేవి). 'బ్రాహ్మలు' వంటివి భాషాపరిణామంలో వచ్చినవే కాబట్టి ఈ రకం తప్పులుకావు. (ii) లిపిసంకేతాలను పునా రచించటం: ఇరుకుటూరుర్ (ఇరుకుటూరు), దేగుల

లంబును (దేగులంబును), పదున్ను (పదున్ను) మొదలైనవి. 'గుడ్డుళను' వంటివి ఆలోచనీయాలు; బహువచనం మీద ఉవర్ణకం వచ్చిన రూపాలను వ్యాకర్త లంగీకరించారు. (iii) లిపిసంకేతాల స్థానవినిమయం: ఉత్తరయాన (ఉత్తరాయన), తుప్పూర్ణన (తూప్పూర్ణన), పపాంబు (పాపంబు), బానరాసి (బారానసి), యోగిజు (జోగియు) మొదలైనవి. అయితే 'పెడరు (పెరడు), ద్రుగ్గాదేవి (దుగ్గాదేవి) అనేవి బహుశా లిపివల్ల భాషలోకి వచ్చిన రూపాలేమో—అవి వాడుకలో ఉన్నాయి. (iv) అచ్చుల హ్రస్వదీర్ఘతలను సరిగా గుర్తించక పోవటం. ఇది రెండు విధాలు: (a) దీర్ఘం ఉండే చోట్ల హ్రస్వం రాయటం: 'కుస్తుబు (కూస్తుబు), తుమ్మెడ్డు (తూమెడ్డు), నయకుణ్డు (నాయకుణ్డు), సంక్రంతి (సంక్రాంతి), సక్షి (సాక్షి)' మొదలైనవి (b) హ్రస్వం ఉండేచోట్ల దీర్ఘం రాయటం: ఈన్ప ఎడ్లు (ఇన్పఎడ్లు), ఎప్పూడూను (ఎప్పుడును), గౌరావలకు (గౌరవలకు) మొదలైనవి. వీటిలో కొన్ని 'కడాన్, రాజులాకు' వంటివి వ్యవహారంలో వినిపిస్తాయి. ఇప్పటి తెలంగాణా ప్రాంతీయ ప్రామాణికంలో అర్ధదీర్ఘత (half-length) వినిపిస్తుంది. ఒకవేళ ఇదే లక్షణం ప్రాచీనభాషలో కూడా ఉండగా దాన్ని సంకేతించటానికి ప్రత్యేక చిహ్నంగాని గుర్తించగల సామర్థ్యంగాని లేక ఈరకం రాతలు రాసేవారేమో స్పష్టంగా చెప్పలేము.

లేఖక ప్రమాదాల్లో ప్రముఖమైనది విలోమ లేఖనం. ఇది ప్రమాణీకరణ ప్రయత్నం. ఇందువల్ల ఒకనాటి భాషాధ్వనులను లేఖనం ద్వారా గ్రహించవచ్చు. వీటిలో ముఖ్యమైన కొన్నిటిని చూద్దాం. (i) ఱకారవిషయం: ఱకారం క్రీ.శ. 7 శతాబ్దానికి ముందు తెలుగులో ప్రత్యేకవర్ణంగా ఉండి ఆ తరవాత భ్రష్టమయింది. అందువల్ల ఈ ప్రాచీన చిహ్నాన్ని ఉపయోగించటం ప్రామాణికత్వానికి చిహ్నమయింది. డకారానికి బదులుగా 'ఖఱ్గ, మేఱాంబా, రఱ్ట్లు, ఱస్సి' వంటి పదాల్లోను, షకారానికి బదులుగా 'రాఱ్ట్రకూట' వంటి శబ్దాల్లోను, ళకారానికి బదులుగా 'ఏఱంగా' వంటి మాటల్లోను, రాస్తుండేవారు. శకటరేఫకు బదులుగా వాడిన రూపాలను ఇంతకుముందే ప్రదర్శించాను. ఈ లేఖనం కారణంగా దాని వర్ణత్వంపోయి అదేమో తెలియని స్థితి ఎనిమిదో శతాబ్దానికి వచ్చిందని ఊహించవచ్చు. (ii) సాధుశకటరేఫల విషయం: క్రీ. శ. 4-5 శతాబ్దాలనాటి ఒకే శాసనంలో 'చెఱ్వెరువ, అఱు తొఱె' అనే రెండు మాటలూ కనిపిస్తాయి. శకటరేఫ లిపిలో లేక చెఱువు శబ్దాన్ని సాధురేఫతో రాశారనటానికి వీలులేదు. అప్పటికే శకటరేఫకు ప్రత్యేకవర్ణత్వం పోతున్నదనాలి 7, 8 శతాబ్దాల లేఖనాల్లో శకటరేఫ స్థానంలో సాధురేప కనిపించే 'ఇరుకుటూరు, చిట్టేరు, నూర' వంటి రూపాలతో బాటు, సాధురేఫ స్థానంలో ప్రమాణీకరణబుద్ధితో శకటరేపను రాసిన 'కఱాఱు, కుమ్మఱి, గోఱ్త్ర, పఱదియ, అంకు, ఱోగొన్నవారు, వాఱు' వంటివి కూడా కనిపిస్తున్నాయి. అంటే ఱ అప్పటికే ప్రత్యేక వర్ణత్వం కోల్పోయిందని అర్థం. (iii) ణ, న ల విషయం: ఇవి కూడా సాధుశకట రేఫలవంటివే. నకారస్థానంలో 'ణ' రాసిన 'తణ, పెణ్న' వంటివి ప్రమాణీకరణ ప్రయత్న ఫలితాలే. (v) ల, ఴ ళ విషయం: 'కఴరు, కఴ్గిన, తఴవర, తఴ్చి, వెఴ్ప' వంటివి కూడా పై రకానివే. ఴకారం లకారంగా 7, 8 శతాబ్దాలకు పరిణమించిందనటానికి ఇవి మంచి ఉదాహృతులు. (v) ఒత్తులుంటే ప్రామాణిక మనే భ్రమ ఇప్పటికీ పండితుల్లో కొందరిలో ఉంది. 'బేధం' వంటి చోట్ల అస్థానపతితం చేసే, 'భాష్పాలు' వంటి చోట్ల లేనిది కల్పించే, విధానమే *దత్తికి బదులుగా 'ధత్తి'ని రాయించింది. (vi) లేఖనోచ్చారణాలకు భేదమున్నప్పుడు రెంటినీ సామీప్యానికి తెచ్చే ప్రయత్నంలో రాసిన 'శకద్విప, సకంద్రిప' అనే రూపాలు శాసనాల్లో కనిపిస్తాయి. 'నృప' శబ్దోచ్చారం 'ద్రిప'తో ఇంచుమించు సమంగా ఉండేదని ఇవి సూచిస్తాయి. ధ్వని శాస్త్ర రీత్యా ఈ లేఖనంలోని నకార దకారాలు రెండూ దంత్యాలు కాక దంతమూలీయాలు అయివుంటాయని

భావించవచ్చు. అప్పటివర్ణాల ధ్వనిగుణాలను ఈ విధంగా విలోమలేఖన సహాయంతో ఊహించవచ్చు.

§ 13.0 శాసన లేఖనంలో కనిపించే మరికొన్ని లక్షణాలు కేవలం ప్రమాదాలని చెప్పటానికి వీలు లేనివి. నేటికీ భాషలో అవే రూపాల్లో కాకపోయినా ఇతరత్రా కనిపించే కొన్ని ధ్వనిలక్షణాలకు ఇవి లిఖిత రూపాలనిపిస్తాయి. ఇవి సందేహాస్పద విషయాలు (marginal cases). ఇవి ప్రధానంగా మూడు విధాలు: (i) ద్విరుక్తాద్విరుక్త రూపాలు (ii) మహాప్రాణ సహిత రహిత రూపాలు (iii) హల్వినిమాయక రూపాలు.

అనుకోనిచోట ద్విరుక్త హల్లులు కనిపించే 'ఇచ్చిన్న, దీనిక్కి, రెక్కల్ల' వంటి వాటితో ద్విరుక్తాలకు బదులు అద్విరుక్తాలు కనిపించే 'ఇచెను, పెటని, కయంబున, దికున' వంటి వాటిని పోల్చిచూస్తే 'అక్కటాదు'ల్లో చేరవలసినవి అనేకం ఉన్నవేమో ననిపిస్తుంది. ఈతీరు రాతలకు నాలుగు కారణాలుండవచ్చు. ద్విరుక్తతను సూచించే బిందు చిహ్నం లోపించి ఉండవచ్చు. రెండుమూడక్షరాల మీది ఊనికను తప్పుగా రాసివుండవచ్చు. బిందు రేఫల తరవాత హల్ద్విత్వంచేసే ఆచారం ఇతరత్రా వ్యాపించి ఉండవచ్చు. ఇప్పటి కొండకుబిభాషలో లాగా ద్విరుక్తాద్విరుక్త హల్లులకు 7–9 శతాబ్దాల మధ్యకాలపు పై ఉదాహరణల్లో అర్థభేదకత లేక పోవచ్చు. ఇప్పటి తెలంగాణా మాండలికంలో ఇంకా ఈ లక్షణం వినిపిస్తున్నది కాబట్టి చివరిమాటే నిజంకావచ్చు. లేదా అవి కేవలం తప్పులే కావచ్చు.

'ఏభది, కుణ్ఠ, పెద్ధ' వంటి రూపాలనూ 'ఆరాదించు, మటంబును, సుకము, స్తానము' వంటి వాటినీ పోలిస్తే ఎక్కడ మహాప్రాణా లుండాలో అప్పటి లేఖకులు నిర్ణయించుకోలేకపోయారని తెలుస్తుంది. ఇదేస్థితి ఇప్పటికీ సంస్కారభేదకారణంగా ఉంది.

భాషాభాషుల ఉచ్చారణలో విద్యాసంస్కారభేదంవల్ల ఇప్పటికే కనిపించే కొన్నిరకాల భేదాలు శాసనాల్లోనూ ఉన్నాయి. 'దారపోచి, ప్రసణ్ణ, సంవచ్చరములు, ఈస్వరయ, అస్వమేధంబు, సూర్య్యగ్రహణా–' మొదలైనవి నేటి పామర భాషణలోని 'చ, స, శ'ల మారుపాటుకు ప్రతినిధులు.

§ 14.0 'వ్యాకరణ దోషా'లని చెప్పదగ్గ రూపాలు కొన్నికనిపిస్తాయి. 'నీలీశ్వర, మాక్కణ్డీశ్వర' వంటిచోట్ల గుణసంధి లేదు; 'మన్చ్యణ్ణ' (మంచి–అణ్ణ) అనే తెలుగుమాటలకు యణాదేశం చేశారు. ఇలాటి అవకతవకలు ఇప్పటి భాషలోనూ కనిపిస్తాయి. 'వేప్గగవిలాళు' (వేయి గవిలళు), 'ఒకాడు బోళచేత' (ఒక బోళచేత) అనేచోట్లు సంప్రదాయ వ్యాకరణసూత్రాలకే కాక భాషాలక్షణానికే విరుద్ధమైనవి. 'ఇల్లకు (ఇళ్ళకు), ఎడ్లుకు, వాన్డ్రుకు' అనేవి అక్కడక్కడ వినిపించేవి. భాషా దోషాలని చెప్పటానికి వీలులేనివి, లక్షణ వ్యతిరేకమైనవీ కొన్ని ఉన్నాయి: 'ప్రధాని, మనోవల్లభి, వనజనేత్రి, సాక్షిమన్తులు, ఉరమాల, వీన్ది(= వీడి)' మొదలైన వాటిలో కొన్ని కావ్యవ్యవహారంలో మరికొన్ని నిత్యవ్యవహారంలో వినిపిస్తున్నాయి.

§ 15.0 ఈ విధంగా శాసనలేఖనాలను పరిశీలించినప్పుడు ఇంకా అనేకానేక విషయాలు తెలుస్తాయి. మొత్తంమీద ధ్వనిలిపులు అన్యోన్యసంబంధాన్ని ప్రదర్శిస్తూ, పరస్పరం ప్రభావితం చేసుకుంటూ, ఇతరేతర విరుద్ధంగా ఉంటూ నిశిత శాస్త్రీయ పరిశీలనకుగాని లొంగవు. తెలుగులో ఈ పరిశీలన ఇంకా సాగాలి.

## ఉపయుక్త ప్రధాన గ్రంథాలు

తెలుగు :

1. *గోపాలకృష్ణయ్య, వడ్లమూడి*
—'ధ్వని లిపిపరిణామం లేక ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష', 1956

2. రాధాకృష్ణ, బూదరాజు
—'ప్రాచీనాంధ్ర శాసనాలు' (అచ్చులో), 1970

3. రామచంద్ర, తిరుమల
—'మనలిపి పుట్టుపూర్వోత్తరాలు', 1957

4. వెంకటరామమూర్తి, గిడుగు
—'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం'

5. " "
—'వ్యాసావళి'

ఇంగ్లీషు :

1. *Bloomfield, L.*
—Language, 1955

2. *Diringer, D.*
—The Alphabet, 1948

3. *Gelb, I. J.*
—A study of writing : The Foundations of Grammatology, 1950

4. *Gleason, H. A.*
—An Introduction to Descriptive linguistics, 1955

5. *Gray, L. H.*
—Foundations of Language 1939

6. *Hockett, C. F.*
—A Course in Modern Linguistics, 1958

7. *Kandappachetty, M.*
– A Historical Grammar of Inscriptional Telugu (1101–1500), unpublished.

8. *Kent, R. G.*
—The Textual criticism of Inscriptions, 1926

9. *Passy, P. & Jones, D.*
· Principles of the I. P. A., 910

10. *Potter, R. K. etc.*
—Visible Speech, 1947

11. *Radhakrishna, B.*
—A Historical Grammar of Early Telugu (200 B.C.–1100 A.D.), unpublished

10. *Sprengling, M.*
—The Alphabet, 1931

13. *Stockwell, R.P. & Barritt, G.W.*
—Some Old English graphemic-phonemic correspondences, 1951

డా. బి. రామరాజు

# తిరుమల బుక్కపట్టణం కిరీటి వేంకటాచార్యులు

పదునెనిమిదవ శతాబ్దమునకు చెందిన ప్రౌఢకవి పండితులం దగ్రేసరుడు కిరీటి వేంకటాచార్యులు. ఆయన తండ్రి తిరుమల బుక్కపట్టణం అణ్ణయాచార్యులు (పెద్దయ్యవారు), పినతండ్రి శ్రీనివాస దేశికులు (చిన్నయ్యవారు). ఇరువురును సురపురం సంస్థానాధీశ్వరులైన బేండరు నాయకులకు గురువులు. వారిరువురును సురపురం రాజు పామి నాయకునికి విశిష్టాద్వైతదీక్ష నిచ్చుటకై ధర్మవరము నుండి ఆహూతులై వచ్చి సురపురమందే స్థిరపడి పోయిరి. వేంకటాచార్యులు సురపురమునందే జన్మించిరి. సమస్త శాస్త్రములను పితృవ్యులైన శ్రీనివాస దేశికుల పాదసన్నిధిని అభ్యసించిరి. శ్రీనివాస దేశికులు ఆనాటి కవిపండితులం దసమానులు. వారు శ్రీవేదాంత దేశికుల యపరావతారమని ప్రతీతి.

వేంకటాచార్యులవారి సాహిత్య జీవిత మొక యద్భుతగాథ. వేంకటాచార్యుల కారవ తరమువారైన బాలసరస్వతి తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు తమ "వేంకటాచార్య విజయ వైజయంతీ" నాటకమున కిరీటి వేంకటాచార్యుల సాహితీ ప్రాభవమును, వారొనర్చిన వాక్యార్థములను, పొందిన ఘన విజయములను విపులముగా వర్ణించియున్నారు. వేంకటాచార్యులవారు వంశ పరంపరగా వచ్చుచుండిన సర్వతంత్ర స్వతంత్ర, కవితార్కిక కంఠీరవ, రామానుజ సిద్ధాంత నిర్ధారణ సార్వభౌమ, శ్రీమద్రాజాధిరాజ గురు సార్వభౌమ బిరుదములనేకాక ప్రచండ పండితాఖండల మండల సార్వభౌమ, శ్లేషయమక చక్రవర్తి, తర్కాలంకార వాచస్పతి, సకలభాషా విశేష కవితాధురంధర, ప్రతినవప్రబంధ పరమేశ్వర బిరుదములను ధరించి సమకాలీన పండిత కవులకు సింహస్వప్నమైరి.

పామినాయక భూపాలుని కుమారుడైన వెంకటప్ప నాయకునికి (క్రీ. శ. 1773 - 1802) వేంకటాచార్యులు రాజగురువులు మరియు సురపురాస్థాన విద్వత్కవులు. వారు జీవించినది ముప్పది రెండేండ్లే యైనను, వారి వాఙ్మయ సృష్టి, వారి వాదములు, వారి సాహిత్యసేవ ఆచంద్రతారము. వేంకటాచార్యులవారు ద్వైతాద్వైతములను పాదుకలను, పరమతఖండన స్వమతస్థాపనమను వింజామరలను విశిష్టాద్వైతమను కిరీటమును ధరించి ముందు విజయదుందుభులు, భేరీలు మ్రోగుచుండ పల్లకిపై నెక్కి ప్రయాణములు చేయుచుండెడివారు. అందుకే వారికి కిరీటి వేంకటాచార్యులవారను పేరు వచ్చినది. వారు ప్రయాణము చేయునపుడు శిష్యులును, పరివారజనమును పల్లకి ముందు నడచుచు,

"గదాధరీయ ఖండన ప్రచండ వాది ఛండన
ప్రకాండ యుక్తి మండన ప్రభూత కీర్తి హిండన,
జయ స్వపక్షరంజన ద్విషద్ద్రుమ ప్రభంజన
ప్రపంచ దర్పభంజన త్రయీపథాద్విగంజన."

యని కైవారములు చేయుచుండెడివారు.

అహోబల మఠాధిపతులైన శ్రీనివాసయతీశ్వరు లొకమారు వేంకటాచార్యులవారితో వేదాంతమును గూర్చి పదునాల్గుదినములు వాదించి ఓడిపోయి వేంకటాచార్యుల ప్రతిభాపాండిత్యములకలరి దీవించిరట. వేంకటాచార్యులవా రొకప్పుడు తమకున్న సమస్త ఆడంబరములతో పేష్వా మాధవరావుగారి పూనా దర్బారుకు పోయిరట. వీరి వేషమును ఆడంబరమును చూచిన మాధవరావు తమ మంత్రులతో మరాఠీభాషలో వీరెవ్వరనియడిగిరట. పేష్వా

మాధవరావు ప్రయోగించిన మరాఠీ శబ్దము లూతగా గొని వేంకటాచార్యులవారు తామే ఇట్లనిరట:

"కణభయితాహే తర్కే
ఫణభయితాహే సుశబ్దగణనోదర్కే
మందర వృత్తం వర్తే
శ్రుత్యంత సుధాంబుధౌ మహాగర్తే."

పేష్వామాధవరావుగారి సంస్థానమున వేంకటాచార్యులవారిని కన్నెత్తి చూడగలిగినవారు లేరట. ఈ విధముగా పండ్రెండేండ్లు పూనా దర్బారులో వేంకటాచార్యులవారి యప్రతిహత వైదగ్ధ్యము వెల్లివిరిసినది. పూనా సంస్థానమునం దుండిన పండితులు కొందరు వేంకటాచార్యులవారియెడ అసూయ వహించి వారిని భంగపరచుటకై వారణాసి నుండి పురుషోత్తమశాస్త్రియను గొప్ప పండితుని ఆహ్వానించిరట. ఈ పురుషోత్తమశాస్త్రి గదాధర భట్టాచార్యులవారి మనుమడు. గదాధరభట్టు రచించిన గాదాధరి యను తర్కగ్రంథమును వేంకటాచార్యులవారు తమ 'గదాధరీయ ఖండనమ్' లేదా 'ఝంఝూమారుతమ్' గ్రంథమున నిశితముగా ఖండించి యుండిరి. తన తాతగారి గ్రంథమును ఖండించిన వేంకటాచార్యులవారి నోడింపవలెనని పురుషోత్తమశాస్త్రి కాశీనుండి బయలుదేరెను. పురుషోత్తమశాస్త్రి పూనా వచ్చులోపల జనార్దనభట్టాచార్యుల మనుమడైన రామరుద్రభట్టాచార్యులను వేంకటాచార్యులవారు వాదమున నోడించిరట. పురుషోత్తమశాస్త్రి పూనా సభ చేరుకొనెను. ఆతనికి ఒక కన్ను లేదట. అది చూచి వేంకటాచార్యులవారు నిండుకొలువులో నాతని నీ విధముగా వెక్కిరించిరి.

"ఆఖండల స్సహస్రాక్షః, విరూపాక్ష స్త్రిలోచనః,
అన్యే ద్విలోచనా స్సర్వే, కో భవా నేకలోచనః?"

వేంకటాచార్యులవారికి పురుషోత్తమశాస్త్రిగారికి పదునెనిమిది దినముల శాస్త్రార్థకురుక్షేత్రము జరిగినది. వాదమున గెలుచు నాశలేని పురుషోత్తమశాస్త్రి వేంకటాచార్యులపై బగళా ప్రయోగ మొనర్చిరట. వేంకటాచార్యులవారి హయగ్రీవమంత్ర మాతని రక్షించుటేకాక బగళాశక్తిని త్రిప్పికొట్టగా నది పురుషోత్తమశాస్త్రినే భక్షించినదట.

ఒకప్పుడు వేంకటాచార్యులవారు తిరుమలకు పోయిరట. పూజారు లప్పటికే గుడి తలుపులు మూసి యుండిరి. ఆచార్యులవా రెంత వేడుకొన్నను వారు వినరైరి. కుపితులైన యాచార్యులవారు శ్రీవెంకటేశ్వరస్వామి నిట్లుపాలంభించిరట.

"ఐశ్వర్యమదమత్తోఽసి, మాం న జానాసి కేశవ!
పరైః పరిభవే ప్రాప్తే, మదధీనా తవ స్థితిః."

అప్పుడు గుడి తలుపులు తామే తెరచుకొన్నవట. స్వామిని దర్శించి ఆచార్యులవారు స్తోత్రములు పాడిరట. గుడి పూజారులు, హత్తీరాంబాబా యను మహంతును క్షమాపణలు చెప్పుకొని వేంకటాచార్యుల వారిని సత్కరించిరట. ఇట్టి యద్భుత గాథలే మనము ఉదయనాచార్యులు, త్యాగరాయలు, వేదాంత దేశికులు మొదలైనవారిగూర్చి విందుము. ఇంకను వేంకటాచార్యులవారిని గూర్చిన యద్భుత గాథలు వానికి సంబంధించిన చాటు పద్యములు కలవు.

కిరీటి వేంకటాచార్యుల వారి వాఙ్మయకృషిని గూర్చి కొంత తెలిసికొందము. వేంకటాచార్యులు వ్రాసిన శాస్త్రగ్రంథము లివి.

1. ఝంఝూమారుతమ్: దీనికే గదాధరీయ ఖండన మను నామాంతరము కలదు. ఇది తర్కగ్రంథము.

2. గజసూత్రవాదమ్ – ఇది వ్యాకరణ గ్రంథము. "ఞిరణౌ" అను పాణినీయ సూత్రమును వివరించుచు వ్రాసినది. గ్రంథాంతమున వేంకటాచార్యులవారు తమను పొగడుకొన్న శ్లోకమిట్లున్నది.

"ఞే రణావితి సూత్రార్థం
భగవాన్ వేద పాణినిః
అహం చ; భాష్యకార స్తు
తత్త్వతో వేత్తివా నవా."

'వేంకటాచార్య విజయవైజయంతీ' నాటకమున గూడ దీని ప్రసక్తి యున్నది. అందులో వేంకటాచార్యులవారి పినతండ్రియు, విద్యాగురువులునునగు శ్రీనివాసదేశికులవారు వేంకటాచార్యులవారిగూర్చి ఇట్లందురు.

"అహో మహతీయం వీరవాదవైఖరీ,
వ్యాకరణ మహార్ణవ కర్ణధారం
భగవంతం పతంజలిమపి న గణయతి."

ఇట్టి శ్లోకమొకటి భట్టోజీ దీక్షితులవారు చెప్పినట్లుగా పండితలోకమున ప్రాచుర్యమున నున్నది.

3. అలంకార కౌస్తుభః : ఇది యలంకార శాస్త్ర గ్రంథము. వివిధాలంకారముల కుదాహరణము లుగా చెప్పిన పద్యము లన్నియు వేంకటాచార్యులవారు తమ ప్రభువు సురపురం వేంకట నాయకునిపై వ్రాసినవే. గ్రంథారంభమున వేంకటచార్యుల వారిట్లు చెప్పినారు.

"శ్రీమాననీయ బహిరీబిరుదాంక పామి
భూపాల పుత్రవర వేంకటనాయకస్య,
స్వస్తి ప్రశస్తిమవతో గురురేవ కుర్వే-
లంకార కౌస్తుభ మనన్యకృతోక్తి లక్ష్యమ్.

ఆఫ్రెర్ట్ మహాశయుడు వేంకటాచార్యుల కృతులుగా నీ క్రింది వానిని గూడ పేర్కొన్నాడు.

4. ఐత్వఖండనమ్
5. తాత్పర్యదర్పణమ్
6. వేదాంత కౌస్తుభమ్
7. ఆనందతారతమ్య ఖండనమ్
8. పుచ్ఛ బ్రహ్మవాదఖండనమ్
9. శివార్కమణిదీపికా ఖండనమ్

వేంకటార్యులవారి సాహిత్యకృతు లివి:

10. శృంగారతరంగిణీ : ఇది ఐదంకముల నాటకము. శ్రీకృష్ణుడు ఇంద్రలోకమునుండి పారిజాతమును తెచ్చు వృత్తాంతమును ఆచార్యులవారు నాటకముగా కూర్చినారు. నాటక ప్రారంభమందలి నాందీ శ్లోకము లిట్లున్నవి.

శ్రీస్తన స్తబక న్యస్త
కస్తూర్యర్ధ్యస్త కౌస్తుభమ్ ।
నిస్తులోరస్థలం శస్తం
వస్తు స్వస్తిర్ప దస్తు వః ॥

జాతః శీతమరీచి రస్య
హృదయాది త్యాగమేషు శ్రుతం
భాను ర్నాన మయం నుద
న్నుదయతే హార్దం తమిస్రన్త్వి తి ।
శంకా మంపరయంత మాశ్రితతతే
ర్యః కౌస్తుభం వక్షసా
ధత్తే స్మేర కృపా విపాక లలితః
కృష్ణః స పుష్ణాతు వః ॥

నీలశ్రీ రలకేషు శంఖగరిమా
కంఠే కుచే మాకరీ
రేఖా కుందవరద్యుతిః
స్మిత సుధాకాన్తేషు దన్తేషు చ ।
పాదౌ కచ్ఛపభూషితౌ
కరయుగం యస్యాః సపద్మం మహా
పద్మానందమయీ ముకుంద
తరుణీ సద్యః ప్రసద్యా న్మమ ॥

ఈ రూపకము తిరుమల శ్రీనివాసుని యుత్సవసందర్భములందు ప్రయోగింపబడిన దట. సూత్రధారుడు నాటక కర్త నీ విధముగా పరిచయము చేయుచున్నాడు.

"శర్వాది తత్త్వపర దుర్వాదివాద శత
నిర్వాపణాది చతురః
స్వర్వాహినీ లహరి గర్వాతిరేకహృ
దఖర్వాభిజాత భణితిః ।
దుర్వార వైభవ సుపర్వాధిపార్య
శతపర్వాతిశాయి ధిషణో
గుర్వాగమాంతయుగనిర్వాహకృ జ్జయతి
సర్వార్థదోఽణ్ణయగురుః ॥

తత్తనయేన సవినయేన తచ్చరణ పరిచ యైక భూమ్నా స్వాగ్రజ శ్రీనివాస తాతార్య కరుణా పరిణాహ లబ్ధ పూర్వ తంత్ర మహిమ్నా వేంకటాచార్య నామ్నా సకల సామ్రాజ్య రారజ్యమాన మాననీయ బహిరీ పామినాయక కుమార వేంకటపతినాయక మహాస్థాన పాండిత్య గురుత్వ భూషితేన విరచితమస్తి సుగుణమణిపేటకం శృంగార తరంగిణీ నామ నాటకం, యదభినయ విశా రద మనీషా విశేషా ఇమే శైలూషా :"

నాటకాంత గద్య మిట్లున్నది.

"ఇతి శ్రీశైలవంశ సుధాంబుధి పూర్ణస్య ప్రచండోద్దండ పండితాఖండల మండలీ సార్వ భౌమస్య అభినవ కవితార్కిక కంఠీర వస్య, సర్వతంత్ర స్వతంత్ర శిరోమణేః వేంకటాచార్యస్య కృతౌ శృంగారతరంగిణీ నామ్ని నాటకే పంచమోఽంకః సమాప్తః."

11. కృష్ణభావశతకమ్ : ఇది గోపికా కృష్ణుని వర్ణించుచు చెప్పిన శతకము. దీని ప్రారంభ శ్లోకములు కొన్ని:

లక్ష్మీనృసింహ కరుణారస లబ్ధ సర్వ
తంత్ర స్వతంత్ర కవితార్కిక సింహ లక్ష్మా।
శ్రీశైల బుక్కనగరాన్వయ వేంకటార్యః
శ్రీకృష్ణ సంస్మరణ మాతనుతే మిషేణ ॥

సాహితీ సౌహితీ రాహితీ మోహితా
యేహి తే నేహ తాత్పర్య మాతన్వతే।
నాటకాలంక్రియా మండితాః పండితా
భావనా జీవనా భావ మాచిన్వతే॥

నవకువలయ శ్రేణీం నాణీయసీం కబరీభరే
బహుధృతవతీ నీలం చేలం చ కించన బిభ్రతీ।
ఉపవనతలే కృష్ణే నాలింగితా రతిసంగతా
నగర యువతి ర్జాతా చంద్రోదయే పరితాపినీ॥

శతకమందలి చివరి శ్లోకము లివి :

సకలభువనమధ్యే సర్వథా సర్వథా తే
న కిమపి తులనార్థం వస్తు సర్వాంగకేపి।
ఇతి మధుమథనేన శ్లాఘితా నాభిమేనే
తిలక మలికదంతే చంద్రికా సేవినీ సా ॥

అయి దయితబలం! తే దర్శయస్వేతి గండ
స్మయవతి భుజమధ్యే సత్యయా యంత్రితస్య
అశక దధ మురారే ర్మోచనాయ క్షణేన
స్తనఘనపులకాగ్రం గాఢసంశ్లేష ఏవ.

12. విష్ణు సప్తవిభక్తి స్తోత్రమ్: ఇదియొక చిన్న స్తోత్రకావ్యము. విష్ణునామములు క్రమముగా సప్తవిభక్తులతో నుండుటే ఇందలి విశేషము. ఈ స్తోత్రమునగల యొక శ్లోకమువలన కిరీటి వేంకటాచార్యులవారు అణ్ణయాచార్యులవారి తృతీయ పుత్రుడని తెలియుచున్నది.

వినిర్మలాద్య తిర్మలాన్వవాయ బుక్కపట్టణా
న్వయాణ్ణయార్యయజ్వన స్తృతీయ సూను నామునా,
ప్రణీయ వేంకటార్యవర్యదాసకేన రాసకే-
లిభాసకస్య మానఖస్య సత్కృతిః పదే ఽర్పితా. 19

13. అహోబలమఠాధిపతులు శ్రీనివాస యతీశ్వరుల కోరికపై వేంకటాచార్యులవారు దశావతార స్తోత్రము, మరియు భావశతకములు వ్రాసిరట. వేంకటాచార్య విజయ వైజయంతీ నాటకము తృతీయాంకమున దశావతార స్తోత్ర మంతయు నుద్ధరింపబడినది. దాని ప్రారంభశ్లోకము లివి :

వరదం వరదంతిహృదాతపహృత్
శరదం శరదంబుజ నేత్రయుగమ్,
దర దివ్య రథాంగధరం మధురం
మధురాకృతధామ మహః కలయే.

కమలా కమలాయతలోచనప
త్యమలా య మలాసయ తానుగుణా,
శమలాలస మౌని మలాపహ మా
గమలాలిత మేన మహం కలయే.

పై కృతులేకాక వేంకటాచార్యులవారు 14. ఉషాపరిణయ నాటకమ్ 15. శుకాభిపతననాటకమ్ 16. శృంగారలహరీ 17. హయగ్రీవ దండకమ్ 18. యతిరాజదండకమ్ 19. లక్ష్మీదండకమ్ మొదలైన గీర్వాణకృతులను, అచలాత్మజాపరిణయ మను తెలుగు ద్వ్యర్థి కావ్యమును వ్రాసినారు.

వేంటాచార్యులవారు రచించిన మరియొక గీర్వాణ కృతి 'అభినవ శృంగార రసమంజరీ' మైసూరు ప్రాచ్యగ్రంథాలయమున నున్నట్లు తెలియుచున్నది.

కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు రసికజన రసోల్లాస భాణముకూడ వేంకటాచార్యులవారి కృతిగా తలంచిరి. కృతికర్తల నామసామ్యమున వారట్లు తలచియుందురు. ఈ భాణమును రచించిన వేంకటాచార్యులవారుకూడ అణ్ణయాచార్యుల సోదరులైన శ్రీనివాస దేశికుల శిష్యుడే. కాని యాతని తలిదండ్రులు అక్కమాంబా వేదాంతదేశికులు. మీదు మిక్కిలి వారిది కౌండిన్యసగోత్రము. ఈ కౌండిన్య వేంకటాచార్యులు మన కిరీటి వేంకటాచార్యులకు సహాధ్యాయి యైనట్లు వేంకటాచార్య విజయ వైజయంతీ నాటకము సాక్ష్యమిచ్చుచున్నది.

ఈ తిరుమల బుక్కపట్టణం వంశస్థులందరును గొప్ప పండితకవులు. ఆత్మకూరు మొదలగు ప్రాంతములందు పూర్వవాసనగల కుటుంబముల వారిప్పటికిని ఉన్నారు. వారి చెంత అపూర్వములైన అముద్రిత గ్రంథము లెన్నియో పూర్వులు వ్రాసినవి యున్నవి. ప్రభుత్వమో ప్రజాసంస్థలో వానిలో కొన్నింటినైనా ప్రచురించిన బాగుండును.

శ్రీ ఎన్.సి.ఎస్. పార్థసారథి

# మంగళాశాసనము

౧

శ్రీ గోలి వంశాబుధి పూర్ణ చంద్రః
చాంద్రై ర్యశోభిః పరితృప్త లోకః
లోకైక కేంద్రః స చ సద్గుణానాం
జీయాత్ చిరాయుః సుకృతీశ్వరార్యః.

౨

బాలురు గోలీ లాడెడు
పోలిక వ్యాపారము నలవోకగ జేయం
జాలు నితండని యా విధి
గోలి యనెడి యింటిపేరు కూర్పగ బోలున్.

౩

అమ్మినంతవరకు సొమ్ము చేసికొనుట
కలిగినంతవరకు కరగ దినుట
చేయలేని దెవరు ? నీ యట్లు విబుధుల
నాదరించువార లరుదుగాక !

౪

పండితాశీః పరంపర ప్రాభవమున
మూడు పూ లారుకాయలై ముమ్మరముగ
వరలు గావుత నీదు వ్యాపార మెపుడు
హితవుగా నెల్లరకు గోలి ఈశ్వరయ్య !

౫

పితృ పైతామహ తారకమ్ముగ
జగద్విఖ్యాతిగా ధర్మముల్
సతముం జేయుచు, నీదు గేహము
సహస్ర స్తుత్య గేహమ్ములం
బ్రతిభాసింపగ నాద్యమై, చిరయశో
భాగ్యాయురారోగ్య సం
తతు లొప్పారగ నీశ్వరయ్య ! మను
మాదర్శమ్ముగా నెల్లెడన్.

డా. పోణంగి శ్రీరామ అప్పారావు

# భామహ కావ్యాలంకారము

## 1

### భామహుడు

కాలము:— భామహుడు, దండి— ఈ యిరువురి కాలములను నిర్ణయించుటలోను, అందున ఈ యిరువురిలో ఎవరు పూర్వులను విషయములోను విమర్శకులలో భేదాభిప్రాయము లున్నవి. ఈ భేదములకు ముఖ్యకారణములు (i) కావ్యాలంకార కావ్యాదర్శములు రెండింటియందును, అర్థమునందే కాక శబ్దమునందును, పరస్పరము సంవదించు భాగము లనేకములుండుట[1]; (ii) దండి భామహుని భామహుడు దండిని పరస్పరము విమర్శించుచున్నట్లు కన్పట్టు భాగములు రెండు గ్రంథములందును బహుళముగా నుండుట.[2]— ఈ కారణములు రెండును విభిన్న వాదములకు దారితీసినవి. ఇట్లు బయలు దేరిన వాదముల సారాంశమును క్రింది విధముగా పేర్కొనవచ్చును— (i) దండికంటె భామహుడే పూర్వుడు. అనగా భామహుడు (క్రీ.శ. 400 ప్రాంతము) ముందరివాడు; దండి (క్రీ.శ. 700 ప్రాంతము) తరువాతివాడు; ఇరువురికిని మధ్య శతాబ్దముల అంతరమున్నది— ఇది శ్రీయుతులు బలదేవ్ ఉపాధ్యాయ,బటుక్‌నాథశర్మల నిర్ణయము.[3] (ii) భామహునికంటె దండియే పూర్వుడు. అనగా

1. ఇందులకు రెండు మూడు ఉదాహరణముల నొసగుచున్నాను.

(i) "సర్గబంధో మహాకావ్యమ్", – కావ్యాలంకారము 1-19: కావ్యాదర్శము 1-14.

(ii) "మంత్రదూత ప్రయాణాజినాయకాభ్యుదయైశ్చ యత్"–కావ్యాలంకారము 1-20. "మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి"— కావ్యాదర్శము 1-17.

(iii) "ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితం"–కావ్యాలంకారము 3-1; కావ్యాదర్శము 2-5.

2. రెండు పక్షములకు రెండుదాహరణముల నొసంగుచున్నాను.

(i) భామహుడు కథ, ఆఖ్యాయికలు రెంటికిని భేదములు పాటించి వేర్వేరు నిర్వచనము లొసంగియున్నాడు (1-25-29). కాని దండి అవి అభిన్నములనియు, కథ, ఆఖ్యాయిక- అనునవి రెండును ఒకేజాతి రచనకు భిన్న నామములు మాత్రమే యనియు పేర్కొనెను. ఇచ్చట దండి భామహుని విమర్శించుచున్నట్లుగా కావ్యాదర్శ వ్యాఖ్యాతయగు తరుణ వాచస్పతి వివరించెను. కాని ఇతడు క్రీ. శ. 13 వ శతాబ్దివాడగుటచేత కాలనిర్ణయమున వీనిని ప్రమాణముగా గ్రహింపరాదని మహామహోపాధ్యాయ శ్రీ పి. వి. కాణే అభిప్రాయము.

(ii) నిందోపమ, ప్రశంసోపమ, చిఖ్యాసోపమ అనెడి ఉపమాభేదములు మూడింటిని దండి కావ్యాదర్శమందు నిర్వచించి యున్నాడు (2-30, 31, 32). కాని ఈ విషయమును గూర్చి భామహుడు చేసిన వివరణము దండి మీది విమర్శగా గోచరించుచున్నది– "నిందా ప్రశంసా, చిఖ్యాసా భేదములచేత, ఉపమాలంకారము త్రిప్రకారమని కొందరు మహాత్ములందురు. కాని ''సామాన్యగుణ'' నిర్దేశము చేత ఈ మూడింటిని మే మిదివరకే చెప్పియున్నాము''— కావ్యాలంకారము, 2-37, 38.

3. చౌకంబా సంస్కృత సీరీస్ (కాశీ) ముద్రణమునకు వారి ఉపోద్ఘాతము, పుట-40.

దండి (క్రీ శ. 660-680) ముందరివాడు. భామహుడు (క్రీ. శ. 700-750) తరువాతి వాడు. ఇరువురికిని మధ్య కొన్ని దశాబ్దముల అంతరము మాత్రమే కలదు. అంతియేకాని శతాబ్దముల అంతరము లేదు; ఒకరు ఇంకొకరి గ్రంథము నుండి గ్రహించినారు, లేదా ఒకరిని ఇంకొకరు విమర్శించినారు అని అనుటకంటె ఇరువురును తమకు పూర్వులైన ఆలంకారికుల నెవ్వరినో అనుసరించియుందురనుట సమంజసము.[4]— ఇది మహామహోపాధ్యాయ శ్రీ పి.వి. కాణే నిర్ణయము.[5] ఇంక తక్కిన విమర్శకుల అభిప్రాయములన్నియు ఈ రెండు వాదములలో ఏదో ఒకదానికి ఇంచుమించుగా సరిపోవును.

భామహునికంటె దండి పూర్వుడను వాదమును లేవనెత్తినవారు శ్రీ యమ్. టి. నరసింహ అయ్యంగార్; శ్రీ ఏ. బి. కీత్ అభిప్రాయము ఇదియే. కాని శ్రీ కె. పి. త్రివేది, డా. జాకోబి, ప్రొ. రంగాచార్య, శ్రీ గణపతిశాస్త్రి, డా. నోబెల్ మొదలగు వారు పై వాదమును ఖండించి భామహుడే ప్రాచీనుడని తేల్చిరి. డా. ఎస్. కే. డే, డా. శంకరన్, డా. వి. రాఘవన్ మొదలగు పరిశోధకుల అభిప్రాయమునందు కూడ భామహుడే ప్రాచీనుడు. శ్రీయుతులు బలదేవ్ ఉపాధ్యాయ, బటుక్‌నాథశర్మలిరువురును కాశీ ముద్రణమునకు తాము వ్రాసిన ఉపోద్ఘాతమందు క్రీ.శ. 1929 పూర్వము బయలు దేరిన వాదములను చాలవరకు చర్చించి దండికంటె భామహుడే పూర్వుడని నిర్ణయించియున్నారు. ఇంక శ్రీ పి. వి. కాణే తన "సంస్కృత సాహిత్య శాస్త్ర చరిత్ర" (సాహిత్యదర్పణోపోద్ఘాతము— క్రీ. శ. 1951) యందు "భామహుడు పూర్వుడు", "దండి పూర్వుడు" అనెడి రెండు వాదములను కూలంకషముగా చర్చించియున్నారు. మొదటి వాదమునకు చెందిన ఆధారములను తొమ్మిదింటిని, రెండవ (తన) వాదమునకు చెందిన ఆధారములను పదునేడింటిని ఆయన పేర్కొనెను. (మొత్తము ఆంగ్లాక్షరమాలను A to Z పూర్తిచేసియున్నారు).

కావ్యాలంకార షష్ఠాధ్యాయమందు భామహుడు "న్యాసకారుని" పేర్కొనియున్నాడు. ఈ న్యాసకారుడు[6] క్రీ. శ. 700 ప్రాంతములందున్న "జినేంద్రబుద్ధి" (పాణిని సూత్రములకు వృత్తియైన "కాశిక" మీద పెద్ద వ్యాఖ్యానమును "న్యాస" మను పేర రచించెను.) అని ప్రొ. పఠక్, శ్రీ పి. వి. కాణే మొదలగువా రంగీకరించియున్నారు. ఆయనను పేర్కొన్న భామహుడు క్రీ.శ. 700 తరువాతివాడగుచున్నాడు. రుద్రటాలంకార వ్యాఖ్యాతయగు "నమిసాధువు" దండిని భామహుని కంటె పూర్వునిగా పేర్కొనుట (దండి, మేధావిరుద్ర, భామహాదికృతాని) శ్రీ కాణే వాదమునకు చాల బలము నొసంగుచున్నది. ఈ చివరి విషయమును చర్చించిన పిమ్మట శ్రీ కాణే తెలిపిన అభిప్రాయమును క్రింది విధమున సంగ్రహముగా పేర్కొనవచ్చును:

"ఇంతవరకును పేర్కొనబడిన ఆధారములు

4. "మేధావి" యనువాని ననుసరించి ఉపమాదోషములను పేర్కొనినట్లు భామహుడు చెప్పుకొనుటనుబట్టి అంతకుముందే కొందరు ఆలంకారికులుండిరనుట స్పష్టము. వారి గ్రంథము లిప్పుడేవియును లభింపకపోయినను దండి భామహులకు అవి తెలిసియేయుండునని యూహించుట అసమంజసము కానేరదు.

5. సాహిత్యదర్పణోపోద్ఘాతము, పుట 94.

6. ఈ "న్యాసకార" పదము పెక్కు విమర్శలకు గురియైనది. "న్యాస" మను పేరు గలిగిన వ్యాకరణసంబంధమైన రచనలు చాల ఉన్నను క్రీ. శ. 700 పూర్వము రచింపబడిన ఇది జినేంద్రబుద్ధి న్యాసము మాత్రమే యని శ్రీ కాణే నిర్ణయము. కావ్యాలంకార పంచమాధ్యాయ మందలి "అనుమానాదుల" నిర్వచనములు కొన్ని ధర్మకీర్తి (క్రీ. శ. 650 ప్రాంతములు) "న్యాయబిందువు" నందలి నిర్వచనములతో సంవదించుచున్నవి. భామహుడు ధర్మకీర్తిని అనుసరించియుండునని అంగీకరించినచో భామహుడు క్రీ. శ. 700 కు తరువాతివాడే కాగలడు.

పూర్వపక్ష రహితములని చెప్పజాలము. కావున ఇరువురిలో ఎవరు పూర్వులైనప్పటికిని ఇరువురి మధ్య వ్యవధానము చాల తక్కువయనియు, ఇరువురును క్రీ.శ. 600–750 మధ్యకాలమునకు చెందినవారనియు చెప్పవచ్చును .... ఒకరినుండి ఇంకొకరు గ్రహించియుండురనికాని, లేదా ఒకరి నొకరు విమర్శించియుందురనికాని అంగీకరింప వలసి వచ్చినప్పుడును— పూర్వాలంకారికుల నుండియే ఇరువురును గ్రహించి యుందురనుట అంగీకారయోగ్యము కానప్పుడును— దండి పూర్వుడను వాదమునే నేను సమర్థింతును."[7]

శ్రీ కాణే చేసిన నిర్ణయము ప్రామాణికమును, పక్షపాతరహితమును అయినప్పటికిని, కాలనిర్ణయము లెట్లున్నప్పటికిని, దండికంటె భామహుడు పూర్వుడనుటయే బహుజనసమ్మతము.

*దేశము:*— భామహుడు తన తండ్రిపేరు తప్ప స్వవిషయము లింకేమియును తెలుపలేదు. అందుచేత దేశ నిర్ణయమును వివాదాస్పదమేయైనది. కాశ్మీరీయుడైన ఉద్భటుడు "భామహ వివరణము" (కావ్యాలంకారమునకు వ్యాఖ్యయగునేమో ?) రచించినట్లు ఉద్భటాలంకార (కావ్యాలంకార సార సంగ్రహ) వ్యాఖ్యాత యగు ప్రతీహారేందురాజు పేర్కొనియున్నాడు.[8] అది లభింపలేదు; లభించి యున్నచో పెక్కు సమస్యలు తీరియుండెడివి. ఉద్భటుడు చూపిన అభిమానమునుబట్టి భామహుడును కాశ్మీరీయుడై యుండునని ఊహింపవచ్చును. "భామహుని జన్మచేత కాశ్మీరదేశము అలంకృతమైన"దని అచ్చటి పండితులు గర్వపడుచుందురట!

*మతము:*— షష్ఠాధ్యాయాంతమున తాను "రక్రిలగోమి" సూనుడనని భామహుడు చెప్పుకొనెను. "గోమి" పదము బౌద్ధనామములను తెలపించుచున్నదనియు, ఆ పేరుగల బుద్ధుని శిష్యుడొక డుండెననియు, చాంద్ర వ్యాకరణ కర్తయగు "చంద్రగోమి" బౌద్ధుడనియు, ఈ కారణములను బట్టి "రక్రిలగోమి"యును బౌద్ధుడగుననియు, తత్పుత్రుడగు భామహుడును బౌద్ధుడే యగుననియు కొందరి వాదము. అంతేకాక మంగళాచరణ శ్లోకమందు "ప్రణమ్య సార్వం సర్వజ్ఞం" అని భామహుడు రచించి యుండుటయు నిందులకు బలము నొసంగుచున్నదందురు. కాని తక్కిన విమర్శకులు "గోమి"పదము పూజ్యవాచకముమాత్రమేయందురు. "గోమి" పదము క్రీ.శ. 4, లేదా 5వ శతాబ్ది నాటికి కేవలము బౌద్ధనామ చిహ్నము మాత్రమే కాదనియు, బౌద్ధులు కానివారికి కూడ ఆ పేరున్నదనియు శ్రీ కాణే నిరూపించియున్నారు. మంగళాచరణమందలి "సర్వజ్ఞ" పదము శివునకు, బుద్ధునకు కూడ పర్యాయపదమే. ఇంక "సార్వ" పదము బుద్ధునకు పర్యాయపదమే కాదు. "అందరకును హితుడు" అని మాత్రమే దాని కర్థము. అంతేకాక భామహుడు బౌద్ధుల "అపోహ" వాదమును (6–17,18,19) తిరస్కరించి యున్నాడు; గ్రంథమం దెచ్చటను బుద్ధునకు, బౌద్ధులకు సంబంధించిన సంఘటనలను పేర్కొనుటలేదు; రామాయణ, మహాభారత, బృహత్కథాదులందలి సంఘటనలను బహుళముగా ఉదాహరించియున్నాడు[9]— ఈ కారణములనుబట్టి ఈతడు బౌద్ధుడు కాడనుట స్పష్టము. భామహుడు వైదిక ధర్మావలంబియైన బ్రాహ్మణుడనుట బహుజనసమ్మతము.

భామహుడు పేర్కొన్న రచయితలు, రచనలు

రచయితలు–మేధావి (2–40;88); రామశర్మ (2–19; 58); కుంభకుడు (5–17); న్యాసకారుడు (6–36); శాఖవర్ధనుడు (2–46)

7. సాహిత్యదర్పణోపోద్ఘాతము–పుట 108.

8. "విశేషోక్తిలక్షణే భామహవివరణే భట్టోద్భటేన ఏకదేశశబ్దః ఏవం వ్యాఖ్యాతః"— కావ్యాలంకారసారసంగ్రహ వ్యాఖ్య.

9. 3-7 శ్లోకమునందు కర్ణ, పార్థ, శల్యులు పేర్కొనబడిరి. 3-14 శ్లోకమునందు రామ, పరశురాములు పేర్కొనబడిరి— ఇట్టివి అనేకములు కలవు.

మొదలగువారు. రచనలు— అశ్మకవంశము (1-33); అచ్యుతోత్తరము (2-19); రాజమిత్రము (2-45; 3-10); రత్నాహరణము (3-8)— ఈ గ్రంథము లేమియును లభింపలేదు. అంతేకాక శాఖవర్ధనుడు, అశ్మకవంశము, అచ్యుతోత్తరము, రాజమిత్రము, రత్నాహరణము— ఈ ఐదుపేర్లను మఱి యే యితర గ్రంథమందు కూడ స్మరింపబడలేదు. బృహత్కథయందలి వత్సేశ, నరవాహన దత్తుల కథ లుదాహరింపబడినవి. ఇంక కొన్నిచోట్ల పేర్లు చెప్పకయే "అపరే, అన్యే, కేషాంచిత్" మొదలగు పదములతో ఇతరుల మతములను పేర్కొనియున్నాడు. నాటకాదుల విషయమున "ఉక్తోఽన్యైస్తస్య విస్తరః" (1-24) అనుట భరతుడు మొ. నాట్యశాస్త్ర కర్తలను సూచించుచున్నది. పాణినిని "సాలాతురీయ", "సూత్రకృత్" అనియు; కాత్యాయనుని "పదకారు" డనియు; మహాభాష్యమును "ఇష్టప్రయోగ" మనియు పేర్కొనెను. "పదము" (Word) ను నిర్వచించు సందర్భమునందు "గురుభిః కింవివాదేన ?" (4-7) అని చెప్పుటలోని "గురువు" లెవ్వరో తెలియదు.

*భామహుని పేర్కొన్న అర్వాచీనులు :—* కావ్యాలంకార మందలి నూరు, నూటపాతిక శ్లోకములు అర్వాచీన గ్రంథములందు—పలు మతములకు చెందిన పలువురిచేత—భామహుని పేరుతోను, భామహుని పేరు లేకుండగనుకూడ పేర్కొనబడినవి.[10] ఈ శ్లోకములను పేర్కొన్నవారిలో ముఖ్యులు ఉద్భట, వామన, ఆనందవర్ధన, కుంతక, అభినవగుప్త, మమ్మటాదులు. ఇంక విద్యాధర, రుయ్యకాదులు భామహునకు ఉన్నతస్థానమిచ్చి ప్రాచీనాచార్యునిగా పేర్కొని యున్నారు.

భామహుని పేరుతో కావ్యాలంకారమునుండి పేర్కొనబడిన శ్లోకములు కొన్ని—

ధ్వన్యాలోకమందు—2-85 శ్లో.[11] పేర్కొనబడినది; ఉద్భటాలంకార వ్యాఖ్యలో—1-17; 3-33 మొ. శ్లోకములు పేర్కొనబడినవి; "లోచన" యందు 1-9 శ్లో. మొ. శ్లోకములు పేర్కొన బడినవి.

భామహుని పేరు లేకయే కావ్యాలంకారము నుండి పేర్కొనబడిన శ్లోకములు కొన్ని—

ధ్వన్యాలోకమందు—1-2, 6, 36; 2-23, 27, 68, 69 మొదలగు శ్లోకములు. కావ్యప్రకాశమునందు—1-13, 14, 15; 2-47, 55, 57 మొ.

"పూర్వేభ్యో భామహాదిభ్యః సాదరం విహితాంజలిః" అని విద్యాధరుడును; "భామహోద్భట ప్రభృతయః చిరంతనాలంకారకారాః" అని రుయ్యకుడును భామహుని సగౌరవముగా పేర్కొని యున్నారు, "అతిశయోక్తి"ని గూర్చి చర్చించెడి సందర్భములో "ఆకరే దర్శితమ్" అనుచు వీర రాఘవభట్టు శాకుంతల వ్యాఖ్యానములో భామహాలంకారమునుండి ప్రమాణము నుదాహరించి యున్నాడు. ఈతడు కావ్యాలంకారమును "ఆకర" (Treasure house) మనుట గమనార్హము.

*ఇతర రచనలు :—* అర్వాచీన గ్రంథములందు, వ్యాఖ్యానములందు భామహునివిగా పేర్కొనబడిన శ్లోకములు కొన్ని కావ్యాలంకార ముద్రణములందు కన్పట్టుటలేదు. అవి ఛందస్సునకు, అలంకార శాస్త్రమునకు సంబంధించి యున్నవి. భామహుడు ఇతర గ్రంథము లేమైన రచించెనేమో తెలియదు. వరరుచి "ప్రాకృత ప్రకాశ"కు భామహుని వ్యాఖ్య ఒకటి కలదు. ఆ భామహుడును, ఈ భామహుడును ఒకరే యగుదురో, కారో అను

10. శ్రీ కె. పి. త్రివేది ప్రతాపరుద్రయశోభూషణమున కనుబంధముగా ప్రకటించిన "కావ్యాలంకార" మందలి అధస్సూచికలలోను, కాశీముద్రణానుబంధమునందును ఈ విషయము సవిస్తరముగా కలదు.

11. "సైషా సర్వైవ వక్రోక్తిః...." — ఈ శ్లోకమును అనేకులు పేర్కొనియున్నారు.

విషయము వివాదాస్పద మైనది. ఇంతకుమించి భామహుని ఇతర రచనలను గూర్చిన వివర మింకేదియును లేదు.

*స్వభావము* :—భామహుడు చాల స్వతంత్రుడు. ప్రసిద్ధమైన "నాట్యరస" ప్రవాహమున కెదురీదిన వాడనుట ప్రసిద్ధమే "అలంకార విధిని స్వబుద్ధితో నిర్ణయించి చెప్పితిని" (3-58); "స్వకీయ శక్తిచేత కావ్యలక్ష్మములు నిర్ణయింపబడినవి" (6-64) అని భామహుడు స్వాతిశయముగా చెప్పుకొనినాడు. ఇందుమించుగా ఉదాహరణములన్నియు భామహుని సొంతములనియే చెప్పవచ్చును. ("స్వయం కృతై రేవ నిదర్శనై రియం, మయా ప్రకౢప్తాఖలు వాగలంకృతిః"— 2-96). శబ్దతత్త్వాది నిర్ణయములందు వ్యతిరేకులను స్పష్టముగా తిరస్కరించుటయే కాక పరిహసించియున్నాడు ("కొందరు సుధీమంతు లిట్లందురు" 1-31; ఆ విద్వాంసులకు నమస్కారము 4-46 మొదలగునవి), అయినను భామహుడు గర్వరహితుడనియే చెప్పవలెను. చతుర్థ పరిచ్ఛేదాంతమున తన్నుగూర్చి చాలా వినతుడై చెప్పుకొనియున్నాడు. మోరాదను మించని ఆ స్వాతంత్రత, ఈ వినయము—ఇవి రెండును తరువాతి ఆలంకారికులపై తమ ప్రభావమును చూపి వారిని వశపరచుకొన్నవని చెప్పవచ్చును; ఇంచుమించు 400 శ్లోకములు మాత్రమే కలిగియున్న కావ్యాలంకారమునుండి నూరు, నూటపాతిక శ్లోకములు అర్వాచీనులచేత ఉదాహరింపబడుట ఆలంకారికులయందు భామహుని స్థానమును సుస్పష్టముగా నిరూపించుచున్నది. "భామహ" నామము సహజ నామము కాదనియు, పెట్టుకొన్న పేరు (Pen name) అయి యుండుననియు, "భామహ" పదమునకు "One who has killed or given up anger" అని అర్థమనియు శ్రీ పి. వి. నాగనాథ శాస్త్రిగారు తమ ఆంగ్లానువాద పీఠికలో పేర్కొనిరి.

## 2

## కావ్యాలంకారము

**గ్రంథపరిశీలనము :**

*ముద్రణములు* :— 1. క్రీ. శ. 1909 లో శ్రీ కె. పి. త్రివేది[12] కావ్యాలంకారమును ప్రప్రథమముగా, విద్యానాథుని ప్రతాపరుద్రీయమున కనుబంధముగా ప్రకటించెను. (Bombay Sanskrit Series).

2. క్రీ. శ. 1927 లో శ్రీ పి. వి. నాగనాథ శాస్త్రి కావ్యాలంకారమును ఆంగ్లానువాద సహితముగా ప్రకటించెను. (Wallace Printing Press, Tanjore)

3. క్రీ. శ. 1928 లో శ్రీయుతులు బటుక్‌నాథ శర్మ, బలదేవ్ ఉపాధ్యాయలు ఇరువురును సంస్కృతమూలమును ప్రకటించుచు, ఇంచుమించు 80 పుటల ఉపోద్ఘాతమును వ్రాసినారు, (Chowkhamba Sanskrit Series, Benares)

4. క్రీ. శ. 1934 లో శ్రీ డి. టి. తాతాచార్య శిరోమణి స్వీయ సంస్కృతవ్యాఖ్య (ఉద్యానవృత్తి) సహితముగా కావ్యాలంకారమును ప్రకటించిరి. (Srinivasa Press, Tiruvadi)—ఉద్భటుని "భామహ వివరణము" లభ్యముకాని లోపమును శ్రీ తాతాచార్యులవారు తీర్చిరని చెప్పవచ్చును.

*రచనా ప్రణాళిక* :—షష్ఠ పరిచ్ఛేదాంతమున రెండు శ్లోకములలో భామహుడు తన గ్రంథరచనా ప్రణాళికను స్థూలముగ నిరూపించి యున్నాడు—

షష్ట్యా శరీరం నిర్ణీతం, శతషష్ట్యా త్వలంకృతిః ।
పంచాశతా దోషదృష్టిః, సప్తత్యా న్యాయనిర్ణయః ॥

---

12. చిరకాలముగా లభ్యముకాని కావ్యాలంకార ప్రతిని ప్రప్రథమముగా సంపాదించిన ఖ్యాతి ఆచార్య రంగాచార్యగారికి దక్కినదని "కవిరాజమార్గ" ఉపోద్ఘాతమందు శ్రీ కె.బి. పఠక్ (1898) పేర్కొనియున్నారు. ఇంక ప్రప్రథమముగా ముద్రించిన ఖ్యాతి శ్రీ త్రివేదికి లభించినది.

షష్ఠ్యా శబ్దస్య శుద్ధిః స్యాదిత్యేవమ్ వస్తుపంచకమ్।
ఉక్తమ్ షడ్భిఃపరిచ్ఛేదైః భామహేన క్రమేణ వః॥

మొత్తము 6 పరిచ్ఛేదములు. అందు ఐదు విషయములు వివరింపబడినవి. ఇంచుమించుగా 400 శ్లోకములు కలవు.

1. కావ్యశరీరము (ప్రథమ పరిచ్ఛేదము—60 శ్లోకములు)—కవిత్వ ప్రయోజనాదులు, కావ్యభేదములు, రీతి, పది సామాన్య దోషములు మొదలగునవి చర్చింపబడినవి.

2. అలంకారములు (ద్వితీయ, తృతీయ పరిచ్ఛేదములు—160 శ్లో.)—3 గుణములు, 2 శబ్దాలంకారములు, 36 అర్థాలంకారములు లక్ష్య, లక్షణ సహితముగా వివరింపబడినవి. ఇందు కేవలము నామమాత్రావశేషులైన కొందరు కవుల గ్రంథముల నుండి ఉదాహరణము లొసంగబడినవి.

3. దోషములు (చతుర్థ పరిచ్ఛేదము—50 శ్లోకములు.)—పది విశేష కావ్యదోషములు లక్ష్య, లక్షణ సహితముగా వివరింపబడినవి,

4. న్యాయ నిర్ణయము[13] (పంచమ పరిచ్ఛేదము—70 శ్లోకములు)—ఇందు 11 వ దోషము (ప్రతిజ్ఞా, హేతు, దృష్టాంత హీనత్వము) చర్చింపబడినది. కావ్యరచనకు, న్యాయశాస్త్రమునకు గల సంబంధము (Logical foundations of poetry), తత్సంబంధమైన దోషములు వివరింపబడినవి.

5. శబ్దశుద్ధి (షష్ఠ పరిచ్ఛేదము—60 శ్లోకములు)—"శబ్ద" నిర్వచనము, శబ్ద సాధుత్వాసాధుత్వ వివేచనము, సౌశబ్ద్యమూలకములైన వ్యాకరణాంశములు నిందు కలవు.

13. న్యాయ నిర్ణయము అలంకారశాస్త్రమునకు సంబంధించిన భాగము కాదని దండి నిరసించియున్నాడు. ఇంక షష్ఠపరిచ్ఛేదము "శబ్దశుద్ధి"యు నట్టిదే. కాని వామనుడు ఒక్కడు మాత్రము ఈ భాగమును మరల కావ్యాలంకార సూత్రములో పంచమాధికరణమునందు సవిస్తరముగా వివరించియున్నాడు.

విషయ పరిశీలనము :

1. కావ్యలక్షణ ప్రయోజనములు :—"శబ్దార్థౌ సహితౌ కావ్యం" (1-16) అనునది భామహుని ప్రసిద్ధ కావ్యనిర్వచనము. (దీనినుండియే "సాహిత్యము", "సాహిత్య శాస్త్రము" అను పదము లేర్పడియుండును). శబ్దార్థసహితమైనదే కావ్యమన్నప్పుడు ఏ రచనయైనను కావ్యము కాగలదు, ఈ లోపము పరిహరించుటకు మరల "యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వమేవైతదిష్యతే" (1-30) అని వివరించియున్నాడు. కావున ఈ రెండును కలిసి యేర్పడిన "వక్రోక్తి యుక్తములైన శబ్దార్థములతో కూడినదే కావ్యము" అనునది భామహుని కావ్యలక్షణము కాగలదు. ఇంక కావ్య ప్రయోజనమునుగూర్చి చర్చించుచు "సాధుకావ్యము ధర్మార్థ కామ మోక్షములందును, కళలయందును వైచక్షణ్యమును, ప్రీతిని, కీర్తిని కలిగించును." (1-2) అని పేర్కొనియున్నాడు. ఈ ప్రయోజనములకు మమ్మటుడు "కాంతా సమ్మితమైన ఉపదేశము" గూడ చేర్చెను. ఈ ప్రయోజనములందు "ప్రీతి"యే ప్రధానమని అభినవగుప్తుని నిర్ణయము (ఆనంద ఏవ పార్యంతికం ఫలమ్).కాని భామహుని "ప్రీతి"యు (A certain pleasant experience), అభినవగుప్తుని "ఆనందము"ను (Aesthetic experience) ఒకటియే యని చెప్పజాలము. ఇంతకును భామహుడు "కవిత్వానుభూతి"ని గూర్చి చర్చింపనేలేదు. కావ్యప్రయోజనములను గూడ "పఠిత" దృష్టితోకాక "కవి"ని దృష్టిలో పెట్టుకొనియే చెప్పెను. అయినను "కవి", "పఠిత"—ఇరువురును సమానానుభూతి కలవారే యని అభినవగుప్తాదులు తరువాత నిరూపించియున్నారు కాన భామహుడు "కవి" పరముగా చెప్పిన ప్రీతిని "పఠిత" అనుభూతికికూడ అన్వయింపవచ్చును.

2. రీతులు :— వైదర్భ, గౌడీరచనలు[14] రెండింటిని మాత్రమే భామహుడు పేర్కొనెను. కాని ఈ రెండింటికిని తరతమ భేదముల నాతడంగీకరింప లేదు. "అలంకారవంతము, అగ్రామ్యము, అనాకులము, అర్థవంతము, న్యాయ్యము అయినప్పుడు రెండు విధములగు రచనలును గ్రాహ్యములే" (1-35) అని వాని నిశ్చయము. కావుననే 'అతిమాత్ర' మైనప్పుడు వైదర్భియు నసహ్యమగును; 'సదర్థ' మైనప్పుడు గౌడియు మనోహరమే యని భామహు డంగీకరించెను. కాని దండి భామహుని అభిప్రాయమునకు పూర్తిగా వ్యతిరేకి యనవచ్చును. "వైదర్భి" యం దాతడధికాదరమును జూపెను.

3. గుణములు :— మాధుర్యము, ప్రసాదము, ఓజస్సు—ఈ మూడింటిని మాత్రమే భామహుడు పేర్కొనెను (2-1, 2, 3). భామహునకు ముందున్న భరతుడు "దశ గుణము"లను నిర్వచించి యుండెను. దండికూడ "దశ గుణము"లను విపులముగా వివరించెను, భామహుని ఈ మూడు గుణముల నిర్వచనములైనను తక్కినవారి నిర్వచనములతో పూర్తిగా నేకీభవించుటలేదు. దండి నిరూపించినట్లు భామహుడు గుణములకు, రీతులకు గల సంబంధమును గూడ స్పష్టముగా నిరూపింప లేదు. కాని వైదర్భ రచనను విమర్శించినప్పుడు "ప్రసన్నమ్ (ప్రసాదము), ఋజు, కోమలమ్, శ్రుతిపేశలమ్" (1-34) అనుగుణములను, గౌడీ రచనను వివరించునప్పుడు "అనాకులమ్....అగ్రామ్యమ్" (1-35) అనుగుణములను వివరించి యుండుట గమనార్హము. అంతేకాక "భావికత్వము" ప్రబంధ గుణముగా (Quality that belongs to a composition as a whole) నిర్వచించియున్నాడు. భామహుడు గుణములకు, అలంకారములకు భేదమును పాటించినట్లు కానరాదు.

4. దోషములు :— భామహుడు మూడువర్గములుగా, మొత్తము ఇరువదియొక్క దోషములను పేర్కొనెను.

i. నేయార్థము, క్లిష్టత, అన్యార్థము, అవాచకము, అయుక్తిమంతము, గూఢశబ్దాభిధానము—ఈ ఆరును మొదటివర్గము.

ii. శ్రుతిదుష్టత, అర్థదుష్టత, కల్పనాదుష్టత, శ్రుతికష్టత — ఈ నాల్గును ద్వితీయవర్గము— ఈ పది దోషములును సామాన్య దోషములు. ఇవి యన్నియును ప్రథమ పరిచ్ఛేదాంతమున (37 నుండి 63 శ్లో. వరకు) వివరింపబడినవి.

iii. ఇంక చతుర్థ పరిచ్ఛేదము ప్రత్యేకముగా దోష ప్రకరణము. ఇందు మఱి పది విశేష దోషములు వివరింపబడినవి. పంచమ పరిచ్ఛేదమందు పదునొకండవ దోషము —ప్రతిజ్ఞా హేతుదృష్టాంత హీనత్వము—విపులముగా వివరింపబడినది. మొదటి పది దోషములు గుణములుగా నయ్యెడి సందర్భములనుగూడ ప్రథమ పరిచ్ఛేదాంతమున భామహుడు వివరించియున్నాడు. కాని తరువాతి దోషముల నట్లు వివరింపలేదు, ఇవియేకాక "ఉపమా దోషములను" ఇంకొక ఏడింటిని భామహుడు పేర్కొనెను (2-39 నుండి 44). అట్లే "వైదర్భ రచన" సందర్భమునందుకూడ కొన్ని దోషములను సూచించియున్నాడు (1-34).

5. కావ్యభేదములు :— నాలుగురకములైన కావ్యభేదములను భామహుడు పేర్కొనియున్నాడు (1-16, 17, 18). కావ్యము; (i) గద్య, పద్యభేదములచేత ద్వివిధము; (ii) సంస్కృత, ప్రాకృత, అపభ్రంశ (భాషా) భేదములచేత త్రివిధము; (iii) వృత్తదేవాది చరిత శంసి, ఉత్పాద్య, కలా, శాస్త్ర (విషయ) భేదములచేత చతుర్విధము; (iv) సర్గబంధ, అభినేయార్థ,

14. భామహుడు "రీతి" పదము నుపయోగింపలేదు. దండి కూడ "రీతి" పదమును గాక "మార్గ" పదమును వ్యవహరించియుండెను.

ఆఖ్యాయికా, కథా, అనిబద్ధభేదములచేత పంచ విధము. ఈ చివరి విభజనయే ప్రధానమైనది. ఈ భేదములను ("అభినేయార్థము" తప్ప) విపులముగా వివరించియున్నాడు.

6. *అలంకారములు :*— తాను నిర్వచించిన యలంకారము లన్నింటిని భామహుడు నాలుగు వర్గములుగా[15] విభజించి యున్నాడు.

i. అనుప్రాస, యమక, రూపక, ఉపమలు ("అన్యైః ఉదాహృతాః" అని పేర్కొని యున్నాడు—2-4) — నాట్యశాస్త్ర మందు "అనుప్రాసము" లేదు. తరువాతి కాలములో ఇది అలంకారముగా పరిగణింపబడి యుండును.

ii. ఆక్షేప, అర్థాంతరన్యాస, వ్యతిరేక, విభావనా, సమాసోక్తి, అతిశయోక్తులు ("షడలంకృతయోఽపరాః"—2-66). ఇది ద్వితీయ వర్గము. పిమ్మట "హేతు, సూక్ష్మ, లేశా" లంకారములు మూడును, "వార్త"యను పేర్కొనబడినను వక్రోక్తి రహితములగుట వలన భామహునిచేత అవి అలంకారములుగా పరిగణింపబడలేదు (2-86, 87). ఈ నాలుగును రెండవ వర్గమునకు చెందినవే.

iii. యథాసంఖ్య, ఉత్ప్రేక్షలు ("అలంకారద్వయంవిదుః"-2-88) ఇది తృతీయవర్గము "స్వభావోక్తి"యను ఈ వర్గమందే వివరింప బడినది (కేచిత్ ప్రచక్షతే[16]—2-93).

iv. 23 అలంకారములను ఏకవర్గముగా తృతీయ పరిచ్ఛేదమందు వివరించియున్నాడు. ఇది చతుర్థవర్గము. తృతీయ పరిచ్ఛేదాంతమున "ఆశీస్సు"నుకూడ పేర్కొనెను (కేషాంచి దలంకారతయా మతా—3-55).

ఈ వర్గములు అలంకారముల అభివృద్ధిని సూచించుచున్నవనుట స్పష్టము. ఉద్భటుడును ఇట్లే ఆరువర్గములను పేర్కొనియుండెను. కాని క్రమముగా ఇట్టి వర్గీకరణము పోయి శబ్ద, అర్థ, ఉభయ (మిశ్ర) భేదములేర్పడినవి. అందు "అర్థాలంకారములు" మరల కొన్నివర్గములుగా విభజింప బడినవి. భామహుడు స్పష్టముగా శబ్ద, అర్థ భేదములను వివరింపకపోయినను, ఆతడు వివరణ ప్రారంభములో పేర్కొనిన "అనుప్రాస, యమకములు" రెండును శబ్దాలంకారములు; సంసృష్టి (3-49) మిశ్రాలంకారము; ఇంక తక్కిన ముప్పది యైదును అర్థాలంకారములు.

7. *సౌశబ్ద్యము:*—శబ్దార్థాలంకార భేదమును స్పష్టముగా చెప్పకపోయినను భామహుడు పేర్కొనిన ఆనాటి వివాదమును, దానిపై భామహుని నిర్ణయమును ఒక విశిష్ట విషయమును సూచించు చున్నవి. "రూపకాద్యలంకారములు 'బాహ్యము' లని కొందరందురు. వారి దృష్టిలో 'సుప్', 'తిఙ్'ల (శబ్దముల) వ్యుత్పత్తియే వాగలంకృతి; అదియే సౌశబ్ద్యము; అర్థ వ్యుత్పత్తి (అర్థాలంకారము) ఇట్టిది కాదు. కాని శబ్ద, అభిధేయ (అర్థ) అలంకార భేదమును అంగీకరించిన మాకు రెండును ఇష్టమే." (1-14, 15)—దీనినిబట్టి శబ్దార్థాలంకార భేదము భామహునకు తెలియునని చెప్పవచ్చును. కాని ఇచ్చట భామహుడు చెప్పిన శబ్దాలంకారము అను

15. ఈ విషయమును గుర్తించిన ప్రథముడు డా. జాకోబి.

16. "కేచిత్ ప్రచక్షతే" అనుదానిపై ఆధారపడి "స్వభావోక్తి"ని గూడ భామహుడంగీకరింప లేదనియు, "వక్రోక్తి" సర్వముఖ్యమైన వాని ప్రణాళికలో తద్విరుద్ధమైన "స్వభావోక్తి"కి తావు లేదనియు కొందరి వాదము, ఇది సరియైన అభిప్రాయము కాదు. "స్వభావోక్తి" యందుకూడ అంతో ఇంతో "వక్రత" లేకపోలేదు. "స్వభావోక్తి" యనగా "వార్త" (Ordinary expression) అని భ్రమింపరాదు. డా. వి. రాఘవన్ "స్వభావోక్తి" అనువ్యాసమునందును (Some concepts of Alankara Sastra), శ్రీ తాతాచార్య శిరోమణి "D·fi-nition of poetry" అను వ్యాసమునందును పై వాదమును ఖండించి యున్నారు.

ప్రాస, యమకాదిరూపమైనదిగా కన్పట్టదు. నాటి ఆలంకారికులు కొందరు శబ్దమునకెక్కువ ప్రాధాన్య మిచ్చి, "సౌశబ్ద్యమే" ముఖ్య వాగలంకృతియని వాదించుచుండిరన్నమాట. కావున వీరి దృష్టిలో "సౌశబ్ద్యము" అభ్యంతరాలంకారము; ఇంక రూప కాదులు బాహ్యాలంకారములు (అప్రధానములు) మాత్రమే. తక్కినవారు "అర్థము"నకే ప్రాధాన్య మిచ్చి రూపకాదులే ముఖ్యమనుచుండిరి. భామహుడు మాత్రము రెండింటికిని ప్రాధాన్యమిచ్చియున్నాడు. కావుననే, రూపకాది అర్థాలంకారములను ద్వితీయ తృతీయ పరిచ్ఛేదములందు వివరించినట్లే, "శబ్ద శుద్ధి" యనెడి షష్ఠ పరిచ్ఛేదమున ఆనాడు శబ్దాలం కారముగా పరిగణింపబడిన "సౌశబ్ద్యము"ను విపు లముగా వివరించెను. భామహుడీ "శబ్దశుద్ధి"ని కేవలము "వ్యాకరణ దృష్టి"తో కాక కావ్యసౌంద ర్యాతిశయ హేతువనెడి దృష్టితో వివరించియుండుట గమనార్హము.

8. వక్రోక్తి:—"ఇదియే వక్రోక్తి. ఇది సర్వా లంకారములందు నున్నది. దీనివలననే అర్థములు విభావ్యములగును (విశేషముగా భావింపబడును). కవులు దీనికై యత్నించుట కార్యము. వక్రోక్తి లేనిచో అది అలంకార మెట్లగును?" (2-85) అనుచు భామహుడు వక్రోక్తి ప్రాముఖ్యమును తెలిపి యున్నాడు. వక్రమైన ఉక్తియే (వక్ర + ఉక్తి—A certain striking or deviating expression) వక్రోక్తి. ఇది కవి వ్యాపారము నకు సంబంధించినది. ఈ వక్రతయే సర్వాలంకార జీవితభూతము. కావుననే వక్రోక్తి రహితములైన "హేతు, సూక్ష్మ, లేశ, వార్త" లను భామహుడు తిరస్కరించి యున్నాడు (2-86, 87). అంతే కాక వక్రోక్తి రహితమైన వైదర్భరచన, గుణవంత మైనప్పటికిని, "గేయ" తుల్యమగునే కాని (శ్రుతి పేశలత్వమువలన) కవిత్వము కాజాలదనెను (1-34). "ఉక్తి" యందలి ఈ "వక్రత" యే "వార్త"ను (Ordinary expression or mere news), కవిత్వమును (Poetic expression) వేరు చేయుచున్నది. కావున భామహుని దృష్టిలో "అలంకారములు కావ్యమునందు ప్రధా నము. ఆ అలంకారములకు ప్రాణము వక్రోక్తి". ఇట్టి వక్రోక్తిని అతిశయోక్తికి పర్యాయపదముగా కూడ భామహుడు వాడియున్నాడు (2-85). వక్రోక్తి సిద్ధాంతము భామహుని నూత్నసృష్టి[17] కాకపోయినను. వక్రోక్తి పదమును ఉపయోగించి దాని ప్రాముఖ్యమును పదే పదే నొక్కి చెప్పిన ప్రథముడు భామహుడే కావుననే "వక్రోక్తి రేవ రావ్యాణాం పరా భూషేతి భామహః" అని భోజుడు శృంగార ప్రకాశమందు పేర్కొనెను. స్వభావోక్తి (Description of things as they are), రూపకాది వివిధాలంకార సమూహము (మొదటి దానిలో వక్రోక్తి తప్పక; ఇందు వక్రోక్తియే ప్రాణము), రసవదలంకారము — ఈ మూడును వక్రోక్తి మయములే యగుటచేత భామహునిదృష్టిలో వాఙ్మయప్రపంచము ఏకవిధమే. కాని దండి స్వభావోక్తిని, వక్రోక్తిని విడదీసి వీనిచేత వాఙ్మ యము ద్వివిధమని పేర్కొని యున్నాడు. (భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్); ఈ విభజనలోకూడ రసవదలంకారము వక్రోక్తిలోని భాగమే. పిమ్మట భోజుడు రసవదలంకారమును కూడ విడదీసి వాఙ్మయము త్రివిధ మనినాడు (వక్రోక్తిశ్చ, రసోక్తిశ్చ, స్వభావోక్తిశ్చ వాఙ్మ యమ్). వామనుడు "వక్రోక్తి"ని కేవలము ఒక అలంకారముగా మాత్రమే నిర్వచించి యున్నాడు (సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః); అర్వాచీనాలంకారికు లందరును ఇట్లే చేసిరి. కాని ఒక్క కుంతకుడు మాత్రము మరల వక్రోక్తి ప్రాముఖ్యమును వెల యించి దానినే "కావ్యాత్మ"గా ప్రతిపాదించెను.

9. రసము :— నాట్యమందు "రసము" ప్రధా

17. తన నూత్నసృష్టి కాదు కావుననే భామహు డెప్పటను వక్రోక్తిని స్పష్టముగా నిర్వచించి యుండలేదు. భరతుని "లక్షణము"ను, భామహుని "వక్రోక్తి"యును ఒకటియేయని డా. కె.సి. పాండే అభిప్రాయము. (Indian Aesthetics Vol.I.P. 399.)

నము. కావున "కావ్యలక్ష్మ" వివరణమునకు పూనుకొనిన భామహుని దృష్టిలో రసమునకు ప్రాధాన్యము లేదు. అయినను ఆనాటికి స్థిరపడిన "నాట్యరస" సిద్ధాంత ప్రాబల్యమువలన రసమునకు కూడ కొంత ప్రాధాన్యము నొసంగియున్నాడు సర్గబంధమును నిర్వచించునప్పుడు "రసైశ్చ సకలైః పృథక్" (1-21) అనియు, రసవదలంకారమును నిర్వచించునప్పుడు "రసవద్దర్శిత స్పష్ట శృంగారాది రసం" (3-6) అనియు, కావ్యమందు శాస్త్రాదుల ఉపయోగమును గూర్చి చెప్పునప్పుడు "స్వాదు కావ్యరసోన్మిశ్రం శాస్త్రమ ప్యుపయుంజతే" (5-3) అనియు భామహుడు రసప్రసక్తిని తీసికొని వచ్చెను. దీనినిబట్టి "రస సిద్ధాంతము" భామహునకు తెలియునని చెప్పగలము కాని విభావాది పదముల నాతడెచ్చటను ఉపయోగించక పోవుట చిత్రము; దీనికి సమాధానము నీ క్రిందివిధముగా నూహింపవచ్చును- భరతుని దృష్టిలో "కవివ్యాపారము" చేత కావ్యమందు ప్రతిపాదితములైన విభావానుభావ వ్యభిచారి భావములయొక్క సంయోగమువలన స్థాయిభావము రసముగా నిష్పన్నమైనప్పుడే అది కావ్యమగును. కాని భామహుని దృష్టిలో "కవివ్యాపార" మందు వక్రోక్తి యున్నచో చాలును: అది కావ్యమగును. కావున అతడు విభావాది పదముల నుపయోగింపవలసిన అవసరము లేదు. అంతేకాక కావ్యమందు "రసమే ప్రధానము" అనుట కాతడు వ్యతిరేకి యనియు చెప్పవచ్చును. "కావ్యము రసవంతమైనప్పటికిని అహృద్యము, అసునిర్భేదము నైనచో అది అపేశలమే" (5-62) అని ఆతడు పేర్కొనుట ఇందులకు తార్కాణము. కావుననే భామహుడు రసమునుకూడ ఒక అలంకారముగామాత్రమే (రసవదలంకారము, 3-6) పరిగణించినాడు.

"సైషాసర్వైవవక్రోక్తి రనయార్థో విభావ్యతే" (2-85) అనెడి భామహ శ్లోకమునందలి "విభావ్యతే" అను దానిపై "లోచన"మం దభినవగుప్తుడు "ప్రమదోద్యానాదిః విభావతాం నీయతే విశేషేణచ భావ్యతే రసమయీక్రియత ఇతి" అని వ్యాఖ్యానించుట గమనార్హము. ఈ వ్యాఖ్యానము ననుసరించి "రసము, అలంకారము–ఈ రెండును వక్రోక్తినుండియే జనించును" అనుట భామహుని అభిప్రాయముగా గ్రహింపవచ్చును.

10 ధ్వని :– భామహుని నాటికి ధ్వని సిద్ధాంతము లేదనుట ప్రసిద్ధమే. కాని "ప్రతీయమానార్థము"ను గూర్చిన సూచనలు కావ్యాలంకారమందు లేకపోలేదు. "సమాసోక్తి"ని నిర్వచించుటలో "యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థః" (ఎచ్చట "ఉక్తి" యందు అన్యార్థము గమ్యమానమగునో, 2-89) అనియు. "పర్యాయోక్తము"ను నిర్వచించుటలో "యదన్యేన ప్రకారేణాభిధీయతే" (ఏది అన్యవిధముగా చెప్పబడునో, 3-8) అనియు చెప్పుట ఇందులకు ఉదాహరణములు. ఇట్టివి మఱికొన్ని కలవు. ఈ సందర్భములన్నియు ధ్వన్యాలోకకారుని 'గుణీభూత వ్యంగ్యము'న కుదాహరణము లగుననియు, కొందరు తలంచునట్లు భామహుడు "ధ్వన్యభావవాది" కాదనియు జగన్నాథ పండితుడు పేర్కొని యున్నాడు.[18]

పైన పేర్కొన్నట్లు భామహ దండ్యాదులకు "రససిద్ధాంతము" తెలిసినను దానియందు వారు సుముఖత్వమును చూపలేదు. అంతేకాక దానిని కావ్యమున కన్వయింపలేకపోయి రనియు చెప్పవచ్చును. ఇంక ప్రతీయమానార్థ మున్నట్లు వారు గుర్తించినను "ధ్వని సిద్ధాంతము"ను స్థాపించుటకు కాని, దానినే "కావ్యాత్మ"గా ప్రతిపాదించుటకు

18. "ధ్వనికారా త్ప్రాచీనైః భామహోద్భట ప్రభృతిభిః స్వగ్రంథేషు కుత్రాపి ధ్వనిగుణీభూత వ్యంగ్యాది శబ్దా న ప్రయుక్తా ఇత్యేతావతైవ తైః ధ్వన్యాదయో నస్వీక్రియంత ఇత్యాధునికానాం వాచోయుక్తిః అయుక్తైవ. యతః సమాసోక్తి వ్యాజస్తుత్యప్రస్తుతప్రశంసా ద్యలంకార నిరూపణేన కియంతోఽపి గుణీభూత వ్యంగ్యభేదాః తైః అపి నిరూపితాః. అపరశ్చ సర్వోపి వ్యంగ్య ప్రపంచః పర్యాయోక్తకుక్షౌ నిక్షిప్తః."

— రసగంగాధరము-ద్వితీయాననము

కాని వారు పూనుకొనలేదు "రసము"ను కావ్యమున కన్వయించుట, "ధ్వని"ని కావ్యాత్మగా సాధించుట—ఈ రెండు పనులను తరువాతి కాలములో ఆనందవర్ధను డొనర్చియున్నాడు.

11 కవి, కావ్యము:—కవి "పరిశ్రమ"ను గూర్చి విపులముగా చర్చించిన ప్రథముడును భామహుడే: "కావ్యాంగము కాజాలని శబ్దము శబ్దమేకాదు, వాచ్యము వాచ్యమేకాదు, న్యాయము న్యాయమేకాదు, అహో! మహాకవుల భారము!" (5-4) అని యాతడు పేర్కొనెను ఇంకొకచోట కవిని "మాలాకారుని"తో పోల్చియున్నాడు (1-59). "అకవియైన వాని శాస్త్రవేత్తృత్వము (1-3), సత్కవిత్వరహితమైన వాగ్విదగ్ధత (1-4) వ్యర్థములు. విలక్షమైన కావ్యమువలన తత్కర్త కుపుత్రవంతునివలెనే నిందపొందును (5-11) అకవియగుటవలన వ్యాధినికాని, అధర్మమునుకాని, దండనమునుకాని పొందరు. ఇంక కుకవియైనచో సాక్షాన్మృతియే యని మనీష లందురు (5-12). సత్కృతి కర్తలు స్వర్గస్థులైనను నిరాతంకమును, కాంతమును అయిన వారి "కావ్యమయ శరీరము" లోకమందు వసించును (1-6)—ఈ విధముగా ప్రతి పరిచ్ఛేదమందును ఆయా సందర్భములందు "కవి పరిశ్రమ"ను గూర్చి, "కావ్య విశిష్టత"ను గూర్చి వివరించెను. ఈ రెండింటిని గుర్తించినవాడు కావుననే "కావ్యము ఒకానొక ప్రతిభావంతునివలన-ఒకానొకప్పుడు మాత్రమే—జనించును" (1-5) అని భామహుడు సుస్పష్టముగా చెప్పినాడు.

(కిన్నెర సౌజన్యంతో*)

* భామహ కావ్యాలంకారానువాదమున దీనిని 'పీఠిక' గా రచించి కిన్నెరలో ప్రకటించినాను. కాని కిన్నెర మాసపత్రిక ఆగిపోవుటతో నా అనువాదము ఆగిపోయినది. ఇంతవరకును భామహ కావ్యాలంకారమునకు తెనుగు అనువాదము లేదు.

శ్రీ వెంపరాల
సూర్యనారాయణశాస్త్రి

# రజతోత్సవ ప్రశంస

కర మేపారెడు "గోలి" వంశమున ముక్తారత్నమై తోఁచి భా
సుర వాణిజ్య కళాప్రవీణుఁ డయి ప్రాజ్ఞుల్ విజ్ఞులున్ మిత్రులై
వరలన్ సాహితికిన్ బ్రజావతికి సేవల్ సేయు దీక్షాధురం
ధరుఁడౌ నీశ్వరనాముఁ డభ్యుదయ సాంతత్యంబునన్ మించుతన్.

లేరాకో వర్తకుల్ ? ధనము లెక్కకు మించ గణింపరొక్కొ ? య
వ్వారలు గోలియీశ్వరయ వైఖరి న్యాయము తప్పకుండ వ్యా
పారము సేసికొంచుఁ దమవైభవమున్ "జగమే కుటుంబ" మం
చారసి క్రుమ్మరించిరె ? యుదారత దెచ్చుకొనంగ వచ్చునే ?

"ఆరయ నేఁటి కిర్వదయి దబ్దము లాయెను – కాగితాల వ్యా
పారము పూని" యంచు గడపన్ గడఁగెన్ రజతోత్సవంబు పెం
పారఁగ నీశ్వరయ్య - కనుఁడయ్య ! *మహారజతోత్సవంబునున్
♦హీరమహోత్సవంబు నిటులే యొనరించుకొనున్ రమాకృపన్.

శ్రీలు పాలపొంగులీలఁ బొంగఁగ యశః
శ్రీలు నుత్తమాయు వోలగింపఁ
గ్రాలుఁగాతఁ బ్రజలపాలి చుట్టంబైన
గోలి యీశ్వరయ సుశీలమౌళి.

నీ గేహరాజంబు నిత్యకళ్యాణమ్ము, పచ్చతోరణమునై పరఁగుఁగాత
నీ కాగితంపు వాణిజ్యంబు దశదిశాప్రకటితంబయి వాసి పడయుఁగాత
నీ ప్రజాసేవావినిద్రవ్రతం బవి, చ్ఛిన్నమై కీర్తిసంపన్న మౌత
నీ యుదారచరిత్ర నీ పుత్రపౌత్ర త, త్సంతానములకు నాదర్శమౌత

నీవు పూజించు సాహితీదేవి నేఁటి
యుత్సవంబట్ల స్వర్ణ వజ్రోత్సవముల
ఘనత నీచేతఁ జేయించుకొనునుగాక !
యిందిరా పూర్ణసాహాయ్య ! యీశ్వరయ్య !

* స్వర్ణోత్సవము Golden Jubilee; ♦ Diamond Jubilee.

శ్రీ ఎస్. సి. యస్. వేంకటాచార్యులు

# సారస్వత వ్యాకరణం

ఉపష్టృతాని చాల్పా
క్షరాణి సూత్రాణి ధారణీయాని
విరచ య్యోపకృతవతే
నమ స్సరస్వత్యైపాహ్వ యార్యాయ.

సంస్కృత వ్యాకరణ శాస్త్ర పరంపరలో అత్యల్ప సూత్రసంఖ్య కలది సారస్వత వ్యాకరణం. ఇందులో 594 సూత్రా లున్నవి. వీటిలో అత్యధిక భాగం అల్పాక్షర సూత్రాలే. బృత్రః, నట్ర్, అయకి, నుమయమః మొ. ఆరునెలలలో శాతవాహనరాజుకు నేర్పడానికి శర్వవర్మ వెలయించిన కాతంత్రవ్యాకరణంలో కృత్ ప్రకరణం లేకుండానే 855 సూత్రా లున్నాయి. వరరుచి కలిపిన కృత్ ప్రకరణంతో కలిసి మొత్తం 1401 సూత్రాలు. అవికూడా అల్పాక్షరాలు కావు. కనుక సౌలభ్యం దృష్టితో సారస్వతం కాతంత్రాన్ని మించినది.

అయితే సమగ్రత విషయంలో పాణినీయానికి ఏ వ్యాకరణమూ ఈడు కాదు. వ్యాకరణం ఒక శాస్త్రంగా అధ్యయనం చెయ్యాలనుకొనేవారికి పాణినీయమే శరణ్యం. కాని నిశితంగా పరిశీలిస్తే అది కూడా సర్వసమగ్ర మనడానికి వీలులేదు. మహాభారత వ్యాఖ్యాత అయిన దేవబోధు డన్నాడుగదా—

యా న్యుజ్జహార మాహేన్ద్రాద్
వ్యాసో వ్యాకరణార్ణవాత్
పదరత్నాని కిం తాని
సన్తి పాణిని గోష్పదే?

[మహేంద్రవ్యాకరణ మనే మహాసముద్రంలోంచి వ్యాసుడు వెలువరించిన పదరత్నాలు గోష్పదం లాంటి పాణినివ్యాకరణంలో దొరుకుతాయా?]

మరి ఆ మహేంద్రవ్యాకరణం మన కీనాడు లేదు. పాణిని కాత్యాయన పతంజలుల సమష్టికృషి అయిన మహాశాస్త్రౌఘమైనా మనకు నిలిచి ఉండడం మన అదృష్టం.

వ్యాకరణాధ్యయనం రెండు విధాలు. దాన్ని శాస్త్రంగా సమగ్రదృష్టితో అధ్యయనం చెయ్యడం ఒకటి. ఫలితం భాషా విరాడ్రూప దర్శనం. ఇంకొక విధం వర్ణ పద వాక్య స్వరూపం తెలుసుకోడానికి చదువుకోడం. ఫలితం భాషాగమనం తెలుసుకొని సాహిత్య సారస్వత వేదవాఙ్మయాన్ని అవగాహించడం. దీనిలో శబ్దంమీద దృష్టి పరిమితం; అర్థం మీద దృష్టి అపరిమితం అర్థంలో ఎంత లోతుకు పోతే అంత ఆనందం.

పై రెండు పద్ధతులలో ఏది గొప్ప? ఏది కొద్ది? అనే మీమాంసకు తావు లేదు. రెండూ ఉత్తమ ఫలితాలే. ఏ ఫలితం కోరేవారికి అదే గొప్పది. రుచిభేద మన్నమాట. నాకు తలనొప్పి వచ్చినప్పుడు మహాభాష్యమో, శేఖరమో ముందు పెట్టుకొని కూర్చుంటాను. నాకు తలనొప్పి ఉందనే మరచి పోతాను. కొందరికి వ్యాకరణ మంటే తలనొప్పి వస్తుంది.

శాస్త్రం చాలామందికి పడదు. వారిలో కొద్దిమంది ఏమీ అక్కరలేని మహానుభావులను మినహాయిస్తే మిగతా అందరికీ సాహితీ విశ్వరూపం మీద దృష్టి ఉంటుందని చెప్పవచ్చు. తన్మయతలో తరతమస్థాయు లుండవచ్చు. ఒక పెద్దమనిషి ఏమన్నాడో చూడండి.

కాళిదాస కవితా నవం వయః
మాహిషం దధి సశర్కరం పయః
ఐణమాంస మబలా చ కోమలా
సంభవన్తు మమ జన్మజన్మని.

[కొత్త వయస్సూ (ఇది ఎప్పుడూ అలానే ఉండాలి), మాంచి గేదెపెరుగుగూ, పంచదార కలిపిన పాలూ, కమ్మని లేడిమాంసమూ, సుతిమెత్తని అబలా— ఇన్నిటికీ పైమెట్టు కాళిదాసు రచనలూ వీటితో కాలం గడపడం నాకు జన్మజన్మలోనూ (ఇవి ఉంటే జన్మరాహిత్య మక్కరలే దన్నమాట) సంభవన్తు (సమ్ - సమ్యక్ - దీనిమీద ఊతం) = లెస్సగా కలుగుగాక !]

ఆనందమే - వీలైతే పొదుగుపొదుగునా - కోరుకోవడం మానవ సహజం. కొంతమందికి సాహిత్యంలో ఆనందం, కొందరికి తర్క వేదాంతాది సారస్వతంమీద ప్రీతి. ఇవన్నీ అబ్బడానికి స్థూలంగా భాషా స్వరూపం తెలియడం అవసరం. అందుకు మాత్రమే పనికివచ్చే వ్యాకరణ పరిజ్ఞానం వీరికి చాలు. కూలంకషమైన వ్యాకరణ జ్ఞానం అవసరం లేదు.

ఈ లక్ష్యం సాధించడానికి కొందరు బుద్ధిమంతులు ప్రయత్నించారు. ఈ కృషిలో సాఫల్యం పొందినవాడు శర్వవర్మ. కాతంత్ర వ్యాకరణం రచించి తన శాతవాహనరాజును ఆరునెలలలో సంస్కృతజ్ఞుని చేశాడు. అతని వ్యాకరణంలో 855 సూత్రా లుండేవి. అందులో అతడు కృత్ప్రకరణం వ్రాయలేదు. వరరుచి 546 సూత్రాలతో కృత్ప్రకరణం పూర్తిచేశాడు. దానితో కాతంత్రం 1401 సూత్రాలుగల దయింది.

కాతంత్ర మంటే అల్పతంత్రం. 3990 సూత్రాల పాణినీయంముందు ఇది అల్పమేగదా! ఐతే ఈ అల్పత్వం ఎట్లా సాధించడం జరిగింది ?

ఇక్కడ ఒక విషయం గుర్తుకు తెచ్చుకోవాలి. అది లక్ష్యభేదం. శాస్త్రంగా చదువుకొనే పుస్తకానికీ భాషా ప్రవేశమాత్రం కోసం చదువుకొనే పుస్తకానికీ చాలా తేడా ఉంటుంది. శాస్త్రంలో నిర్వచనాలు, సూక్ష్మసూక్ష్మ ప్రక్రియలూ అపేక్షితా లవుతాయి. అల్పగ్రంథంలో లోకవాడుకలో ఉన్న సాంకేతిక పదా లుపయోగించుకొని వీలయినంతవరకు నిర్వచనాల బెడద తప్పించుకోడం సహజం. దీనితో సూత్రసంఖ్య కొంత తగ్గుతుంది. మారుమూల పదాల రూపసాధన శాస్త్రచర్చ కవసరం. మామూలు ప్రయోగాలు నేర్చుకుంటే కావ్యాదులు చదువుకోడం మొదలుపెట్టిన తరువాత కొత్తకొత్త పదాలకు ఆకాంక్షా యోగ్యతా సన్నిధి వశంచేత అర్థం తెలుసుకొంటూ వాటి రూపాలను గమనించీ గమనించకుండానే ముందుకు సాగిపోతాడు పఠిత. కనుక క్లిష్టపదాలకూ మారుమూల పదాలకూ ప్రక్రియ అల్పగ్రంథాలలో ఉండనవసరం లేదు. ఈ రూపంగా కొంత సూత్రజాతం తగ్గుతుంది. పాణినీయంలో తిఙ్ ప్రత్యయాలకు వివిధ లకారాలలో ఏర్పడే రూపాలను సాధించడానికి కొన్ని సూత్రా లున్నాయి. ఆ ప్రత్యయాల సిద్ధరూపాలు చూపడంవల్ల ఆ సూత్రాలను తగ్గించడానికి వీలు కలిగింది.

శర్వవర్మకు ఇంకొక అవకాశంకూడా కలిసి వచ్చింది. ఆ రోజులలో అంతటా సంస్కృతం వాడుకభాషగా ఉంది. అందువల్ల కృదంతాలు తద్ధితాంతాలు లోకవ్యవహారంనుంచి గ్రహించడానికి వీలుందని వీటి నతడు వదలివేశాడు. శబ్దాలను నిత్యమూ కర్తృతాడితా లయ్యేవాటిని గ్రహించి వాటిని అభిప్రాయ ప్రకటనకోసం ఉపయోగించడానికి నామరూప ప్రక్రియ, క్రియారూప ప్రక్రియ, వాటి కవసరమయ్యే సంధిసూత్రాలు, కారక సమాసాలూ నేర్చుకొంటే చాలునని గ్రహించి శర్వవర్మ సఫల ప్రయోగం చేసి చూపాడు. అందువల్లనే అతని కాతన్త్రంలో ఈవిధమైన ప్రకరణవిభాగం చోటు చేసుకొన్నది. సౌలభ్యంమూలాన కాతన్త్ర వ్యాకరణం దేశం నలుమూలలనే కాకుండా టిబెట్టు,

మధ్య ఏషియా, సింహళములలోకూడా గప్పు మన్నది.

ఆ కాలం గడచిపోయింది. దేశంలో విద్వాంసు లలో తప్ప సంస్కృతం వాడుకలోనుంచి జారి పోయింది ప్రాంతీయములైన భాషలు కుదురుకో సాగినవి. ముస్లిములు దేశపాలకు లైనారు. వారు బయటినుంచి వచ్చినవారైనా తమ మనుగడను ఈ దేశంతో ముడిపెట్టుకొన్నవారు కావడంవల్ల భార తీయుల భాష, వాఙ్మయము, ఆచార వ్యవహారాలు తెలుసుకోడానికి ప్రయత్నించారు. 13వ శతాబ్ది మధ్యకాలానికి భారతీయుల జ్ఞాన విజ్ఞానాలను గ్రహించడానికి సంస్కృతం నేర్చుకోవాలనే ఆకాంక్ష బలపడసాగినది. వారు సంస్కృతం నేర్చుకోడానికి సులభమైన ప్రవేశిక కావలసి వచ్చింది. దేశ కాల పాత్రాలకు తగినవిధంగా సారస్వత వ్యాకరణం వెలసింది. సుమారు 600 సూత్రాలతో అవసర మైన సాధారణ సంస్కృత పరిచయం కలిగించి వారికి సత్వరమే సాహిత్య సారస్వాలలో ప్రవేశం కల్పించింది సారస్వత వ్యాకరణం.

ఈ వ్యాకరణం ఎవరు రచించారో నిశ్చయంగా చెప్పడానికి ఆధారాలు లభించలేదు. సారస్వత మని పేరు ఉండడంవల్ల కేవలం సరస్వతే రచించినట్టు ప్రథ కలిగిఉంటుం దనుకోడానికి ఈ వ్యాకరణం మీద సిద్ధాంతచన్ద్రిక అనే వ్యాఖ్య రచించిన రామాశ్రమి వ్రాసిన ఈ మంగళాచరణం నిదర్శనం:

నమస్కృత్య మహేశానం
మతం బుద్ధ్వా పతఞ్జలేః
వాణీ ప్రణీత సూత్రాణాం
కుర్వే సిద్ధాన్తచన్ద్రికామ్.

ఇందులో 'వాణీ ప్రణీత' అనే పదబంధం నిర్దేశకం.

అయితే ఈ వ్యాకరణానికి సూత్రక్రమంలో కాక ప్రక్రియాక్రమంలో – కౌముదుల మాదిరి ఏర్పరిచి వ్యాఖ్య రచించిన అనుభూతిస్వరూపాచార్యుల వల్ల ఎక్కువ ప్రచారం వచ్చింది. ఇత డొక యతీశ్వరుడు. ఇతనినిగురించి సాంప్రదాయికంగా వస్తున్న ఒక కథ ఉంది. ఈయన ఒక విద్వత్స భలో ప్రసంగిస్తూ 'పుంక్షు' అని ప్రయోగించాడట. 'పుంసు' అనేది శాస్త్రీయరూపం గనుక కొందరు పండితులు ఆక్షేపించినారట. అందుమీదట అను భూతిస్వరూపాచార్యు లీ ప్రయోగం సారస్వత వ్యాకరణ సమ్మత మని చెప్పగా, ప్రతిపక్షులు ఆ వ్యాకరణం చూపించ మని పట్టుపట్టినారట. అప్పుడు సంధ్యాసమయం కావడంవల్ల మరునాడు చూపిస్తా నని ఆయన వికిడికి వెళ్ళి ఆ రాత్రి సరస్వతిని ఉపాసనచేసి సారస్వతమనే ఈ వ్యాకరణం సంపా దించి మరునాడు ప్రతిపక్షులకు చూపి వారి మన్న నలు పొందినాడట. ఇది కథ మాత్రమే. ఆయన రచించిన సారస్వతప్రక్రియలో "అసంభవే పుంసః కక్ సౌ" అని ఒక వార్తికం ఉంది. దానిప్రకారం వేదంలో 'పుంక్షు' అనే రూపం సిద్ధిస్తుంది. అసం భవే = వేదే. దీన్నిబట్టి బుద్ధిమంతులు కల్పించిన కథ కావచ్చు పైన చెప్పినది. లౌకిక ప్రయోగంలో 'పుంక్షు' అని ప్రయోగించినవాడు వేదంలో ఇట్లా ఉంటుంది అని చెప్పే సూత్రం చూపితే ప్రతిపక్షు లెట్లా ఊరుకొంటారు? ఇంత వ్యాకరణం కొత్తగా వ్రాసినవాడికి అస లా సూత్రం లౌకికపరంగానే వ్రాయడానికి అడ్డేమిటి? కథకు కాళ్ల లేవు. ముంతకు చెవులు లేవు గదా!

అనుభూతిస్వరూపాచార్యులు అక్కడక్కడ వైదిక ప్రయోగాలు కూడా తన ప్రక్రియా గ్రంథంలో స్పృశించాడు. గ్ం ఛన్దసి; అరారా జ్జసో ఽసుక్ క్వచి ద్వక్తవ్య శ్ఛన్దసి; అకారస్య భిసి ఛన్ద స్యేకారో వక్తవ్యః — ఈ విధంగా వార్తికాలు చేర్చి "ఋతగ్ం సత్యమ్, చతుస్త్రిగ్ంశ ద్వాజినః, దేవాసః, బ్రాహ్మణాసః, దేవేభిః, కర్ణేభిః" ఇత్యాదిగా వేద గోచరాలైన ప్రయోగాలకు సాధనను తన వ్యాకరణంలో చేర్చుకొన్నాడు. దీన్నిబట్టి ఇతడు వైదికు డని చెప్పవచ్చు.

అనుభూతిస్వరూపాచార్యుడు సారస్వత

సూత్రాలు తాను రచించినట్టు చెప్పుకోలేదు. గ్రంథాది మంగళంలో —

ప్రణమ్య పరమాత్మానం
బాల ధీ వృద్ధి సిద్ధయే
సారస్వతీ మృజుం కుర్వే
ప్రక్రియాం నాతివి స్తరామ్.

అని తాను సరస్వతీ సూత్రాలకు ప్రక్రియా గ్రంథం వ్రాస్తున్నట్లు చెప్పుకొన్నాడు. కనుక అనుభూతి స్వరూపాచార్యుడు సారస్వత సూత్ర కర్త కాడు.

ఒకానొక క్షేమేంద్రుడు సారస్వత ప్రక్రియకు టిప్పనం వ్రాసి "ఇతి శ్రీ నరేన్ద్రాచార్య సారస్వతే క్షేమేన్ద్ర కృతం టిప్పనం సమాప్తమ్" అని ముగించాడు.

పరమహంస పరివ్రాజకాచార్య అమృతభారతి సారస్వతప్రక్రియమీద వ్యాఖ్య వ్రాసి—

య న్నరేన్ద్ర నగరి ప్రభాషితం
యచ్చ వైమలసర్వతీ(తే?)రితమ్
త న్మయాత్ర లిఖితం తథాధికం
కించి దేవ కలితం స్వయా ధియా.

అని ముగించాడు.

పై సందర్భాలనుబట్టి వీ రిద్దరూ నరేంద్రాచార్యుని ప్రక్రియకు వ్యాఖ్య వ్రాసినట్టు అర్థమవుతున్నది. వీరు వ్రాసిన గ్రంథాలు చూస్తే గాని వీరు గ్రహించిన ప్రక్రియా గ్రంథ మేదో వివరంగా చెప్పడానికి కుదరదు. డా. బెల్వల్కర్, అయననే అనుసరించి ఈ సారస్వత వ్యాకరణ ప్రకరణం రచించిన శ్రీ యుధిష్ఠిర పండితుడూ ఈ విషయంలో మనకు నిశ్చిత జ్ఞానం కలిగించడం లేదు.

పైగా నరేంద్ర నగరి అనేది ఒక వ్యక్తిపేరుగా గ్రహించడం సబబుగా కనిపించడం లేదు. 'నరేంద్రాచార్య సారస్వతే' అన్నచోట బాధ లేదు. 'నగరి' అన్నది 'నగరే' అని ఉండవలెనా? ఐతే ఆ నరేంద్రనగర మేది? ఆ నరేంద్రు డెవరు? 'వైమలసరస్వతేరితమ్' అన్నచోట విమలసరస్వతి ఎవరు? రూపమాల అనే పేరుతో పాణినీయానికి ప్రకరణగ్రంథం మొట్టమొదట రచించిన అతడా? ఈ విషయం ఇంకా పరిశోధించవలసి ఉంది.

విఠలుడు ప్రక్రియా ప్రసాదంలో ఉటంకించిన నరేంద్రాచార్యుడు తీక్ష్ణంగా వ్యాకరణ సిద్ధాంతాలు తెలిసి చర్చించినవాడుగా కనబడుతున్నాడు. అతడు సారస్వత వ్యాకరణానికి మంచి ప్రక్రియా గ్రంథం రచించి ఉండవచ్చు. అతడు మూలసూత్ర కర్త అనడానికి తగిన ఆధారం కనబడడం లేదు. మూల సూత్ర కర్తనుగురించి ఇంకా పరిశోధన జరగవలసే ఉన్నది.

ప్రమాణప్రమేయ కర్త అయిన నరేంద్రసేనుడు నరేంద్రాచార్యుడు కానవచ్చు నని శ్రీ యుధిష్ఠిర మీమాంసక్ భావిస్తున్నారు. అతడు క్రీ శ. 1053 ప్రాంతంవాడు. అతనికి పాణినీయ, చాంద్ర, కాతంత్ర, జైనేంద్ర వ్యాకరణాలమీద అధికారిక జ్ఞాన ముంది. అంతటివాడు సారస్వత వ్యాకరణం రచించిఉంటే 13వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఉండి ముగ్ధబోధ వ్యాకరణం, విచార చింతామణి రచించి అనేక వ్యాకర్తలను పేర్కొన్న బోపదేవుడు సారస్వత వ్యాకరణాన్నిగూడా మూదలించి ఉండవలసిందే. కాని ఆజాడ లేదు.

కొంతనుంది యతీశ్వరుల పేరు చివర సరస్వతి అనే ఉపనామం ఉండడం ప్రచురంగా కనబడుతున్నది. అటువంటి ఒక యతీశ్వరుడు సారస్వత సూత్రాలు రచించినందువల్ల ఆ పేరు ప్రసిద్ధమయి ఉండవచ్చు. కాలక్రమాన ఉపనామమే మిగిలిఉండవచ్చు. నామం చీకటిలో కలిసిపోయింది. ఆ ఉపనామాన్ని వాగ్దేవత కాపాడించడం మనదేశంలో అసంభవం కాదు. దాని పర్యవసానమే "వాణీ ప్రణీత సూత్రాణామ్" ఇత్యాది వక్కాణాలు.

సారస్వత వ్యాకరణం ధ్యేయం ప్రచురప్రయోగాలైన పదాల రూపనిష్పత్తినీ, అక్లిష్టమైన

ప్రయోగ సరణినీ తెలిపి కావ్యాది పఠన సామర్థ్యం కలిగించడమే. ఐతే ప్రక్రియా గ్రంథాలు వ్రాసిన వారు సుమారు నూరు వక్తవ్యాలు (వార్తికాలు) చేర్చి ఈ వ్యాకరణం పరిధిని కొంత పెంచారు. ఇలా వక్తవ్యాలు మాత్రమే గాక మొత్తం సూత్రాల సంఖ్యనే 2133కు పెంచి మూలరచయిత ధ్యేయానికి దూరంచేశాడు రామాశ్రమాచార్యుడు. పేరు కూడా 'సిద్ధాంత చంద్రిక' అని మార్చిపెట్టాడు. సరస్వతీ సూత్రాలను ఆధారంగా తీసుకొని దాన్ని ఒక సమగ్ర వ్యాకరణ శాస్త్రంగా రూపొందించాలనే అభిలాషవల్ల దానికి ఉణాదిసూత్రాలు, ధాతుపాఠము, లింగానుశాసనమూ రచించి తృప్తిపొందారు హర్ష కీర్తిసూరి, నవకిశోర శర్మ మొదలైన ఆనంతరిక విద్వాంసులు. శాస్త్రంగా వ్యాకరణాన్ని దర్శించాలంటే ఇంత చేసినా ఇది అసమగ్రమే. వ్యాకరణం సమగ్రంగా అధ్యయనం చెయ్యదలచుకొన్నవాళ్ళకు త్రిమునితంత్రం పాణినీయం ఉండనే ఉంది. లఘువుగా వ్యాకరణం నేలంటు వదిలించుకొని కావ్య శాస్త్రాదులలో ప్రవేశించదలచుకొనేవారికి కాతంత్రమూ సారస్వతమూ కల్పవృక్షాలలాంటివి.

ఇక్కడ ఒక విషయం తెలుసుకోవాలి. ఏ భాషైనా వ్యవహారభాషగా ప్రవాహినిగా ఉన్న కాలంలో రచించే ఏ వ్యాకరణమూ సమగ్రం కావడానికి వీలులేదు. ఎప్పటికప్పుడు కొత్త ప్రయోగాలు తలచూపి క్రమంగా రచనలలో చోటుచేసుకొంటాయి. అంతకు ముందున్న కొన్ని శబ్దాలు కొత్త అర్థాలు సంతరించుకొంటాయి. కొన్నైతే వ్యవహారచ్యుతి పొందుతాయి. కొన్ని అంతరించేపోతాయి. ఇటువంటి పరిస్థితులలో సర్వసమగ్రమనదగిన వ్యాకరణం ఏర్పడదు. "సిద్ధి ర్లోకతః", "సిద్ధి రనేకాన్తాత్", "సిద్ధిః స్యాద్వాదాత్", "లిఙ్గ మశిష్యం లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య" ఇత్యాది సూత్రాల అంతరార్థం ఇదే. వ్యవహారచ్యుతమైన భాషలకే సమగ్రవ్యాకరణం సంభవం. ప్రకృతి ప్రత్యయ విశ్లేషణాత్మకంగా ఆనాటి సభ్యరచనలలో ప్రయోగించదగిన శబ్దాల రూపనిష్పత్తి చూపి, వాటివి ప్రయోగించడానికి తగిన వాక్య నిర్మాణ విధానానికి దారిచూపడమే వ్యాకరణం చేసే పని; ఒకవిధంగా శబ్దవిశ్లేషణ సంశ్లేషణ మార్గదర్శకం వ్యాకరణం. ప్రతివారూ తమ లోకానుభవం చేతనే భాషాసమష్టి దర్శనం చేసి రచనచెయ్యడం కుదరదు గనుక తత్కాలభాషా సమష్టి దర్శనం చేసిన - అదే అధ్యయనంగా కృషిచేసిన - శాస్త్రజ్ఞులు వ్యాకరణాలు వ్రాసి పథప్రదర్శనం చెయ్యడమూ రచయితలు వాటిని పునాదిగా గ్రహించి క్రమక్రమంగా నెరవయ్యే తమ అనుభవానికి అవసరమైన వాఙ్మయం - ఉన్న శబ్దరాశిని పనికివచ్చే సంతవరకూ తీసుకొంటూ, అవసరమైతే కొత్త పదాలు శాస్త్రీయ పద్ధతులలో ప్రవేశపెడుతూ - సృజనాత్మక దృష్టితో నెరవ్రవయిస్తూ రచనలు సాగించడమూ పరంపరగా సాగే కృషి. వ్యాకరణం ధ్యేయానికి సహకారకమే గాని దాని కదే ధ్యేయం కాదు. అది త్రికాలాబాధ్యమూ కాదు. కనుకనే "అపాణినీయత్వాత్ అసాధుః", "అచిన్నయసూరీయత్వాత్ అసాధుః" అనుకొన్నవారు రచయితల ప్రయోగాలను దిద్దివేసి భాష కపకారం చేసినవారైనారు. అయితే ఈ భావాలు విశృంఖలత్వాన్ని ప్రోత్సహిస్తున్న వనుకోరాదు. భాష ఉపజ్ఞకు, భాషాసిద్ధాంతాలకు అనుగుణంకాని పదప్రయోగం సభ్యం కాజాలదు. ఈ దృష్టితో సారస్వత వ్యాకరణాన్ని మూలకర్త లక్ష్యాని కనుగుణంగా ఉపయోగించుకోడమే ఉచితం. ఇది బయలుదేరిన కాలంలో చక్కని ఫలితం సాధించింది. ఆ ఫలితం నేడూ సాధించవచ్చు. కనుకనే ఈ సూత్రపాఠాన్ని ఇప్పుడు మళ్ళీ వెలుగులోకి తేవడానికి ప్రయత్నం చేస్తున్నాను. పాశ్చాత్యులు మన స్థితిగతులు అవగాహనచేసుకోడానికి సంస్కృతంతో పరిచయం అవసర మనుకొన్న తొలిరోజులలో ఈ సారస్వత వ్యాకరణాన్ని ఆధారంగా చేసుకొనే విల్కిన్స్ అనే ఆంగ్లేయుడు తొలి సంస్కృత వ్యాకరణం ఇంగ్లీషులో రచించాడు.

ఇంక ఇప్పుడు వ్యాకరణాన్ని సులభంచెయ్య

డానికీ సంగ్రహంచెయ్యడానికీ సరస్వతి ప్రవేశ పెట్టిన కొత్త ప్రక్రియ లేవో కొన్ని చూద్దాము.

వ్యాకరణం స్థూలంగా రెండు భాగాలు: 1. పద ప్రక్రియ (Morphology) 2. వాక్యవిన్యాసం (Syntax). పదప్రక్రియలో సంధి, నామవిభక్తులు, క్రియావిభక్తులు, ప్రకృతి ప్రత్యయ యోజనము అనే స్థూల విభాగా లుంటాయి.

సర్వ భాషా వ్యవహారానికీ వాక్యం మూలం. వాక్యం పదాల సమాహారం. పదం ప్రకృతి – ప్రకృతికార్య,విభక్తి – విభక్తికార్యాల సమాహారం.

"అహమ్ వేదం పఠామి" అన్న వాక్యం తీసుకొందాము. వక్త వేదం చదువుతున్నాడనే భావాన్ని వ్యవహారంలోకి తెచ్చింది ఈ వాక్యం. ఇందులో మూడు పదా లున్నాయి. అహమ్, వేదమ్, పఠామి. ఈ మూడు పదాల సమాహారము ఈ వాక్యం. ఒక్కొక్క పదాన్ని గమనించండి. అహమ్ > అస్మద్ (ప్ర.) + సి (ప్రత్య.) > మద్ + సి > అహమ్ అస్మద్ అనే ప్రకృతికి 'సి' అనే ప్రథమైకవచన ప్రత్యయం చేరగా, ఏకవచనంలో అస్మద్‌కు బదులు మద్ వచ్చి, తరువాత మద్, సి అనే రెంటికీ బదులు అహమ్ వచ్చింది. ఇట్లాగే వేదమ్ > విద (ప్రకృ.) + ఘఞ్ (ప్రత్య.) + అమ్ (విభ.) > వేద + అమ్ > వేద్ + అమ్ > వేదమ్ అయింది. ఇంక పఠామి > పఠ్ (ప్రకృ.) + అప్ (ప్రత్య.) + మి (విభ.) > పఠ + మి > పఠా + మి > పఠామి. ఈ మూడు పదాలలోను ప్రకృతి – దాని మార్పులు, విభక్తులు – వాటి మార్పులు గమనించవచ్చు. వీటిని కలిపి వాక్యంగా చెప్పి నప్పుడు "అహం వేదం పఠామి" అని వ్రాస్తాము వాక్యంలో ఒక పదాన్ని ఒక పదం దగ్గరించి నప్పుడు కొన్ని మార్పులు జరుగుతాయి. అహమ్ చివర, వేదమ్ చివర ఉన్న మకారాలకు బదులు అనుస్వారాలు వచ్చినవి. ఇలా దగ్గరించడంవల్ల వచ్చే మార్పులను సంధికార్యా లంటారు. ఒకరు చెప్పిన వాక్యంలో పదాలను విడదీసుకోడానికీ, మనం మన అభిప్రాయానుసారంగా పదాలను కూర్చి చెప్పడానికీ సంధి జ్ఞానం అవసరం. ఇదంతా పదప్రక్రియలో చేరినది.

వాక్యంలో కొలికిపూస లాంటిది క్రియ. ఆ క్రియతో నామపదాలు ఎలా అన్వయించవలెనో తెలిపి వాక్యవిన్యాసానికి దోహదంచేసే భాగం వ్యాకరణంలో రెండవ ముఖ్యవిభాగం. "స పుష్పేభ్యః గృహాత్ ఉద్యాన మగచ్ఛత్". ఇందులో అగచ్ఛత్ అనే క్రియతో – కర్త కనుక సః అనేది ప్రథమావిభక్తిలోను, తదర్థ మనే అర్థంలో పుష్ప శబ్దం చతుర్థీవిభక్తిలోను, దేనిని వదలి వెళ్ళాడో ఆ గృహ మనే పదం పంచమీవిభక్తిలోను, దేనిని చేరడానికి వెళ్ళాడో ఆ ఉద్యాన మనేది ద్వితీయావిభక్తిలోను ఉండి అన్వయిస్తున్నవి. ఇదంతా వాక్యవిన్యాసంలో చేరినది.

పదప్రక్రియనూ, వాక్యవిన్యాసాన్నీ తెలపడానికి అవసరమైన సంజ్ఞలు కొన్ని ఉంటాయి. కనుక ప్రతి వ్యాకరణమూ సంజ్ఞలతో ప్రారంభ మవుతుంది. వ్యాకరణం శాస్త్రంగా అధ్యయనం చెయ్యడానికి పనికివచ్చే పాణినీయం లాంటి మహావ్యాకరణంలో అనేక సంజ్ఞ లుంటాయి. అల్పతంత్రాలయిన సారస్వతం లాంటివి లోకంలో బాగా వాడుకలో ఉండే అన్వర్థ సంజ్ఞలను వాడుకొని పెద్ద సంజ్ఞాప్రకరణం అవసరంలేకుండా చేసుకొని, కొంత సూత్ర సంచయం తగ్గించుకుంటాయి. అందువల్ల సారస్వతంలో సంజ్ఞా ప్రకరణంలోను ఇతర ప్రకరణాలలోనూ ఉన్నవన్నీ కలిపి 25, 30 కంటే ఎక్కువ సంజ్ఞలు లేవు.

సారస్వతంలో వర్ణమాల చెప్పడంలో కొంత కాతంత్రపద్ధతి, మిగతా పాణినీయ ప్రత్యాహార పద్ధతి సౌకర్యంకోసం కలపడం జరిగింది. స్వరాలను కాతంత్రం వరసలోనూ వ్యంజనాలను ప్రత్యా

హారపద్ధతిలోను చెప్పాడు సరస్వతి. ఐతే కాతంత్రంలో హ్రస్వాల పక్కన దీర్ఘాలు చెపితే సారస్వతంలో దీర్ఘాలు వదిలేసి హ్రస్వాలనే దీర్ఘాలకూ ప్లుతాలకూ కూడా ప్రతినిధులుగా పాణినీయ పద్ధతిలో స్వీకరించడం జరిగింది. కాతంత్రంలో ప్లుతాలు అనుపదిష్టాలు,సమాన, సంధ్యక్షర, స్వర. నామిసంజ్ఞలు సారస్వతం కాతంత్రంనుండి గ్రహించినవే. సారస్వతంలో 6 నుండి 12 వ సూత్రం వరకూ చివర ఇత్సంజ్ఞలు లేని ప్రత్యాహార సూత్రాలు. పాణినీయంలోని హయవరట్, లణ్ అనే రెండు సూత్రాలనూ కలిపి 'హయవరల' అని సూత్రించి చంద్రాచార్యునీ భోజునీ అనుసరించాడు సరస్వతి. పాణినీయంలోని 'ఝభఞ్, ఘఢధష్' అనే రెండు సూత్రాలనూ కలిపి సరస్వతి, 'ఝఢధఘభ' అని సూత్రం చేశాడు. 'ఖఫఛఠథ చటతవ్, కపయ్' అనే రెండుసూత్రాలకు బదులు 'ఖఫఛఠథ' 'చటతకప' అని రెండు సూత్రాలు సారస్వతంలో ఉన్నాయి. సరస్వతి ప్రత్యాహార సూత్రాలు హకారాంతస్థాలు, వర్గపంచమాలు, చతుర్థాలు, తృతీయాలు, ద్వితీయాలు, ప్రథమాలు, ఊష్మలు అని విశదంగా కలగలుపు లేకుండా ఉన్నవి ఏ అక్షరం నుంచి ఏ అక్షరం వరకైనా కలుపుకొని ప్రత్యాహారాలు చేసుకోడానికి వీలయినది సరస్వతి పద్ధతి. పాణినీయంలో ఒక అక్షరంనుంచి ఏదో ఒక ఇత్సంజ్ఞ వరకూ తీసుకోవాలి. అందువల్ల అవసరం లేని అక్షరాలు గల ప్రత్యాహారాలు గ్రహించవలసి వచ్చి కొంత తికమకకు కారణ మవుతున్నది. ఉదాహరణకు 'రషాభ్యాం నో ణః సమానపదే' (అష్టా. 8 4, 1) అన్నచోట "అట్ కు ప్వాఙ్ నుం వ్యవాయేఽపి" (అష్టా. 8. 4. 2) అనే సూత్రంలో అట్ ప్రత్యాహారాక్షరాలు వ్యవధానంగా ఉన్నా నకారం ణ కార మవు తుందన్నప్పుడు అట్‌లో 'ర' కూడా ఉండడం అనవసరం. ఐనా ఇత్సంజ్ఞతో కలిపి తీసుకోవలసి రావడంవల్ల ఇది చేరక తప్పలేదు. సరస్వతి పద్ధతిలో 'అవ కు ప్వ న్తరేఽపి' అని చెప్పి 'ర' ను తప్పించడం కుదిరింది. ఇట్లాంటి వింకా ఉన్నవి. ఇంతేకాకుండా చయ్, జశ్ అనే పాణినీయ ప్రత్యాహారాలకంటే చప, జబ అనే సారస్వత ప్రత్యాహారాలకు ఎక్కువ సద్యస్ఫూర్తి ఉంది. ఇలా ప్రత్యాహార పద్ధతిలో ఒక కొత్తదనం తెచ్చాడు సరస్వతి.

గుణవృద్ధి సంజ్ఞల సందర్భంలో ఋకార స్థానంలో 'అఆ'లను చెప్పి అవి ఎప్పుడూ ర పరంగానే వస్తాయని చెప్పడానికి బదులు, ఋ కు అర్ గుణము, ఆర్ వృద్ధి అని సీదాగా చెప్పడం కాతంత్రాదుల ననుసరించి సరస్వతి కూర్చిన సౌలభ్యాలలో ఒకటి.

సంధులు చెప్పిన పద్ధతిలో సరస్వతి సౌలభ్యాన్నే దృష్టిలో పెట్టుకోడం గమనించదగింది. ఇ యం స్వరే — ఇ + స్వరం > య్ + స్వరం: ఉ వ మ్ — ఉ + స్వరం > వ్ + స్వరం ము. అ ఇ ఏ — అ + ఇ > ఏ; ఉ ఓ — అ + ఉ > ఓ ము. ఝలాం జశోఽన్తే; ఝలాం జశ్ ఝశి; చావసానే (అష్టా. 8, 2. 39; 8. 4. 53, 56) అనే పాణినీయ సూత్రాలు చక్కగా అర్థం చేసుకుంటే తెలిసే సంధివిషయం "చపా అబే జబాః" సా. 2. 24 అనే సూత్రం సూటిగా తెలుపుతుంది.

నామ రూప నిష్పత్తిలో కొంత కొత్తదనం చూపాడు సరస్వతి. పాణినీయంలో అకారాంత శబ్దాలకు చతుర్థీ ప్రత్యయం ఙే చేర్చవలసి నప్పుడు దానికి 'య' ఆదేశం చేసి (ఙే ర్యః. అష్టా. 7. 4. 13), అతో దీర్ఘో యఞి, సుపి చ (అష్టా. 7, 3. 101, 102) అనే సూత్రాల ప్రకారం ప్రాతిపదిక చివరి అకారానికి దీర్ఘంచేసి రూపనిష్పత్తి చెయ్యడం జరుగుతుంది. రామ + ఙే > రామ — య > రామా + య > రామాయ. సారస్వత ప్రక్రియ — రామ + ఙే (ఏ) > రామ + ఏ + అ > రామ + అయ రామాయ.

సర్వనామ ప్రక్రియలో — సర్వ + ఙే > సర్వ + స్మై > సర్వస్మై; సర్వ + ఙసి > సర్వ + స్మాత్ > సర్వస్మాత్ అనే మామూలు ప్రక్రియకు

బదులు విభక్తికిముందు 'స్మ'చేరుతుందని(సర్వాదేః స్మట్,అతః. సా.3.25,26)చెప్పి సరస్వతి ఇలా ప్రక్రియ చూపించాడు : సర్వ + ఏ (ఙే) > సర్వ + స్మ + ఏ > సర్వస్మై; సర్వ + ఙసి > సర్వ + అత్ > సర్వ + స్మ + అత్ > సర్వస్మాత్, ఇక్కడ విభక్తి ప్రత్యయాలను అలాగే ఉంచి 'స్మ' ముందు చేర్చడం జరుగుతున్న దని స్మై, స్మాత్‌లను విశ్లేషణ చేసి చూపించా డన్నమాట.

ఋకారాంత శబ్దాల ప్రథమైక వచన ప్రక్రియలో సరస్వతి కొంత సౌలభ్యం చూపాడు. పాణి. ప్రక్రియ: ధాతృ + సు > ధాతఙ్ + సు > ధాతాన్ + సు > ధాతాన్ < ధాతా. సార. ప్రక్రియ: ధాతృ + సి > ధాతృ + డా > ధాత్ + ఆ > ధాతా. (డకారం అనుబంధంగా ఉన్న ప్రత్యయం పరమైనప్పుడు ప్రకృతి చివరి అజాద్యంశం లోపిస్తుంది.) సఖి శబ్ద ప్రథమైక వచనానికి కూడా ఇట్లాగే సారస్వత ప్రక్రియ లఘువు.

సు అనే విభక్తి ప్రత్యయం పాణినీయంలో ఉకారం అనునాసికంగా ఉండి ప్రథమైకవచనానికి, లేకుండా సప్తమీ బహువచనానికీ వర్తిస్తున్నది. ఇది కొంత తికమకకు కారణ మని కాతంత్రాది వ్యాకరణాలు ప్రథమైక వచన ప్రత్యయాన్ని 'సి' గా మార్చి వేశాయి. ఆ పద్ధతినే సారస్వతమూ అనుసరించింది.

కారక తద్ధితాలలోను, స్త్రీ ప్రత్యయాలలోను, సమాసాలలోను అత్యంత ముఖ్యమైన విషయాలే చెప్పింది సారస్వతం.

తిఙంత ప్రక్రియలో ఆయా లకారాల ప్రత్యయాలు మాత్రమే చెప్పి, వాటిని నిష్పాదించడానికి పాణినీయంలో ఉన్న 40, 50, సూత్రాలను వదలి వెయ్యడానికి కాతంత్రం చూపిన మార్గంలో వీలు కలిగించుకొన్నాడు సరస్వతి. ఇక్కడ కూడా మారుమూల రూపాల నిష్పత్తి జోలికి పోలేదు. కృత్ప్రకరణంలోనూ అంతే.

ప్రకరణ విభజన మొదలైన విషయాలలో కాతంత్రాన్ని అనుసరించినా సాంకేతికాలలో సరస్వతి పాణినీయాన్నే అనుసరించాడు. ఉదాహరణకు విభక్తియోజన విషయం గమనించవచ్చు. ప్రాతిపదిక లన్నీ సర్వనామస్థానంలో పూర్ణరూపంతో ఉంటాయి. అసర్వనామ స్థానంలో — వ్యంజనాది ప్రత్యయాలు (భ్యామ్, భిస్, భ్యస్, సు) పరమైనప్పుడు ప్రాతిపదికకు పదత్వాతిదేశం ఉంటుంది. అది మధ్యమ స్వరూపంలో ఉంటుంది; స్వరాది ప్రత్యయాలు (శస్, టా, ఙిత్తులు, ఆమ్, ఓస్) పరమైనప్పుడు ప్రాతిపదిక భ సంజ్ఞను పొంది బలహీనరూపంలో ఉంటుంది. ఉదా : స. నా. స్థా: విద్వాన్, విద్వాంసౌ, విద్వాంసః, విద్వాంసమ్, విద్వాంసౌ. పద. స్థా.: విద్వద్భ్యామ్, విద్వద్భిః, విద్వద్భ్యః, విద్వత్సు, భ స్థా. : విదుషః, విదుషా, విదుషే, విదుషోః, విదుషామ్, విదుషి. వీటిలో పాణిని మధ్యమ స్వరూపంలో ఉన్న శబ్దాన్ని ప్రాతిపదికగా తీసుకొని, సర్వనామస్థానంలో వచ్చే పెంపును, భస్థానంలో ఉండే తగ్గింపును చెబుతాడు. పై ఉదాహరణలో 'విద్వస్' అనే మధ్యమరూపం ప్రాతిపదిక. దీన్ని ఆధారంగా గ్రహించి సర్వనామస్థాన రూపంగా బలపడేందుకూ భస్థానరూపంగా తగ్గేందుకూ సూత్రాలు చెప్పాడు. కాతంత్రంలో సర్వనామస్థానరూపమైన 'విద్వన్స్' నే ప్రాతిపదికగా గ్రహించి క్రమంగా శబ్దరూపం ఎలా హ్రాసం పొందుతుందో చెబుతారు. సారస్వతంలో ఇటువంటి సాంకేతికాలు సరస్వతి పాణిని ననుసరించే కూర్చాడు. అందువల్ల సారస్వతం చదువుకొన్న తరువాత పాణినీయం చదువుకోవాలంటే కొత్త అనిపించదు.

పాణినీయంలో ఉన్న అసిద్ధత్వ విధానం (అసిద్ధవ దత్రాభాత్ – అష్టా. 6. 4. 22; పూర్వత్రాసిద్ధమ్. అష్టా. 8. 2. 1) ఎంతో నిశితంగా పరిశీలిస్తే గాని బోధపడేదికాదు. సారస్వతంలో ఈ బెడద లేదు.

ఇంకా ఇలాంటి విషయాలను వివరించాలంటే గ్రంథవిస్తర మవుతుంది. పిండితార్థం ఏమంటే - పాణినీయం భాషాశాస్త్రాధ్యయనానికి అత్యంతోపయుక్త మైనది. శాస్త్రంగా దానిని కాదనగల వ్యాకరణం లేదు. కాని వ్యాకరణం ప్రాథమిక జ్ఞానం సంపాదించుకొని కావ్య, దర్శనాధ్యయనానికి ప్రవృత్తులయ్యే జిజ్ఞాసువులకోసం కాతంత్రమూ, సారస్వతమూ చక్కగా ఉపయోగిస్తాయి. కనుక వాటి అధ్యయనం ఈ కాలంలో ప్రోత్సహించ దగింది.

అయితే అటువంటివారికోసం లఘుకౌముది, మధ్యకౌముది ఉన్నాయిగదా అనే ప్రశ్న రావచ్చు. లఘుకౌముది సూత్రాలకు ఆనుపూర్వి లేకందువల్ల అనువృత్తులు తెలుసుకొని వివేచనతో అధ్యయనం చెయ్యడం సుగమం కాదు. కాతంత్ర సారస్వతాలలో ఆనుపూర్వి ఉండడంవల్ల బోధ సౌలభ్యం ఉంది. వీటిలో కాతంత్రం మధ్యకౌముదిస్థానీయం, సారస్వతం లఘుకౌముది స్థానీయం అని చెప్పవచ్చు. పూర్వకాలంలో ఇవి అనార్ష గ్రంథా లనే భావంతో పాణినీయానికి లఘుకౌముది, మధ్యకౌముది చేసి ఆంధ్రుడైన చవిటికంటి వరదరాజ పండితుడు లఘు — మధ్యమ - ఆర్ష పాఠవిధి ఏర్పాటుచేశాడు. ఆర్షత్వాభిమానం ఉండవలసిందే కాని సౌలభ్యాభిమానం ఈ రాకెట్ల కాలానికి అత్యావశ్యకం.

సారస్వత వ్యాకరణాన్ని విశదమైన తెలుగు వృత్తితో కొలదికాలంలోనే ప్రచురించాలని సంకల్పించాను. అందుకోసం తగిన ఆరోగ్యం, అవకాశం కలిగించమని శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామిని ప్రార్థిస్తున్నాను.

ఈ వ్యాసాని కనుబంధంగా ఇంతవరకూ అముద్రితంగా ఉన్న మూల సారస్వత సూత్రపాఠం ఇచ్చాను. లఘుభాష్యకర్త అయిన రఘునాథ పండితుడు గ్రహించిన సూత్రపాఠం ఇది. భండార్కర్ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌వారు పంపిన వ్రాతప్రతి పాఠాల విశేషాలు అధోజ్ఞాపికలుగా ఇచ్చాను. సూత్రాల సౌలభ్యము పాఠకులు గ్రహించగలరు. ప్రతి సూత్రానికి ఎదురుగా పాణినీయాష్టాధ్యాయి సూత్రసంఖ్య అధ్యాయం, పాదం, సూత్రం అనే వరుసలో ఇచ్చాను. పాణినీయం చదువుకొన్నవారు ఈ వ్యాకరణం తీరుతెన్నులు గ్రహించడానికి ఇది ఉపకరిస్తుంది.

వ్రాతప్రతిని పంపి తోడ్పడిన భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారికి కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. ఈ వ్యాసానికి ఆధారభూతమైన ఈదిగువ గ్రంథాల గ్రంథకర్తలకు జోహారులు.

లఘు భాష్యమ్ :
రఘునాథః

సారస్వత ప్రక్రియా :
అనుభూతి స్వరూపాచార్యః

సారస్వత చంద్రికా :
రామాశ్రమాచార్యః

సంస్కృత్ వ్యాకరణ్ శాస్త్ర కా
ఇతిహాస్ - పహలా భాగ్ :
శ్రీ యుధిష్ఠిర్ మీమాంసక్

Systems of Sanscrit Grammar :
*Dr. Balavalkar.*

అనుబంధం

# సారస్వత వ్యాకరణమ్

## 1. సంజ్ఞా ప్రకరణమ్

1 అ ఇ ఉ ఋ ఌ సమానాః. శి. సూ. 1, 2
2 హ్రస్వ దీర్ఘ ప్లుత భేదాః సవర్ణాః 1-2.27, 1.1.69
3 ఏ ఐ ఓ ఔ సన్ధ్యక్షరాణి శి. సూ. 3, 4
4 ఉభయే స్వరాః
5 అవర్జా నామినః
6 హ య వ ర ల శి. సూ. 5, 6
7 ఞ ణ న ఙ మ ,, 7
8 ఝ ఢ ధ ఘ భ ,, 8, 9
9 జ డ ద గ బ ,, 10
10 ఖ ఫ ఛ ఠ థ ,, 11
11 చ ట త క ప ,, 11, 12
12 శ ష స ,, 13
13 ఆద్యన్తాభ్యామ్ 1.1.71
14 అన్త్యస్వరాది ష్టిః 1.1.64
15 అన్త్యాత్పూర్వ ఉపధా 1.1 65
16 కార్యా యేత్ 1.3.9
17 ఆరైౌ వృద్ధిః 1.1.1
18 అరేదో న్నామినో గుణః 1.1 2
19 స్వరానన్తరితా హసాః సంయోగః 1.1.7
20 కు చు టు తు పు వర్గాః 1.1 69
21 విభక్త్యన్తం పదమ్ 1,4.14
[22 తత్సముదాయః వాక్యమ్]

## 2. సంధి ప్రకరణమ్

### (i) స్వరసంధిః

1 ఇ యం స్వరే 6.1.77
2 ఉ వ మ్ ,,
3 ఋ రమ్ ,,
4 ఌ లమ్ ,,
5 ఏ అయ్ 6.1.78
6 ఐ ఆయ్ ,,
7 ఓ అవ్ ,,
8 ఔ ఆవ్ ,,
9 య్వో ర్లోపశ్ వా పదాన్తే 8.3.19
10 ఏదోతో౽తః 6.1.109
11 ఙస్య 6.1.110
12 సవర్ణే దీర్ఘః సహ 6.1.101
13 అ ఇ ఏ 6.1.87
14 ఉ ఓ ,,
15 ఋ అర్ 6,1.87, 1.1.51
16 ఌ అల్ ,, , ,,
17 ఏ ఐ ఐ 6.1.88
18 ఓ ఔ ఔ ;,

### (ii) ప్రకృతి భావః

19 నామీ 1 1.12, 6.1.124
20 య్వే ద్విత్వే 1.1.11, ,,
21 ఔ నిపాతః 1 1.14, 15
22 ప్లుతః 6.1.124
23 దూరా దాహ్వానే టేః ప్లుతః 8.2.82, 84

### (iii) వ్యఞ్జనసంధిః

24 చపా అబే జబాః 8.2.39, 8.4.53
25 ఙమే ఙమా వా 8.4.45
26 చపా చ్ఛః శః 8.4.63
27 హో ఝభాః 8.4.62
28 స్తోః శ్చుభిః శ్చుః 8,4.40
29 న శాత్ 8.4,44
30 ష్టుభిః ష్టుః 8.4.41
31 తో ర్లి లః 8.4.60
32 న షి 8.4.43
33 టో రన్త్యాత్ 8 4.42
34 నః సక్ ఛతే 8 3.7
35 శే చగ్ వా 8.3.31
36 ఙ్ణ్నా హ్రస్వా ద్విః స్వరే 8.3,32
37 ఛః 6.1.73
38 హసేఽర్హాహసః
39 రహా ద్వ్యపో ద్విః

సంజ్ఞ. 14 – 18 సూత్రాలు వ్రాతప్రతిలో తద్ధిత ప్రకరణం చివర ఉన్నవి.
సంధి. 18 సూత్రం తరువాత 'ఓష్ఠోత్వోర్వా' అనే సూత్రం వ్రాతప్రతిలో ఉన్నది.
23వ సూత్రం వ్రాతప్రతిలో కృత్ ప్రకరణం చివర 562 సూత్రంగా ఉంది.
37వ సూత్రం వ్రాతప్రతిలో లేదు. 39వ సూత్రం వ్రాతప్రతిలో లేదు.

| | | |
|---|---|---|
| 40 | మో౽నుస్వారః | 8.3.23 |
| 41 | న శ్చాపదాన్తే ఝసే | 8.3 24 |
| 42 | యమా యపే౽నస్య | 8.4.58 |
| 43 | వా | 8 4 59 |

(iv) విసర్గసంధిః

| | | |
|---|---|---|
| 44 | విసర్జనీయస్య సః | 8.3.34 |
| 45 | కుప్వోః ≍క ≍పౌ వా | 8.3.37 |
| 46 | అతో౽త్యః | 6.1,113 |
| 47 | హచే | 6 1.114 |
| 48 | ఆ దచే లోపశ్ | 8.3 17 |
| 49 | స్వరే యత్వం వా | 8.3 18 |
| 50 | భోసః | 8.3,17 |
| 51 | నామినో రః | |
| 52 | రః | |
| 53 | రి లోపో దీర్ఘశ్చ | 6.3 111 |
| 54 | సైషా ఢసే | 6.1.132 |

## 3. విభక్తిప్రకరణమ్

(i) ప్రథమఃపాదః

| | | |
|---|---|---|
| 1 | అవిభక్తి నామ | 1.2.45 |
| 2 | తస్మాత్ | 4.1.1 |
| 3 | (1) సి ఔ జస్ | 4.1.2 |
| | (2) అమ్ ఔ శస్ | ,, |
| | (3) టా భ్యామ్ భిస్ | ,, |
| | (4) ఙే భ్యామ్ భ్యస్ | ,, |
| | (5) ఙసి భ్యామ్ భ్యస్ | ,, |
| | (6) ఙస్ ఓస్ ఆమ్ | ,, |
| | (7) ఙి ఓస్ సుప్ | ,, |
| 4 | సమానా ద్ధే ర్లోపో౽ధాతోః | 6.1.69 |
| 5 | అమ్శసో రస్య | 6.1.107 |
| 6 | సో నః పుంసః | 6.1.103 |
| 7 | ను డామః | 7.1.54 |
| 8 | రః సంఖ్యాయాః | 7.1.55 |
| 9 | ష్ణః | 7.1.55 |
| 10 | త్రే రయజ్ | 7.1.53 |
| 11 | ఢ్ణః | 7.4.42 |
| 12 | జశ్శసో ర్లుక్ | 7.1.22 |
| 13 | డతేః | ,, |
| 14 | అష్టనో డా | 7.1.21 |
| 15 | వా౽౽సు | 7.2.84 |
| 16 | రై స్భి | 7.2.85 |
| 17 | ఆ ద్భి | 7.4.102 |
| 18 | భ్యైః | 7 1.9 |
| 19 | ఏ స్భి బహుత్వే | 7.3.103 |
| 20 | ఓసి | 7.3.104 |
| 21 | ఙసి రత్ | 7.1.12 |
| 22 | ఙ స్స్యః | ,, |
| 23 | ఙేనః | ,, |
| 24 | ఙే రక్ | 7.1.13 |
| 25 | సర్వాదేః స్మట్ | 7.1.14 |
| 26 | అతః | 7.1.15 |
| 27 | ఙి స్మిన్ | ,, |
| 28 | జ సీ | 7.1.17 |
| 29 | సు డామః | 7 1.52 |

(ii) ద్వితీయఃపాదః

| | | |
|---|---|---|
| 30 | యటో౽చ్చ | 8.3.114 |
| 31 | హసేపః సే ర్లోపః | 6.1 68 |
| 32 | ఆపః | 6.1.68 |
| 33 | టాసో రే | 7.3.105 |
| 34 | ధి రీ | 7 3 106 |
| 35 | ఔ | 7.1.18 |
| 36 | ఙితాం యట్ | 7.3.113 |
| 37 | ఆమ్ ఙేః | 7.3.116 |
| 38 | నియః | ,, |
| 39 | స్త్రియాం య్వోః | 7.3.117 |
| 40 | ధౌ హ్రస్వః | 7.3.107 |
| 41 | ఙితా మట్ | 7 3.112 |
| 42 | వేయువః | 1.4.4 |

---

42, 43 సూత్రాలు వ్రాతప్రతిలో ఒకే సూత్రంగా ఉన్నవి.

14 సూత్రం చివర 'వా' అని వ్రాతప్రతిలో ఉంది.

17 సూత్రం వ్రాతప్రతిలో 'అద్భి' అని ఉంది. 23 సూత్రంలో వ్రా. ప్ర. లో విసర్గలేదు.

34 సూత్రంలో 'ధి రిః' అని ఉంది. 35 సూత్రంలో 'ఔ రీ' అని ఉంది.

37, 38 సూత్రాలు కలిపి 'ఆమ్ ఙే ర్నియ శ్చ' అని ఒకే సూత్రంగా ఉంది.

| | | |
|---|---|---|
| 43 | ఇదుద్భ్యామ్ | 1.4.6 |
| 44 | ఔ యూ | 6.1.102 |
| 45 | టా నాఽస్త్రియామ్ | 7.3.120 |
| 46 | ఏ ఓ జసి | 7.3.109 |
| 47 | ఢౌ | 7.3.108 |
| 48 | జితి | 7.3.111 |
| 49 | జే రౌ డిత్ | 7.3.118, 119 |
| 50 | ఋతో జ ఉః | 6 1.111 |
| 51 | సేరా | 7.1.94, 6.4.11 |
| 52 | ఢే రర్ | 7.3.110 |
| 53 | జౌ | 7 3.110 |
| 54 | పఞ్చసు | (అధికారసూత్రమ్) |
| 55 | స్తు రార్ | 6.4 11 |
| 56 | పుంసోఽసుఙ్ | 7.2.89 |
| 57 | త్రితో నుమ్ | 7 2 70 |
| 58 | వా దీపోః శతుః | 7.2 80 |
| 59 | అవ్యయో రా న్నిత్యమ్ | 7.2 81 |
| 60 | న్సమ్మహతోఽధౌ దీర్ఘః | 6.4.10 |
| 61 | నోపధాయాః | 6.4.7 |
| 62 | అత్వసోః సౌ | 6.4.14 |
| 63 | శసి | 6.1.102 |
| 64 | నామి | 6 4.3 |
| 65 | ఇనాం శౌ సౌ | 6.4.12 |
| 66 | అల్లోపః స్వరేఽమ్వయుక్తా చ్ఛసాదౌ | 6.4.134 |
| 67 | వేజ్యోః | 6.4.136 |
| 68 | అఞ్చే ర్దీర్ఘశ్చ | 6.4.138, 6.3 138 |
| 69 | తిరశ్చాదయః | 6.4.93,94,95 |
| 70 | త్రు రో్ణ ణోఽన న్తే | 8.4.1 |
| 71 | అవ కు వ్వ న్తరేఽపి | 8.4.2 |
| 72 | క్విలాత్ షః సః కృతస్య | 8.3.57 |
| 73 | ప్రాదేశ్చ తథా తౌ సునమామ్ | 8.4.14, 8.3.65 |

(iii) తృతీయః పాదః

| | | |
|---|---|---|
| 74 | నపుంసకా త్స్యమో ర్లుక్ | 7.1.23 |
| 75 | అతోఽమ్ | 7.1.24 |
| 76 | త్శ్వన్యాదేః | 7.1:25 |
| 77 | ఈ మౌ | 7.1.19 |
| 78 | జశ్శసో శిః | 7.1.20 |
| 79 | ను మయమః | 7.1.72 |
| 80 | సా వనడుహః | 7.1.82 |
| 81 | నామినః స్వరే | 7.1.73 |
| 82 | అ చ్చాస్థ్నాం శసాదౌ | 7.1.75 |
| 83 | టాదౌ వు క్తపుంస్కం పుంవద్వా | 7.1.74 |
| 84 | వసో ర్వ ఉః | 6.4.131 |
| 85 | శ్వాదేః | 6.4.132 |

(iv) చతుర్థః పాదః

| | | |
|---|---|---|
| 86 | ఆతో ధాతో ర్లోపః | 6.4.140 |
| 87 | పథాం టేః | 7.1.88 |
| 88 | ఇతోఽత్పఞ్చసు | 7.1.86 |
| 89 | థో న్థట్ | 7.1.87 |
| 90 | ఆ సౌ | 7.1.85 |
| 91 | దివ ఔ | 7.1.84 |
| 92 | ఊ రసే | 6.1.131 |
| 93 | చతు రామ్ శౌ చ | 7.1.98 |
| 94 | అనడుహ శ్చ | " |
| 95 | ధౌ వమ్ | 7.1.99 |
| 96 | ఓ రౌ | 7.1.90 |
| 97 | ఆమ్మసి | 6.1.93 |
| 98 | ఐ సఖ్యుః | 7.1.92 |
| 99 | సేర్డాఽదేః | 7.1.93, 6.4.8, 8.2.7 |
| 100 | ఉశనసామ్ | 7.1,93 |

55. 56 సూత్రాల నడుమ 'క్రోష్టు స్తృవత్' అని సూత్రం ఉంది.
60, 61 సూత్రాల నడుమ 'శౌ చ' అని ఒక సూత్రం ఉంది.
64. సూత్రం 'ను ర్వా నామి దీర్ఘః' అని ఉంది. 71 సూత్రం లేదు. 80 సూత్రం లేదు.
85. తరువాత 'ఈపి' అని ఒక సూత్రం ఉంది. 91 తరువాత 'వామి' అని ఒక సూత్రం ఉంది.
94. సూత్రం 'సా వనడుహ శ్చ' అని ఉంది.

| | | |
|---|---|---|
| 101 | య్వో ర్ధాతో రియువౌ స్వరే | 6.4.77 |
| 102 | శ్రీ భ్రువోః | 6.4.79 |
| 103 | వామ్శసి | 6.4.80 |
| 104 | య్వో వా | 6.4.82 |
| 105 | ను ధాతోః | 6.4 77 |

## 4. యుష్మదస్మత్ప్రకరణమ్

| | | |
|---|---|---|
| 1 | యుష్మదస్మదోః షష్ఠీ చతుర్థీ ద్వితీయాభి స్తే మే వాం నౌ వస్ నసౌ | 8 1.20,21,22 |
| 2 | త్వామాఽమా | 8.1.23 |
| 3 | నాచా | 8.1.18 |
| 4 | చాదిభి శ్చ | 8.1.24 |
| 5 | త్వ న్మ దేకత్వే | 7.2.97 |
| 6 | యువావౌ ద్వివచనే | 7.2.92 |
| 7 | ఆ మౌ | 7.2.88 |
| 8 | త్వ మహం సినా | 7.2.94 |
| 9 | యూయం వయం జసా | 7.2.93 |
| 10 | తుభ్యం మహ్యం జయా | 7.2.95 |
| 11 | తవ మమ ఙసా | 7.2.96 |
| 12 | ఙసి భ్యసోః స్తుః | 7.1.31 |
| 13 | భ్యస్ శ్భ్యమ్ | 7.1.30 |
| 14 | సామాకమ్ | 7.1.33 |
| 15 | ఆమ్ సౌ | 7.2.86 |
| 16 | ఏ టా ఙ్యోః | 7.2.89 |
| 17 | సఖి పత్యో రిక్ | |
| 18 | ఙే | |
| 19 | ఋుజ్ ఙే | |
| 20 | త్రిచతురోః స్త్రియాం తిసృ చతసృవత్ | 7.2.99 |
| 21 | కా వ్యతః | 7.3.43 |
| 22 | హ్రస్వో వా | 8.4.15 |
| 23 | అన్యార్థే | 1.2.48 |
| 24 | గోః | 1.2.48 |
| 25 | నపుంసకస్య | 1.2.47 |
| 26 | త్యదాదే ష్టే రః స్యాదౌ | 7.2.102 |
| 27 | దస్య మః | 7.2.109 |
| 28 | సౌ సః | 7,2.106 |
| 29 | తః | ,, |
| 30 | ఇదమోఽయం పుంసి | 7.2.111 |
| 31 | ఇయం స్త్రియామ్ | 7.2.110 |
| 32 | స్ఫోటః | 7.2.113 |
| 33 | అన ఆపోః | 7.2.112 |
| 34 | భిస ఛిస్ | 7.1.11 |
| 35 | అదసః | 7.1.11 |
| 36 | సే రా | 7.2.107 |
| 37 | మా మూః | 8.2.80 |
| 38 | ఏ రీ బహుత్వే | 8.2.81 |
| 39 | భి దసామ్ | 7.4.48 |
| 40 | వసాం రసే (పదాన్తే చ) | 8.2.82 |
| 41 | చోః కుః | 8.2.30 |
| 42 | దిశామ్ | 8.2.62 |
| 43 | షో డః | 8.2.39 |
| 44 | నామ్నో నో లోప శధౌ | 8.2.7 |
| 45 | సంయోగా న్తస్య లోపః | 8.2.23 |
| 46 | స్కో రాద్యో శ్చ | 8.2.29 |
| 47 | స్రో ర్విసర్గః | 8.266, 8.3.15 |
| 48 | స స్తౌ | |
| 49 | అహ్నః | 8.2.68 |
| 50 | రోఽరాత్రిషు | 8.2.69 |
| 51 | దోషామ్ | |
| 52 | ధాతోశ్చ ఝసే | |
| 53 | మో నో ధాతోః | 8.2.64 |
| 54 | హో ఢః | 8.2.31 |

26 సూత్రం తరువాత 'కిమః కః' అని ఒక సూత్రం ఉంది.
42 సూత్రం 'దిశాం కుః' అని ఉంది. 49 'అహ్నః పదాన్తే చ' అని ఉంది.
50 'అహ్నో రోఽరాత్రిషు' అని ఉంది, 50 తరువాత 'ఉషసో బుధే' అని ఒక సూత్రం ఉంది.
51 'దోషాం రః' అని ఉంది. 52 ధాతోః ఝసే' అని ఉంది.
53వ సూత్రానికి బదులు 'న స్రోః' అని ఉంది.

55 దాదే ర్ఘః 8.2.32
56 ద్రుహాదే ర్వా 8.2.33
57 నహో ధః 8 2.34
58 ఛ శ ష రాజాదేః షః 8.2.36
59 షఢోః కః సే 8 2 41
60 సస్తోఽనపి 8.2.73
61 దిపి ..
62 సిపి వా 8.2.74
63 దః 8.2.75
64 ఖసే చపా ఝసానామ్ 8.4.55
65 ఝబే జబాః 8.4.53
66 వావసానే 8.4.56
67 ఆదిజబానాం ఝభా న్తస్య
ఝభాః స్ధ్వోః 8.2 37
68 తథో ర్ధః 8.2.40
69 అవ్యయా ద్విభ క్తే ర్లుక్ 2 4.82
70 సమాస ప్రత్యయయోః 2.4.71
71 అలుక్ క్వచిత్ 6.3.1
72 అవ్యయీభావాత్ 1.1.41
73 అతోఽమనతః 2.4.83
74 వా టాఙ్యోః 2.4.84
75 స నపుంసకమ్ 2.4.18
76 ఏకత్వే ద్విగు ద్వన్ద్వౌ 2.4.17

## 5. కారక ప్రకరణమ్

1 లిఙ్గార్థే ప్రథమా 2.3.46
2 ఆమ న్త్రణే చ 2 3 47
3 సి ర్ధిః 2 3 49
4 భోస్ భగోస్ అఘోస్
5 శేషాః కార్యే క ర్తృసాధనయో ర్దానపాత్రే విశ్లేషావధౌ సమ్బన్ధ ఆధారభావయోః 1.4.49, 2.3.2; 1.4.44, 1.4.42 2 3.18; 1.4.32, 2.3.13;1 4.24 2.3.28; 2.3 50;1.4.45;2 3.36; 2.3.37
6 వినా సహ నమ ఋతే నిర్ధారణ స్వామ్యాది భిశ్చ 2.3.32, 2.3.19, 2,3.16, 2.3 29, 2.3 41,2.3.39.
7 క ర్తృకార్యయో ర క్తాదౌ కృతి షష్ఠీ 2.3.65, 2.3.69
8 అన్యో క్తే ప్రథమా 2.3 1

## 6. తద్ధిత ప్రకరణమ్

1 అపత్యేఽణ్ 4.1.83, 92
2 అత ఇ ఞన్పృషేః 4.1.95
3 ణ్యాయన ణేయ ణ్ణీయా గర్గ న డాత్రి శ్రీ పితృష్వస్రాదేః 4.1.105, 4.1 99, 4.1.122, 4.1.120 4.1.132, 4.1.134.
4 లు గ్బహుత్వే క్వచిత్ 2.4.62-65
5 దేవ తేదమర్థే 4.2.24
6 ణితో వా
7 కారకా త్క్రియాయు క్తే 4.2.1 మొ.
8 కేనేయేకాః 5.3.70 మొ; 5.2.1 మొ. 5.1.1 మొ.; 4.4.1 మొ; 5,1 18 మొ.
9 స్వార్థేఽపి
10 వ త్తుల్యే 5.1.114

56 'ద్రుహాం వా' అని ఉంది. 61 'దిపి సస్య తః'. 63 'దః సః'. 67 తరువాత 'పూర్వస్య జితి ఝసే ధః' అని ఒక సూత్రం ఉంది. 69 తరువాత 'న శబ్దనిర్దేశే' అని ఒక సూత్రం.

**కారక:** 3 'ఆమన్త్రణే సి ర్ధిః' అని ఉంది. 4 సూత్రం లేదు. 5 తరువాత 'భావే చ' అని ఒక సూత్రం ఉంది. 7 తరువాత "స్మృతౌ చ కార్యే, భయహేతౌ పఞ్చమీ, షష్ఠీ హేతు ప్రయోగే, ఇత్థంభావే తృతీయా, యేనాఙ్గవికారః, జనికర్తుః ప్రకృతిః" అని 6 సూత్రా లున్నవి.

**తద్ధిత:** 1 తరువాత 'ఋ ఉరణి' అనే సూత్ర ముంది, అది 'ఋతః' అనే మార్పుతో పైన 16వ సూత్రంగా ఉంది. 5 తరువాత 'సోమా ద్యణ్' అనే సూత్ర ముంది. 9లో 'అపి' లేదు,

11 బావే త త్వ యణః 5 2.119, 123, 124 మొ

12 అ స్త్యర్థే మతుః 5.2.94

13 మాన్తోపధా ద్వ త్వినౌ 5.3.115

14 తరతమేయస్స్విష్ఠాః ప్రకర్షే 5.3.55 మొ

15 వోవ్యః స్వరే 6,1.79

16 ఋత ఉ రణి 4.1.114

17 యస్య లోపః 6.4 148

18 డితి టేః 6.4.143

19 నో వా 6.4,144

20 త్య తనౌ 4.2.98; 4.3 23

21 ఆదిస్వరస్య ణ్ణితి చ వృద్ధిః 7.2.115

22 క్వచి ద్ద్వయోః 7 3.10, 19 మొ.

23 న సన్ధియ్వో ర్యట్ చ 7.3.3

24 ధాతో ర్నామినః 7.3.115

25 అత ఉపధాయాః 7 2.116

26 అతో యుక్ 7.3.33

27 హనో ఘత్ 7.3.54

28 హనో ఘ్నః 7.3.54

29 రాతో ఞౌ పుక్ 7.3.36

30 మితాం హ్రస్వః 6.4.92

31 శేషా నిపాత్యాః కత్యాదయః 5.2.42

## 7. స్త్రీ ప్రత్యయ ప్రకరణమ్

1 ఆ బతః స్త్రియామ్ 4.1 4

2 న్రణ ఈప్ 4.1.5, 15

3 ష్ప్రిత్వతః 4.1.41, 15, 6

4 నదాదేః 4.1.41

5 జాతే రయోపధాత్ 4.1.63

6 ఇన్ద్రాదే రానీప్ 4.1.49

7 స్వాఙ్గా ద్వా 4.1.54

8 పుంయోగే చ 4.1.48

9 ఐ చ మన్వాదేః 4.1.38

10 పత్న్యాదయః 4.1 32,33,34,35

11 వౌ ర్గుణాత్ 4.1.44

12 ఉతః ఊః 4.1.66

13 యూన స్తిః 4.1.77

## 8. సమాస ప్రకరణమ్

1 సమాస శ్చాన్వయే నామ్నామ్ 2.1.1

2 సఙ్ఖ్యాపూర్వో ద్విగుః 2.1.52

3 సమాహారే అత ఈప్ ద్విగుః (ఇష్టిః)

4 పూర్వేఽవ్యయేఽవ్యయీభావః 2.1.5,6

5 అవధారణార్థే యావతి చ 2.1.8

6 యథాఽసాదృశ్యే 2.1.7

7 అమాదౌ తత్పురుషః 2.1.22, 24, 30, 36, 37, 40; 2.2.8

8 నఞ్ 2.2.6

9 చార్థే ద్వన్ద్వః 2.2.29

10 బహువ్రీహి రన్యార్థే 2.2.23, 24

11 కర్మధారయ స్తుల్యార్థే 1.2.42, 2.1.57, 2.1.49 మొ.

12 దిక్ సఙ్ఖ్యే సంజ్ఞాయామ్ 2.1.50

13 టాదకాః 5.4.68-160

14 పుంవ ద్వా 6 3.34-42

15 నా 6.3.73

16 అన్ స్వరే 6.3.74

17 సహాదేః సాదిః 6.3.78-89

18 ఆదేశ్చ ద్వన్ద్వే 1.2.64

19 ప్రాది రుపసర్గః 1.4.59

20 ప్రా గ్ధాతోః 1.4.80

21 నామ్నశ్చ కృతా సమాసః 2.2.8 వా.

22 చాది ర్నిపాతః 1.1.37

23 తత్రాది ర్విభ క్త్యర్థే 5.3 10 మొ. ప్రాగ్ధిశీయాః

24 సద్య ఆదిః కాలే 5.3.22 మొ. ప్రాగ్దిశీయాః

25 త దవ్యయమ్ 1.1.38

తద్ధి: 15 'వో అవ్ స్వరే' అని ఉంది. 17 తరువాత 'ఈపి' అనే ఒక సూత్ర ముంది. 20 లేదు. 31 లేదు.

స్త్రీ ప్ర: 1 తరువాత 'అజాదే శ్చ' అని ఒక సూత్రం ఉంది. 6 లేదు. 12 ఉత ఔః 13 లేదు.
సమా: 2 లేదు. 6 యథా సాదృశ్యే. 12 లేదు. 18 లేదు. 23 చివర 'నిపాత్యతే' అధికం.

## 9. ఆఖ్యాత ప్రకరణమ్

1 ధాతోః 3 4.77

2 వర్తమానే-తిప్ తస్ అన్తి; సిప్ థస్ థ; మిప్ వస్ మస్. తే ఆతే అన్తే; సే ఆథే ధ్వే; ఏ వహే మహే.

3 విధి సంభావనయోః-యాత్ యాతామ్ యుస్; యాస్ యాతమ్ యాత; యామ్ యావ యామ. ఈత ఈయాతామ్ ఈరన్; ఈథాస్ ఈయాథామ్ ఈధ్వమ్; ఈయ ఈవహి ఈమహి.

4 ఆశీః ప్రేరణయోః-తుప్ తామ్ అన్తు; హి తమ్ త; ఆనిప్ ఆవప్ ఆమప్. తామ్ ఆతామ్ అన్తామ్; స్వ ఆథామ్ ధ్వమ్; ఐప్ ఆవహైప్ ఆమహైప్.

5 తుహ్యో స్తాతజ్ ఆశిషి వా. 7.1 35

6 అనద్యతనేఽతీతే-దిప్ తామ్ అన్; సిప్ తమ్ త; అమిప్ వ మ. తన్ ఆతామ్ అన్త; థాస్ ఆథామ్ ధ్వమ్; ఇ వహి మహి.

7 పరోక్షే(ఽతీతే)-ణప్ అతుస్ ఉస్; థప్ అథుస్ అ; ణప్ వ మ. ఏ ఆతే ఇరే; సే ఆథే ధ్వే; ఏ వహే మహే.

8 ద్విశ్చ 6.1 1

9 ఆశిషి-యాత్ యాస్తామ్ యాసుస్; యాస్ యాస్తం యాస్త; యాసమ్ యాస్వ యాస్మ సీష్ట సీయాస్తామ్ సీరన్; సీష్ఠాస్ సీయాస్థామ్ సీధ్వమ్; సీయ సీవహి సీమహి.

10 ఆశీ ర్యాదాదేః పం కిత్ 3.4 104

11 శ్వస్తనే-తా తారౌ తారస్; తాసి తాస్థస్ తాస్థ; తాస్మి తాస్వస్ తాస్మస్. తా తారౌ తారస్; తాసే తాసాథే తాధ్వే; తాహే తాస్వహే తాస్మహే.

12 ఆ ద్భువి కర్మణి 3.4 69

13 కర్తరి పం చ 1.3.78

14 యక్ చతుర్షు 3.1.67

15 అప్ కర్తరి 3.1.68

16 అదాదే ర్లుక్ 2.4.72

17 హ్వాదే ర్ద్విశ్చ 2.4.75

18 దివాదే ర్యః 3.1.69

19 స్వాదే ర్నుః 3.1.73

20 తుదాదే రః 3.1.77

21 రుధాదే ర్నమ్ 3.1.78

22 తనాదే రుప్ 3.1.79

23 నా క్ర్యాదేః 3.1.81

24 హసా దాన హౌ 3.1.83

25 త్యాదౌ భవిష్యతి స్యప్ 3.1.33

26 దిబాదా వట్ 6.4.71

27 స్వరాదేః 6.4.72

28 స్యప్ క్రియాతిక్రమే 3.1.33

29 భూతే సిః 3.1 44

30 నవ పమ్ 1 4.99

31 పరా ణ్యాత్ 1.4.100

32 నామ్ని చ యుష్మది చాస్మది చ భాగైః 1 4.105, 107, 108

33 ణి త్పౌ 7.2.1

34 అనిటో నామివతః 7.2.4, 2

35 హశషాన్తాత్ సక్ 3.1.45

36 ఞే రజ్ ద్విశ్చ 3.1.48

37 లిత్పుషాదే ర్జః 3.1.55

38 ఇరితో వా 3.1.57

39 ఇణ్ త స్యకర్తరి 3.1.60

40 లోపః 6.4.104

41 దిస్యో ర్హసాత్

42 అ ద్రుదాదే రట్ 7.3.99, 100

43 అస్తే రీట్ 7.3.96

5 లేదు. 10 లేదు. 12, 13 లేవు.

ఆఖ్యాత: 30, 31, 32 లేవు. 34 తరువాత 'ణబుత్తమో వా' అని ఒక సూత్రం ఉంది. 36 తరువాత 'శ్ర్యాదేశ్చ', 'శ్రువః శృ చ' అని రెండు సూత్రా లున్నాయి. 38 తరువాత 'మ్లుచాదేశ్చ' అని ఒక సూత్రం ఉంది. 42 లేదు. 43 తరువాత 'అదోఽట్, రుదాదేశ్చ' అని రెండు సూత్రా లున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 44 సేః | 7.3.96 | 73 ఞిత్ స్వరితేత ఉభే | 1.3.72 |
| 45 లోపో హ్రస్వా జ్ఝసే | | 74 పమతోఽన్యత్ | 1.3.78 |
| 46 ఇట ఈటి | 8 2.28 | 75 అపి త్త్రాది ర్జిత్ | 1.2.4 |
| 47 ఝసాత్ | | 76 జాదిః కిత్ | 1.2.5 |
| 48 దాదేః పే | 2.4.77 | 77 ఋసంయోగా న్న | 1.2.5 వా |
| 49 మేఽటః | 6.4.74 | 78 క్త్వాపి సే దదుదామ్ | 1 2.8, 18 |
| 50 ఓ ర్వా హేః | 6.4.106 | 79 త్రో వా | |
| 51 అతః | 6.4.105 | 80 అతిశయే హసాదే ర్యజ్ ద్విశ్చ | |
| 52 అ దే | 6-1.97 | | 3.1.22, 6.1.9 |
| 53 వోర్మ రాః | 7.4.101 | 81 ఇచ్ఛాయా మాత్మనః సః | 3.1.7, 6.1.9 |
| 54 ఆ దాథ ఇః | 7.2.81 | 82 గుబ్భ్యః | 3.1.5 |
| 55 యాః | 7.2.80 | 83 ఆయః | 3.1.28 |
| 56 యా మియమ్ | ,, | 84 నామ్నో యః | 3.1.8 |
| 57 యుస ఇట్ | ,, | 85 ఈ చాస్యే | 7.4 33 |
| 58 ఓ ర్వోర్మ ర్వా లోపః | 6 4 107 | 86 ఆచార ఉపమానాత్ | 3.1.10 |
| 59 ఞా పే | | 87 కర్తు ర్యజ్ | 3.1.11 |
| 60 జి త్యదుః | 6.4.110 | 88 ఞి ర్డిత్ కరణే | 3.1.20,21 |
| 61 నాతః | 6 4.112 | 89 ధాతోః ప్రేరణే | 3.1.26 |
| 62 ఈ హసే | 6.4.113 | 90 చురాదేః | 3.1.25 |
| 63 ద్వే స్త్రా | 6.4.116 | 91 స ధాతుః | 3 1.32 |
| 64 నమసోఽన్య | 6 4.111 | 92 భ్వాధిః | 1.3.1 |
| 65 సి సః | | 93 సే దీర్ఘః | 6.4.16 |
| 66 అతోఽన్తోఽదనతః | 7.1.5 | 94 య్వో ర్వి హసే | 8.2.76 |
| 67 ద్వేః | 7.1.4 | 95 యే | 7.4.25 |
| 68 అన ఉస్ | 3 4.11 | 96 దాదే రిః | 6.4.66 |
| 69 స్యావిదః | 3 4.109 | 97 ఋతో రిజ్ | 7.4.27 |
| 70 ఆతో ఇబ్ డౌః | 7.1.34 | 98 అయకి | 7.4,28 |
| 71 ఆ దనుదా త్త జితః | 1.3.12 | 99 యాదాదౌ | 7.4.28 |
| 72 నివిశాదేః | 1.3 17 మొ. | 100 డాదేరే | 6 4.67 |

48 తరువాత 'వా ధేటామ్' అని ఒక సూత్ర ముంది. 49 మాటః. 57 యుస ఈట్. 59కి బదులు 'కృఞో నిత్యమ్, యే చ' అని రెండు సూత్రాలున్నాయి. 70 తరువాత "ఝసా ద్ధి ర్హేః". 70 తరువాత "నవ పరస్మైపదాని, పరా ణ్యాత్మనే పదాని, నామ్ని చ యుష్మది చాస్మది చ ధాగైః, యుష్మ దస్మ న్మధ్యమోత్తమః, ఆ ద్భువి, కర్మణి, కర్తరి పం చ" అనే 7 సూత్రా లున్నాయి. పై సూత్రాలలో 30, 31, 32, 12, 13 అనేవాటికి సంబంధించినవి ఇవి. 83, 84 సూత్రాలు కలిపి ఒకటిగా ఉన్నాయి. 94 తరువాత 'ఉపధాయాం చ' అని ఒక సూత్రం ఉంది. 99 తరువాత "గుణోఽర్తిసంయోగాద్యోః" అని ఒక సూత్రం ఉంది.

| | | |
|---|---|---|
| 101 | సస్వరాది ర్ద్వి రద్విః | 6.1.1 |
| 102 | స్వరాదేః పరః | 6.1.2 |
| 103 | పూర్వస్య హసాదిః శేషః | 7.4.60 |
| 104 | శసాత్ ఖపాః | 7 4.61 |
| 105 | కుహో శ్చుః | 7.4,62 |
| 106 | ఝపానాం జబ చపాః | 8.4.54 |
| 107 | రః | 7.4.66 |
| 108 | హ్రస్వః | 7.4.59 |
| 109 | య స్సే | 3.1.6 |
| 110 | భృఞాం లుకి | 7.4.76 |
| 111 | నిజాం గుణః | 7.4.75 |
| 112 | యజి | 7.4.82 |
| 113 | ఆతః | 7.4.83 |
| 114 | ఇమ జపాం నుక్ | 7.4.85,86 |
| 115 | రీ గృదుపధస్య చ | 7.4.90 |
| 116 | అజి లఘో ర్హ్రస్వ ఉపధాయాః | 7.4.1 |
| 117 | లఘో ర్దీర్ఘః | 7.4.94 |
| 118 | న రితః | 7.4.2 |
| 119 | ఆభ్వో ర్ణాదౌ | 7 4.73,70 |
| 120 | ను గశామ్ | 7.4 71 |
| 121 | లోపః పచాం కిత్యే చాస్య | 6.4.120 |
| 122 | ఇ స్సే | 7.4.54 |
| 123 | ఝసా ర్ధి ర్హేః | 6.4.101 |
| 124 | జ హ్యేధి శాధిః | 6.4.36,119,35 |
| 125 | గుణః | 7.3.84 |
| 126 | నూపః | ,, |
| 127 | శీజః | 7.4 21 |
| 128 | ఉపధాయా లఘోః | 7 3.86 |
| 129 | నానిటి సే | 1.2.9 |
| 130 | సి స్యోః | 1.2.11 |
| 131 | ఊః | 1.2.12 వా |
| 132 | క్జి త్యద్వ్యసి | 1,1 5,6.4.87 |
| 133 | నో లోపః | 6.4.24 |
| 134 | నమః | 6.4.111 |
| 135 | గమాం స్వరే | 6.4.98 |
| 136 | ఆతో౽నపి | 6.4.140 |
| 137 | యతః | 6.4.48 |
| 138 | ఞేః | 6.4.51 |
| 139 | య్యోః | |
| 140 | అసాదే ర్భ్వాదిః | 2.4.52-56 |
| 141 | సన్ధ్యక్షరాణా మానపి | 6.1.45 |
| 142 | ఆదేః ష్ణః స్నః | 6.1.64,65 |
| 143 | విదో నవానాం త్యాదీనాం ణబాది ర్వా | 3.4.83 |
| 144 | బ్రువ ఆహశ్చ పఞ్చానామ్ | 3.4.84 |
| 145 | తథే | 8.2.35 |
| 146 | అబాదా వీ పితి త్విత్ | 7.3.93 |
| 147 | ఓ రౌ | 7.3.89 |
| 148 | గమాం ఛః | 7.3,77 |
| 149 | దృశాదేః పశ్యాదిః | 7.3.78 |
| 150 | జ్ఞా జనో ర్జా | 7.3.79 |
| 151 | ప్వాదే ర్హ్రస్వః | 7.3.80 |
| 152 | ముచాదే ర్మమ్ | 7.1.59 |
| 153 | ఖితి పదస్య | 6.3.67,68 |
| 154 | ఇదితో నుమ్ | 7.1.58 |
| 155 | శమాం దీర్ఘః | 7.3.74 |
| 156 | ఇమస్య క్జితి ఝసే | 6.4.15 |
| 157 | లోప స్త్వనుదాత్త తనామ్ | 6.4.37 |
| 158 | ఋూత ఇర్ | 7.1.100 |
| 159 | పో రుర్ | 7.1.102 |
| 160 | సి స తా సీ స్యపా మిట్ | 7.2.35 |
| 161 | రుదాదే శ్చతుర్ణాం హసాదేః | 7.2.76 |
| 162 | కృతః | 7.2.35 |
| 163 | హన్నృతః స్యపః | 7.2.70 |
| 164 | ఊదితో వా | 7.2.44 |
| 165 | నైకస్వరా దనుదాత్తాత్ | 7.2.10 |

115లో చివర 'చ' లేదు. 121 తరువాత 'దాం హా' అని ఒక సూత్రం ఉంది. 123 లేదు. 127 తరువాత 'శీజో౽న్తో రుట్' అని ఒక సూత్రం ఉంది. 138 ఞేః కితి. 141 చివర 'అనపి' అని లేదు. 150 తరువాత 149 ఉంది. 164 తరువాత 'ఉదితః క్త్వి' అని ఒక సూత్రం ఉంది.

| | |
|---|---|
| 166 వృ స్నే | 7.2.12,11 |
| 167 కితః | 7.2.11 |
| 168 ఆ దీదితః | 7.2.14,16 |
| 169 వరయోః | 7 2.11 |
| 170 క్రాదే ర్ణాదేః | 7.2 13 |
| 171 కాసాది ప్రత్యయా దామ్ క్రస్ భూ పరః | 3.1.35,40 |
| 172 భువో వుక్ | 6.4.88 |
| 173 ఈటో గ్రహామ్ | 7.2.37 |
| 174 నామినో చతుర్ణాం ధో ఢః | 8.3.78 |

## 10. కృత్ప్రకరణమ్

| | |
|---|---|
| 1 కృత్ కర్తరి | 3.4.67 |
| 2 తృ వుణౌ | 3.1.133 |
| 3 నామ్న్యుపధా త్కః | 3.1.135 |
| 4 పచి నన్ది గ్రహాదే ర య ణిని | 3 1.134 |
| 5 దృశాదేః శః | 3.1.137 |
| 6 జ్వలాదే ర్ణః | 3.1.140 |
| 7 కార్యేఽణ్ | 3.2.1 |
| 8 ఆతో జః | 3.2.3 |
| 9 నామ్ని చ | 3.2.4 |
| 10 అ టౌ | 3.2.9, 16–23 |
| 11 ఇ ఖ ఖి | 3 2.24–47 |
| 12 ఏజాం ఖశ్ | 3 2.28 |
| 13 ఖ్యుట్ కరణే | 3.2.56 |
| 14 భజాం విణ్ | 3 2 62 |
| 15 మనిప్ క్వనిప్ వనిపః | 3.2.74 |
| 16 క్విప్ | 3.2.76 |
| 17 దృశే ష్టక్ సకౌ చోపమానే కార్యే | 3.2.60 |
| 18 ఆ సర్వాదేః | 6.3.91 |
| 19 కి మిదమః కీశ్ | 6.3.90 |
| 20 అదసో మూః | |
| 21 ణినిః | 3.2.78 |
| 22 అతీతే | 3.2.84 |
| 23 క్వని డ్వని డ్వాః | 3.2 94–101 |
| 24 క్త క్తవతూ | 3.2.102 |
| 25 క్వసు కానౌ ఋదేవత్ | 3.2.106, 107 |
| 26 శతృ కానౌ తిఙ్వత్ క్రియాయామ్ | 3.2.124 |
| 27 విదే ర్వసుః | 7.1.36 |
| 28 ము గానేఽతః | 7.2.82 |
| 29 ఆసే రాన ఇః | 7.2.83 |
| 30 శీలే తృన్ | 3 2.134, 135 |
| 31 ఇష్ణు స్ను క్నుః | 3.2 136–140 |
| 32 షాకోకణః | 3.2 154, 155 |
| 33 యజః ఊకః | 3.2.166 |
| 34 లుక్ | 2.4 74 |
| 35 వాన్యత్ర | 3 2.165 |
| 36 ఆ దృతః కి ర్ద్విశ్చ భూతే | 3.2.171 |
| 37 క్తోతాం తక్ వర్తమానేఽపి | 3.2.187 |
| 38 సరోజాదయః | 3.3.1 |
| 39 తుమ్ తదర్థాయాం భవిష్యతి | 3.3.10 |
| 40 ఘఞ్ భావే | 3.3.16–18 |
| 41 సంజ్ఞాయా మకర్తరి చ | 3.3.19 |
| 42 స్వరా దః | 3.3.56, 57 |
| 43 మదామ్ | 3.3.67, 68 |
| 44 ట్వితోఽథుః | 3.3.89 |
| 45 డ్విత స్త్రిమక్ తత్కృతే | 3 3.88 |

169 హవత్యోః. ఇది 'ప్రోః' అని ఉండదగును. వృతః అని అనుభూతిస్వరూపాచార్యుల పాఠము. 171 తరువాత 'ఋత శ్చ సంయోగాదేః' అని ఒక సూత్రం ఉంది.

కృత్: 13 తరువాత 'కృఞః శ చ' అని ఒక సూత్రక ఉంది. 15 మొదట 'ఆతో' అధికం. 15 తరువాత 'విచ్చ' అని ఒక సూత్రం ఉంది. 16 చివర 'ఎ'. 16 తరువాత 'అన్యేభ్యోఽపి దృశ్యన్తే' అని ఒక సూత్రం ఉంది. 19 ంకీశౌ. 20, 21, 22 ఒకే సూత్రంగా ఉంది. 23 క్వ ట్వనిబ్ డాః. 27 విదేః శతు ర్వసుః. 29 లేదు. 34, 35 కలిపి 'లుక్ వాన్యత్' అని ఒక సూత్రంగా ఉంది- 43 మదామః.

| | |
|---|---|
| 46 నజ్ కీ | 3.3.90, 93 |
| 47 క్తో నపుంసకే | 3.3.114 |
| 48 యుట్ | 3.3.115 |
| 49 సాధనాధారయోః | 3.3.116 |
| 50 గత్యర్థా దకర్మకాత్ కర్తరి క్తః | 3.4.71, 72 |
| 51 భావ కార్యయోః | ,, |
| 52 ఈష ద్దు స్సుషు ఖ ల్యా | 3.3.126, 128 |
| 53 తవ్యానీయౌ | 3.1.96 |
| 54 స్వరా ద్యః | 3.1.97 |
| 55 పు శ కాత్ | 3.1 98, 99 |
| 56 ఈ చాతః | 3.1.111 |
| 57 ఋ హసాద్ ఘ్యణ్ | 3.1.124 |
| 58 ఓ రావశ్యకే | 3.1.125 |
| 59 ఋదుపధాత్ క్యప్ | 3.1.109 |
| 60 స్త్రియాం యజాం భావే | 3.3.98 |
| 61 క్తిః | 3.3.94 |
| 62 షి ద్భిదా మజ్ | 3.3.104 |
| 63 గురో ర్హసాత్ | 3.3.103 |
| 64 ప్రత్యయాన్తాత్ | 3.3,102 |
| 65 చజోః కగౌ ఘితి | 7.3.52 |
| 66 హ్రస్వస్య పితి కృతి తుక్ | 6.1.71 |
| 67 శతి చతుర్వత్ | 3.4.113 |
| 68 ఓదౌతో ర్యః స్వరవత్ | 6.1.79 |
| 69 ఢి ఢో లోపో దీర్ఘశ్చ | 6.3.111 |
| 70 సహి వహో రోః | 6.3.112 |
| 71 వే | 6.1.67 |
| 72 యువో రనాకౌ | 7.1.1 |
| 73 రారో ఝసే దృశామ్ | |
| 74 యజాం యవరాణాం య్వృతః కితి సంప్రసారణమ్ | 6.1.15, 1=1.45 |
| 75 గ్రహాం క్జితి చ | 6.1.16 |
| 76 ణబాదౌ పూర్వస్య | 6.1.17 |
| 77 దో ద త్తి | 7.4.46 |
| 78 స్వరా త్తో వా | 7.4.47 |
| 79 స్థామి | 6.4.66 |
| 80 ద స్తస్య నో దశ్చ | 8.2.42 |
| 81 ర‹ | ,, |
| 82 ల్వా ద్యోదిత శ్చ | 8.2.44, 45 |
| 83 ఇచ్ఛార్థేషు తత్కృతే తుమ్ 3 | 3.10, 167 |
| 84 పూర్వకాలే క్త్వా | 3.4.21 |
| 85 సమాసే క్యప్ | 7.1.37 |
| 86 పౌనఃపున్యే ణమ్ ద్విశ్చ | 3.4.22 |
| 87 లోకా చ్ఛేషస్య సిద్ధిః. | |

ఇతి శ్రీమ త్సారస్వత సూత్రపాఠః సమాప్తః

సంపాదితాని సూత్రాణి । పరిశీల్య యథా మతి । యది క్వచన దోషోఽస్తి । మ ద్బుద్ధే ర్విక్రియైవ సా ॥

---

46 నట్ కీ. 48 చివర 'చ'. 49 చివర 'చ'. 50లో "గత్యర్థా దకర్మకా చ్చ కర్తరి కః". 51 చివర క్తః. 55 లేదు. 60, 61 కలిపి 'స్త్రియాం యజన్తా భావే క్తిః'. 64 ప్రత్యయాత్. 65 తరువాత 'న క్త్వాదిద్వ్యజ్యజామ్' అని ఒక సూత్రం ఉంది. 70 సహి వహో రో దవర్ణస్య. 71 చివర విసర్గ అధికం. దీని తరువాత 'ఉ ద్వసామ్' అని సూత్రం ఉంది. 74 రెండు సూత్రలుగా ఉంది. రెండవ సూత్రం 'సంప్రసారణం కితి' అని. 79 స్థామి. 80 'న స్తస్య, నో ద శ్చ' అని రెండు సూత్రాలుగా ఉంది. 81 లేదు. దానికి బదులు 'త్రాణాద్యాః' అని ఉంది. 82 చివర 'చ' లేదు. 83 ఇచ్ఛార్థేషు తత్కర్తృకేషు తుమ్ చ. 84 జారిపోయింది. 86 'ణమ్' తరువాత 'ద్విశ్చ' లేదు. తరువాత 'పదం ద్విశ్చ' అని వేరే సూత్రం ఉంది. 86 తరువాత 'దూరా దాహ్వానే టేః ప్లుతః, విచార్యే చ, లక్షే రీ ముట్ చ, వర్ణా త్కారః, రాదిఫో వా' అని 5 సూత్రాలు ఉన్నాయి. వీటిలో మొదటిది ప్రకృతిభావసంధిలో 5వ సూత్రంగా ఉంది.

శ్రీ తిరుమల రామచంద్ర

# శ్రీ మానవల్లి రామకృష్ణకవి

సాటి రాష్ట్రంవారు పొరుగు రాష్ట్రంలోనో, పొరుగుదేశంలోనో కన్న వన్నెవాసి మనకు మన్నన తెచ్చినపుడు ఒళ్లు పొంగిపోతుంది. అమ్మయ్య! మనమూ ఈ ప్రపంచంలో ఉన్నాము సుమా!– అని పిస్తుంది. ఆస్థితిని ఆలంకారికుల పరిభాషలో విగళిత వేద్యాంతర బ్రహ్మానంద సబ్రహ్మచారిణి అన్నా అతిశయోక్తి కాదు; యోగుల పరిభాషలో అమృత బిందుసంయోగమన్నా అసమంజసం కాదు. అలాటి అనిర్వచనీయ స్థితి అందరి జీవితాల లోనూ సంభవమే.

మూడు దశాబ్దాలనాటి మాట; కాంధార్ పరిస రాలలో ఉండగా ఒక సింహ సంహననుడు కనిపించాడు. ఒక ధర్మశాలలో భేటీ అయింది. చూడగానే దక్షిణ భారతీయుణ్ణని గ్రహించాడు కాబోలు!– గ్రహించక ఏంచేస్తాడు మరి, ఆజానుబాహులైన పఠానుల మధ్య బిక్కు బిక్కుమంటూ ఉన్న నన్ను? "ఏఊరు? ఏంపేరు?" అని ప్రశ్నించాడు "తెలుగువాణ్ణి, పేరు ఫలానా" అన్నాను. సింహం లాగా నామీదికి లఘించి, కౌగిలించుకొని "ఓహ్! మా గురూజీదేశమా? మాగురూజీని మరల దర్శించినట్లైంది" అని ఆనంద తాడవం చేయసాగాడు. నేను పిట్టలాగ ఉక్కిరిబిక్కిరి అయిపోతూఉన్నా, ఆమహాకాయుని ఆపే దమ్ము లేవీ? ఆ ఆనందోన్మత్తుని పేరు గుల్జార్‌మూర్తి, కలియుగ భీములు శ్రీకోడి రామమూర్తిగారి శిష్యుడు. ఈ సంగతి తెలిసినతర్వాత నేనూ పరవశుణ్ణయాను. నేనే రామమూర్తిగారన్నంత తాదాత్మ్యం పొందాను. గుల్జార్ మూర్తి గురుభక్తి అలాటిది.

ఈలాటి పారవశ్యమే మరికొన్నేళ్లకు లాహోర్‌లో కలిగింది. దయానంద ఆయుర్వేద కళాశాల ముందు నిలబడి శంకుస్థాపన సమయం తెలిపే చలువరాతిని చదువుతున్నాను. పండిత దివి గోపాలాచార్యులవారు శంకుస్థాపన చేసినట్టు చెక్కి ఉంది. ఆయన ఆనాటి ఆయుర్వేద చరిత్రేకదా! ఆ చలువరాయి, నన్ను కృష్ణాతీరానికి, ఆంధ్రుల మహావైభవకాలానికి తీసుకువెళ్ళగా మైమరచి నిలుచున్నాను. ఎవరో వీపుతట్టారు. తిరిగి చూశాను; ఒకపెద్దమనిషి, "ఏమిటి చూస్తూన్నారు? క్యాదేఖ్ రహేహైఁ?" అన్నారు ఆయన. "ఈ చంద్రశిలా ఫలకం"అన్నాను."ఎక్కడివారుమీరు? కహాఁకే?" అని మరల ప్రశ్నించారు. "ఈమహానుభావుల దేశమే" అన్నాను. "ధన్య హో!"అంటూ ఆయన తలపాగా తీసి తలవంచి నమస్కరించారు. ఉభయ కుశలోపరి ఎప్పుడు, ఏసహాయం బడితే ఆసహాయం పొందవచ్చు నన్నారు. గోపాలాచార్యులవారు శిష్యులను పుత్రనిర్విశేషంగా చూడడం శ్రీ సి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ పులుగుండ్ల నరసింహ శాస్త్రి, శ్రీ ఏటూరి శ్రీనివాసాచార్యులు, శ్రీ వేటూరి శంకరశాస్త్రిగార్లు కథలుగా చెప్పడం విన్నవాణ్ణి గనుక, ఆయన శిష్యులకు ఆయనపేరే మూల మంత్రం, ఆయనదేశమే దివ్యలోకం కావడం– అన్యరాష్ట్రంలో అదీని–నన్ను మరింత పరవశుణ్ణి చేసింది.

ఇలాటి పారవశ్య విశేషం మరొకమారు దర్భాంగాలో కలిగింది. కొందరు సింధీమిత్రులతో దర్భాంగా సంస్కృత కళాశాలకు వెళ్ళినప్పుడు "కిం భవంతః శతావధానినః? అవధానేన సంతి తర్పయిషవః?" అని అక్కడి పండితులు ప్రశ్నించారు. "నాహం శతావధానీ, ఏష మన్మిత్రం వధ్వానీ. అస్య బంధు ర్గిద్వానీ" అన్నాను. అందరూ

విరగబడి నవ్వారు. "మీరు తెలుగువారమన్నారు గదా! ఇక్కడికి వచ్చి ఆశువుగా కావ్యాలు చెప్పిన గణపతిముని కావ్యకంఠ లయ్యారు" అని వారన్నారు. నా మనస్సు ఊహకందని ఏ అతిమానుష లోకాలకో పయనమయింది-ఇదంతా తెలుగువాణ్ణి గురించి, నన్నుగురించే! "మీదేశంనుంచి చిదంబర శాస్త్రిఅనేవారు వచ్చారు; అవధానాలతో మమ్మల్ని ఓలలాడించారు. కావ్యకళానిధి బిరుదుతో సత్కృతు లయ్యారు" అన్నారు వారు. "ఔను! ఆయన మావాడే! మా తెలుగువాడే!"అని గొణిగాను. ఆ ఆనందంలో విశేషముంది. కోడివారు, దివివారూ నాకు పరిచితులు కారు. శ్రీచిదంబరశాస్త్రిగారిని నేను దర్శించుకున్నాను. నలభై ఆరు సంవత్సరాల క్రితం వారి అవధానం విన్నాను. కనుక ఈ ఆనందం నాది! నా స్వంతంది!

ఇలాటి పారవశ్యం పరాకాష్ఠపొందింది కాన్పూరులో ముప్ఫయి సంవత్సరాలనాడు. ఒక హిందీ సాహిత్య సమావేశానికి 'మహాపండిత' రాహుల్ సాంకృత్యాయన్, లాహోర్ ఓరియంటల్ కాలేజి వైస్ ప్రిన్సిపల్ డాక్టర్ లక్ష్మణస్వరూప్ మున్నగు పండిత ప్రకాండులు వచ్చారు రాహుల్ సాంకృత్యాయన్ అంటే పరిశోధకాగ్రేసరులు, మహారచయితలు, పాట్నా హైకోర్టు న్యాయమూర్తులు కె. పి జయస్వాల్ బహిః ప్రాణమన్నమాట! సరే, పరస్పర పరిచయనమస్కారాల తర్వాత ప్రసంగవశాత్తు "రామకృష్ణకవిగారిని ఎరుగుదురా? మద్రాసువారమని అంటున్నారే?" అని ప్రశ్నించారు రాహుల్‌జీ. "ఎందుకు?" అన్నాను. "ఏమీ లేదు. ఆయన ఎంత ధన్యజీవి! ఆయన జీవిత సార్థక్యానికి ఒక్క కుందమాల నాటకమే చాలు. ఎంత మంచి నాటకం ప్రపంచానికి ప్రసాదించారు!" అన్నారు రాహుల్‌జీ. "బాగానే అన్నారు. మరి నాట్యశాస్త్రం సంగతో?" అని ప్రశ్నించారు డాక్టర్ లక్ష్మణస్వరూప్. "ఆయన వెలుగుకు తెచ్చిన సంస్కృత పుస్తకాలన్నీ అలాటివే. ఒక్కొక్కటీ చాలు ఆయన జీవితాన్ని ధన్యుణ్ణిచేయడానికి" అన్నారు మరొకరు.

నాకు మాట పెగలడంలేదు, గుండె గొంతుకలో కొట్టుకులాడింది. నేనప్పుడు అనుభవించింది మానుషానందం కాదు. ఉపనిషత్తులు ఉద్ఘోషించిన అతిమానుషానంద అనుభూతి అది. అతికష్టంతో గద్గద కంఠంతో అన్నాను "కవిగారు నాకు బాగా పరిచితులు. ఆయన కింద పనిచేసే భాగ్యం నాకు లభించింది." అక్కడివారందరి చూపుల్లోనూ కవిగారిని దర్శించినంత సంతోషంతెలిపే రాగరేఖ ఒక్కసారిగా మెరిసింది. "ఏమిటీ అభేదాధ్యవసాయం?" అని అనుకుంటూ మైమరచాను. నామనసు నాలుగు దశాబ్దాల వెనక్కు ప్రయాణం చేసింది.

1927 నాటి మాట. నే నప్పుడు తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుకొంటున్నాను. మానవల్లి రామకృష్ణకవిగారు తిరుమల తిరుపతిదేవస్థానం విద్యాశాఖాధికారిగా ఉండేవారు. ఆయనకు తాళపత్ర గ్రంథాలు చూచి వ్రాయడానికి "నకలు నవీసు" కావాలని ఎవరో చెప్పగా ఒకరోజు ఆయన ఇంటికి వెళ్ళాను. ఆయన "తాళీదళ సంపుట ప్రకర కాంతారమున" ఉన్నారు. పొడుగాటి శరీరం, కోల ముఖం, నొసట గంధాక్షతలు. కొంచెం వంగినడిచే అలవాటు. అప్పటికే షష్టిపూర్తి అయింది. ఏమైనా ఎదుటివారికి నివురుగప్పిన నిప్పువంటి వ్యక్తిసుమా అనే భావం తెలిపే సౌమ్య గంభీరమూర్తి ఆయనది. నన్ను చూడగానే "ఎవరయ్యా మీరు?" అని ప్రశ్నించారు. "అయ్యా, మీరు" అనడం ఆయన అలవాటు. "మీకు వ్రాయసం వాడొకడు కావాలని విని వచ్చాను" అని వినయంగా మనవి చేశాను. "కూర్చోండి" అంటూ తాళపత్రాలను ఒక వైపుకు తోశారు. నా చేతిలో ఒక నోటుబుక్కు ఉంది. నా దస్తూరీ నమూనా కోసం దానిలో కొన్ని పద్యాలూ, శ్లోకాలూ వ్రాసుకుని వెళ్ళాలెండి. "ఏదీ మీ దస్తూరీ ఎలా ఉందో చూపండి" అని అడిగారు, ఆయన. నా నోటుబుక్కు తెరచి చూపాను.

"ఎవరివీ శ్లోకాలు ?" అని ప్రశ్నించారు. "నావేనండి" అంటూ సంకోచపడ్డాను. "ఏదీ చదవండి" అన్నారు; చదివాను.

"మంజుల నూపుర శింజిత
పుంజీకృత రసికలోక హృత్కుంజా,
కుంజరగమనా గచ్ఛతి
భంజంతీ మదన మంజులతామ్"

అని. "మరొకటి చదవండి" అన్నారు.

"రచయంతీ రంగలతాం
మంగళగాత్రీ సలీల మంగణకే,
విటజన హృదయాంగణకే౽
నంగజబాధాం విశాలయతి నూనమ్"

"ఆర్యా ఛందస్సును బాగానే నడిపించారు. కాని, 'మదన మంజులతాం' అని స్త్రీ సౌందర్యాన్ని పురుష సౌందర్యంతో పోల్చారేం? రతి సౌందర్యం మీకు నచ్చలేదా ?" అని ప్రశ్నించారు. సమాధానం చెప్పక నీళ్ళు నమిలాను, "మదనః అంటే ఒక రకం దేశీతాళం. మదనే చ ద్రుతౌ గురుః, మదనేన ప్లుతౌ ప్రోక్తౌ, తాలే మదన సంజ్ఞేతు దాత్త్రయశ్చ గురు స్తథా—" అని దేశీతాళ లక్షణం చెప్పారు. ఆ తాళ మాధుర్యాన్ని భంజిస్తూ, అంటే అంతకన్నా మధురంగా నడిచింది అని అర్థం చెప్పుకుందామా !" అన్నారు. "నాకు సంగీతమంటే ఓనమాలు రావండి" అన్నాను. "ఇంతకూ మీ వయస్సెంత ?" అన్నారు. "పధ్నాలుగేండ్లండి" అన్నాను. "ఇంత పసివయసులో ఎందుకండీ ఈ శృంగారం ?" అని మందలించే ధోరణిలో అన్నారు. కొంచెం సిగ్గుపడవలసివచ్చింది నేను.

ఇది ఆ పండిత ప్రకాండుని సన్నిధిని ప్రథమ పరిచయం. తర్వాత నేను ఆయనదగ్గరికి వెళ్ళుతూ ఉండే వాణ్ణి. ఆయనకు నకలు చేసిపెట్టింది కొద్దే. కాని, ఆ ఉన్నంతసేపూ సంస్కృత సాహిత్య మధుర ప్రపంచంలో విహరించేవాణ్ణి. అడుగడుక్కూ ఆయన కోహళుడని, శార్ఙ్గదేవుడని, సింగభూపాలుడని నాకు అప్పటికి పూర్తిగా కొత్తవైన పేర్లు చెబుతూ, వారి శ్లోకాలు ఉదాహరిస్తూ ఎన్నో విషయాలు తెలిపేవారు. వేణీసంహారం చర్చ వచ్చింది ఒకమారు. "అంతకంటే ముందుదయ్యా భట్టనారాయణుడు వ్రాసిన కృత్యారావణం !" అంటూ ఘట్టఘట్టానికొకటి రెండు శ్లోకాలు ఉదాహరించేవారు. ఆయన ధారణాశక్తి శక్తి స్వరూపిణి. ఆయన మెదడొక పావురాల గూడనుకుంటాను; అవసరమైనప్పుడల్లా ఆ అరలగుంపా-గూళ్ళ నుంచి-విషయాలనే కపోతాలు కవ్వుల కాంతులతో మనకు ప్రత్యక్షమయ్యేవి. ఆయన "ఊ ఊఁ హుఁ" అని ప్రారంభించి ఒకరకం యాసతో పద్యాలు, శ్లోకాలు చదువుతూ ఉంటే పావురాల గునుపులాగే వినిపించేవి కమ్మగా.

తర్వాత కొన్ని సంవత్సరాలకు చెన్నపురిలో ఆయనకింద పనిచేసే అపూర్వావకాశం కలిగింది-కొన్ని నెలలపాటు. శ్రీ ఆర్. అనంతకృష్ణశాస్త్రి అనే వారు మద్రాసు విశ్వవిద్యాలయానికి కొన్ని తాళపత్రగ్రంథాలు సేకరించి యిచ్చారు. వాటిని వింగడించేపని కవిగారికి అప్పగించారు విశ్వవిద్యాలయంవారు. నేను వారికి అసిస్టెంటును. ఆయన మహాప్రతిభ నాకప్పుడు పూర్తిగా ఆకళింపుకు వచ్చింది. ఆయన తాటాకుల కట్ట విప్పకముందే ఇది ఈ పుస్తకం, ఇది ఈ ఘట్టంలోది అని త్వర త్వరగా చెబుతూ పోతూ ఉంటే, నలునికథ జ్ఞాపకం వచ్చేది. అయినా, నేను ఆయనవద్ద నేర్చుకున్నది అంతంతే. "కూపే పశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్" అని భర్తృహరి ఊరికే అన్నాడా ?

ఆ రోజుల్లోనే అడిగాను ఒకమారు "మీ పుట్టు పూర్వాలు సెలవియ్యండి, ఒకవ్యాసం వ్రాయాలని ఉంది" అని. ఆయన ఒక వెడనవ్వు నవ్వి "నేను అప్పుడే చచ్చిపోతాననుకున్నారా ? ఇంకా కనీసం 20 సంవత్సరాలన్నా బ్రతుకుతాను. సెంచరీ కొట్టాలనే నా ఆశ. నేను పోయిన తర్వాత వ్రాసేదేదో

వ్రాయవచ్చును లెండి" అన్నారు. ఆయన నిరీహకు, నిరాడంబరతకు హతాశుణ్ణి అయాను.

ఇంతకూ ఆయన తన రచనలలో తననుగూర్చి చెప్పుకున్నదికూడ చాలకొంచెమే. ఆ కాలమహిమా, పండితోత్తముల సంప్రదాయమూ అలాంటివి. తమ స్వంత సంగతికంటే తమ రచనా ప్రాశస్త్యమే వారికి కావలసింది. భరతుడు తననుగూర్చి భేరీలు మ్రోయించుకున్నాడా? కాళిదాసు తనవిషయం కాహళలు ఊదించుకున్నాడా? రామకృష్ణ కవిగారూ అంతే. ఆయన 1866లో నుంగంబాకం మద్రాసులో జన్మించారు. ఆయనది చెన్నపురిలో పేరు మోసిన పండితవంశం. తాతపేరు వెంకట కుప్పా శాస్త్రిగారు. తండ్రిపేరు రామశాస్త్రిగారు. రామశాస్త్రి గారు అష్టాదశ భాషలలోను, బహు విద్యలలోను సమర్థులట. నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలట. భరతకోశం ప్రారంభంలో ఆయన ఇలా చెప్పుకున్నారు.

"ఆసీద్వేంకట కుప్పాఖ్యః ప్రవర స్సోమపీథినామ్,
తత్పుత్రో రామశాస్త్రీతి విశ్రుత శ్శంసితవ్రతః,
అష్టాదశసు భాషాసు విద్యాస్వపి కృతశ్రమః,
వ్యాఖ్యాతా నాట్యశాస్త్రస్య రసికో జనరంజనః,
తత్పుత్రో రామకృష్ణాఖ్యః........."

అంతమాత్రమే చెప్పుకున్నారు.

రచయితలకు ప్రథమోత్సాహంలో తమను గురించి చెప్పుకోడం మోపు. కాని ఈ వినీతులకు తమ తొలికావ్యంలోను ఈమోజు కనిపించదు. ఈయన తొట్టతొలుత రచించిన కావ్యం 'మృగావతి' దాని పీఠికలో ఉన్నది ;

"గీ. చెన్నపురి చూళ నివసించుచున్న వాఁడ,
వైదిక బ్రాహ్మణుఁడు మానవల్లి కులుఁడ
రామదైవజ్ఞ పుత్రుఁడ రాజనుతుని
త్యాగరాజపండితుని ప్రియానుజుండ

అనిమాత్రమే.

కవిగారు చిన్ననాట క్రిశ్చియన్ కళాశాల పాఠశాలలో చదువుతున్న రోజుల్లోనే ఆయన ప్రతిభ వెల్లడయింది. పూవుపుట్టగనే పరిమళిస్తుందన్నారు కదా— పెద్దలు! ఆంధ్రభాషా సాహిత్యాలను గూర్చి ఆయనొక బృహద్వ్యాసం వ్రాశారు. దాని పేరు "ఆంధ్రభాషను గూర్చిన యుపన్యాసము". ఇదే ఆయన మొట్టమొదటి రచన. అది అప్పటి విద్వాంసుల మన్ననకు పాత్రమైంది. అప్పుడు కవిపండితులను ఆదరించే "వైజయంతి" పత్రికలో ముద్రితమైంది. తొంభయి సంవత్సరాల క్రితం వ్రాసిన ఈ వ్యాసంలో నేటికీ క్రొత్తగా కనిపించే విషయాలెన్నో ఉన్నాయి. భావి మహాపరిశోధనకు దీనిలోనే దారులు పడ్డాయి.

ఆయన పట్టభద్రులైన (బి.ఏ.) తర్వాత వన పర్తి సంస్థానంలో విద్యాశాఖాధికారిగా జీవితం ప్రారంభించారు. అంతకుముందే 'మృగావతి' ప్రథమ కావ్యరచన జరిగింది; అంటే 1890లో. ఇదికూడ 'వైజయంతి' పత్రికలో మొదట ముద్రితమై 1897లో పునర్ముద్రణ పొందింది. కవిగారు పైలా పచ్చీసుదశలో చేసిన రచన గనుక ఇది శృంగార రసమయం. ఇది నాలుగాశ్వాసాల ప్రబంధం. మొదటి ఆశ్వాసంలో 108,308, రెండవదానిలో 157, మూడవదానిలో 134, నాలుగవ దానిలో 158 పద్యాలుంటాయి. "సోమదత్త మహాకవి ప్రణీత కథా సరిత్సాగరాంతర్గతమైన యేతత్కథా ప్రపంచంబు"ను కవిగారు :

క. "విమలాచార పవిత్రున
కమృతమయ స్వాంతునకు సదాగమవిద్యా
ప్రమదున కుర్వీపాలో
త్తమ నుతునకు త్యాగరాజ దైవజ్ఞునకున్."

గీ. "తల్లిదండ్రులకన్నను ధర్మపత్ని
కన్నవెక్కుఁడు ప్రేమతో నన్ను దనుజు
జూచుకతమున గీర్తిశేషునకు దీని
నంకిత మొనర్తు గన్నీకులట్టె జాలి"

అని దీనిని తమ అన్నగారికి అంకితమిచ్చారు.

ఈ కావ్యం తెలుగు పంచకావ్యాలు పిండిపెట్టిన పంచామృతమంటే సరిపోతుంది. మచ్చుకు నాలుగైదు పద్యాలు ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

కా. "మల్లెల్గోసి మరందబృందముల ధ
ర్మస్థాలికా పాలిలో
బల్లీకన్యలు నింపగా మునికి నే
పాళీమణుల్ గోస్తనీ
వల్లీ నిర్మితకాయమానముల భ
వ్యంబైన పూజా విధుల్
సెల్లింపన్ రహి నుద్యమింతురు యువ
శ్రీగోరు చందంబునన్"—(1-6)

ఈయన సీసమాలికలలో భట్టుమూర్తి సంగీతపు లగువు బిగువులు కనిపిస్తాయి :

సీ. అప్సరః ప్రేమాస్వదానీత కల్పపా
దప పుష్పఝల్లరుల్ దనరుచోట
సామంత సీమంతినీ మంగళారణ్య
మల్లికాహారముల్ మలగుచోట
అన్యరాజన్య కన్యాహస్త నిర్మిత
రంగవల్ల్యాదులు గ్రాలుచోట
విప్రవనితంబినీ విన్యస్త కేతకీ
స్తంభ చతుష్కంబు దగులుచోట

గీ. జిగిని జిగురాకు పందిరు ల్నిగుడుచోట
మాలతీదామ జాలముల్ వ్రేలుచోట
జగతి నిర్మించి రన్నువల్ సరస సరస
దీపకళికా విలాసముల్ జూపుచుండ."2-53

పాదలేపనౌషధహీనుడైన ప్రవరుడు తన పట్టణానికి పోలేక

"అతిథి సంతర్పణంబు లేమయ్యెనొక్కొ !
అగ్ను లేమైనవొక్కొ నిత్యంబులైన
కృత్యములబాపి దైవంబ కినుక నిట్లు
పాలువైచితె మిన్నులు పడ్డచోట ?"

అనివగనడం కవిగారు చక్కగా తమనాయిక మృగావతికి అతికించారు. మృగావతి తనకు తెలియకనే విహంగమంపై కొండచరియ చేరుతుంది. ఇంతలో తటాలున స్మరణ కలిగి

"ఎచ్చట నున్నదాన విది
యెక్కడి పర్వతబృంద మెట్లు పో
వచ్చును వత్సభూమి కిట
వ్రాలెడు భాస్కరు డ స్తవారిలో
మ్రుచ్చులు బెట్టిడంపు మృగ
ముల్ ఫణిరాజులు దా చరింపరే
యిచ్చట నిల్వనేర్తునె ప్రి
యేశ్వర ! వాసతి మిమ్ము జూతునే!"
(3-17)

అని పిలుస్తుంది. ఈయన ఈ కావ్యప్రారంభంలో చేసిన భారతీస్తుతి అప్పటికే ఈయనకు గల శాస్త్ర పాండిత్య ప్రకర్షను ప్రకటిస్తుంది ;

గీ. గంధరసరూప సంస్పర్శకంబులైన
నాల్గుగుణములు శబ్దగుణంబునంద
యడుగునవి యనంతంబ శబ్దార్థి నగుచు
నమృతమూర్తిని భారతి నాశ్రయింతు."
(1-2)

చిన్ననాడే మహాకవుల కోవకు చెందిన ఈయన ప్రశ్రయగుణం ఎంతటిదో కావ్యసమాప్తి పద్యం తెలుపుతుంది.

చ. మును గవితా పయోధి దిగి
ముత్యము లేర్చిన సత్కవీశులన్
గనుట వయోమనీషలను
గాలము లానక మున్గి యేనునుం
గనుడిదె తెచ్చితిన్ శిలయొ
గవ్వయొ కృత్రిమరత్నమో యెఱుం
గను గవులార యెట్లు నను
గాచెదరో కరుణార్ద్ర చిత్తులై "
(4-158)

కవిగారి తక్కిన స్వతంత్ర తెలుగు రచనలు కళింగసేనము, మహావీరుడు, వత్సరాజచరిత్ర

మున్నగునవి, భాసుని నాటకాలను మొదలు అనువదించింది కూడా ఈయనే.

పనప్ర్తిజీవితం ఈయనను పరిశోధకునిగా తీర్చిదిద్దింది. తాళపత్ర గ్రంథాలకోసం, శాసనాల కోసం గవేషణ ప్రారంభించారు. తాళపత్రగ్రంథాల సేకరణ ఒకయజ్ఞం, వాటిని సంస్కరించి ముద్రించడం రాజసూయయాగం. అదొక కళ; మరొక విధంగా అదొక శాస్త్రం. ప్రాచీన శాసనలిపి, తాళపత్రలిపి సులభంగా పోల్చుకో దగినవి కావు; తాళపత్రగ్రంథాలను వ్రాయసంవారు తలకొకవిధంగా వ్రాసేవారు. బండి ఱ, ట, లకు, వపలకు, నసలకు, గుడి ఎత్వాలకు భేదం ఉండదు. వీటికితోడు వ్యాకరణ కార్యాలైన గసడదవాదేశాలు, పూర్ణార్ధబిందువులు, పాఠాంతరాలు, లేఖనప్రమాదాలు - ఇదంతా ఒక కాసట-బీసట. నన్నెచోడు డన్నట్లు "పాకదల్పినీరు" గ్రహించాలి. ఇలాటి పనికి పూనుకున్న వారికి ప్రపంచం వషట్కారాలు తప్పవు.

కవిగారు "విస్మృతకవులు" అనే గ్రంథమాల కింద ప్రాచీనాపూర్వగ్రంథ ముద్రణం ప్రారంభించారు. దీనిలో వెలువరచిన మొదటి గ్రంథం వల్లభరాయని క్రీడాభిరామం. ఇది మొదట వనపర్తిలోని బ్రహ్మవిద్యా విలాసం ప్రెస్సులో ముద్రితమైంది. దీని పీఠిక చివరిమాటలలో "నేను ముద్రించుచున్న వేంకటాదిత్యుని కుమారసంభవము, అమరేశ్వరుని విక్రమసేనము- వీనిని సవరించుటలో నాయజ్ఞానము చాల బ్రకటమైనను గాలహరణమై ధనార్జనభంగము గలిగినను గేవలము భాషయందుగల ప్రీతిచే దీనిని ముద్రించితిని గావున నా దోషములను సరకుగొనక సహృదయులై సవరించుకొని యానందమును గ్రోలుదురుగాక యని విరమించుచున్నాడను" అన్నారు. ఎంతటి ఆవేదన ఈ మాటలలో ఇమిడి ఉందో స్పష్టమౌతుంది.

ఈ పీఠికలో ఈయన కుసుమంబెట్టిన, (కుసుమరంగు అద్దిన), అప్పసమెవ్వాడు (పస నెవ్వాడు) మొదలైన విశిష్ట ప్రయోగాలను సోపపత్తికంగా చర్చించి నిర్ణయించారు.

ఈ గ్రంథమాలలో రెండవది నన్నెచోడుని కుమారసంభవం. ఇది రెండు సంపుటాలుగా వెలువడింది. ఇదే ఆంధ్ర సారస్వతలోకంలో భయంకరమైన ఝంఝూవాతం చెలరేగించిన కావ్యం. నన్నెచోడుని ఈ గ్రంథంలో తక్కిన ఏ కావ్యంలోనూ కనిపించని అపూర్వప్రయోగాలు, కన్నడ తమిళపదాలు, వాటి సామ్యంపొందే హలంతపదాలు కనిపించడంతో ఇది నన్నయకు మునుపటి కృతి అని కవిగారు నిర్ణయించారు. నన్నయే ఆదికవి అనుకున్న ఆంధ్రపండితలోకం దీనిని సహించలేదు. ఖండన మండనలు బయలు దేరాయి దీనిని సమర్థించినవారు నడకుదుటి వీరరాజుగారు మొదలైనవారు. ప్రతిపక్షులు కవిగారు పాఠాలు దిద్దివేశారని అపవాదులు ప్రారంభించారు.

"ఇంత గాలిదుమారం లేవగా మీరు జవాబు చెప్పరెందుకండీ?" అని కవిగారిని ప్రశ్నించాను. "నేను చెప్పేదేదో గ్రంథం పీఠికలోనే చెప్పాను. మళ్ళీ మళ్ళీ చెప్పడం దేనికి ? పొగిడేవారు పొగడనీండి, తెగిడేవారు తెగడనీండి. నాపని తీరింది" అన్నారు, ఆస్థితప్రజ్ఞులు. నిజమే, ఏదోసత్కార్యం చేస్తే, పదిమంది విరుచుకుపడితే, బదులు చెబుతూ కూర్చుంటే సత్కార్యం చెడిపోదూ ? కవిగారిపద్ధతి చాల ప్రశంసనీయమైనదనే నాకు తోచింది. వాదిస్తూ కూర్చునేవాడు ఏమీచేయలేడు. ఆయన ఈవాదాన్ని ఎంత నేర్పుతో ఉపసంహరించారో కుమారసంభవం ద్వితీయభాగం పీఠికచివర చదివితే స్పష్టమౌతుంది.

"ఒకవేళ మనకవి ప్రాచీనుడు కాడయ్యేనేని కొఱంతయేమి? నన్నయాదులకు బూర్వకావ్యములు రాజప్రోక్తములే వెలువడనున్నవి. చవులు గలవేని రాజభోగ్యములగుఁగదా! సర్వవిధముల నిరుపమానమగు నీకావ్యరత్నము కవి యెవ్వడైన నెప్పుడుండినను సర్వజనాదరణీయమే. 'వక్తుః ప్రామాణ్యా

దేవ వచః ప్రామాణ్యం మిష్యతే, సహ్యాశుద్ధతరా ద్వ్యక్తేః ప్రభవంత్యుజ్జ్వలా గిరః" అని జినసేనుడు చెప్పినట్లు వజ్రముల చఫులు బొగ్గులలో బుట్టవా? అల్పజ్ఞుడగు నాయట్టివాఁ డజ్ఞానముచేత లేఖకదోషముల గుర్తించి ముద్రింపఁజాలకున్నను గేవలము తాళపత్రములలోని పఠనశ్రమమును బోఁగొట్టి దీని సర్వజన హస్తగతము చేసినందుననే యించుక సంతోషింతునుగాక. భాషలో గతిపయాక్షర జ్ఞానము సంపాదించిన ఋజుము నిమ్మహాకవి కీర్తిప్రసః ప్రకటనముచే బాడికొన గలిగితిగదా యదియ చాలునని పరమానందమున బొంగుచున్నాడను."

చిత్తశుద్ధిగల సారస్వతోపాసకుని సంతృప్తి యిదే.

నన్నెచోడుని రచన ఆధారంగా ఆయనకు భాషాశాస్త్రదృష్టితో వ్యాకరణమొకటి రచించాలని కూడా బుద్ధిపొడమింది కవిగారికి. దానిలో "ప్రాచీన శబ్దానుశాసనము" వ్రాయసాగినారు.

"వ్యవహారాచారాదుల
నవనవతయ కోరు నవ్య నాగరకుల నీ
నవసూత్ర ప్రాచీనాం
ధ్రవచో వ్యాకరణ మెంత నవ్వించునో!"

సూత్రము:

"భాషలో శబ్దములు ప్రాయశః హలంతములు, ద్విత్వములు తక్క హల్సంయుతాక్షరములు లేవు. పరస్థ ఋకారసదృశరేఫము వ్యతిపాతవిధిచే (metathesis) బూర్వాక్షర సంయుక్తమగు. హలంతముల కభావము పరమైనచో నికారోకారములు నూతగానగు. అనునాసికాంతముల కూఁతగా నుకారము వచ్చునపుడు తత్తద్వర్గ తృతీయాక్షరమూఁతగా నాగమమగు."

అని ప్రారంభించి ఇరవై రెండు సూత్రాలు రచించారు. నేటి వ్యావహారిక వ్యాకరణ వాదులందరికీ ఇవి ఉపాదేయాలు

శబ్దరత్నాకర నిఘంటు గ్రథనకాలానికి కుమార సంభవంవంటి కావ్యాలు లభించనందున పెక్కు పదాలు దానిలో చేరలేకపోయాయి. కనుక కవిగారు "ఇందు శబ్ద రత్నాకరాది నిఘంటుస్థములు కాని ప్రాచీన శబ్దములకు నర్థాంతరముగల శబ్దములకు భాషాంతర ప్రయోగముల ననుసరించియు సందర్భోచితముగను నర్థము" వ్రాశారు. ఈ అర్థవివరణ కవిగారి వివిధ భాషా పరిజ్ఞానానికీ, భాషా శాస్త్ర దృష్టికీ నికషం.

కవిగారు ఆంధ్రావళికి బహూకరించిన మరొక రచన "ప్రబంధమణిభూషణము". ఇదొక సంచిత కృతి. సంచితకృతి అంటే పెక్కుకావ్యాలనుంచి వివిధభాగాలు గ్రహించి ఒక కథగా కూర్చినది. "ఆంధ్రభాషలో నాకు లభించినంత వట్టు పరికింప నట్టి కృతికర్తల మడికి సింగనయే ప్రథముఁడు. అతఁడు ప్రాచీన పంచతంత్రి, ప్రాచీన కామందకము, ముద్రామాత్యము, నీతిభూషణము, బద్దెననీతి, కుమారసంభవము, భారతము, మనుమంచి భట్టు నశ్వశాస్త్రము మొదలగు గ్రంథములలోని రాజనీతి పద్యముల నన్నియు నేరి "సకలనీతి సమ్మత" మను గ్రంథమునుగూర్చెను. పిదప క్రీ. శ. 1720 లో జగన్నాథ కవి రత్నాకర మను గ్రంథమున బ్రాచీన పద్యముల నెత్తి యోజపఱచి యైదాశ్వాసముల కృతి రచించెను. ఆయన నీరెండును గథారూపములు గ్రథితములు కావయ్యె.

"ఉజ్జయినీ నాథుఁడగు రాజశేఖరుఁడు పాండ్య భూపతి పుత్రియగు రత్నసుందరిచే స్వయంవరమున వరింపబడెను. నూతనకథా వస్తువు పరిణమించునట్లు నానా ప్రబంధ పద్యములందు బొసంగింపబడినది."

ఈ సమయంలోనే కవిగారు ఆంధ్ర, సంస్కృత భాషలలో ఎం. ఎ పట్టం పుచ్చుకున్నారు. కవిగారు నలభయ్యవపడిలో మద్రాసు న్యాయశాస్త్ర కళాశాలలో చేరి ఎఫ్. ఎల్ పూర్తిచేశారు, బి. ఎల్. చదివి

పరీక్షకు కూర్చోలేదు. ఈ సంగతి ఆయన సహాధ్యాయులు శ్రీ ఆరావమధు అయ్యంగారు నాతో అన్నారు.

"విస్మృత కవులు" గ్రంథమాల క్రింద కవిగారు ప్రచురించిన తక్కిన ప్రాచీన గ్రంథాలు త్రిపురాంతకోదాహరణము, నీతిశాస్త్ర ముక్తావళి (బద్దెనసీతి), ఆంధ్ర తిరువాయి మొళి, శ్రీరంగ మహత్త్వము, సకలనీతి సమ్మతము - అనేవి. సకలనీతి సమ్మతమును ఆంధ్రపత్రికవారు ఆంధ్ర గ్రంథమాలలో ముద్రించారు.

వనపర్తిలో ఉన్నప్పుడే తెలంగాణాలో పర్యటించి శాసన ప్రతిబింబాలు సేకరించి "లిథిక్ రికార్డ్స్ ఆఫ్ హైదరాబాద్ స్టేట్" అనేపేర ప్రకటించారు.

శ్రీరంగ మహత్త్వము భైరవకవి రచించిన ఐదాశ్వాసాల ఉత్తమ ప్రబంధం. ఇది 1912లో చెన్నపురిలో ముద్రించబడింది. దీనిముద్రణ వేళకు విమర్శకుల ఏటుపోటు మాటలకు, అపవాదులకు కవిగారి మనస్సు ఎంతో వ్యథపడి ఉంటుంది. కనుకనె దాని పీఠికలో "తాళీదళసంపుట ప్రకర కాంతారమున దిరిగి ప్రమాదకంటకముల దొలగించుకొనుచు నపూర్వ పదార్థ వివేచనంబు సేయుచుండువారి యవస్థ తత్త్వ్యలకుఁగాని యన్యుల కెఱుంగరాదు. వాగ్బ్రహ్మకోశము నిర్మర్యాదము; ప్రతిభ నవోన్మేషిణి, కాలము విస్మృతి నిదానము;సామాన్య లోకము జీవయాత్రైకపరాయణము; అయ్యో! యిక మృతి చెందుచున్న పురాణకవి బ్రహ్మల గతియెట్లు అని యనుతాప మాత్రంబున సముద్ర జలమున కేతము గట్టినట్లే కావ్యోద్ధరణ క్రియకుం బూనితిగాని వైదుష్య దర్పమునంగాదు. వ్యయ ప్రయాసముల మాట బోనిచ్చి శతచ్ఛిద్రవ్యాకులంబగు తాళదళ పరిశోధనం బభ్యాస వశంబున జగుప్సారహితంబుగ నలవరచుకొని కార్యము నెట్లో నిర్వహించుచుండుటయు గొంద ఱీర్ష్యాగ్రస్తులు చూచియోర్వక పరిపరి విధముల ననుబాటుపఱచుచున్నారు" అని వ్యాకులపడినారు.

ఈ ఈర్ష్యాద్వేష జుష్టమైన తెలుగు సారస్వత రంగంకంటే విస్తృతమైన సంస్కృతరంగమే మెరుగనుకున్నారు కాబోలు! వనపర్తి ఉద్యోగాన్ని వదలి చెన్నపురి పచ్చయప్ప కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా రెండు మూడు సంవత్సరాలు పనిచేశారు. పరిశోధకునికి అధ్యాపక పదవి విజాతీయం కాకపోయినా, కొద్దిగా ప్రతిబంధకమనే అనాలి. కవిగారికి అదృష్టవశాత్తు తాము కోరిన కొలువే దొరికింది.

మద్రాసు ప్రభుత్వం విద్యాశాఖవారు రాష్ట్రమంతట పర్యటించి తాళపత్ర గ్రంథాలు సేకరించడానికి కొందఱు పండితులను నియమించారు. తాళపత్ర కాంతారంలో తిరగడంలో అనుభవం, దానికి మించిన శ్రద్ధానుభూతులు గల కవిగారు ఆ పండితులలో ఒక్కరు కావడం సహజం. ఆయనకు తోడు మరొక మహోద్దండ పండితులు శ్రీ ఎస్.కె. రామనాథశాస్త్రిగారు; ఉభయ మీమాంసలలోను, అలంకారశాస్త్రంలోను పారం చూచినవారు పాలక్కాడు వాస్తవ్యులు. బంగారానికి తావి అబ్బినట్టు, రామునికి లక్ష్మణుడు తోడయినట్టు అయింది ఇద్దరూ ఆంధ్ర కర్నాట తమిళ కేరళప్రాంతాలలో మారుమూల లన్నీ తిరిగారు. అపూర్వ గ్రంథాలు సేకరించారు. ఈ ఆరేడు సంవత్సరాలే కవి గారికి యావద్భారతకీర్తి, విశ్వవిఖ్యాతి కలిగించాయి.

ముఖ్యంగా కేరళలో వీరికి అపూర్వ గ్రంథాలు దొరికాయి; సంస్కృత నాటకాలు, భరతుని నాట్యశాస్త్రం ప్రతులు, భోజుని శృంగార ప్రకాశం అనే అలంకార శాస్త్రోద్గ్రంథం - ఇంకా ఎన్నో. శ్రీ ఎస్. కె. రామనాథశాస్త్రిగారు తాళపత్రగ్రంథ సంపాదనలో తామిద్దరూ పడిన శ్రమను కథలుగా చెప్పేవారు.

"నారేయి అనే నంబూద్రి యింట్లో ఏడువందల తాళపత్ర గ్రంథాలు కనిపించాయి. వాటిలో రెండు

వందల యాభై మేము ఏరుకున్నాము. ఇవన్నీ మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తకాలయానికి పంపాలి. అప్పుడు ఆ పుస్తకాలయం క్యురేటర్ శ్రీ వరదాచార్యులుగారు. షోరనూరుకు వెళ్ళాలి, నది పొంగివచ్చింది. ఎంతో శ్రమపడి సేకరించిన పుస్తకాలు పోతే మాపంచప్రాణాలూ ఎగిరిపోవా? కొత్తగా ఒకపెట్టె చేయించి, దానిలో వాటిని భద్రపరచి మద్రాసుకు పంపాము. పెట్టె చేయించడానికి యాభై రూపాయ లయింది."

"శృంగారప్రకాశం మలబారులో 12 ప్రకాశలు కలిపి మాత్రమే దొరికింది. ఎర్నాకుళంలో 36 ప్రకాశాలది దొరికింది. దీనికి ఎంత శ్రమపడవలసివచ్చిం దనుకున్నారు? మొదట్లో నంబూద్రీలు తమవద్ద నున్న గ్రంథాలు చూపనైనా చూపేవారుకారు. ఎంత ప్రాధేయ పడాలో! ఎంతభంగపోవాలో!"

"ఒకసారి పై అధికారులతో రభసపడవలసి వచ్చింది. అప్పుడు మహామహోపాధ్యాయ కుప్పుస్వామి శాస్త్రిగారు ప్రాచ్యలిఖిత పుస్తకాలయం క్యురేటరు. ఒకచోట బోధాయనుని భగవదజ్జుకం, రెండు వ్యాఖ్యానాలతో అర్థశాస్త్రం, ధ్వన్యాలోక వ్యాఖ్యానం, ఇంకా ఎన్నో దొరికాయి. మొత్తం 350 గ్రంథాలకు 300 రూపాలిచ్చి కొన్నాము. ఈ సంగతిని కుప్పుస్వామి శాస్త్రిగారికి తెలిపాము. ఇంతధర పెట్టడం తనకు ఇష్టం లేదని ఆయన జవాబు వ్రాశారు. మీకిష్టం లేకపోతే మేము కొంటాము. వదులుకుంటే మరల దొరకవేమో!' అని మరల వ్రాశాము. ససేమిరా వద్దన్నారు కుప్పుస్వామి శాస్త్రిగారు. అప్పుడు విద్యాశాఖ డైరెక్టర్ స్టోన్. ఆయనకు వివరించాము. ఆఖరుకు మా మాట నెగ్గింది."

కుమారిలుని మీమాంసా వార్తికాలకు ఆయన శిష్యుడు ఉంబేకుడు-భవభూతి వ్రాసిన వ్యాఖ్య ఈ "నారేయి" నంబూద్రి ఇంటిలోదే.

"ఉంబేకః కారికాం వేత్తి
తంత్రం వేత్తి ప్రభాకరః,
మండన స్తూభయం వేత్తి
నోభయం వేత్తి రేవణః"

అనే నా నుడి కలిగింది ఈ ఉంబేకుని వల్లనే.

"కేరళంలో ఒకచోట యోగభాష్య వివరణం దొరికింది. దాని సమాప్తిలో 'శంకరాచార్య విరచితం' అని ఉంది. ఇది శంకరాచార్య విరచితం కాదని మేమిద్దరమూ అభిప్రాయ పడ్డాము. (దీనిని మద్రాసు విశ్వవిద్యాలయం ద్వారా నేను ప్రకటించిన 'స్ఫోటసిద్ధి' అనే గ్రంథం పీఠికలో వివరించాను.) వెదకగా, వెదకగా ఒక విడితాటాకు మీద "పయ్యూర్ భట్టేరి ప్రణీతం యోగభాష్య వివరణం" అని దొరికింది, మా గుండె కుదుటబడింది. ఈ భట్టేరి పేరు శంకరన్ అట పూర్వాశ్రమంలో. సన్యసించిన మీదట శంకరాచార్యు డయ్యాడు. ఇంతగా మేము పరిశ్రమించి సత్యం ప్రకటించినా, ఆ గ్రంథం శంకరాచార్య విరచితమనే ఇటీవల ముద్రించారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారు."

శ్రీరామనాథశాస్త్రిగారి వద్దకు వెళ్ళితే ఈలాటి ముచ్చట్లు ఎన్ని సంవత్సరాలపాటైనా చెప్పేవారు. వారూ పది సంవత్సరాల క్రితం పరమపదించారు.

ఆరేడుసంవత్సరాలు ఇలా సాగింది. ప్రభుత్వము వారు ప్రాచీన గ్రంథ సంపాదనను ఆపేశారు. కవిగారు "దక్షిణభారతి" అనే గ్రంథమాల స్థాపించి సంస్కృత గ్రంథాలు ప్రచురించడం ప్రారంభించారు. ఈ గ్రంథమాలకు శ్రీరామనాథశాస్త్రిగారు సంయుక్త సంపాదకులు.

ఈ గ్రంథమాలకింద వెలువడిన మొదటిగ్రంథం నాలుగు భాణాల సంపుటి. దీనిపేరు 'చతుర్భాణీ'.

"వరరుచి రీశ్వరదత్తః
శ్యామిలక శ్శూద్రకశ్చ చత్వారః,

ఏతే భాణా బభణుః
కా శక్తిః కాళిదాసస్య?"

అని ఎవరో అజ్ఞాత విమర్శకుడు సవాలుచేసిన రూపక రాజాలివే. ఈ సంపుటిలో ఉన్నవి శూద్రకుని పద్మప్రాభృతకం, ఈశ్వరదత్తుని ధూర్తవిట సంవాదం, వరరుచి ఉభయాభిసారిక, శ్యామిలకుని పాదతాడితకం. ఇది ప్రకటితమైంది 1922లో.

రెండవగ్రంథం కుందమాల నాటకం. దిజ్నాగాచార్యునిది. మూడవది అవంతిసుందరికథా. ఇది దండి దశకుమార చరిత్రకు మూలమైన విస్తృత గద్యకావ్యం. నాల్గవది శూద్రకుని వత్సరాజ చరిత్రం. ఐదవది విజ్జికాదేవి రచించిన కౌముదీ మహోత్సవం. ఇలా పుంఖానుపుంఖంగా వచ్చాయి. అన్నీ అపూర్వాలే. అన్నీ రసగుళికలే.

నన్నెచోడుని కుమార సంభవంపై వాదోపవాదాలు చెలరేగినట్లే కుందమాల దిజ్నాగ కర్తృకమా, కాదా అని అప్పుడు దేశమంతటా గాలి దుమారం రేగింది. "జర్నల్ ఆఫ్ ది బిహార్ అండ్ ఒరిస్సా రీసెర్చ్‌సొసైటీ" పత్రికలో కవిగారి ప్రతిభను ముక్తకంఠంతో కీర్తించిన శ్రీ కె. పి జయస్వాల్ ఇది దిజ్నాగ కర్తృక మనడం సందేహాస్పద మన్నారు.

కుందమాలవి తంజావూరు, మైసూరు లిఖిత గ్రంథాలయాలలో చేరి రెండు అసమగ్ర ప్రతులు దొరికాయి. రెండిటిలో మొదలు లేదు. మరి రెండిటిలో చివరలేదు. మలబారులో మరిరెండు ముక్కలు దొరికాయి. అన్నిటినీ జోడించగా సమగ్ర నాటకమైంది.

"జయస్వాల్ అంతటివారు ఇది దిజ్నాగ కర్తృకం కాదంటున్నారే మీరేమీ సంజాయిషీ ఇవ్వరేమండీ?" అని కవిగారిని ప్రశ్నించా నొకసారి. "ఇదివరకే చెప్పానుగదయ్యా నా తత్త్వం, ఒకమాట ఒకబాణం. నా అభిప్రాయం ఒక్కసారే చెబుతాను. నమ్మితే నమ్మండి, లేకపోతే లేదు. నాకెందుకు? మొదలున్న కుందమాల లిఖిత ప్రతులలో "అరారావపుర వాస్తవ్య దిజ్నాగస్య" అని ఉంది. అరారావపుర మేదో మొదట మాకు తెలీ లేదు. కుమారదాసు రచించిన జానకీహరణ నాటకం దొరికింది ఇంతలో. దానిలోను అరారావపుర వాస్తవ్యస్య అని ఉన్నది అనూరాధపుర అనడానికి. కుమారదాసుడు అనూరాధపుర వాస్తవ్యుడని లంక చరిత్ర వల్ల తేలింది. మరి ఆ అరారావపుర వాస్తవ్యుడైన దిజ్నాగుడు ఎక్కడివా డౌతాడు?" అని ఆయన అన్నారు.

కుందమాల బొంబాయిలోని తత్త్వ వివేచనాఖ్య ముద్రణ యంత్రాలయంలో ముద్రించబడింది. దీని వ్యయభారం దేశోద్ధారక, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు భరించారు. సంపాదకులు తమ పీఠికలో వారికి కృతజ్ఞత తెలిపారు,

కాని ఈ గ్రంథమాల కొన్నేళ్ళ తర్వాత ఆగిపోయింది. కవిగారు మద్రాసు ప్రభుత్వం విద్యాశాఖలో చేరి రాజమండ్రి కళాశాలలో కొలువుకు కుదిరారు. రామనాథశాస్త్రిగారు మద్రాసు విశ్వవిద్యాలయం పరిశోధన శాఖలో చేరారు.

కవిగారు రాజమండ్రిలో ఉన్నప్పుడే భరతనాట్య శాస్త్రం అభినవగుప్తుని అభినవ భారతి అనే వ్యాఖ్యతోసహా సంస్కరించిపెట్టారు. దీని మొదటి సంపుటి "గాయక్వాడ్ ఓరియంటల్ సీరీస్" కింద 1925 లో ప్రచురించబడింది. అప్పటికి కవిగారు వాతావరణం, శీతోష్ణస్థితి పడనందున రాజమండ్రి వదలి తిరుపతిలో విద్యాశాఖాధికారిగా చేరారు.

భరతనాట్యశాస్త్రం 37 అధ్యాయాల బృహద్గ్రంథం. దేశం నాలుగంచుల నుండి సంపాదించిన 40 ప్రతులను తైపారు చేసి ఆయన పరిష్కృత ప్రతి సిద్ధపరచారు. చిదంబర దేవాలయంలో నాట్యకరణములు (విన్యాసాలు) గండరించి, వాటికింద భరతనాట్యశాస్త్రంనుంచి వాటికి తగిన లక్షణశ్లోకాలు కూడా చెక్కి-ఉన్నాయి. ఇవి దాదాపు 93 ఉన్నాయి.

ఇవి 13వ శతాబ్దిలో ఆ ప్రాంతాన్ని ఏలిన రాజ సింహదేవుని కాలంలో చెక్కబడ్డాయి. కవిగారు పురాతత్త్వశాఖ అనుమతితో వాటి ప్రతిరూపాలను తమ నాట్యశాస్త్రంలో ముద్రించడంతో నాట్యవేద జిజ్ఞాసువులకు లక్ష్యలక్షణ సమన్వయజ్ఞానం సులభ తమ మైంది.

భరతనాట్యశాస్త్రం నాలుగు సంపుటాల వరకే ముద్రించబడింది. "నా జీవితంలో పూర్తవుతుందో లేదో ఇది" అని ఆయన తరుచు అనుకుంటూ ఉండేవారు. అదే నిజమైంది.

అప్పుడే ఆయన తిరుపతి దేవస్థానం ప్రకటించే 'వేంకటేశ్వరా జర్నల్' లోను, ఇతర పత్రికల లోను అపూర్వపరిశోధనవ్యాసాలు వ్రాశారు. వేంకటేశోదాహరణం ప్రచురించారు. భారతిలో 'పుష్పాంజలి' అనేపేర పలువురు విస్మృత కవు లను గూర్చి అముంటిత విషయాలు వ్రాశారు. పూర్వం ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలోను ఉగాది సంచికలలోను అపూర్వ వ్యాసాలు వ్రాశారు. చింతామణి వేశ్యకాదని, ఆడక యోగిపేరని, కేరళ వాస్తవ్యుడని నిరూపించిన వ్యాసం గొప్పది.

ఈ సమయంలోనే గాంధర్వ వేదాధ్యాయులకు శాశ్వతమైన మహోపకారం చేశారు. అదే "భరత కోశ" గ్రథనం. ఇది భరతాది ప్రణీత నాట్య సంగీత శాస్త్ర గ్రంథస్థ పారిభాషిక పదకోశం. భరతా చార్యుడు, కోహలుడు మొదలు అర్వాచీన వరకుగల నాట్యశాస్త్రకారుల గ్రంథాలను ఆయన క్షుణ్ణంగా పరిశీలించి కూర్చిన మహానిఘంటు విది. కవిగారిని అమరులను చేసిన ఉద్గ్రంథ మిది. దీని పీఠికలో ఆయన ఇలా చెప్పుకున్నారు ;

"....ఖండాత్మకాః లబ్ధాః
తేషాం గ్రంథా స్స్వలోక్యచ,
అజ్ఞాత కర్తృకా స్సన్యాః
వాది మత్త గజాంకుశం
వీణా రహస్య నామానం
కుండలీ మణి దర్పణమ్,
నృత్తరత్నాకరం నాట్య
దర్పణం నాట్యలోచనమ్;
ఆంధ్ర ద్రవిడ కర్ణాట
దేశానాం చ వాఙ్మయమ్,
దృష్ట్వా గాంధర్వ వేదార్థం
కావ్యాలంకార లక్ష్మణి.
అనుతంత్రేచ భోజాది
నిర్మితా నతివిస్మృతాః,
అంతర్విగాహితుం సమ్యక్
దుస్సహానేక జన్మని
సంగృహ్య సమ్య గేతేభ్యః
సుశబ్దాన్ పారిభాషికాన్.
నిరుక్తాం స్తత్ర తత్రైవ
స్వాతంత్ర్య ముపహాయ చ,
నామ్నా భరతకోశోఽయం
విద్యా వ్యసనినాం ముదే,
రామకృష్ణేన కవినా
సార్థవర్ష ద్వయావధి.
ఏకోన సప్తతితమే
వయ స్యారచ్య లీలయా,
శ్రీ వేంకటేశ దివ్యశ్రీ
పాదయో రర్పితో ముదా.
అవర్ధంతాః ప్రమాదాశ్చ
సంభవేయుః క్వచిత్క్వచిత్,
అపాస్య దోషాన్ గృహ్ణంతు
పయస హంసాః జలమ్.
యథాగుణ మముం ధీరాః
జ్ఞాతవిద్యా పరిశ్రమాః,
ప్రీణాతు భగవాం శ్చాస్మిన్
వాగ్రూప కుసుమార్చనే."

69 వ ఏట ఆయన రచన యిది. అంతవరకు ఆయన చేసిన నాట్యశాస్త్ర పరిశ్రమ కిది పూర్ణఫలం. ఆయన నాటకపరిశ్రమకు కారణం భరతనాట్య శాస్త్రానికి అభినవగుప్తాచార్యుని టీకను అర్థంచేసు

కోడానికే; దానినే ఆయన భరతకోశం పీఠికలో ఇలా వివరించుకున్నారు :

"తత్పుత్రో రామకృష్ణాఖ్యః
పూర్వాచార్య వినిర్మితాన్
నష్టప్రాయా న్మహాగ్రంథాన్
సమన్వేష్టుం సముద్యతః.
భట్టాభినవగుప్తార్య
ప్రోక్తాఽభినవభారతీమ్
వ్యాఖ్యాం భరత సూత్రాణాం
మహార్థ గుణగౌరవామ్,
సంవాద్యతాః పరిజ్ఞాతుం
నిశ్శేషం నాట్య వాఙ్మయమ్,
ద్రష్టవ్య మితి నిశ్చిత్య
సోఽధ్యగీష్ట చిరాయ తత్."

దీనిని వేంకటేశ్వర ప్రాచ్యగ్రంథమాల ముప్ఫైయవ కుసుమముగా ప్రచురించారు.

భరతనాట్యశాస్త్రం ఎవరు పరిష్కరించి ప్రకటించాలి— అన్న విషయమై కూడ దేశంలో పెద్ద రభస జరిగింది. ఉత్తరదేశంవారు పలువురు శ్రీ ఎస్. కె. డేను సిఫార్సుచేశారు. కాని, శ్రీ జయస్వాల్ పట్టుపట్టి రామకృష్ణకవిగారు వినా మరొకరు దానిని ముట్టడానికి కూడా వీలు లేదన్నారు. విశాల దృష్టిగల పండితుల ఔదార్యం అలాటిది. కుందమాల కర్తృత్వంలో తనకు కవిగారితో అభిప్రాయ భేదం ఉన్నా, కవిగారి ప్రతిభా వ్యుత్పత్తులను గుర్తించినవాడు గనుక, జయస్వాల్ ముక్తకంఠంతో ఆయనను సమర్థించారు. ఆయన ఆశించినట్టే కవిగారు భరతనాట్యశాస్త్రాన్ని నిష్కృష్టంగా ప్రపంచానికి అందజేశారు. దాని మేలి మీగడగ పారిభాషిక పదకోశం కూడా సిద్ధపరచారు.

కవిగారి సంస్కృత కవిత కూడ అతిప్రౌఢంగా ఏ మాఘ భారవులనో తలపించేది. భరతకోశ మంగళ శ్లోకమే చాలు దానికి నిదర్శనం :

"ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రసాదాంతరితం జగత్
కృతం నాట్యాయితం యేన తం నమామి మహానటమ్"

ఇంతటి కవి, పండితులు పరిశోధకులు గనుకనే కవిగారిని ఎం. కృష్ణమాచార్యులు (ఎం. ఎ., ఎం. ఎల్., పి. హెచ్. డి.) తమ హిస్టరీ ఆఫ్ క్లాసికల్ శాన్స్క్రిట్ లిటరేచర్‌లోను, తదితర సాహిత్య చరిత్రకారులు తమ గ్రంథాలలోను ప్రమాణంగా పెక్కుచోట్ల పేర్కొన్నారు.

1935 కు తిరుపతి విద్యాశాఖాధికారి పదవి ముగిసింది. పిదప కవిగారు మద్రాసు విశ్వవిద్యాలయం చరిత్రశాఖలో మెకంజీరికార్డుల పరిశీలకులుగా నియమించ బడ్డారు. కర్నల్ మెకంజీ నూరేళ్ళక్రితం మద్రాసురాష్ట్రంలో సర్వేయర్ జనరల్‌గా ఉండేవారు. ఆయన నారాయణరావు, వేంకటరావు అనే ఇద్దరు బహుభాషావేత్తలను, బహ్వక్షరచణులను నియమించి రాష్ట్రంలోని వివిధ చారిత్రకాంశాలను సంగ్రహించి లిఖితం చేయించారు. అవే మెకంజీ రికార్డులు. వాటిని మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఆంగ్లంలో అనువదించడానికి కవిగారిని నియమించారు. ఈపని దాదాపు ఆరేళ్ళు సాగింది.

ఇంతలో తిరుపతిలో దేవస్థానంవారు ప్రాచ్య పరిశోధనాలయం నెలకొల్పారు; కవిగారిని సంస్కృతశాఖకు రీడరుగా నియమించారు. మరల అక్కడ పదిసంవత్సరాలు పనిచేశారు. కవిగారికి సహస్రమాసాలు ఎప్పుడో నిండాయి. కనుక ఆ ఉద్యోగంనుంచి విరమించవలసి వచ్చింది. ఇదే ఆయన కడపటి ఉద్యోగం.

చేతికి అందివచ్చిన పెద్దకుమారుడు. తన అభిప్రాయాలను, పథకాలను కొనసాగించగలడని నమ్మిన పెద్దకుమారుడు అంతకు ఇరవై సంవత్సరాల క్రితమే అకాలమరణం చెందడం, తక్కిన ఇద్దరు కుమారులూ తమ సంసారయాత్ర జరుపుకొనడంతోనే సతమతమౌతూ తమకు ఏ విధంగానూ తోడ్పడకపోవడం, ఈ దురస్థలో పెద్దకుమార్తె

భర్త కాలధర్మం చెందడం మున్నగు కష్టాలవల్ల కవిగారు అంత్యకాలానికి ముందు ఐదారేళ్ళుగా చాలా వ్యాకుల పడుతూనే ఉన్నారు. వీటికితోడు తగినంత డబ్బు లేకపోవడం. ఈ దుస్థితిని నాట్యశాస్త్రాభిమానులైన ఆచార్య శ్రీ పి. శ్రీరామ అప్పారావుగారు (ప్రస్తుతం తెలుగు ఏకాడమీ అధ్యక్షులు, రిసెర్చిస్కాలరు, పూర్వం మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంధ్రభాషాధ్యాపకులు) పెద్దలందరి సంతకాలతో కవిగారికి గౌరవభృతి ఇవ్వవలసిందిగా భారతప్రభుత్వానికి మహజరు పెట్టించారు. ఎంతో ప్రయత్నంమీద భారత ప్రభుత్వం కొంత, ఆంధ్ర ప్రభుత్వం కొంత గౌరవభృతి (దాదాపు 150 రూపాయలు) మంజూరు చేశాయి. ఆ ప్రయత్నంలోనే కవిగారు చెన్నపురికి వచ్చి కొంతకాలం పండితుల, మిత్రుల ఇంట గడిపారు. నెలరోజుల పాటు నాకు, నాఅర్ధాంగి అనంతలక్ష్మికి ఆయనకు సేవచేసే భాగ్యం లభించింది. అప్పటికే ఆయనకు మరపు ముంచుకొనివచ్చింది. అంగాంగాలు స్వాధీనం తప్పాయి. గౌరవభృతిని కొన్నినెలలపాటు అనుభవించారేమో; నాతో ఒకప్పుడు అన్నట్టు 'సెంచరీ' కొట్టలేకపోయారు. 91వ ఏటనే (1957) సెప్టెంబరు 21వ తేదీన) పరమపదం చెందారు.

ఆయన అకల్మష హృదయులు. అమాయికమైన మాటలూ (సాహిత్య వాదోపవాదాలలో కొందరు వేసే అపవాదుల మాటతో నాకు సంబంధం లేదు.) ఆయనతో పరిచయమున్నవారెవరూ మరువలేరు. యుక్తియుక్తంగా నచ్చజెబితే ఒప్పుకునే ఔదార్యం ఆయనది. ఈ సందర్భంలో శ్రీ ఎస్. కె. రామనాథ శాస్త్రిగారొక చక్కని ఉదాహరణ చెప్పారు.

"తాళపత్ర గ్రంథాలు చూస్తున్నప్పుడు వెంటనే ఏమి తోస్తే అది గుర్తుపెట్టుకోడం ఆయన స్వభావం ఒకమారు సిద్ధాంతసిద్ధాంజన మనే అద్వైత గ్రంథవ్యాఖ్యానం దొరికింది. దానిపేరు రత్న.... లికా అని ఉంది. రత్నతర్వాత ఒక అక్షరాన్ని పురుగు తినింది. కవిగారు దానిని రత్నబాలికా అని పూరించారు. 'బాలిక' అని ఉండడం అసమంజసం. తూలిక అని ఉండాలి. అంజనాన్ని పూసుకునేది తూలికతోకదా. ఇంతచిన్న సంగతి తెలీలేదే' అని శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు ఆక్షేపించారు. 'నిజమే. ఆతొందరలో తోచలేదు' అని కవిగారు అంగీకరించారు.

"మరొకమారు ఒక ఉత్తమపాఠం స్ఫురణకు వచ్చిందనుకోండి. అప్పుడాయన ఉబ్బితబ్బిబ్బు కావడమనేది కూడా లేదు ధ్వన్యాలోక లోచన వ్యాఖ్యలో ఒక ఘట్టంలో 'సన్నిహిత సహచరీ విరహకాతర క్రౌంచా క్రంద జనితః శోకః' అని ఉంది. దీనిని శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు చూచారు. "మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమః శాశ్వతీస్సమాః, యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్" అనే శ్లోకార్థానికి విరుద్ధంగా కనిపించింది సన్నిహిత అనే మాటను సన్నిహత (చంపబడిన) అని దిద్ది వేశారు. ఇప్పుడు అర్థం పూర్తిగా చెడింది. చంపబడింది సహచరి కాదు; సహచరుడే మానిషాద శ్లోకం ప్రకారం. కనుక దిద్దడం పొసగదు. క్రౌంచా క్రంద అన్నప్పుడు క్ర అనే అక్షరం స్పష్టంగా లేదు. కనుక సన్నిహిత అనే పాఠమే అట్టేపెట్టి ఏకశేషంచేసి, క్రౌంచాభ్యంద అని దిద్దితే సరిపోవడమే కాక మరింత మధురమైన అర్థం వస్తుందని మేము సూచించాము. మొదట రెండు పక్షులూ సన్నిహితమైనవి, తరవాత సహచరీ విరహకాతరమైనది మగపక్షి. వాటిని విడదీయడం వల్ల కలిగిన శోకం స్థాయిభావం అని వివరించాము. "సీతావిరహం, రాముని శోకం ధ్వనితమౌతాయి. క్వంది ర్గతిశోష ణయోః అన్నది ధాతువు. శోషణం వియోగం. దీన్ని కుప్పుస్వామి శాస్త్రిగారు అంగీకరించారు."

ఎన్నిరంగాలలో ఎంతకృషిచేసినా ఎంత విజ్ఞాన పాథోనిధులైనా మనను నిర్విరపోజేయగలరేకాని వినయ వినమితోత్తమాంగుని చేయలేరు. మనను నిర్మలమై మనిషిగా పెరిగినవారే మనను వినమ్రుల చేయగలరు. అట్టి మనస్వి కవిగారు.

తాళపత్రగ్రంథ సంపాదనపై ఆయనకున్న మోజు వర్ణనాతీతం, నిజమే. అలాటిది లేకపోతే చెన్న

పురిలో నేటిప్రాచ్యలిఖిత పుస్తక గ్రంథాలయమే ఉండదు. మనకు అపూర్వగ్రంథాలే కంటబడేవి కావు. తనదగ్గరకి వచ్చిన ప్రతివారినీ వెర్రిగా ప్రశ్నించేవారాయన. "ఏమైనా తాటాకుగ్రంథా లున్నాయా? మీతాడిమర్రి, చెయ్యేరు, ముక్తాపురం గ్రామాలలో పూర్వం మహాపండితు లుండేవారు. అక్కడ వెదికితే కొన్నైనా దొరక్కపోవు" అనే వారు నాతో. హనుమద్భరతం గురించి తరుచు అందరినీ అడిగేవారు. నేను లాహోరులో ఉన్నప్పుడు "అక్కడ నన్నెచోడుని కుమార సంభవం ఉందని విన్నాను. పాఠాంతరాలు వ్రాసి పంపవలసింది" అని జాబువ్రాశారు. శ్రీవిశ్వ బంధు శాస్త్రిగారి వేదిక్ బిబ్లియాగ్రఫీ లైబ్రరీలోను, ఇతరత్రాను దానికోసం గాలించాను. ఒక్కటి మాత్రం నిజమైంది. ఒక తాటాకులకట్ట మొదటి ఆకుపైన "కుమారసంభవం" అని వ్రాసిఉంది. దానినే ఎవరో భ్రమపడి కవిగారికి చేరవేసిఉంటారు. అది కొన్ని తెలుగు ప్రబంధ పద్యాల కట్ట. ఇలా కవిగారు తాటాకులకోసం ఎంతో వెచ్చించారు.

కవిగారి తీరనికోరిక ఒకటి తీరకనే మిగిలి పోయింది. అది ఆయన వ్రాసిన "వసంతవిలాస" మనే కావ్యప్రచురణ. కళాపూర్ణోదయానికి దీటు రాగల ప్రౌఢప్రబంధ మది. దానిముద్రణకు కనీసం నేడు నాలుగువేల రూపాయలన్నా కావాలి. మరి కవి గారి కిది సాధ్యమెలా? దాని ముద్రణభారమే కాదు! ఆయన వ్రాసిన వందలాది ఆంగ్ల విమర్శ వ్యాసాల ముద్రణ బాధ్యతకూడ ఆంధ్రావనిదే.

ఎంత చిన్నఉపకారం చేసినా మహాకృతజ్ఞత తెలిపే అత్యుదార మనస్తత్వం ఆయనది. ఈ ప్రవృత్తి ఆయనకే కాదు ఆయుగపు పండితుల కందరికీ ఉండేమో అనిపిస్తుంది. నేడు రచయితలు ఎంత ఉపకారంపొందినా ఇతరులకు కృతజ్ఞతా లవమైనా తెలుపడానికి ఇష్టపడరు. కాని కవిగారు తమ భరతకోశం నకలుచేసిన పెద్దమనిషికి కూడ నోరార, మనసార, కృతజ్ఞత తెలియజేశారు.

"నిష్కృష్య కవినా ప్రోక్తో
న్యాయవేదాంత వేదినా,
నృసింహ తాతాచార్యేణ
శ్రీమతా లేఖ సుష్ఠ్వయమ్."

ఏం? లేఖకునికి కృతజ్ఞత తెలుపకపోతే ఏం? అంటారుకదూ!

కవిగారు "దానం భోగో నాశః తిస్రో గతయో భవంతి విత్తస్య" అన్న భర్తృహరి సూక్తిని అక్షరాల నమ్మిన భోగి, త్యాగి, డబ్బున్నప్పుడు తాను తిని ఒకరికి పెట్టేవారు. తాను మంచి భోక్త, ఇతరులూ అంతటివారు కావాలనే ఆశపడేవారు. అంతగా తిండితినేవారు తెలివిగలవారు కాదంటారు సామాన్యంగా, మరికవిగారు అంతటి ప్రతిభాశాలి ఎలా అయ్యారు? ఆసూత్రానికి ఆయన అప వాదమే!

ఎంతోకాలం కవిగారి సహచరులై సంస్కృత భారతికి సేవచేసిన శ్రీ ఎస్.కె. రామనాథ శాస్త్రి గారిని గురించికూడ రెండు మాటలు తెలుసుకోక పోవడం సమంజసం కాదు మద్రాసు విశ్వవిద్యా లయం పదవికి విరమించిన తర్వాత ఆయన కోవూరు సంస్కృత కలాశాలలో కొంతకాలం అధ్యాపకు లుగా ఉన్నారు. నవ్యవిమర్శాదర్శః, పాత్రవిమ ర్శాదర్శః, ఆనందహృదయం, మణిమంజూషా, రామాయణీయ సౌభ్రాత్రం అనే సంస్కృత గ్రంథాలు రచించారు. కవిగారితో కలిసి, తర్వాతను విశ్వవిద్యాలయంలోను స్ఫోటసిద్ధివంటి శాస్త్ర గ్రంథాలు ప్రచురించారు. చివరిదశలో మైలాపూర్ లో కుమార్తెయింట గడిపారు. వారి ఇద్దరు కుమా రులలో ఒకరు రామకృష్ణమఠంలో చేరి ఇప్పుడు సింగపూరులో ఏకాత్మానంద పేరుతో సన్యాసం స్వీకరించారు.

తెలుగువారు ఎక్కడమెట్టినా తమజాతి గొప్ప దనం గుట్టలుపోసి, తెనుగుతల్లి కీర్తికి పట్టం కట్టారు అట్టిమహనీయులలో మానవల్లి రామకృష్ణ కవిగారొకరు. ఆయన ఆంధ్ర, సంస్కృత సరస్వ తులకు చేసిన సేవతో తెలుగుజాతి తరతరాలవరకు తలెత్తుకొని తిరుగుతుంది. ఆభవ్యమూర్తికి ఇవే నా నమోవాకాలు!

డా. యామాజీ దొణప్ప

# మరాఠీలోని తెలుఁగుమాటలు

'యద్వై వాఙ్ నాభవిష్య
న్న ధర్మో నాధర్మో వ్యజ్ఞాపయిష్యత్
న సత్యం నానృతం నసాధు నాసాధు
న హృదయజ్ఞో నాహృదయజ్ఞో
వాగే వై త త్సర్వం విజ్ఞాపయతి
వాచ ముపాస్స్వేతి.'

—ఛాందోగ్యోపనిషద్, 7-2-1.

పదునాలేండ్ల క్రిందటిమాట. 1954లో పూనా దక్కన్ కళాశాలవారి ఆధ్వర్యవమున నిర్వాహ మయిన భాషావిజ్ఞాన విద్యాలయము (Linguistic School) లో ఈ వ్యాసకర్త విద్యార్థిగా శిక్షణము నందుచుండిన కాలము.

## ప్రస్తావన

1954 డిసెంబరులో పాతికమంది మిత్రులతో పాటు అజంతాఎల్లోరాలు దర్శించుట తటస్థించినది. ఆ బృందములో ఆంధ్రులేగాక ఓడ్రులు, కన్నడి గలు, కాశ్మీరీయులు, తమిళులు, బెంగాలీలు, మరా ఠీలు, మలయాళీలు మున్నగువారుండిరి. పూనా తిరుగుపయనములో సహాధ్యాయులు మిత్రులు శ్రీ కె. జి. గుజరాతిగారిని ఉబుసుపోకకు జ్ఞానేశ్వరి లోని కొన్ని ఓవీలు— మరాఠీసాహిత్యములో ఓవీ యను ఛందములో వ్రాయఁబడిన పద్యములు ఓవీలు —చదివి వివరింపుఁడని కోరుట జరిగినది. ఆ ప్రసంగ మాంగ్లమునందే సాగినది. అప్పటికి జ్ఞానేశ్వరిని గూర్చిన స్థూలమయిన చారిత్రిక జ్ఞానము వ్యాసకర్త కుండెడిది. ప్రసిద్ధమయిన భగవద్గీతకు మరాఠీ భాషలో భావార్థ దీపిక యనుపేర ఓవీఛందములో సంతరింపఁబడిన విపుల వ్యాఖ్యాన రూప మిది. కర్తృనామమును పురస్కరించికొని భారవి మాఘ ముల వలె సంక్రమించినపేరు జ్ఞానేశ్వరి. ఇది ఇంచుమించు పదివేల ఓవీల గ్రంథము. ప్రసిద్ధ భక్తకవి జ్ఞానేశ్వర కృతము. మహారాష్ట్రీయ భాగ వత ధర్మపంథకు పరమప్రమాణము. అతిగహన మయిన వేదాంత తత్త్వరహస్యములను అరఁటి పండొలిచి చేతికందిచ్చిన రీతిగా అలఁతి యలఁతి పలుకులతో అమృతంపు గుళికలవంటి ఉపమలతో దిద్ది తీర్చిన రుచిర రచనము జ్ఞానేశ్వరి.

గుజరాతిగారు మొట్టమొదట చదివినది జ్ఞానేశ్వరి సంపాదకుఁడయిన ఏకనాథుని పద్యము. ఏకనాథుఁడు పదునాఱవ శతాబ్దివాఁడు. జ్ఞానేశ్వరి అనేకములయిన పాఠాంతరములతో, ప్రక్షిప్తములతో నిండి యుండఁగా బహు ప్రతులను పరిశీలించి కవి హృద యము నెఱిఁగి శాస్త్రీయముగా సాధుపాఠములను సవదరించిన సత్య సంశోధకుఁడు ఏకనాథుఁడు. గుజరాతిగారు పఠించిన ఆ పద్య మిది :

"జ్ఞానేశ్వరీ పాఠీ జో ఓవీ కరీలా మరాఠీ
తేణేం అమృతాచియో తాటిమ్ ఙాణవరీటీ శేవిలీ"

'జ్ఞానేశ్వరి పాఠములో ప్రక్షిప్తములను ఇముడ్చు వాఁడు అమృత పాత్రమున కొబ్బెర చిప్పను చేర్చు వాఁడు' అని దీనిఅర్థము.ఆయన వివరణము విన్న తరువాత 'చాంగు భళా' యను ప్రశంసాపదావళితో నా మెచ్చికోలును దెలిపితిని. "మీకు మరాఠీ వచ్చునా ?" యని గుజరాతి మహాశయుని ఆశ్చర్య భరితమయిన ప్రశ్న ! 'ఆరెబాస'తో నాకు బొత్తిగా పరిచయములేదని చెప్పితిని. ఆయన నమ్మలేదు. కారణమేమనఁగా 'చాంగు భళా' యను రెండును మరాఠీమాటలు; పాల్కురికి సోమనాథుని రచనము లలో ప్రశంసార్థకములుగా బహు వారము లివి

ప్రయుక్తము. 'ఏకనాథుని కెంత తెలుఁగు వచ్చునో నాకంత మరాఠీ వచ్చు' నని చమత్కరించితిని. 'ఏమి టేమిటి?' యని ఆయన కుతూహలము. 'ఠాటిమ్' లోని 'ఠాట' తెలుఁగువారి 'తట్ట' యని వివరించితిని. మాతోపాటు పయనము సేయుచున్న సహవ్రతులు మంగ్రూల్కర్ మొదలగు మరాఠీ మిత్రులను, పూనాలో ఆచార్యబాపత్ మున్నగు పండితులను సంప్రతించి 'ఠాట' తెలుఁగువారి సొంత మాట యని తీర్మానించిరి. ఆ తరువాత కొంత కాలము మరాఠీమిత్రుల శుశ్రూషచేసి మరాఠీలో మిడిమిడి జ్ఞానమును సంపాదించితిని. నేఁటికిని ఆ భాషలో పరిమితపరిచయము (working knowledge) తప్ప పరిగణింపఁదగిన ప్రవేశము నాకలవడలేదు. నాఁటినుండియు నేఁటిదాఁక ఆ చూపుతో జరిగిన పరిశీలనమువలని ఫలిత మీ వ్యాసము. భారతీయ భావసమైక్యము నావశ్యకత ప్రబలుచున్న ప్రకృతయుగమున ఈ రెండు భారతీయ భాషల పరస్పర ప్రభావమును గూర్చి పరిమిత పరిధులలో ప్రదర్శించిన యీ వ్యాసము మున్ముందు జరుగవలసిన పర్యాప్త పరిశీలనముకు ప్రస్తావనా ప్రాయము కాఁగలిగినచో వ్యాసకర్త ఉద్యమము ధన్యము.

## తెలుఁగు – మరాఠీలసంబంధము

తెలుఁగు - మరాఠీ భాషలు భౌగోళికముగా పరిసరస్థభాషలు. వ్యుత్పత్తిపరముగా పరస్పర విజాతీయములయిన ఈ రెండుభాషల మధ్యఁ గల కొన్ని సాదృశ్యములు చారిత్రక భౌగోళిక మత విషయక సాంస్కృతికాద్యనేక సంబంధముల మూలమున సంభావ్యములయిన ఆదాన ప్రదానములకు ప్రధాన నిదర్శనములు. మరాఠ్వాడా–తెలుఁగునాడుకుఁ గల ఇట్టి సంబంధ బాంధవములు ఇక్ష్వాకుల తాత ముత్తాతల నాఁటివి. దక్షిణాపథ పతులగు శాతవాహన చక్రవర్తుల పరిపాలనా కాలమునాఁడు మరాఠ్వాడా - తెలుఁగు నాడులు ఇంచు మించు నన్నూతేండ్లపాటు ఒక గొడుగునీడ కూడిమాడి యుండుట జగమెఱిగిన చరిత్రము. ప్రాకృత సాహితీక్షేత్రమున మధుర దర్శనమగు 'సత్తసఈ'-గాథాసప్తశతి—పై గాఢమయిన తెలుఁగు ముద్రకల దని సాహితీ సుగతుల స్వాగతము.

## ప్రాక్కాలికబాంధవము

మరాఠ్వాడాను ఏకాతపత్రముగా ఏలిన పశ్చిమ చాళుక్యవంశీయుల ఒక రెమ్మయేకదా సాగరాంధ్ర సీమల వేంగీ రాజమహేంద్రవరములు ఆలవాలములుగా ప్రాచ్యశాఖగా ప్రవర్తిల్లుట! ఆనాఁటి నుండియు ప్రాక్పశ్చిమ చాళుక్య ప్రభువంశముల మధ్య సాగిన నిరంతర జ్ఞాతి కలహములు చరిత్ర ప్రసిద్ధములు. పూర్వ చాళుక్య ప్రభువగు గుణగ విజయాదిత్యుని మహామాత్యుఁడును, సేనానియును నగు 'పండరంగు' ఈయదనున ముఖ్యముగా పేర్కొనవలసిన వ్యక్తి. ప్రభుపరముగా పండరంగు (క్రీ.శ. 849) నిర్వహించిన జైత్రయాత్రలు–నేఁటి మధ్యప్రదేశమునందలి మరాఠీమండలములకును విస్తరించినట్లు శాసన ఫలకముల కథనము. ధర్మవరము శాసనము ఎత్తుగీతియందు ప్రసక్తమయిన స్థలనామము లనేకము మరాఠ్వాడాలోనివి[1]. కిరణపురము మధ్యప్రదేశములోని 'బాలేఘాటు' మండలమునందలి కిరణపుర మను గ్రామము. చేది మండలమునకు అర్వాచీన నామము డహలదేశము. ఈ డహలము మధ్యప్రదేశములోని బుందేలు ఖండ ప్రాంతము. శాసనము నందలి 'డహలనిరుతము' డహల మండలములో నైరృతి భాగము. మధ్య ప్రదేశములోని నేఁటి 'ఏలిచ్‌పూర్' నాఁటి అచల పురమఁట![2] మరాఠ్వాడా తూర్పు పెల్లలోని దత్తవాడ, బార్సూరు, బైరంఘడ్ (బస్తరు) ప్రాంత

1. మల్లంపల్లి సోమశేఖర శర్మ, ధర్మవర శాసనములు, భారతి, విభవ చైత్ర సంచిక.

2. కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదువారి ప్రచురణ, 1963, పుటలు 3, 84, 156.

ములు నాఁటికిని నేఁటికిని అధిక సంఖ్యాకులగు ఆంధ్రుల కావాసములు. పూర్వోక్త ప్రాంతములలో చోడ వంశోద్భవులు, కరికాలాన్వవాయులు నిలిపిన ఆంధ్రభాషామయ శిలాశాసనములు ఆ భూముల యందలి తెలుఁగు ప్రభుతకు శాశ్వతాశాసనములు. పశ్చిమ చాళుక్య ప్రభువగు సోమేశ్వరదేవుని 'అభిలషితార్థచింతామణి' త్రిలింగ పరమేశ్వరులగు కాకతీయ చక్రవర్తుల రాజ్యతంత్ర నిర్వహణమునకు మార్గదర్శకముగా నుండినట్లు చరిత్రకారుల నిర్ణయము.

నెల్లూరి '.........మన్మ విభు పంపై పన్ని సైన్యంబు........ మాహారాష్ట్రసామంతు........ సారంగున్ దోలి తురంగమున్ గొనిన సంగ్రామము....' (నిర్వచనో. 1-43) తెలుగు - మరాఠీల సరాసరి సంబంధములకు చక్కనిసాక్ష్యము. దేవగిరి యాదవరాజుల పరిపాలనము మరాఠ్వాడా చరిత్రములో స్వర్ణయుగము. రామచంద్రదేవుఁడు (క్రీ.శ. 1271 - 1309) ఈ యాదవరాజులలో సుప్రసిద్ధుఁడు. ఇతని మహామాత్యుఁడే హేమాద్రి. క్రీ.శ. 1277 నాఁటి పంఢరపుర శిలాశాసనమునను, క్రీ.శ. 1279 నాఁటి ఉద్వాకదేవ శిలాశాసనము (ఆదిలాబాదు మండలము) నను పరికీర్తితుఁడయిన మహాప్రౌఢ ప్రతాప చక్రవర్తి శ్రీరామచంద్రదేవుని మహాప్రధాని యగు హేమాడియును, చతుర్వర్గచింతామణికర్త యగు హేమాద్రి పండితుడును అభిన్నులని చరిత్రకారుల నిర్ణయము. వ్రత దాన తీర్థ మోక్ష పరిశేషము లను నైదుఖండములలో సంగ్రథితమయిన విజ్ఞాన సర్వస్వమీ చతుర్వర్గ చింతామణి. యాదవరాజుల దేవగిరికిని, త్రిలింగ పరమేశ్వరుల ఓరుగంటికిని గల రాజకీయ సంబంధములు చిరకాల సమీచీనములు.

## రెడ్డిరాజుల కాలము

కాకతీయ పాలకుల కొలువులో మెలఁగి పాలకుల మెలఁకువ లెఱిఁగిన రాజనీతి కోవిదుఁడు ప్రోలయవేమారెడ్డి (క్రీ.శ. 1300-1353). ఓరుగంటి పతనముతో మధ్యాంధ్ర మహీమండలమున స్వతంత్ర పతాకమెత్తిన ఈ రెడ్డిబిడ్డ రెడ్డిప్రభువుల కుదురునకు మూల పుషుఁడు. రెడ్డిరాజులకు ఒండు రెండు తరములు పూర్వుఁడయిన హేమాద్రి పండితుని చతుర్వర్గ చింతామణికి సాగరాంధ్ర సీమలో నుండిన ప్రశస్తి ప్రచార ప్రభావములు అనన్యములు. చతుర్వర్గ చింతామణి త్రిలింగరాజ పరమేశ్వరు (కాశీ. 3-248) లను రెడ్డిరాజుల నిత్యానుష్ఠానముల యెడ ప్రమాణ గ్రంథముగా చెల్లుఁబడి యగు చుండినట్లును, అది వీరి విమల చారిత్ర శిక్షకాచార్యకము వహించినట్లును ప్రమాణములు బండ్లకొలఁది. రెడ్డిరాజులందఱును హేమాద్రి ప్రోక్త దాన పరులు; హేమాద్రి దాన చింతామణి బిరుద విరాజితులు. ఈ బిరుదములు కేవలము కులక్రమాగతములని కొట్టివేయ వీలులేదు. ఇవి రెడ్డిరాజుల వితరణ గుణ ప్రదర్శకము లయి, ప్రతిపదసార్థకములయిన బిరుదము లని వారి శాసనాదికములు ప్రత్యక్షసాక్ష్యము[3].

రెడ్డిరాజులు పెక్కురు 'ధారాపట్టణసార్వభౌమ సురధాణ్దర్పాపహార క్రియా ధౌరంధర్యము' కలవారు[4]. ధారానగరము రాజధానిగా మరాఠ్వాడా

3. శ్రీశైల శాసనము. A. R. No. 20 of 1915, క్రీ. శ. 1377; కుమారగిరిరెడ్డి అనవర్తి తామ్ర శాసనము, క్రీ. శ. 1390, రెడ్డి సంచిక పుట 381; తంగెడ శాసనము A. R. No. 380 of 1926, క్రీ. శ. 1391; అమీనబాద శాసనము, A. R. No. 543 of 1909, క్రీ. శ. 1415; పలివెల కొప్పేశ్వరస్వామి దేవాలయ కళ్యాణ మంటప స్తంభము మీఁది శాసనము, A. R. No. 503 of 1893 క్రీ. శ. 1416; మన్యమాపురపు శాసనము, Local Records, Vol III; రెడ్డిసంచిక పు. 41; ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము, పీఠిక, 19; నిశ్శంకకొమ్మన శివలీలా విలాసము, పీఠిక; శ్రీనాథుని కాశీఖండము, 5-1.

4. శ్రీనాథుని కాశీఖండము, 1-34, 1-68, 5-237, 6-309; భీమేశ్వర పురాణము, 1-29; నిశ్శంకకొమ్మన శివలీలావిలాస పీఠిక.

లోని ప్రాగ్భాగములందలి మాల్వా మండలము నాకాలమున పరిపాలించిన సులతానులే ధారాపట్టణ సార్వభౌములు. బహమనీ సామ్రాజ్యము బ్రద్దలగు దాఁక మరాఠ్వాడా తెలంగాణము లొక యేలుబడిలోని మాగాణములు మహారాష్ట్ర విజృంభణముతో దాక్షిణాత్య సీమలపై జరిగిన మరాఠీల దండ యాత్రలు చరిత్రప్రసిద్ధములు. టిప్పుసులతానుతో జరిగిన మైసూరు యుద్ధములలో విజయలక్ష్మిని చేపట్టుటకు ఇంగ్లీషు కుంఫిణీ వారికి బాసటగా నిలిచి నందున పశ్చిమాంధ్ర ప్రాంతము (అనంతపురము, కడప, బళ్ళారి మండలములు) మహారాష్ట్ర పాలకులకు పసదనపు వాటాగా నిర్ణీతమయినను కొన్ని రాజకీయ కారణముల వలన ఈ నిర్ణయము ఆచరణమునం దననూదితము; అనూదితమయి యుండినచో ఈ ప్రాంతముమీఁద మరాఠీ ప్రభావము ఇబ్బడిగా పడి యుండెడిది. ఆనంద రంగరాట్ఛంద కృతిస్వామియగు విజయానందరంగ పిళ్ళె 'తన పేరు విన్నంత దద్దరిల్లి మరాఠి ఫౌజు చీకాకుగాఁ బరువులెత్త....వాసి చెందిన (రంగరాట్. పీఠిక, 119) వాఁడు! నిజాముహయాములో మరాఠ్వాడా లోని ప్రాగ్దక్షిణ సీమయును, ఉత్తరాంధ్ర భూమి యును రాజకీయాది సంబంధములు కలవి. తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువుల ఆంధ్ర భాషా సేవ దక్షిణాంధ్ర యుగమున ఒక విశిష్ట లక్షణమునకు లక్ష్య భూతము.

**ఆరెబాస**

మరాఠీ భాషయును తద్వ్యవహర్తలును 'ఆరెము', 'ఆరె' అను నామములతో తెలుఁగునాట వ్యవహృతమగుటకు మధ్యయుగముల నుండియు ప్రమాణములు కోకొల్లలు. పండితారాధ్య చరిత్రము నందలి 'ఆరెపరుస'నడకలు సుపరిచితము(పండితా. పర్వత. పుటలు 381-387).....ఆరెలుఁ గన్నడీలరవలుఁ దెలుఁగులుఁ దన బిరుదందియఁ దవిలి కొలువ నెగడి....(ద్వా. 1-42)న వాఁడు సనదప్రోలి వెన్నయమంత్రి వెలనాటి చోడవంశాలంకారుఁడగు గొంక నృపాలుని కూర్చు మంత్రియగునీ వెన్నయామాత్యుఁడు పదుమూఁడవ శతాబ్ది వాఁడు. సింహాసన ద్వాత్రింశికాకర్త యగు కొఱవి గోపరాజు (క్రీ. శ 15వ శతాబ్ది) ఈ వెన్నయ మంత్రి కనంతరమేడవు తరమువాఁడు. అమీను ఖానుని తనయుఁడగు గతాతఖానుఁడు 'అరబి పారసి గుజరాతి యారె మచ్చ తెనుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ దారి గన్నట్టివాఁడు .... (యయా. 1-47). అమీనుఖానుఁడు యయాతిచరిత్ర కృతి పతి; గోలకొండనవాబు మల్కిభరాము (క్రీ. శ. 1550-1581) నొద్ద రాజకీయోద్యోగి ఆనాఁటి రాచవారలలో అనేకులు 'ధీరులు సన్నుతింప బహుదేశ లిపుల్ బహుదేశ భాషలున్ సార కవిత్వ సౌష్ఠవ రసజ్ఞతయున్ దమసూక్ష్మ బుద్ధిచే నేరిచినట్టి ....' (రామవిలాసము, పు. 35) వారు.

**పాండురంగ విఠలుని ప్రభావము**

మరాఠ్వాడా నడిగడ్డలో పంఢర పురమున వెలసిన పాండురంగవిఠలుని యెడ తెలుఁగు వారికిఁ గల భక్తి ప్రపత్తులను గూడ ఈ సందర్భమున లక్ష్యీకరించుట ఆవశ్యకము. మరాఠ్వాడాలోని భాగవతపంథవారు విఠలేశ్వరోపాసకులు. ఈ పంథలో ముఖ్యుఁడగు జ్ఞానేశ్వరుఁడు (క్రీ. శ. 1275 - 1296) ప్రముఖవ్యాఖ్యాత. కాకతీయుల కాలమునాఁటి ద్విపద రామాయణకర్త బుద్ధారెడ్డి యొక్క తండ్రి విఠ్ఠలాధీశుఁడు పాండురంగ విఠలనాథనామ చిహ్నితుఁడని పెద్దల యభిప్రాయము[5]. బుద్ధారెడ్డి పుత్రులలో విఠ్ఠల భూపతి నామాంకితుఁ డొకఁడు కలఁడు[6] ద్విపదరామా

5. 'మా తండ్రి విట్ఠల క్ష్మాధీశుపేర ........... శ్రీరామ చరిత - మొప్పఁజెప్పెద ...........' అని రంగనాథ రామాయణావతారిక, క్రీ. శ. 13వ శతాబ్ది.

6. 'భూనుతుఁడగు గోన బుద్ధ భూవిభుని - సూను లుదారులు సుగుణ భూషణులు ఘనుఁడు మీసర గండ కాచ భూవిభుఁడు-వినుత పుణ్యుండగువిట్ఠ భూపతియు రచియించి రుత్తర రామాయణంబు....... కాండాంతము, ఉత్తర కాండము, ద్విపద రామాయణము).

యణ కర్తృత్వ వివాదమున బుద్ధారెడ్డికి ప్రతివాది యగు రంగనాథుఁడొకఁడు మన తెలుఁగు కవుల జాబితాలో చేరినాఁడు. మఱి, ఈరంగనాథుఁడు భీమరథీ సరిత్తటమునందలి పాండురంగ విఠ్ఠల నాథునిపేరిటివాఁడో, ఉభయ కావేరీ మధ్యము నందలి శ్రీరంగనాథుని పేరిటివాఁడో చెప్పలేము. రెండవ యూహమే సత్యస్వరూపమునకు సమీపము కావచ్చు. పాండురంగ విఠ్ఠల నామధేయులగు శతాధికవ్యక్తు లానాఁడు తెలుఁగు నాట నున్నట్లా నాఁటి శాసనములు సాక్ష్యము.

### తెలుఁగుసాహితి :
### పాండురంగ విఠలుని ప్రశస్తి

శిల్ప కళాసీమ యనఁదగిన విఠలరాయ దేవాలయమును పాండురంగ సేవాసావధానులగు విజయనగరాధీశులు హంపి విజయనగరములో నిర్మించుట తెలుఁగువారికి క్రొత్తకాదు. తెనాలి రామకృష్ణుఁడు (క్రీ. శ. 1510 - 1580) పాండురంగక్షేత్ర మాహాత్మ్యమును ప్రబంధరూపమున పంచాశ్వాస పరిమితముగా నాంధ్రమునఁ బ్రపంచించినాఁడు. పాండురంగక్షేత్ర మూర్తుల ప్రసక్తి విడిగా ఆంధ్ర సాహిత్యములో లేక పోలేదు. 'పండరంగి నుండి వచ్చి...' (తాళ్ళపాక. శృంగార సంకీర్తనలు, కీర్తన 26, పు. 19), 'పాండురంగ మందలి విఠలునకు సాష్టాంగంబు' (ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, 880), 'వినోదకాఁడ వౌదువు విఠలేశ్వరా – వినుతించ నెట్టువచ్చు విఠలేశ్వరా...పాండురంగమునా చల్లగా నెలకొంటి జయ విఠలేశ్వరా (తాళ్ళపాక. అధ్యా. సంకీ. సంపుటి X, సంకీర్తన 171), 'పాండురంగమునఁ బాటిలు విఠ్ఠలదేవునకు సదా దిగ్విజయము లని.' (హంస. 4-214), 'వసుధఁ జూడఁ బిన్నవానివలె నున్న వాఁడు – వెస నన్నివిద్యలాను వెలసె విఠ్ఠలుఁడు... గట్టిగాఁబుండరీకుడు కడువేడుకఁ బెట్టిన–ఇట్టికపీటపై నున్నాఁడీ విఠ్ఠలుఁడు' (తాళ్ళపాక. అధ్యా. సంకీ. సంపుటి VI. సంకీ. 217), '....భైమి దక్షిణ దిక్తట ప్రాంతభూమి సకలదివిజులతోడ సాక్షాత్కరించి పుండరీకుని మనిచిన పాండురంగ విఠలాధీశు ....' (ఘటికా. 1-65).

### మాహురమ్మ

కాకతీయుల కాలమున ఏకశిలానగరముననేగాక తెలుఁగు సీమలో పలు తావుల కాకతమ్మకు సైదోడుగా, మాహురమ్మక్కనాచిగా, ఎల్లమ్మదేవరగా, బవనీల జవనికపాటల పరశురాముని కథలెల్ల పాడించిన ఏకవీరా మహాదేవిగా జాతరలలో తెలుఁగువారి పూజలఁగొనిన (క్రీడా. పు. 41-45) దేవతామూర్తి మరాఠావారికిని పరదేవతామూర్తి. మాహురగ్రామ నివాసిని యగుటచే పరశురాముని తల్లి రేణుకాదేవి మాహు(హూ)రమ్మగా వ్యవహరింపఁబడినది. ఈ మాహుర ఆదిలాబాదు మండలము కిన్వట్ తాలూకాలో నేఁటి 'మాహుర'యను గ్రామము. మాతాపురము దీని పూర్వనామము. సమస్తలోక జనని శ్రీఏకవీరాంబికకు సంవాసస్థానమగుటచే మాతాపురనామము సర్వథా సార్థకము. క్రీ. శ, 1279 నాఁటి ఉజ్ఞాకదేవ (< ఉష్ణోదక దేవ=శ్రీరామచంద్ర) శిలాశాసనమున మాతాపుర నివాసియును, శరణనాయకుని కుమారుఁడును నగు నొక శిల్పి పేర్కొనఁబడినాఁడు. మాతాపురమే మరాఠీ భాషలో మాహురగా మార్పు చెందినది (మాతాపుర > మాఆవుర > మావుర > మాహుర). ఉజ్ఞాకదేవక్షేత్రమునకు పడమరగా పదికోసుల దూరమున మాహూర గ్రామ మున్నది. పంచకృష్ణ పంథ (మహానుభావ పంథ)కు చెందిన దత్తాత్రేయ భక్త కోటికి నేఁటికిని మాహూర ముఖ్యకేంద్రము.[7] 'మండపాకను బెనుఁబాక మాహురమున – నాగవరమున పోలాస ననిచె నింతి – ఓరుగంట వసించె నీలోత్పలాక్షి-కాకతమ్మకు సైదోడ ఏకవీర' (క్రీడా. పు. 42) అను క్రీడాభిరామ కర్తృ సాక్ష్యము సైత మిఁట అనుసంధింపఁ దగినది. 'నెయ్యంపుఁ

7. Prof. S. G. Tulpule, An old Marathi Reader, Venus Prakashan Poona, 1960, P. 94.

గొడుకుచే ముయ్యేడుసారులు సుక్షత్త్రియకులంబు నిక్షత్త్రముగఁ జేయించి హైహయరాజ దంతాస్థి పటలంబు గవడపేరుగఁజేసికొన్న కోపకత్తె'కావున మాహురమ్మయే ఏకవీరాదేవి, మాహురమ్మయే నేఁటి తెలుఁగునాటి గ్రామదేవత యగు మారెమ్మ. ఏతద్దేవీ ప్రభావసూచకములగు మారెక్క, మారెప్ప, మారెమ్మ యను వ్యక్తినామములు పశ్చిమాంధ్రమున అతిప్రచురములు. తెలుఁగునాట బవినీంద్రు మొదలగువారు పాడు రేణుకకథ, పరశురామపురాణములు కూడ నిందులకు ప్రబల నిదర్శనములు.

## మరాఠీ సంస్కృతి ప్రభావము

తెలుఁగునాటిని చనిననాళుల ఉజ్జూత లూఁగించిన నవనాథ సంప్రదాయమునకు మరాఠ్వాడా జన్మభూమి. ఈ సంప్రదాయమున కాద్యులయిన మత్స్యేంద్ర గోరక్షనాథుల గాథలు, బోధలు ఆంధ్ర సాహిత్యక్షేత్రమున ఒకనాఁడు ముక్కారు పంట పండించినవి. పత్తికొండ సీమ (కర్నూలు మండలము)కు చెందిన ఆరెమరాఠీల కథయు, పానుగంటి సీమ (తెలంగాణా)కుచెందిన మాయలమరాఠికథయు తెలుఁగు పిల్లలకుసైతము కొట్టినపిండి! తెలుఁగు దేశములో రెడ్డి (మునసబు లేక పటేలు), కరణము (పట్వారీ), వెట్టి, తలారి మొదలగు పండ్రెండుగురు గ్రామోద్యోగులను 'బారాబలూతి' (< మరాఠీ—బారా = పండ్రెండు; బలుతేఁ = గ్రామోద్యోగుల స్వామ్యము)అని వ్యవహరించువాడుక మహారాష్ట్రుల నుండి సంక్రమించిన సంప్రదాయము. నిన్న మొన్నటిదాఁక పశ్చిమాంధ్ర ప్రాంతముల ప్రబల ప్రచారములోనుండిన 'బాళబోధ్' లేక 'భాళబంధు' లిపి సంప్రదాయము మహారాష్ట్ర సంస్కృతి ప్రభావమునకు మఱియొక మచ్చుతునుక.[8] ఇప్పటి తెలుఁగువారు చాలమంది తమనామముల చివర తగిలించుకొను 'రావు' (< మరాఠీ. రావ, రావో < ప్రాకృత రాయ — < సంస్కృత. రాజ-) మరాఠీ వారిది (జీవాజీరావు సిందియా, పీష్వా బాజీరావు, మురారిరావు ఘోర్పడే; యశ్వంతరావు హోల్కార్, సిద్ధోజిరావు ఘోర్పడే). ఆంధ్రదేశములో – ముఖ్యముగా ఆవులన్న. కడమలకుంట. కర్నూలు, కాకినాడ, గుంతకల్లు, మాధవరము, రామదుర్గము-పరిసరముల యందలి తోలుబొమ్మలాటలవారు మహారాష్ట్రులు. పశ్చిమాంధ్ర ప్రాంతములఁ గన్పించు హరికథాకథకులు చాలమంది మహారాష్ట్రులు. తెలుగు సీమతోని సంచారజీవు (Gypsy Tribes) లగు సుగాలీలు( = తండాలు లంబాడీలు, బంజారాలు) మరాఠీగుజరాతీ భూములకు చెందినవారు. మరాఠీ గుజరాతీ భాషాసమ్మిశ్రముతో, స్థానికాంధ్ర మాండలిక సాహచర్యముతో వికృతి నొందిన వాగ్రూప వ్యవహారము వీరిభాష. మరాఠ్వాడాకు వలసపోయి స్థిరపడిన తెలుఁగులు నేఁటికిని నాగపురము, పూనా, బొంబాయి, షోలాపురము-మున్నగు నగరములలో లక్షలకొలఁదిగాఁ గన్పట్టుచున్నారు. మరాఠీభాషా ప్రభావముచే మార్పాటొందిన తెలుఁగు మాండలికములు కామాటీ, కొంటావు, బేరాది, వడరి-మున్నగునవి తెలుఁగు-మరాఠీభాషల పరస్పర ప్రభావమును మఱింత త్వరితపఱిచియుండుటయు సుసంభవము.[9] తెలుఁగు కన్నడిగల ఉగాదియును మరాఠీల ఉగాదియును ఒకనాఁడే! ఏకారణము వలననో తెలుఁగులతోపాటు మరాఠీలును పంచద్రావిడులలో ఒకరుగా పరిగణితులు.

## మరాఠీపై తెలుగు ప్రభావము

మరాఠీ బాలుర'విటిదాండు' (గోడుంబిళ్ళ. చిల్లాకట్టె లేక బిళ్ళంగోడి) ఆట లెక్కింపునందలి వకట, లేండ, మూండ, నాల, ఆర. వైద-అను అంకెలు క్రమముగా తెలుఁగునందలి ఒకటి, రెండు, మూడు నాలుగు, ఆఱు. ఐదు – అనువానికి వికృతులు. మరాఠీలో ఈ ఆటయందు 'ఆర' అనఁగా

8. తిరుమల రామచంద్ర, మనలిపి పుట్టు పూర్వోత్తరాలు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1957, పుటలు 164-166.

9. Sir G. A. Grierson, Linguistic Survey of India, Vol IV, pp. 594 - 618.

'అయిదు' అనియు 'వైద' అవఁగా 'ఆఱు' అనియు వ్యవహారము. మూల భాషా పదముల అర్థము స్పష్టముగా తెలియక పోవుటయే పరిగణన క్రమమునందలి ఈ తబ్బిబ్బునకు మూలము. ఆఱేడు శతాబ్దముల క్రిందటిమాట! మరాఠ్వాడాలో పంద్రెండేండ్లు పెద్ద వఱపు పట్టి, కఱవుపై కఱవు రాఁగా 'ఆరె' జనులు ఆబాలగోపాలము సుభిక్షమగు తెలుఁగు సీమకు వలసవచ్చి నిమ్మళముగా బ్రదికి బట్టఁగట్టిరఁట! తెలుఁగువారితోడి ఆ పంద్రెండేండ్ల సావాసము ఊరక పోలేదు. "సోఁగాదొప్పియు నెత్తమున్ మొదలుగా జూదంబు"లలోని పరిభాష యంతయు మరాఠీవారి ఆటలనుండి తెలుఁగున దిగుమతి యయినది.[10] తెలుఁగు పిల్లల ఆటపాటలను మరాఠీ బిడ్డలు నేర్చిరఁట! తెలుఁగు అంకెల పరిభాషతోఁ గూడిన నేఁటి మరాఠీబాలుర 'విటిదాండు' ఆట దీని కొకసాక్ష్యము. ఇది తెలుఁగువారి గొప్పకు ఆచార్యదేశీయులు చెప్పెడి అన్యోన్య ధన్యతా కథనము వంటిది కాదు; ప్రత్యక్షరమును ప్రమాణబద్ధము. విశేషించి మరాఠీపండితులును, చరిత్రకారులును అంగీకరించిన యంశము,[11] 'These words (Vaket, lend, mund, nal, ar, vaid are of Telugu language as the game is supposed to have originated in Telangana, a province in Southern India.'[12]

దంత్య చజల ఉనికి

మరాఠీభాష యందలి దంత్య చ, జ (చే, జే)ల ఉత్పత్తి వికాసములకు తెలుఁగు భాషతోడి సంసర్గ సంబంధమే హేతువని కాల్డ్వెల్, జాన్‌బీమ్స్, హాయర్నెల్, ట్రంప్-మున్నగు భాషాతత్త్వ పరిశీలకుల నిర్ణయము.[13] భారతీయభాషలలో తెలుఁగు మరాఠీలలో మాత్రమే దంత్య చజలు ప్రచురము. ఈ రెండుభాషలలోను దంత్య చజలు (దంత్య స్పృష్టోష్మములు) (tip alveolar affricates) తాలవ్య చజల (తాలవ్య స్పృష్టోష్మముల (Blade alveolar affricates) కు సవర్ణములే (allophones) కాని ప్రత్యేకవర్ణములు (phonemes) కావు. తాలవ్యాచ్చులు (Front vowels ఇ ఈ ఎ ఏ లు) పరముగా వచ్చినపుడు తాలవ్యములుగాను, తాలవ్యేతరాచ్చులు (non-front or Back vowels అఆ, ఉఊ, ఒఓ లు) పరముగా వచ్చినపుడు దంత్యములుగాను చజలు పరస్పర పరిహారకసన్నివేశముల (complementary distribution)లో ప్రవర్తితములు. మరాఠీలో ప్రాచీన తద్భవములందలియు, అవిజ్ఞాత ప్రకృతికములగు

10. నాచనసోమన, ఉత్తర హరివంశము, వావిళ్ళవారి ప్రచురణ, చెన్నపురి, తృతీయా. 120,129.

11. కృష్ణాజి పాండురంగ కులకర్ణి, మారాఠీ వ్యుత్పత్తికోశ్, ఐతిహాసిక వ తౌలనిక, కేశవభికాజీ ధవళేవారి ప్రచురణ, ముంబఈ 1946, పు. 596; సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదువారి ప్రచురణ, ద్వితీయ ముద్రణము, పుటలు 84, 85.

12. Dattatreya Chintamani Mujumdar, Encyclopaedia of Indian Physical Culture, Shree Ram Vijaya Printing Press, Rospura, Baroda, 1950, P. 85.

13. John Beams, A camparative grammar of the Modern Aryan Languages of India, London 1872. Vol I, Introduction, P. 72; Rt. Rev. Dr. Robert Caldwell, A comparative Grammar of the Dravidian or South Indian Family of Languages, Trubner & Co, London, Second Edition, 1875, P. 25; Sir George A. Grierson, Lingustic Survey of India, Calcutta, 1905, Vol VII, Introduction, p. 22; R. V. Jahagirdar, Kanerese Influence on old Marathi with special reference to Jnaneswari, Annals of the Bhandarkar Oriental Research Intitute, Vol XI, pp 374-397; Dr. C. Narayana Rao, History of Telugu Language, A. U. Publication, Waltair 1937 Vol I pp. 195, 196; కులకర్ణి, పూర్వోదాహృతము, ప్రస్తావన, పుటలు 62, 63.

దేశజములందలియు చజలు తాలవ్యేతర స్వరఘటితము లయినపుడు దంత్యస్పృష్టోష్మములు. మరాఠీలోని ప్రాచీన తద్భవము లందలియు, అవిజ్ఞాత ప్రకృతికములగు దేశజములందలియు చజలుతాలవ్య స్వరఘటితములయినపుడు తాలవ్యస్పృష్టోష్మములు. స్పృష్టోష్మము లనఁగా తెలుఁగున చవర్గీయ ధ్వనులు. మరాఠీ భాషావిజ్ఞాన చరిత్రకారుల పరిభాషలో ధ్వనులు అర్థస్ఫోటకములు.[14] వీని యుచ్చారణ మందు స్థానకరణముల సంపూర్ణస్పర్శ ఒక ముఖ్య లక్షణము. నిశ్వాస స్తంభన సమయము (on set) నందు స్పర్శస్వభావమును, నిశ్వాసస్ఫోటన సమయము (release, మోక్షణము) నందు ఊష్మ స్వభావమును క్రమముగా నీధ్వనుల యుచ్చారణ రీతి యందిమిడియుండుటచే స్పృష్టోష్మములను పరిభాష వీని యెడల సార్థకము. చవరీ (=సవరము), చాఊడీ (=చావడి), చునా (=సున్నము), చోఖ (= చొక్కము). చోజ(=చోద్యము), చౌదా (= పదు నాలుగు), జవక(=జంట), జాఇ(=జాజి). జువార (=జూదరి), జూఁ(=జూదము), జోడీ(=జోడు) — ఈ మరాఠీ మాటలయందలి చజలు దంత్యములు. చిముటా(=మంగలివాని చిమ్మట), చేడా(=పిశాచి), జిణేఁ(=బ్రదుకు), జీభా(=జిహ్వ), జేథ(=ఎక్కడ, యత్ర) - ఇందలి చజలు తాలవ్యములు.

## మరాఠీ కవుల పాత్రము

అనాదియును, అవిచ్ఛిన్నమును అయిన ఇట్టి సమీప సంసర్గ సంబంధముల వలన ఈ రెండు ప్రాంతములలోని వ్యవహారభాషలు పరస్పరము ప్రభావితమయి యుండుననుట నిర్వివాదవిషయము. తొలినాళ్ళలో ఈ ఆదాన ప్రదానముల మాహారాష్ట్రి పాకృతము ప్రముఖ పాత్రము వహించినట్లు చరిత్రము. క్రీ. శ. పం్రెండవు శతాబ్ద్యనంతరము మాహారాష్ట్రి ప్రాకృత పుత్రికయగు మరాఠీభాష ఆ స్థానము నాక్రమించుట సుస్పష్టము. ప్రగాఢమయిన ఈ సంబంధముల మూలమున తెలుఁగు నుడు లెన్నియో మరాఠీవారి నోళ్ళలో నలుగుడువడి వ్యావహారిక రూపములుగా మరాఠీకోశముల కెక్కియు, మరాఠ్వాడాలోని కవిపండితుల సమ్మతిని బడసి సాహిత్యస్థాయిని సంపాదించియు అక్షర రూపమున చిరస్థాయి యయినవి. చక్రధరుఁడు, జ్ఞానేశ్వరుఁడు, తుకారాము, నామదేవుఁడు, భాస్కర భట్టు, మోరోపంతు-మొదలగువారు మరాఠ్వాడాలో విశేషవ్యాప్తి నందిన మహానుభావ పంథ, మహారాష్ట్రీయ భాగవత ధర్మపంథ, భక్తిమార్గము-లకు చెందిన భక్తకవులు. తెలుఁగునాట శివకవులవలె మరాఠ్వాడాలో వీరు మాన్యులు. ప్రబోధ వాహకముగా వీరు స్వీకరించినది ప్రజారంజకమయిన సమకాలిక వ్యావహారిక భాష. ఝటితిస్ఫూర్తిని, చమత్కార సమృద్ధిని దృష్టియందిడికొని మాతృభాషలో ప్రచుర వ్యవహారముగల అన్యభాషా పదములను సైతము సాహితీలోకశ్రీకములుగా తమ రచనములలో పొందుపటిచి రససిద్ధిని, లక్ష్యశుద్ధిని సాధించిన కీర్తిమూర్తులు మరాఠీమహాకవులు.

## పూర్వ పరిశీలకుల కృషి

ఇట్టి ఆదాన ప్రదానములు నిదానముగా మరాఠీ భాషలో మచ్చికపడిన తెలుఁగుమాటల తీరుతెన్నులను గూర్చి విశదీకరించుట ఈ యుద్యమము పరమార్థము. ఆచార్య శ్రీ కృష్ణాజీ పాండురంగ కులకర్ణి - బొంబాయి ఎలిఫిన్స్టన్ కళాశాలలో మరాఠీ భాషా శాఖాధ్యక్షులు— తమ మరాఠీ వ్యుత్పత్తి పద కోశము ప్రస్తావన (పు. 100)లో మరాఠీలోని తెలుఁగు పదములనుగూర్చి చర్చించుచు అడసణ, అనారస, అరవార, ఆర, ఓడు, కరఢా, కాచకా, కుడుక, మిడుక, కోడీ, గజగా, చక, చావమ్యావ, చేక, జాడ, ఝాక్క, టాలా(తాళా), నాలబరద,

14. నారాయణ గోవింద్ కాశేల్కర్, మరాఠీ ధ్వని విచార, పూనా, 1955, పుటలు 4 ,46,159; స్పృష్టా స్పృష్టములని. శుద్ధతాలవ్య దంతతాలవ్యము లని కులకర్ణి వ్యవహారము. చూ. కులకర్ణి, ప్రస్తావన, పు. 62.

బురగుండా, ముండ, లేంత, వకట, వయిస, శికే కాయి – ఈ యిరువదినాలుగును తెలుఁగునుండి మరాఠీవారు ఎరవుతెచ్చుకొనిన మాటలుగా పేర్కొనిరి, అదేమి మాయయోగాని ఇందులో అడసణ, అనారస, ఓదు, కావకా, కోడే, చావమ్యావ, చేక– ఈ ఏడును కులకర్ణిగారు కూర్చిన నిఘంటు భాగమున గైరుహాజరు. ఈ గైరుహాజరు బాపతు తెలుఁగు సరకు కూడ కాదులెంకి! అరవార (పు.40), కరడా (పు.140), కుడుక (పు.172), గజగా (పు. 217), శికేకాయి (పు. 740) – ఇవి కన్నడ పదవికృతు లని ఏతన్నిఘంటు భాగమున ఉట్టంకితము. జాడ (పు. 309) సంస్కృత 'జాడ' శబ్దభవముగా నిరూపితము. తాళ (గా) (పు. 378) సంస్కృత 'తాళక శబ్దజన్యమని ప్రదర్శితమయినది. దీని రూపాంతరముగా అంగీకృత మయిన టాళా (శే) (=తాళము) తెలుఁగు తాళమునుండి యని నిర్ణీతమగుట చింత్యము. బరడ (పు.637) తమిళపదముగా నిర్ధారితము. చక (చకనామ, చకబండి), రూక్క ఇవి తెలుఁగుమాటలు కానేకావు. కాగా వీరి సూచనముల మూలమున ప్రకృత వ్యాసకర్తకృషిలో ప్రత్యక్షముగా ఉపకరించిన ఆరోపములు (entry words) ఆ యిన్నొక్కటి మాత్రమే. తక్కినవి వ్యాసకర్త సుదీర్ఘ పరిశోధనము వలన నిర్ణీతములు. ఈ పట్టిక సమగ్రము కాకపోవచ్చు. వ్యాసకర్త చూపునకందని ఎరవు మాటలు మఱికొన్ని యుండవచ్చు. పదపట్టికలోని ప్రధానారోపములు (main entry words) ఏఁబది; ఉపారోపములు (sub-entry words) ఇరువది యెనిమిది. ఉపారోపములు ప్రధానారోపములకు రూపాంతరము (variants) లగుటచే ప్రధానారోపములకు మాత్రమే పదపట్టికలో వరుస సంఖ్య ఈఁబడినది. సమీపమాతృకను స్థాపించుటలో స్పష్ట ప్రతిపత్తి నిమిత్తము ఇతర భారతీయ భాషాపదము లావశ్యక స్థలముల నుద్ధృతములు.

## పదపట్టిక[15] (Etymological Index)

*అడకితా ;* చూ. అ డ కి త్తా (Candy[16] పు. 83).

1. *అడకిత్తా :* రూ. అడకితా, ఆడకిత్తా- పోఁకలను ముక్కలు చేయుటకు వాడు కత్తెరవంటి సాధనము (కులకర్ణి పు. 19). < తె, అడకొత్తు; క. అడకొత్తు, అడకోతు, అడగత్రి.

2. *అడాలు :* భయము (జ్ఞానేశ్వరి). జ్ఞానేశ్వరిలో ఈ పదము ప్రయుక్తమని కులకర్ణి. కాని జ్ఞానేశ్వరిలో నిది మృగ్యము. అడదరు(=భీతి, కంపము) అనుపదము మాత్రము జ్ఞానేశ్వరి(అధ్యా. 1 ఓవీ, 107)లో ప్రయుక్తము. కులకర్ణిగారు పరిశీలించిన ప్రతిలో 'అడాలు' ఘటిత పాఠము కలదేమో ?

< తెలుఁగు, అడలు : భయము. మరాఠీమాట కన్నడమునుండి ఎరవు తెచ్చిన పదమని కులకర్ణి (మరాఠీ వ్యుత్పత్తికోశ ఐతిహాసిక వ తౌలనిక, కృష్ణాజీ పాండురంగ కులకర్ణికృతము, కేశవభికాజీధవళే, ముంబఈ వారి ప్రచురణము, 1946, ప్రస్తావన, పు. 99). కాని కన్నడము నందలి 'అడలు' నవీనమనియు, తెలుఁగు నుండి ఎరవు తెచ్చినది కానగు ననియు ఆచార్య శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారి ప్రతిపాదనము[17].

3. *అల్లడ :* అల్లరి (కులకర్ణి 43). అమాయకత్వము.

< తె. అల్లరి, ఆలరి=దుస్స్వభావము; కొంటెతనము.

4. *ఆటపాట :* బాలికల ఒక ఆట (కులకర్ణి, 62).

< తె. ఆటపాట. ఆట + పాట(=ధ్వని వాచక శబ్దములు కానోపునని కులకర్ణి).

5. *ఆటా :* ఆట, క్రీడ (కులకర్ణి 62). < తె. ఆట. కానడి నాటకాల ప్రభావమువలన 1841లో మరాఠీలోఁజేరి యుండునని కులకర్ణి వ్యాఖ్యానము.

*ఆడకిత్తా :* చూ. అడకిత్తా (K.B. Dhavale) పు. 220[18]).

6. *ఆర :* 'విటిదాండు' అను మరాఠీ బాలుర ఆటలో 'ఐదు'.

< తె ఆఱు=అయిదు నొకటి. మరాఠీ భాషలో శకటరేఫము లేదు గావున సాధురేఫ ఘటితముగా ఉట్టంకితము. విశేషించి తిక్కన్న నాఁటికే రేఫ సాంకర్యము కలుగుటచే శకటరేఫోచ్చారణము వ్యవహార విదూరమయి యుండనోపు.

*ఉండ :* చూ. ఉండా (కులకర్ణి, పు. 95).

7. *ఉండా:* రూ. ఉండ, ఉండీ, గుండ్రని వస్తువు; పిండిముద్ద (కులకర్ణి పు. 95) < తె. ఉంట, ఉండ=గుండ్రముగాఁ జేయఁబడిన వస్తువు;

---

15. < ఈ సంకేతము మొనవైపున నున్నది జన్యపదమనిగాని పరిణత రూపమని గాని అర్థము. పదపట్టికలోని తక్కిన సంకేతములు స్పష్టము.

16. Major Thomas Candy & Captain Molesworth, A Dictionary English - Marathi, second edition, Poona, 1873.

17. Dr. Bh. Krishna Murti, Telugu Verbal Bases : A comparative and Descriptive study, University of California Publications in Linguistics, Vol XXIV, University of California Press Berkely, P. 279.

18. Keshava Bhikaji Dhavale, Students' Modern Dictionary, English and Marathi, Karnatak House, Bombay, 1954.

కన్నడ. ఉండె; తమిళ; ఉండై, ఉరుండై ద్రావిడీశబ్దము కానోపునని కులకర్ణి, పు. 95).

*ఉండీ:* చూ. ఉండా. ముద్ద; గుళిక (జ్ఞా[19]. 11-457).

*ఉరగుడే:* చూ. ఊరగుఢే. పల్లెటూరిలోని కోయిల, దేవళము (కులకర్ణి, పు. 107).

8 *ఊరగుఢే:* రూ. ఊరగుడే 'జేజే కైలాసదుర్గా పాడిలే సత్యలోకే ఘాతలే సోన కానే ఊరగుఢే ఘేతలే వై[illegible]' శిశు.[20] 160.

< తె. ఊరగుడి : పల్లెటూరి దేవాలయము.

9. *ఓనామా :* ఆరంభము, మొదలుపెట్టుట (కులకర్ణి, పు. 119).

< తె. ఓనమాలు='ఓం నమః శివాయ'అనుషద క్షరితో మొదలయ్యేడి అక్షర సముదాయమున (alphabet)కు వాడుకపేరు, వర్ణ సమామ్నాయము. 'గిరిసుత దొలుపలుకుల సుస్వర మొదవగ నోం నమశ్శివాయ సదాస్మద్వరదాయ నమః శంకర శరణు మహాదేవ నీవ శరణనఁ దొచ్చెన్' (కు. సం. 3-34), 'సన్నయ్యవార లోనామాలు దిద్దుకొమ్మనినచోఁ గడుపు నొప్పనుచు నేడ్చి (హంస 3-140), 'ఓనామాలు పఠించియుండు నని లో నూహింపఁగా వచ్చు....' (హేమ సుందరోపాఖ్యానము, ప్రథమా.) ఇత్యాదులు ఆంధ్ర కావ్య ప్రయోగములు.

10. *ఓరకల :* రూ. వరకల, వరఖల, వోరఖల. ఒరపట్టెడురాయి, గీటురాయి (కులకర్ణి, పు. 120).

< తె. ఒరకల్లు, ఒరగల్లు; కన్నడ. ఒరెగల్, ఒరెగల్లు; తుళు, ఉరెకల్లు, ఒరెకల్లు; తమిళ. ఉరైకల్; మలయాళ, ఊరకల్లు, ఉరపుకల్లు. కన్నడము నుండి యని కులకర్ణి. పు. 120.

11. *కట్టా :* కొయ్యతోగాని, రాతితోగాని కట్టిన ఎత్తయినతావు, వేదిక (కులకర్ణి,పు. 128).

< తె. కట్ట=అరుగు, వేదిక, చెఱువులోనగువానిగట్టు, ఎత్తయిన ఒడ్డు; కన్నడ. కట్టె.

12. *కప :* ఆలింగనము. కౌఁగిలింత; ఏకత్వము (జ్ఞా. 13-61).

< తె. కవ=జోడు, జత, మిథునము; కవగూడు = జతగాకూడు; కవగొను=కవియు, జతగూడు; కవయు=కూడు; కవవాయు=జతవిడుచు.

13. *కవళీ :* కౌఁగిలించికొను 'తయా విరహ పిశాచీ ఉకళీ ప్రాణాతేఁ కవళీ' (ఉద్ధవగీతా[21]). కౌగిలింత (జ్ఞా. 5-133). కవళణె (=కౌఁగిలించుకొను.

< తె. కౌఁగిలించు, కౌఁగిలి; కవియు=పైకొను, పొదువు: సమీపించు; కవిసల=తాఁకుడు, స్పర్శ; కప్పు=ఆచ్ఛాదించు; పరివేష్టించు; వ్యాపించు; వ్యవహారాంధ్రమున' కావిలించుకొను'; సంస్కృత. 'కవలయతి' నుండి పరిణతమని తుల్పుళే, పు. 194.

14. *కాలవా :* కాలువ, ప్రవాహము (candy, పు. 123; కులకర్ణి, పు. 162)

< తె. కాలవ. కాలువ; కన్నడ. కాలివె; తుళు. కాళివె; తమిళ. కాల్, కాల్వాయ్=కాలువ; కాల్=ప్రవహించు; కాలువ.

---

19. జ్ఞా. = జ్ఞానేశ్వరి, జ్ఞానేశ్వరకృతము, మరాఠీ సాహిత్యములో మణిపూస - 'భావార్థదీపిక' యన్నది దీని యసలుపేరు.

20. శిశు=శిశుపాలవధ, మహానుభావ పంథకుచెందిన కవీశ్వర భాస్కరభట్ట కృతము, క్రీ.శ.1305.

21. ఉద్ధవగీతా, భాగవతము ఏకాదశ స్కంధాంతర్గతము, కవీశ్వర భాస్కరభట్ట కృతము, క్రీ. శ. 1035.

15. *కావ :* కావిరంగు (< తె. కావి, కుల కర్ణి, పు. 162).

< తె. కావి : ఎఱుపు; ఎఱ్ఱనిది; కన్నడ. తుళు. తమిళ. మలయాళ. కావి.

*కావడ :* చూ. కావడీ (తుల్పుళే, పు. 195).

16. *కావడీ :* కావడ. కావడి, సీళ్ళు లోనగు నవి మోయుటకై రెండుకొనలయందును ఉట్లనో, త్రాళ్ళనో అమర్చినవెదురుబద్ద. 'భరతి మధాచియా కావడీ' (వివేకసింధు[22], అధ్యా. 1, సం. 14; జ్ఞా. 16-77)

< తె. కావడి. కావడికాలు, కావడికొమ్ము, కావడిఉట్లు, కావడిటప్పాలు, కావడిబద్ద, కావడి మోత, కావడించు=భుజముమీఁద మోయు; కావడి, కాండి, కాఁడి; కన్నడ, తుళు. కావడి; కన్నడ, కాగడి; తమిళ. కా=కావడి; మలయాళ. కావు= కావడి; తమిళ, కావు=భుజము మీఁద మోయు; దేశీప్రాకృత—కాయ, కావ, కావడ, కావడి, కావోడి (పాఇఅ సద్దమహణ్ణవో, పు. 240); కావడియా, 'కావడి' వాఁడు, (పైది).

*కురల :* చూ. కురళా (Candy, పు. 205).

17. *కురళా :* రూ. కురల, కురుళ=వంకరలు తిరిగి మొగముపై పడెడి వెండ్రుకలు, నొక్కుల జుత్తు.

< తె. కురులు=అలకలు; కన్నడ, కురుళు, కుఱులు, కుర్ళు; తమిళ. కుఋళ్; మలయాళ, కురుళ్; దేశీప్రాకృత. కురులో=వక్రకేశములు (దేశీ నామమాలా, 2-63); కుటిలకుంతలములు (పాఇఅ. పు. 1255); అలయాకురలా: (పాఇఅ లచ్ఛినామమాల, 905; ధనపాలకృతము, శాదీ లాల్‌జైన్, బొంబాయి ప్రచురితము, 1960).

*కురుళ :* చూ. కురళా (candy; 205).

18. *కైవార :* రూ. కైవారా. పక్షాభి మానము, పక్షపాతము (జ్ఞా. 10-25) వాగ్దానము; స్వీకారము (candy, 286).

< తె. కైవారము=స్తుతి, పొగడ్త: కైవారి= స్తోత్రపాఠకుఁడు; కైవారము సంస్కృత పదమని కొందఱ భ్రాంతి; అచ్చ తెనుఁగు కృతులలోని వాడుకను వీరు గమనింపరు; వ్యుత్పత్తిపరముగా ఆలోచించు ఆసక్తి అల్పబోధనులకు అరుదు; కన్నడ. కెయ్‌వార= చేయెత్తి పొగడుట; తమిళ. కైవారమ్=స్తుతి; ప్రశంస: మరాఠీపండిత పరిశోధ కులు రాజవాడే గారిచే 'కృపాకర' >కింవారక >కింవార; కింవారస్య భావః—కైవార' అని నిరూపితము. ఇది పాండిత్య ప్రకర్ష కావచ్చును కాని, శాస్త్రీయ ప్రక్రియకాదని కులకర్ణి నిర్ణయము (కులకర్ణి. పు. 184). కన్నడమునుండి ప్రతిదేయ మనినను తప్పు లేదు.

*కైవారా :* చూ. కైవార (ఉద్ధవగీతా, సం. 118).

19. *కోడగా :* నిర్లజ్జ, సిగ్గులేమి; బండ బాఱిన (కులకర్ణి, పు. 185).

< తె. కోడిగము= కొంటెతనము; పరిహాసము; కోడంగి, కోణంగి=విదూషక ప్రాయుఁడు; కన్నడ. కోడగ=కోతి.

20. *కోమటీ :* జాతి విశేషము; వ్యాపారి (కులకర్ణి, పు. 187).

< తె కోమటి. 'అంగడులఁ గోమటుల' (ఆంధ్రభారత. ఆది 8-73). కోమటుల మాతృ భాష 'ఏదేశమేఁగినా ఎందు కాలిడినా' తేటతెనుఁగు, కోమటులు అచ్చముగా తెనుఁగువారు. కన్నడ. తుళు. మలయాళ. కోమటి; తమిళ. మలయాళ, కోమట్టి.

22. వివేకసింధు, ముకుందరాజకృతము. ఓవీ వృత్తములలో సంతరింపఁబడిన తాత్త్వికకృతి. కాలము వివాదగ్రస్తము, క్రీ. శ. పదుమూఁడు, పదునాలుగు శతాబ్దులని స్థూలనిర్ణయము.

21. *కోంప :* రూ. కోంపట, ఖోంప. గుడిసె, పాక (కులకర్ణి పు. 186).

< తె. కొంప. 'కొంపం బోరుదయింది రావు గద నాకుంజెప్పుమా' (వేం. పంచ. 4-125), '....అరిభయంకర లంక యంబేదకొంపయే....' (రామా. 7-7), 'దోసెడు కొంపలోఁ బసుల త్రొక్కిడి... (శ్రీనాథుని చాటువు), 'మకరధ్వజుని కొంప ఒక చెంప గనిపింప చీరగట్టిన దయా చిగురుఁబోణి! (శ్రీనాథుని చాటువు) '....కొంప చెఱుపు....' (హంస. 5-117) ఇత్యాది కావ్య ప్రయోగములేగాక, కొంపకు ముప్పు, కొంపకు రెండు వాకిండ్లు, కొంపదీయు, కొంప పీకు, కొంప ముంచు, కొంప మునిగినది, కొంపలకొలివి, కొంప లంటుకొను, కొంపాగోడూ, పల్లెగొంపలు, 'సుపుత్రః కొంపపీకరః' 'హంపికి బోయెదానికంటె కొంపలో వుండేది మేలు'—మొదలగు పదబంధములు పలుకుబడులు తెలుఁగున ప్రసిద్ధము. కన్నడ, కొంపె= చిన్నగుడిసె, పల్లెటూరు; కొప్ప, కొప్పళ=పల్లెటూరు: తుళు. కొప్ప - హీనజాతులవారి గుడిసె; తమిళ. కుప్పమా = పల్లె; కుంపై = అస్పృశ్యుల వాడ; కురంపై = చిన్నగుడిసె; దేశీప్రాకృత. ఖుంపా = వానజల్లునుండి తప్పుకొనుటకై వాడు తృణమయోపకరణము (పాఇఅ సద్దమహణ్ణవో, పు. 277.)

*కోంపట:* చూ: కోంప. చిన్నగుడిసె (జ్ఞా. 14-218).

22. *కోల(జేఁ):* చిల్లకట్టెను దూరముగా చిమ్ము (కులకర్ణి. పు. 188).

< తె. కోల = కట్టె; కోలాటము = కోలలతో ఆడెడియాట; కన్నడ. తుళు, తమిళ, మళయాళ. కోల్ = కట్టె.

*కోల (కాఠీ):* దడికివేసెడి కొయ్య. ఒక రకమయిన ఆయుధము (జ్ఞా. 15-547). చూ.కోల (జేఁ).

*కోలదండా:* పశువుల మెడలో కట్టిన గుదికోల (కులకర్ణి, పు. 188). చూ. కోల(జేఁ).

*ఖోంప:* చూ. కోంప. గుడిసె. ఆశ్రయస్థలము గుహ; రేవు (జ్ఞా. 7-103). పదాదియందలి అల్పప్రాణములు మహాప్రాణము లగుట (aspiration) మరాఠీలో ప్రచురమగు లక్షణమని జాకోబి, బ్లాక్ మున్నగువా రంగీకరించిన యంశము. ఉదా : సంస్కృత పాంశః - మరాఠీ-ఫాంశా (డా. మురళీధర్ గజానన పాంసే Linguistic Peculiarities of Jnaneswari, Deccan College Dissertation Series 13, Samarth Bharat Press Poona, 1953, పు. 45, 46).

23. *గడ్డా:* దుంప; ముద్ద(కులకర్ణి.పు.219).

< తె. గడ్డ; కన్నడ. తుళు. గడ్డె; తమిళ. మలయాళ. కట్ట = ముద్ద.

24. *గుంటా:* రూ. గుంతా. భూపరిమాణము (కులకర్ణి, పు. 236).

< తే. గుంట = గుంఠ; భూపరిమాణవిశేషము; క. గుంటె. ఎకరములో నలువదియవవంతు.

*గుంతా;* చూ. గుంటా (కులకర్ణి పు. 236).

25. *చచ(జేఁ):* చచ్చు. మరణించు (కులకర్ణి, పు. 264).

< తె. చచ్చు, చా, చావు; కన్నడ. సత్తు, సాయ్, సాయు; తమిళ. చా; మలయాళ. చా; సంస్కృత, చంచ్ = గతౌ? నుండి కానోపునని కులకర్ణి.

*చండూ:* చూ. చేండూ (జ్ఞా. 16-100)

*చపల:* చూ. చప్పల (కులకర్ణి. పు. 267).

*చపలీ:* చూ. చప్పల (పైది, పు. 753).

26. *చప్పల:* రూ. చపల, చపలీ, చేపలీ, పలుచని కాలిజోడు// ఆకుఁ జెప్పులు (కులకర్ణి, పు. 263).

<తె చెప్పులు = పాదరక్షలు; కన్నడ. కెర, కెరవు, కెర్పు; కాల్కెర్పు = కాలిచెప్పు; తమిళ చెరుప్పు = తోలుచెప్పులు; మలయాళ, చెరిప్పు; ధ్వన్యనుకరణ మని కులకర్ణి.

27. *చంబూ:* నీరు త్రాగెడిపాత్ర (కులకర్ణి, పు. 268).

<తె. చెంబు = నీరుత్రాగుటకువాడు రాగిపాత్ర; కన్నడ. చంబు. చెంబిగె=తామ్రపాత్ర. కన్నడ. తుళు, చెంబు = రాగిపాత్ర. ఈ కన్నడ పదము తెలుఁగు నుండివచ్చిన ఎరవుమాటకావచ్చు. తమిళ. చెంపు = రాగి; బంగారు, ఎఱ్ఱనిలోహము; పాత్ర; రాగిపాత్ర; మలయాళ. చెంపు = రాగి, రాగిపాత్ర. ఎఱ్ఱని అను నర్థముకల 'కెంపు' తాలవ్యీకరణమంది 'చెంపు, చెంబు'గా పరిణతము సంస్కృత 'జంబూలక' శబ్దభవమని కులకర్ణి. ప్రాకృత. జంబూలయ = నీరు త్రాగెడిపాత్ర (పాఇఅ సద్ద మహణ్ణవో పు. 421) మరాఠీలోని 'జాంబ' (= నీరు త్రాగెడి పాత్ర) 'జంబూలయ' శబ్దజన్యము కానోపు. పశ్చిమాంధ్ర ప్రాంతవ్యవహారమునందలి 'జాము' (= tumbler) మరాఠీనుండి ఎరవు తెచ్చినమాట.

*చవ:* చూ. చవీ, చవదార్ = రుచియయిన; చవ = ప్రీతి, సమ్మతి (Candy P. 866), చవ (కులకర్ణి. పు. 270).

28. *చవీ:* రూ. చవ. రుచి 'కాపురకేళీచాఁ ఘడీఁ-అమృతాచీ చవీలాగే పుడీ' కర్పూరపు టరఁటి ఫలములు అమృతమువంటి రుచికలిగినవి (మూర్తి ప్రకాశ[23]; జ్ఞా. 15-272).

<తె. చవి = రుచి; చప్పరించు, చవిగొను, చవిసూపు, చవులుదప్పు, చవులూరు, చవులొలుకు; కన్నడ. సవి, సవె; తుళు, సవి. సబి; సంస్కృత. చమ్ ధాతువు నుండి యని తుల్పుళె (vide : prof. S.G. Tulpule, An Old Marathi Reader, Venus Prakashan, Poona, 1960, P. 202.) సంస్కృత. చమ్-అదనే అని కులకర్ణి పు. 270.

29. *చిక్కా:* కృపణత్వము; లోభి(కులకర్ణి, పు. 278).

<తె. చిక్కు = ఆపద, బాధ; కార్శ్యము; కన్నడ. సిక్కు.

30 *చిల్లర:* చిలుకు నాణెముల మొత్తము; చిల్లర సామానులు, సంబారవస్తువులు (కులకర్ణి; పు. 284).

<తె. చిల్లర : మిగిలినది; సామాన్యపు సరకు; చిలుకు: శేషము, సత్రకాయ బాపతు;(అల్లరి, చిల్లరి, చిల్లర మల్లర, చిల్లరవెచ్చములు; చిల్లర సీవాఁ లిచ్చిమి (శ్రీమహాలక్ష్మి),

31. *చుట్టా:* పొగచుట్ట, బీడీవంటిది (Candy పు. 139; కులకర్ణి, పు. 285)

<తె. చుట్ట = పొగచుట్ట; కన్నడ. చుట్ట. చుట్టి; తుళు. చుట్ట; తమిళ. మలయాళ. చురుట్టు. కన్నడము నుండి యని కులకర్ణి ప్రస్తావన, పు. 99; ఆంగ్లమునందలి 'cheroot' కు, తమిళ 'చురుట్టు' మాతృక.

*చేండు:* చూ. చేండూ.'మగశ్రీ కృష్ణచక్రవర్తీ సంఘాతేఁ చేండుఫళీ ఖేళోఁ లాగిన్హలే' 'శ్రీకృష్ణునితో 'చేండుఫళీ' ఆటను ఆడమొదలిడిరి' (శ్రీకృష్ణ చరిత్ర[24]).

32. *చేండూ:* రూ. చండూ, చేండు. బంతి; బంతి యాట (candy, 67, కులకర్ణి). 'శ్రీకృష్ణ చక్రవర్తి గోపాళాంసి చేండూఫళీ ఖేలత' 'గోపాలురతో శ్రీకృష్ణుఁడు చేండూఫళీ ఆటను ఆడు

23. మూర్తి ప్రకాశ, కేసోబసకృతము, క్రీ. శ. 1285.

24. శ్రీకృష్ణ చరిత్ర, కర్తృత్వము వివాద గ్రస్తము, భాస్కరుఁడని కొందఱు. మ్హాయిభట్ట (మహీంద్రభట్ట) అని కొందఱు. పంచకృష్ణపంథ- మరాత్వాడాలోని ఒకభక్తి సంప్రదాయము - (లేక మహానుభావ పంథ)కు ప్రధానాచార్యుఁ డయిన చక్రధరుని అనుయాయులు, క్రీ. శ. 1300.

చుండఁగా' (శ్రీకృష్ణ చరిత్ర; జ్ఞా. 11-580): చేంపాఫళీ = బంతియాట.

< తె. చెండు = బంతి; కన్నడ. చెండు; తుళు. చెండు; తమిళ. మలయాళ. చెండు = బంతి; మలయాళ. చెండు=దారపుబంతి. సంస్కృత. 'కందుక' - భవమగు ప్రాకృత 'చండుఅ' జన్యమని కులకర్ణి వ్యుత్పత్తి, చూ. పు. 289; కాని ప్రాకృతములలో 'చండుఅ' మృగ్యము; కందుక-ఫలికా జన్యమని తుల్పులే, పు. 204.

చేపలే : జూ. చప్పల (candy. పు. 753).

33. డావ (వా) : ఎడమ, సవ్యము (జ్ఞా. 7-126); - దవీబాజో = ఎడమవైపు; డావరా. డావఖురా, డావరా = ఎడమచేయి వాటముగల; దావ్యాహాత్‌చా = ఎడమ చేతిలోనున్న (candy పు. 477) డావియే శ్రీకరి చేంయా = ఎడమచేతి (పూజావసర)[25], డావా డోళానిముతే = ఎడమ కన్ను అదిరినప్పుడు. (రసకౌముది)[26].

< తె. డా. విశ. సవ్యము, ఎడమ. డాకడ, డాకాలు, డాకెలను, డాకేలు, డాచను, డాచేయి, డాతొడ, డాపల, డాపలికేలు,డాపలిసున్న, డామూపు. మరాఠీలోని ఈ 'డావా' వ్యుత్పత్తి అనిశ్చితము, సందిగ్ధము అని ఆచార్య తుల్పులే అభిప్రాయము (vide. పు. 208). దేశీప్రాకృత. డావో = ఎడమ చేయి (దేశీనామమాల, 4-6); టర్నరు దొరగారి నేపాలీ నిఘంటువునకు[27], < దేద్రె (= ఎడమ) అనే పదము క్రింద ప్రదర్శితములయిన పదము లన్నియు ద్రావిడ మూలకములని ఆధునికుల సోపపత్తిక నిర్ణయము[28] (ద్రావిడ భాషలలో పదాది దకార ఘటితములు ముఖ్యముగా తెలుఁగునకే పరిమితము).

34. తాట : భోజన పాత్రము, పళ్ళెరము (జ్ఞా. 5-107, 6-2, 13-423); తాటభర = తట్టెడు (స్మృతిస్థల[29]); తాటకేలేం (పైడి).

< తె. తట్ట = పళ్ళెరము,కంచము;తాట[30] = పల్లెపేపి. కన్నడ తట్టె; తమిళ. తట్టం, తట్టు; తుళు. టిట్టిగ; కన్నడమునుండి యని కులకర్ణి, పు. 372; సంస్కృత 'తత' - నుండి యని తుల్పులే, పు. 209.

35. తాటీ : పంచె, వెలుగు (జ్ఞా. 2-310); వెదురుబద్దల చట్రము (కులకర్ణి, 372).

< తె. తట్టి = పడి; తట్టిగోడ = ఊరి చేరువ పొలముచుట్టు కట్టెడి రాతి కంచె; కన్నడ. తట్టి, పడికె; తమిళ. తట్టి.

తుక : చూ. తూక. బరువు (జ్ఞా. 14-141; 18-640).

తుక (ణే) : తూకముచేయు (కులకర్ణి, పు. 382) చూ. తూక.

36. తూక : రూ. తుక. బరువు. తూఁచి నిర్ణయింప వలసిన పరిమాణము (జ్ఞా. 9-261).

25. పూజావసర, నాగదేవాచార్య శిష్యుఁడగు బైదేవబాస విరచితము చక్రధరుని సహచరులలో నాగదేవాచార్యుఁ డొకఁడు.

26. రసకౌముది, వైద్య గ్రంథము అనజపూర (నేఁటి ఎలిచ్‌పూరు) వాస్తవ్యుఁడును, విజయనగర బుక్కరాయల ఆస్థాన వైద్యుఁడును అగు విఠలుఁడు దీనికి కర్త క్రీ. శ. 1350.

27. Sir. Q. L. Turner, A Comparative and Elymological Dictionary of Nepali Language, London, 1931, P. 318 - suggests borrowing from an aboriginal language.

28. Prof. T. Burrow and Prof. M. B. Emeneau, A Dravidian Etymological Dictionary, Oxford University Press, London 1961, Entry No. 381.

29. స్మృతిస్థల, నరేంద్ర పరశురాములను జంటకవులచే రచితము, క్రీ. శ. 1309.

30. కోరాడ రామకృష్ణయ్య, Dravidian Cognates, Madras University Telugu Series No 11. Madras, 1944. P. 111.

< తె. తూకము = బరువు, భారము; తూకు = కొలఁది, ప్రమాణము, బరువు; తూకువ = భారము, తెలుఁగు నందలి తూకము మొ. వి. వ్యుత్పత్తి పరముగా సబిందుకములగుట శాస్త్రీయము; ఇవి తూఁగు ధాతుజన్యములు. కన్నడ. తూక, తూకు. తూంకు.

37. *తేలగూ :* ఒకానొక ద్రావిడ భాషా నామము (కులకర్ణి, పు. 387).

< తె. తెలుఁగు. ప్రాకృత. తేలంగ—.

38. *దిండ :* బట్టలమూట(candy, పు.67; కులకర్ణి, పు. 460).

< తె. దిండు; కన్నడ. దిండె; తమిళ, మల యాళ. తిరటు.

39. *నాల :* 'విటిదాండు' ఆటలో పరిగణన క్రమములో 'నాలుగు' (కులకర్ణి, పు. 596; ముజుందార్, పు. 85).

< తె. నాలుగు.

40. *పైకా :* డబ్బు, సంపద. '...నానాభక్త మాలిఆఁదత్త పైకాచా వివరు....'( = నానా భక్తు లచే సమర్పితమయిన పైకము వివరము). (పంఢర పుర శిలాశాసనము, క్రీ. శ. 1273).

< తె. పైకము = ధనము; ఒకనాణెము; పసిఁడి నాణెము. లేఁత, పచ్చ అను అర్థములు కల పచ్చ, పచ్చటి, పచ్చని, పచ్చి, పచ్చిక, పయిఁడి, పసరు, పసి, పసిఁడి, పసిమి. పసిరిక, పసుపు, పెయ్య పెసర, పెసలు, పైకము, పైఁడి, పైద, పైదలి, పైరు-ఈ పదరాశి సమస్తము *పచ్-/*పయ్ - అను ద్రావిడమూలధాతు జన్యము. పసిఁడి యనఁగా పసుపు పచ్చని లోహము ( = బంగారు) దీనితో చేసిన నాణెముల రాసియే పైకము అని మౌలికార్థము, కన్నడ. పయ్క, పైక; తమిళ. పయిక్కం.

41 *బరగుండా :* బాలుఁడు (కులకర్ణి పు 653).

< తె. బురుకఁడు = స్తనపాయి, బిడ్డఁడు; బురక = పసిపాపఁడు, పోరగాఁడు. తెలుఁగు 'బరగే' నుండి యని కులకర్ణి.

కన్నడ, పోర, శిశువు; తుళు. పోర, పోరె = బాలుఁడు; పోరి = బాలిక.

42. *మాందీ :* గుంపు, సమూహము (జ్ఞా. 7-104; 8-56, 'ఈశ్వర నిష్ఠాంచీఁ మాంది యలీఁ' 18-1775).

< తె. మంది = జనులు, జనుల గుంపు; సేనా భాగము; మంది మార్బలము; మంద = గుంపు, ఆలమంద, పసులమంద; కన్నడ. మందె = జనులు, పశువులమంద; తుళు. మందె = జనులు; పత్తుమందె = పదిమంది; తమిళ. మంతై = గుంపు, తెలుఁగున మను, మనికి, మనికిపట్టు, మన్నిక, మంద, మంది— మొదలగునవి ఏకధాతు జన్యములు.

(సంస్కృత—మండ్ ( = శోభాయామ్) నుండి యని కులకర్ణి, పు. 588; సంస్కృత. మండలిక ( = సమూహము, రాశి) నుండియని తుల్పుళే, పు. 234).

43. *ముండ:* 'విటిదాండు' ఆటలో మూఁడు (కులకర్ణి, పు. 596; ముజుందార్ పు. 85).

< తె. మూండు, మూఁడు. పూర్ణబిందు ఘటి తోచ్చారణము ప్రచురముగా నుండిన కాలమున మరాఠీలో ప్రతిదేయమనుట స్పష్టము. 'పోండిగ నగజ తపశ్శిఖి—మూండు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర-హ్మండముగాఁచిన గాంచన — ఖండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభా భాసితమై' (కు. సం. 6-158). కన్నడ. మూరు; తుళు. మూజి, తమిళం. మూన్ఱు = మూఁడు; మలయాళ,మూన్ను.

44. *ముదలు:* రూ. ముద్దల. మూలధనము (జ్ఞా. 8-25 'తైసేం మనపణ ముదల జాయో' ( = తాదృశమయిన మనస్థితి మొదలునంచి (మూల ధనము) అగుచున్నది, పైది 5-157).

< తె మొదలు: మూలధనము సంస్కృత. ముద్రా శబ్దభవము కావచ్చునేమో యని పాంసే. పు. 41.

ముద్దల: చూ. ముదలు, మూలధనము. బంద వలము, సంస్కృత. మూలద(?, 'మూలదేయమ్' మూలము కానోపునని కులకర్ణి, పు. 596.

45. యెలమ్మా: రేణుకాదేవి,ఒకానొక గ్రామ దేవత (కులర్ణి పు. 607).

< తె ఎల్లమ్మ : ఒకానొక గ్రామదేవత, ఎల్లల యందుండు పొలిమేర దేవత(?). ఎల్లయంటను (= అంతటను) కలదేవత; కన్నడమునుండి యని కులకర్ణి.

46. రేండ: 'విటిదాండు' ఆటలో రెండు (కులకర్ణి. పు. 635, ముజుందార్, పు. 85). మరాఠీలో హ్రస్వమగు ఎకారములేదు గావున దీర్ఘ స్వరాది.

< తె. రెండు; కన్నడ. ఎరడు; తుళు. రడ్డు: రడ్డనె = రెండవ; తమిళ ఇరండు; మలయాళ, రండు. తెలుగు 'రేండ్' నుండి యని పీఠిక పు. 100 లోను, రోంయా నుండి యని నిఘంటు భాగము (పు. 635) నను కులకర్ణి నిర్ణయము. ఇట దంతమూలీయ తాడిత (alveolar flap) మగు రేఫము దంతమూలీయపార్శ్విక (alveolar lateral)మగు లకారముగాపరిణతము. 'రసోర్లశౌ' మాగధీ ప్రాకృతములో ప్రసిద్ధమగు ధ్వని పరిణామము. గుట్టం-గుల్లం, రాను-లాను, రాధ-లాలు, రాములు - లాములు ఇత్యాద్యుచ్చారణము పిల్లల వాడుకలో ప్రసిద్ధము.

47. ఏకట: 'విటిదాండు' ఆటలో ఒకటి (కులకర్ణి, పు. 637, ముజుందార్. పు. 85).

< తె. ఒకటి; వ్యవహారరూపము 'వ క టి'; కన్నడ. ఒందు; త. ఒన్రు; మ. ఒన్ను.

ఏరకల: చూ. ఓరకల (Candy పు 889)

48. వాళ: బహిష్కారము, జాతిభ్రష్టత (కులకర్ణి, పు. 655).

< తె. వెలి = కులబహిష్కారము. వెలిచవి, వెలివాడ, వెలివేయు, వెలిసంత, వెలుపల, వెలుపడు,వెలువరించు, సంస్కృత. వృ-, వార-లు దీనికి మూలమని కులకర్ణి.

49, పైద: 'విటిదాండు' ఆటలో ఆఱు (కులకర్ణి పు. 671; ముజుందార్ పు. 85). 'ఆర' అనగా ఐదును. 'పైద' అనగా ఆఱును అను నర్థములు తబ్బిబ్బు వలన నేర్పడినవి.

< తె, ఐదు = నాలుగు నొకటి. అజాదిరూపము హలాదియగుటయు అర్థపరిణామము కలుగుటయు మరాఠీ 'పైద' విశిష్టత.

వోరకల: చూ. ఓరకల (జ్ఞా. 17-405)

50. సజగురా: ధాన్యవిశేషము (కులకర్ణి. పు. 701).

< తె. సజ్జ + కొఱ్ఱ. సజ్జలు, కొఱ్ఱలు అను ధాన్యములు. సజ్జ, కొఱ్ఱ రాయలసీమలో ప్రచుర మగు పంటలు.

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# రజతోత్సవాభినందనము

నీ విఖ్యాతియు నీ ప్రయోజకత వాణిజ్యంపు చాతుర్యముల్
ప్రావీణ్యంబు పురద్వయంబునసె మాత్రఙాగాక యాంధ్రావనిఙ
శ్రావం శ్రావము విందు మీశ్వరధనీ ! సద్వైశ్య చింతామణీ !
నీ వాక్చాతురి గోలివంశమునకుఙ గీర్తిఙ బ్రసాదించెడిఙ.

ఉండిరి యెందఱో వణిజు లుండిరె యీ రజతోత్సవోత్సుకుల్
దండిగ స్వర్ణరత్న వివిధంబులుగాఁ దగు నుత్సవంబులఙ
మెండుగఁ జేయు నుత్సుకత మించు ధనేశ్వర కోటి కెల్లెడఙ
గండరగండఁ డైతి విటఁ గాదె భవద్రజతోత్సవంబుచే ?

నీ సారస్వతమంటపంబునసె యాంధ్రీదేవి ఉయ్యేలలం
దే సంకోచములేక ఛాత్రతతితో నిచ్ఛాగతిం దేలఁగా
సేవల్ సేసితి ; గ్రంథసంచయము నిస్సీమంబుగా ముద్రితం
బై సాగెఙ భవదీయపత్రతతిచే నానాఁడు నీనాఁడునుఙ.

విద్వాంసులఁ బ్రేమించుచు
నుద్వేగములేక మంచి యుద్యోగముతో
సద్విద్యా ప్రచురణ కీ
వద్వయసముదారుఁ డన్న ఖ్యాతిని గనుమా !

పత్ర వణిజులపేర్లలోఁ బ్రథమముగను
నీదు పే ర్వచ్చునట్టుల నిలిచి న్యాయ
వర్తనుం డీశ్వరుం డన్న వాసిఁగాంచి
మనుమ వాణిజ్యమునఁ దలమానికముగ.

# ఉపమాలంకారము - ఉత్పత్తి వికాసములు

డా. ఫుల్లెల శ్రీరామచంద్రుడు

మానవుడు తన భావమును ఆవిష్కరించుటకై సంపాదించుకొనిన అత్యుత్తమసాధనము భాష. ఈ సాధనము చక్కగ పనిచేయుటకై తగు ఉపాయములను నిరంతరము అన్వేషించుచు ఆతడు తన భావమును సులభముగను స్పష్టముగను ఇతరులకు తెలుపుటకై అనాదికాలమునుండియు ప్రయత్నించుచునే యుండెను. అట్టి ప్రయత్నముల ఫలితమే భాషలోని అలంకారములు.

అలంకారములలో కొన్ని కాలక్రమమున ఆవిర్భవించి యుండవచ్చును. కాని ఉపమ మొదలగు కొన్ని అలంకారములు మాత్రము ఈషత్ప్రయత్నసాధ్యములై భాషతోపాటు జనించినవని చెప్పవచ్చును. అనాగరకుడై అడవులలో తిరుగుచు ప్రప్రథమముగ భాషాప్రయోగమును అలవర్చుకొనిన ఆదిమమానవుడు కూడ తానుచూచిన అత్యున్నతకాయమగు ఏదైన ఒక వింత మృగమును గూర్చి తనవారితో చెప్పవలె ననుకొనినపుడు ప్రక్కనున్న రాతిబండ నొకదానిని చూపి ఆమృగ మింత పెద్దదిగ ఉన్నదని చెప్పవచ్చును. దానితో వినువారికి ఆ మృగమునుగూర్చి బాగుగ అర్థమగుటయే కాక చెప్పువానికి కూడ తాను చెప్పదలచుకొనినది స్పష్టముగ చెప్పగల్గితినికదాయని సంతృప్తి యుండును. ఇట్టి మాటలతోనే ఉపమకు బీజావాపము ఏర్పడినది. ఈవిధముగ, ఇతరాలంకారములమాట ఎట్లున్నను, ఉపమయు, దానికి అతి సన్నిహితముగనుండు అలంకారములును ఇంచుమించు భాషతోడనే అవిర్భవించియుండునని చెప్పు అవకాశము కలదు.

జె. గొండా అను పాశ్చాత్యపండితుడు "రిమార్క్స ఆన్ సిమిలీస్" అను గ్రంథమునందు ఈవిషయమును గూర్చియే ముచ్చటించుచు— "Naive and primitive men who are scarcely able to abstract, are inclined to name new things after the familiar and to compare things unknown to the well known By means of a simile, they bring the unknown within the sphere of the known". "Primitive men and the common people think concretely and entirely on the analogical lines" అని వ్రాయుచు అత్యంతము అనాగరకు లగువారు కూడ క్రొత్త వస్తువులను తమకు అంతకు ముందుగనే పరిచితములగు వస్తువులతో పోల్చి చెప్పుచుందు రనియు, సాధారణముగ వారి యాలోచనలు సాదృశ్యముపై ఆధారపడి యుండుననియు ప్రతిపాదించియున్నాడు.

చెప్పదలచిన విషయమును సుస్పష్టముగ చెప్పుటకు ఔపమ్యము బాగుగ ఉపకరించు నను విషయమును రుద్రటుడు కూడ ప్రతిపాదించి యున్నాడు.

"సమ్యక్ ప్రతిపాదయితుం
స్వరూపతో వస్తు తత్సమాన మితి
వస్త్వంతర మభిదధ్యాత్
వక్తా యస్మిం స్తదౌపమ్యమ్."
(కావ్యాలంకారము 8-1)

"ఏదైన ఒక ప్రకృత వస్తువుకుచెందిన స్వరూప స్వభావాదులను స్పష్టముగ ప్రతిపాదించుటకు అప్రకృతవస్తువు నొకదానిని చూపి ఇది దానితో సమానముగ నున్నదని చెప్పుటకు ఔపమ్యమనిపేరు."

ఈ దృష్టితో చూచినచో ఉపమ భాషకు అత్యంత సహజమగుటచే అతిప్రాచీనమైన దని చెప్పుటకు

సందేహములేదు. కావుననే ఋగ్వేద సంహితాదులందును, వాటి సిమ్మట వచ్చిన రామాయణ మహాభారత మనుస్మృత్యాది గ్రంథములందును ఈ ఉపమయు, దానికి అతిసన్నిహితములగు రూపకాదులును అత్యధికముగ ఉపయుక్తములై యున్నవి.

వైదిక వాఙ్మయమునందు ప్రయుక్తములగు ఉపమలలో వృక్ష పర్వతాది స్థావర వస్తువులును, పశు పక్ష్యాది జంగమవస్తువులును ఉపమానముగ గ్రహింపబడినవి. యజ్ఞయాగాదులు ప్రచుర ప్రచారములో నుండుటచే వాటికి సంబంధించిన వస్తువులు గూడ కొన్ని స్థలములందు ఉపమానముగ గ్రహింప బడినవి ఉదా :- "హోతేవ క్షదసే ప్రియమ్" (ఋగ్వే. 1.25.17) హోతయను ఋక్కువలె ప్రియమగు హవిస్సును ఆస్వాదించుచున్నావు."

జీవితమున మానవుడు నిత్యము చూచుచుండెడు పక్షులు తమ గూండ్లకు పోవుట, గోవులు గోశాలలోనికి పోవుట మొదలగు విషయములు కొన్నిచోట్ల ఉపమానములుగ చెప్పబడినవి. ఉదా:-

"పరా హి మే విమన్యవః పతన్తి వస్యః ఇష్టయే, వయో న వసతీ రుప" (ఋగ్వే. 1.25.4) "ఓ వరుణదేవా! క్రోధరహితములగు నాబుద్ధులు, జీవన ప్రాప్తికై, గూండ్లకుపోవు పక్షులవలె ప్రసరించుచున్నవి."

"పరా మే యాన్తి ధీతయః గావో న గవ్యూతీరను, ఇచ్ఛన్తీ రురుచక్షసమ్"(ఋగ్వే.1.25.16) "గోవులు గోష్ఠములకు పోవుచున్నట్లు నాబుద్ధులు వరుణుని వైపునకు తరలిపోవుచున్నవి."

"విమృళీకాయ తే మనః రథీ అశ్వం నసన్దితమ్, గార్భిః వరుణ సేమహి" (ఋగ్వే. 1.25.3) "ఓ వరుణదేవా! రథికుడు అలసిపోయిన అశ్వమునువలె నిన్ను, మా సుఖము కొరకై, స్తోత్ర వాక్యములచే బంధించెదము" మొదలగునవి

అచేతనములగు ప్రాకృత శక్తులను గూడ చేతనములుగ భావించి చక్కని ఉపమలద్వారా వాటిని వర్ణించుట కూడ వైదిక వాఙ్మయమునందు కాననగును. ఉషస్సును వర్ణించు ఋక్కులు కొన్ని ఇందుల కుదాహరణములు :

"సూర్యో దేవీ ముషసం రోచమానాం మర్యః న యోషా మభ్యేతి పశ్చాత్" (ఋగ్వే.1.115.2) "సూర్యుడు ప్రకాశించుచున్న ఉషస్సును, పురుషుడు సుందరియగు స్త్రీనివలె అనుసరించుచున్నాడు".

"అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానామ్, జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః" (ఋగ్వే. 1.224.7)• "సోదరులులేని వనిత సహాయార్థమై పిత్రాదులను చేరునట్లును, తనకు రావలసియున్న ధనాంశమును (రిక్థమును) తీసికొనుటకై యువతి న్యాయాలయమునకు పోవు విధమునను ఉషస్సు సూర్యుని చేరుచున్నది. సుందరములగు వస్త్రములను ధరించి స్మితశోభితానన యగు భార్య భర్తకు తన రూప సౌందర్యాదులను చూపునట్లు (ఉషస్సు సూర్యునకు తన సౌందర్యమును చూపుచున్నది)."

"కన్యేవ తన్వీ శాశదానా ఏషి దేవి దేవమియక్షమాణమ్, సంస్మయమానా యువతిః పురస్తాదావిర్వక్షాంసి కృణుషే విభాతీ" (ఋగ్వే.1.123.10) "అత్యల్పవసనయై స్పష్టాకృతితోనున్న కన్యవలె సూర్యుని చేరుచున్నావు. నవ్వుచున్న యువతివలె సూర్యుని ఎదుట వక్షమును చూపుచున్నావు".

ఈ విధముగ వైదిక వాఙ్మయమునందు ఉపమాలంకారమే ఎక్కువ ప్రయోగములో నున్నను ఉపమాగర్భితములగు రూపక, రూపకాతిశయోక్త్యాదులు కూడ అచ్చటచ్చట ప్రయోగింపబడినవి. ఉదా :—

"ధనుర్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం పరం హ్యుపాసా నిశితం సంధయీత. ఆయమ్య తద్భావగతేన చేతసా లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి". (ముండకోపనిషత్తు. 2.2.3). "ఔపనిషద

ధనుస్సును చేపట్టి, ఉపాసనా నిశితమగు మహాస్త్రమును ఎక్కుపెట్టవలెను. దానిని ఏకాగ్రమగు చిత్తముతో వంచి అవినాశి యగు బ్రహ్మయనెడు లక్ష్యమును వేధించుము." రూపకాలంకారము.

"ఆత్మానం రథినం విద్ధి
శరీరం రథమేవతు
బుద్ధిం తు సారథిం విద్ధి
మనః ప్రగ్రహ మేవ చ
ఇంద్రియాణి హయా నాహు
ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనో యుక్తం
భోక్తే త్యా హుర్మనీషిణః".
(కఠోపనిషత్తు 1.3.3).

"ఆత్మయే రథికుడని తెలిసికొనుము. శరీరము రథము. బుద్ధి సారథి. మనస్సు కళ్ళెము. ఇంద్రియములు గుఱ్ఱములు. విషయములు వాటి గమ్యస్థానములు. మనోబుద్ధీంద్రియాదులతో గూడిన ఆత్మయే భోక్త యని విద్వాంసులు చెప్పుదురు." రూపకము.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రేకః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో అభిచాకశీతి."
(ఋ. 1.164.20)

"ఎప్పుడును కలసి యుండెడు రెండు మైత్రిగల పక్షులు (జీవాత్మపరమాత్మలు) ఒకే వృక్షమును ఆశ్రయించి యున్నవి. అందులో ఒకటి (జీవాత్మ) మధురమగు ఫలమును (కర్మ ఫలమును) అనుభవించును. రెండవది (పరమాత్మ) ఏమియు అనుభవింపక ఒప్పుగ నుండును". రూపకాతిశయోక్త్యలంకారము.

ఈ విధముగ వైదిక వాఙ్మయమునందు ఉపమాలంకారము, తదాశ్రితములగు రూపకాదులును బహుల ప్రయోగములో కనబడుచున్నవి.

రామాయణ మహాభారతములందు గూడ ఉపమాద్యలంకారములు మాత్రమే ఎక్కువగ ప్రయుక్తములై యున్నవి ఉపమాలంకారము వైదిక వాఙ్మయమునుండి రామాయణ మహాభారతములను చేరునరికి దీని క్షేత్రము చాల విస్తృతమైనది. ప్రపంచములోని స్థావరజంగమాత్మకము లగు వస్తువులన్నియు ఇపుడు ఉపమాన పరిధిలోనికి ప్రవేశించినవి. సముద్రపర్వతాదులు, పశుపక్ష్యాదులు, నక్షత్రాకాశాదులు, మరి ఇతర వస్తువులు గూడ ఉపమానములుగ గ్రహింపబడినవి, గాంభీర్యమున సముద్రముతోడను, స్థైర్యమున పర్వతముతోడను, అస్థిరత్వమున గ్రీష్మనది ప్రవాహములతోడను, ఓర్పు విషయమున భూమితోడను, వైశాల్యమున ఆకాశముతోడను, ఉన్నతి విషయమున గిరిశిఖరాదులతోడను, వేగమున వాయు గరుడాదులతోడను, సౌందర్య విషయమున చంద్రమన్మథాదులతోడను పోల్చుట ఈ ఇతిహాస గ్రంథములందు పెక్కుచోట్ల కనబడును.

"సముద్ర ఇవ గాంభీర్యే స్థైర్యే చ హిమవానివ".
రామా. బా. కాం.

గాంభీర్యమున సముద్రమువలెను స్థైర్యమున హిమాలయమువలెను ఉన్నాడు.

"చలం హి తవ సౌభాగ్యం
నద్యాః స్రోత ఇవోష్ణగే" రామా. అయో.

గ్రీష్మమునందు నదీప్రవాహమువలె నీ సౌభాగ్యము అస్థిరమైనది.

"తేజ సాదిత్యసంకాశః క్షమయా పృథివీసమః
బృహస్పతిసమో బుద్ధ్యా యశసా వాసవోపమః."
రామా.సుం.కాం.

తేజస్సుచే సూర్యునితో సమానుడు. ఓర్పుచే భూమితో సమానుడు. బుద్ధిచే బృహస్పతితో సమానుడు. కీర్తిచే దేవేంద్రునితో సమానుడు.

ఈ విధముగ ఎన్నియో చేతనాచేతనవస్తువు

లును, ప్రసిద్ధ దేవతాదులును ఉపమానములుగ గ్రహింపబడి యున్నారు. చేతనాచేతనత్వాది భేదము లున్నను ఏదియో ఒక సమాన ధర్మమును ఆధార ముగ గ్రహించి ఔపమ్యము అంగీకరింప బడినది.

నేత్రాదులగు భిన్న శరీరావయవాదులకు ఉప మానములను కల్పించి "రాజీవలోచనః" "కమల ప్రతాక్షమ్" "పద్మపత్ర నిభేక్షణం" మొదలగు ప్రయోగములుగూడ ఈ ఇతిహాస గ్రంథములలో ప్రచారములోనికి తీసికొనిరాబడియున్నవి.

ఒక ద్రవ్యమును మరియొక ద్రవ్యముతో పోల్చుట మాత్రమేకాక గుణక్రియాదులను ఇతర గుణక్రియాదులతో పోల్చుటగూడ ఈ గ్రంథము లలో గోచరించును.

"యథామృతస్య సంప్రాప్తి
ర్యథా వర్ష మనూదకే
యథా సదృశ దారేషు
పుత్రజన్మాఽప్రజస్య చ.
ప్రనష్టస్య యథా లాభో
యథా హర్షో మహోదయః
తథైవాగమనం మన్యే
స్వాగతం తే మహామునేః"

రామా. బా. కాం.

ఇచట మునీంద్రుని ఆగమనము అమృత ప్రాప్తితోడను, ఎడారిలో వర్షాగమనముతోడను, పుత్రహీనునకు పుత్రలాభముతోడను, పోయిన వస్తువు మరల లభించుటతోడను, ఆకస్మిక మహా హర్ష హేతు సంప్రాప్తితోడను పోల్చబడినది. ఇది మాలోపమకు గూడ ఉదాహరణము.

కొన్ని స్థలములలో ఒక ద్రవ్యమును మరియొక ద్రవ్యముతో సామాన్య రూపమున పోల్చుటకు బదులు దానికొక విశిష్టావస్థను కల్పించి, అట్టి ద్రవ్య ముతో పోల్చుట గూడ ఇచట కానవచ్చును. ఇది వర్ణ్య విషయ స్పష్టీకరణమునకు మిగుల ఉపక రించును.

"తం దృష్ట్వా భీమసంకాశం
జ్వలన్త మివ పావకమ్." రామా.బా.కాం.

"ప్రజజ్వాల రణే భీష్మో విధూమ ఇవ పావకః"
భార. భీ. వ.

పై వాక్యములలో కేవలాగ్నిని కాక ప్రజ్వ లించుచున్న అగ్నిని, విధూమాగ్నిని ఉపమానము లుగ గ్రహించుటచే వర్ణ్యమాన విషయమునందు ఒక వైశిష్ట్యము సూచింపబడుచున్నది.

ఇట్లే "ప్రతిప త్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా" (సీతాదేవి ప్రతిపత్తునందు అధ్యయనము చేయువాని విద్యవలె కృశించి పోయినది) ఇత్యాదు లందు మూర్త ద్రవ్యములకు అమూర్తద్రవ్యము లతో ఔపమ్యము చెప్పబడినది.

ధర్మవిశేష విశిష్టమగు ఉపమేయముతో సరి తూగుటకై తాదృశ ధర్మాంతర విశిష్టమగు ఉప మానమును ప్రయోగించుట (బింబ ప్రతిబింబ భావము) కూడ ఇతిహాసములందు పెక్కుచోట్ల కానవచ్చు చున్నది.

"తతః ప్రదీప్తలాంగూలః
సవిద్యుదివతోయదః" రామా. సుం. కా.

"అవతీర్ణౌ గదాహస్తౌ వేకశృంగా వివాచలౌ"
భా. ఆ. ప.

మొదటి ఉదాహరణమున హనుమంతుడు ఉప మేయము, మేఘము ఉపమానము. హనుమంతుని యందు ప్రదీప్తాగ్ని యున్నది; మేఘమునందు విద్యుత్తు ఉన్నది. ఈ విధముగ విభిన్న వస్తువులగు అగ్ని విద్యుత్తులకు బింబ ప్రతిబింబ భావమును కల్పించుటచే హనుమంతుని మేఘముతో పోల్చుటకు వీలుకలిగినది. ఇట్లే రెండవ ఉదాహరణమునందు గదాశృంగములకు బింబ ప్రతిబింబభావ ముండుటచే ఆ యోధులను పర్వతములతో పోల్చుటకు అవ కాశము లభించినది.

అచ్చటచ్చట మాలోపమగూడ అతిమనోహర ముగ కూర్చబడినది.

"తేజసాదిత్యసంకాశః
క్షమయా పృథివీసమః,
బృహస్పతి సమో బుద్ధ్యా
యశసా వాసవోపమః" రామా.సుం.కాం.

ఇచట ఒకే ఉపమేయమునకు వేర్వేరు సాధారణ ధర్మములను పురస్కరించుకొని ఆదిత్యుడు మొదలగు అనేకములగు ఉపమానములు చెప్పబడినవి

"శోషణం సాగరస్యేవ
మన్దరస్యేవ చాలనమ్,
నభసః పతనం చైవ
శైత్య మగ్నే స్తథైవచ,
అశ్రద్ధేయ మహం మన్యే
వినాశం శార్ఙ్గ ధన్వనః" భార.మౌ.ప.

సముద్రము ఎండిపోవుటవలె, మందరము కదలుటవలె, ఆకాశము క్రిందికి పడిపోవుటవలె, అగ్ని చల్లబడిపోవుటవలె, శ్రీకృష్ణుడు మరణించుట యనునది నమ్మరాదని నా అభిప్రాయము. ఇచట ఉపమేయమగు శ్రీకృష్ణుని నిధనమునకు సాగర శోషణాదులు ఉపమానములుగ గ్రహింపబడినవి.

పైన జూపిన విధముగ ఉపమాలంకార విధానము రామాయణ మహాభారతములను చేరి అతివిస్తృతరూపము దాల్చినది. ఉపమయే కాక అనన్వయోత్ప్రేక్షాదులు గూడ ఈగ్రంథములలో ప్రచురముగ ప్రయోగింపబడినవి.

"గగనం గగనాకారం సాగరః సాగరోపమః,
రామరావణయోర్యుద్ధం రామరావణయో రివ."
రామా. యు. కాం.

"ఆకాశమునకు ఆకాశమే సాటి; సముద్రమునకు సముద్రమేసాటి. రామరావణ యుద్ధమునకు రామరావణ యుద్ధమే సాటి." ఇది అనన్వయమునకు సుప్రసిద్ధమగు ఉదాహరణము.

"న బాహ్వోః సదృశో వీర్యే
పృథివ్యా మస్తి కశ్చన,
త్రిషు లోకేషు వై రామ
న భవే త్సదృశ స్త్వయా."
రామా. బా. కాం.

ఇచట రామునితో సమానుడు మూడులోకము లందును లేడు అని వర్ణించుటచే ఇది అసమాలంకారము.

"రామచంద్రమసం దృష్ట్వా
గ్రస్తం రావణ రాహుణా
ఉపగ మ్యాబ్రవీ ద్రామ
మగస్త్యో భగవా నృషిః"
రామా. యు. కాం.

ఇచ్చట రాముడే చంద్రుడు, రావణుడే రాహువు అని వర్ణించుటచే రూపకాలంకారము.

"ఘృతకుంభసమా నారీ
తప్తాంగారసమః పుమాన్
తస్మాద్ ఘృతం చ వహ్నిం చ
నైకత్ర స్థాపయే ద్బుధః" మనుస్మృతి.

"ఆడుది నేతికుండవంటిది. పురుషుడు కనకన లాడెడు నిప్పువంటివాడు. అందుచే నేతిని, అగ్నిని ఒక్కచో ఉంచరాదు." ఇచ్చట పూర్వార్థమున ఉపమాలంకారము, ఉత్తరార్థమునందు రూపకాతిశయోక్తియు ప్రయోగింపబడినవి.

"రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్"
రామా. అయో. కాం.

రాజే సత్యము, రాజేధర్మము– ఇత్యాది విధముగ వర్ణించుటచే ఇది మాలారూపకమునకు ఉదాహరణము.

కైకేయీ మబ్రవీత్ క్రుద్ధః
ప్రదహ న్నివ చక్షుషా."
రామా. అయో. కాం.

"అతడు క్రుద్ధుడై తనదృష్టితో కాల్చివేయుచున్న వాడువలె కైకేయితో పలికెను."

అట్లే "ఇంద్రియాణి పురా జిత్వా
జితం త్రిభువనం త్వయా
స్మరద్భి రివ తద్వైర
మింద్రియై రేవ నిర్జితః" రామా.యు.కాం.

"పూర్వము నీవు ఇంద్రియములను జయించి (తపస్సునందు) ముల్లోకములను జయించితివి. ఇపుడు ఆ వైరమును స్మరించుచున్నవి వలె ఆ ఇంద్రియములే నిన్ను జయించినవి." ఇచట "స్మరద్భి రివ తద్వైరమ్" అనునది సుందరమగు ఉత్ప్రేక్షో దాహరణము.

"కః కృష్ణసర్ప మాసీన
మాశీవిష మనాగసమ్
తుద త్యభిసమాపన్న
మంగుల్యగ్రేణ లీలయా." రామా.అ కాం.

ఒక్కచో కూర్చొనియున్న నిరపరాధియగు త్రాచు పామును వ్రేలితో పొడుచుచున్న వాడెవడు ? ఇది అప్రస్తుత ప్రశంసాలంకారమున కుదాహరణము.

"కా త్వం కాంచన వర్ణాభే
పీతకౌశేయ వాసినీ
హ్రీః కీర్తిః శ్రీః శుభా లక్ష్మి
రప్సరా వా శుభాననే ?" రామా.అ.కా.

ఇచట "నీవు లక్ష్మివా, అప్సరస్త్రీవా" ఇత్యాది సందేహమును ప్రకటించుటచే సందేహాలంకారమునకు ఉదాహరణము.

ఈవిధముగ వైదిక వాఙ్మయమున ప్రప్రథమముగ ఆవిర్భవించిన ఉపమ రామాయణ మహాభారతాదులందు క్రమవికాసము పొంది వివిధ రూపములను దాల్చినది. ప్రాచీనవాఙ్మయమునందంతటను ఈ ఉపమాలంకారము, లేదా దీనికి సంబంధించిన ఇతరాలంకారములు మాత్రమే ప్రచుర ప్రచారములో నుండెడివి. కావుననే అలంకార ప్రతిపాదకులలో అతిప్రాచీనుడగు భరతుడు తన నాట్యశాస్త్రమున ఉపమ, రూపకము, దీపకము అను మూడు అర్థాలంకారములను మాత్రమే పేర్కొని యున్నాడు. ఇందు రూపక దీపకములు ఉపమతో సన్నిహిత సంబంధము కల వను విషయము సర్వవిదితము. అట్లని రామాయణ భారతాది ప్రాచీనగ్రంథములలో గూడ లభ్యములగు అనన్వయ, అసమాద్యలంకారములు భరతునకు తెలియ వని కాదు. అవి కూడ ఉపమాంతర్గతములే యని ఆతడు భావించియుండును. కొంచెము భేద మున్నంతమాత్రమున వాటికి విశేషనామధేయము ఈయవలసిన పనిలేదని ప్రాచీనాలంకారికుల అభిప్రాయము. ఉదాహరణమునకు దండి ఉపమాలంకారమునందు ఎన్నియో విశేషములను అంగీకరించి అన్యోన్యోపమ, అద్భుతోపమ, సంశయోపమ, నిర్ణయోపమ, అసాధారణోపమ, ప్రతివస్తూపమ, మోహోపమ, ఉత్ప్రేక్షోపమ మొదలగు భేదములను ప్రతిపాదించెను. ఆతని అభిప్రాయము ప్రకారము ఇవి యన్నియు ఉపమాలంకార విశేషములే. కాని అర్వాచీనులగు ఆలంకారికులు ఉపమాభేదములనే క్రమముగ ఉపమేయోపమ, అతిశయోక్తి, సందేహము, నిశ్చయము, అనన్వయము, ప్రతివస్తూపమ, భ్రాంతిమత్ప్రతీపము అను స్వతంత్రాలంకారములుగ అంగీకరించి యున్నారు.

వ్యాస వాల్మీక్యాదులే కాక భాస కాళిదా సాశ్వఘోషాది ప్రాచీన కవులు కూడ ఇతరాలంకారముల కంటె ఎక్కువగ ఈ ఉపమాలంకారమును తత్సంబద్ధములగు రూపకార్థాంతరన్యాసాదులను ఉపయోగించుట గమనించతగిన విషయము. దానిని బట్టి ఉపమాలంకారము అతిప్రాచీనమైన దనియు, అధిక ప్రచారము కలదనియు స్పష్టమగుచున్నది.

ఆలంకారికు లీ ఉపమాలంకారమును విభిన్న దృక్కోణములతో పరిశీలించి నిర్దుష్ట లక్షణాది నిర్దేశపూర్వకముగ అనేక విధములుగ విభజించి యున్నారు.

"ఒకవస్తువును సమానధర్మములు గల మరియొక వస్తువుతో మనోహరముగ పోల్చుట ఉపమాలంకారము" అని స్థూలముగ చెప్పవచ్చును.

ఒక వస్తువును మరియొక వస్తువుతో పోల్చవలె నన్నచో ఆరెండింటి యందును సమానములగు ధర్మము లుండవలెను. "ముఖము చంద్రునివలె అందముగ నున్నది" అని వర్ణించినప్పుడు ముఖము నందును చంద్రుని యందును 'అందము' అనెడు సమానధర్మ మొకటి యుండుటచే ముఖమును చంద్రునితో పోల్చుటకు వీలైనది. ఈవిధముగ ముఖచంద్రాలయందు సుందరత్వ మనెడు సాధర్మ్య మున్నది. ఈ సాధర్మ్యమే ముఖచంద్రుల సాదృశ్యమునకు ఆధారమైనది. ఈ సాదృశ్యమే ఉపమాలంకారము.

సాధర్మ్య సాదృశ్యముల విషయమున పండితులలో విప్రతిపత్తి గలదు. "ముఖం చంద్ర ఇవ, యతః ఉభావపి సుందరౌ"— ముఖమును చంద్రుడును సమానముగ నున్నవి ఏలయన రెండును సుందరములే — ఇత్యాదులలోని సౌందర్యరూప సాధర్మ్యమే ముఖచంద్రులలో గల సాదృశ్యమనియు, కావున సాదృశ్య మనునది సాధర్మ్యముకంటె భిన్నమగు పదార్థాంతరము కాదనియు నైయాయికుల మతము. సాదృశ్యమనగా పోలిక. సౌందర్యము మొదలగు సమాన ధర్మము లున్ననే కాని ఈ పోలిక (సాదృశ్యము) సాధ్యము కాదు అందుచే సాదృశ్య మనునది సాధర్మ్యముచే సాధింపదగిన పదార్థాంతరమని మీమాంసకాదుల మతము. జగన్నాథపండితరాజాదులు ఈ రెండు మతములను గూడ చూపియున్నారు. వాస్తవమున రెండవ మతమే యుక్తియుక్తముగ నున్నట్లు తోచును. సాదృశ్యము అనగా సమానముగ కనబడుట. ఇది విస్తృతరూపమైనది. రెండువస్తువులు ఈ విధముగ సమానరూపములుగ కనబడుటకు కారణము ఆ రెండిటియందును సమానరూపములగు ధర్మము లుండుట (సాధర్మ్యము) కావచ్చును కాని ఆ సాధర్మ్యము పరిచ్ఛిన్న స్వభావము కలది. సాధర్మ్య మనగానే మనదృష్టి రెండు వస్తువులందును వేరువేరుగ కనబడు ధర్మవిశేషములవైపు పోవును. కాని సాదృశ్యమనగనే ఆ రెండువస్తువు లందును అభివ్యాప్తమై యున్న ఒక విశేషము మన బుద్ధికి గోచరించును. ఇందు ఆరెండు వస్తువులయందును ఉన్న సౌందర్యాది సమానధర్మములేకాక తత్ప్రతిపాదితమును, ఉభయానుస్యూతమును అగు ఒక విశిష్ట స్వరూపము భాసించును కావున సాదృశ్య మనునది సాధర్మ్య భిన్నమగు పదార్థాంతరమని చెప్పుట యుక్తము

'ముఖం చంద్ర ఇవ సుందరమ్' అనునది ఉపమకు ఉదాహరణము. ఇందు 'ముఖం' అనునది ఉపమేయము, 'చంద్రః' అనునది ఉపమానము, 'ఇవ' అనునది సాదృశ్యవాచకము. 'సుందరమ్' అనునది సమాన ధర్మవాచకము. ఇవి యన్నియు చెప్పబడియున్నచో అది పూర్ణోపమ వీటిలో ఒకటి గాని, రెండుగాని, మూడుగాని లోపించినచో అది లుప్తోపమ. పూర్ణోపమ ఆరు విధములు. సాక్షాత్ సాదృశ్య వాచకములగు 'ఇవ' 'యథా' మొదలగు పదములను ప్రయోగించినచో శ్రౌతి. 'సదృశ' 'తుల్య' ఇత్యాది పదములు 'సాదృశ్యముగల' అను నర్థమును బోధించునుగాన అది సాదృశ్యమును పరోక్షరూపమున (ధర్మిద్వారా) బోధించును. అట్టి పదములను ప్రయోగించినచో ఆర్థీ పూర్ణోపమ. శ్రౌతీ పూర్ణోపమ వాక్యగత యనియు, సమాసగత యనియు, తద్ధితగత యనియు మూడు విధములు. ఇట్లే ఆర్థీ పూర్ణోపమగూడ వాక్యగత యనియు, సమాసగత యనియు, తద్ధితగత యనియు మూడు విధములు. ఈ విధముగ పూర్ణోపమ ఆరువిధములు. లుప్తోపమ ప్రధానముగ వాచకలుప్త, ధర్మలుప్త, ధర్మవాచకలుప్త, వాచకోపమేయలుప్త, ఉపమానలుప్త, వాచకోపమానలుప్త, ధర్మోపమానలుప్త, ధర్మోపమానవాచకలుప్త యని ఎనిమిది విధములు. వీటిలో గూడ శ్రౌతీత్వము, ఆర్థీత్వము, వాక్యగతత్వము, సమాసగతత్వము, తద్ధితగతత్వము, ఇవాదులకు క్యచ్ ప్రత్యయముచే లోపము, ణముల్ ప్రత్యయముచే లోపము, క్విప్చే లోపము మొదలగు విశేషములచే మొత్తము ఇరువదియొక్క భేదములు

ప్రతాపరుద్రీయాదులందు సోదాహరణముగ ప్రతిపాదింపబడినవి. సమానవిధానము, విభిన్న కృత్తద్ధితాదిప్రత్యయ ప్రయోగము గల సంస్కృత భాషయందు మాత్రమే ఇన్ని భేదములను చెప్పుటకు అవకాశముండునుగాని ఇతర భాషలలో వీలుపడదు. ఇది మన ప్రాచీనాలంకారికుల సూక్ష్మేక్షికకు ఒక ఉదాహరణము. పాశ్చాత్య భావ ప్రభావితులై భారతీయశాస్త్ర సంప్రదాయము నెరుగని కొందరు ఈ విభాగము లన్నియు కేశాగ్రవిదారణ సదృశము లనియు (Hair splitting) ఇట్టి విభాగములచే ప్రయోజన విశేష మేమియు ఉండదనియు ఒక్కమాటలో కొట్టి వేయవచ్చును. కాని వ్యాకరణాది శాస్త్రములలో ఏకొంచెము ప్రవేశమున్నను వారికి ఈ విధములగు భావములు ఉదయింపవు. అపుడు వారు ఈ విభాజనము నందలి ఔచితిని బాగుగ గ్రహింతురు. అట్లుకాక కేవలము స్థూలవిభాగమునకు మాత్రమే ప్రాధాన్యమిచ్చెడి పక్షమున 'సూక్ష్మ పరిశీలనము' (critical appreciation) అను మాటయే నిరర్థకమగును. ఉదాహరణమునకు - "దన్తాః కుందానీవ వర్తన్తే" - దంతములు కుంద పుష్పములవలె నున్నవి - అను భావమునే "దన్తాః కున్దన్తి" అను ఆచారార్థ క్విబంతరూపమును (కుందా నీవ ఆచరంతి కుందంతి - "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అను వార్తికముచే క్విప్‌ప్రత్యయము) ప్రయోగించి చెప్పవచ్చును. కాని వాక్యప్రయోగములో భేదమున్నదను విషయమును మాత్రము ఎవ్వరును కాదనజాలరు. ఇట్టి ప్రయోగ భేదములను బట్టియే సూక్ష్మపరిశీలకు లగు మన యాలంకారికులు ఇన్ని విభాగములను ఏర్పరచి యున్నారు.

'అలంకారము' అనగనే అలంకరింప దగినది ఒకటి ఉండవలెను. అదియే అలంకార్యము లేక ఉపస్కార్యము అని చెప్పబడును. కావున ఆలంకారికులు పైన జూపిన ఉపమా విభాగముతో సంతృప్తి చెందక ఉపస్కార్యములగు వస్త్వలంకార రసాదుల భేదమును బట్టియు, బింబ ప్రతిబింబ భావ, నిరవయవత్వ, సావయవత్వ, పరంపరితత్వాది భేదములనుబట్టియు ఈ ఉపమ బహు విధములుగ నుండునని ప్రతిపాదించి యున్నారు. ఈ భేదములు రసగంగాధరాదులలో స్పష్టీకరింపబడినవి.

వెనుక సూచించిన విధముగ, సాదృశ్యరూపమగు ఈ ఉపమ అనేక భేద భిన్నమగుటయేకాక అనేకములగు ఇతరాలంకారములకు మూలకందముగ కూడ నున్నది. అనగా ఈ సాదృశ్యమునకే కొన్ని విశేషములను పురస్కరించుకొని విభిన్ననామధేయము లొసగబడినవి. ఇట్టి అలంకారములను ఉపమాలంకార మూలకము లని చాలకాలమునకు పూర్వమే తొమ్మిదవ శతాబ్దికి చెందిన రుద్రటుడు వ్రాసి యున్నాడు.

రుద్రటుని ప్రకారము అర్థాలంకారము లన్నిటి యందును అంతర్గతములగు మూలతత్త్వములు నాలుగు :

> "అర్థస్యాలంకారా
> వాస్తవ మౌపమ్య మతిశయః శ్లేషః,
> ఏషామేవ విశేషా
> అన్యేషుభవన్తి నిశ్శేషాః." (కా.అ. 1.7)

"వాస్తవము, ఔపమ్యము (సాదృశ్యము), అతిశయము, శ్లేష అనునవియే అర్థాలంకారములు; మిగిలినవన్నియు వాటి విశేషములే." (తరువాతి ఆలంకారికులు గూడ కొంచెము మార్పు చేర్పులతో రుద్రటుని మతమును అనుసరించినారు.) రుద్రటుడీ విధముగ అర్థాలంకార మూలతత్త్వములను నాల్గింటిని పేర్కొని సాదృశ్యమూలము లగు అలంకారములను ఈ క్రింది కారికలో సంగ్రహించినాడు.

> "ఉపమోత్ప్రేక్షా రూపక
> మపహ్నుతిః సంశయః సమాసోక్తిః,
> మత ముత్తర మన్యోక్తిః
> ప్రతీప మర్థాంతరన్యాసః.

ఉభయన్యాస భ్రాన్తిమ
దాక్షేప ప్రత్యనీక దృష్టాన్తాః,
పూర్వ సహోక్తి సముచ్చయ
సామ్యస్మరణాని తద్భేదాః."

ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, అపహ్నుతి, సంశయము, సమాసోక్తి, మతము (అర్వాచీనులు దానిని అపహ్నవ భేదముగ గ్రహించినారు), ఉత్తరము, అన్యోక్తి, ప్రతీపము, అర్థాంతరన్యాసము, ఉభయన్యాసము, భ్రాంతిమత్, ఆక్షేపము, ప్రత్యనీకము, దృష్టాంతము, పూర్వము, సహోక్తి, సముచ్చయము, సామ్యము, స్మరణము అను ఇరువది యొక్క అలంకారములును ఔపమ్య భేదములు."

రుద్రటునికి పూర్వమునందున్న వామనుడు అలంకారము లన్నియు ఉపమా మూలములే (స్వరూపములే) యని చెప్పి యున్నాడు :

"సంప్రత్యర్థాలంకారాణాం ప్రస్తావః, తన్మూలం చోపమైవేతి సైవ విచార్యతే." (కావ్యాలంకార సూత్రము - ద్వితీయాధ్యాయ ప్రారంభము). అర్థాలంకారము లన్నిటికిని ఉపమయే మూలము గాన దానిని గూర్చి ముందుగ చర్చించుచున్నాను అని దాని యర్థము. "ప్రతివస్తు ప్రభృతి రుపమా ప్రపఞ్చః" (కా. సూ. 4.3.1.) "ప్రతి వస్త్వలంకారాదులు ఉపమావిశేషములే యను మతమును అనుసరించి, తానుచూపిన దాదాపు ఇరువదియైదు అలంకారములును ఉపమాసంబద్ధములే యను విషయమును స్పష్టీకరించు విధమున లక్ష్యలక్షణాదులను ఇచ్చియున్నాడు. చివరకు—

"బహు వైచిత్ర్య గర్భేయ
ముపమైవ ప్రపఞ్చితా,
అలంకారైకదేశా యే
మతాః సౌభాగ్య శాలినః
తేఽప్యలంకార దేశీయాః
యోజనాయాః కవీశ్వరైః"
(కా. సూ, చతుర్థాధికరణాంతము)

అని వ్రాసియున్నాడు. తాను చెప్పినవికాక ఇంకను ఏవైన అలంకారములున్నచో అవి అన్నియు పై అలంకారములలో ఏదియో ఒకదాని సంస్పర్శగల అలంకారైకదేశము లనియు, కావున ఉపమయే సర్వాలంకారమూల మనెడు తన సిద్ధాంతమునకు ఏ విఘాతము లేదనియు ఇందలి అభిప్రాయము.

"ప్రతివస్తు ప్రభృతి రుపమా ప్రపఞ్చః" అను వామనవాక్యమునే మనస్సులో నుంచుకొని అర్వాచీనాలంకారికుడగు అప్పయదీక్షితులు ఉపమయే వివిధాలంకార రూపములతో అలరారుచున్నదను విషయమును చిత్రమీమాంసయందు ఆలంకారిక భాషలో చాల చక్కగ చెప్పియున్నాడు.

"ఉపమైకా శైలూషీ
సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్,
రంజయతి కావ్యరంగే
నృత్యన్తీ తద్విదాం చేతః."

"ఉపమయను నర్తకి యొక్కతెయే కావ్యరంగమున విచిత్రవేషములను ధరించి కావ్యతత్త్వజ్ఞులగు సహృదయుల మానసములను అలరించుచున్నది."

ఈ విషయము నీతడు సోదాహరణముగ, సవిస్తరముగ ఈ క్రింది విధమున ప్రతిపాదించి యున్నాడు.

"ముఖము చంద్రునివలె ఉన్నది" అనుసాదృశ్య వర్ణనమే ఉపమ. ఈ ఉపమయే ఉక్తివైచిత్రిచే అనేకాలంకారముల రూపమును ధరించుచుండును. "ముఖము చంద్రునివలె నున్నది, చంద్రుడు ముఖమువలె నున్నాడు" అని చెప్పినచో అది ఉపమేయోపమాలంకారము. "ముఖము ముఖము వలె నున్నది" అని చెప్పినచో అనన్వయాలంకారము. "చంద్రుడు ముఖమువలె నున్నాడు" అనునది ప్రతీపాలంకారము. "చంద్రుని చూడగనే ముఖము స్మృతికి వచ్చుచున్నది" అనునది స్మరణాలంకారము. "ముఖమే చంద్రుడు" అనునది

రూపకాలంకారము. "ముఖచంద్రుడు తాపమును శమింప చేయుచున్నాడు" అనునది పరిణామాలంకారము. "ఇది ముఖమా లేక చంద్రుడా?" అనునది సందేహాలంకారము. "చకోరములు చంద్రుడను కొని నీముఖమువైపు పరువెత్తుకొని వచ్చుచున్నవి" అనునది భ్రాంతిమదలంకారము. "చంద్రుడని చకోరపక్షులును, పద్మమని తుమ్మెదలును నీముఖముపై ఆసక్తి చూపుచున్నవి" అనునది ఉల్లేఖాలంకారము. "ఇది ముఖము కాదు; చంద్రుడు" అనునది అపహ్నవాలంకారము. "ఇది నిజముగ చంద్రుడే" అనునది ఉత్ప్రేక్షాలంకారము. ముఖమును చూపి "అదిగో చంద్రుడు" అనినచో అతిశయోక్త్యలంకారము. "ముఖము చంద్రకమలములను జయించినది" అనునది తుల్యయోగితాలంకారము. "రాత్రియందు చంద్రుడును, నీముఖమును అధిక ప్రకాశవంతములై యున్నవి" అనునది దీపకాలంకారము. "నేను నీముఖమునందే ఆసక్తుడనై యున్నాను, చకోరము చంద్రునియందే ఆసక్తమై యున్నది" అనునది ప్రతివస్తూపమాలంకారము "దివి చంద్రో భువి త్వన్ముఖమ్" - ఆకాశమున చంద్రుడు భూమిపై నీముఖము-అనునది దృష్టాంతాలంకారము. "ముఖము చంద్రుని శోభను ధరించుచున్నది" అనునది నిదర్శనాలంకారము. "నిష్కలంకమగు నీముఖము చంద్రుని మించి యున్నది" అనునది వ్యతిరేకాలంకారము. "రాత్రులందు చంద్రుడు నీముఖముతో కూడ (పాటు) ప్రకాశించుచున్నాడు" అనునది సహోక్త్యలంకారము. "ముఖం నేత్రాంకరుచిరం స్మిత జ్యోత్స్నాపశోభితమ్" - నేత్రములనెడు అంకముతో శోభించునదియు స్మితమనెడు వెన్నెలతో ప్రకాశించుచున్నదియు నగు నీముఖము - అనునపుడు విశేషణ సామ్యముచే అప్రకృతమగు చంద్రరూపార్థము గమ్యమగుచున్నదిగాన సమాసోక్త్యలంకారము. "అబ్జేన సదృశం వక్త్రం హరిణాహితసక్తినా" - ముఖము సూర్యునియందు ఆసక్తి గల పద్మముతో సమానమైనదని ఒక యర్థము. లేడితోకూడిన చంద్రునితో సమానమైనదని రెండవ యర్థము - ఇత్యాదులందు శ్లేషాలంకారము "ముఖము ఎదుట చంద్రుడు కాంతి విహీనుడు" అనునది అప్రస్తుత ప్రశంసాలంకారము."

ఈ విధముగ ఉపమాలంకారము వివిధాలంకారములలో అంతర్గతమై యున్నదను విషయమును సోదాహరణముగ నిరూపించి చిత్రమీమాంసాకారుడు "బ్రహ్మజ్ఞానము కలవానికి సమస్త విశ్వస్వరూపము తెలియునట్లు ఉపమాజ్ఞానము కలవానికి అలంకార ప్రపంచమంతయు కరతలామలకమై యుండు" నని చమత్కరించినాడు.

"తదిదం చిత్రం విశ్వం
బ్రహ్మజ్ఞానా దివోపమా జ్ఞానాత్,
జ్ఞాతం భవతీ త్యాదౌ
నిరూప్యతే నిఖిల భేదసహితా సా."

(చిత్రమీమాంస)

ఇట్లు వైదిక వాఙ్మయమునందు అంకురితమై, రామాయణ భారతాదులందు పల్లవితమైన ఉపమా వృక్షము మహాకావ్య నాటకాదులలో శాఖోపశాఖలతో అతివిస్తృత రూపమును పొంది వివిధాలంకార రూపములగు మనోహర సుమనో గుచ్ఛములతో అలరారుచున్నది.

శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

# కాణ్వ వ్యాకరణము

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందు D 1245 సంఖ్యతో త్రిలింగశబ్దానుశాసన మను నముద్రితాంధ్రవ్యాకరణ మొక్కటి కలదు. తత్కర్త అథర్వణాచార్యుఁ డైనట్లు కాండాంత గద్యలు చెప్పుచున్నవి[1]. ఈ గ్రంథప్రారంభము నందు—

"బార్హస్పత్యాని సర్వాణి[2]
కాణ్వం వ్యాకరణం విదన్
నానావిధప్రయోగాంశ్చ
జ్ఞాత్వా వివిధపంక్తికాః."[3]

అని తత్కర్త బార్హస్పత్య కాణ్వ వ్యాకరణము లను జూచియున్నట్లు చెప్పఁబడియున్నది. ఆంధ్ర వ్యాకర్తలలో కణ్వునకు స్థానము కలదని చెప్పు నాధారములలో నిదియే నాకుఁ దెలిసినంతవఱకు మొట్టమొదటిది.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందే "ఆంధ్రకౌముది" అను మఱియొక తెలుఁగు వ్యాకరణమునకు మూఁడునాలుగు ప్రతులు కలవు.[4] తత్కర్త మంద లక్ష్మీనరసింహాచార్యులు. వీనిలో D 1223 సంఖ్యగల ప్రతికిని కడమమూఁడింటికిని చాల భేదము గలదు. కడమమూఁడును నొకే విధముగా నున్నవి. మొదటిది అముద్రితము. దీని ప్రణాళిక చాల విశాలమైనది. ఎన్నియో కవిప్రయోగములు దీనిలో నుదాహరింపఁబడి యున్నవి. కడమ మూఁటి ప్రమాణము చిన్నది. ఇది విజయనగర వాస్తవ్యులు శ్రీ పరవస్తు శ్రీనివాసస్వామిగారిచేత నొకమాఱు పూర్వము ముద్రింపఁబడినది. కాని యిప్పుడు ప్రతులు లభించుటలేదు. మంద లక్ష్మీ నరసింహాచార్యులు గ్రంథారంభమునందు

"ఆథర్వణాని కాణ్వాని
బార్హస్పత్యాని సంవిదన్
కౌముదీ మాంధ్రశబ్దానాం
సూత్రాణి చ కరోమ్యహమ్"[5]

అని తనకు ఆథర్వణ కాణ్వ బార్హస్పత్య వ్యాకరణములు తెలిసియున్నట్లు చెప్పినాఁడు. లక్ష్మీనరసింహాచార్యులు పేర్కొన్న ఆథర్వణవ్యాకరణము త్రిలింగశబ్దానుశాసనమే యని యాంధ్రకౌముదిని జూచిన స్పష్టము కాఁగలదు. అనఁగా కణ్వు నాంధ్ర వ్యాకర్తగాఁ బేర్కొనుటలో మంద లక్ష్మీనరసింహాచార్యులు రెండవవాఁ డన్నమాట.

త్రిలింగశబ్దానుశాసనము, ఆంధ్రకౌముది అను పై రెండు వ్యాకరణములలో కణ్వుఁ డాంధ్రవ్యాకరణ కర్తగాఁ బేర్కొనఁబడుటమాత్రమే కాదు; కాణ్వ వ్యాకరణమునుండి కొన్ని శ్లోకములును సూత్రములును గూడ వానిలో నీయఁబడియున్నవి. కనుక కణ్వుఁ డొక ఆంధ్రవ్యాకర్త యనియు నాతని

1. "ఇతి శ్రీచతుష్షష్టి కళాఢ్య ర్యాథర్వణాచార్య విరచితే త్రిలింగశబ్దానుశాసనే ప్రథమకాండః".
2. బార్హస్పత్యము సూత్రాత్మక మయిన ఆంధ్రవ్యాకరణము. దీనినిగూర్చి "ఆంధ్రవ్యాకరణవికాస" మను నాసిద్ధాంతవ్యాసమునందు వివరముగా చర్చించి ఉపలబ్ధసూత్రముల నొసఁగియున్నాను. కనుక "సర్వాణి" యనునది "సూత్రాణి"అని యుండఁదగునని నాయభిప్రాయము.
3. త్రిలిం. శబ్దా. 1 కాం. 3 శ్లో.
4. D 1223, 24, 25, 26 సంఖ్యలు గలవి.
5. ఆం. కౌము. (విజ.) 1 పు.

గ్రంథము ఆంధ్రవ్యాకరణ మనియు ననుటలో సందేహము లే దన్నమాట.

శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు "ద్రావిడభాష కగస్త్యునివలె నాంధ్రభాషకు వాల్మీకి ఆదివ్యాకరణ కర్త యని గ్రంథములు వచించి యున్నవి. కణ్వాదులును ఆంధ్రవ్యాకరణముల రచించిరి."[6] అని కణ్వుని ఆంధ్రవ్యాకరణకర్తగాఁ బేర్కొనిరి. శ్రీ సుబ్బారావుగారు చెప్పినగ్రంథములు త్రిలింగశబ్దానుశాస నాంధ్రకౌముదులే కాని యన్యములు కావు. ఆంధ్రకౌముదియందు "పూర్వమే వాంధ్రభాషోత్పత్తి ర్భగవతావాల్మీకినా ప్రోక్తం ప్రాకృతాదిషు"[7] అనియు త్రిలింగశబ్దానుశాసనమునందు "ఏతద్వాల్మీకినా ప్రోక్తం ప్రాకృతాదౌ చ వస్తుతః"[8] అనియు వాల్మీకి ప్రాకృతవ్యాకరణకర్త యైనట్లు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. కనుక వాల్మీకి ఆంధ్రవ్యాకర్త కాఁ డన్నమాట. వాల్మీకి ప్రాకృతవ్యాకరణము సుప్రసిద్ధము. త్రివిక్రముఁడు, లక్ష్మీధరుఁడు, బాలసరస్వతి,[8a] అప్పయదీక్షితుఁడు ఈ వాల్మీకిప్రాకృతవ్యాకరణమునకు వృత్తులు రచించిరి. దీని కాంధ్రదేశమున బహుళప్రచార ముండెననుటకు కుమారస్వామిసోమపీథి రత్నాపణము, అప్పకవీయము, వైకృతచంద్రిక, ఆంధ్రకౌముది, త్రిలింగ శబ్దానుశాసనము మొదలగు పెక్కుగ్రంథములు సాక్ష్యమిచ్చుచున్నవి. అయినను నిటీవలి కాలమున వాల్మీకి ప్రాకృతవ్యాకరణమునకు మన దేశమున ప్రచారము తగ్గిపోయినందువలనఁ గాఁబోలును శ్రీసుబ్బారావుగారు వాల్మీకిని ప్రథమాంధ్రవ్యాకరణకర్తగా భావించిరి. కనుక అది సరికాకపోయినను శ్రీ సుబ్బారావుగారు చెప్పినట్లు కణ్వాదులాంధ్రవ్యాకరణకర్త లగుటమాత్రము నిజము.

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు "ప్రాఁదెనుఁగుఁగమ్మపై నంపగమి"[9] యను తమవ్యాసమునందుఁ గణ్వు నాంధ్రవ్యాకరణకర్తగాఁ బేర్కొన్నారు. కాని వా రందు "కాణ్వవ్యాకరణ మథర్వణకారికావళియే కాని వేఱు గాదు" అని వ్రాసినారు. ఇట్టే అంధ్రశబ్దచింతామణియే బార్హస్పత్యాంధ్రవ్యాకరణ మని వారి యభిప్రాయము.[10] కాని శ్రీపార్వతీశ్వరశాస్త్రిగారు అముద్రితము లగు ఆంధ్రకౌముది, త్రిలింగశబ్దానుశాసనములను జూచినట్లు కానరాదు చూచినచో వికృతివివేకచింతామణులను కాణ్వబార్హస్పత్యవ్యాకరణములుగాఁ జెప్పియుండువారు కారు. కనుక వారన్నట్లు అథర్వణకారికావళి కాణ్వవ్యాకరణము కాదు. కాని కణ్వుఁడు ఆంధ్రవ్యాకరణకర్త యనుట మాత్రము నిజమన్నమాట.

"త్రిలింగభాషాయాః ప్రత్యయ ప్రాతిపదికాని సంత్యేవ, ఋష్యంశజాతో యో విప్రః స త్రిలింగ కవి ర్భవేత్" అని ఆంధ్రభాషకును సంస్కృతమునకువలెనే ప్రకృతిప్రత్యయవిభాగము కల దనియును గనుక అట్టిభాషలో కవిత్వము వ్రాసిన వాఁడును ఋషియే యనియును వచించి యాంధ్రభాషకు వ్యాకరణమును వ్రాసిన వాఁడు కణ్వుఁడు.

ఈతఁడు రచించినసూత్రములు రామునకు,[11] హరిని,[12] హరికి, గురువు,[13] గురుడు,[14] రమ,[15]

6. సుల. వ్యాక. సంజ్ఞా. 5 సూ. వివ. 7. ఆం. కౌము. (విజ) 1 పు.

8. త్రిలిం. శబ్దాను. కాం. 3 శ్లో. 1. 8a. బాలసరస్వతి రచించిన భాషావివరణము వాల్మీకి సూత్రములకు వృత్తి యని నేను నాసిద్ధాంత వ్యాసమునందు గుర్తించి చూపితిని. కాని ఆగ్రంథము నాకు లభించినది కాదు. అడయారు గ్రంథాలయమునందు బాలసరస్వతి భాషావివరణప్రతి కల దని మిత్రులు శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారు వివరముల నొసఁగియున్నారు.

9. ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక. 3 సం. 2 సంచి. 10. Ibid.

11. నే ర్నికా వదంతస్య (8 సూ.) 12. కో ర్నో రిత్వ మితః (10 సూ.)

13. ఉదంతానాం పు స్స్వప స్స్యాత్ (11 సూ.) 14. డుజ స్తథా (13 సూ.)

15. త్రిషు హ్రస్వస్తు దీర్ఘాణామ్ (14 సూ.)

దార, గౌర[16] మొదలగుతెనుగురూపములను సాధించుటకు దగినవిగా నున్నవి. ఇవి కణ్వసూత్రములే యని స్పష్టముగా వాని నిచ్చు సందర్భములలో నథర్వణుడు పేర్కొనియున్నాడు.[17] మంద లక్ష్మీనరసింహాచార్యులుకూడ ఆంధ్రకౌముదియందు "సంయోగ శ్చాలుకి కణ్వస్య"[18] "రో రాయః కణ్వస్య"[19]అను సూత్రములచేత గణ్వమతము నందు రాము గ్గరుణాజలదిన్, రో అనునవి సిద్ధించు నని చెప్పినాడు. నరసింహాచార్యులు చెప్పిన యీ రెండుసూత్రములు త్రిలింగశబ్దానుశాసనమున లేవు. కనుక అతడు కేవలము త్రిలింగశబ్దానుశాసనమును మాత్రమే చూచి కణ్వ నాంధ్రవ్యాకర్తగా పేర్కొనలేదనియు, నాతడు స్వయముగా గణ్వవ్యాకరణమును జూచియేయుండెననియు వీనినిబట్టి నిశ్చయ మగుచున్నది.

లభించిన కొలదిమాత్రముసూత్రములనుబట్టి చూచినను సంజ్ఞా సంధి శబ్ద పరిచ్ఛేదములు కాణ్వ వ్యాకరణమునం దుండె నని చెప్పవచ్చును.

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు వచించినట్లు[20] కాణ్వ బార్హస్పత్యవ్యాకరణములు కేవల నామమాత్రావశిష్టములు కా వనియు వానిలో గొన్ని సూత్రములు మనకు లభించిన వనియు జెప్పుటకు వీనివలన నవకాశము కలిగిన దన్నమాట.

కాణ్వాంధ్రవ్యాకరణ మొకటి కల దని సిద్ధమయినపిదప దత్కర్త కణ్వు డేకాలమువాడు? అను ప్రశ్న ముదయించును. దీనికి వెంటనే వచ్చు సమాధానము కాణ్వవ్యాకరణముయొక్క ఉనికిని మనకు దెలియజెప్పినది త్రిలింగశబ్దానుశాసనము కనుక కణ్వుడు త్రిలింగశబ్దానుశాసనకర్తకన్న ప్రాచీను డనునది.

త్రిలింగశబ్దానుశాసనకర్త "చతుష్షష్టి కళాధుర్యాథర్వణాచార్య" దని దానిలోని కాండాంతగద్యలు చెప్పుచున్నవి. అథర్వణకారికావళి యను నామాంతరముగల వికృతివివేకకర్తయు నీతడు నొక్కడేనా? లేక వేర్వేరు వ్యక్తులా? అని యడిగినచో నొక్కరని చెప్పుటకు దగినయాధారములు లేవు; కాని త్రిలింగశబ్దానుశాసనకర్తయు భారత కర్తయు నొక్కరే యని చెప్పుటకుమాత్ర మంత సాక్ష్యము కలదు. "వేశ్యో పారుడి రిష్యతే"[21] యని త్రిలింగశబ్దానుశాసనమున "పారుడి" యను నొక విభక్తి ప్రత్యయము చెప్పబడియున్నది. వికృతివివేకమున నీవిభక్తిప్రత్యయము పేర్కొనబడలేదు కాని అథర్వణుని భారతమునందు,

"నే నిటగొ మక్కలోద్భవు డైనజముని
పట్టిపారుడి శాపంబు వాసి తింక
సొర్గమున కేగెదను మీరు సుఖము జెంది
యుండు డనుచు విమానము........"[22]

అను నాదిపర్వపద్యమున పారుడి ప్రయుక్తమయినట్లు మంద లక్ష్మీనరసింహాచార్యులచే నుదాహరింపబడియున్నది. ఇది భారత త్రిలింగశబ్దానుశాసనముల యేకకర్తృకతకు సాధకముగా నున్నది.

అట్లయినచో నీ యథర్వణుడు, తనవ్యాకరణమున వాల్మీకిని పేర్కొనియున్నాడు కనుక ప్రాకృతవ్యాకరణకర్త వాల్మీకి హేమచంద్రాచార్యునితరువాతివా డని ప్రాకృతసాహిత్యవిమర్శకులు నిర్ణయించియున్నందువలన క్రీ. శ. 13వ శతాబ్దివాడు కావచ్చును. అంతకంటె పూర్వుడు ఆంధ్రవ్యాకరణకర్త యైన కణ్వు డనుటలో నేమాత్రమును సంశయము లేదు. ఇది కణ్వునికాల నిర్ణయమునకు బహిస్సాక్ష్యముమాత్రమే. అంత స్సాక్ష్య మేమయిన గలదేమో చూతము.

16. అ శ్చైకవచనే (16 సూ.) 17. త్రిలిం. శబ్దా. కాం. 3. 18. ఆం. కౌము (విజ.) 21 పు.
19. ఆం. కౌము (D 1223) 45 పు. 20. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపు. 3 సంచి. 2.
21. త్రిలిం. శబ్దాను. 4 కాం.
22. ఆం. కౌము (D 1223.) 32 పు. దీనిలోని నాల్గవపాదమున యతిభంగమే కాక లేఖకదోషములును గలవు. "ఉండు డనుచు విమానము నెక్క తగయలే" అనురీతిగా నున్న దీపాఠము.

"ఆంధ్రవిష్ణో రనుజ్ఞాతస్య మద్వ్యాకరణస్య ద్రోహీ గురుద్రోహీ" యని కణ్వుఁడు తనవ్యాకరణ ప్రశస్తినిగూర్చి చెప్పినట్లు త్రిలింగశబ్దానుశాసనాంధ్ర కౌముదులు రెండింటను జెప్పఁబడి యున్నది. ఇందలి ఆంధ్ర విష్ణువు చారిత్రకపురుషుఁ డయినచో కణ్వుఁ డాతనికాలమునాఁటివాఁ డనిమాత్రమే కాక కణ్వుని నివాసము కృష్ణామండల మనికూడ నిర్ణయమగును.

ఆంధ్రవిష్ణువున కాంధ్రభాషతోఁ గలసంబంధ మునుగూర్చియు నాతనిచరిత్రాదికమునుగూర్చియు వచించు నీ క్రింది శ్లోకము లిక్కడ నుదాహరింపఁ దగినవి.

"ఆంధ్రనాథో మహావిష్ణుః
నిశంభుదనుజాపహః
పురా స్వాయంభువమనోః
కాలే కలియుగే హరిః.

కాకులే రాజవర్యస్య
సుచంద్రస్య తనూభవః
అభవ త్సర్వదేవైశ్చ
వేష్టితో లోకపూజితః.

శ్రీశైల భీమ కాళేశ
మహేంద్రగిరి సంయుతమ్
ప్రాకారం తు మహత్ కృత్వా
త్రీణి ద్వారాణి చాఽకరోత్,

త్రిలోచన స్సన్మహేశ
స్త్రిశూలం చ కరే ధృతః
త్రిలింగరూపే ణావాస
త్రిద్వారేషు గణై ర్వృతః.

ఆంధ్రవిష్ణు స్సురయుతో
దనుజేన నిశంభునా
యుద్ధ్వా త్రయోదశయుగాన్
హత్వా తం రాక్షసోత్తమమ్.

అవస త్తత్ర ఋషిభి
ర్యుతో గోదావరీతటే,
తత్కాలప్రభృతి క్షేత్రం
త్రిలింగ మితి విశ్రుతమ్."[23]

వీనినిబట్టి శ్రీకాకుళము రాజధానిగా నేలిన ఆంధ్ర విష్ణువు సుచంద్రుఁ డనురాజు కొడుకు. నిశంభుఁ డనురాక్షసుని జయించి దేవతల మెప్పించినవాఁడు. త్రిలింగ మనుపేరీదేశమున కానాఁటినుండి వ్యవహారములోనికి వచ్చినది ఋషులు పలువు రాకాలమున గోదావరీతీరభూములను దమ నివాసముగాఁ జేసికొన్నారు. మూఁడు శివక్షేత్రములును నప్పటి నుండియే ప్రసిద్ధములుగా నుండినవి.

కాని పైశ్లోకము లాంధ్రవిష్ణువుకు కణ్వునితోడి సంబంధమును జెప్పుటలేదు. కాని అట్లు గోదావరీ తటమున నివసించిన మహర్షులలోఁ గణ్వుఁడుకూడ నుండె నేమో ? ఉన్నయాతఁ డప్పుడే రూపు సంతరించుకొనుచున్న ఆంధ్రమునకు వ్యాకరణమును రచించి ఆంధ్రవిష్ణువు మన్నన లందుకొనె నేమో?

అంధ్రవిష్ణువు సాతవాహనులకన్నఁ బ్రాచీనుఁ డని చారిత్రకుల అభిప్రాయము. అట్లయినప్పుడు చాళుక్యులకాలముదాక సాహిత్యము లేని మనభాష కంతకు వేయి సంవత్సరములకన్న నెక్కువ ప్రాచీనకాలమున వ్యాకరణము వ్రాయఁబడె ననుట నమ్మరాని దని యొకనిర్ణయమున కెవరేని రావచ్చును.

కాని హాలుని యాస్థానములోని గుణాఢ్యుని శపథము అప్పటికే దేశభాషలు పటిష్ఠములుగా నున్న వని చెప్పుచున్నదిగదా ! ప్రాకృత కావ్యములలో నాంధ్ర్యపదము లున్నవని విజ్ఞులు గుర్తించిరి గదా ! మఱి అట్లయినప్పుడు ఆంధ్రమును వ్యాకరణబద్ధము కావించు ప్రయత్నము కూడ నానాఁడే ప్రారంభ మయిన దని యనుట కభ్యంతర ముండ రాదు.

23. ఆం. కౌము. (విజ.) 2 పు; ఆం. కౌము. (D 1223) 2 పు; త్రిలిం. శబ్దా. 3 కాం.

అంతేకాదు. ఇక్కడ మఱి కొంచెము చూడఁ దగిన యంతస్సాక్ష్యము కూడ నున్నది. మనకు లభించిన కాణ్వవ్యాకరణసూత్రములు తత్సమశబ్ద సాధన కుపకరించునట్టివి మాత్రమే. విభక్తి ప్రత్యయములలో కు, ను, ని, కి, వు, డు అనునవిమాత్రమే ఈ వ్యాకరణమున నున్నవి. ఇవి చాల ప్రాచీనములు కావలయు ననుటలో నెవ్వరికిని విప్రతిపత్తి యుండదు. "అందు" విభక్తి ప్రత్యయ మనుట కన్న విడిపదముగాఁ జెప్పఁబడిన దనుకొనుట తగును. చేత, తోడ, వలనేత్యాదులు తరువాత తరువాత విభక్తి ప్రత్యయము లైనవి. కనుక నీ విభక్తి ప్రత్యయములును కాణ్వవ్యాకరణము యొక్క ప్రాచీనతనే చెప్పుచున్నవి. ఇట్లే కాణ్వ వ్యాకరణము సంస్కృతములోని మూఁడులింగముల ప్రణాళికను తెనుఁగునకు సమన్వయింపఁ జూచినది. ఇదియు దాని ప్రాచీనతనే చాటును. కనుక ఈయంశములను నిష్పక్షపాత దృష్టితోఁ బరిశీలించినచో కాణ్వము ప్రథమాంధ్రవ్యాకరణమనియు నది సాతవాహనరాజులకన్నఁ బూర్వమే వ్రాయఁబడె ననియు నిర్ణయింపవలసి యుండును. బార్హస్పత్యాద్యాంధ్ర వ్యాకరణములు తరువాత వ్రాయఁబడి ఆంధ్రశబ్దచింతామణివంటి భాషా సహజ సంప్రదాయ వ్యాకరణముల రచనకుఁ బూర్వరంగముగా నొప్పె నని నిర్ణయింపవలెను. ఉపలబ్ధములైన కాణ్వవ్యాకరణసూత్రములను సంస్కరించి ప్రక్క పుటలో పొందుపఱచుచున్నాను.

## (ఉపలబ్ధ) కాణ్వవ్యాకరణము

ఆంధ్ర సంస్కృతభాషా స్తు
దేవతార్హాః ప్రమోదదాః
సుబంతై శ్చ కృదంతై శ్చ
యుక్తాః స్వర్గప్రదా నృణామ్.[1]

ఆంధ్ర సంస్కృత భాషాభ్యాం
కవిత్వం ఋషితాప్రదమ్.[2]

యో దేవతాంశజో విప్రః
స సంస్కృతకవి ర్భవేత్
ఋష్యంశజాతో యో విప్రః
స త్రిలింగకవి ర్భవేత్.[3]

త్రిలింగభాషాయాః ప్రత్యయ
ప్రాతిపదికాని సంత్యేవ.[4]

త్రిలింగశాస్త్ర విహితస్య లక్షణ
స్యాల్పప్రయోగేన హైన్యం న కారయేత్.[5]

ఆంధ్రవిష్ణో రనుజ్ఞాతస్య
మద్వ్యాకరణస్య ద్రోహీ గురుద్రోహీ.[6]

సంయోగ శ్చాలుకి.[7]

నే ర్న్వా కా వదంతస్య.[8]

అందౌ చ.[9]

కో ర్నో రిత్వ మితః.[10]

ఉదంతానాం పు స్సుప స్స్యాత్.[11]

వా లోపశ్చ.[12]

డుజ స్తథా.[13]

త్రిషు హ్రస్వశ్చ దీర్ఘాణామ్.[14]

స్త్రియామ్.[15]

అ శ్చైకవచనే.[16]

---

1. త్రిలిం. శబ్దాను. 4 కాం.; ఆం. కౌము. (విజ) 3వ పు; ఆం. కౌము. (D 1223) 3వ పు.

2. త్రిలిం. శబ్దా. 4 కాం.; ఆం. కౌము. (విజ.) పరిభాషా. 3వపు; ఆం. కౌము. (D 1223)3వపు.

3. ఆం. కౌము. (1225) పరిభాషా; ఆం. కౌము. (1223) 3వ పు. విజయనగర ముద్రిత ప్రతియందిది కానరాదు.

4. ఆం. కౌము. (D 1223) 3 పు.

5. త్రిలిం. శబ్దాను. 3 కాం; ఆంధ్రకౌము. (D 1223) 4 పు: కాని యిం దిది బృహస్పతి వ్యాకరణము లోనిదిగాఁ జెప్పఁబడియున్నది.

6. త్రిలిం. శబ్దాను. 3 కాం; ఆం. కౌము. (విజ) పరిభా. 3 పు.; ఆం. కౌము. (1223) 4 పు; కాని యిందిది నాగరాజవచనముగాఁ జెప్పఁబడినది. 1225, 1226 ప్రతులలోను త్రిలింగశబ్దాను శాసనములోను కణ్వవచనముగా నుండుటచే నదియే సరియైన దని చెప్పవలెను.

7. ఆం. కౌము. (విజ.) సంధి 96 సూ: "సంయోగ శ్చాలుకి కణ్వస్య"యని సూత్రింపబడినదానిని బట్టి యిది కాణ్వవ్యాకరణసూత్రముగా నూహింపఁబడినది.

8. త్రిలిం. శబ్దాను. 3 కాం. 9. Ibid. 10. Ibid.

11, 12; 13, 14. "ఉదంతానాం పు స్సుప స్స్యాత్ వా లోపశ్చ డుజ స్తథా। త్రిషు హ్రస్వస్తు దీర్ఘాణాం ఋదంతస్య తతోఖిలమ్" అనువిధముగా (త్రిలిం. శబ్దా. 3 కాం.) నీయఁబడిన శ్లోకమును విడఁదీసి కూర్చఁబడిన సూత్రము లివి. 15. Ibid. 16. Ibid.

ఇదంతాదీనాం పుంవత్.[17]

ఋదంతస్య తతోఽఖిలమ్.[18]

రో రాయః.[19]

శ్రుత్యాది సమ్మత్యా చ.[20]

17. త్రిలిం. శబ్దాను. 3 కాం.

18. త్రిలిం. శబ్దాను. 3 కాం. పైనీయఁబడిన శ్లోకభాగమేయిది.

19. ఆం. కౌము. (D 1223) "రో రాయః కణ్వస్య" (45 పు.) అని కణ్వమతముగాఁ జెప్పఁబడినదానినిబట్టి యీసూత్ర మూహింపఁబడినది.

20. "స్మృత్యాదిసమ్మతినా(?)చ ఆంధ్రసంస్కృతభాషాభ్యాం కవిత్వమృషిత్వప్రదమ్ తథాచ శ్రుతిః "ఋషి ర్విప్రః కావ్యేన", స్మృతిశ్చ "నానృషిః కురుతే కావ్యమ్" ఇత్యాది నిర్దిష్టవాన్ కణ్వః" (ఆం. కౌము. (విజ.) 3, 4 పు.) అని దీనికి పాఠాంతరము కానవచ్చుచున్నది. "శ్రుత్యాదిసమ్మత్యా చ" అనునది D 1223 పాఠము. సరియైనపాఠముకూడ నిదియే. ముందు శ్రుతివాక్యమే యీయఁబడినది గదా ! ఇంతకునిది కాణ్వవ్యాకరణ సూత్రమగునో ? కాదో ? దాని రచన సూత్రమున కనుగుణముగా నున్నది. కడమది వివరణము కావచ్చును.

శ్రీ సన్నిధానము
సూర్యనారాయణశాస్త్రి

# ఆ శీ స్సు మ మా ల

శ్రీమాన్ లక్ష్మీనాథో । లక్ష్మీం చ సదాశివ శ్శివం చ సదా
బ్రహ్మాయుశ్చ సుదీర్ఘం । దత్వా గోలీశ్వరం పాంతు.

ముంగిటిముత్తియంబయి ప్రమోద మొసంగఁగ శంకరుండు, ముం
గొంగుఁబసిండియై తనదుకోర్కులు దీర్చుచునుండ శ్రీనివా
సుండు, కొమాళ్ళుఁ గూఁతులును శోభిల, మన్మలు మన్మరాండ్రు సె
ల్గంగ సమస్తసౌఖ్యములు గాంచుము గోలికులీన! యీశ్వరా!

అర్థమట్లు సమృద్ధమై యలరుఁగాతఁ
దావకంబైన ధర్మంబు; ధర్మమట్లు
అర్థము సమృద్ధమై పొలుపారుఁగాత
నీకు గోలీ కులోద్వహా! ఈశ్వరయ్య!

ధనమున్నందుకు గైహికంబులగు క్షుద్రక్షుద్ర సౌఖ్యంబులన్
మునుకల్ వేయుచు నుళ్ళలోఁబడి యెటో పోకుండ మర్త్యుండు స
జ్జన సాంగత్యముఁబొంది పుణ్యరతుఁడై సత్కార్యముల్ సేయుచున్
అనఘంబైన యశంబుఁ గాంచవలెనయ్యా! యీశ్వరయ్యా! యిటుల్.

రాతి గోలిగాదు; రమణీయమైన ర
త్నాలు పొదిగినట్టి గోలి యిద్ది
యనుచు నర్థిబృంద మద్దాని హరియింపఁ
గన్నువేసి కాచియున్న దిచట.

శ్రీ మొదలి నాగభూషణశర్మ

# తెలుగు నవల : జాతీయోద్యమ ప్రభావం

"ప్రాచీన భారతదేశంలో జాతీయత" అన్న గ్రంథంలో ప్రొఫెసర్ రాధాకుముద్ ముఖర్జీ ఋగ్వేదకాలంనుంచీ భారతదేశంలో జాతీయతా భావం ఎలా ప్రజల జీవితాలను సంఘటితపరుస్తూ వచ్చిందో సోదాహరణంగా వివరించారు. ప్రకృతి శక్తులను ఆరాధించి, ఆవాహనంచేయడానికి ఉద్దేశింపబడ్డ ఋక్కులు, పృథ్వీమాతను ఆవాహనం చేయడానికి ఉపలక్షించిన పృథ్వీసూక్తం మొదలైనవన్నీ భారతదేశంలోని తరతరాల ప్రజల దేశభక్తికి తార్కాణగా ఆయన ఉదాహరించారు.[1] కాని మధ్యయుగంలో మరుగున పడిపోయి, ఆధునిక కాలంలో తిరిగి తలయెత్తిన భారత జాతీయోద్యమానికి 1857 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య సమరంలోనే బీజారోపణం జరిగింది. ఆనాటినుంచి విద్యావంతులైన మేధావుల ఆధ్వర్యంలో జాతీయ మహాసభ (కాంగ్రెసు, 1885) ప్రారంభం అయ్యేవరకు ఆభావం చిగురిస్తూనే వచ్చింది. అంతేకాదు. ఆనాటినుంచి ఈనాటివరకు ఈజాతీయోద్యమం సాహిత్యాన్నంతనూ, ముఖ్యంగా నాటక నవలా సాహిత్యాలను ప్రభావితం చేస్తూనే ఉంది.[2]

ఏ ఉద్యమమైనా సాహిత్యం మీద తన ప్రభావాన్ని రెండువిధాలుగా ప్రసరింపచేస్తుంది. ఒకటి ప్రత్యక్ష ప్రభావం: ఉద్యమం జరుగుతూ ఉండగా, ఆ ఉద్యమ విశేషాలను, దాని ప్రాముఖ్యాన్ని ఎప్పటికప్పుడు ప్రజలకు చూపుతూ వ్రాయడం, ఉద్యమంలో పాల్గొన్న వారినే తమ రచనలలో పాత్రలుగా స్వీకరించడం ప్రత్యక్ష ప్రభావానికి ఉదాహరణలు. ఆ ఉద్యమం సంఘంమీద, లేదా కొందరు వ్యక్తులమీద ఎటువంటి ప్రభావాన్ని కలుగ చేసిందో చూపడం పరోక్ష ప్రభావానికి నిదర్శనం. తెలుగు సాహిత్యంలో ప్రతిబింబించిన భారత జాతీయోద్యమాన్ని పరిశీలిస్తే, ప్రత్యక్ష ప్రభావం కల రచనలు ఎక్కువగా నాటకాలలోను (వీనినే రాజకీయ నాటకాలు అనవచ్చు), పరోక్ష ప్రభావం గల రచనలు నవలలలోను మనకు కనిపిస్తాయి,

తెలుగులో వచ్చిన జాతీయభావ స్ఫోరకాలైన నవలలన్నీ పరోక్షప్రభావితాలేనని చెప్పవచ్చు. కాని వీనిలో కూడ ఎంతో భిన్నత్వం మనకు గోచరిస్తుంది. కొన్ని నవలలు జాతీయోద్యమాన్ని వర్ణించి, అందులో పాల్గొన్న కొందరువ్యక్తుల జీవితాలను ఆలంబనంగా గ్రహించి వ్రాయబడ్డవి. మరికొన్ని ఆ ఉద్యమ నిర్వహణంలో ప్రముఖ సూత్రాలుగా వెలువడ్డ అస్పృశ్యతానివారణ, గ్రామ పునరుద్ధరణము వంటి సమస్యలను చిత్రించినవి.

గాంధీజీ తన అసహాయోద్యమాన్ని ప్రారంభించక ముందే ఎందరో రచయితలు జాతీయతాభావాన్ని తమ రచనలలో పొందుపరచారు. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమైన తొలిరోజుల్లో ఈభావం ఇంకా విస్పష్టంగా రచనలలో తొంగి చూసింది. పందొమ్మిదవ శతాబ్దం చివరి రోజులలో

1. Prof. Radha Kumud Mukherjee, "Nationalism in Ancient India", పుటలు 14,27-28,42.

2. కావ్యాలలోను, ఖండకావ్యాలలోను ఈ నాడు జాతీయోద్యమ ప్రభావం అంతగా కనిపించడంలేదు. నవలలో ఇది ఎక్కువగా కనిపించడానికి కారణం ఆజాతీయోద్యమాన్ని తమ కథలకు పృష్ఠభూమి (back ground) గా స్వీకరించిన చాలమంది నవలాకారులు ఉండడమే.

రచయితలు జాతీయతా భావాన్ని ప్రత్యక్షంగా ప్రదర్శించడానికి వెనుకాడి దానిని పౌరాణిక, చారిత్రక గాథలద్వారా పరోక్షంగా వెలువరించారు. రామరావణ యుద్ధాన్ని, కురుపాండవుల యుద్ధాన్ని ప్రాతిపదికగా స్వీకరించి, మంచిని భారతజాతి గాను, దుర్మార్గాన్ని బ్రిటిష్ పరిపాలన గాను అన్యాపదేశంగా చూపారు. అలానే భారతదేశ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడానికి కంకణం కట్టుకొన్న రాణాప్రతాప్, శివాజీల వంటి వీరులకథలు కూడా పరోక్షంగా ఇట్టి జాతీయతాభావానికే ప్రోద్బలకాలైనాయి.

నవలాసాహిత్య చరిత్రను గమనిస్తే 1915 నాటికే ఈ చారిత్రక నవలలు పాఠకుల మన్ననలను పొందాయని స్పష్టమవుతుంది. ఇందులో కొన్ని స్వతంత్రాలు, చాలవరకు అనువాదాలు. ఇట్టి నవలలను వెలువరించి భారతజాతీయోద్యమాన్ని, ఆంధ్రోధ్యమాన్ని తెలుగుదేశం నలుమూలలా విస్తరింప చేసిన ఖ్యాతి ఆంధ్రప్రచారిణీ గ్రంథ మాలను స్థాపించిన వెంకటపార్వతీశ్వరకవులది. వారు స్వయంగా ఇట్టినవలలు వ్రాయడమేకాక, తమ గ్రంథమాలలో ఇట్టి చారిత్రక నవలలను ప్రచురించి జాతీయోద్యమ భావానికి తెలుగు సాహిత్యంలో మేలుకొలుపులు పాడారు.

గాంధీజీ భారత రాజకీయ రంగంమీదికి రాక మునుపే తెలుగు నవలాకారులు, సంస్కర్తలు పంచముల ఉద్ధరణను గురించి ఎంతో శ్రద్ధ వహించారు. శ్రీ తల్లాప్రగడ సూర్య నారాయణమూర్తి గారు వ్రాసిన "హేలావతి" (9-5-1913 నాడు వెలువడ్డది) తెలుగులో అస్పృశ్యతా సమస్యమీద వ్రాయబడిన తొలినవల. దీనిలో శ్రీమూర్తిగారు అస్పృశ్యలని దూరంగా ఉంచుతూ వచ్చిన పంచములు మిగిలిన కులాలవారికి ఏవిధంగానూ తీసిపోరన్న సత్యాన్ని వెలువరించారు. వేంకట పార్వతీశ్వరకవులు 1918లో వ్రాసి ప్రచురించిన "మాతృ మందిరము" అన్న నవల ఈనాటివరకు కూడా ఆసమస్యపై వచ్చిన ఉత్తమమైన నవలలలో ఒకటి. 1920 లో వచ్చిన వేలూరి శివరామశాస్త్రి గారి "అహోబలీయము" అన్ననవలిక ('ఓబయ్య' అన్నపేరుతో 'భారతి'లో వెలువడ్డది) జాతీయోద్యమంలోని బాగోగులను చర్చించిన మొట్ట మొదటి నవల.

తెలుగు నాటక సాహిత్యంలో వచ్చినంత రాజకీయసాహిత్యం నవలలలో రాలేదనే చెప్పాలి. నాటకాలు ప్రదర్శింపబడి, మారుమూలల ఉన్న చదువు లేనివారిని కూడా కదిలించగలవి కావడంవల్ల తెలుగులో ప్రచారనాటకాలు ఎక్కువ. నవలలలో సిద్ధాంత ప్రతిపాదన పరమైనవో, లేదా ఉద్యమం ఆనాటి వారిపై కలిగించిన ప్రభావాన్ని తెలియ చెప్పేవో ఉన్నాయి కాని రాజకీయ నవలలు లేవు.

అయినా, తెలుగు నవలా రచయితల్లో ప్రఖ్యాతులందరూ ఏదోవిధంగా గాంధీజీప్రభావానికి లోనైనవారే! ఎక్కడో ఒకచోట - తమ నవలలలో - గాంధీజీని గురించి, దేశంలో ఆయన సాగించిన ఉద్యమాన్ని గురించి గ్రంథస్థం చేసినవారే![3] ఇలా జాతీయోద్యమం వల్ల ప్రభావితమైన నవలలలో ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి", విశ్వనాథవారి "వేయిపడగలు", అడవి బాపిరాజుగారి "నారాయణరావు", "కోనంగి", బుచ్చిబాబు "చివరకు మిగిలేది", కొడవటిగంటి కుటుంబరావు "చదువు", మహీధర రామమోహనరావు "కొల్లాయి గట్టితే నేమి", ముప్పాళ్ళ రంగనాయకమ్మ "బలిపీఠం" ముఖ్యమైనవి. ఇవికాక ఇంకా ఎన్నో నవలల్లో ఈ విషయం ప్రస్తావింపబడ్డది. అందులో కొన్ని నవలలను గురించి ఇక్కడ పరామర్శించడం జరుగుతుంది.

1920 కి పూర్వమే బంకించంద్ర చటర్జీ నవ

3. ఇట్టివారిలో చెళ్ళపిళ్ళ, శ్రీపాద కృష్ణమూర్తిగార్ల దగ్గరనుండి అతినవీనుల వరకు ఈ ఉద్యమాన్ని గురించి, ఈ ఉద్యమనాయకుడైన గాంధీజీని గురించి ప్రశంసలు చేసినవారే!

లలు కొన్ని తెలుగులోనికి అనువదింపబడి ఈ జాతీయతా భావానికి అంకురార్పణ చేశాయి. తరువాత పేర్కొనదగిన నవల వెంకటపార్వతీశ్వరకవుల "మాతృమందిరము." ఈ నవలలో సంఘ దురాచారాలను గురించిన విమర్శ, సంస్కరణాభిలాష చూపబడ్డాయి. తరువాత తరువాత జాతీయోద్యమంలో ఒక భాగంగా పరిగణింపబడ్డ అస్పృశ్యతా నివారణను గురించి ఈనవల చాలా విప్లవాత్మకమైన అభిప్రాయాలను వెల్లడించింది (ఆనాటి దృష్ట్యా). బ్రాహ్మణ కుమారుడని తెలిసిన తరువాత కూడా రంగన్న - మాలజాతివాని కుమార్తె ముత్యాలును వివాహమాడటం అన్న సంఘటనను ఇంత విస్పష్టంగా ఆనాడు చూపడానికి ఎంతో ధైర్యం అవసరం అయివుండాలి.

జాతీయ సాహిత్యంలో "మాలపల్లి" మణిపూస వంటిదని చెప్పవచ్చు. ఉన్నవ లక్ష్మీనారాయణ గారు "సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్యవిశారదులు, కార్యశూరులు."[4] ఈ నవలలో ఉన్నవవారు అస్పృశ్యతా నివారణను, హరిజనోద్యమాన్ని ప్రధాన ఇతివృత్తంగా స్వీకరించారు. "ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లి యందు సంకల్పించిన నవజీవన నిర్మాణవిధానము లాంధ్ర సాహిత్య సంస్కారమునందు నూతనాధ్యాయములు"[5] అన్నారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

ఈ నవలను రామదాసు 'ఆత్మోద్ధరణము' అనవచ్చు. పెరిగిన పంటచేనును చూసుకొని మురిసిపోతున్న రామదాసుతో నవల ప్రారంభమై ఆయన మౌనిగా, యతీంద్రుడుగా రూపొందడంతో అంతమవుతుంది. భౌతికమైన సంసదనుంచి కష్టాల సంక్లిష్టమార్గం గుండా ఆధ్యాత్మికమైన సంపదను పొందడానికి ప్రతిమానవుడు సాగించేయాత్ర రామదాసు జీవితమని చెప్పవచ్చు. రామదాసు గొప్పతనాన్ని చూపడానికి—చిన్నకులాల వారి గొప్పతనంతోపాటు పెద్దకులాలవారి చిన్నతనం కూడా విస్పష్టంగా చూపారు రచయిత.

'మాలపల్లి'కి 'సంగవిజయము' అన్నది నామాంతరం. సంగదాసు ఈ నవల మొదటిభాగంలోనే మరణించినా అతడు నిజంగా జీవించడం మొదలుపెట్టింది ఆ తరువాతనే. విజయకళాశాల స్థాపన, దిగువవారికి విద్యాభ్యాసపూర్తనకు అవకాశం, పంచములను కూడ గౌరవంగా చూడడం—ఇవి అన్నీ సంగదాసు ఆశయాల పరిపూర్ణరూపమే. రామదాసు దిగువకులాలవారి ఆధ్యాత్మిక సంపత్తికి ప్రతీక అయితే సంగదాసు వారి మేధాసంపత్తికి ప్రతీక అని చెప్పవచ్చు.

ఈ నవలలో రామదాసు, సంగదాసు, రామానాయుడు అహింసా సిద్ధాంతం మూర్తికట్టినవారు. వీరి పాత్రలను చిత్రించడంలోను, హరిజనోద్యమ విజయాన్ని చూపడంలోను ఉన్నవవారు జాతీయోద్యమ సిద్ధాంతాలనే స్వీకరించినా ఈ నవల ఆద్యంతమూ ఎక్కడా మనకు ఆ ఉద్యమనేత అయిన గాంధీజీ పేరుకాని, ఆయన సారథ్యం వహించిన కాంగ్రెసు పేరుకాని, ఆ కాంగ్రెసు నడిపిన జాతీయోద్యమం పేరుకాని కానరావు. అందువల్లనే మాలపల్లి కేవలం వస్త్వాశ్రయ పద్ధతిలో ఒక వర్గంవారి జీవితాన్ని చిత్రించిన అద్వితీయమైన నవలగానే పరిగణింపబడుతుంది.

"వేయిపడగలు" విశ్వనాథ సర్వోత్కృష్టమైన రచన. ఈ శతాబ్దంలోని మొదటి రెండు, మూడు దశాబ్దాలలో తెలుగువారి జీవనగతుల్లో వచ్చిన మార్పును విశ్వనాథవారు ఇందులో చిత్రించారు. ఈ రెండుమూడు దశాబ్దాల కాలాన్ని చిత్రించదలచు కొన్నవారెవ్వరూ జాతీయోద్యమ భావాన్ని, ఆ ఉద్యమ స్థితిగతులను పేర్కొనకుండా ఉండడానికి వీలులేదు.

4. మాలపల్లికి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు వ్రాసిన పీఠిక: "తొలిపలుకు", పుట xviii.

5. ఆదే: "తొలిపలుకు", పుట ix.

'వేయిపడగలు'లో కనీసం ముగ్గురు పాత్రలు జాతీయోద్యమంలో మునిగితేలినవారు: సుబ్బన్న పేటలో జాతీయ కళాశాలను స్థాపించిన కేశవరావు, ధర్మారావుస్నేహితుడు రాఘవరావు ఆ ఉద్యమం వల్ల ప్రత్యక్షంగా ప్రభావితులైనవారు. ఇక ధర్మారావు— ఆ ఉద్యమం అంటే అభినివేశం ఉండి ఆర్థికమైన కారణాలవల్ల దాని సిద్ధాంతాలను ఆమోదించినవాడు.

కేశవరావుగారు జాతీయభావాలకు ఆలవాలమై ఉండే కళాశాలస్థాపనకు పడిన మథన, దానిని నిర్వహించడానికి పడిన పాట్లు ఆనాటి విద్యావిధానాన్ని తెలియచెబుతాయి. ఇక రాఘవరావు మద్యపాన నిషేధంవంటి దురాచారాలను మాన్పడానికి పడిన శ్రమ ఆ జాతీయోద్యమ కార్యకర్తలకు తగినదే! తుదకు రాఘవరావు తన సర్వస్వాన్నీ, చివరకు తన దేహదార్ఢ్యాన్నికూడా ఈ జాతీయోద్యమానికే ధారపోయడం చూస్తే, నిస్వార్థకాములై ఆనాడు తమ ధన, మాన, ప్రాణాలనుకూడా లెక్కించక జాతీయోద్యమంలోకి దూకిన ఎందరో యోధులు జ్ఞాపకం వస్తారు.

వీనికన్న ఎక్కువగా, విశ్వనాథ ఆనాడు గాంధీజీ యెడ, ఆయన ప్రారంభించిన జాతీయోద్యమం యెడ వెలువరించిన భావాలు ఎంతో సత్యాలు.

"అప్పటికి మహాత్ముడైన గాంధి సహాయ నిరాకరణోద్యమమారంభించి రెండేండ్లయినది. జనులు గాంధి దేవుడై యవతరించె నన్నారు. ఆయనే కృష్ణుడు. రాటమే వేణువు. తన్మధురధ్వని వంశీనాదము. భారతదేశము బృందావనము. ప్రజలు గోపికలై యాయన చెప్పినట్లే కోట్లకుగోట్లు జనులు గుమిగూడి యవలంబించ జొచ్చిరి, దేశమునం దింగ్లీషు చదువన్నను పాశ్చాత్య సంప్రదాయానుసరణ మన్నను నిరాదరణ కలిగెను."[6]

అడవి బాపిరాజుగారు జాతీయోద్యమ ప్రచండతకు విచలితులై, బందరులోని జాతీయకళాశాలలో అధ్యాపకవృత్తి నెరసినవారు. ఆయనకు గాంధీజీ అన్నా, ఆయన అహింసా సిద్ధాంతమన్నా, జాతీయ భావ నిష్ఠమైన ఏ వ్యవహారమన్నా ఎంతో ప్రాణం. ఆయన "నారాయణరావు," "కోనంగి" అన్న నవలలలో జాతీయోద్యమ విశేషాలు వివరంగా వర్ణించబడ్డాయి. కాంగ్రెసు ప్రారంభించిన ఉద్యమాలలోని ఉత్కృష్టతను గురించి, మిగిలిన పార్టీలలోని లోపాలనుగురించి ఆయన తన నవలలోని ప్రధాన పాత్రలద్వారా చాలా సంభాషణలలో ఉపన్యాసాలు చెప్పించారు.

నారాయణరావు గాంధీగారి పిలుపు విని కాలేజీ వదలి దేశంకోసం ఖైదుకు వెళ్ళినవాడే! అలాగే కోనంగికూడా. ఈ అసహాయోద్యమంయొక్క ఉత్సాహం స్త్రీలలోకూడా అమితంగా ఉండడాన్ని చూపారు బాపిరాజు. "కోనంగి"లో అనంతలక్ష్మి, "నారాయణరావు"లో శారద అక్కగారు శకుంతల ఇటువంటివారు.

"నువ్వు అదృష్టవంతురాలవు కాబట్టి నీకు నాన్ కోఆపరేషన్ భర్త దొరికాడు" అంటుంది శకుంతల, చెల్లెలు శారదతో.

ఇక కోనంగికి చిన్నతనంనుంచీ "కాంగ్రెసు మహాసంస్థ అనీ, కాంగ్రెసు నాయకుడైన మహాత్మా గాంధీ లోకనాయకుడనీ నమ్మకం. రానురాను అతడు కాంగ్రెసులో సభ్యుడై, అది చేపట్టిన అన్ని ఉద్యమాలలోను ముందుకు ఉరికాడు.

కోనంగి సమకాలికమైన ఉద్యమాలను తలచుకొన్నప్పుడల్లా బాపిరాజు ఆనాటి సర్వ విషయాలను వర్ణిస్తారు. 1925-40ల మధ్య వచ్చిన అన్ని రాజకీయ ఉద్యమాలను, పరిణామాలను కోనంగి ద్వారా చెప్పిస్తాడు. చివరకు కోనంగి క్విట్ ఇండియా ఉద్యమంలోపాల్గొని జైలుకుపోతాడు. ఇలా ఆనాటి అన్ని ఉద్యమాలను వివరంగావర్ణించాడు బాపిరాజు.

6. "వేయిపడగలు" - పదునొకండవ అధ్యాయము మొదట.

ఈనవల అంతటా కోనంగికి ఆనాటి రాజకీయ జీవితానికి ఉన్న సంబంధం చూపబడ్డది. ఉత్సాహవంతుడైన ఉద్యమ కార్యకర్తగా, జైలు నివాసిగా, సంపాదకునిగా అతని అనుభవాలే ఇందులో వర్ణింపబడ్డాయి. నిజానికి ఇవిఅన్నీ బాపిరాజుగారి స్వానుభవాలే!

జీవితం మీద ఒక దృక్పథాన్ని కలగచేయాలన్న ఉద్దేశ్యంతో సాగిన నవల బుచ్చిబాబు "చివరకు మిగిలేది." ఈ దృక్పథాన్ని కలగచేయడానికి రచయిత దయానిధి పాత్రను స్వీకరిస్తాడు.

దయానిధి జీవితంలో వచ్చిన పెద్ద మలుపు అతని శోభనంనాటిరాత్రి కాంగ్రెసు సభలో మాట్లాడి, అరెస్టుకాబోయి, మామగారు పోలీసు ఆఫీసరయి నందువల్ల బయటపడడం. దయానిధిలో వచ్చిన రాజకీయ చైతన్యానికి ఇది దోహదం చేస్తుంది.

దయానిధి అత్తవారింటికి వచ్చాడు. ఆ రాత్రి భోజనం చేశాడు. ఇంకా కొద్దిసేపట్లో భార్యాభర్తలు ఒకటౌతారు. "ఐదు నిముషాల్లోనే భారత మాత సంకెళ్ళని చప్పుడు చేస్తూ అతనిఏకాంతాన్ని భంగం చేసింది." ఆ సంకెళ్ళ చప్పుడుకు చలించిన దయానిధి కదనరంగంలోకి దూకుతాడు. ఇది 1935 లో.

గాంధీజీ ("ఒకసన్నటి నల్లటి పొడుగాటాయన") సాగించిన ఉధృతమైన ఉద్యమం, అందులో ప్రజలు రేణువులై పోవడాన్ని ఎంతో నిశితంగా వర్ణించాడు బుచ్చిబాబు. తాను ప్రేక్షకుడుగా మాత్రమే ఉపన్యాస వేదిక దగ్గరకు వస్తానన్న దయానిధి, తీరా దగ్గరకు వచ్చాక తన ఉద్రేకాన్ని ఆపుకోలేక పోతాడు. ఆ ఉద్రేకం ఎటువంటిది? "శరీరం పొంగింది. చర్మం విప్పుకుని వెంట్రుకలు నిలబడి గుండెలు దడదడ కొట్టుకుంటూ రక్తం వేడెక్కి వేగంగా ప్రవహిస్తూ, అతన్ని నరాలకుప్పగామార్చి వేశాయి. అతనిక మనిషికాడు. ఒక శక్తి."[7]

ఇది ఆనాడు ఉద్రేకపూరితుడైన ప్రతికార్యకర్తకు నిర్వచనంగా చెప్పుకోవచ్చు.

ఈ నవలలో రెండు ప్రపంచ సంగ్రామాల మధ్యకాలంలో ఒకవైపు బ్రిటిష్‌వారి తాబేదార్లకూ వేరొకవైపు స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించే యువతీ యువకులకూ మధ్య జరిగిన సంఘర్షణ ఎంతో ప్రతిభావంతంగా చిత్రించబడ్డది.

కొడవటిగంటి కుటుంబరావుగారు వ్రాసిన చాలా నవలలకు 1920-40ల మధ్యకాలాన్ని పృష్ఠభూమిగా స్వీకరించారు. ఆనాటి జీవితాన్ని వర్ణించాలంటే జాతీయోద్యమాన్ని వర్ణించి తీరవలసిందే. కుటుంబరావుగారి చాలా నవలలలో ఈ ప్రస్తావన ఉన్నా, ముఖ్యంగా ఆయన "చదువు" అన్న నవలలో ఆ జాతీయోద్యమం వల్ల ప్రభావితమైన ఒక కుటుంబజీవితం చిత్రించబడ్డది.

ఆనాడు స్వదేశోద్యమంలో జరిగిన ఎన్నోకార్యక్రమాలకు ఈ నవలలో నాయకుడు సుందరం కేవలం ప్రేక్షకుడు మాత్రమే. కాని అతని మేనమామ శేషగిరి ఉద్యోగం మాని ఉద్యమంలో చేరడంతో ఆ ఉద్యమ విశేషాలు చాలా స్పష్టంగా తెలిసి వస్తాయి సుందరానికి.

"ఇంకా అస్పృశ్యత ఏమిటి? అంతా గాంధీమయం అయిపోతుంటేను—? జగమంతా గాంధీమయం" అంటాడు శేషగిరి. దీనివలన ప్రభావితుడైన సుందరం కాలేజీలో చేరాక కాంగ్రెసు సభలకు వెళ్ళాడు. ఉప్పు సత్యాగ్రహంలో దేశం అట్టుడికినట్టు ఉడికిపోవడం సుందరానికి తెలుసు. ఇలా సుందరానికి చుట్టూ ఉన్న జీవితంలో ఆనాడు దేశవ్యాప్తంగా జరిగిన అనేక జాతీయోద్యమాల ప్రభావం ఎలా పడ్డదీ వివరంగా చూపుతుంది ఈ నవల. ముఖ్యంగా ఇన్ని ఎగుడు దిగుడుల్లోను నిజంగా తమ సర్వస్వాన్ని త్యాగం చేసిన శేషగిరి వంటి వ్యక్తుల జీవితాలనుగురించి ఇంకా స్పష్టంగా విశదీకరిస్తుంది "చదువు".

7. "చివరకు మిగిలేది" - చప్పుడు చెయ్యని సంకెళ్ళు, పుట 241.

మహీధర రామమోహనరావుగారి "కొల్లాయి గట్టితే నేమి" అన్న నవల 1921 లో దేశాన్ని ఉద్రూతలూగించిన గాంధీజీ ఉద్యమాలను గురించిన రచన. కార్యస్థానం గోదావరి జిల్లాలోని ముంగండ. ఆనాటిరాజకీయ జీవితాన్ని చిత్రించడం ఈ నవల ధ్యేయం. ఆనాడు సంఘాన్ని కదలించి వేసిన అన్ని కార్యక్రమాలు ఇందులో సవివరంగా వర్ణించ బడ్డాయి.

ఈ నవలకు రచయిత ఉంచిన పేరునుబట్టే ఇది గాంధీజీ ప్రభావాన్ని చిత్రించే నవలగా మనం ఊహించవచ్చు. గాంధీజీ ఆదేశంప్రకారం కాలేజి చదువులు మానిన ఒక విద్యార్థి కథ ఇది. అలా కాలేజి చదువులు మానడంలోగల ఇబ్బందులు, చుట్ట పక్కాలు చూపే నిరసన ఇందులో వాస్తవికంగా చిత్రించబడ్డాయి. ఒకగ్రామాన్ని కేంద్రస్థానంగా స్వీకరించి, దానిలోని విభిన్నవ్యక్తుల్ని—ముఖ్యంగా భారతజాతీయోద్యమం అంటే వారికివున్న విభిన్న మనస్తత్వాల్ని - ప్రకటించి 1921 లో జాతీయోద్యమం ఒక అగ్రహారంలోని ప్రజల జీవితాలను ఎలా ప్రభావితం చేసిందీ చూపే నవల ఇది.

హ రి జ న సమస్యను గురించీ, కులాంతర వివాహాలను గురించీ వ్రాయబడిన నవలల్లో "బలి పీఠం" ఎన్నికచేయ తగ్గది. వర్ణాంతర వివాహం చేసుకొన్న వారిజీవితాలు ఎలా నడుస్తాయో చూపి, "కులాల ఆధిక్యత" అర్థంలేని సిద్ధాంతం అని రచయిత్రి శ్రీమతి ముప్పాళ్ల రంగనాయకమ్మ ఈ నవలలో ప్రతిపాదించింది. ఇం దు లో పరిచయంచేసిన "కరుణసమాజం", ఆ ఆశ్రమ సిద్ధాంతాలు గాంధీజీ ఆశ్రమ సిద్ధాతాలను జ్ఞప్తికి తెస్తాయి.

ఈ పైనపేర్కొన్న నవలలు కాక ఇటీవల వెలువడిన ఇంకా ఎన్నో నవలలు జాతీ యోద్యమ ప్రభావాన్ని చిత్రించడానికి ప్రయత్నించాయి. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి వ్రాసిన 'కౌసల్య' లో కౌసల్యభర్త శోభనంనాటిరాత్రే జాతీయోద్యమంలో పాల్గొని జైలుకు వెడతాడు. ఒక కుటుంబాన్ని ఈ జాతీయోద్యమం ఎలా ప్రభావితం చేసిందో, అందులోని విభిన్న వ్యక్తులు దానిని ఎలా వేరువేరు దృక్పథాలతో దర్శించారో చూపుతుంది "కౌసల్య".

సుమలతవ్రాసిన "జీవనకలశం"లో నాయిక వసంతలక్ష్మి తనకు ఇష్టంలేని భర్తను వదలి గాంధీజీని వార్ధాలో దర్శించి, ఆయన ప్రాపున నాగపూరులో చదువుకొని తనకు నచ్చినవాడిని వివాహమాడుతుంది. ఇటీవలనే వెలువడ్డ "రాజరికాలు-పేదరికాలు" అన్న నవలలో ఫ్యూడల్ పద్ధతులకు చెందిన జమీందారుల కుటుంబంలో జాతీయ భావాలు పెంపొందించుకొన్న ఒక యువకుడు, అతనిభార్య పడే కష్టాలు వర్ణించబడ్డాయి.

అలానే శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన "విజేత"లో సత్యాగ్రహోద్యమ ప్రసక్తి ఉంది.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన కవితలలో వలెనే నవలలలో కూడా జాతీయోద్యమంలో త్యాగాలు చేసిన నాయకుల పవిత్రత, ధర్మదీక్షలకు ప్రతిగా ఈనాటి అధర్మము, నీచత్వము చూపబడ్డాయి. ఇవి అన్నీ వ్యంగ్యాత్మక మైనవి. ఇట్టి నవలల్లో శ్రీ జి. వి. కృష్ణారావు వ్రాసిన "కీలుబొమ్మలు" ఎన్నదగిన రచన. ఈ నవలలో అమ్మాయమ్మ స్వార్థప్రయోజనాలకు హరిజనసేవ అన్న నినాదాన్ని ఎలా ఉపయోగించుకొన్నదో ఎంతో వ్యంగ్యంగా చిత్రించ బడ్డది

ఇలా వందలాది నవలలు జాతీయోద్యమాన్ని ఏదోవిధంగా వర్ణించాయి. ఇలావర్ణించిన నవలలను మూడు కక్షలకు చెందినవిగా క్రోడీకరించవచ్చు. ఒకరకం నవలలు జాతీయోద్యమాన్ని, ఆనాటి వ్యక్తులమీద అది చూపిన ప్రభావాన్ని చిత్రించేవి. అట్టివానిలో వేయిపడగలు, నారాయణరావు,కోనంగి, కొల్లాయి గట్టితేనేమి మొదలైన వానిని చేర్చవచ్చు.

మొదలి నాగభూషణశర్మ

రెండవ రకం నవలలు ఆనాటి ఉద్యమానికి దోహదాలై, నిర్మాణ కార్యక్రమాలకోవకు చెందినవి. అస్పృశ్యతా నివారణ,గోవధ నిషేధము, వర్ణాంతర వివాహాలు మొదలైన వానిని చిత్రించినవి. మాలపల్లి, బలిపీఠం వంటివి ఇందుకు ఉదాహరణలు.

ఇక మూడవ పద్ధతికి చెందినవి ఆనాటి జాతీయోద్యమంలోని స్వచ్ఛందతనూ, ఈనాడు దాని పేరున నాయకమ్మన్యులు సాగిస్తున్న అవినీతినీ తులనాత్మకంగా చూపే వ్యంగ్యరచనలు. 'కీలుబొమ్మలు' వంటి నవలలు ఈ కోవకు చెందినవి.

కాని మధ్యతరగతి ప్రజలు, వర్తకులు, ధనికులు నగు ప్రజలయందు మాత్రమే యది వ్యాపించి యుండినది. తరువాత రెండు శతాబ్దములలో నది క్రమముగా దక్కను పీఠభూమియందును, ఇంకను దక్షిణమున గాంగరాజుల పరిపాలనములో నుండిన కన్నడప్రాంతము నందును, బాదామి చాళుక్యుల స్థలమునందును గోమఠసంప్రదాయమునకు చెందిన వారు మైసూరున కేగుదాక వ్యాపించెను.

సంగయుగమునకు తరువాత 'శ్రావణబెళగోళ' ప్రాంతమున నివసించుచుండిన కలభ్రు లనుతెగ వారు కదంబరాజులచే పారద్రోలబడి తమిళదేశము నకు తరలిపోవలసిన పరిస్థితులేర్పడెను. కలభ్రులు జైన మతావలంబకు లగుటచే వారితోబాటు వారి మతము కూడ తమిళదేశమునకు వ్యాపించినది. తమిళదేశమునందలి పూర్వపల్లవరాజులు (Early Pallavas) కూడ బౌద్ధమతమును విడనాడి జైన మతావలంబకు లైరి. ఇట్లు తమిళదేశమున క్రమ ముగా కాలు నిలువ ద్రొక్కుకొని యుండిన జైన మతమున కొక స్థిరమైన యాధారము క్రీ. శ. 470 లో నేర్పడినది. పూజ్యపాదుడను జైనముని శిష్యుడు 'వజ్రనంది' యను జైనాచార్యుడు పాండ్య దేశమునకు రాజధానియగు మధురానగరమున 'జైన ద్రావిడసంఘము' అనుపేరుతో నొక సంఘమును స్థాపించుటయే కాక దక్షిణదేశములో పెక్కు స్థ ములయందు దానికి సంబంధించిన పెక్కు శాఖలు కూడ నెలకొల్పెను. అతఁడు జైనమత వ్యాప్తికి మఱొక పద్ధతిని కూడ నవలంబించెను.

అతడు జైనధర్మములలో ప్రధాన మగు అహింసా సిద్ధాంతము యొక్క యాచరణమునందు తన్మతానుయాయులకు కొంత స్వేచ్ఛను ప్రసా దించెను. దాని మూలమున కూడ పెక్కురు జైనమతము నవలంబింప దొడగిరి. జైన ధర్మము లను ప్రజలలో వ్యాపింపజేయవలయు నన్నచో వారి కాప్రాంతీయభాషలలో చక్కని పరిచయ ముండవలెను. అందుచేత జైనవసదులు లేక పళ్లల యందు నివసించుచుండిన జైనసన్యాసులు తమిళ భాషాసాహిత్యములయందు పరిచయము కల్పించు కొన ప్రారంభించిరి. అట్లు భాషమీద నధికారము సంపాదించిన పిమ్మట వారు లౌలుతనే మతధర్మ ప్రతిపాదకము లగు గ్రంథములను రచించినచో దానిమూలమున ప్రజలలో తీవ్రమయిన ప్రతిఘటన యేర్పడు నని భావించి సర్వమతస్థులకును ఉపా దేయము లయిన సామాన్య నీతిసూత్రములను గ్రంథరూపమున రచించిరి. మఱియు తమకు మునుపు రచింపబడిన ప్రాచీన తమిళకావ్యములకు జైనమతపరముగా వ్యాఖ్యానములు వెలయించిరి. 'పురం' శాఖకు చెందిన రచనలను సంకలనము చేసి 'పురత్తిరట్టు' అను సంకలన గ్రంథము నొకదానిని వెలయించిరి. 'ముత్తొళ్ళాయిరమ్' మండలకేశి విరుత్తం, కిళివిరుత్తం, ఎలివిరుత్తం, నరివిరుత్తం' అను జైన వేదాంత గ్రంథములను సరళసుందర మయినభాషలో వెలయించిరి. ఇవి యన్నియు క్రీ. శ. 5వ శతాబ్దియందు రచింపబడిన గ్రంథ ములు. వీనిలో నేఁడియును మనకు ప్రస్తుతము లభించుట లేదు.

తమిళసాహిత్యములో నీతిసూత్రములకు సంబం ధించిన 'పదినెన్ కీళ్కణక్కు' అను కావ్యసము దాయము ప్రసిద్ధిచెందినది. వీనిలో పెక్కుగ్రంథ ములు జైనకవులచే రచింపబడెను. వీనిలో లౌలుత పేర్కొనదగిన గ్రంథము 'నాలడియార్'. ఇది సంస్కృతమునందు వలెనే నాల్గేసి పాదములతో కూడిన పద్యముల గ్రంథము. ఇందలి విషయములు సర్వమతసామాన్య మయినను దీనిని జైన సన్యా సులు రచించినట్లుగా నొక యైతిహ్యము కలదు. ఇది జైనద్రావిడ సంఘము యొక్క మొదటి ప్రచురణ మని కొందఱి యభిప్రాయము. దీనిని ఒక్కకవియే రచించెనని కొందఱును, ఇది పెక్కురచే రచింపబడెనని కొందఱును అభిప్రాయపడుచున్నారు. ఆ పెక్కురు కవులలో కొందఱు జైనసన్యాసులు కలరట! ఇందుచే నిది జైన కవిరచితమైన గ్రంథ ముగా నంభావింపదగి యున్నది.

'పఙమొళి' యనునది మఱియొక జైనగ్రంథము.

'పలమొఱి' యనగా 'ప్రాతమాట' లని యర్థము. ఇందు 400 వెన్బాపద్యములలో పెక్కు సామెతలు సంకలింపబడెను. 'రం అరయనార్' అను జైన రాజకవి దీనిని రచించెనని తెలియుచున్నది. 'పదినెణ్కీళ్కణక్కు' కావ్యసంచయమునకు చెందిన శిరుపంచమూలం, ఏలాది, ఇనై వై నార్పదు, ఇన్న నార్పదు అనునవి కూడ నిట్టి గ్రంథములే.

తమిళ పంచమహాకావ్యములలో నొకటిగా పరిగణింపబడిన 'జీవకచింతామణి' యనునది తమిళము నందలి జైనకావ్యములలో ప్రముఖముగా పేర్కొనదగినది. చోళరాజవంశమునకు చెందిన 'తిరుత్తక్కదేవర్' అనునతడు దీనికర్త. ఇది జీవకుడను చక్రవర్తియొక్క జీవిత చరిత్రమును, అతని పూర్వజన్మములను, అతని నిర్యాణమును అభివర్ణించు గ్రంథము. జీవకుడు జైనపురాణములందు సుప్రసిద్ధుడు. జినసేనుడు రచించిన మహాపురాణము నం దతని చరిత్ర మభివర్ణింపబడి యున్నది. జినసేనుడు రాష్ట్రకూట చక్రవర్తి యగు అమోఘవర్షునికి మతగురువు. అందుచే మహాపురాణము క్రీ. శ. ఎనిమిది తొమ్మిది శతాబ్దులకు చెందిన దగుచున్నది. దాని ననుసరించి రచింపబడిన జీవకచింతామణి క్రీ. శ. 10వ శతాబ్దమునకు చెందిన గ్రంథముగ పండితు లభిప్రాయపడుచున్నారు. జీవకుని శృంగారమయ జీవితము, అతని యుద్ధయాత్రలు, మొదలగునవి యిందతడు నిర్యాణము చెందుదాక నభివర్ణింపబడినవి. ఇది జైనమత ప్రతిపాదక మగు కావ్యము.

తమిళ సాహిత్యములోని పంచలఘుకావ్యములలో యశోధరకావ్యము జైనసాహిత్యమునకు చెందినది. దీనికర్త యెవరో మనకు తెలియకున్నది. అతడు జైనమతావలంబకు డనుట మాత్ర ము నిశ్చయము. ఇందలి యితివృత్తమును బట్టియే దీని రచనాకాలము కొంత మనకు సూచిత మగుచున్నది. యజ్ఞములయందు బలిపశువునకు బదులుగా 'పిష్టపశువు' నుంచి యజ్ఞమును నిర్వర్తింప వచ్చునని మధ్వాచార్యుడు క్రతుకలాపములకు సంబంధించి యొక మార్పును దీసికొని వచ్చెను. ఈ యశోధరకావ్యమునందు అట్లు పిష్టపశువును బలి యిచ్చుట కూడ తగ దనియు, దానిమూలమున జంతుహింస చేసినవారికి కలుగు పాపము సంభవించు ననియు, దానిమూలమున వారు పెక్కు జన్మములను పొందవలసి వచ్చుననియు కథావ్యాజమున తెలుపబడినది ఇందువలన నిది మధ్వాచార్యుడు క్రతుకలాపవిధానమున తెచ్చిన మార్పునకనంతరము రచిత మయ్యెనని యూహింపదగును. ఇందు ప్రస్తావవశమున పెక్కు జిన ధర్మములు ప్రతిపాదింపబడినవి.

తోలామొళిదేవర్ అను జైనకవి రచించిన 'చూడామణి' కావ్యముకూడ జైనసాహిత్యమునకు చెందినదే. ఇందు 'తివిట్టన్' అను పౌరాణికవ్యక్తికి సంబంధించిన గాథ యభివర్ణింప బడినది. ఇతడు త్రిషష్టిశలాకా మహాపురుషులలోనివా రగు తొమ్మండుగురు వాసుదేవులలో నొకడుగా జైనులచే పరిగణింపబడుచున్నాడు. ఇందును జైనసమయమునకు సంబంధించిన పెక్కు విషయములు కథావ్యాజమున వివరింపబడినవి. ఇందలి కవిత్వము జీవకచింతామణి యందలి కవిత్వమును పోలియుండునని పండితుల విశ్వాసము. "The one beauty of the Chudamani is that it maintains the poetic excellence of the Chintamani."

నీలకేశి యను జైనకావ్యము తమిళపంచమహాకావ్యములలో నొకటిగా పరిగణింపబడిన 'కుండలకేశి' యను కావ్యమునకు ప్రతిగా రచింపబడిన కావ్యము. ఇది యొక జైన వేదాంతిచే రచింపబడెను. కుండలకేశి బౌద్ధమతౌత్కృష్ట్యమును ప్రతిపాదించుచుండగా నిది బౌద్ధమతమును ఖండించి జైనమతౌత్కృష్ట్యమును ప్రతిపాదించుచున్నది. ఇందు జైనమతమునకు సంబంధించిన ప్రాథమిక సూత్రములు, జైనదర్శనము విస్తారముగా వివరింపబడెను. అహింసాధర్మముయొక్క యౌత్కృష్ట్యము, భౌతిక విచారమునకంటె ఆత్మవిచారముయొక్క యాధిక్యము నిందు కాననగును.

గుణాఢ్యకవి రచించిన బృహత్కథలోని యితివృత్త మాధారముగా తమిళమున 'పెరుంకదై' యనుపేరుతో నొక స్వతంత్రకావ్యము రచింపబడెను. దీనిని 'కొంగు' దేశపరిపాలకుడగు 'కొంగువేల్' అనునతడు రచించెను. ఇందు వత్సరాజగు ఉదయనునిగూర్చియు, అతని కుమారుడగు నరవాహనదత్తుని గూర్చియు పెక్కుకథలు వివరింపబడినవి. దీనికర్త యగు 'కొంగువేల్' జైనమతావలంబకు డగుటచే నీ కావ్యమున నచటనచట జైనమతధర్మములు ప్రతిపాదింపబడుట కానవచ్చుచున్నది.

'మేరుమందిరం' అనుకావ్యము తమిళసాహిత్యములో ప్రసిద్ధి చెందినది. దీనిని 14వ శతాబ్దికి చెందిన వామనముని యను నతడు రచించెను. అతడు బుక్కరాయనికి సమకాలికుడు. ఇందు మేరు మందిరు లను రాజకుమారులకు సంబంధించిన యితివృత్త మభివర్ణింప బడినది. వారు కావ్యాంతమున విమల తీర్థంకరుని ధర్మోపదేశములను విని అతనిని ఆరాధించినట్లును, తుదిని యోగ మభ్యసించి దైవత్వము పొందినట్లును అందు కలదు. ఇందలి యితివృత్తము జైనవేదాంత ధర్మమును ప్రతిపాదించుట కనువుగా మలచి రచింపబడినది. 'The story is formed in such a way that Jaina Philosophical Doctrine could be expounded with ease'—J. Somasundaram.

శ్రీపురాణ మనునది తమిళసాహిత్యమున వెలసిన మరొక జైనకావ్యము ఇది తమిళదేశమునందలి జైనులలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన రూపము. ఇది జినసేనుడు రచించిన మహాపురాణము నాధారము చేసికొని రచింపబడిన గ్రంథము. దీనికర్త యెవరో తెలియవచ్చుట లేదు. తమిళసంస్కృత సమ్మిశ్రితమైన 'మణిప్రవాళ' శైలిలో నిది రచింపబడి యుండుట యిందలి విశేషము. ఇందు త్రిషష్టి శలాకా మహాపురుషుల జీవితచరిత్రము లభివర్ణింపబడినవి. వారు 24 తీర్థంకరులు, 12 గురు చక్రవర్తులు, 9 మంది బలదేవులు, 9 మంది వాసుదేవులు, 9 మంది ప్రతివాసుదేవులు. వీ రందఱును జైనమతాచార్యులుగా, జైనమతానుయాయుల కారాధ్యులుగా పరిగణింపబడువారు. మగధాధిపతియగు జరాసంధుడు ప్రతివాసుదేవుడు కాగా శ్రీకృష్ణుడు వాసుదేవుడు, బలరాముడు బలదేవుడు. తమిళదేశమునందలి జైనులీగ్రంథమును మిక్కిలి పూజ్యభావముతో గౌరవింతురు.

ఇట్లు తమిళసాహిత్యమునందు వెలసిన జైనకావ్యములలో యశోధరకావ్యమునందు కానవచ్చు నితివృత్తమే కన్నడమున జన్నకవి రచించిన 'యశోధరచరితె' అను గ్రంథమునందు కానవచ్చుచున్నది. అట్లే తమిళసాహిత్యములోని 'శ్రీపురాణము' నందలి యితివృత్తము కన్నడమున క్రీ. శ. 10వ శతాబ్దమున జీవించిన చావుండరాయకవి రచించిన 'చావుండరాయ మహాపురాణ'మను నామాంతరము కల 'త్రిషష్టిశలాకా మహాపురాణ' మను గద్యకావ్యమునందు కానవచ్చు చున్నది.

జైనకవులు రచించిన కావ్యవాఙ్మయము మాత్రమే కాక వారు ఛందశ్శాస్త్రమునందును, వ్యాకరణ శాస్త్రమునకును సంబంధించి రచించిన గ్రంథములు కూడ కొన్ని కలవు. అమృతసాగరు డనుజైనకవి 'యాప్పెరుంగలకారికై'అను వ్యాకరణగ్రంథమును రచించెను. గుణవీరపండితు డను జైనవిద్వాంసుడు 'నేమినాథన్' అనుపేరుతో ఒక వ్యాకరణ గ్రంథమును రచించెను. ఇందలి యవతారికాపద్యములను బట్టి మదరాసునందలి మైలాపూరులో ఒక జైనదేవాలయ ముండెడి దనియు, అది కాలక్రమమున సముద్రతరంగములచే శిథిలమయ్యె నని యు తెలియుచున్నది. తమిళమున 'నన్నూల్' అనునది మిక్కిలి ప్రసిద్ధి చెందిన ప్రామాణికమైన వ్యాకరణ గ్రంథము. దీనికర్త కూడ ఒక జైనవిద్వాంసు డగుట గమనార్హ మయినవిషయము. వ్యాకరణ ఛందశ్శాస్త్రములతో తృప్తి నందక వారు తమిళమున కొన్ని నిఘంటువులను కూడా రచించిరి. దివాకరం, పింగళాందై, చూడామణి యనునవి

జైనవిద్వాంసులచే రచింపబడిన నిఘంటవులు. 'It is probable that the three Tamil Nighantus are the works of people whose religion was Jainism'- 'జినేంద్ర మాలై' యనునది తమిళమున రచిత మైనజ్యోతి శ్శాస్త్ర గ్రంథము. ఇదియు జైనకవిరచితమే. తమిళ జ్యోతిష్కులు 'ఆరూఢం' గుణించుసందర్భమునందు పలుమాఱులు జినేంద్రమాలైని ప్రమాణముగా నుదాహరించుట దీని యౌత్కృష్ట్యమును తెలుపుచున్నది. ఇట్లు పాండ్యదేశమునకు రాజధాని యగు మధురలో జైన ద్రావిడసంఘము స్థాపింపబడిన తరువాత నించుమించుగా వేయిసంవత్సరముల కాలములో తమిళమున జైనకవులు కావించిన కావ్యజాతము, శాస్త్రగ్రంథములు విస్తారముగా వెలసి తమిళసాహిత్యాభివృద్ధికి విశేషముగా తోడ్పడినవి.

తమిళ సాహిత్యమునందు వలెనే కన్నడ సాహిత్యమునందు కూడ జైన వాఙ్మయము విస్తారముగా వెలసినది. కన్నడసాహిత్య చరిత్రకారులు కన్నడకవులను స్థూలముగా జైనులు, వీరశైవులు, వైష్ణవులు నని మూడు వర్గములుగా విభాగించి యుండుటయు - ఆంగ్లమున కన్నడ సాహిత్య చరిత్రమును విరచించిన E. P. Rice దొర సాహిత్య చరిత్రమును శాఖోపశాఖలతో కూడిన మహాప్రవాహముగ పోల్చి యందలి మూలప్రవాహము జైనప్రవాహ మని పేర్కొని యుండుటయు కన్నడసాహిత్యమున జైనవాఙ్మయవిస్తృతిని తెలియజేయుచున్నది. కన్నడమునందు వెలసిన జైనసాహిత్యము పూర్వయుగము, పంపయుగము, కుమారవ్యాస యుగము అను మూడుయుగములందు వెలసినదిగా విభాగింపదగి యున్నది. శివకోట్యాచార్యుడు రచించిన 'వడ్డారాధన' యను గ్రంథము పూర్వయుగమునకు చెందినది. ఇది జైనమతమునకు సంబంధించిన కథల సంగ్రహము. చక్కని గద్యములో వ్రాయబడిన యీ గ్రంథము కన్నడవాఙ్మయమున కొక యపూర్వాలంకారము. దీనిరచనాకాలము క్రీ శ. 925 ప్రాంతము కావచ్చునని యాంతరంగిక ప్రమాణములతో నిర్ణయింపబడినది. ఇందు మార్గ దేశి పద్ధతులకు సమప్రాధాన్య మొసగబడినది.

కన్నడమున ఆదికవి యని ప్రసిద్ధుడైన పంప మహాకవికి జైనమతముపై నభిమాన మెక్కువ. అతని తండ్రియగు అభిరామదేవుడు తన బ్రాహ్మణ్యమును వదలక జైనధర్మమును స్వీకరించెను. ఇట్లు పంపనిలో వైదికజైన సంస్కారముల ప్రభావము సమానముగా కానవచ్చును. ఇతడు రచించిన గ్రంథములు ఆదిపురాణము, విక్రమార్జున విజయ మను నామాంతరము కల పంపభారతము. ఇతని ప్రధానకృతియగు ఆదిపురాణమునందు జైనతీర్థంకురులలో ప్రథము డైన వృషభనాథుని చరిత్ర మభివర్ణింపబడినది. జైనభారతమునందు పాంచాలి పాండవుల కందఱికి పత్ని కాక యొక్క యర్జునునికే ధర్మపత్ని యైనట్లు అభివర్ణింప బడినది, అతడు తన భారతరచనమునందు చాలవఱకు వ్యాస భారతమునే యనుసరించినను నీయొక్క యంశమునందు మాత్రము అతడు జైనభారతము ననుసరించెను. దీనికి కారణము తన కాశ్రయదాత యైన అరికేసరిని అర్జునునితో పోల్పగడగుటయే కావచ్చును. ఇందు మహాభారతకథకు సూత్రధారి యైన శ్రీకృష్ణుని మహిమలను పంపకవి ప్రస్తావింపక పోవుటకు కూడ అతని జైనదృష్టియే కారణమై యుండునని భావింపబడుచున్నది. పంపనికి తరువాత కన్నడమున కవితలు వెలయించిన కవీశ్వరులు పంపనివలెనే యొక ధార్మిక కావ్యమును, ఒక లౌకిక కావ్యమును రచించిరి.

'రత్నత్రయము'లో రెండవవా డగు పొన్నకవి శాంతిపురాణము, జినాక్షరమాలె యను రెండు జైన గ్రంథములను రచించెను. ఇందు 'జినాక్షరమాలె' యనునది 29 కందపద్యములతో కూడినజినస్తుతి. ఇతని శాంతిపురాణము పదునాఱవ తీర్థంకరు డగు శాంతినాథుని జీవితమును వర్ణించు జైనపురాణము. పొన్నకవి నాగమయ్య యను జైన బ్రాహ్మణుని

పుత్రు డగుటచేతను, ఇతని గ్రంథములనుబట్టియు - ఈతడును పంపనివలెనే జైనుడని తెలియుచున్నది.

'రత్నత్రయము'లో మూడవవాడగు రన్నకవి జైనుడైన గాజులసెట్టి కులమున జన్మించినవాడు. గంగమండల మందలి అజితసేనాచార్యు డితని గురువు. ఇతడు తన విద్యాగురువైన అజిత సేనాచార్యునితో 'శ్రావణబెళగోళ'లో వసించి యందు తన పోషకుడైన చావుండరాయడు వెలయించిన గోమతేశ్వరుని విగ్రహమును ఆరాధించుచుండిన జైనసమయారాధకుడు. దాన చింతామణి యని ప్రసిద్ధి చెందిన 'అత్తిమబ్బె' ప్రేరణచే నితడు 'అజిత పురాణము' అను నొక జైనపురాణమును రచించెను. ఇందు రెండవ తీర్థంకరుడగు అజిత నాథునిచరిత్ర మభివర్ణింపబడినది.

రత్నత్రయమునకు తరువాత పేర్కొన దగిన వాడు చావుండరాయడు. ఇతడు క్రీస్తుశకము 10వ శతాబ్దమునకుచెందిన వీరచూడామణి. పశ్చిమగాంగ రాజైన రాచమల్లునికడ మంత్రిగను, సేనాధిపతిగను నుండి యనేక యుద్ధములలో విజయమును సాధించిన మహాయోధు డతడు. 'శ్రవణ బెళగోళ'లో గోమతేశ్వరుని విగ్రహమును ప్రతిష్ఠించి యచట నొక జైన 'బసది'ని కూడ కట్టించిన జినభక్తుడు. ఇతడును రన్నకవి వలెనే అజితసేనాచార్యుని శిష్యుడై, కవులను ప్రోత్సహించి కవిపోషకుడై వెలయుట మాత్రమేకాక తాను స్వయముగ కవియై 'చావుండరాయ మహాపురాణ' మనుపేరుతో గద్యమున నొక జైనపురాణమును రచించెను. దీనినే 'త్రిషష్టి శలాకా లక్షణ మహాపురాణ' మని కూడ వ్యవహరించెదరు. ఇందు జైనమత విశ్వాసములు, తత్త్వములు, చరిత్రములు నిమిడి యున్నవి.

క్రీస్తుశకము 11వ శతాబ్దమునకు చెందిన దుర్గసింహుడను కవి పంచతంత్రమును కన్నడమున చంపూకావ్యముగా రచించెను. ఈ కన్నడ పంచతంత్రమునందు జైనమతతత్త్వములు వివరింపబడి యున్నవి. ఇందు విశేష మేమనగా కవియైన దుర్గసింహుడు స్మార్తభాగవత సంప్రదాయమునకు చెందిన పండితవంశమున పుట్టినవాడును, అతనికి పోషకుడైన చాళుక్య జయసింహమహారాజు వైదిక మతావలంబకుడును - అయ్యు నితడు జైన సంప్రదాయములను తెలుపు గ్రంథము నేల వ్రాయవలసి వచ్చెనో తెలియదు.

క్రీస్తుశకము 12వ శతాబ్దమునకు చెందిన నాగచంద్రుడను జైనాచార్యుడు 'మల్లినాథపురాణ'మను గ్రంథమును రచించెను. ఇందు 19 వ తీర్థంకరు డైన మల్లినాథునిచరిత్ర మభివర్ణింపబడినది. ఈ శతాబ్దమునకే చెందినవా డగు నయసేను డనుకవి రచించిన 'ధర్మామృత' మను కావ్యమునందు జైన మతాచారములలో పవిత్ర మహావ్రతము లనిపేరు పొందిన వ్రతముల నాచరించి సద్గతిని పొందిన మహాపురుషులకథ లభివర్ణింపబడినవి.

బ్రహ్మశివుడు రచించిన 'సమయపరీక్షె' యను నది కన్నడమున వెలసిన మొదటి దూషణకావ్యము. ఇందు అన్యమతదూషణమును, జైనమత ప్రశంసయు నెక్కువగా గలవు. పంపయుగము చివరి భాగమున అన్నపార్యు డనునతడు నేమినాథపురాణ మను జైనకావ్యమును రచించెను. క్రీస్తుశకము 13వ శతాబ్దికి చెందిన జన్నకవి 'యశోధరచరితె', 'అనంతనాథపురాణము' అను రెండు గ్రంథములను రచించెను. ఇవి రెండును జైనగ్రంథములే. ఇందలి 'యశోధరచరితె' యను గ్రంథములోని యితివృత్తమునే కలిగిన గ్రంథము 'యశోధరకావ్య' మను పేరుతో తమిళ సాహిత్యమున నొకటి కలదు. ఈ శతాబ్దమునకే చెందిన 'అండయ్య' యనుకవి 'కబ్బిగరకావ' అను గ్రంథములో మన్మథవిజయమునకు సంబంధించి వైదిక జైనసంప్రదాయము లకు చెందిన కథలను గ్రహించి యక్కడక్కడ జైనమతాధిక్యమును వెల్లడించుటకై కొన్నిమార్పు లను చేసెను. మన్మథుడు శివునిపై దండెత్తు కాలములో నత డొక జైనమునిని దండింపబోయి భంగపడిన ట్లొక కల్పన మీకావ్యమునందు చేయ బడినది.

క్రీస్తుశకము 15వ శతాబ్దమున - అనగా కుమారవ్యాస యుగమునందు కొంత జైనసాహిత్యము వెలసెను. క్రీ శ. 1425 ప్రాంతమునకు చెందిన భాస్కరు డనుకవి భామినీషట్పదులలో 'జీవంధర చరిత్రము'ను రచించెను. ఇతడు తొలుత శైవబ్రాహ్మణుడై యుండి జైనమును స్వీకరించినవాడు. ఇంచుమించు ఆకాలముననే చెందిన మాయదేవు డనుకవి రచించిన 'త్రిపురదహనసాంగత్యము' ఒక జైనకావ్యము. ఇందు జైనపురాణములోని త్రిపురదహనగాథను జైనతత్త్వమున కనుకూలించునట్లు మార్చి మాయదేవు డీకావ్య రచనమును గావించెను. ఇందు జన్మజరామరణములు అను త్రిపురములను ఆదీశ్వరుడు దహించును.

క్రీస్తుశకము 16వ శతాబ్దికి చెందిన 'రత్నాకరవర్ణి' తొలుత వీరశైవుడై యుండి తరువాత జైనుడయ్యెను, అతడు రచించిన గ్రంథములలో 'భరతేశవైభవ' మను గ్రంథమున ప్రథమతీర్థంకరుడైన పురుదేవుని పుత్రు డగు భరతచక్రవర్తి, బాహుబలి యనువారి కథలు మిక్కిలి సుందరముగా నభివర్ణింపబడినవి. ఇట్లు కన్నడ సాహిత్యమున పూర్వయుగము మొదలుకొని క్రీ. శ. 16. 17 శతాబ్దులదాక జైనసాహిత్యము కొంత విస్తారముగనే వెలయుచు వచ్చెను.

తమిళమునందు కవిత్వము వెలయించిన జైనకవులవలె కన్నడమునందలి జైనకవులు నీతిగ్రంథములను, శాస్త్రగ్రంథములను రచింప లేదు. వీరు తొలుతనుండియు జైనమత ప్రతిపాదకము లగు కావ్యములనే రచించుచు వచ్చుట వీరికిని వారికిని గల భేదము.

ఆధార గ్రంథములు :


1. A History of Tamil Literature- *By Sri T.P. Meenakshisundaram*
2. A History of Tamil Literature- *By J. M. Somasundaram*
3. History of Kanerese Literature- *By E. P. Rice*
4. దక్షిణ భారత సాహిత్యములు- *Pub. A. P. Sahitya Akademi, Hyderabad*
5. తెలుగు విజ్ఞాన సర్వస్వము. Vol VI.
6. Indian Literature - *Ed. By Nagendra*

శ్రీ ఉత్పల
సత్యనారాయణాచార్య

# రజతోత్సవ ప్రశంస

శ్రీమద్గోలి కులార్ణవ
సోముఁడు వాణిజ్యరాజ్య శోభామహితో
ద్దాముఁడు నీశ్వరనాముఁడు
కామితఫలసిద్ధి నందుఁగాత ధరిత్రిన్.

భవ దమేయ కీర్త్యవదాత పత్రకములు
లేఖ్యములుగావె సుకవి సమాఖ్య కెపుడు,
నీ యశస్విత యీశ్వర నిభముగాఁగ
వన్నెలీనెను రజతోత్సవమున మఱియు.

అర్థాకారకమున నన్వయ మట్టులు
నీ ప్రవృత్తిచేత నెగడె వృత్తి;
సుప్రశస్త పత్ర శుభ్రతా కీర్తిని
నేలుమయ్య! గోలి ఈశ్వరయ్య!

నీదు వ్యాపార మనయంబు నెగడుఁగాక
జరుపుకొనుగాక శుభపరంపరలతోడ
ఉజ్జ్వలంబగు స్వర్ణ వజ్రోత్సవములు
పుత్త్ర పౌత్ర నిరంతర పోషితములు.

ఎమ్మెయిఁ గోటికిం బడగ
లెత్తిన వర్తకు లుండ్రుగాని సౌ
ఖ్యమ్ముల ముగ్గి; పుస్తకము
లమ్మిన నేమటుగాక, కాగితా
లమ్మిన నేమి? స్వర్ణ రజ
తాదుల నమ్మిన నేమి? నీ వలెన్
కమ్మని కైతచేత నుతి
గాంచిన వర్తకు లెందరీ పురిన్?

శ్రీ వెలమచెర్ల రంగాచార్యులు

# చమత్కార చంద్రిక

"ధర్మార్థ కామ మోక్షేషు
వైచక్షణ్యం కళాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ
సాధు కావ్య నిషేవణమ్"

అను ఆలంకారిక సూక్తి భారతీయుల కావ్య స్వరూప ప్రయోజనములను స్పష్టపఱచుచున్నది. ఈదృష్టితోనే కావ్యస్వరూపమును పరిష్కరించుటకును, తదాత్మను నిరూపించుటకును విద్వాంసులు కావ్య మీమాంస ప్రారంభించినారు కావ్యానందము బ్రహ్మానందసధ్రీచీన మగుట సత్కావ్య నిషేవణమునకు రసికపాఠకులు అహమహమికతో ప్రసక్తులైనారు. అగ్నిపురాణమునుండి అధునాతకాలము వఱకును ఈ మధురోపనిషదర్థ చర్చ సాగుచునేయున్నది.

"సాహిత్యం సపరిష్కారం
కవినా పరికల్పితమ్,
భావయన్ రసికో లోకే
సుఖ మత్యంత మశ్నుతే."

అని సాహిత్యమీమాంసాకారుఁడు రాజశేఖరుఁ డన్నట్లు ఈ రసికులు పరిష్కృతమైన కావ్య స్వరూపమును తెలిసికొని తదనుగుణముగా మహాకవుల కావ్యములను పఠించి అందలి రసాలంకార చమత్కారములను భావించి ఆనందింతురు. కేవల పఠితలకంటె ఆయా కావ్యాంగ స్వరూప జ్ఞానపూర్వకముగా కావ్యానుసంధానము చేయు సహృదయునకు అందు విశేషానందప్రాప్తి కలుగు ననుట తెల్లముగాదా!

ఈ సాహిత్యవిమర్శలో పాల్గొన్న ప్రతిభా సంపన్నులలో భరతమహర్షి - ఆనందవర్ధనాచార్యుఁడు - అభినవగుప్తుఁడు - దండి - వామనుఁడు - మమ్మటుఁడు - రాజశేఖరుఁడు - భోజుఁడు - క్షేమేంద్రుఁడు - విద్యానాథుఁడు - విశ్వేశ్వరుఁడు - జగన్నాథపండిత రాయలవంటి మహామహులు కలరనిన ఈ శాస్త్ర మహత్త్వ మెట్టిదో స్పష్టపడును.

కావ్యములో ఆనందహేతువైన ప్రధానాంశము అనగా ఆత్మస్థానీయము - కావ్యజీవితము ఏది యను జిజ్ఞాసలో పలువురు తమతమ అనుభవములనుబట్టి భిన్నాభిప్రాయములను ఈక్రింది విధముగా ప్రకటించియున్నారు.

| | | |
|---|---|---|
| 1. | రసము | భరతముని మొ. |
| 2. | అలంకారము | భామహాదులు -- |
| 3. | రీతి | వామనాదులు |
| 4. | ధ్వని | ఆనందవర్ధనప్రభృతులు |
| 5. | వక్రోక్తి | కుంతకుఁడు |
| 6. | ఔచిత్యము | క్షేమేంద్రుఁడు |
| 7. | చమత్కారము | విశ్వేశ్వరుఁడు. |

సారస్వతరసికులైన శాస్త్రజ్ఞులు వాఙ్మయమును విశేషముగ ఆలోడించి తమతమ పరిశీలనమునకు ఫలితముగా ఈ కావ్యజీవితమును నిరూపించియున్నారు. ఈ శాస్త్రకారులశ్రేణిలో పేర్కొనఁదగిన ఆంధ్రాలంకారికులు — 1. విద్యానాథుఁడు 2. విశ్వేశ్వరుఁడు 3. జగన్నాథపండితరాయలు 4. వారణాసి ధర్మసూరి.

వీరిలో ప్రతాపరుద్రుని యాస్థానమున విద్వత్కవి పదవిలో నుండి డెబ్బదినాలుగు కృతుల వెలయించి, విద్యానాథుఁడుగా ఖ్యాతిగాంచిన అగస్త్యపండిత వర్యుఁడు అలంకారశాస్త్రములో ఒక నూతన మార్గమును నెలకొలిపి వాసికెక్కెను. అలంకార శాస్త్ర

గ్రంథమున ఉదాహరణముగా లోకోత్తరగుణోత్తరుఁడైన ఒకవ్యక్తిని నాయకునిగా కూర్చుటయే ఆ క్రొత్తత్రోవ. తన అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహ మనెడి గ్రంథమున లక్ష్యముగా ప్రతాపరుద్రచక్రవర్తి వృత్తమును నిబద్ధించి, అటు అలంకార శాస్త్రమునకును, ఇటు ఆంధ్రచరిత్రకును సువర్ణ సౌధమును నిర్మించి భళీ యనిపించుకొన్నాఁడు. పిమ్మట ఈ పద్ధతి అలంకారశాస్త్రగ్రంథరచన సాగించిన రచయితలకు పెక్కురకు ఆదర్శమై ఒప్పారినది. విద్యానాథుఁ డీ సందర్భమున చెప్పిన ఈ క్రింది శ్లోకములు గమనింపఁదగియున్నవి :

"యద్యప్యసౌ ప్రబంధేషు
ప్రాచాం సాధు నిరూపితా
తథా ప్యస్యాః సమం నేతు
రోన్నదాహరణ మాదృతమ్॥

ప్రబంధానాం ప్రబంధౄణా
మపి కీర్తిప్రతిష్ఠయోః ।
మూలం విషయభూతస్య
నేతు ర్గుణనిరూపణమ్ ॥

చిరేణ చరితార్థోఽభూత్
కావ్యాలంకార సంగ్రహః ।
ప్రతాపరుద్రదేవస్య
కీర్తి ర్యేన ప్రకాశ్యతే ॥"

రసగుణాలంకారాదికమైన యీ శాస్త్రప్రమేయము భరత, భామహాదులగుపూర్వులును తమనిబంధముల లెన్నగా నిరూపించియే యున్నారు. కాని అందెందును పుణ్య శ్లోకుఁడగు మహాపురుషుని జీవితాంశములు ఉదాహరణములుగా చెప్పఁబడ లేదు. పవిత్ర చరిత్రుఁడైన నాయకుని గుణకీర్తనముచేయు ప్రబంధములకును, ప్రబంధనిర్మాతలకును శాశ్వతములైన కీర్తి ప్రతిష్ఠలు కలుగును. ప్రతాపరుద్ర సార్వభౌమునివంటి పురుషోత్తముని నాయకునిగా స్వీకరించి తద్యశస్సు నుగ్గడించిన దగుటచే నేఁటి కీ శాస్త్రము చరితార్థమైనది.

విషయమహత్తకు తోడు వర్ణ్య నాయక మహత్తయు కూడినచో బంగారమునకు తావి యబ్బినట్లే కదా! ఈ భావమునే—

"కవే రల్పాపి వాగ్వృత్తిః
విద్వత్కర్ణావతంసతి
నాయకో యది వర్ణ్యేత
లోకోత్తరగుణోత్తరః"

అనుచు ఉత్తమనాయక కీర్తి నిబద్ధమైన కావ్యమున కవిగతలోప మేదేని యున్నను అది మఱుఁగువడిపోయి పండితుల మెప్పు పొందఁగలదియే యగునని భోజరాజు సమర్థించెను.

ఈ మార్గము ననుసరించియే ఆయా ప్రదేశవాసులైన సాహిత్యగ్రంథకర్తలు తమతమ కృతులలో ప్రజారంజకులును, వైదికధర్మ రక్షాదీక్షితులును, వాఙ్మయపోషకులు నగు రాజచంద్రులయు, మహాపురుషులయు సచ్చరితములను కీర్తించుచు గ్రంథరచనముచేయసాగిరి. ఈ యశోభూషణగ్రంథవాటికలో దాదాపుగా ఏఁబదియైదు గ్రంథములు వెలువడిన వనగా ఈ పద్ధతి శాస్త్రకారుల నెంతగా ఆకర్షించినదో తెల్లమగుచున్నది. ఈ యశోభూషణ శాఖకు చెందిన గ్రంథరత్నములలో చమత్కార చంద్రికయు ఒకటియై విలసిల్లుచున్నది.

చమత్కార చంద్రిక – సింగభూపాలుఁడు :

విశ్వేశ్వరకవి తన చమత్కార చంద్రికలో సింగభూపాలుఁడను రాజచంద్రుని కీర్తి చంద్రికను ఉదాహరణముగా నిబద్ధించియున్నాఁడు. రెండవ సింగభూపాలుఁడుగా చరిత్రప్రసిద్ధి నొందిన ఈ సింగభూపాలుఁడు రేచెర్లవంశీయుఁడైన అనపోత నాయకుని కుమారుఁడు. కాకతీయరాజ్య పతనానంతరము కాకతీయులకడ చమూపతులుగా నుండిన ఈ రేచెర్లవీరులు స్వతంత్రులై రాచకొండను రాజధానిగా చేసికొని పాలించినారు.

ప్రకృత మాంధ్రప్రదేశములోని నల్లగొండ జిల్లాలో నున్న ఈ రాచకొండనే "రాజాచల" మని

సంస్కృతకవులు వ్యవహరించిరి. రాజాచలప్రభువు లైన ఈ రేచెర్లవారు రణరంగమునను సాహిత్య రంగమునను సమముగా విహరించి పేరుమోసిన వారు. వీరిలో నాయకమణిగా చెప్పఁదగినవాఁ డీ విశ్వేశ్వరకవి కృతిలో వర్ణింపఁబడిన సింగభూపా లుఁడు,

ఈ రెండవ సింగభూపాలుఁడు క్రీ.శ. 1386–1412 నడుమ రాజ్యమేలినట్లు చరిత్రలవలన తెలియుచున్నది. ఈతఁడు విశేషవిద్యాపరిశ్రమము చేసినవాఁడు. సంగీతసాహిత్యశాస్త్రములలో మిగుల లోతైన పాండిత్యముగలవాఁడు. నిరంతరము పండితులతో శాస్త్రగోష్ఠుల నెఱపుచు బహువిధమైన శాస్త్ర జ్ఞానమును, ప్రజ్ఞాపాటవమును సంపాదించుకొన్న వాఁడు. కావుననే ఈతనికి సర్వజ్ఞుఁడను ప్రసిద్ధి కలిగెను. ఈతఁడు సర్వజ్ఞుఁ డనుటయు, పాండితీ ధురంధరుఁ డనుటయు ఈ క్రింది ప్రమాణములను బట్టి దృఢపడుచున్నది. ఇతని ఆస్థానపండితుడై యుండి అమరపదపారిజాత మనెడి అమరకోశ వ్యాఖ్యానమును రచించిన బొమ్మకంటి అప్పయార్యుఁడు ఆ వ్యాఖ్యారంభములో—

"విద్యాదైవత తాత తావకగురోః
సర్వజ్ఞ చూడామణేః
స్తోతవ్యోఽసి మనీషిణాం త్వ
మథవా మద్యోజవాకై రలమ్,
ఇత్థం సింగమహీపతిం
గురుజనో ప్యాభాషతే దో—వాణ(?)
త త్తత్పద్ధతి ధర్మమర్మణి
పరిచ్ఛేదావిసంవాదికమ్."

అను పద్యమునను —

"జైవాతృకం బుధగురుం నిలయం కలానాం
సర్వజ్ఞ మూర్ధమణి మాశ్రిత శుద్ధపక్షమ్,
శ్రీ బొమ్మకంట్యుపపదాంకిత మప్పయార్యం
సర్వేష్టితోషితసురం ద్విజరాజ మాహుః"

అను శ్లోకమునను "సర్వజ్ఞచూడామణేః" "సర్వజ్ఞ మూర్ధమణిమ్" అను పదములు శ్లేషభంగితో స్పృశించిన సర్వజ్ఞశబ్దము ఈశ్వరునకు వలెనే రాజాచలేశ్వరుఁడైన ఈ రెండవ సింగభూపాలున కును అన్వయించునట్టిదియై యున్నది.

"అతిగంభీరే విషయే
కతిపయవేద్యే త్విహ గ్రంథే
సమ్యగ్వ్యాఖ్యాకుశలః
సర్వజ్ఞ స్సింహభూప ఏవైకః"

అనుచు స్వయముగా సింగభూపాలుఁడే తనకు సర్వజ్ఞబిరుద మున్నట్లు తన సంగీత రత్నాకర వ్యాఖ్యయైన "సుధానిధి"లో స్పష్టముగా చెప్పి కొన్నాఁడు.

ఈయంశమే కోలాచల మల్లినాథసూరి కుమారుఁడైన పెద్దిభట్టు అను మహావిద్వాంసుని ప్రశంసించుచు, ఆవంశీయుడే యైనవాఁడును చంపూ రామాయణ వ్యాఖ్యాతయు నైన నారాయణ పండితుఁడు చెప్పిన —

"మహోపాధ్యాయ ఆఖ్యాతః
సర్వదేశేషు సర్వతః
మాతులేయ కృతౌ దివ్యే
సర్వజ్ఞే నాభివర్ణితః"

అను శ్లోకమువలన కూడ దృఢపడుచున్నది. సర్వశాస్త్రవిశారదుఁడైన కోలాచల పెద్దిభట్టునకు సర్వజ్ఞుఁడైన సింగభూపాలుఁడు కనకాభిషేక మహోత్సవము జరిపించుట యుక్తమేకదా !

ఈ విధమైన యాధారములనుబట్టి ఈ రెండవ సింగ భూపాలునకును సర్వజ్ఞబిరుదము కలదనుట స్పష్టము.

ఈతని మనుమఁడగు మూఁడవ సింగభూపాలుఁడును (1405–'75) మహావిద్వాంసుడుగను వాఙ్మయపోషకుఁడుగను పేరెన్నిక గన్నవాఁడు ఈతనికిని సర్వజ్ఞ బిరుదము కలదు. ఈతని చూడ వచ్చినప్పుడే శ్రీనాథుఁడంతటి మహాకవి ఈ విద్వద్రాజశేఖరు నెట్లు మెప్పింతునో యనుచు—

"దీనారటంకాల తీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద

మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణ నికురంబ! శారదాంబ!"

అని శారదాంబను తనకు తోడుపడ నభ్యర్థించెను. అట్లే సర్వజ్ఞుఁ డనఁగా రావుసింగ మహీపాలుఁడే యనుచు అతఁడే చెప్పినట్లు వాడుకలో నున్న

"•సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే"

అను పద్యమువలనను ఈ మూఁడవ సింగభూపాలునకు సర్వజ్ఞ బిరుద మున్నట్లు స్పష్టమగుచున్నది.

పోతనమహాకవి భోగినీదండకమును* చెప్పినది కూడ ఈ మూఁడవ సింగభూపాలుని మీఁదనే యను నంశము—

"వసంతావనీనాథ సంసేవితాంచత్ పదాంభోజ – కుమారాన్నపోతావనీ నాథ సూనున్ – సర్వజ్ఞ సింగక్షమానాథున్ – ఘనున్ రావుసింగక్షమానాథ పౌత్రున్—"

అను భోగినీదండకస్థము లగు వాక్యములవలన తేటపడుచున్నది ఇందు పేర్కొనఁబడిన అనపోత నాయకుఁడు రెండవ సింగభూపాలుని కుమారుడు. వసంతనాయకుఁడు మూఁడవ సింగభూపాలునికి తమ్ముఁడైనవాఁడు. కావున "రావుసింగమహీనాథ పౌత్రున్" అనుచో నున్న సింగమ నాయకుఁడు సుప్రసిద్ధుఁడైన రెండవ సింగభూపాలుఁడే. అతని పౌత్రుడే ఈ మూఁడవ సింగభూపాలు డనుట స్పష్టము.

ఇంతేగాక ఈమూఁడవ సింగభూపాలుని యోగ్యతామహిమంబులను రెంటూరి రంగరాజకవి తన భానుమతీ పరిణయగ్రంథములోఁ గృతిపతివంశాను వర్ణనమున —

"ఏ మహాసేనాని యుద్ధతేజోరాశి
హిత ధనంజయ జయోన్నతి వహించె
.... .... .... .... .... .... .... .... .... ....

ఏ సమాశ్రిత విద్యాధరేంద్ర శక్తి
సుగుణగణపాల నార్పిత స్ఫూర్తిఁ గాంచు
అట్టి సర్వజ్ఞమూర్తి నా నలరుచుండుఁ
జిత్రకళ మీఱి సర్వజ్ఞ సింగశౌరి"

అని "సర్వజ్ఞ"బిరుదవిషయమును ప్రస్తావించెను. ఈ మూఁడవ సింగభూపాలునకు సర్వజ్ఞ బిరుద మున్న విషయమున అతడు తిరుపతికేగి శ్రీవేంకటేశ్వరస్వామిని సేవించి అనర్ఘ రత్నాభరణాదులను సమర్పించి వేయించిన శాసనములో అతనికి విశేషణముగా సర్వజ్ఞపదము వాడఁబడియుండుట అతి ముఖ్యమైన ప్రమాణము. ఈ అంశములను బట్టి రాచకొండ ప్రభువు లగు రెండవ సింగభూపాలునకును, మూఁడవ సింగభూపాలునకునుకూడ సర్వజ్ఞ బిరుదము కలదని తేలుచున్నది. వీరిరువురికే గాక కొండవీటి ప్రభు వగు పెదకోమటి వేమారెడ్డికిని సర్వజ్ఞ బిరుద ముండినట్లు తెలియుచున్నది. ఇదియు ఆనాటి స్పర్ధా వైచిత్రియేమో!

• ఈ పద్యమున 'రావుసింగజనపాలున కేయుర్విం జెల్లును' అని విఱిచి ప్రశ్నార్థకముచేయుటయు కవిసార్వభౌముని యభిప్రాయమై యుండునని కొంద ఱందురు.

* ఈ భోగినీదండకము భాగవతరచయిత యగు పోతనకవిది కాదని కొందఱును, ఔనని కొందఱును తలంచిరి.

రెండవ సింగభూపాలుని తమ్ముఁడుమ, మహా శూరుఁడును అయిన మాదానాయకుఁడు దేవరకొండ దుర్గమున కధిపతియై అన్నగారివలెనే కవులను ఆదరించి వాఙ్మయపోషణము కావించినట్లు చరిత్ర ప్రసిద్ధి. ఆతని కుమారుఁడు వేదగిరినాయకుఁడు శాకల్య అయ్యలార్యునిచే అప్పటికి అసంపూర్ణముగా నున్న భాస్కరరామాయణమున యుద్ధకాండమును వ్రాయించి పూర్తిచేయించెను.

రెండవ సింగభూపాలుని రచనలు :

సింగభూపాలుఁడు కేవలము విద్వాంసుఁ డగుటయేగాక ఉత్తమ రచయితగాను ప్రసిద్ధికెక్కెను. పండితపోషణము, గ్రంథరచనము కూడ అతనికి వంశానుగతముగ ఏర్పడిన సౌభాగ్యముగనే కనఁబడుచున్నది. ఆతని తండ్రి అనపోతనాయకుఁడు మదనవిలాసభాణ కర్తయు, అయినవోలు శాసన రచయితయు నగు నాగనాథ కవివంటి విద్వాంసులను పోషించెను. స్వయముగా ఈ యనపోతనాయకుఁడు అభిరామరాఘవ నాటకమును రచియించి ప్రశస్తివడసెను. అట్టి విద్వద్రాజ తల్లజునకుఁ పుత్రుఁడైన సింగభూపాలుఁడును ఉత్తమరచయిత యగుట యుక్తమేగదా ! ఈతని గ్రంథములలో ముఖ్యముగా పేర్కొనఁదగినవి—

1. రసార్ణవ సుధాకరము

2. కువలయావళి

3. సంగీత సుధానిధి

1. రసార్ణవ సుధాకరము

ఈ విద్వద్రాజకవి కీర్తిసౌధమునకు స్వర్ణపతాక యనఁదగు ఇది మూఁడు విలాసములలో వెలయు నాట్యాలంకారశాస్త్రగ్రంథము. ఇందు నాటకాది రూపకముల స్వరూపము, నాయికా నాయకాది లక్షణము, రసాది నిరూపణము మున్నుగా పెక్కు విషయములు సవిస్తరముగా లక్షణోదాహరణములతో ప్రదర్శింపఁబడినవి. ప్రామాణికులైన మల్లినాథసూరి మున్నైన వ్యాఖ్యాతలచే ప్రామాణిక గ్రంథముగా పేర్కొనఁబడుటయే ఈ గ్రంథ వైశిష్ట్యమును వెల్లడిచేయుచున్నది. ఈ గ్రంథమును సింగభూపాలుఁడు రచియింపలేదనియు, విశ్వేశ్వర కవియే రచియించి తనప్రభువుపేరు పెట్టెననియు దేశములో గల ప్రవాదము నిరాధారమైనది.

ఈ రసార్ణవసుధాకరమున కవి తన పూర్వ వంశజులను, తనను ఉగ్గడించుకొనుచు చెప్పినట్లున్న భాగము "వంశావళి" అనుపేర చమత్కార చంద్రికలోను అచ్చటచ్చట ఉట్టంకింపఁబడుట జూచి 'యే కవియైన తనను – తనవంశమునుగూర్చి వర్ణించుకొనునా ?' అని ప్రశ్నించికొని 'ఇది విశ్వేశ్వరకవియే చమత్కారచంద్రికను రచించె ననుటకు హేతువు' అందురు. సుప్రసిద్ధ కవులు తమ వంశమును గురించి చెప్పిన ప్రశస్తిపద్యములను తమ రచనలలో చేర్చుకొనుట తప్పిదము కాదనియు, అది ఆ సందర్భమున యుక్తమైనదే యనియు, అంతమాత్రముచేతనే గ్రంథకర్తృత్వమే ఆ రాజకవికి తొలఁగిపోదనియు విజ్ఞులు భావింతురు. రాజకవులు రచించిన కృతులలో స్వీయవంశప్రసక్తి వచ్చిన సందర్భమున తమ ఆస్థాన కవులు రచించి యున్న పద్యములను వాడుకొనుచుండుట పరిపాటియే యనుటకు సంస్కృతాంధ్రవాఙ్మయములో ఉదాహరణములు పెక్కు గలవు.

కావ్యరీతి నిర్వచన ప్రకరణములో సింగభూపాలుఁడు కోమలము, కఠినము, మిశ్రము అను మూఁడు తెఱఁగులను పేర్కొని సమన్వయింపఁగా విశ్వేశ్వరకవి అసమాసము, మధ్యసమాసము, దీర్ఘ సమాసము, మిశ్రసమాసము అని రీతులను నాల్గువిధములుగా విభజించి సమన్వయించెను. ఇదియు ఈ గ్రంథముల భిన్నకర్తృత్వమునకు ప్రమాణ మనవచ్చును.

ఇరువురు కవులును ఆయా సందర్భములలో తమ గ్రంథములయందు ఒండొరుల గ్రంథములను స్పష్టముగా పేర్కొనియుండుటయు, వీరు భిన్న

గ్రంథ రచయిత లనుటకు తార్కాణ యగుచున్నది. ఈ రెండు గ్రంథములయొక్క స్వరూపమునుబట్టి కూడ వీని భిన్నకర్తృకత్వము నిరూపిత మగుచున్నది. రసార్ణవసుధాకరమున లక్ష్యములుగా ప్రసిద్ధులైన మహాకవుల పద్యములు రచయితచే స్వీకరింపఁబడగా, చమత్కారచంద్రికలో కవి స్వీయపద్యములనే విశేషించి లక్ష్యములుగా కూర్చి విద్యానాథమహాకవి చూపిన యశోభూషణరూపమైన నూతన ప్రక్రియ ననుసరించెను.

ఇఁక కందర్పసంభవ మనెడి గ్రంథమును ఈ ఉభయులును తమదిగా తమ గ్రంథములలో పేర్కొనియుండుట కొంత ఈ కర్తృత్వవిషయములో ఇబ్బంది కలిగించుచున్న విషయమే కాని ఇంతకు ఇది యొక లఘుకృతియై యుండును. పైగా ఇది అలభ్యము. ఇట్టి పరిస్థితిలో ఏయొకరి గ్రంథములోనైనను ఈ కందర్పసంభవము పేర్కొనఁబడినచోట 'మమైవ' - అను పదము లేఖకప్రమాదపతిత మన్నచో ఈ యిబ్బంది తొలఁగఁగలదు.

పైన పేర్కొన్న విశేషాంశములనుబట్టియు, ప్రామాణికులైన వ్యాఖ్యాతలు 'సింగభూపాలీయ' మని రసార్ణవసుధాకరమును పేరుపెట్టి తెలుపుటచేతను, పరంపరగా పండితమండలిలో ప్రరూఢమైన వ్యవహార ముండుటచేతను, రసార్ణవ సుధాకరము సింహభూపాల విరచితమే యనుట సమంజసముగా తోచుచున్నది.

**2.** కువలయావళి

ఇది నాలుగంకములలో నిర్మింపఁబడిన ఒక నాటిక. దీనికి రత్నపాంచాలిక యనియు నామాంతరము గలదు. ఇందలి యితివృత్తము శ్రీకృష్ణస్వామి కువలయావళుల ప్రణయము. ఇది సహృదయులకు చమత్కారహేతు వగునని—

"శ్రీమతా సింగభూపాలేన ప్రణీతామ్" అఖండ పరమానంద వస్తు చమత్కారిణీం, కువలయావళీం నామ నాటికాం ప్రయోగతో దర్శయ-- "అను సూత్రధారవాక్యమున కవియే స్పష్టీకరించెను. ఈ రూపకమున నేత, రచయిత, సామాజికుఁడు, ప్రయోక్త అను నలువురి మేలికలయిక హృదయంగమమై యేర్పడిన దనుచు

"నేతా మన్మథకారణం యదుపతిః;
శ్రీయన్నపోతాత్మజో
నాట్యాలంకృతి నిర్మితౌ పరిణతః
శ్రీసింగభూపః కవిః;

ఏషా పండితమండలీ రసరమా
సామ్రాజ్య సంజీవనీ;
పుణ్యే నాద్య పురాకృతేన పరితో
మే నాట్యవిద్యాశ్రమః."

అను ఈ నాటికయందలి ఆముఖ శ్లోకము వ్యక్తీకరించుచున్నది. అతిరసవంతమైన సింగభూపాలుని ఈ నాటిక విద్వత్కర్ణావతంసమై యొప్పినది.

"పూర్ణేయం సింగభూపేన
గ్రథితా మధుజల్పితైః
రత్నపాంచాలికా నామ
నాటికా రసవేటికా ॥"

అని నాటకాంతమున కవి తనకృతిని రసపేటికగా చెప్పికొన్నాఁడు. ఇది సహజోక్తియే యని సహృదయు లగు పాఠకులు భావింతురు.

**3.** సంగీత సుధాకరము

ఇది శార్ఙ్గదేవుఁడు రచియించిన సుప్రసిద్ధమైన సంగీతరత్నాకర మనెడి గ్రంథమునకు వ్యాఖ్య. సంగీతసాహిత్యములలో అతలస్పర్శియైన పాండిత్యము గల ఈ విద్వద్రాజకవి స్వయముగా నాట్య గ్రంథమును (రసార్ణవసుధాకరమును) రచియించి ఆ శాస్త్రమున కవసరమైన సంగీతప్రక్రియను వివరించుటకే వ్యాఖ్యానమును సంతరించినాఁడు. సంగీతరత్నాకరమునకు గల పెక్కు వ్యాఖ్యానములలో సర్వజ్ఞుని ఈ సుధాకరమునకు విశిష్టస్థానము కలదు.

ఈ రచనలలో నెల్లయెడలను ఈ మహారాజు కీర్తిప్రతిష్ఠల వైపునకంటె ఆధ్యాత్మికమార్గము నందే దృష్టి విశేషించి కేంద్రీకరింపఁజేసినాఁ డనుట తెల్లమగుచున్నది.

"కల్యాణమస్తు జగతాం సతతం త్రయాణాం
సంవర్ధితో భవతు వైదిక ఏవ మార్గః"

అని కువలయావళీ భరతవాక్యమున ఈ కవి యాశించినాఁడు. అట్లే సంగీత సుధాకరమున "సంగీత శాస్త్రజ్ఞుఁడైన వీణావాదనకుశలుఁడు మోక్షపదము నొందు ననుచు—

"వీణావాదన తత్త్వజ్ఞః
శ్రుతి జాతి విశారదః
తాలజ్ఞ శ్చాప్రయాసేన
మోక్షమార్గం స గచ్ఛతి"

అను యాజ్ఞవల్క్యస్మృతి వాక్యము నుట్టంకించుచు తన ఈ సాహిత్య సంగీత పరిశ్రమము సర్వేశ్వరుని యనుగ్రహసంపాదక మైన ఉపాసనలోని భాగమే యని ధ్వనింపఁ జేసినాఁడు.

సింగభూపాలుని మతము

ఈ రేచెర్ల వంశీయులలో ముఖ్యముగా సర్వజ్ఞ సింగభూపాలుఁడును ఆతని సంతతివారును దేవరకొండ రాజ్యమేలు ఈ శాఖలోని మాదానాయకుఁడు (మాధవ నాయకుఁడు), ఆతని కుమారుఁడు వేదగిరి నాయకుఁడు మున్నైనవారు విశిష్టాద్వైతసిద్ధాంతానుయాయు లైనట్లు తెలియుచున్నది. సుప్రసిద్ధ శ్రీవైష్ణవమత ప్రవర్తకు లగు వేదాంతదేశికుల వారును, భగవద్రామానుజ సిద్ధాంత విజయధ్వజులుగా వాసికెక్కిన కుమారవేదాంతాచార్య లనఁబడు వరదాచార్యులును ఈ రాజులకు ఆచార్యస్థానీయులై యుండినట్లు "నిగమాంత దేశిక సచ్చరిత్రము" మున్నైనవానివలనఁ దెలియుచున్నది.

"తతశ్చ సర్వజ్ఞ సింహభూపః (?)
ప్రాగేవ రామానుజదర్శనస్థః
తీవ్రాం ముముక్షా మధిగత్య, తస్మిన్
గురౌ భరన్యాస మపేక్షతే స్మ."

"శ్రీవైష్ణవాగ్ర్యా అపి తత్త్వయుక్తాః
ప్రణమ్య భూయః పదపద్మయుగ్మం
ముముక్షు మేనం గురుసార్వభౌమే
సమర్పయామాసు రనన్యరక్షమ్."

అను శ్లోకములవలన సర్వజ్ఞసింగభూపాలుఁడు అంతకుముందే రామానుజమతానుయాయుఁడై యున్నట్లు, క్రమముగా పరిణతచిత్తుఁడైన ఆ రాజచంద్రునకు మోక్షేచ్ఛ తీవ్రమైనట్లును శ్రీ నిగమాంత దేశికుల చరణముల నాశ్రయించి భరన్యాసమును (ప్రపత్తివిశేషము) చేయగోరి కొందరు భాగవతోత్తములను కాంచీపురమునకు పంపినట్లును వారు దేశికులవారి అనుగ్రహమును సంపాదించి సింగభూపాలునకు భరన్యాస మిప్పించినట్లును తెలియుచున్నది.

మాదానాయకుని పుత్రుఁడైన వేదగిరినాయకుడు తత్వవిషయమున జిజ్ఞాసువై దేశికులవారిని పరిప్రశ్న సేయగా దేశికులవారు

"త్రివిధ చిదచిదీశ లక్ష్య తంత్రే
యతిపతి యామున భాషితే నియోక్తుః
ఇదమితి నిగమాంతదేశికేన
ప్రతిసమదిశ్యత మాధవాత్మజః."

యామునరామానుజా ద్యాచార్యులచే ప్రతిపాదింపఁబడినదియు, తత్త్వత్రయోపేత మైనదియు నగు విశిష్టాద్వైత సిద్ధాంత స్వరూపమును నిరూపించుచు సమాధానముగా సందేశమంపిరట.

ఈ పైఅంశములవలన వీరు విశిష్టాద్వైత మతానుయాయులని తేలుచున్నది.

సింగభూపాలుని వాఙ్మయపోషణము

ఈ విద్వత్కవిరాజశేఖరుని ఆస్థానమున బొమ్మకంటి అప్పయార్యుఁడు (అమరపదపారిజాత కర్త) మున్నైన పండితకవులు నుండిరి. ప్రఖ్యాత వ్యాఖ్యాత యైన కోలాచలము మల్లినాథసూరి

కుటుంబమువారుకూడ ఆ కాలమునకు రాచకొండ చేరి ఈ ప్రభువు ఆస్థానమున సంభావ్యులై ఆస్థానవిద్వత్పదవుల నధిష్ఠించియున్నట్లు కనఁబడుచున్నది. ఆనాటి ఈ పండితకవుల కోవలో నాయకమణిగా పేర్కొనఁదగినవాఁడు వీరభద్ర విజృంభణ మను డిమరూపకము, కరుణ కందళము, కందర్పసంభవము (సంశయకర్తృత్వము), చమత్కార చంద్రికలకు కర్త యగు విశ్వేశ్వరపండితుఁడు.

ఈ శతాబ్దము సంస్కృతాంధ్రవాఙ్మయమున నూతనసృష్టి ప్రచారముల కాటపట్టయినట్లుగా గోచరించును. కృష్ణకీవల రేచర్లవంశీయులైన వెలమ రాజులు పైరీతిని తమపాలనలో వాఙ్మయపోషణము గావించుచుండగా, కృష్ణ కావల కొండవీటిసీమలో రెడ్డిప్రభువులుకూడ వైదికమార్గ సంరక్షణమునను, సంస్కృతాంధ్ర వాఙ్మయ పోషణమునందును బద్ధశ్రద్ధులై యుండిరి. ఈ ఉభయ రాజవంశీయుల కును గల విరోధభావము రాజకీయములలో ఏ పరిణామమునకు హేతువైనను, సారస్వతరంగమున మాత్రము పెద్ద మేలే చేకూర్చిన దనవచ్చును. ఒకవిధముగా చూడగా వీరు ఒండొరులను మించి ఖ్యాతిగాంచు నుద్దేశముతో పోటీపడి వాఙ్మయ పోషణము గావించినట్లున్నారు. "స్పర్ధయా వర్ధతే విద్యా" అనుసూక్తి ఈ రెడ్డి-వెలమ రాజకుటుంబములవారి సోత్సాహ వాఙ్మయ నిర్మాణ-పోషణములో నిక్కమైనది. కుమారగిరిరెడ్డిప్రభువు (1386-1402) "వసంతరాజీయము" అను నాటకలక్షణగ్రంథమును రచియించుటయేగాక తన సన్నిహితుఁడగు కాటయ వేమారెడ్డిచే కాళిదాస విరచితములైన శాకుంతలాది నాటకత్రయమునకు సంస్కృతమున చక్కని వ్యాఖ్యానములను రచియింపఁజేసెను. కుమారగిరి "వసంతరాజీయము", కాటయ వేముని "కుమార రాజీయ" నామాంకితములైన కాళిదాస నాటక వ్యాఖ్యలును మల్లినాథాదులచే తమ వ్యాఖ్యలలో ప్రమాణీకరించుకొనబడిన వగుటచే వాని వైశిష్ట్యము తెల్లమగుచున్నది. ఈ రెడ్డిప్రభువులలో మేటి యైన పెదకోమటివేమారెడ్డి (1402-1420) కూడ కవిపండితపోషకుఁడుగా పేరొందినవాఁడు, ఇతఁడు అలంకార శాస్త్రములో "సాహిత్యచింతామణి" అను గ్రంథమును రచియించెను అతఁడు సంస్కృత వాఙ్మయమునేగాక తెలుఁగువాఙ్మయమునుకూడ పోషించెను. సుప్రసిద్ధ కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు ఈతని ఆస్థానకవియై యుండెను.

తులనాత్మకముగా పరిశీలించినచో రాచకొండవారి చమత్కార చంద్రిక, రసార్ణవ సుధాకరములకు దీటుగా కొండవీటివారి వసంతరాజీయము, సాహిత్య చింతామణులు భాసించును. ఇచ్చటివారి (కోలాచలము మల్లినాథసూరి మొ.) కాళిదాసీయ రఘువంశాది వ్యాఖ్యలకు అచ్చటివారి (కాటయవేముడు మొ.)కాళిదాసీయ శాకుంతలాది నాటకవ్యాఖ్యలును, ఎదురెదురుగా నిలుచుచున్నవి. ఈవిధమగు సాహిత్యస్పర్ధ యెంతయు వినోదహేతువే గాక దేశమునకు ప్రయోజనకారియు అగునుకదా!

మధ్యాంధ్రములో కృష్ణ కిరువైపులను ఈరీతిగా సారస్వతకృషి జరుగుచుండగా పశ్చిమాంధ్రములో తుంగభద్రానదీ తీరమున విజయనగరములో రాయ వంశీయులు హరిహర, బుక్క, ప్రౌఢదేవరాయాదులు వైదికధర్మరక్షణమునకును వాఙ్మయపోషణమునకును నడుముగట్టి పనిచేయసాగిరి. సాయణాచార్యులవారి ప్రసిద్ధములైన వేదభాష్యములు, శంకరవిజయము, సర్వదర్శనసంగ్రహము, మాధవీయధాతువృత్తి మున్నగునవియు అనాఁడు వెలసినవే. హరిహరరాయల మంత్రియై ప్రసిద్ధ వీరుఁడుగాను, రచయితగాను వాసికెక్కిన నిరుపమ (ఇరుగప) దండనాథుని "నానార్థ రత్నమాలిక" నిఘంటువు, భోగనాథుని ఉదాహరణమాల, తిప్ప భూపతి వామనాలంకార సూత్రవృత్తి వ్యాఖ్యయగు కావ్యాలంకార కామధేనువు, తాళదీపిక (సంగీత), రాజనాథ డిండిముని సాళ్వాభ్యుదయము మొదలైన సంస్కృత గ్రంథములును, జైమిని భారతము, విక్రమార్క చరిత్ర, శేషధర్మము

మున్నగు తెలుగుగ్రంథములును రచియింపబడినవి. విజయనగర ప్రభువుల వైదికధర్మ ప్రతిష్ఠాపన దీక్ష జగద్విదిత మైనదే.

ఈరీతిగా ఆనాఁడు తుంగభద్రనుండి గోదావరి వఱకును ఆంధ్రదేశములో ప్రభువులు తురుష్కుల ధాటిచే ఆఘాతము నొందిన వైదికధర్మమును పున రుద్ధరించి సుప్రతిష్ఠితము చేయుటలోను, సంస్కృతాంధ్రములలో గ్రంథములను నిర్మింపఁజేయుట లోను కృషిగావించి ప్రజారంజకులుగా స్థిరతర కీర్తి నార్జించిరి.

ఈ మహోద్యమములో మహత్తరమైన పాత్ర వహించిన శ్రీసింగభూపాలుని యశశ్చంద్రికలకు మణిదర్పణముగా భాసించుచున్నది శ్రీ విశ్వేశ్వర కవి చంద్రుని "చమత్కార చంద్రిక"యను అలంకారగ్రంథము. ఇని విద్యానాథుడుగా ప్రసిద్ధికెక్కిన అగస్త్యపండితుఁడు చూపిన యశోభూషణ రూప మైన నూతనప్రక్రియలో విశ్వేశ్వరకవి నిర్మించిన మణిప్రాసాదము.

## విశ్వేశ్వరకవిచంద్రుడు

ఈ విశ్వేశ్వర కవిచంద్రుఁడు భారద్వాజ సగోత్రుఁడు, ఈతఁడు వివిధశాస్త్రములలో విద్వాంసు డైనవాఁడు విశేషప్రతిభా సంపన్నుఁడైన మహా కవి. రసమీమాంసా రచయితయు, పండితాఖండలుఁడు నగు కాశీశ్వరమిశ్రుఁడు తన గురుదేవుఁడని—తథాచోక్త మస్మదాచార్యైః కాశీశ్వరమిశ్రై రసమీమాంసాయామ్ – (చమత్కార) అను వాక్యముచే తెలిపినాఁడు. ఆనాటి పలువు రాంధ్ర దేశీయ విద్వాంసులవలెనే విశ్వేశ్వరకవియు కాశీ క్షేత్రమునకు వెళ్ళి వివిధశాస్త్రములు అధ్యయనము చేసిన ట్లూహింపఁదగియున్నది. ఈతఁడు రేచెర్ల వంశీయుఁడైన మొదటి సింగభూపాలుని కుమారుఁడును రెండవ సింగభూపాలుని తండ్రియు నైన అనపోతనాయకుని రాజ్యకాలముననే అతవి ఆస్థానమున విత్వత్కవిపదవిని అధిష్ఠించి యుండెను. ఈ విద్వాంసుని చరణసన్నిధిని ఆనాడు పెక్కురు విద్యార్థులు విద్యార్జనము కావించిరి. వారిలో పశుపతినాథుని కుమారుఁడు నాగనాథకవి ముఖ్యుఁడు. ఇతఁడును రాచకొండ రాజాస్థానమునందలి పండిత శ్రేణిలో ఎన్నికగనియుండెను. గురువరుని వలెనే ఈతఁడుమ రసవత్కవిగా పేరొందినాఁడు. 'మదన విలాస'మనెడి ఈతని భాణమున—

> 'రేచెర్లవంశ రత్నాకరేణ, శ్రీ సింగభూపాల పూర్వాచల ప్రభాకరేణ, కేసమాంబికా కల్ప ప్రసూన గుచ్ఛేన, శ్రీ యనపోత భూపాలేన, సతత సన్నిధీకృత కల్యాణనారాయణస్య వసంతోత్సవే, భారద్వాజాన్వయ పరిపూర్ణరత్నాకరస్య, గురు విశ్వేశ్వరకవిచంద్రస్య ప్రియ శిష్యో నాగనాథకవిః—'

అని చెప్పిన గ్రంథారంభభాగముచే ఈ గురుశిష్యుల సంబంధము, వారు ఇరువురును అనపోతనాయకుని విద్వత్సభకు సంబంధించి యుండిన విషయము స్పష్టపడుచున్నవి. ఈ నాగనాథకవి తెలుఁగులో కూడ గ్రంథకర్త యైనట్లును, ఈతఁడు విష్ణుపురాణమును వ్రాసినట్లును విమర్శకులు చెప్పుచున్నారు. 1369 క్రీ. శ. లో వేయబడినదియు అనపోత నాయకుఁడు మైలారుదేవుని అంగరంగ భోగముల కొఱకు అయినవోలు గ్రామమును సమర్పించుచు వ్రాయించినదియు నగు అయినవోలు శాసనము చివర గల—'ఇతి శ్రీ కౌశికబ్రహ్మర్షి గోత్రజనుషా పశుపతి పండిత పుత్రేణ నాగనాథకవినా లిఖిత మిదం శాశ్వత ప్రతిష్ఠ మస్తు— అను వాక్యముచే ఇతఁడు శాసనకవి యనియు వెల్లడియగుచున్నది.

ప్రభుకుమారుఁడైన (రెండవ) సింగభూపాలునకును విశ్వేశ్వరకవి ఆచార్యత్వము వహించి శాస్త్రములు బోధించి ఆతనిని విద్వత్కవిగా తీర్చి దిద్దినట్లు కనఁబడుచున్నది. దీర్ఘాయుష్యసంపన్నుడైన ఈ కవిచంద్రుఁడు తన శిష్యుని రాజ్యకాలములో కూడ ఆ విద్వద్రాజసభకు మండనాయమానుఁడై, ఆ రాజకవి సారస్వతకృషికి చేదోడు

వాదోడై వాత్సల్యము ప్రదర్శించుచుండెను. తాను కావ్యమీమాంస యగు చమత్కార చంద్రికను చేపట్టకముందే సింగభూపాలుని ప్రోత్సహించి ఆతనిచే రసార్ణవ సుధాకర మను నాట్యాలంకార శాస్త్రగ్రంథమును వ్రాయించి ఆనందించెను. వీరి కొకరిపై నొకరికి గల ఆదర విశేషము—

'కృతి రభిమత కృతిచతురా
యది చతురోదాత్త నాయక గుణోదారా
ఇతి లక్షణ కృతిరత్నం
రచయే శ్రీసింగభూపాల గుణోదాహరణమ్(?)'

అను చమత్కారచంద్రికలోని శ్లోకమువలనను

అహో సాహిత్య సౌభాగ్యం
శ్రీ సింగ ధరణీపతౌ
శ్లాఘాయై యస్య సన్నద్ధా
విశ్వేశ్వర సరస్వతీ'

అను కువలయావళిలోని శ్లోకమువలనను స్పష్టపడు చున్నది. గుణపక్షపాతి యైన విశ్వేశ్వరకవి, ఉత్తమగుణసంపన్నుఁడును ఆదర్శరాజచంద్రుఁడు నైన ఈ సింగభూపాలుని యశోబింబమును తన వాఙ్మయాదర్శమున సుప్రతిష్ఠితముచేయ సంకల్పించి చమత్కారచంద్రికను నిబద్ధించెను. ఈ సందర్భమున చమత్కారచంద్రిక పీఠికాభాగమున విశ్వేశ్వర కవిచంద్రుడు చెప్పిన ఈ పద్యములు గమనింపఁ దగియున్నవి.

'లోకే రాఘవపాండవాద్భుతకథా
గ్రంథానుసంధాయినౌ
తౌ గ్రంథా వివ తన్మనిప్రణిహితౌ
శ్రీసింగభూపాశ్రయః
యాయా దాదరణీయతాం కృతధియాం
గ్రంథోఽయ మస్మత్కృతః
నాహం యద్యపి తాదృశోఽస్మ్యయ మసౌ
రాజా హి తాదృగ్గుణః.'

వాల్మీకి వ్యాస మహర్షులు రచించిన రామాయణ భారతములవలె శ్రీసింగభూపచరిత్ర నిబద్ధమైన ఈ చమత్కారచంద్రికయు సహృదయుల సమాదరమునకు పాత్రము కాగలదు. నేను ఆ వాల్మీకి వ్యాసుల కెందును పోలకపోయినను, ఈ సింగమనాయకుఁడు మాత్రము ఆ రామ యుధిష్ఠిరులతో ఈడైనవాఁడే సుమీ!— అని తాత్పర్యము.

మ్లేచ్ఛుల దురాక్రమణముచే పెక్కువిధముల ధర్మగ్లాని కలుగుచుండఁగా శౌర్యముతో వారి నెదిర్చి పోరాడి ధర్మోద్ధరణమున, మతసంస్కృతుల రక్షణమున దీక్షవహించి ప్రజారంజన తత్పరులై యున్న గుణవరేణ్యు లగు భూపతులు దైవాంశసంభూతులుగా, ధర్మసంస్థాపనార్థ ముదయించిన మహనీయులుగా ప్రజలచేత సంభావింపఁబడుట భావ్యమేకదా! 'నావిష్ణుః పృథివీపతిః', 'అష్టాభిః లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః' మొదలైన సూక్తు లీ యంశమునే తెలుపుచున్నవి. ఈ భావమునే మది నిడికొని వైదికధర్మ రక్షాదక్షులై వెలసిన కాకతీయప్రభువులలో నాయకరత్నమైన ప్రతాపరుద్రసార్వభౌముని అగస్త్య విద్యానాథమహాకవి—

'కౌసల్యాసీత్ ప్రథమజననీ
దేవకీ చ ద్వితీయా
విష్ణోర్మాతా తపసు మహితా
ముమ్మడంబా తృతీయా—

ఇత్యాది పద్యములలో ఆ మహారాజు ధర్మరక్షణార్థ ముదయించిన రామకృష్ణాదులవలె శ్రీమన్నారాయణుని అవతారమే యని ఉగ్గడించినాఁడు. ఇట్లే యింకను పెక్కుచోట్ల ఆతని దైవాంశసంభూతిని ప్రశంసించినాఁడు. అట్లే వైదికధర్మోద్ధారకుఁడును శ్లాఘ్యగుణోదారుఁడు నగు శ్రీసింగభూపాలమౌళిని భగవదంశసంజాతునిగా ప్రస్తుతించుచు ఆతని మహితచరిత మితివృత్తముగా లక్ష్యములనుగూర్చి లక్షణగ్రంథమును నిబద్ధించినాఁడు. ఇట్టి వీరి గుణగ్రాహితను కుక్షింభరిత యనుట సమంజసము కాదు.

**చమత్కారచంద్రిక : శాస్త్రప్రమేయము**

ఈ గ్రంథము ఎనిమిది విలాసములుగా విభజింపఁబడినది, అలంకారశాస్త్రప్రమేయ మైన గుణ రీతి రసాలంకారాదుల స్వరూపము నిది నిరూపించు చున్నది.

వర్ణవివేక మనెడి మొదటి విలాసములో వర్ణ, పద, వాక్య రూపమున వాక్కును మూఁడువిధము లుగా విభాగించి తొలుత వర్ణములను నిరూపించి, కావ్యప్రసజ్యములగు అవ్వాని శుభాశుభ ఫలితము లను వివరించెను. పిమ్మట అట్టి వర్ణములతో ఏర్పడు గణములను, వాని మంచిచెడుగులను విశదీకరించెను వర్ణ, వర్ణసంఘాత రూపమైన పద మును వివేచించి దాని వాచక, లక్షక, వ్యంజక రూపమైన త్రైవిధ్యమును లక్షణోదాహరణములతో సమన్వయించి చూపెను. ఈ ప్రకరణముననే పద దోషములను సోదాహరణముగా ప్రదర్శించెను. ఆయాదోషములు ఏయే సందర్భములలో గుణము లుగా భాసించునో వివరించెను.

వాక్కు మూఁడవ రూపమైన వాక్యమును రెండవ విలాసములో నిరూపించెను. అప్రయుక్త, దుస్సంధి, వ్యుత్క్రమాదులగు వాక్యదోషముల నిందు లెస్సగా చర్చించెను.

ఈవిధముగా మొదటి రెండు విలాసములలో శబ్దస్వభావమును వెల్లడించి మూఁడవ విలాసములో కవి అర్థస్వరూప నిరూపణమునకు కడఁగినాఁడు. వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము— అనురీతిగా వెలయు అర్థముల స్వరూపమును చూపి అపార్థ వ్యర్థాపక్రియాదులగు వివిధములైన అర్థదోషము లను సోదాహరణముగా ప్రకటించెను.

ఈరీతి పదార్థ స్వరూప వివేచన పూర్వకముగా కావ్యమును నిరూపించి అట్టి కావ్యమున గల పద్య, గద్య, మిశ్ర, శ్రవ్య, దృశ్య భేదములను ప్రదర్శించెను. ఈ ప్రకరణములోనే చతుర్భద్ర, భోగావళి, బిరుదావళి, ఉదాహరణము— మున్నైన లఘు కావ్యములకు లక్షణములు పేర్కొనెను.

గుణవివేక మనెడి నాల్గవ విలాసములో కావ్యోత్కర్షహేతువు లగు శ్లేష, ప్రసాద, సమతాదు లగు ఇరువదిమూఁడు గుణములను లక్ష్యలక్షణము లలో ప్రపంచించెను.

ఈ ప్రకరణములోనే అసమాస – మధ్యమ సమాస – అతిదీర్ఘ సమాస – మిశ్రసమాసములతో ఏర్పడు రీతి చతుష్టయమును; కైశికి, ఆరభటి, సాత్వతి, మధ్యమారభటి. మధ్యమకైశికి – అను వృత్తుల స్వరూపస్వభావమును, మృదు, ఖర (కఠిన) భేదముచే ద్వివిధమైన కావ్య పాకస్వరూ పమును క్రమముగా వివరించెను. కడపట విని మయాసహిష్ణువు లగు పదముల ఆన్యోన్య మైత్రీ రూపమైన శయ్య వివరింపఁబడినది.

పంచమోల్లాసము రసమునకు ప్రత్యేకింపఁ బడినది. ఈ రసవివేకమున విశ్వేశ్వరకవి శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, రౌద్రము, బీభత్సము, భయానకము– అను ఎనిమిది రసములనుమాత్రమే పేర్కొనెను. రస శ్రీసంపన్న మైన కావ్య మెట్లు కమనీయతర మగునో తెలిపి, ఆరసపోషణమున రచయిత బద్ధ శ్రద్ధుడు కావలె నని ప్రబోధించెను. పిమ్మట శృంగారాది రసములను, వానిస్థాయి, సాత్త్వికాది భావములను తెలిపి ఉదాహరణములతో సమన్వ యించెను. ఈ సందర్భములో తాను దిఙ్మాత్రము గానే ఈ రసాదుల స్వరూపమును ప్రదర్శించితి ననియు. వీని విస్తరరూపమును తెలియఁగోరు వారు శ్రీ సింగభూపాలుని రసార్ణవ సుధాకరమును చూడవచ్చు ననియు తెలిపెను.

కావ్యలక్ష్మికి భూషణములుగా వెలయు అలంకారములను ఈ కవి ఆఱవ విలాసములో చర్చించుచు అవి శబ్దాలంకారములు, అర్థాలంకారములు, ఉభయాలంకారములు– అను విధమున ముత్తెఱఁగులుగా విలసిల్లు నని తెలిపి అందు మొదటి విభాగమైన శబ్దాలంకారములను ఛాయ, ముద్ర, యుక్తి మున్నైన పదునొకండు విభాగ

ములనుగా చూపి వానికి లక్షణోదాహరణములను పొందుపఱచెను. అనుప్రాసాదులును, విభిన్న శ్లేషలును, చిత్ర, బంధ, గర్భ, గూఢాదులును— ఇట్టి శబ్దగతము లైన పలురీతుల కవితాప్రక్రియలును ఇందు చూపఁబడినవి.

ఏడవది అర్థాలంకార వివేకము అర్థము నాశ్రయించి యేర్పడు ఈ అర్థాలంకారములలో జాతి, విభావన, హేతువు, అహేతువు, సూక్ష్మము, ఉత్తరము, విరోధము, సంభవము, అన్యోన్యము, పరివృత్తి, నిదర్శనము. భేదము, సమాహితము, భ్రాంతి, వితర్కము, మీలితము, స్మృతి, భావము, అనుమానము, అర్థాపత్తి అను ఇరువదింటిని అవాంతరభేదములతో గూడ స్వరూపమును నిరూపించి లక్ష్యములలో సమన్వయించెను.

అష్టమవిలాసములో ఉభయాలంకారములు తెలుపఁబడినవి. ఇందు ఉపమ, రూపకము, సామ్యము, సంశయోక్తి, అపహ్నుతి, సమాధి, సమాసోక్తి, ఉత్ప్రేక్ష, అప్రస్తుత ప్రశంస, తుల్యయోగిత, లేశము, సహోక్తి, సముచ్చయము, ఆక్షేపము, అర్థాంతరన్యాసము, విశేషము, పరిష్కృతి, దీపకము, క్రమము, పర్యాయము, అతిశయము, శ్లేషము, భావనము, సంసృష్టి అను ఇరువదినాలుగు అర్థాలంకారములను పేర్కొని వానిలోని అవాంతర భేదములను వివరించి లక్షణసమన్వయముఁజేసెను. కడపట ఈ ప్రకరణములోనే సంసృష్ట్యలంకారమును నిరూపించుచు భిన్న శబ్దాలంకారముల కలయిక, అర్థాలంకారముల కలయిక, శబ్దాలంకారముల కలయికయు నను విధముగా ఇందు మూడు భేదము లేర్పడు నని ఉదాహరణములతో స్పష్టీకరించెను.

ఈ రీతిగా ఈచమత్కార చంద్రికయందు గుణ, రీతి, రస, వృత్తి, పాక, శయ్యాలంకారము లనెడు సప్త విధమైన అలంకారశాస్త్ర ప్రమేయము ప్రదర్శింపఁ బడినది.

చమత్కారము

ఇట్టి ప్రమేయముతోఁగూడిన లక్ష్యలక్షణ సంగతమైన శాస్త్రనిబంధమునకు, విధినియమములు తెలిపి, పాఠకులను సత్పథమున ప్రవర్తింపజేయుటయును అసత్పథము నుండి నివర్తింపఁ జేయుటయును ముఖ్యప్రయోజన మని తెలుపుచు విశ్వేశ్వరకవి—

"నృణాం విధౌ నిషేధే చ
శిక్షా కావ్య ప్రయోజనమ్
శిక్షా చ సచమత్కారం
బోధితా స్థిరతాం భజేత్"

అని ఈ విధినిషేధములవలని ప్రవర్తన నివర్తన రూపమైన శిక్షణము చమత్కార యుక్తముగా చేయబడినచో అది ఆ ప్రజల హృదయమున తెన్నుగా హత్తుకొనియుండు నని వచియించెను. మఱి ఇంత ప్రభావముగల యీ చమత్కారమెట్టిది? దాని స్వరూప మేమి? చమత్కార పదమునకు నిఘంటు నిర్వచన మిట్లున్నది—

"చమత్ ఇత్యవ్యక్తం క్రియతే (చమత్ + కృ + ఘఞ్) లోకాతీత వస్తుదృష్ట్యా చిత్తస్య ఆనందహేతు ప్రకాశే - విస్మయే".

అసాధారణమైన పదార్థములను చూచినందువలన చిత్తమునకు కలుగు ఒకవిధమైన తళుకు-వెలుఁగు; ఇదియే విస్మయము అని దీని భావము. ఈ లౌకికార్థము కావ్యమునకు అన్వయించునప్పుడు అందు కొంత వైలక్షణ్యము గోచరించును. ఆలంకారికులలో ప్రామాణిక మూర్ధన్యులైన అభినవగుప్తుడు "అభినవభారతి"లో రససూత్ర వ్యాఖ్యా సందర్భమున ఈ చమత్కారమును ఇట్లు వివరించెను.

"సా చావిఘ్నా సంవిచ్చమత్కారః
తజ్జోపి కంప పులకోల్లసనాది వికార
శ్చమత్కారః."

"తథాహి స చ అతృప్తివ్యతిరేకే
ణాచ్ఛిన్నో భోగావేశ ఇత్యుచ్యతే,

భుంజాన స్యాద్భుతభోగస్పందావిష్టస్య చ మనః కరణం చమత్కార ఇతి.

న చ సాక్షాత్కార స్వభావో మానసాధ్యవసాయో వా, సంకల్పో వా, స్మృతిర్వా, తథాత్వేన స్ఫుర న్నస్తు."

చమత్కార మనఁగా అనుపహతమైన ఒక మానసిక జాగృతి. అది తృప్తినొందక సాగెడు భోగ్యవస్తువునందలి భోగావేశము. భోక్త హృదయమున కలుగు అద్భుతమైన ఒక స్పందమే ఈ చమత్కారము. దీనివలన ఆనందమో, సంకల్పమో, స్మృతియో ఏదియో యొక మానసిక వ్యాపారము వెలయును" అని తెల్పి దీనికి—

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీభవతి యత్సుఖితోఽపి జంతుః,
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం;
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అను కాళిదాసమహాకవి శ్లోకము నుదాహరించి

"సర్వథా తావ దేషా ప్రతీతిః ఆస్వాదాత్మా యస్యాం రతిరేవ భాతి, అతఏవ విశేషాంతరానుపహితత్వాత్ సా రసనీయా సతీ న లౌకికీతి, న మిథ్యా, నానిర్వాచ్యా. న లౌకికతుల్యా, న తదారోపాదిరూపా."

చక్షుఃప్రీతికరము లగు సుందరవస్తువులను చూచినప్పుడు కాని, శ్రవణసుభగము లగు మధుర శబ్దములను విన్నప్పుడుగాని, స్వస్థుడై యున్న మానవుని హృదయము కూడ ఒకవిధముగా పర్యుత్సుక మగును. దీనికి హేతు వేమనగా ఏదో తనకు వివరింపరాని, బోధపడని ఒకానొక విషయమును తనమనస్సు స్మరించుటయే.జన్మాంతరములయందలి కొన్నికొన్ని విషయములు, సంఘటనలు భావములో వాసనా రూపమున నెలకొనియుండు నని తాత్పర్యము. కనుక రసవిషయమున కూడ స్థాయి యైన రతి మున్నైన భావము సజాతీయవిజాతీయములైన ఇతరములచే తిరస్కరింపఁబడక సహృదయ హృదయముచే అనుభవింపఁబడునదియై రసముగా వ్యవహరింపఁబడును. అప్పుడు దానికి అలౌకిక స్థితియే గాని, లౌకికస్థితి ఉండదు. అది మిథ్యయు, అనిర్వచనీయము, లౌకికతుల్యము. లౌకికఆరోపితము మున్నైన వ్యవహారములను పొందదు. ఈ చర్చచే అభినవగుప్తుని అభిప్రాయమున ఈ చమత్కారము రసమునకు పర్యాయముగా భావింపఁబడినట్లు తెల్లమగుచున్నది.

ఈ చమత్కారమును స్పృశించి వివరించిన వారిలో పేర్కొనఁదగిన మఱియొక ఆలంకారికుఁడు క్షేమేంద్రుఁడు. ఇతఁడు ఔచిత్యమే రసాదు లన్నింటికిని మెఱుఁగువెట్టునదనియు, అదియే కావ్యమునకు జీవిత మనఁదగిన దనియు అభిప్రాయపడుచు—

"ఔచిత్యస్య చమత్కారకారిణ శ్చారు చర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా"

అని తన ఔచిత్యము కావ్యరసానుభూతిలో చమత్కారము కలిగించునది యని చమత్కారమును పేర్కొన్నాఁడు. ఔచిత్యమువలన పొడము ఈ చమత్కారము పదివిధములుగా భాసించు నని చెప్పుచు —

"అవిచారితరమణీయము, విచారితరమణీయము, సమస్తసూక్తివ్యాప్తము, సకృదేకదేశగతము, శబ్దగతము, అర్థగతము, శబ్దార్థగతము, అలంకారగతము, రసగతము, ప్రఖ్యాతవృత్తిగతము" అని వానిని తన కవికణ్ఠాభరణములో పేర్కొనెను.

సాహిత్యదర్పణకారుఁడు విశ్వనాథుఁడు—

"లోకోత్తర చమత్కార
ప్రాణః కైశ్చి త్ప్రమాతృభిః
స్వాకారవ దభిన్నత్వే
నాయ మాస్వాద్యతే రసః"

అనుచు చెప్పిన కారికను వివరించుచు—

"అఖండ ఇత్యేక ఏవాయం విభావాది రత్యాది ప్రకాశ సుఖ చమత్కారాత్మకః"

అనియు,

"చమత్కారశ్చ చిత్తవిస్తారరూపో విస్మయాపరపర్యాయః"

అనియు వివరించి అద్భుతవస్తు సందర్శనాదులచే కలుగు విస్మయ మనెడి నామాంతరము గల చిత్త విస్తృతియే చమత్కార మని నిర్వచించెను. దీనికి ఉపష్టంభకముగా—

"రసే సార శ్చమత్కారః
సర్వత్రా ప్యనుభూయతే
తచ్చమత్కారసారత్వే
సర్వత్రాప్యద్భుతో రసః
తస్మా దద్భుత మేవాహ
కృతీ నారాయణో రసమ్"

అను "ధర్మదత్త" పండితుని వాక్యమును ఉట్టంకించెను. వాచస్పత్యములో అన్యులు చేసిన చమత్కారపద నిర్వచనముగా మఱిరెండు విధము లిట్లు చెప్పఁబడినవి: మొదటిది —

"చమత్కార శ్చ లోకాతీతార్థకలనేన కిమేత దితి జ్ఞానధారాజననేన చిత్తవృత్తేః దీర్ఘవిస్తారః. దృష్ట హేతుభ్యః అసంభావితత్వజ్ఞానేన హేత్వంతరానుసంధానాయ మనసో వ్యాపారభేద ఏవ చిత్తవిస్తారః."

సాధారణమైన అర్థము నాకర్ణించినపుడు ఏమిది? ఎట్లిది? అని మనస్సునకుఁ గలుగు ఒక విస్తృతియే యీ చమత్కారము. అనగా అట్టి అద్భుతావహ మగు విషయము, అనుభవములో నున్న కారణములచే సంధావితము కాకపోవుటఁ బట్టి కారణాంతరముల నన్వేషించుటకుగాను మనస్సులో కలుగు వ్యాపారవిశేషమే ఈ చిత్తవిస్తారము – చమత్కారము. రెండవది– "సుఖవిశేష ఏవ చమత్కారః" కావ్యాదులవలన చిత్తమునకు కలుగు సంతోషమే (సుఖవిశేషమే) చమత్కారము.

ఇట్లు పూర్వసూరి గ్రంథ పరామృష్ట మైన చమత్కారము విశ్వేశ్వరుని భావనలో విశేషముగా భాసించినది. అతఁడు దానిని కావ్యజీవితపదవిలోనే అభిషేకించినాఁడు. అతఁడు సహృదయుల నానందింప చేయునది ఈ కావ్యచమత్కారమే సుమా! అది లేనిది ఎన్ని సొగసు లున్నను ఏమి ప్రయోజనము? అని ప్రశ్నించి చమత్కారమును కలిపి చెప్పినప్పుడే కావ్యము సహృదయమున మాయని ముద్ర వేయు నని "శిక్షా చ న చమత్కారం భోధితా స్థితాం భజేత్" అను వాక్యమూలమున నొక్కిచెప్పినాఁడు. ఇఁక తన నిర్వచనముగా చమత్కారము నిట్లు ప్రదర్శించినాఁడు:

"చమత్కారస్తు విదుషా
మానంద పరివాహకృత్"

దేనివలన విద్వాంసుల హృదయమున ఆనందము కలుగునో అట్టి అంశము చమత్కార మని తెలిపి ఈ చమత్కృతి "ఖాదు వెల్ల కలిమి యందు దాగివడి కావ్యప్రమేయ మైన గుణ రీతి రసాదులయం దెల్ల వ్యాపించియుండు ననియు, ఆయా గుణ రసాదులు సహృదయులకు అహో! భళీ! అనిపించు టెల్ల ఈ చమత్కార ప్రభావమే అనియు ఇట్లు వ్యాఖ్యానించెను.

"గుణం రీతిం రసం వృత్తిం
పాకం శయ్యా మలంకృతిమ్
సప్తైతాని చమత్కార
కారణం బ్రువతే బుధాః"

ఈ సందర్భములో ఉద్దిష్టుఁడు క్షేమేంద్రుని గుడుసుపోదగనే పోయెను. అతఁడు ఔచిత్యమే కావ్యాత్మ అనియు అది కావ్యప్రమేయము లైన వివిధాంశములలో భాసించు నన్నట్లే, ఈతఁడును తన చమత్కారము గుణ రీత్యాదులలో వ్యాపించు నని ప్రపంచించెను. అసలుగా నీ యుభయులును కావ్యాత్మవాదులలో చేరినీ కాదన్నవారు కాక, ఏది కావ్యాత్మ యనుకొన్నను అది యెల్ల తాము నిర్వచించిన ఔచిత్యము-చమత్కారములతో సహకృతములైనప్పుడే ఆనందహేతువు లగు నను సిద్ధాంతమును ప్రకటించుకొన్నారు. ఇట్లన్నంత

మాత్రముచేత పరమోపాదేయమైన రస ధ్వన్యాదులు వీరికి ఉపాదేయములు కాలే దని కాదు. వీరును ధ్వని సిద్ధాంత బద్ధాదరులే. దానికి ఈ చమత్కారాదులను అనుసంధించుటయే వీరి ఆశయము. కావుననే విశ్వేశ్వరకవి

"సప్తాంగ సంగతం కావ్యం
సామ్రాజ్య మివ భాసతే
లక్ష్యతే తదిదం సాంగం
మయా కృతధియాం ముదే"

అని ఇంతకు మునుపే పేర్కొనఁబడిన గుణ రీత్యలంకారాదులతో కావ్యము సప్తాంగ సంగత మనియు, చమత్కార సంపన్న మైన ఆ కావ్యము సు హృ త్కో శా ది స ప్తాం గ సంపన్నమైన సామ్రాజ్యమువలె విరాజిల్లు ననియు, అట్టి సాంగ మైన కావ్యమును సహృదయుల ఆహ్లాదము కొఱకు లక్ష్య లక్షణ సమన్వయ పురస్సరముగా ప్రదర్శింతు ననియు చెప్పెను.

ఈ కావ్య చమత్కృతిని అందిపుచ్చుకొని తత్స్వరూప నిరూపణము కావించిన తరువాతి ఆలంకారికులలో ముఖ్యుఁడును మఱియొక ఆంధ్రుఁడే. అతఁడే రసగంగాధరకర్త యగు పండితరాయలు ఆతఁడు చమత్కారము ఆహ్లాద గత మైన ఒక జాతివిశేష మనుచు ఇట్లు నిరూపించెను

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని కావ్యస్వరూప నిరూపణము చేయుచు అందలి రామణీయకత్వ మేమో వివరించుచు "రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనక జ్ఞానగోచరతా" అని లోకాతీత మైన ఆనందమును కలుగఁజేయు జ్ఞానమునకు గోచరమగుట యని తెలిపి, తిరిగి ఆ లోకోత్తరత్వమును వివరించుచు "లోకోత్తరత్వం చ ఆహ్లాదగతః చమత్కారపర్యాయః అనుభవ సాక్షికో జాతివిశేషః" అని తెలిపెను. ఇందలి లోకోత్తరత్వము ఆహ్లాదమందలి చమత్కార మను మారుపేరు గలదియు, స్వానుభవైక సాక్షిక మగు నదియు నగు నొక జాతివిశేష మని తిరిగి వివరించి ఫలితస్వరూపముగా "ఇత్థం చ చమత్కారజనక భావనావిష యార్థప్రతిపాదక శబ్దత్వం యత్ ప్రతిపాద్యార్థవిషయక భావనాత్వం, చమత్కారజనకతావచ్ఛేదకం తత్వం, స్వవిశిష్ట జనకతావచ్ఛేదకార్థప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారత్వవత్త్వమేవ వా కావ్యత్వ మితి ఫలితమ్' అని తేల్చెను. ఈ గంగాధరకారుని కావ్యలక్షణ తాత్పర్య మిది: కావ్యగత మైన శబ్దమువలన బోధ్యమైన అర్థమును గ్రహించి పాఠకుఁడు లోకోత్తర మైన ఒక ఆహ్లాదము ననుభవించును. అట్టి ఆహ్లాదమం దున్న అసాధారణధర్మమే చమత్కార మనఁబడుచున్నది. ఇది యొక విశిష్టజాతి. ఈ చమత్కారలబ్ధికై కావ్యార్థమును రసికుఁడు మాటిమాటికిని అనుసంధించును. ఇట్టి అనుసంధానమే విశిష్టమగు భావన, సాధారణముగా "నీకు పుత్రుఁడు కలిగినాఁడు; నీకు ధన మిత్తును" అను లౌకిక వాక్యముల వలనఁ గూడ ఆహ్లాదము కలిగినను అది లోకసామాన్యమే యగును. కనుక ఆ వాక్యములు కావ్యములు కావు. చమత్కారమును కలిగించు భావనలో గోచర మగు అర్థము నందించు పదము గాని, ఏ పదము ప్రతిపాదించిన అర్థమును భావించుటవలన చమత్కృతి అనుభూత మగునో అట్టి పదముగాని కావ్య మని స్పష్టపడినది. కాఁగా చమత్కారత్వమే కావ్య మని ఫలితార్థము.

తర్కపరిభాషలో నిష్కర్షింపఁబడిన ఈ కావ్య లక్షణమునకు ప్రధానముగా చెప్పఁబడిన జాతి, తద్విశిష్టము లనెడి వాని తెలివిడి యిది: "స్వవిశిష్ట జనకతావచ్ఛేద కార్థప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారత్వవత్త్వమ్"— అను ఈ వాక్యమునందలి స్వశబ్దమునకు చమత్కారత్వజాతి యని యర్థము. (అనేకములందు ఏకరూపమున నుండునది జాతి.) "తద్విశిష్ట" అనునప్పుడు చమత్కార విశిష్టములైనవి వివిధచమత్కారములు – వ్యక్తులు. అవి గుణకృతములు, అలంకారకృతములు, రసకృత

ములు మున్నైనవి పలువిధములు. ఇట్టి చమత్కారమునకు జనకమైనది భావన. కావ్యార్థవిషయక జ్ఞానమే భావన కాఁబట్టి అది చమత్కారమునకు కారణ మగునది. ఈ విధముగా చమత్కారజనకమైన భావనకు గోచరమైన అర్థమును ప్రతిపాదించు శబ్దము కావ్యమని పరినిష్ఠితార్థము సిద్ధించినది.

మొత్తముమీఁద ప్రతిభావిశిష్టుఁడైన కవీశ్వరుని ఇట్టి చమత్కారశోభితమైన కావ్యమువలననే రసికులు ఆనందింతు రని ఈచర్చవలన తేలుచున్నది. ఈ యర్థమును మహాకవి క్షేమేంద్రుఁడు అతి రమణీయముగా నిట్లు చెప్పినాఁడు—

"సుకవి రతిశయార్థే వాక్చమత్కార లోభాత్
అభిసరతి మనోజ్ఞం వస్తు శబ్దార్థ సార్థే
భ్రమర ఇవ వసంతే పుష్పకాంతే వనాంతే
నవకుసుమ విశేషామోద మాస్వాద లోలః"
(కవి. కం.)

వసంతమున పుష్పశోభితమైన ఉద్యానములో క్రొత్తపూవుల సౌరభమును ఆస్వాదింప ముచ్చటపడు తుమ్మెదపిండువలె మనోజ్ఞవస్తు భరిత మగు కావ్యమున చమత్కారలోభముచే సహృదయవర్గము ప్రవేశించును.

చమత్కారచంద్రిక – అన్యలాక్షణికులు

కావ్యాహ్లాదకారక మగు ఈచమత్కారమునందు సర్వజ్ఞ సింగభూపాలుఁడును మిక్కిలి ఆదరమును చూపెను. తాను చమత్కారచంద్రికకు కృతిభర్తృత్వము నంగీకరించుటయే గాక ఒండురెండుచోట్ల తన గ్రంథములలో ఈ చమత్కార ప్రశస్తిని గావించియున్నాఁడు. కువలయావళి ఆ ముఖములో "ప్రణీతాఖండ పరమానంద వస్తు చమత్కారిణీం కువలయావళీమ్" అని తన "కువలయావళి" నాటిక అఖండ పరమానంద వస్తు చమత్కార శోభితమైనదని ఉగ్గడించెను. అందే ప్రథమాంకమున—

"అపూర్వ సంవిధానేన తరంగిత చమత్కృతేః
పారితోషిక దానేఽహ మథమర్ణో భవామితే"

నాయకుని వాక్యముగా చెప్పించిన ఈ పద్యమున శ్లేషభంగితో సంధాన రామణీయకతను సంతరించుకొని కూర్చిన చమత్కార సౌభాగ్య సంపన్నమైన కృతిని కానుకగా నిచ్చిన సుకృతికి నేను అధమర్ణుఁడ నగుచున్నాను – అని తనకు చమత్కార రంజితమైన కావ్యమునందుగల విశేషమైన ఆదరమును వెల్లడించెను.

చమత్కార చంద్రికను ఉపజీవ్యము చేసికొన్న లాక్షణికులలో సుప్రసిద్ధుఁడైన శాయణాచార్యుఁడు (1356-1378 క్రీ.శ.) కూడ ఒకడు శాయణుఁడు "అలంకార సుధానిధిలో" చమత్కార చంద్రిక నుండి బంధకవిత్వమునకు ఉదాహరణములుగా ఈ రెండు శ్లోకములను ప్రదర్శించెను.

చక్రబంధమునకు:

"నమ్రచక్ర దిశా విలాసి విధునా
తిగ్మాంశు హారి శ్రియా
విశ్రామ క్షణ విశ్వరంగ వియతా
కల్పం యశో జ్యోతిషా
విద్వత్కాన్తి మపాప యః ప్రదిశదా
విఖ్యాత కృత్స్నాగమాం
మాంధాతా న చ తద్విశేష విదుషో
యాతి త్విషా నోపమామ్ ॥"

పద్మబంధమునకు—

"సా చ మా క్షపిత భావరాశిసా
సాక్షరావగత పాపమారసా
సారసా చయతు సింగయం రసా
సారయం గజపతి క్షమా చ సా ॥"

పై చక్రబంధములో "చమత్కారజ్యోత్స్న" అను కృతియు, "విశ్వపతికవిః" అని కృతికర్తయు, "సింగభూప" అని కృతిభర్తయు పేర్కొనఁబడినారు.

ఇఁక తెలుఁగు లాక్షణికులలో కస్తూరి రంగకవి తన "ఆనందరంగరాట్ఛందము"న

"క్షేమం సర్వగురు ర్దత్తే
మగణో భూమిదైవతః

కరో త్యర్థా నాదిలఘుః
యగణో వారిద్దైవతః."

భూదేవతాక మైన మగణము శుభకరము. జలదేవతాక మైన యగణము అర్థలాభదాయకము.

"భీతిదాయీ మధ్యలఘూ
రగణో వహ్నిదైవతః
ఈశత్వ మంత్యలఘు చ
తగణో వ్యోమదైవతః"

అగ్నిదేవతాక మగు రగణము భీతి గల్గించునది. ఆకాశదేవతాక మైన తగణము ఈశత్వ సాధకము.

"రుజాకరో మధ్యగురుః జగణో భానుదైవతః"
సూర్యదైవతక మగు జగణము వ్యాధికారకము. అని చెప్పి అశుభము లైన గణములు ఏ సందర్భములో శుభకరము లగునో తెలుపుచు—

"చతుర్ముఖముఖేత్యాదౌ చవర్ణో జగణోఽపి చ
బ్రహ్మనామాంకితత్వేన కావ్యాదా వపి శోభనౌ"

"చతుర్ముఖముఖా" అను పదములోని తొలియక్షరము చకార మైనను "చతుర్ముు" అనుచో జగణ మైనను తనకావ్యాదర్శ గ్రంథారంభమున మహాకవి దండి వాడుకొనుటకు కారణము "చతుర్ముఖ" అను పదము పరమపూజ్యుఁడైన బ్రహ్మకు వాచక మగుట శుభకరముగానే పరిణమించు నని.

ఈ ఉదాహృతము లైన పైశ్లోకము లన్నియు చమత్కారచంద్రికలోని వర్ణవివేకభాగమునుండి గ్రహింపఁబడినవియే.

అప్పకవియు వర్ణమాలను వివరించు సందర్భములో మాతృకార్చనావిధానమున "చమత్కార చంద్రికాయామ్" అని నామనిర్దేశముచేసి మాతృక లనగా "అకారాది క్షకారాన్త వర్ణాః స్యుః మాతృకాహ్వయాః" అకారమునుండి క్షకారమువఱకు గల వర్ణములు మాతృక లనఁబడును అని నిర్దేశించెను.

"కవయో లోక సిద్ధాంత
సిద్ధార్థ వ్యవహారిణః
అత్రైవ హి చమత్కార
సాక్షాత్కా రైక సాక్షిణః"

లోకసిద్ధము లైన పదార్థములను కావ్యమున నిబద్ధించు కవులు ఈ రసవత్కావ్యముననే వానికి అలౌకికత్వ సంపత్తిని చేకూర్చి "లోకోత్తరాహ్లాద జనక మైన చమత్కృతి సద్భావమునకు సాక్షులుగా వెలయుదురు" అని రసపోషణచతురు లైన కవులను, చమత్కార శోభితము లైన అట్టివారి కృతులను ప్రశంసించుచు—

"ఏవం నిర్దిశితం(?) సంప్ర
దాయా దాలోచ్య లక్షణమ్
కల్పనాకల్పితం కావ్య
మాచంద్రార్కం ప్రకాశతే."

తన చమత్కారచంద్రికవంటి లక్షణగ్రంథములను బాగుగా పరిశీలించి విషయములను జీర్ణించుకొన్న కవీశ్వరునిచే నిర్మింపఁబడిన కావ్యము శాశ్వత మైనదై పఠనపాఠనములలో బహుప్రచారము గని వెలయుచుండును అను మంగళాశాసనముతో విశ్వేశ్వరకవి తన గ్రంథమును పరిసమాప్తి కావించెను.

"జయంతి తే సుకృతినః
రససిద్ధాః కవీశ్వరాః."

శ్రీ మేడిచెర్ల ఆంజనేయమూర్తి | పఞ్చరత్నాని

కైలాసాద్రి ర్వసతి రనిశం యస్య జాయా చ గౌరీ
శీర్షే గంగా, శశధరకళా, చావదాత శ్శరీరః
శేషో భూషా, లలిత భసితోద్ధూళిత స్సర్వదేహః
సోఽవ్యా దీశో బుధవినుత గౌలీశ్వరం వర్తకాఢ్యమ్.

కావ్యం కర్తుం ప్రభవతు కవిః కింతు తద్రూపరేఖా
యోగ్యం వస్త్రం సురుచిరతరం యో హి సంధాయ మీశః
సోవై ధన్య స్తదధికతమం పుణ్య మశ్రాన్త మాప్తం
యేనాఽసౌ సో భువి జయతు గౌ రీశ్వరః సర్వపూర్ణః.

సంస్థారంభః ప్రథన సదృశః త న్నితాంతానుకూల్యం
దైవాధీనం, తదపి రజతాఖ్యోత్సవశ్రీక మాసీత్
వక్తవ్యం కిం? సమధిక సువర్ణోత్సవాఢ్యాచ భాయా
దేషా సంస్థా భువి శతగుణా, ప్రాజ్ఞ కృత్యానుకూలా.

జ్ఞాన జ్యోతి స్సకల పథికాహ్లాదకృ న్మార్గ మిత్రం
తస్మై యస్స్యాద్భువి లఘుతర స్నేహదాతాఽపి శశ్వత్
సోవై ధన్య స్తదధికధియా యా చ గౌలీశ్వరేణ
సృష్టా సైషా విబుధవలితా వర్ధతాం పత్రసంస్థా.

హే వాణిజ్య ప్రియ! బుధగణానంద సంధాయక! శ్రీ
గౌలీశాఖ్య! త్వ దభిమతకృ ద్దేవదేవ స్సదా తే
ధర్మార్థాభ్యాం సహ బహుమతిం, వంశవృద్ధిం చ దద్యాత్
ఆయుర్వృద్ధిం సకలవిబుధ స్తుత్య సఙ్కల్పసిద్ధిమ్.

డా. యస్వీ జోగారావు

# శారదా పీఠము

పిల్లలమఱ్ఱివారి యింట శారద పీఠము పెట్టుకొనినది. పైతామహంబగుచు వెలయుచున్నది కవిత్వలక్ష్మి. పినవీరన "తాతయుఁ దండ్రియు నగ్రభ్రాతయునుం దాను భువన భాసుర కృతి నిర్మాతలు." "వారిలోపల పిన వీరు వాక్యసరణి సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు."

శ్రీనాథ హరవిలాస కృతిపతి అవచి తిప్పయ్యసెట్టికి గురువు "పిల్లలమఱ్ఱి మహా ప్రధాని పెద్దన్న గురూత్తముండు" మఱి యీతని తాతగారేమో! కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశిక యందు ప్రస్తుతించిన పిల్లలమఱ్ఱి వీరరాజు ఈతని అన్నగారేమో! ఏమైన నేమి–

"మఱ్ఱి మాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలె గాదు శారదాపీఠకంబు."

ఆ శారదా పీఠాధిపతులలో "వాణి నా రాణి" యని వాసికెక్కినవాడు పినవీరన. 'వాణి నా రాణి' యనగా అది యేదో వాడుక వాటపు మాట వరుస కాదు.

"ప్రణవ పీఠమున మంత్ర పరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరా పశ్యంతి మధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి"
[జైమిని భారతము]

అని పిన వీరన ప్రస్తుతించినట్లు మంత్రాధిదేవతయు వాఙ్మయ సామ్రాజ్య సింహాసనారూఢయునైన మహారాజ్ఞి వాణి.

"పొసగన్ నే కృతి చెప్పగా
పరిమళంబుల్ చాల కొక్కొక్కచో
కొసరొక్కించుక కల్గనేనియును
సంకోచంబు గాకుండ నా
రసి అచ్చోటికి నిచ్చుగాత
పరిపూర్ణం బొంద వాగ్దేవి ఇం
పెసలారన్ తన విభ్రమ
శ్రవణాకల్హారోదయామోదముల్"

"అని తన శృంగార శాకుంతలమున నీతడు చేసిన సరస్వతీస్తుతి చిత్రముగా నున్నది. ఇందు స్తుత్యర్థ మేమియు లేదు. కాని వాక్పరముగా పరిమళ ప్రసక్తి తెచ్చియుండుటను బట్టియు వాగ్దేవి శ్రవణకల్హారోదయామోదము తల్లోప పూరకము కాగల దనుటలోను ఒకమహార్థ మిమిడి యున్నది. ఈ కవి వాక్కులే ఆ దేవికి పూజాపుష్పములు. తత్పరిమళ గ్రహణ తత్పర ఆమె. అవి వాక్పుష్పములగుట వాని గమ్యస్థానము ఆమె శ్రవణములే. కాన తత్సౌరభ లోప పూరకము ఆమె శ్రవణ కల్హారోదయామోదములే.

ఉపర్యుక్త సందర్భములను బట్టి అహరహస్సరస్వత్యుపాసకుడని యనిపించు నీతని వాక్కులు ఆ దేవికి శ్రవణగోచరము లగుచుండు నని ఈతని విశ్వాసము. ఈ సారస్వత భారతీతీర్థుడు "భారతీ తీర్థగురు కృపా సమృద్ధ సారస్వతుడే" యగుట విశేషము.

"విపుల చాటూక్తి నిర్నిద్రుఁ" డీ పినవీరన. "కుకవిమల్ల కషోల్లసత్ కులిశ హస్తపల్లవుడు"

"అల్లన విచ్చు చెంగలువ
 లందు రంజంబను కప్పురంబు పైఁ
జల్లగఁ జల్లనై వలచు
 సౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్త చన్నుగవ
 పయ్యెద జీబుగఁదోచు భాతిగా"

కబ్బములు చెప్పగ నేర్చిన అభిజ్ఞుడు.

నన్నపార్యుని "ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి"; తిక్కయజ్వ "వాక్సూక్తి కామోదంబు"; నాచిరాజుని సోము "వాచా మహత్వ సౌరభంబు"; శ్రీనాథభట్టు "భాషా నిగుంభంబుల పరిమళంబులు" తన కవితలో పట్టువెట్ట నేర్చిన ఒక వింత మధువ్రత మహావీరుడు పినవీరన.

పై పద్య పంక్తులయందు సర్వత్ర కవిత్వ పరముగానున్న సౌరభ ప్రసక్తిని గమనించినచో శాకుంతలమున వాగ్దేవీ ప్రశంసాత్మక మగు పద్యము పరమార్థము తేటపడగలదు.

ఈ కవియు శ్రీనాథయుగమునందలి చాలకవుల వలె హరిహరాభేదభావము గలవాడుగా గన్పట్టు చున్నాడు. ఇట్లనుట కీ రెండు గ్రంథావతారికలందలి తత్తద్దైవ స్తుతిపద్యములేకాక రెండు గ్రంథము లందును అంత స్సాక్ష్యము కలదు.

శృంగార శాకుంతలము అవతారిక 20వ పద్య మున తాను "శివభజనాసక్తుడననియు, 21లో "వీరభద్ర పదపద్మ ధ్యాన శుద్ధాంతరంగుడ" ననియు వచించినాడు. 5వ పద్యమున చిట్రగుంట భైరవస్వామిని గొల్చినాడు. చతుర్థాశ్వాసమున కణ్వుని శివునిగురించి తపస్సు చేసినవానిగా, శివ సాక్షాత్కారము పొందినవానిగా చిత్రించి శివుని రెండు సీసములందును, పంచాక్షరీమాహాత్మ్యమును మూడు పద్యములందును ప్రశంసించి యున్నాడు. "ప్రాసాదపు పంచవర్ణమునఁ గాలగ్రీవుఁ బూజించగా నలవాటై మతియొండెఱుంగని" కృతిపతి నాశీర్వ దించు ప్రప్రథమ పద్యమున విష్ణువును గీర్తించి నాడు.

జైమినిభారత కృతిపతి సాళ్వనరసింహరాయలు "శ్రీమదహోబలేశ్వర నృసింహుని యంశమునన్" జనించినవాడట. (అవతారిక - 43); "శ్రీరమణ చరణకలిత విచారణుఁడట" (2-1); "శ్రీ వేంకటాద్రినాథ దయావర్ధిత రాజ్యు"డఁట (3-1). అయ్యు "షోడశ భృత్కన్యాధవసేవా నుగు"డట.

ఈ జైమిని భారతమున అమూలకముగా భీము డొక గొప్ప కృష్ణ భక్తుడుగా చిత్రింపబడినాడు. (1-82, 127, 128, 133). మణిపురమున ప్రజలందరును కృష్ణభక్తులేనట (7-199-201) కథాంశముల కుపమానముగను హరిభక్తి ప్రశంసలు వచ్చినవి. (2.77, 55)

ఈతడు అవతార దర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాస సారము అను కృతులను మున్ను చెప్పినట్లు తనశృంగారశాకుంతల మున చెప్పెను. అవి నామమాత్రావశిష్టములే. నే డుపలబ్ధములగునవి శృంగారశాకుంతలము, జైమినీ భారతము మాత్రమే.

శృంగార శాకుంతలము : పస్తుతత్త్వము

పస్తువు "ప్రఖ్యాతంబన మిశ్రబంధమన నుత్పాద్యంబనంగా త్రిధాప్రఖ్యాతం" బగుననియు అందు "ప్రఖ్యాతం బితివృత్తమైన కృతి చెప్పన్ వక్తకున్ శ్రోతకున్ విఖ్యాతిం గలిగించు" ననియు అవతా రికలో వాక్రుచ్చినాడు కవి. (ఈ యితివృత్త త్రైవిధ్యమునుగూర్చి యీ యుగమున ముందు చెప్పినవాడు జక్కన). కాని పినవీరన కృతిపతి చిల్లర వెన్నయామాత్యుడు అభ్యర్థించిన ప్రకారము "భారతప్రోక్త కథ మూలకారణముగ, కాళిదాసుని నాటక క్రమము కొంత" తన ఉక్తికి "అభినవ శ్రీవహింప" "మిశ్రబంధంబుగా శాకుంతలంబను ప్రబంధంబు బంధుర ప్రీతిం జెప్పుబూనితిని" అని నాడు.

ఇతివృత్త నిర్వహణము

భారతమున శకుంతల కథ ఒక ఉపాఖ్యానము కావునను, అభిజ్ఞాన శాకుంతలము నాటకము కావునను వాని యందు పురవర్ణనమునకును, నాయక ప్రాభవ వర్ణనమునకును తగిన అవకాశము లేదు. శృంగార శాకుంతలము ప్రబంధ మార్గమున నడిచినది కావున అందావర్ణనలు సుదీర్ఘముగా సుందరముగా ఉన్నవి. అతని మృగయా సన్నాహము ప్రసక్తి ఆ రెండింటను ఉన్నను ఇందు విపులముగా సాంగోపాంగముగా నున్నది.

నన్నయగారి భారతమున ప్రకృతి సిద్ధముగా "లతాలలనల మృదుబానిలాపవర్జిత కుసుమాక్షతావళుల సేసలు, అళినీ నినాద మృదుభాషల దీవెనల" ప్రసక్తి ద్వారమునను, అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుని బాహు స్ఫురణము వలనను ఇందు స్వప్న శకునముల ద్వారమునను అవశ్యంభావి యగు శకుంతలా దుష్యంతుల వివాహమును గూర్చిన కావ్యార్థ సూచన యున్నది.

పినవీరన కణ్వాశ్రమ వర్ణనమున నన్నయగారిని కొంత అనుకరించినాడు. కాళిదాసుని కొంత అనువదించుకొనినాడు. శకుంతలా సౌందర్యమును వారి కంటె భిన్నముగా ప్రబంధోచితముగా వర్ణించినాడు. శకుంతలా దుష్యంతుల ప్రథమ సమావేశమున కాళిదాసీయమునే ఎక్కువగా అనుసరించెను. భారతమున లేని అనసూయా ప్రియంవదల పాత్రములను అభిజ్ఞాన శాకుంతలము నుండియే గ్రహించెను. భారతమున శకుంతలయే తన జన్మవృత్తాంతమును దుష్యంతునకు పితృ శృంగార వర్ణనా పురస్సరముగా నివేదించినట్లున్నది. ఇది ఆమె లోగడ కణ్వమహర్షి మఱియొక మహర్షితో చెప్పుచుండగా తాను వినినట్లు చెప్పినది. అపుడును బ్రహ్మచర్య నిష్ఠుడగు కణ్వుడు సాటి మహర్షియైన విశ్వామిత్రుని శృంగారమునుగూర్చి మఱియొక మహర్షితో అంతదూరము చెప్పుట అనుచితమే యగును. భారతమున పలుతావులను ఆ యుపాఖ్యానమునందే ఇతరత్ర అనువాదమున ఎంతో స్వతంత్రించి 'నిరంకుశోక్తి గతి విహరించిన నన్నయభట్ట కుంజరము' ఈ యనుచితమును కాళిదాసీయమును చూచియైనను తొలగింపలేదు. కాళిదాసు అనసూయా ముఖమున అతిసంగ్రహముగా ఔచిత్యాసిధారావ్రతముగా ఈ వృత్తాంతమును ప్రవర్తింపజేసెను. శృంగారశాకుంతలమున ఒక కణ్వాంతేవాసి చెప్పినట్లు కలదు. (ఈ మార్పు గూడ ఔచిత్యపరిపోషకమే). ఇందు మేనకావిశ్వామిత్ర ఘట్టము అరవంద పద్యములలో అక్కడి కక్కడికి అదియొక అందమైన ప్రబంధపోతముగా నున్నది. తదుపరి శకుంతలా దుష్యంతుల విప్రలంభ శృంగార వర్ణన అమూలకముగా విపులముగా నున్నది.

కణ్వాశ్రమముననే శకుంతలకు భరతుడు కలిగినట్లు భారతమున గలదు. మరీచ్యాశ్రమమున అని అభిజ్ఞాన శాకుంతలము. ఇందు భారతమే అనుసృతము. దుర్వాసశ్శాప వృత్తాంతము, అంగుళీయక వృత్తాంతము భారతమున లేవు. అభిజ్ఞాన శాకుంతలమునను దానినిబట్టి యిందును గలవు.

భారతమున పేరోలగమున నున్న దుష్యంతుడు లోకాపవాద భీరువై శకుంతల నెఱిగియు నెఱుగను పొమ్మని తృణీకరించును. అట అతడొక ధూర్తుని వలె ప్రవర్తించినాడు. ఆ లోపమును పరిహరించుటకై కాళిదాసు ఆ వృత్తాంతమును కల్పించెను. దానివలన దుష్యంతుని ధీరోదాత్తత పోషింపబడినది. అప్పట్టున పినవీరన అభిజ్ఞాన శాకుంతలమునే అనుసరించెను కాని భారతమునందు వలె దుష్యంతుని సభలో ఆకాశవాణిని కూడ పలికించి శకుంతలా దుష్యంతుల సంయోగము వైశమ సంఘటించెను. ఇందువలన దుష్యంతుని ధీరోదాత్తతకు భంగము వాటిల్లకుండుటయు, అతడు లోకాపవాదమునకు గుఱికాకుండుటయు అను రెండు ప్రయోజనములు సాధింపబడెను. కణ్వుడు దుష్యంతుని కడకు శకుంతలను సాగనంపువేళ ఆయన పడిన వేదన, చేసిన ఉపదేశము అభిజ్ఞాన శాకుంతలము నుండి గృహీతములై ప్రపంచింపబడినవి. ఇప్పట్టున

శృంగార శాకుంతలమున కణ్వమహర్షి ఒక మహో త్తమ మనస్విగా తీర్చబడెను (చూ. IV. 2-18, 71-82, 84-95)

"ఎన్నడు నామది న్మఱతు
నేనిటఁ బుత్త్రిక పూటపూట యా
సన్న సరోవరంబునను
సంస్మరణం బొనరింప సంతత
స్విన్న మరందసిక్త సర
సీజముఁ జూచి మదంతికంబునం
గన్నుల నీటితోడఁ గుశ
కంబగుచున్న భవన్ముఖాబ్జముఁ గా."
(IV. 90)

"కొంత సుఖంబునుం గలదు
కోమలి నాకిటఁ బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం
బరువొందిన మాలతీలతా
క్రాంత మనోజ్ఞమైన సహ
కారముఁ గన్గొను నప్పుడెల్ల దు
ష్యంతుడు మా శకుంతలయు
సంగడి నుండుటగాఁ దలంపఁగన్."
(IV. 91)

అనసూయా ప్రియంవదలనుకూడ శకుంతలతో పాటు దుష్యంతుని పాలికి పంపుట భారతమున నరేసరి, కాళిదాసీయమునను లేదు. ఇందున్నది. అట్లు కులపాలిత లగు కన్యలను పంపుట అనుచిత మనుకొందురు కొందఱు. కాని వారామెను తామెరి గిన ఆమె మగనికడ దిగవిడచుటకు మాత్రమే పోయిరి. ఆ పోవుటవలన సభలో ఆమె పక్షమున విషయజ్ఞులైన వారు మాటాడుట కవకాశమేర్పడి నది. నాడేవారు కణ్వాశ్రమమునకు తిరిగిపోయిరి.

శృంగారశాకుంతలమున సభలో దుష్యంతునితో శకుంతల ఒక్క పలుకైనను పలికినట్లు లేదు. అంతయు నెఱిగిన అనసూయా ప్రియంవదలే "వకాల్తా" వహించిరి. ఈఘట్టముతో ఇందనసూయా ప్రియంవదల పాత్రములకు ఒక క్రొత్తతేజస్సు వచ్చినది. అట్లు శకుంతల మాటాడ కుండుటయే సమంజసముగా నున్నది. అభిజ్ఞాన శాకుంతలమున నున్నవి ఎక్కువగా శకుంతల స్వగతములే. ఎట్ట కేలకు చివర తన సత్యము నిరూపించుకొనవలసిన బాధ్యత తనపై బడినపుడు నోరు విప్పెను. అట ఔచిత్యము పోషింప బడినది. అప్పట్టున భారత మున శకుంతల "పెద్ద" ఉపన్యసించినది దుష్యం తుని దూషించినది. అది ఔచితీమారము. అసలు భారతమున శకుంతల ఒక ప్రౌఢగా ప్రగల్భగా చిత్రింపబడినట్లు తోచును. కాళిదాసును అతని నను సరించి పినవీరనయు ఆమెను ముగ్ధగా చిత్రించిరి

శృంగార శాకుంతలమున దుష్యంతుడు శకుంత లను స్వీకరించిననాడే ఆమెను పట్టమహిషిగా చేసి భరతునకు యువరాజ్య పట్టాభిషేకముచేసి తాను-

"పెద్దవాడనైతి పృథివీభారం బింక
పూన వయసుగాదు పుత్త్రుఁడెల్ల
భరము బూనఁగా తపస్వినై సుఖలీల
వనమునందు నుంత వయసుగాని"

అని పలుకును. ఇందు అవతారికలో "శృంగా రంబు ముఖ్యంబగు అంగి" అనియు ఆశ్వాసాంత గద్యలో "శాకుంతల శృంగార కావ్యంబు" అనియు వక్కాణింపబడి యుండఁగా గ్రంథము నాయక నిష్ఠ మై సశృంగార భావముతో ముగియవలసియున్నది. కాని నాయకుడు తద్విరుద్ధముగా వానప్రస్థాశ్రమ స్వీకారాభినివేశమును చూపుట తగదు. అయితే చివరకు "శకుంతలయు దుష్యంతుడును పెద్ద కాలంబు పూజ్యంబగు రాజ్యసౌఖ్యంబు ననుభవించు చుండిరి" అను వాక్యముతో కావ్యాంతమైనది. అది కొంత మేలు.

**అభిజ్ఞానశాకుంతలము — పినవీరన**

పినవీరన అభిజ్ఞాన శాకుంతల శ్లోకముల నెట్లు అనువదించుకొనెనో పరిశీలింతము.

I. శృంగార శాకుంతలావతారిక యందలి అష్ట మూర్తిస్తుతియగు రెండవపద్యము అభిజ్ఞానశాకుంలము నందలి నాందీశ్లోకమునకు మానస పుత్రిక.

అ. శా. "యా సృష్టిస్స్రష్టు రాద్యా, వహతి
విధిహుతం యా హవి, ర్యా చ హోత్రీ,
యే ద్వే కాలం విధత్త శ్రుతివిషయగుణా
యా స్థితా వ్యాప్య విశ్వమ్;
యా మాహు స్సర్వభూత ప్రకృతిరితి,
యయా ప్రాణినః ప్రాణవ న్తః
ప్రత్యక్షాభిః ప్రసన్న స్తనుభి రవతు
వ స్తాభి రష్టాభి రీశః."

శృం. శా. :

"పూని చరాచరంబు భరించు నొకమూర్తి
యుడుపుఁ దృష్ణాభేద మొక్కమూర్తి
యారగించు మనోజ్ఞమగు హుతంబొకమూర్తి
యొసగు చైతన్యంబు నొక్కమూర్తి
యాదిత్యులకుఁ ద్రోవయై పొల్చునొకమూర్తి
యుడుగణంబుల నేలు నొక్క మూర్తి
విశ్వంబు చీకటి విరియించు నొకమూర్తి
హోతయై దీపించు నొక్కమూర్తి

యరయ నెవ్వనియందు నయ్యష్టమూర్తి
యిష్టఫలదాత కరుణా సమేతుడగుచు
వెలయఁ జిల్లర నాగయ వెన్నమంత్రిఁ
జిరతరైశ్వర్య సంపన్నుఁ జేయుగాత."

II. అభిజ్ఞాన శాకుంతలములోని ప్రథమాంకపు 34 శ్లోకములు శృంగార శాకుంతలమున 1 ఆ. 118 వ పద్యమున అన్యూనాతి రిక్తముగా అనువదింపబడినవి,

ఆ శా "ముక్తేషు రశ్మిషు, నిరాయత పూర్వకాయా
నిష్కంప చామర శిఖా, నిభృతోర్ధ్వకర్ణాః,
ఆత్మోత్థితై రపి రజోభి రలంఘనీయా,
ధావంత్యమీ మృగ జవాక్షమ యేవరథ్యాః" (I. 3)

"యదాలోకే సూక్ష్మం వ్రజతి
సహసా తద్విపులతాం
యదర్థే విచ్ఛిన్నం భవతి
కృత సంధాన మివ తత్,
ప్రకృత్యా యద్వక్రం
తదపి సమరేఖం నయనయో
ర్నమే దూరే కించిత్ క్షణమపి,
న పార్శ్వే రథజవాత్" (I. 4)

శృం. శా. :

"కనుదృష్టినెయ్యది మిను మినుక్కనుచుండ
ఘనత వ్రేల్మిడి లోనఁ గానఁబడగ
నెడత్రెవ్వియుండు నెయ్యది యేని నదికూడ
నదికిన చందాన నన్వయింప
నేయది విలువంకయై యుండుఁ బదమున
నది సమరేఖతో నందమంద
దూరాన నెయ్యది తోచు నాలోకింప
నది పార్శ్వమున లేక యవులఁజనగ

శ్రవణములు నిక్క నిష్కంప చామరాగ్ర
ములను నిర్వాత పూర్వాంగములఁ దనర్చి
ఘనఖురోద్ధూత రేణువు గడవఁ బాఱి
నిగిడెభువితేరి హయములు మృగజయములు" (I, 118)

III. అభిజ్ఞానశాకుంతల మందలి ప్రథమాంకము 1 శ్లోకమునందలి "అధిజ్యకార్ముక" శబ్దము అనువాదమున (II. 18) "పుంఖిత శరుడు" అని పరివర్తితమైనది. ఈ పరివర్తనమున అర్థభేదముంచుట వలనను అది సందర్భమున కంత కుదిరియుండక పోవుట వలనను సరియైనదికాదు.

IV. ప్రసిద్ధమైన "గ్రీవాభంగాభిరామం" అను శ్లోకము నందలి "ఉగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి" అను పంక్తి యొక్క పరమార్థము అనువాదమున (2ఆ. 19ప) "మింటికి చొకళించుచుఁ" అను మాటలో అందముగా పొదుగబడినది. "అనుపతతి స్యందనే"

అనుమాట విలుగొని వెంటవెంట పృథివీపతి రాఁ అని మార్చబడినది'. మార్పున వచ్చు అర్థహాని ఏమియు లేదు. కాని "గ్రీవాభఁగాభిరామం" "పశ్చార్థేన ప్రవిష్టః", "భూయసా పూర్వకాయమ్"— అనుమూలపంక్తులు అనూదితములే కాలేదు. ఊహగల చిత్రకారునకును, మనశ్చిత్రకారులగు సహృదయులకును మాత్రమే అందునట్టి అప్పటి ఆ భయవిహ్వల మృగభంగిమ చిత్రణములోని సురుచిర సుషమను అనువాదము కోల్పోయినది.

అ. శా. :

"గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి
స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్ట శ్శర పతనభియా
భూయసా పూర్వకాయమ్
దర్భై రర్ధావలీఢైః శ్రమవివృత
ముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వాద్వియతి
బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి"
(I. 2)

శృం. శా. :

"విలుగొని వెంట వెంట
పృథివీపతి రా శరపాత భీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు
మార్గము క్రేవకు నడ్డగించుచున్
నిలుచుచుఁ గొంతగొంత గమ
నించుచు నర్ధము మేసిమేసి ద
ర్భలు వివృతాస్య పార్శ్వముల
రాలగ మింటికి చౌకలించుచున్"
(II. 19)

V. అభిజ్ఞాన శాకుంతలము ప్రథమాంకము తొమ్మిదవ శ్లోకమునకు అనువాదము కాళిదాసుని కాలిజాడలో నడచినది. ఇందు మూలగత శబ్దంబును అనుసరింపబడెను.

అ. శా. ;

"నీవారాః శ్శుకగర్భకోటర ముఖ
భ్రష్టా స్తరూణా మధః;
ప్రస్నిగ్ధాః క్వచిదిఙ్గుదీ
ఫలభిదః సూచ్య న్త ఏవోపలాః;
విశ్వాసోపగమా దభిన్నగతయ
శ్శబ్దం సహంతే మృగాః
తోయాధార పథాశ్చ వల్కల
శిఖా నిష్యంద రేఖాంకితాః" (I. 9)

శృం. శా. :

"శుకగర్భ కోటర చ్యుతములై నివ్వరి
ప్రాల్కుంద చెదరిన పాదపములు
దలలకు గారకాయలు నూర నందున
జముకంటి మెఱయు పాషాణతలము
నిబిడ వల్కల శిఖా నిష్యంద రేఖల
జాడలుగల జలాశయ పథములు
దపమేను లొంగికొంచు మనుష్యు లరిగిన
భయమునఁ జంచలింపని మృగములు

గలిగి యన్యోన్య మైత్రి నక్కడ జరించు
పులుల కూనలు జింక పిల్లలు, మృగేంద్ర
పోతకంబులు నాలప్రేపులును కదుపు
గట్టికొని కూడి యాడ నక్కజము చెందె"
(II. 48)

VI. అభిజ్ఞాన శాకుంతలములోని ప్రథమాంకము పదమూడవ శ్లోకమునకు శృంగార శాకుంతలము ద్వితీయాశ్వాసము లోని ఇరువది యొకటవ పద్యము అందమైన భావానువాదము. అనువాదమునందలి అర్థాంతర న్యాసము మాత్రము వేఱు.

అ. శా. :

"ఇదం కి లావ్యాజమనోహరం వపుః
తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం స నీలోత్పల పత్రధారయా
సమిల్లతాం ఛ్ఛేత్తు మృషి ర్వ్యవస్యతి"
(I, 13)

శృం. శా. :

"దిరిసెన పువ్వుకంటె గఱు
తింపగ మెత్తన మేనుదీగె యీ
తరుణికి, నిట్టి కోమలి లతా
తరుసేచన మాచరింపగా
కరుణ యొకింత లేక కడఁ
గట్టె మునీంద్రుడు మాటలేటికిఁ
నరవి యెఱుంగ లేకకట !
జాదులు వేఁచర మంగలంబునఁ"

(II. 61)

IV. మూ :

"అసంశయం క్షత్త్రపరిగ్రహక్షమా
యదార్య మస్యామభిలాషి మే మనః
సతాం హి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః."

(I, 17)

అను :

"సందియ మేల యీ వికచ
సారస లోచన రాజపుత్త్రి నా
డెందము మౌని కన్యల బడిం
జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయ వి
చారపదంబగు నట్టి వస్తు సీ
మం దమ చిత్తవృత్తులు ప్ర
మాణము లుత్తములైన వారికిన్."

ఇట "క్షత్త్ర పరిగ్రహక్షమా" అనుటలో శకుంతల యొక్క కులీనత్వము, కన్యాత్వము మూలమున స్పష్టపడినది. అనువాదమునగల "రాజపుత్రి" శబ్దమున ఆ విషయము స్పష్టము కాదు. మూల శ్లోకమునందలి రెండవపాదమున కిందలి రెండవ పాదము సరియైన అనువాదము కాదు.

VIII. మూ ;

"చలాపాంగం దృష్టి స్పృశసి
బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి
మృదు కర్ణాంతికచరః
కరం వ్యాధున్వత్యాః పిబసి
రతి సర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషా న్మధుకర
హతా, స్త్వం ఖలు కృతీ."

(I, 19)

అను: వనితఁ జంచదపాంగఁ జేసి
కనుగ్రేవన్ ముట్టుచుంజేరి మం
తనముం జెప్పెడు భంగి నొయ్యఁ
జెవిచెంతఁ మ్రోయుచుఁ మెల్లమె
ల్లన మోవిఁ రతిసౌఖ్య సంపదలఁ
గొల్లలొంటి ధన్యుండ వీ
వనఘా తుమ్మెద ! నేను వెల్వడితిఁ
దత్త్వాన్వేషముం జేయుచుఁ."

(II. 72)

ఇట శ్లోకమున శకుంతలా స్థితిసూచకములగు "వేపథు మతీం" "వ్యాధున్వత్యాః" అను మాటలకు అనువాదమున ఆస్కారము లేకపోయినది. అధరమును "రతిసర్వస్వ" మని విశేషించినాడు అభిజ్ఞుడు కాళిదాసు. అదియు అనువాదమున లేదు.

ix. "కే ఆవాం పరిత్రాతుం? దుష్యంత మాక్రందస్వ. రాజరక్షితవ్యాని తపోవనాని నామ." అను మూల పంక్తికి అనువాదము వ్యాఖ్యాన ప్రాయముగా నున్నది.

అను : "ఇంతి తపస్వికన్యకల
మేమసమర్థల మీతి బాధ భూ
కాంతుడు మాన్పి ధాత్రి ప్రజఁ
గావను బ్రోవను గర్త కాన దు
ష్యంతున కేమి చెప్పెదము
సాధు జనార్తిహరుండతండు దు
ర్దాంతుని నియ్యలిం గెడపి
తామరపూఁ జెరసాలఁ బెట్టెడున్."

(II. 77)

మూల శ్లోకమున తపోవనములు "రాజరక్షితములు" అను నొక విశేషమును కాళిదాసు తెలిపియుండగా అది అనువాదమున లేదు. మూలమున దుష్యంతునితో మొఱపెట్టుకొనుమని యుండగా అనువాదమున 'దుష్యంతునకేమి చెప్పెద' మనుట సరసముగా లేదు.

x. మూ: "అనాఘ్రాతం పుష్పం,
కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం,
మధు నవ మనాస్వాదిత రసం,
అఖండం పుణ్యానాం
ఫలమివ చ తద్రూప మనఘం
న జానే భోక్తారం కమిహ
సముపస్థాస్యతి విధిః" (II. 10)

అను : "కొనగొని తావి మూర్కొనని
క్రొవ్విరి, యెయ్యెడ వజ్రసూచి దా
యని రతనంబు, జిహ్వచవి
యానని తేనియ, గోటమోపి గి
ల్లని చిగురాకు, లాలిత వి
లాసనికేతన మా లతాంగి, దా
ననుభవకర్త యేఘనుడొ
యా విధియత్న మెఱుంగనయ్యెడున్"
(II. 158)

మూలమున చివరి పంక్తియందు ఆ యనుభోక్త ఎవరో యెరుగరాదని యుండగా అనువాదమున "తా ననుభవకర్త యే ఘనుడొ యా విధి యత్న మెఱుంగ నయ్యెడున్" అని యుండుట సమంజసముకాదు. "ఎఱుంగనయ్యెదన్" అని పాఠాంతర మున్నచో బాగు.

xi. మూ: "శుశ్రూషస్వ గురూన్, కురు ప్రియసఖీ
వృత్తం సపత్నీ జనే,
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా
మాస్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
భాగ్యే ష్వనుత్సేకినీ
యాంత్యేవం గృహిణీపదం
యువతయో; వామాః కులస్యాధయః"
(IV. 17)

అను :

"అత్తమామలకు నీ యుపసేమి వెట్టక
గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యేప్రొద్దు
సవతింపుమీ ప్రేమ సవతులందు
భర్తయొక్కొకవేళ బహుమాన మొనరింప
గదియ రానీకు మీ గర్వరేఖ
పతి చిత్తమెఱిఁగి తత్పరిజనంబుల మీదఁ
జేయుమా మిగుల దాక్షిణ్యగరిమ

పలుక నొంచకుమీ పెద్ద తరిగినపుడు
పలుకులను జేయకుమీ పరుసదనము
వీని వెలిగాగఁ బిసుగనే వెలదియైన
కులమునకు నాధియగు జుమీ కూతుఁగుఱ్ఱ!"
(IV. 88)

ఇంచిలి మూడవ పాదమునకు మూలమున పంక్తి కనబడదు కాని ఆ సందర్భమున ఆ మాటకూడ ఉచితముగనే యున్నది. ఈ పద్య రచనము శ్రీనాథుని శృంగార నైషధములోని—

"పాటించి కొలుపుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁ బోలె"

ఇత్యాది సీసమునకు అనుకృతిగా నున్నది.

xii. "పాతుం న ప్రథమం వ్యవస్యతి
జలం యుష్మా స్వపీతేషు యా,
నాదత్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేన యా పల్లవమ్,
ఆద్యే వః కుసుమ ప్రసూతి సమయే
యస్యా భవ త్యుత్సవః,
సేయం యాతి శకుంతలా పతిగృహం;
సర్వై రనుజ్ఞాయతామ్" (IV. 8)

అను మూల శ్లోకమునకు అనువాదము వ్యాఖ్యా ప్రాయమైనది

అను :

"అలపెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరువోసి
క్రమ వృద్ధిఁ బొందు మార్గంబు లారసివచ్చి
పూటపూటకు చాల ప్రోడిచేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకు
చిగురాకు కొనగోర చిదుమ వెరచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన
సఖులుదానును మహోత్సవ మొనర్చి

తల్లియై పెంచె మిమ్ము నే తలిరుబోఁడి
యత్తవారింటి కరిగెడు నా లతాంగి
క్షితిరుహములార ! పుష్పిత లతికలార !
యనుమతింతురు గాక కల్యాణ యాత్ర
(IV. 93)

ఉపరి సందర్భముల బట్టి అభిజ్ఞానశాకుంతలము ననుసరించు పట్టులు కొన్ని యెడల రుచిరముగను, కొన్ని యెడల సామాన్యముగను ఉన్నవి. పిన వీరన కొన్నియెడల జాగరూకత ప్రదర్శించినను కొన్ని యెడల అసడ్డజూపెను, పరాకుపడెను. ఎందులకోగాని అందములైన శ్లోకము లనేకములు అనువదింపక విడిచెను.

పినవీరన కాళిదాసుని కుమార సంభవమును గూడ పలుకరించినాడు :

1. "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః,
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః." (I. 1)

"అలరి పెంపొందు పూర్వాపరాంబునిధుల
నడుమ ధరణికి మానదండంబు వోలె
దేవతాత్మ ధరాధీశ దిగ్విభూష
పుణ్య నిలయంబు నీహార భూధరంబు"
(II. 101)

ఇది అన్యూనాతిరిక్తమైన యనువాదము.

2. "యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే,
భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ
పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్" (I. 2)

"భూధరము లెల్లఁ దను వత్సముగ నొనర్ప
పృథు నృపాలోపదిష్టయై ప్రియము మీర
నఖిల రత్నౌషధులను జన్నవిసి పిదికె
నమర శైలంబు దోగ్ధగా నవని సురభి."
(II. 103)

ఇట అనువాదము చతురస్రముగా మన్నది.

3. "పదం తుషార స్రుతి ధౌత రక్తం
యస్మి న్నదృష్ట్వాఽపి హతద్విపానాం,
విద న్తి మార్గం నఖరన్ధ్ర ముక్తై
ర్ముక్తా ఫలైః కేసరిణాం కిరాతాః." (I. 5)

"వారని మంచు పైఁబొదవి
వచ్చినపోయిన చొప్పు మాసిన
న్బారి నఖాగ్ర ముక్తమయి
పొల్పగు ముత్తెపుఁజాలు వెట్టగాఁ
దా రటు లేగి కాంతురు
హతద్విప కేసరివాస సీమలన్
వీర కిరాతు లద్రివన వీథుల
సింగపువేటలాడుచున్" (II. 104)

4. "యః పూరయన్ కీచకరన్ధ్ర భాగాన్
దరీముఖోత్థేన సమీరణేన,
ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం
తానప్రదాయిత్వ మి వోపగన్తుమ్" (I. 8)

"మానము దప్పకుండ నసమాన
దరీముఖరాయమాన హే
లానిలపూర్ణ రంధ్ర నిచయంబయి
కీచకరాజి మ్రోయగా
నా నగరాజు కిన్నరుల యంచిత
గాన వినోద వేళలన్
దానొక వాసికాఁడువలెఁ దక్కఁగ
నూల్కొనఁ జేయు తానముల్" (II. 105)

5. "కపోల కణ్డూః కరిభి ర్వినేతుం
విఘట్టితానాం సరళ ద్రుమాణామ్,
యత్ర స్రుతక్షీరతయా ప్రసూత
స్సానూని గన్ధ స్సురభీకరోతి." (I. 9)

"ధరణీధరసానుతటములు
పరిమళవంతములు సేయుఁ బాయకయెపుడున్
గరికండూయన నిస్స్రుత
సరళక్షీర ప్రసూత సౌరభహలహరుల్"
(II. 106)

ఈ యుపరి సందర్భములు మూటను అనువాదము సరళసుందరముగనే సాగినది.

6. "ఉద్వేజయ త్యఙ్గుళి పార్ష్ణిభాగాన్
మార్గే శిలీభూత హిమేఽపి యత్ర,
న దుర్వహ శ్రోణి పయోధరార్తా
శ్భిన్దన్తి మన్దాం గతిమశ్వముఖ్యః" (I. 10)

"బింగపు టాలుగా హిమము
పేరిన యగ్గిరిత్రోవ దుర్వహో
త్తుంగ కటీకుచాలసగతు
ల్తురగాస్యలు సంచరించుచో
నంగుళి పార్శ్వభాగముల కార్తి
యొనర్చినఁ గాని యయ్యెడన్
జంగలు వాచి మందగమనంబున
కొందగనీ రపాయముల్" (II. 107)

ఇందు మూలభావమే ఇంచుక ప్రపంచీకరింపబడినది ఈ కుమార సంభవ శ్లోకము లన్నియు హిమవద్గిరి వర్ణన సందర్భమున అనుసంధింపబడినవి. ఆ సందర్భమున నింపు (II. 102) శ్రీనాథుని హర విలాసములోని—

"ఎంచి నుతింప శక్యమె
యహీశ్వరు నంతటి వానికైన ర
త్నాంచిత రోచి రుద్గమ నిరస్త
సమస్త రవీందు జాలముం
గాంచన కందరా యవని
కాయిత వారిధరాంతరాళ ని
ర్వంచిత దేవతా మిథున
వాంఛితమూలము శీతశైలమున్"

అను పద్య మిట్లే వాడబడెను. "శ్రీనాథభట్టు భాష నిగుంభంబులు పరిమళంబుల గూడఁబఱచ నేర్చు" వాడనని చెప్పికొనిన పినవీరన శ్రీనాథుని రచన లనేకము ననుసరించుగాక కాని అతని పద్యము పద్యమంతటిని ఇట్లు యథాతథముగా గ్రహించుట మిక్కిలి ఆశ్చర్యకరము.

రస పోషణము :

శృంగార నైషధమును చూచి పినవీరన కృతికి నామ కరణము చేసికొని యుండును. "సాపంతలం బను శృంగార కావ్యంబు" అని ఆశ్వాసాంత గద్యలలో పేర్కొనెను.

"శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములుఁ దలపనన్య (నష్ట) రసములున్
సాంగమగునేని టంకము
బంగారము తోడి యొరపు ప్రబంధము వొందున్"

అని అవతారికలో చెప్పిన మాటనుబట్టి, ఈతని అభిప్రాయమున నిందు శృంగారమే ప్రధాన రసము, కడమ యష్టరసములు నంగప్రాయము లని చెప్పవచ్చును.

కథ యెత్తుగడలో తొమ్మిది పద్యములలో దుష్యంతుని గుణకీర్తనము గలదు. కాని కవి శృంగార నాయక లక్షణము నందు నిక్షేపింపలేదు. నాయికా నాయకుల ప్రథమ సమావేశమునకు ప్రాతి పదికగా ఆ కథారంగమును మాలినీ తరంగిణీ పరి సరమును శృంగార సురుచిరముగా వర్ణించెను.

పరిమళ ప్రణయుడగు కవి తత్తరంగిణీ తట మున విహరించుచున్న నాయకు నాలింగనము చేసి

కొనిన మందానిలము అడవియేనుగుల దాన గంధముతో, చెంచితల శిరసుల జవ్వాది పరిమళముతో, జలజ మధు సౌరభములతో, అలరు క్రొవ్వాసనలతో 'శబలితంబగు నయ్యేటి సలిలకణముల నల్లన గొనుచు' వచ్చెనని వర్ణించినాడు. అచ్చో నాయకుని మనమున కానందమును సంధించినవి— "మత్తమరాళ నృత్త నినదములు", "చక్రవాక కుటుంబ స్మరకేళి జాత కలనిక్వాణము", "వికచాంభోజ మరంద సన్మధు మదావేశ భ్రమద్భృంగగాన కలాప ధ్వని". ఇవి యన్నియు శృంగార భావోదయమునకు సంచకరువులగు ఉద్దీపన విభావములు. ఇట నాయకుడు చూచిన మాలినీ నదికి కవిచేసిన స్త్రీత్వారోపము మనోజ్ఞము :

"చల దిందీవర చారునేత్ర
సముదంచ చ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి
బిసహస్తం జక్రవాక స్తనిం
బులినశ్రోణి మరాళరాజగమనన్
భూజాని గాంచె న్నట
జ్జలకల్లోల పరంపరా నినద
వాచాశాలినిన్ మాలినిన్"
(2 ఆ. 27 ప.)

ఈపద్యము జక్కన విక్రమార్క చరిత్రమునందలి

చక్రవాక స్తని శైవాల ధమ్మిల్ల
సందీప్త డిండీర మందహాస
యావర్త నతనాభి యభినవ బిసహస్త
రాజిత రాజమరాళయాన
సికతాతల నితంబ వికచ బంధూకోష్ఠ
వరతరంగావళీ వళివిలాస
కంబుకంధర దళితాంబుజాతానన
నానావిధ విలోల మీననయన

యమృతసాగర విభుని యర్ధాంగ లక్ష్మి
యిందుధరునిలు పుట్టిన యిల్లుగాఁగ
నెగడెడు పినాకినీ తటినీ వధూటి
పట్టణాంతరసీమఁ జూపట్టుటయును.
(7-139)

అను పద్యమున కనుకరణప్రాయమైనది. ఈ జక్కన పద్యము వసుచరిత్రమునందలి శుక్తిమతీ వర్ణనమునకును గురుస్థానమైనట్టిది. పినవీరన జక్కననుమించి మఱియొక చమత్కారము చేసెను. స్థలాంతరమున శకుంతలారూపమునకు సరస్సామ్యమును సమగ్ర సుందరముగా నిరూపించినాడు.

"కుంతలమ్ముల పేరి కొదమ తుమ్మెదలను,
గ్రాలు కన్నుల పేరి గండుమీలఁ,
జన్ను గుబ్బల పేరి చక్రవాకంబుల,
హస్త ద్వయము పేరి యబ్జములను,
త్రివళీ రేఖల పేరి నవవీచికములను.
నతనాభిపేరి నెన్నడిమి సుడిని,
కటి మండలము పేరి ఘనసైకతోన్నతిఁ,
గోమలాంఘ్రుల పేరి కూర్మములను,
రుచిరమైన శకుంతలా రూప సరసి
నీదు లాడింపకుండిన నెట్లు పాయు
దర్పితానంగ శరజాల దావ దహన
తప్త మన్మానస మరాళతాప భరము."
(3 ఆ-37 ప.)

రెండు తావులను తన శృంగార కవి సమయ చమత్కారాభిజ్ఞతను ప్రదర్శించినాడు కవి. నాయికానాయకుల తొలిచూపులో వలపు తొలకరింప జేసినది వారి సౌందర్య రిరంస. అట్టిచో రసికునకు ప్రసిద్ధ సారస్వత సంకేతమైన భృంగము వర్ణనా వ్యాజమున నాయకుని శృంగార లాలసను వ్యంజింప జేసినాడు కవి. ఆ చిత్రణము సందర్భ సుందరము.

"శ్రవణేందీవరమున్ భజించె
నదియుం బ్రస్థాన ముక్తంబుగా
భవదక్షిన్ వసియించె నక్షి
ముకుళింపం దేటి నెమ్మోముపై
దవిలెన్ దానిఁ దొరంగఁ జోపుటకు
హస్తం బెత్తి వారించె దొ
నవు నంభోరుహ సామ్య దోషము
వయస్యా! లేదె నీ చేతికిన్" (2-70)

మేనకా విశ్వామిత్ర ఘట్టమున వసంత విజృంభణమును చక్కగా వర్ణించి వారి సరస శృంగారమునకు పూర్వ రంగమును సమర్థముగా నిర్వహించినాడు కవి. అచట ఆ ప్రకృతి సన్నివేశమును శృంగార భావ పేశలము కావించెను.

మలయ సమీరమ న్విటుఁడు
మచ్చరికంబునఁ బట్టి తీవలం
జెలువలపైఁ బురాణదళ చేలములన్
హరియింప లజ్జనొ
జలనము నొందగా నమపుజాణఁడు
చైత్రుఁడు గప్పెఁ దోనతో
నొలసిన కూర్మి పేర్మి
చెదకుండఁగఁ గెంజికురాకుబట్టలన్.
(2-125)

తళతళమించు కెందలిరుటాకుల నెడ
నెడ నొయ్య నొయ్యనఁ దొడిమలెత్తెఁ
దొడిమల నడుమ వాతు లొకింత గనవచ్చి
రావన నన లంకురంబు నొందెఁ
నన లంకురంబంది నవకంబుతోఁ గూడి
బలసి లేదావుల కలిక లయ్యెఁ
గలికల పరిమళంబులు వాకొలుపు మొము
లరవిచ్చి మవ్వంపు టలరులయ్యె
నలరు గుత్తులు మకరంద మలక నెఱయ
విచ్చి సోడుముట్టింపఁగా వీథికలను
దరుణ భావంబు నొందించెఁ దరుల లతల
నభినవంబైన నవవసం తాగమంబు.
(2-126)

పై పద్యము నందలి శృంగార చమత్కారము, రెండవ పద్యము నందలి కుసుమోన్మేషక్రమ సమున్మీలనము కవి యొక్క భావుకతను పట్టియిచ్చుచున్నవి.

కౌశికుని యంతవాడు కచ్చరు మూర్చిన సందర్భమున ఆతని చిత్తమున చిత్తజాతుడు తన అరాతి శివునెట్లు స్థానభ్రష్టుని గావించినదియు చమత్కరించినాడు.

"ఆ తన్వంగి పయిం బ్రియం బొదవి
విశ్వామిత్రు డీక్షించుచుం
జేతః పద్మమునందు నున్న శివునిం
జేమోడ్చి ప్రార్థించి తా
నా తారాద్రికిఁ బంపి యచ్చట
లతాంతావాస సీమన్ మనో
జాతుం బ్రీతుని జేసె దేవగణికా
సంభోగ సౌఖ్యంబులన్."      (2.141)

అయితే వారి శృంగార ప్రసంగమును ముక్తసరిగా ఒక్క పద్యమున మూడు ముక్కలలో తెమల్చివేసెను. ఆర్ష శృంగారమును అట్లు తెమల్చివైచుటలో ఔచిత్యము గలదు. కాని ఆపాటిదానికిరువది పద్యములలో ఉద్దీపన విభావ ప్రకల్పనమేల? అను ప్రశ్న పుట్టును. అంతటి మహర్షియందు మాన్మథ ప్రకర్ష యేర్పడుటకు ఆపాటి ఉద్దీపన విభావము కావలె మరి.

దుష్యంతుని తలపోతగా పినవీరన చిత్రించిన శకుంతలా సౌందర్యమున కవి భావనా విహంగము విహాయసవిహారమే చేసినది గాని స్వాభావికత గూటి పట్టున రవంత విశ్రమించినది కాదు. అయితే నాయకుని గుండెలో గూడుకట్టిన నాయికా శృంగార భంగిమ యొకటి సిసర్గ సుమోజ్ఞముగా చిత్రితమైనది.

"చికురంబుల్ నొసలంట నున్న
చెమటల్ జెక్కుల్ దరిర్పన్ ఘటో
దర భారమ్మునఁ గెంపు హస్తయుగ
ముద్గారింప నంసంబు లిం
చుక జాలిం జనుదోయి
యూర్పుపడి సంక్షోభించి కంపింపఁ దా
నొకకేలం దుఱు మావటించు
చెలువం బుల్లంబుఁ గొల్లాడదే" (2.161)

శకుంతలా శృంగారమున మదనావస్థలు, శిశిరోపచారములు వర్ణితములైన పట్టున కంటె ఆమె మౌగ్ధ్యము చిత్రితమైన ఘట్టము రసపట్టము నందుకొన్నది.

"బాలికఁ జూచుచు ధరణీ
పాలుడు పలుకుడిగి ప్రమద భరితుండయ్యెన్
బాలికకును నా ధరణీ
పాలకు నెడ లజ్జ మౌన బంధము నొందెన్.

"ఇవ్విధంబున శకుంతలా సౌందర్య సందర్శన సౌఖ్య పారవశ్యంబున రాజును, లజ్జా భయ రజ్జు బంధంబున మౌనిగంధగజయానయుఁ జిత్ర రూపంబు చెలువునఁ, బ్రతిజ్ఞ చేసికొనిన కరణి, కనుఁబోకవెట్టిన చందంబున, మూసిన ముత్తియం బుల వలె నుండ ననసూయ డాయవచ్చి భూనాయ కున కిట్లనియె." (3.77)

అట చంద్ర మదనోపాలంభములును ప్రబంధో చితముగ సుదీర్ఘముగ సాగినది. సంభోగ శృంగార పోషణ యందును కొంత చాతుర్యము గలదు.

కవి తన చమత్కార ప్రియత్వము నిందు శృంగారపరముగను ప్రదర్శించెను. మీద కొన్ని ఉదాహరణలు చూపబడినవి. మఱికొన్ని—

*పుష్పలావికలు :*

వెలకుఁ దగం బ్రసూనములు
వేడుచు మార్వలికింప నెత్తులం
గలసి చిగుళ్లు వెట్టి యడ
కట్టిన క్రొవ్విరి మొల్లపూవుబె
త్తులు దశనాధర ద్యుతులఁ
దోఁచిన బైకొనరీవిగా విటుల్
విలువగ వారి చిత్తములు
విల్తురు తత్పురి పుష్పలావికల్.

*కటి :*

"శశవిషాణంబు గగనపుష్పంబు నైన
వణిజు లిండులలో విలువంగగలవు
హంస గమనల మధ్యంబునందు దక్క
లేమి యే వస్తువులయందు లేదు పురిని"
(1.85)

*శకుంతల కేశపాశము :*

"బాలేందునిపైఁ దిమిరము
పాశెము వెట్టుకొని వేశఁ బరికించుచుఁ దా
వేలము చేసిన పోలిక
బాలిక హరినీలకేశ పాశం బమరున్"
(2.181)

చంద్రవర్ణన (3 ఆ-173 ప), చంద్రోపాలంభము (3 ఆ-181-183, 185) మదనోపాలంభము (3 ఆ-190, 191), మందానిల వర్ణన (1ఆ-84 ప; 2ఆ-24 ప; 2 ఆ132 ప) మున్నగు సందర్భములును శృంగార చమత్కార చారువులు.

కావ్యాంతమున నాయకునియెడ వానప్రస్థాశ్రమ స్వీకారాభినివేశ మున్నట్లు చెప్పబడెను. శృంగార కావ్యనాయకున కది తగదు. అయితే అతడు నాయికతో రాజ్యసుఖముల ననుభవించు చుండినట్లు కథ ముగిసినది. కొంత నయము. "శృంగార శాకుంతల"మని దీని పేరైనను ఇందు అతివేల శృంగారములేదు. ఉన్నది కొంత మోతాదుగనే యున్నది. అసభ్యతా స్పర్శలేదు. ఔచితీ సనాథముగా నున్నది. అయితే రసపారవశ్యమును కలిగించు సన్నివేశము లేమంత లేవు.

ఇక రసాంతరముల నితడెట్లు పోషించెనో, యించుక పరిశీలింతము. హాస్యము :

అభిజ్ఞాన శాకుంతలము నుండి విదూషక పాత్ర గ్రహింపబడెను. ఆ మాండవ్యుని పరముగ హాస్య మించుక పోషింపబడినది. [1-125, 2-9, 10, 170, 171)

ఒల్లమిచేసి వీరలకు
నుత్తరమీకు నృపాల పెర్వులుం
జల్లలు నమ్మకొన్నయవి
చాలఁగ నున్నవి చిత్రధాన్యము
లొక్కల్లలు త్రవ్వి తండములు
కుప్పలు నేతులు పాలువెన్నలుం
గొల్లలకేమి మూఁడె మనకు స్మృతి
కూడొక పూటవెట్టినన్. (1-125)

మనమున జంకు గల్గినను
మాన్పెద నేనది మంత్ర శక్తిచే
మునుల యవజ్ఞ గల్గినను
ముందటికి న్మనసీమలోని కా
ననములు గుత్తయిచ్చి జత
నంబుగఁ జేసినఁ గందమూలము
ల్దినియెదు వారుగాగ నరు
దెంచి వశంవదు లౌదు రందఱున్.
(2-170)

కరుణము:

శకుంతలా ప్రస్థాన సందర్భమున కణ్వుడు పడిన వేదనయందు కరుణస్ఫురణము కలదు.
[4-84, 85, 90, 91]

పొమ్మనఁ జూచుఁ జూచి మదిఁ
బుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొ
గంబయి కన్నుల నీరు మ్రింగుచుం
గ్రమ్మఱఁ దాశకుంతల మొ
గంబగు నశ్రులు నించుఁ గొంతసే
పమ్మని జాలిఁబొంది ధృతి
యంతయు నిల్వక విచ్చి పాఱగన్.
(4-84)

ఇందు 90, 91 పద్యము లుదాహృత పూర్వములు.

బ్రహ్మనిష్ఠుడైనను మహామనస్వియైన ఆమహర్షి పెంచిన ప్రేమచే కనులనీరు నించినాడు. శకుంతల వెళ్ళిపోవుచున్నది. కాని వియోగదుఃఖ బాష్పాకుల నేత్రయైన ఆమె ముఖవైఖరి అతని మనస్సున నిలిచిపోయినది. ఇక శకుంతల పడిన వేదనకు అంతేలేదు (4-96, 97). ఈ సన్నివేశమున కరుణము పోషింపబడిన దైదాఱు పద్యములందే యైనను అవి చాలు సహృదయముల నుఱ్ఱూతలూచుటకు.

యుద్ధవర్ణనమున (3 ఆ.114-144 వఱకు) రౌద్రవీరములు, కించిద్బీభత్సమును గలవు.

శార్దూల వర్ణనమునను, తద్దర్శనమున విప్రుడు సంత్రాసము పొందిన సందర్భమునను భయానక స్ఫూర్తి కొంత గలదు.

"అని చింతించుచు సంతసించుచు
రయం బారంగ సారంగ లాం
ఛన వంశాగ్రణి యేఁగుచోఁ
జటుల వర్షాకాల కాలాంబుద
స్తనితధ్వానపథాధ్వనీన గళ
గర్త క్రోడ నిష్ఠ్యూత ని
స్వన నిర్భగ్న నితాంత కాంత బహు
సత్త్వస్వాంత కాంతారమై.
(2-152).

శైలద్రుమచర దేహ
జాలోదరదళనకేళిసమయాలిగళ
కీలాల సిక్త దంష్ట్రా
భీల నఖంబునుచు నొక్క బెబ్బులి వచ్చెన్.
(2.153)

ఆ శార్దూలముఁ జూచి భీత హృదయుండై
మేను కంపింపఁగా
నాశల్ చూచుచు బ్రాహ్మణుండపుడు
ప్రాయః ప్రాణరక్షార్థమై
యో శార్దూలమృగేంద్రచర్మధర !
యో యుగ్రాక్ష ! యో యద్రిజా
ధీశా ! యీ యపమృత్యువుం గడపరావే
యంచుఁ గీర్తింపఁగన్.
(2=154)

పై పద్యగత బంధుర దీర్ఘ సమాసపద కలిత నిబిడ బంధము వ్యాఘ్రభీకరత్వమునకు ఝటితిస్ఫూర్తి కలుగ జేయుచున్నది; ప్రౌఢ శ్రీనాథ గాఢ పద్య బంధ స్తనంధయముగా నున్నది. మూడవ పద్యమున విప్రుని కంపన శివస్మరణాదిక ప్రసక్తి అతని భయభ్రాంత స్వాంత స్పందనమును దెలుపుచున్నది.

తపోవనవర్ణమునను (II. 44-49) విశ్వామిత్ర తపస్సందర్భమునను (II. 109-116) శాంతరసపోషణము మహర్షి స్వాంత మధురముగ సాగినది. అందును తపశ్చర్య నుపస్థితుడైన విశ్వామిత్రుని ఆత్మసాక్షాత్కార ప్రకారమును వర్ణించిన పట్టున (II. 114-116) పినవీరన తన ఉపాసనానుభవమునే నిక్షేపించెనా యనిపించును

అంగరసముంలో హాస్య రౌద్ర వీర భయానక శాంతకరుణముల కుత్తరోత్తరాధికస్ఫూర్తి ఏర్పడినది. కవి రసతత్పర హృదయుడే యనిపించినది.

శైలి :

వేములవాడ భీమన ఉద్దండలీల, నన్నయభట్టు నుభయవాక్ప్రౌఢి, తిక్కయజ్వ రసాభ్యుచితబంధము, ప్రబంధ పరమేశ్వరుని సూక్తి వైచిత్రి— ఇత్యాది సర్వ పూర్వకవి ప్రౌఢమార్గములును శ్రీనాథుని రచనలో సంగమించి మనసాహిత్య జగత్తున సంస్కృతాంధ్ర పదానుబంధ బంధురమైన ఒక సరిక్రొత్త బంధ సౌందర్యము సాక్షాత్కరించినది. అది శ్రీనాథుని సమకాలికుల నాకర్షించినది. అర్వాచీనులగు సర్వాంధ్ర కవులకును, అందును ముఖ్యముగా ప్రబంధ కవుల కొరవడులు పెట్టినది. ప్రసిద్ధమగు ప్రబంధశయ్య కధికారముద్ర నచ్చొత్తినది. "శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబులఁ గూడఁ బఱచ నేర్చిన" వాడనని పినవీరనయే కంఠోక్తిగా చెప్పుకొనినాడు.

ఉదా : 1.

ప్రసవ కార్ముకుఁడను పాపకర్మునిచేత
　　సూనాస్త్రుఁ డనెడు దుర్మానిచేత
నంబుచర ధ్వజుండను కిరాతునిచేత
　　మన్మథుండను నసన్మార్గుచేత
శంబరాంతకుఁడను జాల్మ చిత్తునిచేఁ
　　గందర్పుఁడను పలుగాకిచేత
నంగసంభవుఁడను నతినిర్దయునిచేత
　　దర్పకుండను నాకతాయిచేఁ
జెడ్డవారలఁ గథలుగాఁ జెప్పనేల
వేల్పు తేఁడంప నొక దేవవేశ్యఁ జూచి
తొడరి యజునైన నొసలి వ్రాల్దుడువనోపు
కౌశికునియంతవాఁడూడ్చెఁ గచ్చడంబు.
　　(2-143)

2. ప్రళయసంధ్యా నటత్ఫాలాక్ష డమరుకో
　　చ్చండ నిర్ఘోషంబు బెండుపఱిచి,
మందరాచల మహామథన వేళా గుంభ
　　దంభోనినాదంబు నపహసించి
గిరిగరుత్ఖండన క్రీడాసమారంభ
　　దంభోళి రుదితంబుఁ ద్రస్తరించి
పుష్కలావర్త కాంభోధరోదర గళ
　　న్నిర్ఘాత రావంబు నీచపెట్టి
వరుస దిక్కుంజములఁ బ్రతిధ్వనులు చెలఁగ
నాశ్రమారణ్యముల నెల్ల నాక్రమించె
మునులు భీతిల్లఁ గాళికాముఖ మహోగ్ర
భూరి సన్నాహ సమర భేరీరవంబు.
　　(3-94).

5. అంధకాసురవైరి యపరావతారుల
　　యక్షేశ సఖుని పర్యాయతనుల
సాక్షాత్కరించిన శశిమౌళి మూర్తుల
　　నంబికేశ ప్రతిబింబములను
భావజారాతి లీలా విగ్రహంబుల
　　నిటలలోచనుని మాఱట యొడళ్ళ
నగరాజ కోదండు నామాంతరంబులఁ
　　బ్రమథాధిపతి బహిఃప్రాణములను
ఫణికులాధిపధరు ననుప్రాసములను
దనుజపట్టణ భేదను వినిమయములఁ
బంచబాణారి పట్టము భద్రకరులఁ
గాశ్యపుని యాశ్రమ స్థానకము మునులను.
　　(3 ఆ-15)

4. తురగరింఖా ముఖోద్ధూత ధూళీపాళి
　　నభ్రగంగా నది నడుసు రేగ
లసిత శస్త్రజ్యోతు లాశాధినాథుల
　　యిండ్ల ముందళ్ళ నీరెండ గాయ

దంతి సంతాన దుర్దాంత ఘీంకృతులచేఁ
జెవులు జుమ్మనుచును జిల్లువోవ
విపులసైన్య వధోగ్ర విన్యాసరవమున
నుర్వి పట్టదలి యుబ్బూతలూఁగఁ

గుండలీకృత చారుకోదండ దీర్ఘ
నిష్ఠుర జ్యారవంబుల నింగి వగుల
విక్రమాభిక్రమంబున నాక్రమించి
రభసమున వచ్చి దుష్యంతవిభునిఁ దాఁకె.

(3 ఆ–116)

పై పద్యములందు, అందును ఆ సీసబంధముల అందచందముల యందు, ఆ సంస్కృతాంధ్రముల పలుకుబడుల యొడుపులందు, ఆ నాదమాధుర్యము నందా లయ హొయలునందు, (జైమిని భారతము నందును IV. 10, V. 3, V. 79 మున్నగు ననేక పద్యములందు), పలుతావుల పలుకు నుడికారమునందు, శృంగార చమత్కారములందు స్వీయ చిత్తనిత్యస్థిత శ్రీనాథునే మనకు సాక్షాత్కరింప జేసినాడు పినవీరన.

ఈ సీస పద్యము లీ క్రింది శ్రీనాథుని సీసపు మూసల బోసిన పోతలు :

1. "కాలకూట విషాగ్ని కబళ హేలాగ్రాస
కల్మాషితాసితకంఠు చేత
కుంభినీధరసుతా కుచకుంభ పరిరంభ
సంభావనా కేలిశాలిచేత" మొ.

—భీమఖండము 2–21

2. "జనమేజయారబ్ధ సర్పాధ్వరాహూత
చక్షుశ్శ్రవస్సహస్రములఁ బోలి" మొ.

—భీమఖండము 3–52

3. "చెలికారు లంజనాచల గండ శిలలకు
యమదూతలకు సభిధాంతరములు" మొ.

—శివరాత్రిమాహాత్మ్యము 4–18

(చూడుడుభీ ఖం.1–54 కాశీఖండము 4–191 కూడ)

4. "ధమధమార్భటి డమడ్డమరు ఢక్కాధ్వని
పదిదిక్కులందును భ్రమసిపార" మొ.

—కాశీఖండము 5–105

సీసపద్యములం దీపాటి పోలికలే గాక సీసపాదము పాదమంతయు నేక సమానధాటిగ నడచిన సందర్భములందును పినవీరన రచనలో శ్రీనాథుని యొరవడి కన్పట్టును.

ఉదా : "పద్మరాగోపల ప్రాకార రుచిజాల
గండూషిత వ్యోమ మండలంబు" మొ.

శృ. శా. 1.69

"వేదండ వదన శుండాదండ చుళుకిత
ప్రోజ్ఝితాంభశ్ఛటా ప్లుత నభంబు" మొ.

భీమఖండము 1.106

ఒక్కొకచో పినవీరన శ్రీనాథుని వాణికి మెఱుగు పెట్టుటకు ప్రయత్నము చేసినట్టును కన్పట్టును.

ఉదా : "వికట పాటలజటా మకుటకోటి పినద్ధ
ముగ్ధచంద్రుఁడు జగన్మోహనుండు" మొ.

—కాశీఖండము 4.53

"పాలితాఖిల హరిద్పాలకాది సుపర్వ
మండలుం డురగేంద్రకుండలుండు" మొ.

—శృం. శా. 4.3

ఇదే పద్ధతిగా సాగిన ఈ రెండు పద్యములందును పాదపాదమున రెండేసిగా నున్న శివవిశేషణములు శ్రీనాథునిదాన శబ్దసారూప్య విరహితములుగా నుండ పినవీరన దానిలో ఆ సారూప్యముచే సమలంకృతములైనవి. అయితే "ఎంచి నుతింప శక్యమె...." అను శ్రీనాథుని హరవిలాస పద్యము (ఉదాహృతపూర్వము) ఊచముట్టుగ నున్నదున్నట్లు శృంగార శాకుంతలమున గ్రహింపబడి యుండుట మాత్రము కడు వింత.

నన్నయ తిక్కన నాచన సోముల వచస్సౌరభములును పినవీరన రచనలో గుబాళించినవి :

ఉదా : 1. "ఎన్నడు నా మదిన్మఱతు...." (4.90), "కొంతసుఖంబుమంగలదు...."(4.91) అనుపద్యములందలి (ఉదాహృత పూర్వములు) రస ప్రసన్నమైన రచనయు, అందలి "సంతతస్విన్న మరంద సిక్త సరసీజము", మాలతీలతాక్రాంత

మనోజ్ఞమైన సహకారము' అను మనోజ్ఞసమాస ముల ఘటనయు నన్నయగారి నైపుణిని తలపించు చున్నవి.

2. అవనీచక్రము గ్రుంగె, నింగి
ఘన గర్జాడంబరంబయ్యెఁ, జి
క్కువడం జుక్కలు డుల్లె,
దిక్కరులు సంక్షోభించెఁ, గుంభీనస
ప్రవరుం డుల్కెఁ, దలంకె ధాత,
పగిలెన్ బ్రహ్మాండ భాండంబు, బి
ట్టవిసెన్ నిర్జరరాజధాని,
వడి నూటాడెన్ మహాశైలముల్.
— శృం. శా. 2-117.

కలగెం దోయధి సప్తకంబు,
గిరివర్గం బెల్ల నూటాడె, సం
చలతం బొందె వసుంధరావలయ,
మాశాచక్ర మల్లాడెఁ, గొం
దలమందెం ద్రిదశేంద్రు పట్టణము
పాతాళంబు ఘూర్ణిల్లె, నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము,
సంక్షోభించె నవ్వేధయున్.
— విరాటపర్వము 4-172.

ఈ రెండు పద్యములను పరిశీలించినచో పినవీరన వాగర్థ విన్యాస వైఖరి తిక్కన పక్కికి మానస పుత్రిక యనిపించును.

3. ఏతెంచెన్ మధుమాస లక్ష్మి,
తరుణీ హిందోళరాగధ్వనుల్
వీతెంచెన్, బటు మీనకేతనముతో
విల్లంది పూఁదేరిపైఁ
దోతెంచెన్ దలిరాకుఁ గైదువులుఁ
దోడ్తోఁ దాల్మి లేఁదీగెలన్
వే తెంచెన్ జగదేక విక్రమ కళా
వీరుండు మారుం డొగిన్.
— శృం. శా. 2-121

పరపయ్యెన్ బరిభోగవాంఛ దడవం
బాలయ్యె నిద్రారతుల్
పొరపయ్యెన్ బలుదాల్మి వింతవగపుం
బ్రోవయ్యె నాలాపముల్
నెరపయ్యెన్ మదనానలంబు వరుసన్
నీరయ్యె నాలేపముల్
సొరపయ్యెన్ దనువల్లి బాణుసుతకున్
సోలింతలం దూలుటన్.
— ఉత్తర హరివంశము 5-100

ఇప్పట్టున నవీనగుణ సనాథుని నిపుణ ఫణితి పద్ధతిని పుణికి పుచ్చుకొన్నది పినవీరన రచన. అసలు నాచన సోముడు పద్యరచనలో ప్రదర్శించిన కొన్ని నవీన గుణములు శ్రీనాథ పినవీరన ప్రభృతుల అనుకరణలో మరింత యందగించి అర్వాచీన ప్రబంధ ధోరణుల కొజ్జబంతులు దీర్చినవి. అట్టి పినవీరనగారి బాణీలలో మచ్చున కొక రెండు :

ఆ వాలుం గనుదోయి యా నగుమొగం
బా గుబ్బ పాలిండ్ల పెం
పా వేణీ రుచి యా తనూవిలసనం
బా యొప్పు నేఁజెప్పినం
గైవారం బగుఁగాని యయ్యెడ శిరః
కంపంబు తోఁగూడ నా
హావుట్టింపదె యిక్షుధన్వునకు
నయ్యబ్జాక్షి నీక్షించినన్.
—శృం. శా. 2-188.

కుముదోజ్జీవన మంత్ర, మంగజభుజా
కోదండ గర్వంబు, సం
తమసానేకప కూట పాకలము,
జ్యోత్స్నావర్షి వర్షాపయో
దము, పాంథవ్రజచిత్తశల్యము, నిశా
ధమ్మిల్ల బంధూక గు
చ్ఛము, ప్రాచీ నగశృంగ వీథిఁ బొడిచెం
జద్రుంతు సాంద్రద్యుతిన్.
—శృం. శా. 3-154

రామరాజ భూషణుడు, మాదయగారి మల్లన మున్నగు ప్రబంధ కవులెందరో యీ పద్యరచనా ఫక్కికలను పాటించిరి.

వర్ణనలు :

ఇతడానాటి చాలమంది కవులవలె అంత అతివేల వర్ణనాప్రియుడు కాడు. ప్రసిద్ధములైన అష్టాదశ వర్ణనము లందును అన్నియు చేసినవాడు కాడు. అయితే చేసినంతమట్టుకు చాకచక్యమునే ప్రదర్శించి నాడు.

పురవర్ణన, రాజవర్ణన, సభావర్ణనములందు సర్వకవి సామాన్యములైన ఉత్ప్రేక్షాకల్ప కల్ప నములు, ప్రౌఢ పదగుంభనములు మాత్రమే కలవు. పుష్పలావికలు, మలయానిలము మున్నగునవి వర్ణింపబడిన కతిపయ పద్యములందు మాత్రము కాసంత చమత్కారమున్నది. హిమవన్నగ వర్ణ నమున కాళిదాస కుమార సంభవములోని ఆరు శ్లోకముల నందముగా ననువదించు కొనినాడు (ఈ పద్యము లుదాహృతపూర్వములు). పదభావ ప్రౌఢ మైన శ్రీనాథుని పద్యముల ననుకరించినాడు. కాని మృగయా వర్ణనమున మాత్రము ప్రత్యక్ష పరిజ్ఞాన మున్నవానివలె దానిని సాంగోపాంగముగా వర్ణించి నాడు.

పుళిందుల వర్ణనమున (I. 97, 98) యథావ ద్వస్తు చిత్రణము గలదు.

వసంత వర్ణనమున (II. 121-131) రస ప్రసన్నమైన శైలి, కతిపయ శృంగార చమత్కార ములు, కుసుమోన్మేష క్రమ సమున్మీలనమున స్వాభావికతయు గలవు. స్త్రీ సౌందర్య వర్ణనమున రచనలో కొంత నైషధానుసృతి కలదు. నదికి స్త్రీత్వారోపము, స్త్రీ స్వరూపమునకు సరస్సామ్యము విశేషములు.

వివిధ ప్రకృతి వర్ణనలు (III. 148-160). నాయికా విరహ వీరవ్రతవర్ణనము (III. 169-197) ప్రబంధోచితముగా నడచినవి.

యుద్ధ వర్ణనమున (III. 114-144) రౌద్ర వీర భయానక రసస్ఫూర్తి గలదు.

ఇక గుర్విణ్యవస్థా చిత్రణము (IV 56-58) పుత్త్ర ప్రశస్తియు (IV. 105) సామాన్యములు. తపోవన వర్ణన చక్కగనేయున్నది కాని అందీతని యుపజ్ఞా ప్రతిపత్తి తక్కువ, అనుకరణ ప్రవృత్తి ఎక్కువ. అట నన్నయ, కాళిదాసులను అనుకరించి నాడు (II. 44-48).

విశ్వామిత్రుని తపోనిష్ఠా వర్ణనము నొక అను భవజ్ఞునివలె చేసెను (II 110-117).

శ్రీనాథునివలె మందానిల (I. 84, II. 24, II. 132) వర్ణనమునందు ఈతడు కడు స్నిగ్ధ హృదయుడు. తద్వర్ణనము బహువారములు చేసి నాడు (పుటలు 19, 43, 65) ఈ కవియెడ ఒక చిత్రమగు పరిమళ ప్రలోభము కలదు. అది ఆమల యానిల వర్ణనమున పలుతావుల ప్రసరించినది.

బెబ్బులి చిత్రణము (II. 152, 153), భేరీ రవ వర్ణనము (III. 94) ఇతడు చేసిన ప్రత్యేక వర్ణనలు, ఆ పద్యములందు బంధ సౌందర్యముతో పాటు భావ సౌందర్యమును పుష్కలముగా నున్నది. భేరీరవ వర్ణనమున సామయిక చిత్రణ మున్నది.

అరుణ కాంతుల వర్ణనమును, ప్రభాత వర్ణ నమునను (III ఆ-202, 203 ప) ఉన్నది ఒక అతిలోకమైన భావనయే కాని ఆ భావన వస్తు స్థితికి సన్నిహితముగా నున్నట్లున్నది.

వర్ణనలందు కథాంశమున కనువైన వాతావర ణము కల్పించుట యందును, అందు భావపుష్టిని, శయ్యాసౌష్ఠవమును, చమత్కారమును సాధించుట యందును పినవీరన దక్షుడని చెప్పవచ్చును. శృం. శా. నందలి మందానిల వర్ణనము నందును, జైమిని భారతమునందలి భోజనవర్ణనమునందును ఆతడు బహుధా శ్రీనాథ ప్రభావితుడైనను కడమ వర్ణనము లందు చేసిన కల్పనలందు ఉపజ్ఞయు, ఊహాశాలి

తయు ప్రదర్శించి అర్వాచీన ప్రౌఢప్రాబంధికుల కనుకార్యుడు నయ్యెను. తాదృశములు పినవీరన పద్యము లనేక ముదాహృత పూర్వములు.

విశేషములు :

ఇందు నాటి తెలుగు సమాజపు స్థితివిశేషములుగా పరిగణింపదగినవి కొన్ని గలవు. మృగయావర్ణన సందర్భమున (I. 108-117) పులి మల్లడు, అడవి పోతుల రాజు, గరుడుండు, గాలి వేగంబు, పందేల పసిడి, విష్ణు ప్రసాదంబు మొదలుగా నాడు వేటకుక్కలకును పేరులు పెట్టుకొనునాచారమున్నట్లు తెలియుచున్నది.

స్వప్న ఫలముల మీదను శకున ఫలముల మీదను ప్రజలకు విశ్వాసముండెనని (1 ఆ-129 ప, 132 ప) తెలియుచున్నది. నాడు అక్షరాభ్యాస కాలమున "ఓం నమశ్శివాయ"తో ప్రారంభము చేయు ఆచార మున్నది. (4 ఆ-5ప). భోజన తాంబూల పుష్పముల నొకరు గొనుమన నిరాకరించుట మర్యాదగాదు. "కార్యఫలసిద్ధి కవి యాదికారణము"లని నాటివారి నమ్మకము.

అల్లువారి విషయమున ఆడపిల్లలు కలవారిచూపు ఎట్టిదో అదియు వ్యక్తమైనది (4 ఆ-73ప).

దిష్టులు, దిగదుడుపులు తీయు నాచారమును గలదు (3 ఆ-41 ప). నాడు జాతరలందు మేష బలి యొక యాచారముగ నుండినట్లును తెలియనగును (3-130)

అట్లే యింకను పురిటాలి తగవుల ప్రసక్తి (2.45, 4. 62), తెఱ బొమ్మలాట (3.125) బహురూపముల (2.78) ప్రసక్తియు గలవు. ఆ యీవిశేషములు శ్రీనాథ యుగవాఙ్మయమున నితరత్రను ప్రసక్తములై నాటి తెలుగు సమాజము తీరుతెన్నులను వ్యక్తము సేయుచున్నవి.

ఈ శృంగార శాకుంతలమును జూచిన తరువాత రాయల యుగముననే ప్రబంధము పురుడుపోసుకొన్నదని పొరపాటున వాడుక పడిపోయిన మాటనెంత వేగము మార్చుకొనిన నంతమంచిది. ఏ లక్షణములను మను వసుచరిత్రాది మహాప్రబంధముల ప్రక్రియకు ప్రాణస్నాయువులుగా పరిగణించుకొనుచున్నామో ఆ లక్షణము లన్నియు – ఆ వస్త్వైక్యము, ఆ ఏకనాయకాశ్రయత్వము, ఆ శృంగార రసప్రాధాన్యము, ఆ వర్ణనా ప్రాచుర్యము, ఆ ఆలంకారిక శైలీ నైగనిగ్యము మున్నగునవన్నియు శృంగారశాకుంతలమునకు బట్టినవి. మీదుమిక్కిలి ఆ ప్రబంధము లందలి అర్థాతిశాయియైన శబ్దాడంబరము, చిత్రకవిత్వపు కసరత్తులు, శ్లేషధృతరాష్ట్ర పరిష్వంగములు నిందులేవు. వానివలెగాక వస్తు శరీర వైపుల్యము, వైచిత్రికి బలికాని భావసంపదయు, అనుస్యూతమైన రసరక్తియు నిందుగలవు. వానియందున్నపాటి స్వతంత్రరచనయు నిందు లేకపోలేదు. అందు కొన్నింటి కిది కొన్నింట మార్గదర్శకము నైనది. శ్రీనాథయుగ ప్రబంధ చైత్రరథములో నిదియొక చక్కని సౌగంధికము.

## జైమిని భారతము

వ్యాసుని శిష్యుడే జైమిని. మరల నీతడెందుకు వ్రాసెనో మహాభారతము. ఈ భారతమునకును శ్రోత జనమేజయుడేనట; జైమినియే కథాఖ్యాత. మఱి యీతడు భారతము నంతను వ్రాసెనో లేదో కాని ఉపలబ్ధమైనది మాత్రము అశ్వమేధపర్వమొక్కటే. ఇందు వ్యాస భారతమున లేని విశేష కథలు చాల గలవు. యౌవనాశ్వ చరిత్రము, అనుసాళ్వని చరిత్రము, నీలధ్వజ మహారాజోదంతము, సౌభరి చరిత్రము, ఉద్దాలకుని కథ, హంసధ్వజ వృత్తాంతము, ప్రమీలకథ,వృక్షదేశ వృత్తాంతము, శ్రీరామ చరిత్రము, చంద్రహాసోపాఖ్యానము మొదలగునవి. వ్యాసభారతమున అశ్వమేధ పర్వము మొదటి మూడాశ్వాసముల యందలి అంశములు పెక్కు జైమిని భారతమున లేవు, బభ్రువాహన కథ మొదలగు నంశములుమాత్రము రెంటనుగలవు,

పినవీరన కృతులలో శృంగార శాకుంతలము వ్యాస కాళిదాసుల గ్రంథముల నుండి కతిపయ కథాంశములను శ్లోకములను గ్రహించి యున్నను అది స్వతంత్రకావ్య మనదగును. ఈ జైమిని భారతము మాత్రము అనువాద గ్రంథము. "సుకవి జన హృద్యము. ఆద్యము, ఇతిహాసానేక ద్యోతిత పద్యా వైశద్యంబై నదియు" నై "జైమినిభారత మనగా భూమి నపూర్వము పురాణముల గణి యింపన్" అని గుర్తించి మఱి ఈ అనువాదము మునకు పూనినాడు పినవీరన.

"ఆ పురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేని
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేని
దెనుగు నుడికారమున మించు గనియెనేని
గుందనము కమ్మ వలచిన చందమగును"

అను అవతారిక యందలి పద్యమునుబట్టి పినవీరన నాడు ప్రసిద్ధుడై యుండెననియు, ఈ గ్రంథమున తెలుగు నుడికారము మెండుగ నున్నదనియు గ్రహింపనగును.

ఈ కృతిని వలచి వరించిన మహనీయుడు విజయనగర సమ్రాట్టు సాళువ నృసింహరాయలు (క్రీ. శ. 1485-1490). పినవీరన శృంగార శాకుంతలమున కతిపయ కాళిదాస శ్లోకములను తెనిగించినాఁడు కాని అందు మూలమునకు వన్నె పెట్టలేక పోయెను. పురాణేతిహాసానువాదములందు అది సులభసాధ్యము కాదు. కారణము కావ్యము లందున్నంతగా కవితా పుష్టియు, శిల్పసౌష్ఠవము పురాణాదు లందుండదు. ప్రకృతము ఈతవి అను వాద మెట్లు సాగినదో కతిపయ సందర్భములను బట్టి పరిశీలింతము.

1. కృష్ణ భీమసేనుల సరసాలాపఘట్టమునందలి ఏ దెనిమిది పద్యములకును (1.125-133) మూలము పందొమ్మిది శ్లోకములు. అనువాదమున లాఘవము గలదు. అప్పట్టున వారి యుల్లసము లకు పిదప భీముని మాటలుగా—

"నీ కరుణ తోడుగా వైరినృపుల గెలుతు"
(1.127)

"నా హృదయంబులోన
నీపదయుగళంబునిల్పి... దిగ్గజంబులన్
రదనము లూడఁ దన్నుదునొ
రాలుతునో గ్రహతారకంబులన్,"
(1.128)

"పోయి వచ్చెద నీ పదాంబురుహ చింత
నాకుఁ దగు సంబళంబుగా నలిననాభ!"
(1.133)

అను నమూలక పంక్తులు భక్తిశక్తులను నిరూపించి భీమపాత్రకు వన్నె పెట్టుచున్నవి.

"త్వత్కరే వార్పితం దేవ!
స్వల్పం తద్బహుళం భవేత్"

అను మూల పంక్తి—

"అరసి భవత్కరాంబురుహ
మందొక టిడ్డను కోటికొండలై
పెరుగుటఁజేసి" (1.132)

అని చక్కని జాతీయతతో అనూదితమైనది.

2. భద్రావతీ పురవర్ణనయందు 2 ఆ. 3, 4 పద్యములు అమూలకములు. ప్రౌఢభావ శైలీ పరిపాలకములు :

పావని గాంచె కట్టెదుర
ధర్మ శిరోగృహ తుంగ శృంగ సం
భావిత పద్మరాగజ
గభస్తి సమాజవిరాజమాన లీ
లా విపరీత సాంధ్య నిశలం
దిశలందు నలంకరించు భ
ద్రావతి యౌవనాశ్వ సుర
రాజ విరాజ దిరామరావతిన్."

"స్ఫాటిక మణి శిలా ప్రత్యగ్ర రచనాతి
బంధుర ప్రాకార భాసురంబు
పాతాళజలఝరీ పర్యాప్త కల్లోల
సుకుమార పరిఖోపశోభితంబు
కనక సౌధాంచల కలిత ముక్తాఫల
రాజి లీలాగ్ర తారాగణంబు
శక్రనీల శిలా విశాల గోపుర రోచి
రసమయ జనిత మిథ్యాతపంబు

భవన కాసార కహ్లార పద్మ కుముద
పుండరీక నీలోత్పల షండ సురభి
విపుల మధుకర కలనాద విజిత పుష్ప
చారు నినదంబు భద్రావతీ పురంబు"

ఇట మూలమున ఆరుశ్లోకములలో రంభా నారికేళ క్రముక పనస ఖర్జూర దాడిమీ వృక్షములు ప్రత్యేకముగా ఒక్కొక్క శ్లోకమునను ఇంకను పుష్పములు, పక్షులు, మృగములును ప్రత్యేకముగా పేర్కొనబడినవి. అనువాదమున ఒక్క పద్యముననే ఆ నానాత్వమంతయు మనోజ్ఞముగా ప్రదర్శింపబడినది.

"నానా పక్వఫలాతినమ్రతరు
సంతానంబులన్ విస్ఫుర
న్నానా పుష్పలతా ప్రతానముల
నానాపక్షి రావంబులన్
నానావర్ణ మృగప్రచారముల
నానాకేళి కుంజంబులన్
నానా భంగి నుతింప నొప్పుఁ బురి
నానాభోగ సంపన్నతన్"
(2 ఆ. 6 ప.)

మూ : యూపై ర్న లక్ష్యతే మార్గో
హోమధూమై ర్న దృశ్యతే
న బహి శ్రూయతే శబ్దో
వేదఘోషై ర్ధనుస్స్వనైః.

అను : పంబిన వేదఘోషణల
భాషణముల్ వినరాక హోమ ధూ
మంబులు గ్రమ్మి కొక్కొన
ఖమార్గము గానఁగనీక యూపసం
ఘంబుల సందడిన్ నడువఁ
గాల్దెరువై నను లేక సాధు ర
మ్యంబును శత్రుభీషణమునై
పుర మొప్పుచునుండు నెప్పుడున్.
(3 ఆ. 5 ప)

ఈ పద్యమున "సాధు రమ్యంబును శత్రుభీషణమునై పురమొప్పుచు నుండు నెప్పుడున్" అను చివరిపంక్తి విశేషము.

3. గజవర్ణనము, గజవిహార వర్ణనము మూల పరిమితిని మించి మూలరమ్యత నతిశయించి యున్నవి.

మూ : ఏతే పశ్య గజాః ప్రాప్తాః
సమదా మధుపై ర్వృతాః
కరేణవశ్చ కరభాః
కజ్జలస్యేవ పర్వతాః.

అను : అని సల్లాపములాడుచున్నయెడ
నుద్యద్వాద్య ఘోషంబులున్
ఘన ఘీంకార రవంబులున్
బృథుగళ గ్రైవేయ ఘంటా కఠో
ర నినాదంబులు గండదానజల
ధారాలోల రోలంబమో
హన ఝుంకారములున్ జెలంగ
నివహంబై వచ్చె శుండాలముల్.
(2 ఆ. 12 ప.)

ఈ పద్యమునగల 'ఉద్యద్వాద్యఘోషంబుల', 'పృథుగళగ్రైవేయ ఘంటాకఠోర నినాదంబుల' ప్రసక్తి అమూలకము, 'మధుపై ర్వృతాః' అని వట్టి పొడిముక్కలుగా నున్న మూలపంక్తి "గండదానజలధారాలోల రోలంబమోహన ఝుంకారములు" గా విస్తరించినది. ఇది యంతయు ప్రబంధోచిత భావశయ్యాప్రౌఢి సాధించుకొఱకే. అయితే మూలము నందలి మనోజ్ఞమైన కజ్జల పర్వతోపమాన మనువాదమున లేదు.

మూ : ఉన్మజ్జంతి నిమజ్జంతి
మహామాత్రై రధిష్ఠితాః
ప్రీతాః ప్రేమజాలైః స్త్రీణాం (?)
కాముకాః పురుషా ఇవ.

అను : (2ఆ-13) గజవిహార వర్ణనాత్మక మగు పైయనుష్టుప్పు యొక్క పరిమితి అనువాదమున వచనమున నేడు మడుంగులైనది. ఇట ననువాదము మూలమునకు వ్యాఖ్యాన ప్రాయముగ నున్నది.

4. మూలమున గల యౌవనాశ్వుని గుఱ్ఱాల సందడి (మూ. IV. 16-18) వర్ణన అనువాదమున (2ఆ-14) ఎక్కువ కవిత్వ పదార్థమును చేపినది :

నేమినిర్గత ధారుణీరేణు కల్పిత
తిమిరబృంద స్యందనముల తోడఁ
గల్పాంత రుద్ర ఢక్కారావ ధిక్కారి
సముదగ్ర వాద్యఘోషములతోడ
వ్యాలోల మృత్యు జిహ్వా పల్లవాళీల
సందీప్తబిరుద ధ్వజములతోడ
గ్రీష్మ ఘర్మత్విష దీప్యమదీప్తిచ్ఛటా
కలితాస్త్ర సుభట సంఘములతోడ

వచ్చుసైన్యంబు చటుల గర్వంబుఁ జూచి
యౌవనాశ్వుండు గాఁబోలు ననుచుఁ గర్ణ
సుతుఁడు డిగ్గన లేచి చూచుచును నీపు
ద్రావనేతెంచు హరుల సందడిగఁ దెలిసి.

ఇందు శ్రీనాథుని ప్రౌఢ శయ్యా విరూఢి ప్రగల్భించినది.

5. భీమసేనునకు సమర సహాయుడుగా వచ్చిన కర్ణపుత్త్రుడు వృషసేనుడు యౌవనాశ్వుని సేన జూచి తానందుఁకు జాల ఁనని, భీముని తలపడ వలదని ప్రార్థించు సందర్భమున—

మూ : భవంతం శ్వశురం వీక్ష్య
విముఖా హి భవిష్యతి
పతాకా పల్లవ వృతం
న ముఖం దర్శయిష్యతి

అను : కరియానం బటు పాశ హస్తుఁ
బృథుశంఖగ్రీవుఁ జక్ర స్తనిన్
బరసేనారమణిన్ వరించితి
నురోభాగంబునన్ నిల్పె ని
ర్భరకేశిన్ విషమాస్త్ర చిహ్నములు సేరన్
వావి గాదింక మా
ను రణోత్సాహము నీవు,
జన్యరతిఁ గాంతు న్నే యశస్సంతతిన్.
(2ఆ-49)

నన్ను వరియించినది కారణంబు గాఁగ
దేవరకుఁ గోడలైన సేనావధూటి
సిగ్గుపెంపున మొగము వాంచినది చిత్ర
వైజయంతీ నవాంచుక వ్యాజమునను.
(2ఆ-50)

అనువాదమున భావ మందగించినది.

6. అనువాదమున గల రణరంగ వర్ణన అమూలకము. శ్లేషానుప్రాణిత ఉపమాలంకార సంశోభితము.

ప్రథమపయోరాశి పగిది నొక్కొక చోట
ఘోర కీలాల సంకలితమగుచుఁ
గైలాసశైలంబు కరణి నొక్కొక చోటఁ
గరిరాజవదన విస్ఫురిత మగుచుఁ
దార్థ ప్రతిజ్ఞాది భంగి నొక్కొకచోట
దళిత సైంధవముఖోద్దామ మగుచు
శౌరి దక్షిణ బాహు సరణి నొక్కొక్కచోట
పృథుల రథాంగాతి భీమమగుచు

నిష్ఠురాశ్మీయ కింశారునికర నిర్భి
దేశి మారాతి సైన్య ప్రతీక శకల
వితత విషమిత సంగరోర్వీ తలంబుఁ
జూచి యల్లన నగుచు నచ్చోట నిలిచి,
(2 ఆ - 55 ప)

7 కాసార తీరవిహారమున కాముక వ్యాపార పరముగా రుక్మిణీకృష్ణుల "పరిహాస పల్లవిత సల్లాపములు" మూలమునందు కంటె అనువాద మున సంక్షేపింప బడినవి. (3. 67-69).

8 వైనతేయాగమన సందర్భమున—

"కృష్ణః సస్మార గరుడం
స్మృతమాత్రః సమాగతః
వైనతేయో నమస్కృత్య
స్వనాథం చాగ్రతః స్థితః ॥

అను శ్లోకానువాదమునందు వైనతేయ ప్రశస్తి అమూలకము. పద్య మంతయు ఏక సమాస ధాటితో నడచినది. సందర్భ సుందరమైన బంధ సౌందర్య మున్నది. (5 అ. 78 ప.):

"అరుదెంచెన్ వినతా తనూజుడు
సముద్యత్ప్రౌఢారంభ ని
ర్భర జీమూత ఘటాంతరాళ
విచల ద్రాఘిష్ఠ విద్యుల్లతా
పరిపంథి ప్రథమాన దీధితి
నట త్పక్షానిలా ఘాత జ
ర్జరితోడ్డీన కులక్ష్మాధరదృష
ఝ్ఝంపా కళాసంపదన్."

9. శ్రీమండలమువారి యుద్ధ సన్నాహసంరంభమును వర్ణించు పట్టున వారి వీరశృంగార మూర్తి చిత్రణమున సాగిన రచనా విన్యాస మమూలకము. (5 అ. 111 ప.)

నెలవంక బొమలకుఁ దలకి మ్రొక్కుచునున్న
పగిది నానమిత చాపములు మెఱయ
కలికి చూపులకు భీతిలి డాగి నిలిచిన
కైవడిఁ బొదుల మార్గణము లమరఁ
గుచమండలముల కన్గొని భయం బదెడు
రీతిఁ జక్రములు పరిభ్రమింప
నలువొందు రోమావళులకుఁ గాక వడంకు
కరణిఁ బట్టెంబులు గంపమొంద
వీర శృంగారములు మేళవించినట్టి
చెలువమున నిందుముఖులు తేజీల నెక్కి
వచ్చి రాహవ మొనరింప వారిలోనఁ
బడతి యొక్కతె మున్నాడి పాఱుతెంచి.

10. ప్రమీల అర్జునునితో—

"కిం కరిష్యసి యాగేన మయా సహ మధుంపిబ"

అని పలుకును.

అను : సోమపానంబు నీ యగ్రజుం డొనర్చి
యిష్టఫల భోగములఁ బొందనిమ్ము నీవు
నిట మదీయాధరామృతం బెలమిఁ గ్రోలి
యువతి మండలమునకెల్ల నొడయ డగుము.
(5 అ. 117 ప.)

11. బభ్రువాహనుడు జ్వాలాభిధాన శర సంధానము చేసిన సందర్భము—

నెత్తురు వర్షించె నీరదంబులు వీచె
శర్కరాభీల ఝుంఝూ మరుత్తు
విరివిగాఁ గప్పెఁ గావిరి దిగంతముల సం
గ్రామ భూస్థలి మూడు వ్రయ్యలయ్యె
రాలె నుల్కా సహస్రము లెల్లెడల నిల్చి
ధట్టించె భూత బేతాళ గణము
పొగలేక యాయుధంబులు మండె నుజ్జ్వల
ప్రతిసూర్య మండల ప్రభలు వెలిగె

బభ్రువాహనుండు పాండవ మధ్యమ
ప్రాణ హరణ నిష్ఠుర ప్రచార
జాగ్ర దుగ్ర శరధి సంచిత జ్వాలాభి
ధాన శరము వింటఁ బూనుటయును.
(7 అ. 44 ప)

ఇందులకు మూలము—

తత శ్చకంపిరే దేవాః
శక్రాద్యాః పితర స్తథా
సూర్యాదయో గ్రహాః సర్వే
భుజంగా శ్చ భయావృతాః

ద్విధా భిన్నా ధరాదేవీ,
ఉల్కానాం పతనం తతః
వవౌ సశర్కరో వాయూ
రుధిరం వవృషు ర్ఘనాః.

అనువాదమున అభిప్రాయమును గుఱించిన మూల ప్రపంచన మున్నది. అదియు ఆ రచనావై చిత్రియు ఆ సన్నివేశభీషణత్వమును మఱింత పరిస్ఫురింప జేసినవి.

12. వృద్ధ వేశ్యాజనమును జూచి వాసుదేవ భీమసేనులు గావించిన హాస్యప్రసంగము మూలమున కంటె ( XI. 5-7 ) అనువాదమున చక్కగా అన్యథాకరింపబడినది :

"వీరిఁ బరిగ్రహింపు మిది
వేళ సమానలు నీకు భీషణా
కార కఠోర మన్మథ
వికారగుణంబుల నన్న వవ్వి య
మ్మారుతి పల్కె నిట్టి కొఱ
మాలిన జంతలఁ జక్కఁబెట్ట నీ
భారము, వన్నెకెక్క దురవస్థలు
నీ కరలాలనంబునన్.

(3-63)

13. శ్రీరామునితో వాల్మీకి యన్నట్లుగా—

"తవ పుత్రౌ మహారాజ!
గృహ్యాతాం రఘునందన
మన్యసే యది సీతాంచ
నిర్దోషాం నేతు మర్హసి"

అవి యన్న యొక్క మూలపంక్తిని పట్టుకొని పదుమూడు పద్యములలో (6-245-257) నరసాగినాడు పినవీరన. ఆ పద్యములందు ఆర్ద్రహార్ద భావము లిరవుకొన్నవి.

14. అనువాదమున గల 7.55 వ పద్యమమూలకము. చిన్న శ్లేష చమత్కారమిందున్నది. ఇట్లు శ్రీనాథ యుగమున తెలుగు వాఙ్మయమున సకృత్పతితమైన హాస్యము ప్రబంధయుగమున ప్రగల్భించినది.

15. మణిపురమున ప్రవేశించిన కృష్ణుని మాయా విప్రరూపము వర్ణన (7.197) అమూలకము. అతిమాత్ర మనోజ్ఞమైన స్వాభావిక చిత్రణ మిందు సాగినది :

కటిఁ బ్రాఁతముతుక నీర్కావి దోవతి పంచె.
ఫాలమధ్యమున నూర్ధ్వ పుండ్రకంబు,
వక్షః స్థలమునఁ బద్మాక్షమాలిక, కర్ణ
బిలమున నులివాడు తొడసి యెన్ను,
నంస భాగంబున నాయవారపు సంచి,
దోర్మూలమున నిట్టతోలు సజ్జ,
కుడితరంబున నబుగుడు వేణుదండంబు,
గూని వీఁపునఁ బంపి గొడుగుఁ దరక

తనకు నలవడ వృద్ధవిప్రుని విధంబుఁ
దాల్చుటయుఁగూర్మి సఖుఁడు సుత్రామసుతుఁడు
బ్రహ్మచారియై తనవెంట రా మురారి
రత్నసగరంబు సొచ్చె పూర్వ త్రియామ.

శృంగార శాకుంతలము నందొక వృద్ధముని వర్ణన మిట్లున్నది (2.29). శ్రీనాథుని హరవిలాసమునను నిట్టి వర్ణన యొకటున్నది (7.12) యథావద్వస్తు వర్ణనా చారువు లీ సందర్భములు గావుననే యిట్టిపట్ల స్వభావోక్తి అలంకార మనిపించుకొన్నది. యథార్థ జీవితరంగమున నిట్టి దృశ్యములు మన కుపాదేయములు గాకున్నను కావ్యరంగమున మెచ్చుకోల్పుచున్నవి. ఇదే కళా మర్మము, ధర్మము. కళ అనుకరణమేగాని యథార్థము గాదుకదా.

16. మణిపురమున పురుషాయితగోష్ఠులందును పురుషోత్తమ ప్రశంసలు వచ్చుచుండునట!

సురతసుఖంబులన్ మిగులఁ
జొక్కుచు నొక్క విటుండు కాంత! నీ
కురులకుఁ గృష్ణవర్ణమును
గుంకుమ గుబ్బల కచ్యుతత్వమున్

దొరకె ననన్ నిజేశ కర
తోయ రుహంబుఁ దెమల్చి నిన్ను నీ
కరముల శంఖచక్రములు
గా పురుషోత్తముఁ జేసె నావుడున్.

ఇట మూలము తీరు వేఱు. అనువాదమే సుందర తరము. ఇందలి శ్లేషాను ప్రాణిత ధ్వని రసిక మనోభిరామము.

పూర్వోక్త సందర్భములను బట్టి కావ్యత్వ సంపాదనార్థము పినవీరన మూలాభిప్రాయములను అందముగా మలచుకొని ప్రపంచించుట యందును, వర్ణనాది సందర్భములందు మూలాతిక్రమణ రమణీయముగా విజృంభించుట యందును అభినివేశము చూపినట్లు స్పష్టము.

సంస్కృత జైమిని భారతమును పురాణములలో అపూర్వమైన దానినిగా పినవీరన పేర్కొనెను. తన గ్రంథమును మాత్రము "హృద్యానవద్య గద్య పద్యాను బంధమగు ప్రబంధంబు" అని వక్కాణించెను మనకు పదునారు కళల ప్రబంధచంద్రుడుదయించినది రాయల యుగమందైనను ఆ ప్రబంధయుగ ప్రస్తావన జరిపినది శ్రీనాథయుగమే. పినవీరన శృంగార శాకుంతలము నందలి ప్రబంధ స్వభావ సౌందర్యము గూర్చి మీద ముచ్చటింప బడినది. ఇక, జైమిని భారతమునకు కడమ ప్రబంధ లక్షణము లన్నియు పట్టకపోయినను అందొక నిండైన ప్రబంధశయ్య నెలకొనియున్నది. అది నన్నయ తిక్కనల రౌచిక శయ్యా రసాభ్యుచిత బంధ రాజమార్గములే తీరములుగా ప్రవహించిన శ్రీనాథుని పద ప్రసిద్ధ ధారాధుని యందు మునిగి పునీతమైనట్టిదే.

ఉదా : 1.

అంగ వల్లులకుఁ బర్యాయంబులైన క్రొ
వ్వలపుఁ దీగలు వంచివంచి మాని
హస్త పల్లవముల కభిధాంతరము లైన
కిసలయంబులు గిల్లిగిల్లి మాని
కుచగుచ్ఛములకు విచికిత్సలైన పూ
గుత్తు లబ్బున కోసికోసి మాని
యధరామృతములకు నామ్రేడితము లైన
తేనె లింపున నాని యాని మాని

మదనమంజరి మానినీ మణులుఁ దాను
వనవిహారంబు చాలించి చనియెఁ బురము
త్రోవఁబట్టి పదంబులు తొట్రువడఁగ
నధిపుఁ బెడబాసి చతురంత యానమునను"
(4 ఆ. 10 ప.)

ఇందలి "పర్యాయంబు లైన" "అభిధాంతరము లైన" "విచికిత్సలైన" "ఆమ్రేడితములైన" మొదలగు పదబంధములతో ఆ రచనా విన్యాసము నట్లు పరిఢవించుట శ్రీనాథుని యొడుపులలోనొకటి. ఇందలి 2-14, 5-79, 5-3 మున్నగు పద్యములును శ్రీనాథ సంఘటన కళాసనాథములు. ఆ మొదటి రెండుపద్యములు నుదాహృతపూర్వములు.

2. ఎట్రా శేషుఁడు పోతరించి సభ న
న్నెగ్గాడెనా ? రత్న మీఁ
దట్రా వాసుకి ? తక్షకాది ధృతరా
ష్ట్రామాత్య కర్కోటకుల్
చట్రా నిల్తురుగాక నన్ను సమర
క్షోణీ విజృంభించి యా
గట్రాచూలివిభుం డెదిర్చిన
నహంకారంబు వారించెదన్"
(7 అ, 92 ప)

బభ్రువాహనునిచే అనిఁ ద్రెళ్ళిన అర్జునుని పునర్జీవితు గావించుటకు సంజీవమణ్యర్థము శేషుని కడకేఁగిన పుండరీకుడు తిరస్కృతుడై రాగా "కఠోర క్రుధా వేల్లద్భ్రూకుటి మండలుండగుచుఁ జేవిల్లంది" కార్ష్ణి పలికిన పలుకులివి. రౌద్రరసాభ్యుచితబంధ సుందరమైన రచన యిది.

ఇట్లు ఎక్కడ పట్టి చూచినను "రయవిచల తురంగమ" మీతని రచన.

ఇందవకాశ మున్నంతలో అసమానమైన భావ సంపదను రసదృష్టిని ప్రకటించినాడు పినవీరన. ఇందులకు భీమపాత్రచిత్రణ మొక తగినతార్కాణ. ఆతడొక గొప్ప కృష్ణభక్తుడు :

"అరసి భవత్కరాంబురుహ
మందొక టిడ్డను గోటికొండలై
పెరుగుటఁ జేసి దుష్కృతముఁ
బెట్టఁగఁ గూడదు నీ కరంబునఁ
నరపతి యశ్వమేధ సవనం
బొనరించిన నాఫలంబు నీ .
కరకమలంబునందు నిడఁ
గానికగా నది గాంచు నున్నతిఁ."
(1-132)

ఉత్తమ మనస్వి :
ఏచిన యాగ్రహంబు సహి
యించి భవజ్జనకున్ కఠోర నా
రాచ పరంపరల్ గొని దు
రంబునఁ గూల్చిన నాటనుండియున్
ద్రోచిన శోకవేదనల
తోడ కుమారక నీ ముఖాబ్జముఁ
జూచిన యప్పుడెల్ల మది
చుట్టను తీఱని లజ్జపెంపునఁ"
(1-89)

సరసాలాప చతురుడు :
"అనఘ నీవానతిచ్చిన యట్ల మిగులఁ
దుందిలుండను బహ్వాశి దుష్ట రాక్ష
సీరతుండను నగుదు జర్చించి చూడ
దేవరకు నట్టి గుణములు లేవు గాన."
(1-125)

మొదల నత్యంత కాముకుఁడ వౌటకు గొల్ల
యిల్లాంద్ర గుబ్బ పాలిండ్లు సాక్షి
అతినీచరతిశీలి వగుటకుఁ బాతీన
కమఠ సూకర విగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండ కోట్లును
బూరింపలేని నీ బొజ్జ సాక్షి
స్త్రీలోలు డగుటకుఁ దైలోక్యము నెఱుంగ
ధరకుఁ దెచ్చిన వేల్పుతరువు సాక్షి

జడ సముత్సాహి వగుటకు జలధిసాక్షి
వామనుడ వగుటకు బలీశ్వరుడుసాక్షి
మందమతినౌట నది మఱపొందెఁగాక
నరవి పేర్కొన తరమె నీ నటలు కృష్ణ !"
(1-126)

"తల్లి చన్నుల పాలు ద్రావి యంతటఁబోక
పూతన బొరిగొంటి పురిటిలోన
జనని యగ్గునఁ దృప్తి సనక నిన్నఁటిదాక
వెరఁజితి ద్రేపల్లె వెన్న లెల్ల
నంబ పొత్తునఁ దనియక వెక్కసంబైన
యుదరాగ్ని నార్చి తింద్రోత్సవమున
జనయిత్రి యొసగు భక్షణము చాలక తింటి
వా కుచేలునిచేరి యటుకు లొడిసి

కడుపులోపల సకలలోకములు వరుసఁ
గూర్చుకొన్నప్పుడును నఱగొఱతగాని
తుష్టదపు గావు నీదుపొత్తున భుజింపఁ
దీరునే నాకు ఘనమైన దీపనంబు ?"
(3-53)

ఇట్టి సరస సందర్భము లితరములు :

వృషకేతుని సౌమనస్యము (1ఆ-90,95ప), ఆహవోత్సాహము (2ఆ.49, 50ప.); ఇందిరా వల్లభునకు "ప్రియుల సన్నిధి నర్మగర్భితము కాగ ప్రౌఢ గోపాంగనలు తమ ప్రాఁత వలపు వెల్లివిరి చేసిన"విధము (3ఆ.76ప.); ధర్మజుని విషాదము (1ఆ-56 నుండి 60ప); మదన మంజరి వన విహారము (4ఆ-10ప.); స్త్రీమండలవృత్తాంతము (5ఆ-111, 117, 120). కౌసల్య మాతృ హృదయ మర్మము (5ఆ-7ప.).

ఆ యీ సందర్భములందలి కొన్ని పద్యము లుదాహృతపూర్వములు. కళాసౌందర్య కమనీయ

మైన కవిహృదయము నాకళించుకొనుటకు ఒక తగిన సందర్భము :

దీక్షితుఁడైన కౌశికుఁడు
దేరఁగ నాఁడు వివాహవేళ నా
లక్షిత కాక పక్ష సమ
లంకృతమున్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణ
బింబ నిభంబు విశాల పుండరీ
కాక్షము నైన రాముని
ముఖాంబుజ మెన్నఁడుఁ బాయదాత్మలోన్.
(6–72)

ప్రథమసందర్శనమున సీతాహృదయమున స్థిర ప్రతిష్ఠితమైన శ్రీరామ చంద్రుని రూపధేయ రుచి రత్వమంతయు ఈ పద్యమున ప్రతిష్ఠింపబడినది. నన్నయగారి రౌచికరచనలోని సున్నితపు విన్నాణ మీ పద్యమున పొడుకొన్నది. ఇతఃపూర్వ ముదాహృతమైన శృంగారశాకుంతలము నందలి దుష్యంత స్వాంత ప్రతిష్ఠిత శకుంతలా సౌందర్యవర్ణనమును (2–161) నిట్టిదే. అయితే జైమినిభారతము నందలిది మూర్తిచిత్రణము; శాకుంతలమునందలిది అవస్థాచిత్రణము.

పినవీరన రమ్యవస్తు వర్ణనమున ఎంత ప్రవీణుడో జుగుప్సిత వస్తువర్ణనమునను బీభత్స భయానకరసభావముల రమణీయ చిత్రణమునందును అంత ప్రవీణుడు.

ఉదా: బ్రహ్మరక్షస్సు మూర్తిచిత్రణము:

అఱుత యజ్ఞోపవీ తాంత్ర గుచ్ఛంబులు
వఱలు నెత్తురు పట్టె వర్ధనంబు
మనుజ కపాలాక్షమాలికా వలయంబు
చర్మకాషాయ వస్త్ర ద్వయంబు
గరటి విస్ఫార కర్పర కమండలువును
వ్రేలను గర్ణ పవిత్రకమును
గరమునందుఁ బురాణ కంకాళ యష్టియు
నలర మేదోహోత యనెడు పేరి
వాఁడు దనుజ పురోహితవర్యుఁ డచటి
కరుగుదెంచిన యజ్ఞవాహంబుఁ జూచి
వచ్చి కొలువున్న దానవేశ్వరునిఁ గదిసి
సన్నుతోక్తుల నిట్లని విన్నవించె. (5–129)

స్వభావోక్తి సుభగమైన మూర్తి చిత్రణము నందు అముక్తమాల్యద యందలి బ్రహ్మరక్షస్సు ఈ మేదోహోత వారసుడే.

ఈ గ్రంథమున యుద్ధప్రసక్తి పలుమరువచ్చును. తిక్కనవలె పినవీరనయు ఒక్కొకచో ఒక క్రొత్త ఒడుపు చూపి రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత రసభావములను భావకూలంకషములుగ ఆవిష్కరించెను.

ఉదా :

1. యౌవనాశ్వ సైన్యవర్ణన–2-14 (ఉదాహృతపూర్వము)

2. మేఘవర్ణుని మాయాసమరము—2-28

3. సంక్షుభిత సైన్యమునకు ఘూర్ణితార్ణవ సామ్యము—2-33

4. రణరంగవర్ణన — 2-55 (ఉదాహృత పూర్వము)

5. భీముని దారుణ ప్రియదర్శనమైన విజృంభము—2.76-78

6. సైన్యమునకు శ్రీత్వారోపము–1.49-53 (49, 50వ పద్యము లుదాహృతపూర్వములు.)

7. స్కంధావారము—3.66

8. బభ్రువాహనుని జ్వాలాశరసంధానమునకు ప్రకృతి సంక్షోభము–7.44(ఉదాహృతపూర్వము)

9. ద్వంద్వయుద్ధము—7.175

10. లవుని విక్రమాటోపము—6.170

(ఈ పద్యమున భయభ్రాంతులైన శత్రుసైనికుల కలవరము మాత్రమే వర్ణితమైనను అది లవుని లోకోత్తర పరాక్రమాటోపమును పటిష్ఠముగ వ్యజ్యమాన మొనర్చుచున్నది.)

జైమిని భారతమున సంవాదసందర్భములును తఱచు. పినవీరన సంవాదములను పాత్రస్వభావ జీవస్యందులుగా, కథకు నాటకీయరక్తి నెసకొల్పుచు, సందర్భోచిత శయ్యాసౌష్ఠవముతో తీర్చి దిద్దెను.

ఉదా ;

1. వ్యాసధర్మజుల సంవాదము— 1.56-59, 64
2. భీమసేన వృషకేతుల సంవాదము— 1.89-95; 2.48-51
3. కృష్ణభీముల సరసాలాపములు— 1.125-133; 3.63
4. రుక్మిణీ కృష్ణుల సరసాలాపములు — 3.67-69
5. సీత లక్ష్మణునితో—6.70-74

ఉపరి సందర్భములందలి పద్యములు కొన్ని యుదాహృత పూర్వములు. ప్రకృత మీతని సంవాద ఘటనా చమత్కార నిరూపణార్థము ఒక రెండు సందర్భములు :

1. యుద్ధముచేయ నేతెంచిన పార్థుని ప్రమీల మాన్మథ యుద్ధమున కిట్లుసికొల్పుచున్నది.

రణమున నాదు భీకర
శరంబులనైన లసత్కటాక్షవీ
క్షణములనైన నిన్నిపుడు
చంపుట తప్పదు రిత్త చావఁగా
రణమది యేల నన్ను
రతిరాజ సుఖంబులఁ దేల్చి తీఱినన్
గణనకు నెక్కఁ బావక
ముఖంబున నీబడి నేఁగుదెంచెదన్.

(5.120)

ఇందు సహగమనాచార ప్రసక్తి ఉండుట గమనింప దగును.

మఱియొక చమత్కారము :

రజకి యొకర్తు నాథుఁడు
తిరస్కృతిఁజేసినఁ బుట్టినింటికే
గ జనకుఁ డాత్మజం గని
జగజ్జనగాత్ర మలీమసాంశుక
వ్రజములు శుద్ధిసేయు నిజ
వంశము మైల వడంగఁజేసి తిం
టిజగడ మింటిలోనె
హవణింపక నీవిటు లొంటి వచ్చుటన్.

(6.28)

ఈ జైమిని భారతమున ఒక్కచో ముక్తపద గ్రస్తము (2.115), ఒక్కచో పాదభ్రమక యమకమును (8-221), అవియు ఆశ్వాసాంత సందర్భములందే, గలవు. శ్లేష సందర్భోచితముగా సకృత్ప్రతితమైనది. (2-49, 2-55, 6-59, 7-55). ఏవంవిధ శబ్దాలంకారముల ప్రయోగములు, శ్లేషవిన్యాసములు శ్రీనాథయుగమున అరుదుగా కనిపించినవి, ప్రబంధయుగమున ప్రాచుర్యము వహించినవి.

ఇందనేకములు తెలుగు జాతీయములు, లోకోక్తులు, అపురూపములైన తెలుగు ధాతువులు, సంస్కృత సూక్తులు సందర్భసుందరముగా చోటు చేసికొన్నవి :

జాతీయములు :

1. హెచ్చిన శోకము మదిలో నచ్చిన లాదింగ ననియె (1-55)
2. రాజవంశమున్ గూకటివేళ్లతోఁ బెఱికి (1-64)
3. గోరుచుట్టుపై రోకటిపోటు చందముగ (1-64)
4. అపార సుదక్షిణలంది తెప్పలందేలి (1-66)
5. విత్తము వెక్కసంబుగా మూలుగుచున్న దిప్పుడు (1-66)

6. పడిచి కూర్చుండి (1-68, 2-108)
7. ఆజుల ముక్కాకల నారితేజిన మహా శూరుల్ (1-87)
8. నీముఖాబ్జమున్ జూచినయప్పుడెల్ల మది మజ్జను దీఅనిలజ్జపెంపునన్ (1-89)
9. నీ వ టు దండగోలగుచు నిల్చినఁజాలు (1-100)
10. భ క్తజనులకు ముంగొంగు పసిఁడిగాడె దేవతారత్నమీవాసుదేవుఁడనఘ (1-116)
11. అ త్తయు మామయు మగఁడును గ త్తుల బోను లయి (3-33)
12. అందఱు గ్రచ్చగదలినట్లు గుచ్చాకరిగొని తిట్టన్ (4.72)
13. తేనె తలపడఁబండె ధాత్రీతలంబు (6.9)
14. చెక్కుమీటిన వసవల్చు శి శు వు లెదురె (6.245)

శృంగార నై షధావతారికలో శ్రీ నా థు ని ప్రయోగము :

'చెక్కు గీటినవసవల్చు బాలకుడు డెందమునం గలగంగ నేర్చునే ?'

15. తిరిగి యాతండు వచ్చిన తెరువుఁ బట్టి (7.89)
16. తోడు తొన యైన చుట్టంబు దొరకుటెట్లు (1.195)
17. ఆవంక పోతుటేఁగవున్నైనఁ బొలయరాదు (1.84)
18. బ్రహ్మకమిచ్చి (4.87)

లోకోక్తులు :

1. పిసిఁడి యర్థము గూడబెట్టినట్లు (1.84)
2. చింతామణి విడిచి గవ్వ చేకొనుభంగిగా (1.91)
3. వేము వెగ్గలము పెరుఁగఁగలదె మాధుర్య గుణము తి క్తంబ కాక (4.86)
4. ......రేగుబండ్ల కొఱకు ము త్తియంబులు వెలపోయు ములుచ గలఁదె ? (5.55)
5. సురగాలింబడిన చొప్పు చొరగును బోలెన్ (5.83)
6. రెంటికిని జెడ్డ రేవని రీతియయ్యె (4.87)
7. అయస్కాంత మినుము జెందిన మాడ్కి (7.156).

ధాతువులు :

వేంచేయు (పుట. 27); వెరజు (పుట 80; శ్రుం.శా.లోను II. 186 లో గలదు); ఎలనగుచు (160), ఎలనవ్వుచు (241); హవణించుఁ (182); అంగవించు(227). వసవల్చు(227), పొకాలు (279) మున్నగు నపురూపములైన తెలుఁగు ధాతువు లిందు ప్రయోగింపబడినవి.

తనకృతి 'తెనుఁగు నుడికారమున మించుగనిన' కృతియని ముందే సూచించినాడు పినవీరన. కొన్ని సంస్కృత ధాతువుల వాడకమునను వై శిష్ట్యము చూపినాడు. ఉదా : పరిణమించు (1.102); అహ మించు (2.43); (చంపూ శబ్దమునకు 'జంబూ' శబ్దము పర్యాయ వాచకముగా వాడినాడు చూ. అవ తారిక 10 వ పద్యము).

సంస్కృతసూక్తులు :

1. అగ్నిముఖా వై దేవాః (4.41)
2. స్త్రీబుద్ధిః ప్రళయాంతకః (4.57)
3. అభ్యాగతః స్వయం విష్ణుః (7.208)
4. అటవ్యాం నారసింహః (7.210)
5. దుర్బలస్య బలం రాజా (7.214)

విశేషములు :

ఇందు కోలాటము, కోలాటపాత్రలు, కీలుబొమ్మలు (2-82), "సోశాదొప్పి" అను ద్యూతము (3-42), గడియారము (1-2), భో జ న ము (3-50; 8.198-204), జారస్త్రీ లక్షణము

(8-28-37), సహగమనము (7-63), అరిష్ట లక్షణములు (6.98-102), దుస్స్వప్నములు (8-103), మున్నగు విషయములు ప్రసక్తము లైనవి. ఇవి పినవీరన లోకజ్ఞతకును, నీతిజ్ఞతకును నిదర్శనములు.

జైమిని భారతమును వచనకావ్యముగా సంతరించిన సముఖము వెంకటకృష్ణప్పనాయకుడు సంస్కృతమునుండి అనువదింప సమర్థుడయ్యును అట్లు చేయక పినవీరన కృతిని బాహాటముగా అనుసరించి యుండుట చూడ అది పినవీరన కృతిప్రాశస్త్యమును నిరూపించును.

పినవీరనకృతి అనువాద గ్రంథమైనను శృంగార శాకుంతలము వలె ఇదియు నితని నిపుణోపజ్ఞకు నికషోపలము. మన ప్రాచీనాంధ్ర కావ్యము లనేకము సంస్కృత మాతృకలకు మానస పుత్త్రికలే కాని ఆ కవిత్రయ శ్రీనాథ పోతనాదులను కవి జగజ్జైవాతృకులుగా పరిగణించుచున్నాము. ఆసంస్కృత సారస్వత నిధి నిక్షేపములను భారతీయ సంస్కృతి భండారములను తెనుగునకు తెచ్చుటయే మాతృభాషకు తా మొనర్పగల మహోపకారమని భావించిన వారగుటయే వారు అట్లు చేయుటకు కారణముగాని ఉపజ్ఞ చాలమి కాదు. ఆ యనువాదములే వారి ఉపజ్ఞ కెత్తిన పతాకలును. అవి సంస్కృత దీపముల వలన వెలిగిన తెలుగు దివ్వెలే. ఐనను ఏదివ్వె వెలుగు దానిదే.

ఆ పూర్వమహాకవిరాజమార్గమున పయనించిన పినవీరనయు కవితా ప్రతిష్ఠయందు వారికి తరువాతి వాడే కానచ్చును కాని అర్వాచీనులు కొందఱి కనుకార్యుడైన యాతడు వారందఱికిని కవిత్వ విషయమున తరువాతివాడనుట యొప్పదు. ఆంధ్ర సాహిత్యశారదకు ఈతని కృతులు శిరోభూషణములు కాక పోవచ్చును. కాని పాదాంగదమాత్రములుగావు మఱి "విభ్రమ శ్రవణ కల్హారోదయామోదములు".

డా. చేకూరి రామారావు

# భాషాశాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం

## పూర్వరంగం

1933 లో ప్రచురితమైన Bloomfield 'Language' భాషాశాస్త్రాభివృద్ధిలో ఒక మైలురాయి. అప్పటినుంచి దాదాపు 1960 వరకు భాషాశాస్త్రంలో బ్లూమ్‌ఫీల్డుయుగం అనవచ్చు. ఈ యుగంలో Bloch, Harris Hockett మొదలైన వారు ప్రసిద్ధులైన భాషా శాస్త్రజ్ఞులు. వీరి కాలంలో భాషా శాస్త్రం ఒక శాస్త్రంగా నిలదొక్కుకుంది. మిగతా సాంఘికశాస్త్రాలు అసూయ పడేంతగా శాస్త్రీయతను సంతరించు కున్నది. ఈ కాలంలో వచ్చిన వ్యాకరణాలు అతివ్యాప్తిలేకుండా భాషలను వర్ణించటానికి ప్రయత్నించినై. ఒకభాషా వ్యాకరణంలో వచ్చే నామక్రియావ్యయాదులు ఆభాష ననుసరించే నిర్వచింపబడుతూ వచ్చినై. ఈ కాలంలోనే వర్ణం (Phoneme), పదాంశం (Morpheme), అవయవి (construction) మొదలైన మాటలకు సూటిఅయిన నిర్వచనా లియ్యటానికి ప్రయత్నాలు జరిగినై. అపరిచితాలయిన ఎన్నో భాషలకు వ్యాకరణాలు రచితాలయినై. ఈ వ్యాకరణాలు భాషలనుగురించి మన జ్ఞానం విస్తృతం చేసినై. ఈ పరిణామాలన్నీ అమెరికాఖండంలో ఎక్కువగా జరిగినై. ఆమెరికాఖండం భాషాశాస్త్రానికి ఒక పరిశోధనాగారం వంటిది. ఇప్పటి చాలామంది అమెరికన్ శాస్త్రజ్ఞులు ఏదో ఒక అమెరికన్ ఇండియన్ భాషమీద పరిశోధన చేసినవారే. వందల సంఖ్యలో ఉన్న ఈ భాషలమీద జరిగిన పరిశోధన భాషాశాస్త్రాభివృద్ధికి దోహదం చేసింది. సాధారణంగా ఈ పరిశోధన ఇట్లా ఉండేది.

ఒక పరిశోధకుడు ఒకభాషా వ్యవహర్తతో మాట్లాడుతూ అతని దగ్గర్నుంచి కొన్నివాక్యాలు సేకరిస్తాడు. దీన్నే corpus అంటారు. ఈ వాక్యాలను టేపురికార్డరు ద్వారా సేకరించవచ్చు. వీటిని వేరే కాయితాల మీద ధ్వనిలిపి (phonetic script) లో రాసుకుంటాడు. ఆ తరవాత ఈ ధ్వనులను వర్ణ సమూహంగా వేర్పాటు చేసుకుంటాడు. ఆతరవాత పదాంశ నిర్ణయం, అవయవి నిర్మాణం మొదలైన వాటిని కనుక్కుంటాడు, వీటినన్నిటినీ వ్యాకరణరూపంలో గ్రంథస్థంచేస్తాడు. ఈ లోపల సందేహాలు వచ్చినచోట మళ్లీ ఒకసారి వ్యవహర్తను సంప్రదించ వచ్చు. పరిశోధకుడు తాను సేకరించిన వాక్యాల నన్నిటినీ వ్యాకరిస్తాడు. తరచుగా ఈ వ్యాకరణం ఆసేకరించిన వాక్యాలకే పరిమితమై ఉంటుంది. అప్పటివ్యాకర్తల లక్ష్యం విషయ బాహుళ్యం కాదు. శాస్త్ర సంక్షిప్తతే (scientific rigour) వారి ప్రధాన లక్ష్యం.

దాదాపు పాతిక ముప్ఫై సంవత్సరాల పాటు ఈ పద్ధతి అవిచ్ఛిన్నంగా సాగింది. అయితే ఈ పద్ధతిలో కొన్ని మూఢ విశ్వాసాలు కూడా బయలుదేరినై. పరిశోధకుడు తాను సేకరించిన వాక్యాలనుదాటి ఏమీ చెప్పలేడని, వ్యాకరణంలో వర్ణవిభాగం, పదవిభాగం, వాక్యవిభాగం వేరువేరుగా ఉండాలని, వర్ణ నిర్ణయానికి పదాంశ, వాక్య నిర్మాణాలతో సంబంధమే లేదని, భాషల మధ్య భేదం అపారంగా ఉంటుందని, నామాలు అవ్యయాలు విశేషణాలు వంటి వాటిని ఏభాష కాభాషకే విడివిడిగా నిర్వచించాలని, భాషకు భిన్నప్రయోజనాల్ననుసరించి బిన్నవ్యాకరణా లుండ వచ్చునని, వాటిలో ఒకదానికంటే ఇంకొకటి మేలైనదని చెప్పటానికి మనకి హక్కు లేదని, వ్యవహర్త

మాట్లాడిందంతా వ్యాకరణ సమ్మతమేనని, అవన్నీ వ్యాకరణ విషయాలే నని; వర్ణాలను, పదాంశాలను, అవయవులనూ కొన్ని నిర్ణీతపద్ధతు ల్ననుసరి స్తే కనుక్కోవచ్చునని; ఆ పద్ధతులను కనిపెట్టటమే భాషాశాస్త్రలక్ష్యమనీ అప్పటి శాస్త్రజ్ఞు లనుకున్నారు. ఈ నమ్మకాలు అప్పటి శాస్త్రజ్ఞుల కందరికీ ఉన్నయ్యని కాదు. అప్పటి శాస్త్రజ్ఞుల్లో బహుళ వ్యాప్తిలో ఉన్న నమ్మకాల్లో పైవి కొన్ని. వీటిలో కొన్నిటిని అప్పుడప్పుడు వ్యతిరేకించినవారు లేకపోలేదు.

వర్ణనిర్ణయానికి వ్యాకరణంలో ఇతరభాగాల అవసరంఉందని Pike ప్రతిపాదించాడు. పరిశోధకుడు సేకరించిన వాక్యాలను edit చేసుకో వలసిన అవసరముందని Hockett గుర్తించాడు. అయినా మొత్తంమీద ఆ కాలపు శాస్త్రజ్ఞుల్లో పైన పేర్కొన్న నమ్మకా లుండేవి.

ఛామ్స్కీ విప్లవం

వీటన్నిటిమీద Noam Chomsky అనే ఆయన తిరుగుబాటు చేశాడు. ఈయన Zellig Harris అనే ఆయన శిష్యుడు. అప్పటికే Harris వాక్యాల పరస్పర సంబంధాన్ని వ్యాకరణం నిరూపించాల్సిన అవసరం ఉందని గుర్తించి అదేవిషయంమీద పరిశోధనచేస్తున్నాడు. కొన్నాళ్లు వీరిద్దరూ కలిసే పరిశోధన చేశారు. 1955 లో Harris పర్యవేక్షణ కింద 'The logical structure of linguistic theory' అనే సిద్ధాంత గ్రంథం రాసి డాక్టరేటు పొందాడు. అందులో కొన్ని అభిప్రాయాలను సంగ్రహించి 1956 లో Three models of grammatic description అనే వ్యాసంగా ప్రకటించాడు. ఈ అభిప్రాయాలను ఇంకా స్త విశదీకరిస్తూ 1957 లో Syntactic structures అనే చిన్నపుస్తకం ప్రకటించాడు. ఈ పుస్తకం భాషాశాస్త్రంలో కృషి చేస్తున్న పరిశోధకులను త్వరగా ఆకర్షించింది. అప్పటినుంచి ఇప్పటివరకూ ఎన్నో పుస్తకాలు, వ్యాసాలు రచించాడు. ఆయన అభిప్రాయాలు కూడా కాలంతోబాటు క్రమపరిణామం పొందుతూనే ఉన్నై. 1965 లో ప్రచురించిన Aspects of the theory of syntax అనేగ్రంథంలో భాషాశాస్త్రలక్ష్యాలను గురించి, వ్యాకరణ ప్రణాళికను గురించి విపులమైన చర్చ ఉంది. ఈ గ్రంథాల్లో ఆయన అప్పటివరకూ భాషాశాస్త్రంలో పాతుకుపోయిన విశ్వాసాలను తీవ్రంగా ఖండించాడు. భాషాశాస్త్ర లక్ష్యాలను పునర్నిర్వచించాడు. భాషాశాస్త్ర ప్రవాహగతిని ఇంకోవైపు మళ్లించాడు. దీన్ని భాషాశాస్త్రంలో ఛామ్స్కీ-విప్లవం (Chomskyan revolution) అంటారు. ఇతరశాస్త్రాల్లో న్యూటన్, ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్, పావ్లావ్, మోర్గన్, కారల్ మార్క్స్ వంటి శాస్త్రవేత్తలకున్న గౌరవమే ఛామ్స్కీకి భాషాశాస్త్రంలో ఉంది. వీరందరూ ఆయా శాస్త్రాలను ఒక అడుగు ముందుకి వేయించిన వాళ్లే.

ఇంతకుముందు భాషాశాస్త్రం ఇతర శాస్త్రాలనుంచి ఎక్కువగా విషయగ్రహణ చేస్తుండేది. ఛామ్స్కీ అవతరణతో భాషాశాస్త్రం ఇతర శాస్త్రాలను ప్రభావితం చెయ్యగలిగింది. ముఖ్యంగా తత్త్వశాస్త్రం మీద. మనస్తత్త్వశాస్త్రంమీద ఈయన అభిప్రాయాల ప్రభావం అపరిమితంగా ఉంది. మానవ వర్తన, ఇతర జంతుజాలాల వర్తనల మధ్య గుణాత్మకమైన (qualitative) భేదం ఉందని, ఇతర జంతువుల వర్తనమీద చేసే పరిశోధన మానవ వర్తన గురించి చెప్పలేదని, ఈయన ప్రతిపాదించిన సిద్ధాంతం మనస్తత్త్వ శాస్త్రంలో కూడా సంచలనాన్ని లేవదీసింది. ఛామ్స్కీకి గణిత (mathematics), తర్క (logic), తత్త్వ (philosophy), మనస్తత్త్వ (psychology) శాస్త్రాల్లో విశేషమైన పాండిత్యముంది. 1967 నుంచి ఈయన రాజకీయ విషయాలమీద కూడా పరిశోధన వ్యాసాలు రాస్తున్నాడు. ఇవి Liberation, Ramparts, The New York Review of Books, Link వంటి పత్రికల్లో అచ్చయినై.

ఈయన రాజకీయ వ్యాసాలన్నీ కలిపి American Power and New Mandarins అనే పేరుతో 1969లో పుస్తకరూపంలో వచ్చింది. ఈవ్యాసాల్లో ఆయన అమెరికన్ సామ్రాజ్యవాద విదేశాంగవిధానాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నాడు. ఈనాటి ప్రపంచానికి ప్రమాదం చైనానుంచి కాదని, అమెరికన్ సామ్రాజ్యవాదంనుంచేనని నిర్మొహమాటంగా ప్రకటించాడు. వియత్నాం, క్యూబా వంటి దేశాల్లో ప్రభుత్వం జోక్యాన్ని నిరసించాడు. 'Scientific expertise' అనేదే ఉండటానికి వీల్లేని రంగంలో experts గా చెలామణి అవుతున్న ప్రబుద్ధులు అమెరికన్ ప్రజల్ని మోసంచేస్తున్నారని విమర్శించాడు. ఈ మోసాన్ని బట్టబయలు చెయ్యటమే అమెరికన్ మేధావుల ప్రస్తుత కర్తవ్యమని నిర్దేశించాడు. కేవలం ఉపదేశాలతోనే తృప్తిపడక వియత్నాంలో అమెరికన్ జోక్యానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు నడిపాడు. "అమానుషమైన వియత్నాం యుద్ధంలో చేరటానికి నిరాకరించిన ధైర్యవంతులైన యువకులకు" పైన పేర్కొన్న పుస్తకాన్ని అంకితమిచ్చాడు. వియత్నాంలో అమెరికన్ ప్రభుత్వ విధానాలకి నిరసనగా తను కట్టాల్సిన పన్నుల్లో సగభాగం కట్టటానికి నిరాకరించాడు. మేధావులంటే కాయితాల్లో తలదూర్చి కూర్చునేవాళ్ళు మాత్రమే కాదని, సమాజంపట్ల వారికి ప్రత్యేకమైన విధులున్నయ్యని ఛామ్‌స్కీ ఆదర్శం నిరూపిస్తున్నది. పౌరహక్కులకు మనదేశంలో రక్షణ లేకుండాపోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో ఛామ్‌స్కీ ఆదర్శం ముఖ్యంగా గమనించ దగింది. ఈయన రాజకీయాభిప్రాయాలకూ, భాషాశాస్త్ర సిద్ధాంతాలకూ మూలం ఒకే తాత్త్విక దృక్పథమని జాన్ లయన్సు (John Lyons, 1970) అనే భాషాశాస్త్ర పండితుని అభిప్రాయం. మానవులంతా ఒకటేనని, మానవజాతిని ఇతర జంతువుల కన్నా, యంత్రాల కన్నా భిన్నంగా గుర్తించాలని, రాజకీయాల్లోనూ, సాంఘికశాస్త్రాల్లోనూ మానవత్వానికే ప్రాధాన్యముండాలని ఈయనవాదం.

**భాష : వ్యాకరణం : భాషాసిద్ధాంతం**

**(Language: Grammar: Linguistic Theory)**

ఒక భాషకు రచించిన వ్యాకరణం ఆభాషను గురించిన సిద్ధాంతం సర్వభాషలకూ, సర్వభాషా వ్యాకరణాలకూ సంబంధించిన సిద్ధాంతం భాషాసిద్ధాంతం. ఇదే భాషాశాస్త్రం. భాషాసిద్ధాంతం, వ్యాకరణాలు పరస్పరాభివృద్ధికి దోహదకారులు. భిన్నభాషలకు రచించే వ్యాకరణాలు భాషాశాస్త్రం నిర్వచించే పద్ధతుల్లో ఉంటై. భిన్నభాషలమీద చేసే పరిశోధనవల్ల మానవుల భాషలను గురించి మన అవగాహన పెరిగి భాషాశాస్త్ర సిద్ధాంతాలు విస్తృతమూ, పటిష్ఠమూ అవుతై. భాషాశాస్త్రం వ్యాకరణాల విషయంలో చెయ్యవలసిన పనులను గురించి ఛామ్‌స్కీకీ మిగతా శాస్త్రజ్ఞులకూ అభిప్రాయభేదముంది.

**భాషాశాస్త్ర లక్ష్యాలు**

**(Goals of Linguistic theory)**

భాషాశాస్త్రం చెయ్యదగిన పనులను గురించి మూడురకాలుగా ఊహించవచ్చు. ఏపరిశోధకుడైనా భాషలో సర్వవాక్యాలనూ సేకరించలేడు. భాషలో వాక్యాలెన్ని ఉన్నయ్యని ఎవరూ చెప్పలేరు. పరిమితమైన వాక్య సముదాయాన్ని ఆధారం చేసుకొని అపరిమిత సంఖ్యాకాలయిన వాక్యాల కనువర్తించేట్టు వ్యాకరణం లక్షణం చెపుతుంది. ఈ సందర్భంలో భాషాశాస్త్రం ఈ పనులను చేసేట్టు ఊహించవచ్చు.

1. భాషలోని వాక్యసముదాయాన్ని వ్యాకరించే పద్ధతుల్ని శాస్త్రం స్పష్టెచెయ్యాలి. అంటే ఒక భాషలో ధ్వనులను, వర్ణాలను పదాంశాలను, అవయవులను కనుక్కోటానికి వీలైన యాంత్రికమైన (mechanical) పద్ధతుల్ని భాషాశాస్త్రం ఇయ్యాలి. అంటే ఈ పద్ధతుల్ని క్రమంగా అనుసరిస్తే మనం వ్యాకరణం ఆటోమేటిక్‌గా రాయగలిగేట్టుండాలి. దీన్నే discovery procedure అంటారు.

2. వ్యాకరణం ఎట్లాగో తయారైందనుకుందాం. అప్పుడీ వ్యాకరణం ఆ భాషకు సరైందా కాదా అనే నిర్ణయం భాషాశాస్త్రం చెయ్యాలి. దీనికి వ్యాకరణం, వాక్యసముదాయం సిద్ధంగా ఉండాలన్నమాట. అప్పుడు శాస్త్రం ఆ వ్యాకరణం ఆభాషకు సరైందో కాదో చెప్పాలి. దీన్నే decision procedure అంటారు.

3. ఒక భాషకు కొన్ని వ్యాకరణాలు తయారై ఉన్నయ్యనుకుందాం. ఈ భిన్నవ్యాకరణాలు ఒకే భాషను గురించిన భిన్న సిద్ధాంతాలు. ఈ భిన్న సిద్ధాంతాల్లో ఏది ఉత్తమమైనదో శాస్త్రం ఆటోమేటిక్‌గా చెప్పగలిగి ఉండాలి. దీన్ని evaluation procedure అంటారు. వీటిని ఈ కింది విధంగా బొమ్మలో చూపించవచ్చు.

1.

i.




ii.




iii.




ఈ బొమ్మల్లో మధ్యనున్న చదరాన్ని ఒకయంత్రంగా ఊహించవచ్చు. ఎడంపక్కనున్నవి ముడిసరుకుగా (input) భావించవచ్చు. కుడిపక్కవి యంత్రం ఉత్పత్తిచేసే పదార్థం (output)గా భావించవచ్చు. ఈ యంత్రమే భాషాసిద్ధాంతం లేక భాషాశాస్త్రం. ఇక్కడ యంత్రం అన్నంతమాత్రంచేత ఇట్లాంటి నిజమైన యంత్రాన్ని నిర్మించవచ్చునని తాత్పర్యం కాదు. మాటవరసకి తెచ్చుకున్న ఉపమానం మాత్రమే.

పైన పేర్కొన్న మూడుపనుల్లో మొదటిది బలవత్తమమైనది రెండోది బలవత్తరమైనది. మూడోది బలహీనమైనది. నిజానికి శాస్త్రం చెయ్యాల్సిందీ మూడోదే. మొదటి రెండుపనులను శాస్త్రాన్ని చెయ్యమని అడగటం అహేతుకం. ఏ శాస్త్రమైనా రెండు ప్రతిపాదిత సిద్ధాంతాల్లో (hypotheses) ఏది మేలైనదో మాత్రమే చెప్పగలదు. బాగా అభివృద్ధిచెందిన భౌతికశాస్త్రాల్లో అయినా ఒక పదార్థం గుణాదికాల్ని కనుక్కోటానికి ఆటోమేటిక్

సూత్రాలు లభించవు. ఫలాని పద్ధతుల్లో ప్రయోగ శాలలో పరిశోధనచేస్తే పరమాణువుల్లో ఎలక్ట్రానులు కేంద్రకంచుట్టూ పరిభ్రమిస్తయ్యన్న సంగతి తెలుస్తుందని భౌతికశాస్త్రం చెప్పదు. అట్లాగే ఏవో కొన్ని నియమాల ననుసరించి పరిశోధన సాగిస్తే ఆ భాషకు సరైన వ్యాకరణం వస్తుందని భాషా శాస్త్రం చెప్పక్కర్లేదు. అట్లాంటి ఆటోమేటిక్ పద్ధతుల్ని తయారుచెయ్యటంకూడా సాధ్యం కాదు. న్యూటన్ గతిసూత్రాల్నిగాని, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్నిగాని ఒక నిర్ణీత యాంత్రిక పద్ధతుల్లో పరిశోధన చెయ్యటంవల్ల కనుక్కోలేదు. అది పూర్తిగా వారి వైయక్తిక ప్రతిభామూలకమే. శాస్త్రజ్ఞుడు ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తాడు. అంతకు ముందున్న సిద్ధాంతాలకన్న ఇది మేలైనదోకాదో శాస్త్రం నిర్ణయిస్తుంది. ఆ సిద్ధాంతం శాస్త్రజ్ఞుడి మనసులో ఎప్పుడో ఒక మెరుపులాగా మెరుస్తుంది. ఆ తరవాతనే ప్రయోగాలు, ఉపపత్తులు.

ఛామ్‌స్కీ పూర్వపు భాషాశాస్త్రజ్ఞులీ విషయాన్ని విస్మరించి ఒక భాషకు వ్యాకరణం రచించటానికి ఆటోమేటిక్ పద్ధతుల్ని తయారు చెయ్యటానికి ప్రయత్నించారు. ఒక భాషలో వర్ణాలను కనుక్కోవాలంటే ధ్వనిసామ్యం, పరిపూరణ మొదలైన నియమావళిని క్రమంగా అనుసరిస్తే ఆ భాషా వర్ణాలను సాధించవచ్చునని వారు భావించారు. ఈ పద్ధతులవల్ల ఒకే భాషకు రెండు మూడు రకాల వర్ణ సమామ్నాయాలు తయారైనై. అందులో ఏది ఉత్తమమో నిర్ణయించే పని శాస్త్రానిది కాదనుకున్నారు. అన్నీ సరైనవే అనుకున్నారు. ఇట్లా అనటం వల్ల ఆ నియమావళి పూర్తిగా త్యాజ్యమని భావం కాదు. అయితే వాటిని సూచనలుగానే గ్రహించాలి గాని ఆటోమేటిక్ పద్ధతులుగా భావించరాదు.

వ్యాకరణ రచనకు వ్యవహర్త ఒక్కోసారి కొన్ని సూచనలు చెయ్యవచ్చు. ఆ భాషకు లిఖితమైన చరిత్రఉంటే నేటిభాషను వ్యాకరించటానికి కొన్ని సులువులు దొరకవచ్చు. ఇన్నిటినీ మించి పరిశోధకుడు తన పూర్వానుభవాన్ని, మేధని, ప్రతిభను పురస్కరించుకొని ఆ భాషా లక్షణాలను కనుక్కోవచ్చు. ఇవేవీ భాషా శాస్త్ర సిద్ధాంతంలో భాగాలుగా మనం పొరపాటుపడగూడదు.

ఛామ్‌స్కీ పూర్వపు శాస్త్రజ్ఞులు వ్యాకరణ రచనకు యాంత్రిక పద్ధతుల్ని తయారు చెయ్యటానికి ప్రయత్నించటానికి కారణం వారు సైంటిఫిక్ రిగర్ (scientific rigour) ని ఎక్కువగా ఆదరించారు. భాషాతత్త్వ నిరూపణమే రిగర్‌కన్నా ఎక్కువ సమాదరణీయమని వారు గుర్తించలేదు.

భాషాశాస్త్రలక్ష్యాల్లో ఛామ్‌స్కీ మిగతా శాస్త్రజ్ఞులకూ ఉన్న భేదానికి తత్త్వగతమైన నేపథ్యం (philosophical back ground) కూడా ఉంది.

### తత్త్వ శాస్త్ర నేపథ్యం
### (Philosophical Back ground)

తత్త్వశాస్త్రంలో హేతువాదం(rationalism) అనుభవవాదం (empiricism) అని రెండువాదాలునై. 17–18 శతాబ్దుల్లో ఈ రెండువాదాలు పరస్పరం సంఘర్షించినై. మానవ విజ్ఞాన సముపార్జనకు సంబంధించిన సిద్ధాంతాలివి. మొదటి వాదానికి దేకార్త్. లీబ్నిజ్ మొదలైనవాళ్ళు మూల పురుషులు. రెండో వాదానికి లాక్, బర్క్లీ మొదలైన వాళ్ళు ప్రధాన కర్తలు.

మానవుడు పుట్టేటపుడు కొన్ని స్వతస్సిద్ధమైన భావాలతో (innate ideas) తో పుట్టాడని, విజ్ఞానం జన్మగతమైందని, అనుభవం కేవలం ఆ భావాల కుద్దీప్తిని (activation) మాత్రమే కలిగిస్తుందనీ హేతువాదు లంటారు. స్వతస్సిద్ధ భావాలు ఆలంబన విభావమనీ, అనుభవం ఉద్దీపన విభావమనీ వారి నమ్మకం. విజ్ఞానం జన్మసిద్ధమని అనుభవవాదు లంగీకరించరు. అనుభవమే విజ్ఞానానికి మూలమని, మానవుడి మనస్సు మొదట ఏమీ ఎరగదనీ, అనుభవమే విజ్ఞానాన్ని మనసుమీద

ముద్రిస్తుందని అనుభవవాదు లంటారు. తాను గ్రహించేవిజ్ఞానస్వభావం జన్మగత స్వతస్సిద్ధభావాలు (innate ideas) చాలావరకు నిర్ణయిస్తయ్యని హేతువాదుల నమ్మకం. గ్రహించబోయే విజ్ఞానానికి అవధులు విధించే శక్తి ఏదీ మానవుడిలో జన్మతః లేదని అనుభవవాదు లంటారు. స్వతస్సిద్ధభావాల ఉద్దీప్తికి అనుభవ ప్రాధాన్యాన్ని హేతువాదులుగుర్తిస్తారు. కాని అదే మూలమని ఒప్పుకోరు. అట్లాగే జ్ఞానసముపార్జనకి మానవుడి మనసు ముందుగా సిద్ధమయి (Predisposition to learning) ఉండాలని అనుభవవాదులూ అంగీకరిస్తారు. కాని వాటిని భావా లనరు. ఆర్జించే విజ్ఞానస్వభావం ముందుగా నిర్ణయమవుతుందనీ వాళ్ళు ఒప్పుకోరు. ఈ రెండు వాదాలవారూ భాషాసముపార్జనను కూడా ప్రస్తావించారు. భాషకు (సర్వభాషలకు అని అర్థం) సంబంధించిన సామాన్య లక్షణాలు మానవుడికి జన్మగతంగానే వస్తయ్యని, నేర్చుకొనే భాషలో ఉన్న వివరాల్లో ఉన్నభేదాలు (differences in details) మాత్రమే మనిషి నేర్చుకుంటాడని హేతువాదం ప్రతిపాదిస్తుంది. మానవుడు పుట్టేటప్పుడు భాషలను గురించే ఏమీ ఎరగడని, సర్వం వినుకలిద్వారా అభ్యాసంవల్ల మాత్రమే భాషను నేర్చుకుంటాడని అనుభవవాదం చెపుతుంది. భాషా సామాన్య లక్షణాలను గురించి హేతువాదం నొక్కిచెపుతుంది. ఈ లక్షణాలను విశ్వవ్యాకరణం (Universal grammar) అనవచ్చు. అది మనిషికి జన్మసిద్ధమైన దని హేతువాదుల నమ్మకం. భాషల వైవిధ్యానికి అనుభవవాదులు ప్రాధాన్య మిస్తారు. ఈ సిద్ధాంతాలకూ పూర్వమే చెప్పిన భాషాశాస్త్రాభిప్రాయాలకూ ఉన్న సామ్యం ఈపాటికి స్పష్టమే అయి ఉండాలి. ఈ అనుభవవాదపు ప్రతిరూపాన్నే మనస్తత్త్వశాస్త్రంలో ప్రవృత్తి వాదం (behaviourism) అంటారు. జ్ఞానగ్రహణం ఇంద్రియాల ద్వారా మాత్రమే జరుగుతుందని ఈ వాదం చెపుతుంది. భౌతికప్రపంచంలోని ప్రేరణల (stimuli) కు ప్రాణులు స్పందిస్తయ్యని (response), ఈ ప్రేరణ—స్పందనలు ప్రాణిలో ముద్రితమవుతయ్యని, అవే అలవాట్లుగా మారతయ్యని, ఈ అలవాట్లే జ్ఞానమనీ ప్రవృత్తి వాదం చెపుతుంది. భాషా సంపాదన ఇందుకు భిన్నం కాదని ఈ వాదాన్ని నమ్మేవారి ఉద్దేశం. ఈ వాదాన్ని ప్రస్తుతం గట్టిగా సమర్థించే వారిలో B. F. Skinner అనే మనస్తత్త్వశాస్త్రవేత్త ప్రసిద్ధుడు. ఈయన రాసిన Verbal behaviour అనే గ్రంథాన్ని సమీక్షిస్తూ ఈవాదాన్ని ఛామ్స్కీ ఖండించాడు, మానవుల జ్ఞానసముపార్జనను ప్రేరణ స్పందనల ద్వారా వివరించనం అసాధ్యమని ఛామ్స్కీ వాదించాడు. మానవుల వర్తనకూ, ఇతర జంతుజాలాల వర్తనకూ మౌలిక భేదముందని ఛామ్స్కీ ప్రతిపాదించాడు ఈ భేదం గుణాత్మకమైన (qualitative) దని ఆయన ఉద్దేశం.

పైన పేర్కొన్న హేతు - అనుభవవాదాల్లో ఛామ్స్కీ హేతువాదాన్ని సమర్థిస్తాడు. ఈ వాదాన్ని పునరుద్ధరించి దానికి భాషాశాస్త్రంనుంచి కొత్త బలాన్ని సంపాయించిపెట్టిన గౌరవం ఛామ్స్కీకే దక్కింది.

సాధారణంగా పిల్లలు ఐదారేళ్ళకు తమ భాషను పూర్తిగా నేర్చుకుంటారు. భాషలో శబ్దజాలాన్నంతా నేర్చుకుంటారని కాదు. ఆ భాషలో ముఖ్యమైన వ్యాకరణాంశా లన్నిటినీ ఆ వయస్సుకు స్వాధీన పర్చుకుంటారు. సరైన శిక్షణ లేకపోతే కొన్ని విద్యలను నేర్చుకోలేక పోవచ్చు. ఉదాహరణకు చెట్లెక్కటం, కుప్పిగంతులు పిల్లిమొగ్గలు వెయ్యటం మొదలైనవి నేర్చుకోలేక పోవచ్చు. నేర్చుకున్నా అభ్యాసాన్నిబట్టి తరతమభేదా లుండవచ్చు. అట్లాగే కొంతమంది లెక్కల్లో మొద్దులుగా ఉండవచ్చు. కాని ఎట్లాంటి గురువూ నియతమైన శిక్షణ అవసరం లేకుండానే పిల్లలంతా స్వభాషని తరతమభేదాలేకుండా నేర్చుకుంటారు. కొంతమంది తల్లిదండ్రులు బిడ్డలకు భాషవిషయంలో శిక్షణ ఇయ్యవచ్చు. కొంతమంది తల్లిదండ్రులకు శిక్షణ ఇచ్చే వ్యవధి ఉండకపోవచ్చు. మరికొంతమంది పిల్లలకు శిక్షణ

ఇయ్యటానికి తల్లిదండ్రులే లేకపోవచ్చు. అయినా వారందరూ భాష విషయంలో శిక్షణతో సంబంధం లేకుండా సమానమైన ప్రతిభనే చూపించగలుగుతున్నారు. తెలివిగలవాళ్ళు, తెలివితక్కువవాళ్ళు అని మనం అనుకునేవాళ్ళంతా భాష విషయంలో (అంటే భాషా వ్యవహారంలో) ఒకేరకమైన పరిణతిని చూపిస్తున్నారు. భాషకు సంబంధించిన విశ్వ సూత్రాలు పుట్టుకతోనే రాకపోతే ఇది సాధ్యమయ్యేది కాదు.

వివిధ జీవరాసుల్లో మనుషులు మాత్రమే మాట్లాడ గలుగుతున్నారు. మానవులతో ఎక్కువ పోలికలున్న వానర జాతులకు భాషలేదు. ఉదాహరణకు చింపాంజీలు సైకిలు తొక్కటం, సిగరెట్లు కాల్చటం మనలో చాలామంది చూసేఉంటారు. మానవుల అలవాట్లు చాలావరకు చింపాంజీలకు నేర్పవచ్చు గాని మాట్లాట్టం మాత్రం నేర్పలేం. కెల్లాగ్ దంపతులు ఒక చింపాంజీని తెచ్చుకుని పెంచుకుని, దాని మీద పరిశోధనచేసి 1933లో The Ape and the child అనే పుస్తకం రాసి ప్రకటించారు. అందులో ఆ కోతిపిల్లకి మనుషుల అలవాట్లను తాము ఎంత త్వరగా నేర్పగలిగిందీ వివరించారు. కాని భాషను మాత్రం నేర్పలేకపోయామని అంగీకరించారు. వానరాలు భాషను నేర్చుకోలేక పోవటానికి వాటి ఉచ్చారణావయవాల లోపం కాదు, వానరాల ఉచ్చారణావయవాలు మానవులుచ్చరించ గలిగిన ధ్వనులను ఉచ్చరించటానికి సమర్థమైనవే నని హూటన్ (Hooton) అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయం. మానవుడి దగ్గర్నుంచి కొన్ని అలవాట్లను నేర్చుకోగలిగిన వానరాలు, మానవుల భాషను నేర్చుకోలేక పోతున్నయ్యంటే భాషాసామాన్య సూత్రాలు మనిషికి మాత్రమే జన్మతః వచ్చినయ్యని, ఇతర జంతువులకు ఈ జన్మగత భావాలు (innate ideas) లేవని అర్థం.

పిల్లల్లో కొంతమందికి లెక్కలు సరిగ్గా రాకపోవచ్చు. కొంతమందికి జాగ్రఫీ ఒంటబట్టకపోవచ్చు. కొంతమందికి చదువే సరిగ్గా అబ్బకపోవచ్చు. ఎంత తెలివితక్కువ పిల్లవాడైనా స్వభాషను వ్యవహరించకుండా ఉండలేడు. మామూలుగా మనంఅనుకునే తెలివితేటలే స్వభాషను నేర్చుకోటాని కవసరమయితే భాష నేర్చుకోలేని 'తెలివితక్కువ' పిల్లలు కూడా ఉండి ఉండాలి. కాని ఎన్నో విషయాల్లో మొద్దబ్బాయి లుండవచ్చుగాని, స్వభాషా వ్యవహారం నేర్చుకోలేని మొద్దబ్బాయిలున్నట్టు మనం వినలేదు. దీన్నిబట్టి తెలివితేటలకీ భాష నేర్చుకోటానికీ సంబంధం లేదని తేలుతున్నది. తెలివితేటల కతీతమైన, మానవజాతికే పరిమితమైన భాషకు సంబంధించిన శక్తి ఒకటి ఉందన్నమాట. మనిషి తను నేర్చుకోబోయే భాషాస్వరూపాన్ని నిర్ణయించే విశ్వవ్యాకరణంతోనే జన్మించాడన్నమాట. ఇది తెలివితేటలతో నిమిత్తం లేకుండా మానవులందరికీ పుట్టుకతో వచ్చిందే.

కొన్నిశతాబ్దాల తరబడి తత్త్వవేత్తలు, వ్యాకర్తలు భాషనుగురించి ఆలోచిస్తున్నారు. అయినా భాషలనుగురించి మనకు తెలియవలసింది ఇంకా చాలా ఉంది. ఏ ఒక్క భాషను సమగ్రంగా వ్యాకరించిన సంపూర్ణవ్యాకరణం ఇంతవరకూలేదు. కాని పిల్లలు స్వభాషకు సంపూర్ణ వ్యాకరణం నిర్మించుకోగలుగుతున్నారు. అతిక్లిష్టమైన వాక్యనిర్మాణానికి అంతర్గత సూత్రాలను నిర్మించుకో గలుగుతున్నారు. దానికి కారణం ఏరకమైన వ్యాకరణ నిర్మాణమున్న భాషలు మానవజాతికి సాధ్యమో నిర్ణయించే విశ్వవ్యాకరణం జన్మగతంగా మానవులకు సిద్ధమయి ఉండటమే. అదే లేకపోతే కొన్ని పిట్టల్లాగా వాక్యాలను కేవలం కంఠతాపట్టే ఉండేవారు. మానవుల భాషలో వాక్యాలసంఖ్యకు గరిష్ఠపరిమితి లేదని సూచించే విశ్వవ్యాకరణం మానవులకు జన్మసిద్ధం కాబట్టి దానిసహాయంతో తము పుట్టిన సమాజంలో వ్యవహరించేభాషకు అలిఖిత వ్యాకరణాన్ని నిర్మించుకోగలుగుతున్నారు. అయితే ఆ విశ్వవ్యాకరణమూ, నిర్మించుకున్న వ్యాకరణమూ అత్యంత అమూర్త (abstract) స్థితిలో ఉండటంవల్ల పరిశోధకులకు సులువుగా అందుబాటులో ఉండవు. వ్యవహ

రించిన వాక్యాల సహాయంతో ఆ అమూర్త వ్యాకరణ లక్షణాలను తెలుసుకోవలసి ఉండటంవల్ల లిఖిత వ్యాకరణం కష్టసాధ్య మవుతున్నది.

ఈపైన సూచించిన కారణాలవల్ల భాషానముపార్జన కవసరమైన సూత్రావళి మానవులకు జన్మసిద్ధమవి (innate ideas), మానవసాధ్యమైన భాషల స్వరూపాన్ని ఈ సూత్రావళి నిర్ణయిస్తుందని ప్రతిపాదించే హేతువాదానికి బలం చేకూరుతున్నది.

## భాష – పుట్టుక

భాషలపుట్టుకను గురించి 'పూపూ' వాదమని, 'బౌ వౌ' వాదమని, 'డింగ్ డాంగ్' వాదమని కొంతకాలంనుంచి ప్రచారంలో ఉన్నై. ఇవేవీభాషలు పుట్టిన విధాన్ని సరిగ్గా చెప్పలేకపోయినై. భాషలో అత్యల్పమైన ధ్వన్యనుకరణాలవంటి శబ్దాలనే స్పృశించినై. భాషల్లో సంక్లిష్టమైన వాక్యనిర్మాణ మెట్లా ఏర్పడిందో చెప్పటం ఈ వాదాల కతీతమైనది. అసలీ వాదాల్ని భాషాశాస్త్రజ్ఞు లెవరూ సీరియస్‌గా పట్టించుకోరు.

ఇతరప్రాణుల అభిప్రాయప్రకటన సాధనాలతో మానవుల భాషలను పోల్చి, ఆ సాధనాల క్రమపరిణామమే మానవుల భాషఅని ఒకవాదం వచ్చింది. దీన్ని క్రమవికాసవాదం (continuous theory) అనవచ్చు. మానవుడు ప్రాథమికమైన(primitive) జీవజాలంనుంచి పరిణామంచెందాడని, అతని ఆకారం, శరీరనిర్మాణం, ప్రవృత్తికూడా క్రమపరిణామం వల్లనే సిద్ధించినయ్యని డార్విన్ ప్రతిపాదించిన పరిణామవాదాన్ని స్థూలంగా శాస్త్రజ్ఞులంగీకరించారు. కాబట్టి మానవుడి భాషావ్యవహారంకూడా అతని ప్రవృత్తిలో భాగమే కాబట్టి భాషకూడా ఇతరజంతువుల అభిప్రాయప్రకటన పద్ధతుల క్రమపరిణామమే అయిఉండాలని ఈ క్రమపరిణామవాదుల నమ్మకం.

ప్రాణులన్నిటికీ అభిప్రాయ ప్రకటన (communication) జీవితావసరం (biological necessity). మనిషి ఇతర జంతువుల కన్న ఎక్కువ తెలివితేటలు కలవాడు కాబట్టి ఎక్కువ ఫలవంతమైన, పటిష్ఠమైన (effecient) సాధనాన్ని రూపొందించుకున్నాడని ఈ వాదం ప్రతిపాదించేవారి నమ్మకం. కాని తెలివితేటల్ని కొలవటానికి జీవశాస్త్రంలో సాధకాలులేవు. మానవులు భాషావ్యవహారంలో చూపే నేర్పుకీ తెలివి తేటలకీ సంబంధం లేదని పూర్వమే చూశాం. ఇతర జంతువుల తెలివితేటల్ని కొలిచి మనం ఇచ్చే అర్థం సాపేక్షం. మానవజాతి దృష్టిలో మనం ఇచ్చే అర్థం సర్వజాతులకీ అన్వయించదు. క్రమపరిణామవాదులు ఇతర జంతువులనుంచి భాష ఏయేదశల్లోపరిణామం చెందిందో వివరించకుండా సర్వజంతువుల భావప్రకటనల సాధనాల్ని ఒకేసారి మానవుల భాషలతో పోలుస్తారు. ఉదాహరణకు పక్షులు, జలచరాలు, తేనెటీగలు ఉపయోగించే అభిప్రాయ ప్రకటన పద్ధతులకీ మానవుల భాషకూ యాదృచ్ఛికమైన పోలికలుండవచ్చు. కాని పరిణామంలో అవి మానవజాతికి అతిదూరమైనవి. తేనెటీగల నృత్యపద్ధతికీ, మానవుల భాషలకూ పోలిక అధికంగా ఉండవచ్చు. అయితే అవి ధ్వనులనే ఉపయోగించవు. అయినప్పుడా పోలికవల్ల ఫలిత ముండదు. మానవులకు పరిణామంలో దగ్గరిదైన వానరజాతులు (Gibbons, Orangutangs Chimpanzees. Gorillas etc ) ధ్వని సంకేతాల ద్వారానే భావప్రకటన చేస్తై. కాని వాటి అరుపులు దజనుకన్నా ఎక్కువుండవు. మిగతావి వాటి పునరావృత్తే. భాషలో మనం ఉపయోగించే వాక్యాలు, ఏవో కొన్నిటిని మినహాయిస్తే, చాలా భాగం కొత్తవి. అంతేకాక Hockett ప్రతిపాదన ప్రకారమే జంతువుల అరుపులకు వ్యాకరణంలేదు. ద్వైధనిర్మాణం (Duality of patterning) లేదు. అందువల్ల ధ్వనులు ఉచ్చరించ గలిగిన యంత్రాంగం ఉండికూడా వాటికి భాషలేదు. పైగా పరిణామంలో వానరజాతినీ (primates) మానవజాతినీ కలిపే లింకు లభించలేదు. ఒకవేళ ఆ (లింకు) ఆధారం దొరికినా భాషనుగురించి సాక్ష్యం

ఎట్లాగూ దొరకదు. అందువల్ల భాష పుట్టుకను క్రమపరిణామంగా నిరూపించటానికి చేసే ఏ ప్రయత్నమూ సఫలమయ్యే అవకాశం లేదు.

అసలు మానవులభాష ఇతర జంతువుల అభిప్రాయ ప్రకటన పద్ధతులకన్నా మౌలికంగా భిన్నం. ఇది కేవలం తరతమభేదం కాదు. భాష ఒకటే మానవజాతిని సర్వజీవజాతినుంచీ వేరుచేసే స్పష్టమైన కొలబద్ద. దీన్ని మానవులు మానవులుగా పరిణమించినప్పుడే సంపాయించుకున్నారు. ఇది మానవ జాతికే దత్తమైన వరం. దత్తం–వరం వల్ల భగవద్దత్తమైన వరం అని కాదు. శాస్త్రంలో ఆధిభౌతిక శక్తుల ప్రసక్తి ఉండదు. మానవుల భాషలకు, ఇతర జంతువుల అభిప్రాయ ప్రకటన విధానాలకు క్రమపరిణామ సంబంధం లేదు. దీన్నే (discontinuous theory) అంటారు.

## సృజనాత్మకత
## (Creativity)

భాషావ్యవహారంలో వ్యవహర్తకు సృజనశక్తి ఉంది. అంటే వ్యవహారంలో వక్త తనెప్పుడూ పూర్వం వాడని కొత్తవాక్యాలు వాడతాడు. శ్రోత ఆ వాక్యాలను ఇంతకు పూర్వం ఎప్పుడూ వినకపోయినా వాటి అర్థగ్రహణం చేస్తాడు. జంతువులు కొత్త అరుపులను సృష్టించలేవు. పరిమిత సంఖ్యాకాలయిన అరుపులనే పునశ్చరణచేస్తై. వాక్యాల సంఖ్యకు గరిష్ఠపరిమితిలేదు. ఒక వాక్యం దైర్ఘ్యానికి సైద్ధాంతికంగా గరిష్ఠ పరిమితి లేదు. దీన్నే ఛామ్‌స్కీ అనంతత్వం (infinity) అన్నాడు, ఇది భాషకు అతి ప్రధానమైనలక్షణం. ఈ అనంతత్వమే భాషను మిగతాజంతువుల అరుపులనుంచి వేరుచేస్తుంది.

భాషలో వాక్యాలు చిన్నవిగా ఉండటం మన అనుభవం. అట్లాగే పరిమిత జీవనాన్ని కలిగిన వ్యవహర్త ప్రయోగించే వాక్యాల సంఖ్యఎంత అధికమైనా పరిమితమే అవుతుందికదా! అయితే అనంతత్వం అనేది భాషకు ప్రధానలక్షణంగా ప్రతిపాదించటం ఎట్లా సాధ్యం?

## ప్రతిభ : ప్రవృత్తి
## Competence : Performance

ఈ సందర్భంలోనే వ్యవహర్తకు అంతర్గతంగా పరిమితులకు అతీతంగా ఉన్న ప్రతిభను, అతని బాహిరమైన భాషా ప్రవృత్తిని ఛామ్‌స్కీ వేరు చేస్తాడు. ప్రవృత్తి వ్యవహారానికి సంబంధించినది. వ్యవహారానికి పరిమితులున్నై. ఒక పొడుగైన వాక్యం ప్రయోగించాలంటే వక్తకు దమ్ము చాలకపోవచ్చు. వెనకేం చెప్పాడో వాక్యం ముందుకు సాగుతున్నకొద్దీ మరిచిపోవచ్చు. మాట్లాడుతున్నప్పుడు వాక్యంమధ్యలో ఆపివేసి విషయాంతరం ఎత్తుకోవచ్చు. కొన్ని వింతపరిస్థితుల్లో ఎవరైనా అతని నోరు ముయ్యవచ్చు. సందర్భాన్నిబట్టి నట్లు పడవచ్చు. పొరపాట్లు చెయ్యవచ్చు. తడబడవచ్చు. ఇన్నింటినీ మించి అంత పొడుగైన వాక్యంవాడే అవసరం రాకపోవచ్చు. ఇవన్నీ ప్రవృత్తికి సంబంధించిన ఆటంకాలు (limitations). ఈ పరిమితుల్లో కొన్ని ఉండక పోవడంవల్ల మాట్లాడేవాక్యాలకన్న రాసే వాక్యాలు పెద్దవిగా ఉండటం మనం గమనించవచ్చు. అట్లాగే అతని జీవిత పరిమితైనా. మనిషికి చావు లేకుండా ఉండే మార్గం కనిపెడితే అతని జీవితం అనంతమే అవుతుంది. అప్పుడతను వాడే వాక్యాల సంఖ్యా అనంతమే. అంటే అనంత వాక్యాలు సృష్టించ గలిగిన ప్రతిభ అతని కున్నదన్నమాట. పరిమితులు ప్రవృత్తికే ఉంటై, ప్రతిభకుండవు. ప్రతిభ అంతర్గతమైనది. మానసికమైనది. ప్రవృత్తి భౌతికమైనది. పరిమితులూ భౌతికమైనవే. అంతర్గతమైన అతని వ్యాకరణంలో అనంతత్వాన్ని అనుమతించే యంత్రాంగముంది. ఈ వ్యాకరణం అలిఖితం, అమూర్తం. ఈ అలిఖిత, అంతర్గత, అమూర్త వ్యాకరణానికి బాహిరరూపమియ్యటమే వ్యాకర్త చెయ్యాల్సిన పని. వ్యాకర్త సూత్రించేది మానసికమైన ప్రతిభను. ప్రవృత్తిని

కాదు. భాషాశాస్త్రం నిర్వచించేది ఈ ప్రతిభనే. అందువల్లనే భాషాశాస్త్రం మానసికమైన (mentalistic) శాస్త్రం. భాషాశాస్త్రాన్ని మనస్తత్వశాస్త్రం (psychology) లో భాగంగానే ఛామ్‌స్కీ పరిగణిస్తాడు.

వ్యవహర్త తనభాషకు వ్యాకరణాన్ని నిర్మించుకుంటాడని చెప్పుకున్నాం. దీన్నే అలిఖిత వ్యాకరణం అని వ్యవహరిస్తున్నాను ఇది అతని ప్రతిభామూలకం. ప్రతిభే వ్యాకరణ మూలకం అన్నా అనవచ్చు. నిజానికి రెండూ వేరు వేరు కావు. ఒక దానికే రెండు పేర్లు. ఈ అలిఖిత వ్యాకరణ ప్రతిపాదనను అర్థం చేసుకోటం కష్టంకాదు. భాషా వ్యవహారంలో వ్యవహర్త చూపించే కొన్ని శక్తులను గమనిస్తే ఈ విషయం విశదమవుతుంది. అంతర్గతమైన అలిఖిత వ్యాకరణాన్ని మనం ప్రతిపాదించకపోతే ఈ శక్తులకు గతి లేదు. భాషా లక్షణాలను అతను వ్యక్తరూపంలో చెప్పగలడని ఈ ప్రతిపాదనకు అర్థం కాదు. అట్లా చెప్పగలిగితే వ్యాకరణ పరిశోధనే అనవసరం. అతని సర్వ వ్యవహారాన్ని అవ్యక్తంగా ఉండి నడిపించేది ఈ వ్యాకరణం అని అర్థం.

వ్యవహర్త భాషా పరిజ్ఞానం

భాషా వ్యవహర్తకు తను వ్యవహరించే భాషను గురించి పూర్తిగా తెలుసు. ఒక వాక్యంలో భిన్న పదాల వ్యాకరణ సంబంధం అతనికి తెలుసు. అది తెలియటంవల్ల వాక్యనిర్మాణం సరిగ్గా చెయ్యగలుగుతున్నాడు. భిన్నవాక్యాల పరస్పర సంబంధం అతనెరుగు. ఒక వాక్యానికి అందులోని పదాల వ్యాకరణ సంబంధాల్లో భిన్నత్వంవల్ల లభ్యమయ్యే భిన్నార్థాల పరిజ్ఞానం అతనికి ఉంది. స్థూలదృష్టి కొకేరకంగా కనిపించే వాక్యాల వ్యాకరణభేదాన్ని అతను గ్రహించగలడు. భిన్నవాక్యాలు ఒకదానికొకటి వివరణాత్మకాలవునోకాదో అతనికి తెలుసు. వ్యాకరణసమ్మతమైన వాక్యాలకు వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలకూ ఉన్న భేదాన్ని గ్రహించగలడు. వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలకు వ్యాకరణసమ్మతమైన వాక్యాల సహాయంతో అర్థగ్రహణం చేయగలడు. ఈ శక్తులన్నీ ఉన్నయ్యంటే వ్యవహర్తకు తన భాషను గురించి సంపూర్ణ పరిజ్ఞానం ఉన్నట్టే. దీన్నే ప్రతిభ (Competence) అని పరివర్తన సిద్ధాంతకర్త లంటారు. ఈ ప్రతిభామూలకమే అలిఖిత వ్యాకరణం. ఈ శక్తులకు తెలుగులో నుంచి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

వరవరరావు రాసిన 'చలినెగళ్ళు' అనేకావ్యంలో 'ఆకలి' అనే చివరి ఖండికలో —

2. 'కప్పుకోడాని కేమున్నాయని
అయినా కప్పుకోడాని కేమున్నాయని'

అనే వాక్యాలున్నై. ఇందులో పునరావృతమైన వాక్యానికి రెండర్థాలున్నై. మొదటి అర్థంలో సాధనాలు లేవని, రెండో అర్థంలో కప్పుకోవలసినవి ఏమీలేవని కవి ఉద్దేశించాడు. 'కప్పుకొను' అనే క్రియతో 'ఏం' అనే ప్రశ్నార్థక శబ్దం అన్వయించే తీరులోనిభేదంవల్ల ఈరెండర్థాలూ వస్తున్నై. 'ఏం' శబ్దం ప్రశ్నించేనామం ఒకచోట కరణార్థకం, ఇంకోచోట కర్మార్థకం, ఈ అర్థాలను అంతర్గత వ్యాకరణం ద్వారా పాఠకుడు గ్రహిస్తాడు.

3. కమల కలంతో పరీక్ష రాసింది.
కమల జ్వరంతో పరీక్ష రాసింది.

ఈ రెండు వాక్యాలు స్థూలదృష్టి కొకే నిర్మాణ మున్నట్లు కనిపిస్తై. కాని మొదటి వాక్యం నుంచి "కమల పరీక్షరాసిన కలం" అనే నామ బంధం నిష్పన్నం చేసినట్టుగా రెండో వాక్యంనుంచి "కమల పరీక్ష రాసిన జ్వరం" అనే నామ బంధాన్ని నిష్పన్నం చెయ్యలేం. ఈ రెండు వాక్యాల్లోనూ ప్రయుక్తమైన 'తో-బంధం'లో తేడా ఉంది. మొదటి వాక్యంలో 'కలంతో' అనేపదం

క్రియలో అన్వయిస్తుంది. రెండో వాక్యంలో 'జ్వరంతో' అనేది కర్తతో అన్వయిస్తుంది. ఈ సంబంధాలను ఎరిగినందువల్లనే తెలుగు భాషావ్యవహర్త నామ బంధాల నిష్పత్తిలో పైన సూచించిన భేదాన్ని పాటిస్తాడు.

4. వాడు స్నానంచేసి వారంరోజులయింది.
వాడు వారంరోజుల కిందట స్నానంచేశాడు

స్థూలదృష్టికి పై రెండు వాక్యాల్లో భిన్న వ్యాకరణ నిర్మాణమున్నట్టు కనిపిస్తున్నది. మొదటివాక్యంలో రెండు క్రియలున్నై. అది సంశ్లిష్ట వాక్యం (Complex sentence) రెండోదాంట్లో ఒకేక్రియ ఉంది. ఇది అశ్లిష్ట వాక్యం (simple sentence). ప్రాధాన్య వివక్షలో భేదంఉన్నా ప్రధానార్థం ఒకటే. వ్యాకరణ నియామాల్లోనూ సామ్యంఉంది. రెండిట్లోనూ 'వారంరోజు'లకు బదులు నిన్న, మొన్న మొదలైన పదాలను ప్రయోగించ టానికి వీల్లేదు. రెండిట్లోనూ '8 O'clock' అనే అర్థంలో 8 గంటలు అని వాడటానికి వీల్లేదు. ఈ సామ్యాన్ని ఎరిగినందువల్లనే వ్యవహర్త పైన చెప్పిన నామాలను ఆ వాక్యాల్లో ప్రయోగించడు.

5. నాకు సైకిలు తొక్కటం తెలుసు.
నాకు నరసయ్యగారు తెలుసు.

మొదటివాక్యంలో 'తెలుసు'కు బదులు 'వచ్చు' అనే క్రియ వాడవచ్చు. రెండో వాక్యంలో అట్లా వాడి 'నాకు నరసయ్యగారు వచ్చు' అని అనటానికి వీల్లేదు. వచ్చు అనే క్రియతో అభ్యసనార్థమైన నామపదాలే కర్తృ పద స్థానంలో రాగలవని అంతర్గత వ్యాకర ణంలో నియమం ఉండటంవల్ల వ్యవహర్త ఆ వాక్యాన్ని ప్రయోగించడు. అంటే పదాల మధ్య పరస్పర వ్యాకరణ సంబంధాలు అత నికి తెలుసునని, వ్యాకరణ సమ్మతమైన వాక్యానికి వ్యాకరణ విరుద్ధమైన వాక్యానికి ఉన్న భేదం అతనికి తెలుసునని అర్థం.

6. 'నాకు నువ్వు కంఠతా వచ్చును. నిన్ను ఈ స్వల్ప పరిచయంలోనే బాగా చదివేశాను."

ఈ పై వాక్యాలు పంతుల జోగారావుగారి 'శైలజ' అనే కథలోవి (చూ. ఆంధ్రజ్యోతి: వారపత్రిక, జనవరి 10, 1969). 'వచ్చు' అనే క్రియకు కర్తృపదస్థానంలో 'నువ్వు' అనే పురుషబోధక (సర్వ) నామం వాడటం వ్యాకరణ విరుద్ధం, అట్లాగే 'చదువు' అనే క్రియకు కర్మపదస్థానంలో 'నిన్ను' అనే పురుషబోధకనామం వాడటంకూడా. వ్యాకరణ నియమాలను ఉల్లంఘించిన పై వాక్యాలను పాఠకుడు వ్యాకరణ సమ్మతమైన 'నాకీ పద్యం కంఠతా వచ్చును. నేనీపుస్తకం చది వేశాను" వంటి వాక్యాల వ్యాకరణ నిర్మాణ సహాయంతో అర్థం చేసుకోగలుగుతున్నాడు.

## వ్యాకరణసమ్మతి

వ్యాకరణ సమ్మతిని ఇంకాస్త వివరంగా తెలుసు కోటం అవసరం. ఇక్కడ వ్యాకరణం అంటే వ్యవహర్త మనస్సులో అజ్ఞాతంగాఉన్న అలిఖిత సూత్రాలు, నియమాలు. వీటిని కొంతవరకైనా పట్టుకోగలిగిన లిఖిత వ్యాకరణానికి కూడా ఈ పదం ఈ వ్యాసంలో వాడబడింది. వ్యాకరణ సమ్మతి అంటే ఈరెండు వ్యాకరణాల సమ్మతి అని అర్థం చేసుకోవచ్చు, అలిఖిత వ్యాకరణం కన్నా లిఖిత వ్యాకరణం అసమగ్రంగా ఉంటుంది గనుక అలి ఖిత వ్యాకరణ సమ్మతి అనే అర్థం ఇయ్యటమే ఎక్కువ సబబైనది.

వ్యాకరణసమ్మతి (grammaticality), వ్యవ హర్త సమ్మతి (acceptability) ఒకటి కావు. వ్యాకరణసమ్మతమైన ఒకవాక్యం మరీ పెద్దదైతే వ్యవహర్త అర్థబోధ వెంటనే కాలేదని నిరాకరించ వచ్చు. వ్యాకరణవిరుద్ధమైనా ఒకవాక్యం అర్థబోధ

త్వరగా చెయ్యగలిగితే వ్యవహర్త దాన్ని అంగీకరించవచ్చు. కొన్ని స్పష్టమైన ఉదాహరణల విషయంలో వ్యాకరణ విరుద్ధమైన వాటిని వ్యవహర్త చప్పున గుర్తించి నిరాకరిస్తాడు. 'నువ్వు వెళ్ళవచ్చు' అనే అర్థంలో 'వచ్చు నువ్వు వెళ్ళ' అనేది ప్రయోగించటం వ్యాకరణ విరుద్ధమని వ్యవహర్త గుర్తించగలడు. అట్లాగే "నేను తెలుగువాడు" అనే వాక్యంలో కర్తను బోధించే ప్రత్యయం చేర్చి 'తెలుగువాణ్ణి' అనాలని వ్యవహర్త చెప్పగలడు. పదక్రమ వ్యత్యయం, ప్రత్యయ విధానలోపం వంటి వాటిని గుర్తించటంలోను నిరాకరించటంలోను వ్యవహర్త ఆలోచించనక్కర్లేదు. కాని భిన్నపదాల పరస్పరవ్యాకరణ సంబంధాల ఉల్లంఘనని వ్యవహర్తలు కారణం చెప్పగలిగేట్టు గుర్తించటం కష్టం. మొదట పేర్కొన్న పదక్రమ వ్యత్యయం వంటివి సాధారణ పరిస్థితుల్లో మాతృభాషావ్యవహర్తలు చెయ్యరు. వ్యాకరణసంబంధాల ఉల్లంఘన తరచుగా మాతృభాషా వ్యవహర్తలు చేస్తుంటారు. ఈ ఉల్లంఘనను కవులూరచయితలూ ఇంకా ఎక్కువ చేస్తారు. ఈ ఉల్లంఘన కవిత్వంలో అవసరమవుతుంది కూడా. అట్లా ఉల్లంఘించిన వచనాన్ని కవితాస్పర్శ ఉన్న వచనంగా మనం మెచ్చుకుంటాం. పైన ఉదాహరించిన పంక్తుల జోగారావుగారి వాక్యం అట్లాంటిదే.

వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలు ప్రయోగానర్హాలని అనటం ఇక్కడ ఉద్దిష్టం కాదని స్పష్టమే. వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలు ప్రయోజనాన్ని అనుసరించి మనం తరచుగా ప్రయోగిస్తుంటాం. ప్రయోగం వ్యవహారానికి సంబంధించింది అంటే ప్రవృత్తి (performance) గతమైనది. వ్యవహర్త సమ్మతికూడా అంతే. ప్రాచీన (గ్రాంథిక) భాష వ్యాకరణ సమ్మతమైనదని, ఆధునిక (వ్యవహార) భాష వ్యాకరణ విరుద్ధమైనదని మనలో కొందరనుకోటానికి కారణం వారి శిక్షణవల్ల ఏర్పడిన నిశ్చితాభిప్రాయాలే. ఇదీ ప్రవృత్తికి సంబంధించిందే. ఆటంకాలు, పరిమితులు (limitations) ప్రవృత్తికే.

వ్యాకరణ సమ్మతి ప్రతిభకు సంబంధించింది. వ్యవహర్త సమ్మతి ప్రవృత్తికి సంబంధించింది. ఈ రెండూ ఒక్కసారి కలవవచ్చు. భిన్నం కావటమూ అరుదుకాదు. వ్యవహర్త ప్రతిభానిరూపణమే లిఖితవ్యాకరణం చెయ్యాల్సిన పని. అప్పుడు ప్రవృత్తిని కూడా అర్థంచేసుకోటం తేలికవుతుంది. ప్రవృత్తి ప్రతిభమీద ఆధారపడి ఉంటుంది, ప్రతిభను నిరూపించటానికి ప్రవృత్తి ఆధారాలను (evidence) ఇస్తుంది:

ఒక్కొక్కజాతి సామాజికావసరాల్ని బట్టి ఏవి ప్రయోగించాలి ? ఏవి ప్రయోగించ గూడదు అని సూచించే గ్రంథాలు ఒక్కోకాలంలో ఉండవచ్చు. వాటినికూడా వ్యాకరణాలని వ్యవహరించటం ఇంకో మంచిమాట దొరక్కనే, విద్యార్థులు పాఠశాలల్లో చదివే 'వ్యాకరణాలు' ఇట్లాంటివే. వాటిని guide books అనో, style books అనో వ్యవహరించుకోవచ్చు.

వ్యాకరణ సమ్మతి-అసమ్మతి అంతస్పష్టంగా గిరిగీసి చెప్పదగిన లక్షణాలు కావు. బాగా వ్యాకరణ విరుద్ధమైన వాటిని అందరూ గుర్తించగలుగుతారు. ఉదాహరణకు హైదరాబాదు సుల్తాన్ బజారులో, "ఇచ్చట కాఫీగింజలను పొడుముచేసి ఇవ్వబడును" అని రాసిన బోర్డు ఒకటి ఉంది. అట్లాగే తిరుపతి కొండమీద "యాత్రికులు ఇచట ఉచితముగా చెప్పులు ఉంచుకొని వాపసు ఇవ్వబడును" అనే వాక్యం ఉంది. కారణం చెప్పలేక పోయినా ఈ రెండూ వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలని చాలా మంది గుర్తించ గలుగుతారు. మొదటి వాక్యంలో తృతీయా విభక్తి తీసివేస్తే వ్యాకరణ సమ్మత మవుతుంది. రెండో వాక్యంలో 'ఇవ్వబడును' తొలగించి 'తీసుకోవచ్చును' అంటే వ్యాకరణ సమ్మత మవుతుంది. ఈ రెండు వాక్యాలు బహుశా తెలుగు వాళ్ళే రాసి ఉంటారు. అనవధానతవల్ల ఈ పొర

పాటు జరిగి ఉండవచ్చు. (అనవధానత ప్రవృత్తి కున్న పరిమితుల్లో ఒకటి). అయితే అన్నిచోట్లా ఇది వ్యాకరణ విరుద్ధం, ఇది వ్యాకరణ సమ్మతం అని స్పష్టంగా చెప్పలేం. 1969 జులై నెలలో ఆంధ్రప్రభ దినపత్రికల్లో "ఆమాకీ తెలియని శ్రీధరరెడ్డి" అని, "జాడ తెలిసిన నౌక" అని రెండు వేరువేరు ఉపశీర్షికలు అచ్చు అయినై. ఇవి వ్యాకరణ సమ్మతమా? విరుద్ధమా ? వెంటనే తేల్చి చెప్పటం కష్టం. అట్లాగే 1969 ఫిబ్రవరి 23 (ఆదివారం) ఆంధ్రప్రభదినపత్రికలో శ్రీమతి సదాలక్ష్మి ఉపన్యాస భాగంగా ఈ వాక్యం ఉంది.

"తెలంగాణ సిబ్బందిపై ఎటువంటి దౌర్జన్యాలు జరిగాయని వూహించుకొనడానికి శ్రీకొండాలక్ష్మణ్ బాపూజీ ప్రకటన అవకాశమిస్తున్నది."

ఈ వాక్యమూ వ్యాకరణ సమ్మతమో కాదో త్వరగాచెప్పలేం. బహుశా అని బదులు ఓ ఉప యోగిస్తే ఎక్కువ వ్యాకరణ సమ్మతమయ్యేదేమో.

దీన్నిబట్టి వ్యాకరణ సమ్మతిలో తరతమ భేదాలు (degrees of grammaticality) ఉంటయ్యని తెలుస్తుంది. ఉల్లంఘించిన సూత్రాల స్వభావాన్ని బట్టి, సంఖ్యనుబట్టి బహుశా దీన్ని కొలవటం సాధ్యం కావచ్చు.

### శాస్త్ర, వ్యాకరణాలు సాధించాల్సిన సమగ్రతలు

వ్యాకరణాలూ, శాస్త్రమూ సాధించాల్సిన సమగ్రతలను మూడురకాలుగా విభజించవచ్చు. 1. ఒక భాషలో వ్యాకరణ రచనానుకూల వాక్యాలను సేకరించి వాటిని వర్ణమూ, పదాంశం వంటి చట్రాలకు సరిపోయేట్టుగా విభజించి, అక్షరబద్ధం చెయ్యటం. ఇట్లాచేసిన వ్యాకరణం పరిశీలన సమగ్రత (obser vational adequacy)ను సాధించిందనవచ్చు. పైకి తేలిగ్గా కనిపిస్తున్నా, దీన్ని సాధించటంకూడా అనుకున్నంత తేలికకాదు. వ్యవహర్త ప్రతిభ ఏ వాక్యాల్లో ప్రతిఫలిస్తుందో, ఏ వాక్యాలు వ్యాకరణ రచనార్హాలో తేల్చుకోటంకూడా కొంత కష్టసాధ్యమే. ఒక్కోసారి సేకరించిన వాక్యాలు బహుళసంఖ్యాకాలైనా, వ్యవహర్త ప్రతిభను సమగ్రంగా ప్రతిఫలించక వ్యాకరణరచనకు అనర్హాలో అసమగ్రాలో కావచ్చు. 2. ఒక వ్యాకరణం వ్యవహర్త ప్రతిభను, అతని భాషా-వ్యాకరణ పరిజ్ఞానాన్ని సరిగ్గా వివరించి, పరిశీలించిన వాక్యాల్లో అంతర్నిహితంగాఉన్న నియమావళిని సూత్రపద్ధతిలో నిర్వచించగలిగితే ఆ వ్యాకరణం వర్ణన సమగ్రత (descriptive adequacy) ను సాధించిందనవచ్చు. ఈ నియమావళి పరిశీలించిన వాక్యాలకే పరిమితం కాదు. వ్యవహర్త కున్న వ్యాకరణ పరిజ్ఞాన సర్వస్వాన్ని బింబించగలగాలి. అంటే వ్యవహర్త అధీనంలో ఉన్న అంతర్గత వ్యాకరణానికి బాహిరరూపాన్ని కల్పించాలి. 3. పరిశీలించిన వాక్యాలను వ్యాకరించటంలో వ్యాకరణాల్లో భిన్నత్వం ఉండవచ్చు. అందులో ఏవ్యాకరణం వ్యవహర్త ప్రతిభను ఎక్కువ ప్రతిబింబించిందో ఎంచి చూపించగలిగిన భాషాసిద్ధాంతం (linguistic theory) వివరణ సమగ్రత (explanatory adequacy) ను సాధించిందనవచ్చు. వర్ణన సమగ్రతను సాధించినవ్యాకరణానికి సహేతుకమైన, శాస్త్రీయమైన (principled basis) వివరణను భాషాసిద్ధాంతం ఇస్తుంది. వర్ణన సమగ్రతను సాధించిన వ్యాకరణం స్వభాషలో వ్యవహర్తకున్న పరిజ్ఞానాన్ని ప్రతిబింబిస్తే, అట్లాంటి వ్యాకరణం వ్యవహర్త నిర్మించుకోటానికి అతనిలో ఉన్న (ఇది జన్మసిద్ధమని పూర్వమే చెప్పబడింది) శక్తులను భాషాసిద్ధాంతం ప్రతిబింబిస్తుంది. అంటే భాషాసిద్ధాంతమూ, స్వభాషా వ్యాకరణమూ వ్యవహర్తకున్నయ్యన్నమాట. వ్యవహర్తలో అంతర్గతంగా ఉన్న వాటిని సిద్ధాంతీకరించటమే భాషా శాస్త్రమూ, వ్యాకరణమూ చెయ్యాల్సిన పనులు. నిజానికి రెండూ సాధించటం బహుకష్టం. వ్యవహర్తకున్న సిద్ధాంతాన్ని, వ్యాకరణాన్ని ఇంద్రియాల ద్వారా గ్రహించలేం. భౌతిక పరికరాల

ద్వారా అసలే సాధించలేం. వీటిని సాధించటానికి ప్రత్యక్షమైన, సూటి అయిన(direct evidence) మార్గాలు లేవు. నిరంతర పరిశోధన ద్వారా శాస్త్రజ్ఞులు సాధించాల్సినవి. ఇంతవరకూ ఏభాషకూ వర్ణన సమగ్రతను సాధించిన సంపూర్ణ వ్యాకరణం లేదు. కాకపోతే భాషైకదేశాలకు మాత్రం అటువంటి ప్రయత్నాలు విస్తారంగా జరిగినై. అట్లాగే వివరణ సమగ్రతను సాధించిన భాషాసిద్ధాంతం లేనే లేదు. పరివర్తన సిద్ధాంతం ఆమార్గంలో కొంత విజయాన్ని సాధించగలిగింది. ఈ సిద్ధాంతమూ 1957 నుంచి ఇంతవరకూ ఎంతగానో మారింది. ఇంకా ఎన్నో మార్పులు రాబోతున్నై. అయినా వ్యాకరణమూ, శాస్త్రమూ క్రమంగా వర్ణన సమగ్రతను, వివరణ సమగ్రతను లక్ష్యాలుగా ఉంచుకోకపోతే భాషాపరిశోధన గుడ్డెద్దు చేలో పడ్డట్టుగా ఒక దారీతెన్నూ లేకుండా పోతుంది.

ఛామ్స్కీకి పూర్వపు శాస్త్రజ్ఞులు మొదటినుంచీ పేర్కొన్న పరిశీలన సమగ్రత కోసమే శక్తియుక్తుల్ని వెచ్చించారు. తాము పరిశీలించిన వాక్యాలను పదాంశాలుగా, అవయవులుగా వేర్పాటు చెయ్యటమే వ్యాకరణ లక్ష్యమని వారనుకున్నారు. అంతేకాని భాషలో అంతర్నిహితంగా ఉన్న సామాన్య సూత్రాలను పట్టుకోటానికి ప్రయత్నించలేదు. వారి వ్యాకరణం తరచుగా వారు సేకరించిన వాక్యాల (corpus) కే పరిమితమై ఉండేది. వ్యవహర్త ప్రతిభకు బదులు, ప్రవృత్తినే ధ్యేయంగా పెట్టుకొన్నారు. ప్రవృత్తిని సాధించాలన్నా ప్రతిభా వర్ణన ద్వారానే అది సాధ్యమని వారు గమనించలేదు. ఒకభాషకు సాధ్యమైన రెండు మూడు వ్యాకరణాల్లో మేలైనదాన్ని ఎంచి చూపగలిగిన భాషాశాస్త్రాన్ని నిర్మించుకోవాల్సిన అవసరాన్ని కూడా వారు గుర్తించలేదు. అట్లాంటి యంత్రాగం ఒకటి వ్యవహర్తకున్నదన్న విషయాన్ని వారి తత్వం (philosophy) అంగీకరించదు. ఈ పరిస్థితికి కారణం అనుభవవాద (empiricism), ప్రవృత్తి వాదాల (behaviourism) ప్రభావమే నని ఇంతకు ముందు చెప్పుకున్నాం. హేతువాద (rationalism) తత్త్వమార్గంలో పయనిస్తున్న పరివర్తన సిద్ధాంతం (transformational theory) వ్యవహర్తకున్న సిద్ధాంత వ్యాకరణ పరిజ్ఞానాన్ని సాధించబూనుకోవటంలో ఆశ్చర్యం లేదు. అందుకే ఈ సిద్ధాంతానుయాయుల లక్ష్యాలు వర్ణన సమగ్రత, వివరణ సమగ్రత.

వ్యాకరణం-భాషాసిద్ధాంతం చెయ్యాల్సిన పనులను ఇప్పుడింకా విపరంగా ఈ విధంగా చెప్పుకోవచ్చు.

వ్యాకరణం

1. వ్యాకరణ సమ్మతమైన వాక్యాల నన్నిటినీ నిష్పన్నం చెయ్యాలి. వ్యాకరణ విరుద్ధ వాక్యాలను నిష్పన్నం చెయ్యగూడదు.

2. నిష్పన్న వాక్యాలన్నిటికీ ఆటొమేటిక్‌గా నిర్మాణవర్ణన(structural description) చెయ్యాలి. అంటే వాక్యంలో పదాల పరస్పర సంబంధాల్ని సక్రమంగా నిర్వచించాలి.

3. భిన్నార్థ బోధక వాక్యాలకు ఏ వ్యాకరణ సంబంధాల మూలకంగా భిన్నార్థ బోధకత వచ్చిందో వివరించాలి. అంటే ఎన్ని అర్థాలున్నయ్యో అన్ని నిర్మాణవర్ణనలు ఇయ్యాలి.

4. ఒకదాని కొకటి వివరణ ప్రాయాలైన రెండు వాక్యాల్లో ఉన్న వ్యాకరణ సామ్యాన్ని నిరూపించాలి.

5. స్థూలదృష్టికి ఒకే రకంగా కనిపించే వాక్యాల్లో ఉన్న వ్యాకరణ భేదాన్ని నిరూపించాలి.

6. వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలు ఎందుకు వ్యాకరణ విరుద్ధాలో చూపించగలగాలి.

వ్యాకరణ విరుద్ధ వాక్యాల్లో తరతమ భేదాల్ని (degrees of grammaticality) కొలిచే పద్ధతిని కూడా సూచించాలి. వ్యాకరణ సమ్మత

వాక్యాల సాయంతో వ్యాకరణ విరుద్ధ వాక్యాల అర్థవివరణను ప్రసాదించాలి.

ఈ శక్తులన్నీ స్వభాషవిషయంలో వ్యవహర్త కున్నయ్యని ఇంతకు ముందే చెప్పుకున్నాం.

భాషా సిద్ధాంతం

1. వ్యాకరణ సూత్రమంటే ఏమిటో నిర్వచించాలి.

2. వ్యాకరణంలో ఉపయోగించే గుర్తులను (symbols) అన్ని భాషల కనువర్తించేట్టు నిర్వచించాలి. అంటే నామబంధం, క్రియాబంధం అనే వాటిని ఏభాష కాభాషకు విడివిడిగా కాకుండా సర్వభాషా సామాన్యంగా నిర్వచించాలి.

3. వ్యాకరణ స్వరూప స్వభావాలను నిర్ణయించాలి. మానవ భాషలకు సాధ్యమైన వ్యాకరణాలను నిర్ణయించాలి.

4. ఒక భాషకు సాధ్యమైన రెండుమూడు వ్యాకరణాల్లో ఏది మేలైనదో నిర్ణయించటానికి యాంత్రిక పద్ధతి (mechanical procedure, algorithm) ని సూచించాలి.

ఈ యంత్రాంగం మానవులందరికీ జన్మ సిద్ధమని పూర్వమే చెప్పబడింది.

పునరావృత్తి సూత్రాలు
**(Recursive rules)**

పైన చెప్పిన వాటిని సాధించాలంటే వ్యాకరణం, శాస్త్రం ఎట్లా ఉండాలి అనే ప్రశ్నలుత్పత్తి కావటం సహజం.

వాక్యాల దైర్ఘ్యానికి పరిమితి లేదని పూర్వం చెప్పుకున్నాం.ఒకవాక్యంలో మరోవాక్యం ఇమడడం వల్ల వాక్యం పొడుగు పెరుగుతుంది. దీన్ని అనుమతించే సూత్రాలు వ్యాకరణంలో ఉండాలి. ఒక సూత్రం పదేపదే అనంతంగా అనువర్తించ గలగటం పునరావృత్తి. తెలుగులో క్త్వార్థక క్రియలు అనంతంగా ఉపయోగించి వాక్యాన్ని పెంచవచ్చు. అనుకరణ వాక్యాల్ని కూడా అట్లాగే పెంచవచ్చు. ఉదాహరణకి తెలుగుభాషా వ్యాకరణంలో ఈ కింది సూత్రా లున్నయ్యనుకొందాం.

1. వాక్యం ⟶ { విధి / ప్రశ్న / వ్యతిరేకం } నామబంధం – అఖ్యాతబంధం

2. అఖ్యాతబంధం ⟶ (కారకబంధం) { నామబంధం / క్రియాబంధం / విశేషణం }

3. క్రియాబంధం ⟶ (నామబంధం) క్రియాపదం

4. నామబంధం ⟶ { నామం / సర్వనామం / వాక్యం }

ఈ సూత్రాలన్నిటినీ వివరించటం ఇక్కడ సాధ్యం కాదు. ఇక్కడ ముఖ్యంగా గుర్తించాల్సింది మొదట ప్రారంభించిన వాక్యం అనే గుర్తు (symbol) నాలుగో సూత్రంలో కుడిపక్కన వచ్చింది. కుడి పక్కన వచ్చిన ఈ గుర్తు మీద మొదటి సూత్రం మళ్ళీ వర్తించి వాక్యాన్ని మళ్ళీ ఆ సూత్రంలో సూచించినట్లుగా విడదీస్తుంది. ఆ తరవాత మిగిలిన సూత్రాలన్నీ వెంటవెంటనే వర్తిస్తే. నాలుగో

సూత్రం వరకు వచ్చినప్పుడు మళ్ళీ అందులో వాక్యం అనే గుర్తు ఉంటే మళ్ళీ మొదటినుంచే వర్తిస్తై. ఇట్లా ఈ సూత్రాలన్నీ ఎన్నిమాట్లయినా వర్తించే అవకాశం ఉండటంవల్ల వాక్యం అనంతంగా పెరుగుతుంది. ఎడంవైపు గుర్తు ఒకటి ఒకానొక నిర్ణీత ప్రదేశంలో కుడివైపున కూడా రావటంవల్ల ఈ అవకాశం కలుగుతున్నది. అనంతమైన వాక్య నిర్మాణానికి సూత్రాలు అనంతంగా వర్తించటానికి వీలుండటం వల్ల ఈ అవకాశం కలుగుతున్నది. ఇట్లాంటి సూత్రాల్ని పునరావృత్తి సూత్రాలంటారు.

### గుప్త వ్యక్త నిర్మాణాలు
### (Deep and Surface structures)

పైన పేర్కొన్న సూత్రాలు పరివర్తన వ్యాకరణం (transformational grammar) లో వాక్యపరిచ్ఛేదంలో మూల విభాగం (base component)లో వచ్చే పదబంధ నిర్మాణ (phrase structure) సూత్రాలు. ఈ సూత్రాలు వాక్యంలో పదాల వ్యాకరణ సంబంధాలను నిర్వచిస్తై. ఈ సూత్రాలు, ఇంకా మరికొన్నిరకాల సూత్రాలు అనువర్తించిన తరువాత వచ్చే వ్యాకరణ నిర్మాణాన్ని గుప్త నిర్మాణం (deep structure) అంటారు. దీనిమీద పరివర్తన విభాగం (transformational component) లో సూత్రాలు వర్తించిన తరవాతవచ్చే వ్యాకరణ నిర్మాణాన్ని వ్యక్త నిర్మాణం (surface structure) అంటారు. వాక్యంలో అర్థానికి గుప్త నిర్మాణానిదే ప్రధాన బాధ్యత. పరివర్తన సూత్రాలు (transformational rules)వాక్యార్థాన్ని (ప్రాధాన్య వివక్షను మినహాయించి) మార్చలేవు. వ్యక్త నిర్మాణంమీద వర్ణవిభాగం (phonological component) లో సూత్రాలు వర్తిస్తే వాక్యోచ్చారణ విధానం తెలుస్తుంది. ఈ గుప్త వ్యక్త నిర్మాణభేదాల గుర్తింపు వ్యాకరణంలో అతి ముఖ్యమైనదని ఛామ్స్కీ అభిప్రాయం.

ఒక వాక్యంలో అంతర్నిహితంగా ఉండి బయటికి వెంటనే స్ఫురించనిది గుప్తనిర్మాణం. సాధారణంగా బయటికి కనిపించేది వ్యక్త నిర్మాణం. గుప్త నిర్మాణాన్ని గుర్తించటం వ్యక్తనిర్మాణం ఇచ్చే సాక్ష్యం మీదనే ఆధారపడి ఉంటుంది. ఇంతకుపూర్వం ఉదాహరించిన 2, 3, 4, సంఖ్య గల వాక్యాల్లో ఇందుకు సాక్ష్యం ఉంది. ఒక వాక్యానికి వ్యాకరణసంబంధమూలకమైన అర్థభేదాలుంటే దానికి భిన్న గుప్త నిర్మాణాలను సూచించాలి. రెండు వాక్యాలు పైకి ఒకటేగా కనిపిస్తున్నా వ్యాకరణ సంబంధాల్లో భేదం (నామ్నీకరణాములవల్ల) కనిపిస్తే కూడా భిన్న గుప్త నిర్మాణాలను గుర్తించాలి. రెండు వాక్యాల్లో ప్రధానంగా ఒకే అర్థం ఉంటే రెంటికీ ఒకే గుప్త నిర్మాణాన్ని చూపించాలి. రెండు చూపించాల్సివస్తే రెంటిల్లో ఆ సామ్యాన్ని చూపించాలి. గుప్త వ్యక్తనిర్మాణాల మధ్య ఉండే సంబంధాల్ని ఈ కింది విధంగా బొమ్మతో చూపించవచ్చు.

8.

i. $X$ —— $Y$

ii. $X < \begin{matrix} Y_1 \\ Y_2 \end{matrix}$

iii. $\begin{matrix} X_1 \\ X_2 \end{matrix} > Y$

ఇందులో X గుప్తనిర్మాణాన్ని Y వ్యక్త నిర్మాణాన్ని సూచిస్తై. మొదటి బొమ్మలో ఉన్న పరిస్థితి మాత్రమే ఉంటే గుప్త వ్యక్త నిర్మాణ భేదాల్ని గుర్తించక్కర్లేదు. కాని మిగతా రెండు స్థితులూ భాషలో ఉన్నై. రెండో బొమ్మలో ఒక గుప్తనిర్మాణానికి రెండు వ్యక్త నిర్మాణాలు సూచింపబడినై. (ఈ బొమ్మల్లో 2 బహుత్వానికి గుర్తు.) మూడో బొమ్మలో రెండు గుప్తనిర్మాణాలూ ఒకే వ్యక్త నిర్మాణంగా వ్యక్తమయినై. వీటికి కొన్ని ఉదాహరణలు.

9. శ్రీశ్రీ కుక్కపిల్లమీద కవిత్వం రాశాడు
శ్రీశ్రీ కుక్కపిల్లనుగురించి కవిత్వం రాశాడు.

పై రెండు వాక్యాలు పైకి భిన్నంగా ఉన్నై. భిన్నవిభక్తులు ప్రయుక్తమయినై. అయినా బోధించే కారకం ఒకటే. పైన రెండోబొమ్మలో సూచించిన పరిస్థితికి ఇది ఉదాహరణ.

10. అతను కాఫీ తాగి కవిత్వం రాయలేదు.

ఇందులో 1. అతను కాఫీ తాగాడు కాని కవిత్వం రాయలేదు. 2. అతను కవిత్వం రాశాడు కాని కాఫీ తాగలేదు అనే రెండర్థాలున్నై. ఈ అర్థాలు భిన్నార్థాలున్న శబ్దాల వల్ల రాలేదు. వ్యతిరేకాన్ని సూచించే శబ్దం అన్వయించే తీరులోని భేదంవల్ల వచ్చింది. వ్యతిరేక బోధకశబ్దాన్వయ భేదాన్ని సూచించే భిన్న గుప్త నిర్మాణాల ద్వారానే పైన పేర్కొన్న రెండర్థాలు సాధ్యమవుతై.

11. నేను కమలతో వెళ్ళాను.
నేను కమలతో చెప్పాను.

పైరెండు వాక్యాలు స్థూలదృష్టికి ఒకే రకంగా ఉన్నా గుప్తనిర్మాణంలో భేదం ఉంది. నామీన్కరణంలో వ్యక్తమవుతుంది. రెండో వాక్యం నుంచి 'నేను చెప్పిన కమల' అనే నామబంధాన్ని నిష్పాదించినట్లుగా మొదటి వాక్యం నుంచి 'నేనువెళ్ళిన కమల' అని నిష్పాదించలేం. మొదటి వాక్యంలో కమల 'అముఖ్య' కర్త. రెండో వాక్యంలో 'కమల' అముఖ్య కర్మ. ఇది మూడో బొమ్మలో సూచించిన పరిస్థితికి ఉదాహరణ.

ఒక్కొసారి వ్యక్తనిర్మాణం కనిపించని వాటిని గుప్తనిర్మాణంలో నిర్దేశించాలి. అట్లాంటి నిర్దేశం లేకపోతే వ్యవహర్త వాక్యాన్ని అర్థం చేసుకునే తీరుకు గతి కల్పించ లేకపోతాం.

12. సుమిత్ర వంటచెయ్యటం పూర్తి చేసింది.

పై వాక్యంతో సుమిత్రను రెండు క్రియలకూ కర్తగా అర్థం చేసుకుంటున్నాం. పై వాక్యం సంశ్లిష్టవాక్యం. అంటే ఒక వాక్యంలో ఇంకోటి ఇమిడి ఉంది. గుప్త నిర్మాణంలో ఈ రెండు వాక్యాల్ని చూపి వాటి కర్తలను కూడా సూచించాలి. అప్పుడే వ్యవహర్త ఈ వాక్యాన్ని అర్థంచేసుకునే తీరు తెలుస్తుంది.

పై ఉదాహరణలనుబట్టి ఈ వాక్యనిర్మాణంలో గుప్త వ్యక్త నిర్మాణాలభేదం అవసరమని, అట్లాంటి భేదాన్ని గుర్తించిన వ్యాకరణమే వ్యవహర్త ప్రతిభను సరిగ్గా ప్రతిఫలించ గలుగుతుందని తేలుతుంది. ఈ రకమైన భేదాన్ని సంస్కృత వ్యాకర్తలు కూడా గుర్తించినట్టు కారక విభక్తి సంబంధాల వ్యత్యయ నిరూపణంవల్ల మనం గ్రహించవచ్చు. గుప్త వ్యక్త నిర్మాణాల సంబంధాన్ని తెలియపరిచేవి పరివర్తన సూత్రాలు. గుప్త నిర్మాణాన్ని వ్యక్తనిర్మాణంగా పరివర్తింప జేస్తె గనక వీటి కాపేరు వచ్చింది. ఇట్లాంటి సూత్రాలున్న వ్యాకరణాన్ని పరివర్తన వ్యాకరణం అంటారు. ఈ వ్యాకరణ రూపాన్ని నిర్వచించేదే పరివర్తన సిద్ధాంతం.

## సౌలభ్యం లేక సంక్షిప్తత (Simplicity)

భాషకుగాని భాషైకదేశానికిగాని సాధ్యమైన వ్యాకరణాల్లో మేలైనదాన్ని ఎన్నికచేసేపని భాషా సిద్ధాంతానిదని పూర్వం చెప్పుకున్నాం. సౌలభ్యం అనే కొలబద్దను భాషాశాస్త్రం ఇస్తుంది. ఈసౌలభ్యం రచనాసౌలభ్యంకాదు. వ్యాకరణరచన ఎప్పుడూ క్లిష్టమైనదే. దానికి అడ్డదార్లు లేవు. ఈ సౌలభ్యం ప్రక్రియా సౌలభ్యం. ప్రక్రియాసౌలభ్యాన్నే సంక్షి

ప్తత అని కూడా వ్యవహరిస్తారు. సౌలభ్యం, సంక్షిప్తత అనేవి భాషాశాస్త్రంలో సమానార్థకాలు. ఒకే విషయాన్ని రెండువ్యాకరణాలు ఒక భాషా సిద్ధాంతం సరఫరాచేసిన గుర్తులు (symbols) సూత్రాలు (rules) వాడి వ్యాకరిస్తే తక్కువ గుర్తులు, తక్కువ సూత్రాలు వాడిన వ్యాకరణం మేలైనది అవుతుంది. ఉదాహరణకి (7) సంఖ్యతో ఇచ్చిన సూత్రాల్ని పరిశీలించండి. అందులో నాలుగో సూత్రం ఇక్కడ 13 సంఖ్యతో సూచించిన విధంగా ఉంది.

13. $\text{నామబంధం} \longrightarrow \left\{ \begin{matrix} \text{నామం} \\ \text{సర్వనామం} \\ \text{వాక్యం} \end{matrix} \right\}$

దీన్నే (14) లో సూచించిన విధంగా కూడా రాయవచ్చు.

14. i. నామబంధం ⟶ నామం
ii. నామబంధం ⟶ సర్వనామం
iii. నామబంధం ⟶ వాక్యం.

(14)లో మూడు సూత్రాలలో చెప్పిందీ 13 తో ఒక సూత్రంలో చెప్పిందీ ఒకే విషయం. కాని (14)కన్నా (13)సంక్షేపమైనది. అందువల్ల (14) కన్నా (13) ఉత్తమమైనది. బ్రాకెట్ల వాడకంవల్ల ఈ సంక్షిప్తత సాధ్యమయింది. అట్లాగే తెలుగు వర్ణవిభాగంలో సాధ్యమైన ఈ సూత్రాలను పరిశీలించండి.

15.

i. $\begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ +\ \text{నాదం} \end{bmatrix} \longrightarrow \begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ -\ \text{నాదం} \end{bmatrix} \ / \ \text{—} \begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ -\ \text{నాదం} \end{bmatrix}$

తెలుగు సంధిలో స్వరలోపానంతరం వచ్చే సూత్రం ఇది. క వర్ణంముందు గ వర్ణం క వర్ణంగా మారుతుందని దీని అర్థం.

ఉదా : అడుగు + కో > అడుక్కో

ii. $\begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ -\ \text{నాదం} \end{bmatrix} \longrightarrow \begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ +\ \text{నాదం} \end{bmatrix} \ / \ \text{—} \begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ +\ \text{కంఠ్యం} \\ +\ \text{నాదం} \end{bmatrix}$

గ వర్ణం ముందు క వర్ణం గ వర్ణంగా మారుతుందని ఈ సూత్రార్థం.

ఉదా : పడక + గది > పడగ్గది.

ఇట్లాంటి సూత్రాలే చ > జ; జ > చ; త > ద; ద > త; ప > బ; బ > ప అనే మార్పులకు కూడా అవసరం. అప్పుడు పైన ఇచ్చిన సూత్రాల వంటివి మొత్తం 8అవుతై. ఈ సూత్రాల్లోనిస్సంశయంగా సాధారణీకరణ (generalization) లోపించింది. ఈ సంధి కార్యాన్నే (16)లో చూపించిన విధంగా సంక్షేపించవచ్చు.

16. $[\pm\ \text{నాదం}] \longrightarrow [\alpha\ \text{నాదం}] \ / \ \begin{bmatrix} \overline{\quad\ } \\ +\ \text{స్పర్శం} \end{bmatrix} \begin{bmatrix} +\ \text{స్పర్శం} \\ \alpha\ \text{నాదం} \end{bmatrix}$

పై (15) లో సూచించిన సూత్రాలు ఎనిమిదింటిలో చెప్పిన విషయాన్ని (16) లో ఒక సూత్రం చెప్ప గలిగింది.

పరస్పర్శం నాదం అయినప్పుడు పూర్వ స్పర్శం నాదం అవుతుందని పరస్పర్శం శ్వాసం [— నాదం] అయినప్పుడు పూర్వ స్పర్శమూ శ్వాసమవుతుందని పైసూత్రం చెపుతుంది. α అనే గుర్తు + నీ, — నీ, కూడా సూచిస్తుంది. అయితే బాణానికి ఎడం పక్కనున్నదానికి విరుద్ధమైన గుర్తుమాత్రం అయి ఉంటుంది. (15)లో సూత్రాలకన్నా (16)లో సూత్రం సంక్షేపమైనదని స్పష్టమే. కేవలం సూత్రసంఖ్యను, వాడిన గుర్తులను లెక్క పెట్టటంద్వారా ఈ సంక్షిప్తతను కొలవవచ్చు. మొదటే చెప్పినట్టుగా ఒక శాస్త్ర సిద్ధాంతాన్ని పాటించి రచించబడ్డ వ్యాకరణాల్లో మాత్రమే ఈ సంక్షిప్తతను కొలవటం సాధ్యం అవుతుంది

## భాషా - వ్యాకరణసామాన్యాలు

## (Language and Linguistic Universals)

భాషా సిద్ధాంతం వ్యాకరణ స్వరూపాన్ని నిర్వచించి నిర్ణయిస్తుందని చెప్పుకున్నాం. సర్వభాషలకూ సంబంధించిన సామాన్య విషయాలు భాషా సిద్ధాంతంలో భాగాలవుతై. ప్రతిభాషలోనూ విధి, ప్రశ్నార్థక, వ్యతిరేక, అనుకరణ వాక్యాలు, నామ క్రియా బంధాలు, వ్యంజనాలు, స్వరాలు, స్పర్శాలు అనునాసికాలు ఉంటయ్యని భాషా శాస్త్రమే చెప్పుతుంది. వీటిని భాషాసామాన్యాలు (Language Universal or Substantive Universals) అంటారు. ప్రతిభాషా వ్యాకరణంలోనూ గుప్త వ్యక్తనిర్మాణాల వేర్పాటు అవసరమని, గుప్త నిర్మాణాన్ని వ్యక్త నిర్మాణంగా మార్చే పరివర్తన సూత్రాలుంటయ్యని, ఈ సూత్రాల వరస నియతమని, ఇవి వర్తులక్రమవర్తన (cyclical order) కలిగి ఉంటయ్యని భాషాశాస్త్రమే చెపుతుంది. వీటిని వ్యాకరణ సామాన్యాలు (Linguistic universals or Formal universals) అంటారు. భిన్నభాషలమీద పరిశోధన పెరిగినకొద్దీ ఆయా భాషలకుగాని, భాషా వ్యాకరణాలకు గాని ప్రత్యేక మనుకొన్న ఎన్నో విషయాలు సర్వభాషా వ్యాకరణ సామాన్యాలుగా తేలి భాషా సిద్ధాంతంలో భాగాలుగా కలిసిపోతై. సర్వభాషా వ్యాకరణ సామాన్యాలు భాషాసిద్ధాంతంలో భాగాలవుతై గనక విడివిడిగా రచించే భాషావ్యాకరణాల్లో వీటిని ప్రస్తావించనక్కర్లేదు.

ఈవిధంగా భిన్నభాషలమీద లోతైన పరిశోధన జరిగినకొద్దీ వ్యాకరణాలమధ్య అంతరం తగ్గిపోతుంది. ఇటీవల భాషలన్నిటికీ ఒకే గుప్త నిర్మాణం సాధ్యమని కొందరు ప్రతిపాదించారు. పరివర్తన సూత్రాల్లో కూడా కొన్ని సర్వవ్యాకరణ సామాన్యమైనవి ఉండవచ్చు. ఉదాహరణకు ప్రత్యక్షానుకృతిలో (direct report) ఉన్న ఉత్తమ పురుష సర్వనామాన్ని పరోక్షానుకృతి (indirect report) లో ప్రథమ పురుషగా మార్చేపరివర్తన సూత్రం సర్వవ్యాకరణ సామాన్యమై ఉండాలని ఈ వ్యాసకర్త ఊహ. అట్లాగే ఈ వ్యాసంలో (4) సంఖ్యతో ఉదాహరించిన వాక్యాల్లో చూపించిన విధివిషేధాలు చాలా భాషల్లో కనిపిస్తున్నై. ఇవి అన్ని భాషల్లోనూ కనిపిస్తే ఈ రకపు వాక్యాలను సాధించే ఈ పరివర్తన సూత్రం సర్వవ్యాకరణ సామాన్య మవుతుంది. ఇదే నిజమైతే ఇది కూడా భాషా సిద్ధాంతంలో భాగమే అవుతుంది. ఈ పరిశోధనలవల్ల వ్యాకరణాల మధ్య కూడా భేదం కూడా నియతమైన పద్ధతుల్లోనే ఉంటుందని తేలుతున్నది. నామ్నీకరణ విధానంలో టర్కిష్, జావనీస్, ద్రావిడభాషలమధ్య ఎన్నో సమాన ధర్మాలున్నై. ఈ భాషల్లో ఒకేరకపు పరివర్తన సూత్రాలు చాలా ఉండవచ్చు. ఇంతేకాక ఈభాషల పరివర్తన సూత్రాలకీ ఇంగ్లీషు మొదలైన భాషల పరివర్తన సూత్రాలకీ బింబప్రతిబింబ భావం (mirrorimage) ఉన్నట్టు కూడా ఇటీవలి పరిశోధనవల్ల తేలింది. ఇదంతా ఒక భాషా సిద్ధాంత పరిధిలో పరిశోధన సాగటంవల్లనే సాధ్యమయింది. అందువల్ల భాషా పరిశోధనకు భాషా సిద్ధాంతబలం

అవసరం. అట్లాగే ఈపరిశోధనవల్ల భాషాసిద్ధాంతం కూడా విస్తృతమూ, పటిష్ఠమూ అవుతుంది. దీన్ని బట్టి భాషా వ్యాకరణ సిద్ధాంతాలు పరస్పరాశ్రితాలని రుజువవుతున్నది. భాషలను గురించిన మన అవగాహన పెరగటమే ఈ నిరంతర పరిశోధనకు ఫలితం.

## ప రి భా ష

అంతర్గత-Internal
అజ్ఞాత-Unconscious
అనంతత్వం-Infinity
అనుభవవాదం-Empiricism
అభిప్రాయప్రకటన-Communication
అమూర్త-Abstract
అలిఖిత-Unwritten
అవయవం-Constituent
అవయవి-Construction
అశ్లిష్టవాక్యం-Simple sentence
ఆఖ్యాతబంధం-Predicate phrase
కారకబంధం-Case phrase
క్రియాబంధం-Verb phrase
గుప్తనిర్మాణం - Deep structure
గుర్తు-Symbol
జన్మగతభావాలు - Innate ideas
జీవితావసరం - Biological necessity
ద్వైధ నిర్మాణం - Duality of patterning
ధ్వనిలిపి - Phonetic script
ధ్వనిసంకేతాలు - Speech symbols
ధ్వనిసామ్యం - Phonetic similarity
నామబంధం - Noun phrase
నిర్మాణవర్ణన - Structural description
నిష్పత్తి - Derivation
పదబంధనిర్మాణం - Phrase structure
పదాంశం - Morpheme
పరిపూరణ - Complementation
పరిశీలనసమగ్రత-Observational adequacy
పరివర్తన - Transformation
పరోక్షానుకృతి - Direct report
పునరావృత్తి సూత్రాలు - Recursive rules
ప్రతిభ - Competence
ప్రత్యక్షానుకృతి - Indirect report
ప్రవృత్తి - Performance
ప్రవృత్తివాదం - Behaviourism
ప్రేరణ - Stimulus
బింబ ప్రతిబింబ భావం - Mirror image
భాషాసామాన్యాలు - Language Universals; Substantive Universals
భాషాసిద్ధాంతం - Linguistic theory
మానవ వర్తన - Human behaviour
మూలవిభాగం - Base component
వక్త - Speaker
వర్ణం - Phoneme
వర్ణన సమగ్రత - Descriptive adequacy
వర్ణవిభాగం - Phonological component
వర్తులక్రమం - Cyclical order
వివరణ సమగ్రత-Explanatory adequacy
విశ్వవ్యాకరణం - Universal grammar
విశ్వసూత్రాలు - Universal laws
వ్యక్త నిర్మాణం - Surface structure
వ్యవహారసమ్మతి - Acceptability
వ్యాకరణ సంబంధాలు - Grammatical relations
వ్యాకరణవిరుద్ధ - Ungrammatical
వ్యాకరణ సమ్మతి - Grammaticality
వ్యాకరణ సామాన్యాలు - Linguistic universals; Formal universals

శ్రోత - Hearer
సంక్షిప్తత - Simplicity
సంశ్లిష్టవాక్యం - Complex sentence
సాధారణీకరణం - Generalization
సృజనాత్మకత - Creativity
సౌలభ్యం - Economy
స్పందన – Response
స్వతస్సిద్ధభావాలు - Innate ideas
హేతువాదం - Rationalism

## SELECTED BIBLIOGRAPHY


*Bloomfield L.* (1933) Language. New York: Holt.

*Chomsky, Noam.* (1955) The Logical structure of linguistic theory.

,, (1956) Three models for the description of language, in I. R. E. Transactions on Information Theory, Volume IT-2, PP. 113–124.

,, (1957) Syntatic structures. The Hague : Mouton.

,, (1959) Review of skinner (1957), Language, 35, PP. 25–58.

,, (1961) Some methodological remarks on generative grammar. Word, 17, PP. 219–239.

,, (1954) Current issues in linguistic theory. The Hauge : Mouton.

,, (1965) Aspects of theory of syntax, Cambridge, Mass : MIT press.

,' (1966) Topics in the theory of generative grammar. The Hague : Mouton.

,, (1966) Cartesian linguistics, New York : Harper & Row.

,, (1967) Language and mind. New York: Harcourt, Brace & World.

,, (1968) Political prospects for the seventies. Link, Volume 19, No. 1. PP. 94–96.

,, (1969) American power and new mandarins, New York: Pantheon.

*Hockett, C. F.* (1958) A course in modern linguistics. New York : Macmillan.

*Hockett, C. F.* (1960) Logical considerations in the study of animal's communications in W. E. Lanyon and W. N. Tavolga (eds) Animal communication. PP. 392–430. American Institute of Biological Science, Washington.

,, (1967) The state of the trt. The Hague: Mouton.

,, *& R. Ascher.* (1964) The human revolution, current anthropology 5 : 1354158.

*Hooton, B.A.* (1937) Apes, men and morons. New York.

*Katz. J. J.* (1964) Mentalism in linguistics : language, 40, P.P. 124–137.

,, (1966) The philosphy of language. New York : Harper & Row.

*Kellog, W. N. & L. A.* (1933) The ape and the child. New York.

*Langacker, R.N.* (1967) Language and its structure. New York, Harcourt, Brace & World.

*Lenneberg, E. H.* (1967) Biological foundations of language. New York : John Wiley.

*Lyons, John.* (1970) Chomsky. London : Fontana.

*Skinner, B. F.* (1957) Verbal behaviour. New York : Appleton-Century Crofts.

శ్రీ కాళూరి హనుమంతరావు

# రామాయణ సమాలోచనము

"యావత్ స్థాస్యంతి గిరయః
సరిత శ్చ మహీతలే
తావద్ రామాయణ కథా
లోకేషు ప్రచరిష్యతి." (బాల. 2.36)

(మహీతలంపై ఎంతవరకు పర్వతములూ నదులూ ఉంటాయో అంతవరకు మూడు లోకాలలోనూ రామాయణకథా ప్రచారం జరుగుతుంది.) అని బ్రహ్మ వాల్మీకి మహాకవిని రామాయణ కావ్యరచనకు ప్రోత్సహిస్తూ ఆశీర్వదించాడు. ఈ రామాయణం ఎన్నివేల సంవత్సరాల పూర్వం రచితమైందో తెలియదు. కాని రచితమైన నాటినుండి సాహిత్యవేత్తలనూ సాధారణ పాఠకులనూ, పండితులనూ, ఆధ్యాత్మిక విజ్ఞానులనూ, అలాగాజనాన్నీ, అందరినీ అలరిస్తూ ఆశ్చర్యపరుస్తూ వస్తున్నది. ప్రపంచంలో ఏ ఇతర కావ్యమూ రామాయణ కావ్యమంతగా ప్రజలను ప్రభావితులను చెయ్య లేదు. ఈ రామాయణ కథను ఎందరో కవులు ఎన్నెన్నో విధాలుగా మలచి కావ్యాలూ నాటకాలూ రచించారు. గాయకులు గానంచేశారు. చిత్రకారులు చిత్రించారు. హరిదాసులు దేవాలయాలలోనూ బహిరంగ ప్రదేశాలలోనూ భక్తిపరవశులై కీర్తించారు.

చిన్నప్పుడు రామాయణం హరికథ వింటూ ఉంటే, రాముడు ఒక్క బాణంతో మారీచుణ్ణి సప్త సముద్రాల అవతల పడవెయ్యడం, ఐదువేలమంది బలశాలులు మోసితెచ్చిన శివుని విల్లు అవలీలగా విరిచి సీతను పెండ్లాడడం, మాయలేడి రామలక్ష్మణులను మోసగించడం, హనుమంతుడు గుభిల్లున సముద్రం మీాంచి దూకడం, సురస నోరు ఎంత పెద్దది చేస్తే హనుమంతుడు అంతకన్నా పెరిగి చటుక్కున చిన్నవాడై ఆమె వదనంలో ప్రవేశించి నిష్క్రమించడం, రాక్షసులు అతని తోకకు ఎన్ని గుడ్డలు చుట్టినా అది ఇంకా పెరుగుతూనే ఉండడం, కుంభకర్ణుణ్ణి నిద్ర లేపడం ఇదంతా మనని ఆశ్చర్యానందభరితులను చేసిఉంటుంది. కొంచెం పెద్దవాళ్ళమయాక శ్రీరాముని గాంభీర్యం, లక్ష్మణుని భ్రాతృప్రేమ, భరతుని ఔదార్యం, హనుమంతుని కార్యదీక్ష, సీత నిర్మల స్త్రీత్వం— వీటికి మనం ముగ్ధులమవుతాము. ఇంకా ఇంకా మనం వివేచన చేసి రామాయణాన్ని మళ్ళీ మళ్ళీ చదివినకొద్దీ ఆ మహాకావ్య నిర్మాణంగురించి గాఢంగా ఆలోచించడం ప్రారంభిస్తాం.

బహుకాలంగా మనదేశంలో రామాయణం దేవుని కథగా, ధార్మిక గ్రంథంగా ఉన్నదున్నట్లు ప్రజలచే శిరోధృతమయింది. వేదాంత దృష్టితో రామాయణానికి అనేక వ్యాఖ్యానాలు వెలశాయి. కాని ప్రజలలో నాస్తికత ప్రబలమైనప్పటినుంచి రామాయణాన్ని కేవల కావ్యంగా, చరిత్రగా వాస్తవిక దృక్పథంతో విమర్శకులు సమీక్షించసాగారు. ఈ విధంగా సమీక్షించడంతో అనేక శంకలు ఉత్పన్నమవసాగాయి. కనుక ఇప్పుడు రామాయణానికి ఈ దృష్టితో పరిశీలనం ఆవశ్యమయింది.

లెక్కలేనన్ని రామాయణాలు ప్రస్తుతం సంస్కృత భాషలోనూ వివిధ దేశభాషలలోనూ ప్రచారంలో ఉన్నాయి. ప్రతి కవీ మూలకథ నుండి కొద్దోగొప్పో మార్పులు చేశాడు. వీటన్నిటి ఫలితంగా ప్రస్తుతం పఠితల మస్తిష్కాలలో వివిధ రామాయణ కథలు సంఘర్షించుకొంటున్నాయి. అసలు వాల్మీకి రచించిన మూల రామాయణకథ

ఏదో చాలామందికి విస్పష్టంగా తెలియని పరిస్థితి ఏర్పడింది.

ప్రస్తుతం లభ్యమవుతున్న వాల్మీకి రామాయణం దేశమంతటా ఒకే విధంగా లేదు వివిధ ప్రాంతాలలో వివిధ పాఠా లుంటున్నాయి. బెంగాల్‌లో ప్రతినీ బొంబాయిలో ప్రతినీ మద్రాసులో ప్రతినీ పోల్చిచూస్తే కొన్ని భాగాలు మాత్రమే మూడిటికీ సామాన్యంగా ఉంటాయని పరిశోధకులంటున్నారు. ఇట్లా దేశంలో వివిధ ప్రాంతాలలో వివిధ ప్రక్షిప్తాలతో సంకీర్ణంగా పెరిగిపోయిన రామాయణాన్ని పరిశీలించి విశ్లేషించి దానిలో సిసలైన వాల్మీకి రచన ఎంతో నిగ్గుతియ్యడం అంత సులభసాధ్యమైన పనికాదు.

కాని ఒక విషయం మాత్రం రామాయణం చదివినప్పుడు మనకి తోస్తుంది. ఎప్పుడో వాల్మీకి మహాకవి రచించిన రామాయణ కావ్యాన్ని పెంచి ఇంకొక కవి ఎవరో (ఈయనని ద్వితీయ వాల్మీకి అందాం) తిరిగి రచించారనీ, ఆ పునారచిత రామాయణమే ఇంకా అనేక ప్రక్షిప్తాలతో ప్రస్తుతం ప్ర చా ర ం లో ఉన్న రామాయణమయిందనీని. ఇందుకు ఆధారంగా ఈ క్రింది విషయాలను చూపవచ్చును.

"నారదస్య తు తద్వాక్యం
శ్రుత్వా వాక్య విశారదః
పూజయామాస ధర్మాత్మా
సహశిష్యో మహామునిః" (బాల. 2,1)

"తస్యాభ్యాశే తు మిథునం
చరంత మనపాయినమ్
దదర్శ భగవాం స్తత్ర
క్రౌంచయో శ్చారునిస్స్వనమ్" (బాల.2.9)

"చింతయన్ స మహాప్రాజ్ఞ
శ్చకార మతిమాన్ మతిమ్
శిష్యం చై వాబ్రవీ ద్వాక్య
మిదం స ముని పుంగవః," (బాల.2.17)

కవి తనను గురించి తాను ప్రథమ పురుషలో చెప్పుకోవడంలో వింత లేదు. కాని 'భగవాన్, మహామునిః, మహాప్రాజ్ఞః, మునిపుంగవః' అని వాల్మీకి తననుగురించి తాను చెప్పుకొని ఉంటాడా ?

"తదుపగత సమాస సంధియోగం
సమమధు రోపనతార్థ వాక్యబద్ధమ్
రఘువర చరితం ముని ప్రణీతం
దశశిర సశ్చ వధం నిశామయధ్వమ్"
(బాల. 2. 43)

"మునివరుడైన వాల్మీకి ప్రణీతమైన రామాయణం వినండి" అని ఇంకొక కవి ఎవరో చెబుతున్నట్లుగా ఈ వాక్యాలు తోస్తున్నాయి. ఇంతేకాక యుద్ధకాండ చివరలో "ఆదికావ్య మిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్" (యుద్ధ. 131. 107), "ఇతిహాసం పురాతనమ్" (యుద్ధ. 131. 116)అన్న వాక్యాలుకూడా పూర్వం ఎప్పుడో వాల్మీకి రచించిన కావ్యాన్ని పెంచి ఇంకొకరు తిరిగి రచించినట్లే సూచిస్తున్నాయి.

క్రౌంచపక్షి హననంచేత అప్రయత్నంగా తన ముఖం నుండి వెలువడిన "మానిషాద" శ్లోకాన్ని మననం చేసుకొని అటువంటి శ్లోకాలలోనే పూర్తిగా రామాయణ కావ్యాన్ని రచించాలని వాల్మీకి సంకల్పించాడు. కాని ప్రస్తుత రామాయణంలో ప్రతిసర్గ చివరలోనూ అనుష్టుప్కన్న ఛందస్సులలో శ్లోకాలు చాలా కనిపిస్తున్నాయి. అంతేకాక కొన్ని చోట్లలో సర్గలో చెప్పినదే తిరిగి సర్గాంతంలో చెప్పడం కనిపిస్తున్నది. కనుక బహుశః సర్గాంత రచనలన్నీ ద్వితీయ వాల్మీకివి కావచ్చునని తోస్తుంది.

బాలకాండ వాల్మీకి కృతముా అని కొందరు విమర్శకులు సందేహిస్తున్నారు. వీరి సందేహానికి కారణం నారదుడు వాల్మీకికి ఉపదేశించిన సంక్షేప రామాయణంలోనూ మహాభారతారణ్య పర్వస్థమైన రామోపాఖ్యానంలోనూ బాలకాండకి సంబంధించిన కథాభాగం ఏమీ లేకపోవడం. బాలకాండలో రాము

నికి సంబంధించిన కథాభాగం ఏమంతగా లేనందు వలన నారదుడు చెప్పిన సంక్షేప రామాయణం లోనూ, మహాభారతాంతర్గత రామోపాఖ్యానంలోనూ చెప్పబడకపోయి ఉండవచ్చును. అంతమాత్రాన వాల్మీకి బాలకాండ వ్రాయకుండా అయోధ్యాకాండతో రచన ప్రారంభించాడని ఎలా చెప్పగలం? బాల కాండలో ఉన్న అనేక కథలలో రెండవ వాల్మీకి రచన కొద్దో గొప్పో చేరి ఉండవచ్చును.

ఉత్తరకాండ ఎవరి రచన? వాల్మీకిదా? వాల్మీకి రచనను పెంచి తిరిగి రచించిన ద్వితీయ వాల్మీకిదా? లేక ఈ ఇద్దరిదీ కాక అన్యునిదా? ఉత్తరకాండలోని కొన్ని కథాంశాలు – కుంభకర్ణ శాపం, రావణ దిగ్విజయం ఇత్యాదులు యుద్ధ కాండలో పేర్కొనబడినాయి. కనుక రామాయణం సప్తకాండలలోని కథ పరస్పరసంబద్ధమై సమైక్యం కలదిగా తోస్తుంది. కాని ఉత్తరకాండలో కొన్ని విరుద్ధ విషయాలున్నాయి. అహల్యాశాపం బాల కాండలో ఉన్నదానికి భిన్నంగా ఉత్తరకాండలో ఉంది. ఉత్తరకాండలో శంబూకవధ సన్నివేశంలో కృతయుగంలో బ్రాహ్మణులకూ, త్రేతాయుగంలో బ్రాహ్మణక్షత్రియులకూ, ద్వాపరయుగంలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకూ, కలియుగంలో నాలుగువర్ణాల కారికీ తపస్సుచేసే అధికారం ఉందనీ, త్రేతాయు గంలో శూద్రుడు తపస్సుచెయ్యరాదు కనుక వధ్యు డనీ నారదు డనే ముని రామునకు చెప్పినట్లు ఉంది. కాని కృతయుగంలో విశ్వామిత్రాది రాజులు తపస్సు చేశారు. ఉపనిషత్తులలో ఎందరో క్షత్రియ తపస్వులు కనిపిస్తారు. దశరథుడు ఏనుగనుకొని చంపిన మునిబాలుడు శూద్రతపస్వి కొడుకు, కనుక అన్ని యుగాలలోనూ అందరూ తపస్సు చేస్తు న్నట్లే తోస్తుంది. ఈ విరుద్ధరచనలనుబట్టి ఉత్తర కాండ ఇంకొకరి రచన అనిగాని, లేక ఆ విరుద్ధ భాగాలు ప్రక్షిప్తాలనిగాని ఊహించవలసి వస్తున్నది. వాల్మీకి కావ్యప్రారంభంలో మననం చేసుకొన్న కథలో ఉత్తరకాండ కథాభాగసూచన ఉంది. కాని కొందరు విమర్శకులు ఆ సర్గ ప్రక్షిప్తమని తలంచు తున్నారు

ప్రథమ వాల్మీకి ప్రప్రథమంగా రామాయణాన్ని ఎప్పుడు రచించాడు? ద్వితీయవాల్మీకి ఎప్పుడు దానిని పెంచి తిరిగి రచించాడు? ఉత్తరకాండ పూర్తిగా ప్రక్షిప్తమే అయితే దానికి ఎప్పుడు చేర్చ బడింది? ఈ ప్రశ్నలకు జవాబులు చెప్పడం ప్రస్తుతం అసాధ్యం. మున్మొదట వాల్మీకి రామా యణ కథను ఆర్యానార్య సంఘర్షణ కథనంగా, సీతాపహరణ రావణ వధలని వర్ణిస్తూ చాలావరకూ వాస్తవదృష్టితో రచించాడనీ, తర్వాత బౌద్ధమతం ప్రబలి బుద్ధుడు దేవుడుగా నిరూపించబడిన బౌద్ధ సాహిత్యం విజృంభిస్తున్నప్పుడు తదనుకరణగా రాముడు విష్ణువు అవతారంగా వర్ణితుడైన ప్రస్తుత రామాయణాన్ని ద్వితీయవాల్మీకి రచించి ఉంటాడనీ కొందరు విమర్శకులు అంచనా వేస్తున్నారు. ఈ అంచనాకి కొన్ని సాధకబాధకాలు కనిపిస్తున్నాయి.

అసలు ప్రథమ వాల్మీకి కూడా (రామాయణంలో అలా ఉన్నప్పటికీ) రాముడికి సమకాలికుడనీ, అత నికి వాస్తవ రామాయణగాథ ఉన్నదున్నట్లు తెలు సుననీ నిశ్చితంగా చెప్పలేం. ఆయనకి కూడా నారదుడి ద్వారా విన్న రామాయణకథే కావ్యరచ నకు ఆధారమైనట్లు కనిపిస్తుంది. ఆయన రాక్షసు లకు పెట్టిన విభీషణుడు, దుర్ముఖుడు, శూర్పణఖ మొదలైన పేర్లను చూస్తే వారి అసలు పేర్లాయనకి తెలియవని, వారి క్రూరత్వ వికారాలను సూచిస్తూ ఆ పేర్లను కల్పించాడనీ అనిపిస్తుంది. సాహి త్యంలో పాత్రల స్వభావాలని బట్టికూడా తదను గుణనామములను పెట్టడం కనిపిస్తుంది. మహా భారతంలోనూ ఇటువంటి పేర్లున్నాయి. ఇటీవల రచితమైన కన్యాశుల్కంలో కూడా లుబ్ధావధాన్లు; కరటకశాస్త్రి మొదలైన అవాస్తవమైన పేర్లు ఉన్నాయి. దశరథుని భార్యలు ముగ్గురిలో వాల్మీకికి ఒక్క సుమిత్ర పేరే తెలుసుననీ, కౌసల్యా కైకేయిల అసలు పేర్లాయనకి తెలియవనీ (కౌసల్య

అంటే కోసలరాజు కూతురు, కైకేయి అంటే కేకయరాజు కూతురు అనీ అర్థాలు) దీనిని బట్టి వాల్మీకి రామాయణకథా కాలానికి చాలా తర్వాతి వాడని ఊహించవచ్చుననీ కొందరంటున్నారు.

రామాయణ వాస్తవగాథ ఇలా జరిగి ఉండవచ్చునని కొందరు విమర్శకులు ఊహిస్తున్నారు. రాజ్య బహిష్కృతుడైన రాముడు భార్యాసోదరులతో దండకారణ్యంలో నివసిస్తాడు. అతనికి జటాయువనే ఒక ఆటవికుడు సహాయకారిగా ఉంటాడు. మారీచుడు రామలక్ష్మణుల నిద్దరినీ ఏలాగో మోసంచేసి దూరంగా తీసుకుపోతాడు. రావణుడు జటాయువును చంపి సీతను అపహరిస్తాడు. రామలక్ష్మణులు సుగ్రీవుడనే వన్యజాతి నాయకునితో స్నేహం చేస్తారు. రామేశ్వరంనుండి సిలోనుకు సముద్రంలో ఉన్న గుట్టల మీఁంచి దాటుకొంటూ ఈదుకొంటూ హనుమంతుడు లంకను చేరి ఉంటాడు. తర్వాత ఆ గుట్టల మీదనే ఇంకా రాళ్ళూ చెట్లూ అవీ వేసి వంతెన నిర్మించి సైన్యంతో లంకలో ప్రవేశించి రాముడు రావణుడిని సంహరించి ఉంటాడు అని.

వానరులు ఎంత బలవంతులైనా వారికి బాణ విద్య తెలియదు అందుకే సుగ్రీవుడు ముందు రాముణ్ణి పరీక్షించి ఉంటాడు. రాక్షసులకు కూడా బాణవిద్య తెలిసి ఉండదు. వాళ్ళంతా చాలావరకూ ఈటెలూ గదలూ మొదలైన ఆయుధాలనే ఉపయోగించారు. రావణాది రాక్షసనాయకులు బాణాలతోనూ దివ్యాస్త్రాలతోనూ యుద్ధం చేశారనడం వాల్మీకి కల్పన కావచ్చును. రావణుడు రామునితో బాణ విద్యలో దాదాపు సమానుడయితే రాముడు వాలిని చంపినట్లే రావణుడు అంతకుముందే చంపగలిగి ఉండేవాడు. దేశచరిత్రలను చూస్తే ఆయుధాధిక్యం కలిగిన జాతులు ఇతర జాతులను జయించడం కనిపిస్తున్నది వానరులూ రాక్షసులూ ఎంత బలవంతులైనా ఆర్యులు బాణవిద్యచేత అధికులై దేశానికి అధిపతులై తమ సంస్కృతిని వ్యాపింప జేసి ఉంటారని ఊహించడం బహుశః పొరపాటు కాకపోవచ్చును.

రాక్షసు లెవరు ? వానరు లెవరు ? జటాయు వెవడు ? లంక ఎక్కడుంది ? వీటినిగురించి పరిశోధకులు వివిధంగా ఊహించారు. వాటిలో ముఖ్యమైన అభిప్రాయాలను వ్రాస్తున్నాను.

రావణుడు రాక్షసజాతికి చెందినవాడు. అతడు అసురుడుకాడు. రావణాసురుడు అని మనం సాధారణంగా అనడం చరిత్ర దృష్టిలో తప్పు. రావణుడు రాక్షసుడనే తప్ప అసురుడని వాల్మీకి ఎక్కడా చెప్పినట్లు లేదు. భారతదేశంలోని ఆర్యుల అభిప్రాయంలో దేవులు (దేవాః) మంచివారు, అసురులు దుర్మార్గులు. ఇరానుకు వెళ్ళిన ఆర్యుల అభిప్రాయంలో అసురులు మంచివారు, దేవులు దుష్టులు. వారికి అసురుడు (అహూర) దేవత. ఒకప్పుడు ఒకచోటే ఉండి పరస్పర విభేదంవలన ఆర్యులు రెండుగా చీలిపోయినట్లు కొందరు ఊహిస్తున్నారు. మధ్య ఆసియానుండి ఒకతెగ భారతదేశానికి ఇంకొక తెగ ఇరానుకూ ఇతర ప్రాంతాలకూ వెళ్ళారని కొందరూ; ఆర్యులు భారతదేశంవారే, ఇక్కడినుంచే వారిలో కొందరు ఇతర దేశాలకు వెళ్ళారని ఇంకొందరూ చారిత్రికులు ఊహిస్తున్నారు. ఏమైనా పరస్పర విభేదంవలన వీరి దృష్టిలో మంచివారు వారి దృష్టిలో చెడ్డవారుగానూ, వీరి దృష్టిలో చెడ్డవారు వారి దృష్టిలో మంచివారుగానూ పరిగణింపబడి ఉండవచ్చును. ఈ దృష్టిలో రావణుడు పులస్త్య బ్రహ్మకొడుకనీ వేదపండితుడనీ అనడం ఉత్తరాదివారి కల్పన అని చెప్పాలి. రావణుడు వేదపండితుడై అతనికి వేదమే ప్రమాణమైతే వేదవిహితము లైన యజ్ఞములను అతను ధ్వంసం చేసి ఉండడు కదా !

రావణుని తల్లి సాలకటంకట వంశానికి చెందినది. ఈ మాట ప్రాచీన కాలంలో మెక్సికోను జయించిన Tlascala జాతి నాయకుడు xicotencatl అనే వాడి పేరుతో సదృశంగా ఉందనీ, నరమాంస భక్షణ శీలమైన ఈ ఆదిమజాతి సిలోనులోనూ, ఇతర దీవులలోను భారతదేశ దక్షిణ ప్రాంతాల

లోనూ ఆకాలంలో ఉండి ఉండవచ్చుననీ వైద్యాగారు అభిప్రాయపడ్డారు. విద్యుత్కేశుని భార్య, సుకేశుని తల్లి సాలకటంకట (ఉత్త, 5,23). రావణుని తల్లి కైకసి ఈ వంశానికి చెందినది. వైద్యాగారింకా ఇలా వ్రాశారు —

"రాక్షసులు నల్లని వారైనా కురూపులూ భయంకరరూపులూ కారు. ఈ లక్షణాలు కవిచేత ఆరోపితములై ఉండవచ్చును రాక్షస వివాహ ధర్మం ప్రకారం బలవంతంగా ఎత్తుకు వచ్చిన స్త్రీ తన మనస్సు సమాధానపరచుకొని తనను వివాహం చేసుకొందుకి అంగీకరించడానికి అపహర్త ఒక సంవత్సరం వవ్యధి ఇయ్యాలని మహాభారతంలో చెప్పబడింది. రావణుడు సీతకు ఇచ్చిన గడువు కూడా ఒక సంవత్సరమే. అంతేకాక సంవత్సరంలోగా నీవు నన్ను అంగీకరించకపోతే నిన్ను బలాత్కరిస్తానని రావణుడు అనలేదు. నిన్ను చంపి నీ మాంసం తింటాను అంటాడు. తనను ఒల్లని స్త్రీని చంపితింటానని రావణు డనడం ఆదిమజాతి లక్షణానికి సరిపోతున్నది"— అని.

వానరు లెవరై ఉంటారు అన్న విషయంపై పలువురు విమర్శకులు పలువిధాలుగా ఊహించారు. వానరులూ రాక్షసులూ ప్రక్క ప్రక్క ప్రాంతాలలో నివసించినవారు. వాలి సుగ్రీవులూ రావణుడూ అన్నదమ్ములని రామాయణంలో చెప్పబడింది. బహుశః ఈ రెండు జాతులకీ కొంత సంపర్కం ఉండి ఉండవచ్చును.

శ్రీ గో. రామదాసుగారు వానరుల ఆచారాలను బట్టీ, రామాయణంలోని కొన్ని మాటలనుబట్టీ ఇప్పటి సవరజాతికి చెందినవారై ఉండవచ్చునని తర్కిస్తున్నారు.

"A tribe of savaras is called Arsi or Arisi which means a monkey in the language of Savaras. By their Oriya neighbours they are called Lambo Lanjia (long-tailed) which is the Oriya equivalent of Arsi. They got the name from a long piece of cloth which the males allow to hang down." (Castes and Tribes of South India, Thurston).

"ఈ అర్శినామము మొగవారి బట్టకట్టువలన ఆ జాతికి వచ్చినది. అందుచేతనే రామాయణము నందు గూడ మొగవారికే తోకలున్నట్లు చెప్పి యున్నదిగాని ఆడువారికి తోకలున్నట్లు చెప్పలేదు. ........'అర్శి' అను పేరును 'లంబో లంజియా' అని ఓఢ్రులు వారి భాషలోనికి తర్జుమాచేసి యెట్లు ఇప్పుడు చెప్పుచున్నారో, పూర్వము వాల్మీకి కాలములో వానరులకు సమీపమునందు నివసించి యుండు ఆర్యులు వారి భాషలో 'కపి' యని మార్చి చెప్పి యుందురు, కవిత్వము చెప్పవలసి వచ్చినప్పుడు ఛందస్సుకొరకు 'కపి'కి ఉన్న యావత్తు పర్యాయ పదములు వాడుటకు అవసర ముండును. అయినప్పటికి కేవలము కోతి మృగమునకే అర్థమిచ్చే 'మర్కటము' మాత్రముపయోగించలేదు" అని.

రామదాసుగారు రామాయణంలో కొన్ని పేర్లు శబరసవర భాషలనుంచి వచ్చాయని వ్యుత్పత్తులు సూచించారు. లంకాశబ్దం 'లంకాన్' అన్న శబర భాషాపదంనుంచి వచ్చిందన్నారు. లంకాన్ అంటే ఎత్తు, మీద, పైన అని అర్థం. లంక ఎత్తుగా పర్వతం మీద ఉంది. 'జైతాన్' అనగా దిగువ. దీనినుంచి 'జనస్థాన' పదం వచ్చి ఉండవచ్చునన్నారు. "రామస్యతు పితుర్మిత్రం జటాయుర్నామ గృధ్రరాట్" (అర, 58, 9) అని జటాయువు గురించి ఉంది. కాని దశరథునికీ జటాయువుకీ స్నేహం జరిగినట్లెక్కడా చెప్పలేదు. సవర భాషలో 'యువ' అంటే తండ్రి. 'జటా' అంటే జట్టు. జటాయువ అంటే తండ్రి జట్టువాడు. జటాయు శబ్దం దీనినుంచి వచ్చి ఉంటుంది. ఆ శబ్దానికి అర్థం తండ్రికి స్నేహితుడు అని.

'దండకా' అన్న మాటకు కూడా సవర భాష

నుంచి వ్యుత్పత్తి చూపారు. రామాయణోత్తర కాండలో శుక్రుని శాపంచేత దండకారణ్యమంతా భస్మమయమైందని ఉంది. కాని అరణ్యకాండలో వర్ణనలనిబట్టి అక్కడంతా విశేషంగా చెట్లూ నీరూ ఉన్నట్లు ఉంది.

"స్థాలీప్రాయే వనోద్దేశే పిప్పలీవన శోభితే
బహుపుష్పఫలే రమ్యే నానా శకుని నాదితే
పద్మిన్యో వివిధాస్తత్ర ప్రసన్న సలిలాశ్రితాః
హంసకారండవాకీర్ణా శ్చక్రవాకోపశోభితాః".
(అర. 11, 40-41)

(అగస్త్యాశ్రమం పిప్పలీ వనశోభితమైన సమతలంపై ఉంది. అక్కడ బహువిధములైన పుష్పములూ ఫలములూ ఉంటాయి. ఎన్నోరకాల పక్షులు రవం చేస్తూ ఉంటాయి. స్వచ్ఛ జలపూర్ణములైన సరస్సులక్కడ ఎన్నో ఉంటాయి. అక్కడ హంసలు, సారసములు, చక్రవాకములు ఉంటాయి.) సవర భాషలో 'దాన్' అనగా నీరు, 'డాక్' అని కూడా అంటారనీ, దన్‌డాక్ అంటే విశేషంగా నీరు. దీని మీద 'ఆ' అన్న షష్ఠీవిభక్తి ప్రత్యయం చేర్చగా విశేషంగా నీటి యొక్క అన్న అర్థంలో 'దండకా' అవుతుందనీ, దండకావనం అంటే విస్తారం నీరు కల అడవి అనీ, ఈ అర్థం పై వర్ణనకి సరిపోతున్నదనీ రామదాసుగారు ప్రతిపాదించారు. రామదాసుగారింకా తమవ్యాసంలో కబంధ, పంపా, ఋష్యమూక, కిష్కింధా, శృంగిబేర, సరమా మొదలైన మాటలకి సవర శబర భాషలనుండి వ్యుత్పత్తులు చూపారు. చిన్నవాడు పెద్దవాని భార్యను పెండ్లాడవచ్చును గాని పెద్దవాడు చిన్నవాని భార్యను ముట్టకూడదన్న సవరల ఆచారం కూడా రామాయణంలో వాలిసుగ్రీవుల కథతో సరిపోతోంది. వీటినిబట్టి వానరులు కోతులు కారనీ, ఒకానొక జాతివారనీ వారు ఊహించారు.

రామాయణంలో గ్రద్దగా వర్ణితుడైన జటాయువు కూడా ఒక ఆటవికుడని శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు అభిప్రాయపడ్డారు. "క్రీస్తుశకము ఏడవ శతాబ్దమందు 'గుద్దవాది' విషయ మనున దుండెను. కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు ప్రకటించిన విష్ణుకుండి మూడవ మాధవవర్మ శాసనములో గుద్దవాది విషయము వచ్చినది. కొమర్రాజు వారును, శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారును అది యిప్పటి గోదావరి జిల్లాలోని రామచంద్రపురము తాలూకా యని నిర్ణయించిరి. దానినే పూర్వము 'గుద్రహారము', 'గుద్రవాది' అనియు పిలిచిరన్నారు. గుద్రశబ్దాన్ని సంస్కృతములో 'గృధ్ర'గా మార్చి గద్దలనుగా తర్వాత రామాయణాన్ని పెంచినవారు కల్పించి యిట్లూహింపవలెను." అని వారు వ్రాశారు. ఇంతే కాక శరచ్చంద్రరాయ్‌గారు ముండా జాతిని గురించి వ్రాసిన గ్రంథంలో ముండాలలో ఉరోవన్ అను ఒక శాఖ ఉందనీ, వారు తాము రావణ సంతతి వారమని ఇప్పటికీ చెప్పుకొంటారనీ, హోరమండల్ తీరము అన్న ఆంగ్లపదం ఖరమండలము అన్న మాటనుంచి వచ్చిందనీ, పూర్వమిదంతా ఖరుని రాజ్యమై ఉండవచ్చుననీ వారు వ్రాసినట్లు ఉటంకించారు.

లంక ఎక్కడిది? అన్న విషయంపైకూడా ఏకాభిప్రాయంలేదు. చాలాకాలంనుంచీ ఉన్న విశ్వాసం సింహళమే లంక అని. కాని సముద్రతీరానికి అది నూరు యోజనాల దూరంలో లేదు. నూరు యోజనాలనడం అతిశయోక్తేమో! లంక ప్రస్తుతం లంకదీవులలోనిదని కొందరన్నారు. సురవరం ప్రతాపరెడ్డిగారు లంక అన్నది తెనుగు మాట అని, చుట్టూ నీరులేకపోయినా, రెండు మూడు వైపుల నీరున్న భూభాగాలని కృష్ణా గోదావరీ ప్రాంతాలలో లంక లంటారు కనుక లంక గోదావరీ ప్రాంతంలోనిది కావచ్చుననీ, హనుమంతుడు గోదావరి కాలువనేదైనా దాటి ఉంటాడని అభిప్రాయపడ్డారు. కాని రామాయణంలో స్పష్టంగా సముద్రం దాటినట్లు ఉండగా అతడు కాలువదాటాడని మనం ఎలా అనగలం? రామాయణ ప్రభావంచేతనే మన వారు డెల్టాభూములను లంకలని ఉండవచ్చును. రామాయణ కాలంనాటి నైసర్గిక స్థితిలో భారత

దేశానికీ లంకకీ నూరు యోజనాల ఎడం ఉండేదేమో! కనుక లంక ఏదిఅని నిశ్చింతగా తేలేవరకూ మనం చాలాకాలంగా నమ్ముతున్నట్లు సింహళమే లంక అని అనుకోవడంలో ఆక్షేపం ఉండకూడదు.

ఇవన్నీ ఆధార లవలేశాలపై చేసిన ఊహలు. వీటిలో చాల సందేహాలకి తావుంది. జటాయు శబ్దం ఉకారాంతం, సకారాంతం కూడ ఉంది. రెండూ సమానంగా ప్రయుక్తము లయాయి. సకారాంత శబ్దంనుండి ఉదతశబ్దం వచ్చిఉండ వచ్చును. రామ దాసుగారు సవరభాషనుండి చూపిన వ్యుత్పత్తి ప్రకారం ఉదంతపదం మాత్రమే ఏర్పడుతుంది. ఉకారాంత పదం బలవంతంగా సకారాంత పదమెలా అయింది ?

రావణుడు సీతని అపహరించి సంవత్సరం గడువు పెట్టడం, అప్పటికీ ఒల్లకపోతే బలాత్కరిస్తాననక చంపుకు తింటాననడం ఆజాతి లక్షణాన్ని సూచిస్తున్నాయన్న వైద్యాగారి అభిప్రాయానికి చాలినంత ఆధారం కనిపించదు. సుందరకాండలో రావణుడు సీతతో అన్న ఈమాటలు గమనించ వలసి ఉంది,

"స్వధర్మో రక్షసాం భీరు !
సర్వథైవ న సంశయః
గమనం వా పరస్త్రీణాం
హరణం సంప్రమథ్య వా
ఏవం చైత దకామాంతు
న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి !
కామం కామః శరీరే మే
యథాకామం ప్రవర్తతామ్."

(సుం. 20 5-6)

(పరస్త్రీగమనం, పరస్త్రీలను బలాత్కరించడం రాక్షసులకు స్వధర్మం. కాని ఈ విధంగా నాపై కామన లేని నిన్ను నేను తాకను. మన్మథుడు నా శరీరంలో తన ఇచ్ఛ వచ్చినట్లు ఎంతైన ప్రవర్తించనీ ) ఈ శ్లోకాలు వైద్యగారి అభిప్రాయాన్ని అంతగా సమర్థించడంలేదు. సీత తనను మనః పూర్వకంగా కామించాలని రావణుడు తపించి పోవడం, అందుచేతనే స్త్రీలను బలాత్కరించడం స్వజాతి ధర్మమైనా అతడు ఆచరించక పోవడం ఈ శ్లోకంలో స్ఫురిస్తుంది. కనుక వైద్యగారి అభిప్రాయాన్ని అంగీకరించడం కష్టం.

వానరులు మహాబలవంతులు, పరాక్రమ వంతులు, బుద్ధిమంతులు, దక్షిణ దేశంలో ప్రముఖులు. పైగా ఆర్యులకు స్నేహితులు పెరగకుండా నష్టప్రాయమైపోయి వారు సవరలు మొదలైన అనాగరికులుగా అణగారి పోయారనడం చిత్రం. ఏదో ప్రబలకారణం వలన వారిజాతి క్షీణించి పోయిందని సమాధానపడవలసిఉంది. అటువంటి ప్రబల కారణ మేదీ కనిపించడం లేదు. కిష్కింధ ఉందన్న ప్రాంతంలో వానరజాతికి సంబంధించినవారనదగిన మనుష్యు లెవరూ అధిక సంఖ్యలో కనిపించక పోవడమేకాక ఇప్పటికీ అక్కడ కోతులు చాలా ఎక్కువగా ఉంటున్నాయి. ఇదొక విచిత్రం.

రామాయణంలో హనుమంతుని ఉద్దేశించి 'మారుతాత్మజః' అని ఆరంభంలోనే చెప్పబడింది. రామలక్ష్మణులను తొలిసారి కలుసుకొన్నప్పుడు కపిరూపం విడిచి భిక్షురూపంలో వెళ్ళాడని ఉంది. బహుశః అతని తండ్రిపేరు గాలి అన్న అర్థంకల మాట అనీ, భిక్షువువలె మారువేషం వేసుకొని వెళ్ళాడనీ సరిపెట్టుకోవచ్చును. కాని సముద్ర లంఘనవేళ హనుమంతుడు సూర్యునకూ, ఇంద్రునకూ, తన తండ్రి అయిన పవనునకూ నమస్కరించడం, రామలక్ష్మణులను చూడగానే భయంతో సుగ్రీవుడు అనుచరులతో సహా చెట్లమీంచి దూకి పారిపోవడం, హనుమంతుడు శరీరం పెంచడం, పర్వతం మీంచి లంఘించి సముద్రం దాటడం, కవి అతణ్ణి తరచు పవనాత్మజః అనడం ఇదంతా చూడగా అమానుష శక్తులుగల దైవాంశ సంభూతులైన కోతులుగానే వానరులు కనిపిస్తారు.

ఈ చర్చనంతటినీబట్టి రాక్షసు లెవరు, వానరు

లేవరు మొదలైన ప్రశ్నలకి ప్రస్తుతం ఉన్న ఆధారాలనిబట్టి ఇదమిత్థమని నిశ్చయించ లేక పోతున్నాం. కాని, రామాయణ కర్త, ప్రప్రథమ రామాయణ కర్త కూడా రాముడికి సమకాలికుడు కాకపోవచ్చు ననిపిస్తుంది. సమకాలికుడైతే కావ్యంలో వాస్తవికత ఇంత పరిమితంగానూ ఊహాలూ కల్పనలూ ఇంత అధికంగానూ ఉండి ఉండవు. రామాయణం గడచిన బహుశః కొన్ని శతాబ్దుల అనంతరం వాస్తవగాథ కట్టు కథలతో కలిసి లోకంలో కర్ణోపకర్ణికగా వినవస్తున్న రామాయణ గాథను ఇంకా అనేక కల్పనలతోనూ కవితోక్తులతోనూ మేళవించి రామాయణ కావ్యం రచించి ఉండవచ్చును. ఆ కథమీద ఇంకా ఇంకా కల్పనలూ, ప్రక్షిప్తాలూచేరి ప్రస్తుత రామాయణ కావ్యమయి ఉండవచ్చును. ఈ లెఖ్ఖని రామునిలో విష్ణుత్వారోపణ కల కథ సైతం ప్రథమ వాల్మీకి కృతమే అనీ, రెండవ వాల్మీకి సర్గాంత శ్లోకాలను మాత్రమే రచించాడనీ అనుకోడంలోకూడా బహుశః పెద్ద పొరపాటు ఉండకపోవచ్చును. రెండవ వాల్మీకి కూడా మొదటి వాల్మీకికి కవితాశక్తిలో తీసిపోడు. అనుష్టుప్ఛందో భిన్న శ్లోకాలలోకూడా చాలా మంచి కవిత్వం ఉంది.

ఐతే ఇలా ఊహించడంలో వాల్మీకి రామునికి సమకాలికుడని, ఆయన సీతకు ఆశ్రయమిచ్చాడని స్వవిరచిత రామాయణాన్ని కుశలవులచే కంఠ పాఠం చేయించి రామునిముందు పాడించాడనీ రామాయణంలో ఉన్న వాల్మీకి వృత్తాంతాన్ని నిరాకరిస్తున్నామన్నమాట. అమానుష కల్పనలు భారత భాగవతాలలోనూ ఉన్నాయి. కనుక రామాయణ కావ్యంలో పేర్కొనబడిన వాల్మీకే కావ్య కర్త అనుకొందామంటే, ఆయన ఉత్తర కాండను జరక్కముందే రచించాడనడం విడ్డూరంగా ఉంది. మొత్తం మీద రామాయణ కర్తృత్వాన్ని గురించి కూడా స్పష్టంగా నిర్ణయించలేక పోతున్నాం.

కాళిదాసు రఘువంశంలో ఉత్తరకాండతో సహా రామాయణాన్ని ఉన్న దానిని ఉన్నట్లు అనుస రించాడు. భాసుడు రాముడు విష్ణువన్నట్లు తన అభిషేకనాటక షష్ఠాంకంలో వ్రాశాడు. రామునిలో విష్ణుత్వారోపణ భాసునికి చాలా పూర్వమే జన విశ్వాసంలో రూఢమై ఉండాలి. అభిషేక నాటక తృతీయాంకంలో ఉత్తరకాండలోని కథాంశాలను భాసుడు పేర్కొన్నాడు. కనుక భాసుని కాలం నాటికే ఉత్తరకాండ రామాయణాంతర్గతమయి ప్రజల సమ్మతంలో స్థిరపడిందని చెప్పవచ్చును.

రామాయణ భాషలో అపాణినీయ ప్రయోగాలు చాలా ఉన్నాయి. ఇటువంటి ప్రయోగాలు మహాభారతంలోనూ ఇతర పురాణాలలోనూ కూడా ఉన్నాయి ఆ కాలానికి సంస్కృతం వ్యవహారంలో ఉండటంచేత శిష్టప్రయోగంలో వైవిధ్యం ఉండి ఆ భాషా వైవిధ్యాన్ని కవులు స్వీకరించారనీ, తర్వాత వాటిలో కొన్నిటినే పాణిని వ్యాకరణ సమ్మతం చేసి ఉంచినప్పటికీ, అనంతరం పాణిని వ్యాకరణం శిలాశాసనంవలె ప్రమాణమైపోయి భాషను నిబద్ధం చేసినందువలన ఈ అపాణినీయ ప్రయోగాలు వ్యాకరణ విరుద్ధంగా మనకి కనిపిస్తున్నాయని శ్రీ సత్యవ్రత్‌గారు ప్రతిపాదించారు.

రాముడు శ్యామవర్ణుడని రామాయణంలో చాలా చోట్ల వ్రాయబడి ఉంది. రెండుమూడు చోట్ల మాత్రం దీనికి భిన్నంగా కనబడుతుంది. "దైర్ఘ్య వంతౌ సువర్ణాభౌ కౌ యువాం చీర వాససౌ" (కిష్కిం. 3, 8); "త్రిస్త్రిస్త్ర తథేషు సమానవర్ణః తస్యాననం" (సుం. 36, 28) అని. అయినా ఈ ఉదాహరణలు రాముడు తెల్లనివాడని నిస్సంశయంగా చూపటం లేదు.

మారీచుడు స్వర్ణ మృగరూపంలో వచ్చి రామలక్ష్మణులను వంచించిన కథ ప్రక్షిప్తమని వైద్యాగారు అభిప్రాయ పడుతున్నారు. రామలక్ష్మణుల నిద్దరినీ మారీచు డేలాగో మోసంచేసి దూరంగా తీసుపోయిన సమయంలో రావణుడు గాడిదలు పూన్చిన రథంమీద సీతను బలవంతంగా కూర్చోబెట్టి అడ్డం వచ్చిన జటాయువును సంహరించి భూ

మార్గంలోనే తీసుకుపోయి ఉంటాడనీ, వాల్మీకి అలాగే వ్రాయగా తర్వాత ఎవరో ప్రస్తుతం ప్రచారంలో ఉన్న కథగా దానిని మార్చి ఉంటారని వ్రాశారు. భిక్షురూపంలో వచ్చిన రావణునితో సీత అలజడి లేకుండా "మా ఆయన చాలా రకాల మాంసాలు తీసుకొని వస్తారు, మీరు కొంచెంసేపు నిరీక్షించండి" (అర. 47. 23) అంటూ నెమ్మదిగా మాటాడడం చూస్తే రామలక్ష్మణులు జటాయువుకి సీతను అప్పగించి వేటకి వెళ్ళి ఉంటారని వారు ఊహించారు ఈ ఊహకు కావ్యంలో ఆధారం మృగ్యం. రావణుడు నీవెవరు ఇక్కడెందుకున్నావు అని ప్రశ్నించగా సీత రామలక్ష్మణుల కోసం ఎంత చూసినా అంతా ఆకు పచ్చని అడవే కనిపించింది తప్ప రామలక్ష్మణులు కానరాలేదనీ (అర. 56; 37), 'ఇతడు బ్రాహ్మణుడు, అతిథి; ప్రత్యుత్తరం చెప్పకపోతే నన్ను శపిస్తాడు, అని ముహూర్తం ఆలోచించి సీత ప్రతివచనం చెప్పింది' (అర, 47. 2) అనీ అనడం వలన సీతప్రవర్తనసహజంగానే ఉందని తోస్తుంది. మొదట రామాయణ కథని వాల్మీకి వాస్తవదృష్టితో రచించి ఉంటాడనీ, తర్వాత అమానుష కల్పనలన్నీ ఇంకెవరో చేసి దానిలో ప్రక్షిప్తం చేశారనీ అనుకొనడం వలన ఇటువంటి పొరపాటు అభిప్రాయాలు కలుగుతున్నాయి. అసలు రామాయణం పరిపూర్ణంగా వాస్తవ దృష్టితో ఎప్పుడూ రచించబడి ఉండదు. ఇలా కల్పనలన్నీ ప్రక్షిప్తాలని భావిస్తే రామాయణమంతా ప్రక్షిప్తమనే చెప్పవలసి వస్తుంది. రావణుడు సీతను ఆకాశమార్గంలో తీసుకు వెళ్ళినట్లు వ్రాయబడింది. జటాయువు పూర్తిగా గ్రద్దగానే వర్ణితుడయాడు. ఇవన్నీ ప్రక్షిప్తాలని చెప్పజాలం,

రామాయణం మహాభారతానికి సుమారు వెయ్యి సంవత్సరాల ముందు జరిగి ఉంటుందని విమర్శకులు అంచనావేస్తున్నారు. అప్పటికీ ఇప్పటికీ దేశ కాల పరిస్థితులలో రాజకీయంగా, సాంఘికంగా, మతపరంగా ఎన్నో మార్పులు వచ్చాయి. అందుచేత మనం రామాయణాన్ని చదివేటప్పుడు ఆనాటి మత రాజకీయ సాంఘిక విశ్వాసాల దృష్టితో చదవాలి తప్ప ఆధునిక విశ్వాసాల దృష్టితో చదవకూడదు. అలా చదువుతే అంతా వక్రంగా కనిపిస్తుంది. సాహిత్యంలో మనం చూసేది వారివారి విశ్వాసాలను కాదు. వారివారి విశ్వాసాలు ఆయా వ్యక్తులను నడిపించిన తీరు, వ్యక్తం చేసిన మానవత్వం—ఇవి చూస్తాం,

కాని ఇటీవలకొందరు విమర్శకులు వక్రదృష్టితో రామాయణాన్ని సమీక్షించి విపరీతాభిప్రాయాలను ప్రకటిస్తున్నారు. నవ్లేకర్‌గారు రాముడు రాక్షస సంహారంచేసి ఆర్య సంస్కృతిని వ్యాపింపజేసే పన్నుగడతో బయలుదేరాడనీ, జనస్థానంలోని మున్యాశ్రమాలన్నీ ఆతనికి రాక్షసుల గుట్టుమట్లు తెలియజేసే రహస్యమందిరాలనీ అభిప్రాయపడ్డారు. కాని రాక్షసులను చంపడానికి సైన్యం లేకుండా ఒక్కడే ఎందుకు వెళ్ళాడో అర్థంకాదు. వానరులు తనకు అంత సహాయం చేస్తారని రాముడు కలగన్నాడా ? నవ్లేకర్‌గారు రాముడు అరణ్యవాసంలో సీతను దాచేసి శబరిని ఆమె స్థానంలో పెట్టాడనీ, దీనినే అధ్యాత్మ రామాయణంలో మాయాసీతగా ఉత్ప్రేక్షించారనీ అన్నారు. దీనికి ఆధారంలేదు. అపహరింపబడినది శబరి అయితే రాముని విరహదుఃఖమంతా నటన అనాలి. కాని వాల్మీకి అలా వ్రాయలేదు. రాముడు రాక్షసులతో యుద్ధం తెచ్చుకొందుకే అరణ్యానికి వెళ్తే పదమూడేళ్ళు ఊరకొని అంతా ఆఖరు సంవత్సరంలో చెయ్యడం చాలా అసహజం.

రాముడు కిష్కింధా లంకా రాజకీయాలలో జోక్యం కలిగించుకొన్నాడనీ, విభీషణుడూ సుగ్రీవుడూ భ్రాతృద్రోహులూ దేశద్రోహులూ అనీ ఇటీవల కొందరు విమర్శకులు ఆరోపించడంలో చారిత్రికావగాహన కనిపించదు. ఫలాని ప్రజలది ఫలాని దేశం అన్నదృష్టి ప్రపంచంలో ఏర్పడి అట్టేకాలం కాలేదు. పూర్వం రాజ్యాలు వ్యక్తిగతంగా వారి వారికి చెంది ఉండేవి. ఇంకొకడు వచ్చి ఆ రాజును

ఓడిస్తే రాజ్యం ఆయనదయేది. క్రమంగా రాజ్యాలు మతప్రాతిపదికమీదా భాషాప్రాతిపదికమీదా ఏర్పడ్డాయి. కాని ఇవి జరగడం ప్రారంభించి వెయ్యి సంవత్సరాలుకాలేదు. పూర్వం యుద్ధాలూ సంధులూ రాజుల వ్యక్తిగత గౌరవాభిమానాలకోసం జరిగేవి. పాండవులకి సహాయం చెయ్యడానికి వస్తూ వస్తూ శల్యుడు పొరపాటున దుర్యోధనుడికి మాట ఇచ్చి వాళ్ళవైపు తిరిగిపోయి తన మేనల్లుళ్ళతోనే యుద్ధం చేశాడు. కృష్ణుడు రెండుపక్షాల వారికీ యుద్ధంలో సహాయం చెయ్యడం విచిత్రమైనది. ఈనాటి రాజకీయాల దృష్టిలో ఇవన్నీ అర్థహీనమైనవి. శల్యుడూ కృష్ణుడూ తమ వ్యక్తిగత గౌరవానుగుణంగా అట్లా ప్రవర్తించారు. వారి ప్రవర్తనలో రాజకీయమైన పన్నుగడలు లేవు. అలాగే విభీషణుడూ సుగ్రీవుడూ తమ వ్యక్తిగత కారణాల వలన తమ అన్నలను విడిచి రాముని పక్షం చేరారు. దీనిలో రాజకీయ ద్రోహం ఉందనుకోవడం భ్రమ. శ్రీరాముని సద్గుణ సంస్కృతులచే ఆకృష్టులై తమకు నిస్సంశయంగా ధర్మమని తోచిన పనిని వారు చేశారు.

వాలివధలో ధర్మాధర్మాల గురించిన చర్చ చాలా ఉంది. "నీవు జంతువువి కనుక నిన్ను వేటాడాను, అధర్మంగా ప్రవర్తించావు కనుక శిక్షించాను" అని రాముడు వాలికి సమాధానం చెప్పాడు. కోతిని చంపుతే ప్రాయశ్చిత్తం చేసుకోవాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయనీ, కనుక వాలి అధర్మప్రవర్తకుడైనందుకు రాముడతనికి మరణరూప దండనం విధించాడన్నదే సముచిత సమాధానమని ధర్మాకూతకర్తలు అంశాన్ని కూలంకషంగా చర్చించి నిర్ణయించాడు. ఆపద్ధర్మంగా శత్రువును మాయోపాయంచేత చంపవచ్చునని కూడా అతడన్నాడు. ఇదంతా ధర్మదృష్టితో చేసినచర్చ. కాని ఇది వాస్తవ దృష్టిలో మనకు సంతృప్తి కలిగించదు. ఎక్కడనుంచో అయోధ్య రాజు వచ్చి కిష్కింధ రాజుని శిక్షించడ మేమిటి? పరిస్థితిని బట్టి శత్రువును ఎలాగైనా తుద ముట్టించడ మన్న రాజనీతి మాత్రమే రాముని చర్యను సమర్థిస్తుంది. ఎంతో ధర్మబద్ధంగా ప్రారబ్ధమైన కురు పాండవ యుద్ధం చివరకి ఎలా క్రూరంగా పరిణమించిందో ఆలోచిస్తే యుద్ధధర్మం చాలా చంచలమైనదనీ అల్పప్రయోజనం కలదనీ నిశ్చయించ వచ్చును.

తన భార్యను అగ్నిప్రవేశంచేసి పాతివ్రత్యం నిరూపించు కోమనిన రాముని మనః ప్రవృత్తిని కొందరు విమర్శకులు ఖండిస్తున్నారు. రాముడికి ఎంతసేపూ తన గౌరవ ప్రతిష్ఠలే తప్ప సీతమీద ప్రేమే లేదని అభిప్రాయపడుతున్నారు. పాతివ్రత్య నిరూపణ లోకంకొరకు తప్ప తనకొరకు కాదని రాముడుచెప్పాడు. అగ్నిప్రవేశం, పాతివ్రత్య నిరూపణాకావ్యసంఘటన. కావ్యసంఘటనని కావ్యదృష్టితో చూడాలి తప్ప వాస్తవ దృష్టితో చూడరాదు. సీతాగ్ని ప్రవేశాన్ని విశ్వసించినప్పుడు అగ్నిదేవ ప్రత్యక్షమైనాన్ని కూడా మనం కావ్యదృష్టితో విశ్వసించవలసి ఉంటుంది. పూర్వం నేరం చెయ్యనివాడు అగ్నిచేత దగ్ధుడు కాడనీ, నీటిలో మునుగడనీ ప్రజలు నమ్మేవారు. మృచ్ఛకటిక నాటకంలో చారుదత్తునిపై అసత్యాభియోగం మోపబడి అతనికి శిక్ష పడినప్పుడు రాజు నిప్పు అగ్నిజలపరీక్షలేయకుండా దోషిగా నిర్ణయించడం అధర్మమని ఆక్రోశించాడు. నిర్దోషి అయితే మాత్రం నిప్పులో వేస్తే కాలిపోడా అనిమనం శంకించవచ్చును. కాని అది ప్రాచీనుల నమ్మకం. ఆ విశ్వాసమే అద్భుత సంఘటనగా రామాయణంలో నిరూపితమైంది.

ఇంతేకాక, వాల్మీకి సీతాదేవిని అగ్నిలో ప్రవేశపెట్టేముందే ఆ అగ్నిని హిమసదృశం చేసి ఉంచాడు. హనుమంతుని తోకకు నిప్పుపెట్టినప్పుడు సీతా పాతివ్రత్య మహిమచేత అతనిని అగ్ని బాధింపలేదని, కనుక అంతటి ప్రభావం కల సీతాదేవిని అగ్ని దహించక పోవడంలో విశేషంలేదనీ అస్మత్ పితృపాదులు కాటూరి వ్యాసమూర్తి గారు ప్రతిపాదించారు.

రాముడు ఏకపత్నీ వ్రతుడు కాదని కొందరు

సందేహిస్తున్నారు. దీనికి ఆధారంగా మంథర కైకేయితో అన్న —

"హృష్టాః ఖలు భవిష్యంతి
రామస్య పరమాః స్త్రియః
అప్రహృష్టా భవిష్యంతి
స్నుషా స్తే భరతక్షయే"(అయో. 8, 12)

(రాముడు యువరాజైతే అతని స్త్రీలందరూ హృష్ట లవుతారు. భరతుని క్షయంచేత నీకోడళ్ళు అప్రహృష్ట లవుతారు) అన్నమాటలూ, సీతాదేవి దుఃఖ నైరాశ్యాలతో—

"పితు ర్నిదేశం నియమేన కృత్వా
వనా న్నివృత్త శ్చరిత వ్రతశ్చ
స్త్రీభి స్తు మన్యే విపులేక్షణాభి
స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః".
(సుం. 29. 14)

(తండ్రి ఆజ్ఞానుసారంగా వనవాసావధిని ముగించుకొని నీవు ఇంటికి వెళిపోయి ఉంటావు. అక్కడ నిర్భయుడవూ కృతార్థుడవూ అయి విశాలాక్షులైన స్త్రీలతో రమిస్తూ ఉండి ఉంటావు). అన్నమాటలూ ఉదాహరిస్తున్నారు. అప్పటి వరకు రాముడికి సీత ఒక్కర్తే భార్య అయినా ఆనాటి రాజుల సాధారణ ప్రవర్తననుబట్టి ముందు ముందు అనేక భార్యలను పెండ్లాడ వచ్చునన్న అభిప్రాయంలో మంథర అలా అని ఉండవచ్చు నని శ్రీకాకూరి వ్యాసమూర్తి గారు రాముని ఏకపత్నీ వ్రతాన్ని సమర్థిస్తున్నారు. సీతాదేవి దుఃఖోద్రేకంతో అన్న మాటలను పరమార్థంగా తీసుకోకూడదు. అలాగే రాముని భుజం గురించి "భుజైః పరమ నారీణా మభిమృష్ట మనేకధా". (యుద్ధ, 21, 3) అనడంలో కూడా సేవక స్త్రీలచేత స్నానవేళ నలుగుపెట్ట బడినది అని అభిప్రాయం కావచ్చును. కనుక ఇవేవీ రాముడు ఏకపత్నీవ్రతుడు కాడని నిరూపించడం లేదు.

లక్ష్మణునికి పెండ్లికాలేదని సురవరం ప్రతాపరెడ్డిగారు సందేహించారు. బాలకాండలో లక్ష్మణునికి ఊర్మిళనిచ్చి పెండ్లి చేసినట్లున్నా తర్వాత ఎక్కడా ఆమె ప్రసక్తి లేకపోవడం, లక్ష్మణుడు అరణ్యానికి వెళ్ళేటప్పుడు ఆమె ఒక్క మాట అయినా అనక పోవడం ఈ సందేహం కలిగిస్తున్నాయని వారన్నారు. ఈ సందేహానికి ఉపబలకంగా రాముడు శూర్పణఖతో అన్న ఈ శ్లోకాన్ని ఉదాహరించారు.

"అనుజ స్త్వేష మే భ్రాతా
శీలవాన్ ప్రియదర్శనః
శ్రీమా నకృతదారశ్చ
లక్ష్మణో నామ వీర్యవాన్." (అర.18,3)

(శీలవంతుడు, సుందరుడు, శ్రీమంతుడు, వీర్యవంతుడు అయిన ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడు. ఇతడు అవివాహితుడు). రాముడు పరిహాసానికైనా అనృతమాడడు కనుక లక్ష్మణుడు అవివాహితుడన్నారు. కాని రాముడు పరిహాసానికైనా అనృతమాడడన్న కవి అతిశయోక్తిని ఇంత పరమార్థంగా తీసుకోకూడదు. సీతారాముల కథని ప్రముఖంగా వర్ణించడంలో నిమగ్నుడై వాల్మీకి ఊర్మిళను గురించి చెప్పకపోయి ఉండవచ్చును. కనుక బాలకాండలో స్పష్టంగా లక్ష్మణునికి ఊర్మిళనిచ్చి వివాహం చేసినట్లుండగా అతనికి పెళ్ళికాలేదనుకోడం నిరాధారం. రామునికి వివాహ మయాక వనవాసానికి పూర్వం అయోధ్యలో పదమూడేళ్లున్నారని కావ్యంలో చెప్పబడింది. అంతకాలం రూప గుణ కుల శీల సమన్వితుడైన లక్ష్మణుడికి పెళ్ళికాలేదని ఏలా అనుకోగలం ?

సీతారాముల వయస్సుగురించి రామాయణంలో ఉన్న ఆధారాలనిబట్టి ఏమీ నిర్ణయించడానికి శక్యం కావడం లేదు. ఈ శ్లోకాలలో కొన్ని ప్రక్షిప్తాలు కావచ్చును. ఏవి ప్రక్షిప్తాలో తేలేవరకూ వయోనిర్ణయం చెయ్యలేము.

ఇంకా రామాయణంలో శ్రీరాముని జన్మసమయ నిర్దేశం గురించి చాలా తర్జన భర్జన ఉంది. కొందరు జాతకం అలా ఉండదంటున్నారు. ఆ శ్లోకాలు

అన్ని రామాయణ ప్రతులలోనూ లేవు కనుక ప్రక్షిప్తా లంటున్నారు కొందరు. లక్ష్మణ భరతులలో ఎవరు పెద్ద అన్న దానిని గురించి శ్రీ కాటూరి వ్యాసమూర్తిగారు చర్చించారు. ఇలా రామాయణంలో చర్చనీయాంశా లెన్నో ఉన్నాయి.

కాని వాల్మీకి కవిత్వం, కథా నిర్వహణం, పాత్ర పోషణ ఈ చర్చ అన్నిటికీ అతీతమైనవి. ఉత్తమ మానవుడైన రాముని చరిత్రం ఉత్తమ కవి అయిన వాల్మీకి చేతిలో రామాయణ మహాకావ్యంగా మలచబడింది. శోకమైనా శృంగారమైనా పరాక్రమమైనా హాస్యమైనా వేదాంత భావమైనా నీతి చర్చఅయినా ఏదైనా వాల్మీకి అత్యంత శక్తిమంతంగా నిర్వహిస్తాడు. పురవర్ణనగాని ప్రకృతి వర్ణనగాని ఏదైనా కళ్ళకి కట్టినట్లు చేస్తాడు. అరణ్యకాండనుండి కథ కల్పనలలో విహరిస్తూ ఉండగా వర్ణనలు వాస్తవ ప్రకృతిలో పఠితలను పట్టి ఉంచుతాయి. పాత్ర పోషణలో ప్రతిపాత్రనూ ఎంతో స్పష్టంగా సహజంగా తీర్చాడు. ముఖ్యంగా సీత భర్తృ ప్రేమనీ రాముని గాంభీర్యాన్నీ తీర్చ డంలో వాల్మీకి చూపిన ప్రతిభకు ప్రపంచం నివాళులెత్తుతున్నది.

మానవుడైన రాముణ్ణి వాల్మీకి మహాకవి తన లేఖినీ మహిమచేత దేవుడుగా చేశాడు. భారత దేశంలో రామునిగుడి లేని ఊరు లేదు. రామకథ దేశాంతరాలకి వ్యాపించి అందరనూ ముగ్ధులను చేస్తున్నది. భారతీయ సంస్కృతి కంతటికీ రాదారి సీతారాముల దివ్యచరిత్రం. ఎక్కడో ఆకాశంలో ఉండిపోకుండా మన మధ్య నిలిచి మనవలె సుఖ దుఃఖాల ననుభవించి మనకు కర్తవ్యాన్నీ జీవిత పరమార్థాన్నీ ప్రదర్శించిన మానవులైన దేవులు సీతారాములు.

## ఉపయుక్త రచనలు

ధర్మాకూతమ్ :
—త్ర్యంబకరాయ మఖి.

రామాయణ విశేషములు :
—సురవరం ప్రతాపరెడ్డి.

రామాయణమునందు వానరులు ఎవరు ?
— గో. రామదాసు.
భారతి 1926 మార్చి, ఏప్రిల్.

రామాయణము - బాలకాండము :
—కాటూరి వ్యాసమూర్తి.

రామరాజ్యము - పొలుపులు :
—కాటూరి వ్యాసమూర్తి.

The Riddle of The Ramayana :
—C. V. Vaidya.

A New Approach to Ramayana :
—N. R. Navlekar.

The Poetry of Valmiki :
—*Masti Venkatesa Iyengar.*

The Ramayana, A Linguistic Study:
—*Satya Vrat.*

శ్రీ వంతరాం రామకృష్ణారావు

# శివకవుల భాషా చ్ఛందో విశేషములు

శివకవుల భాషా చ్ఛందో విశేషములను గూర్చి తెలిసికొనుటకు ముందు, వారెట్టి భాషను ఆదరించి నారన్నది నిర్ణయించుట ఆవశ్యకము. ఏలన శివ కవులు లక్షణవిరుద్ధ ప్రయోగములు చేయుటకు దీక్ష పట్టినారని, అదే శివకవిసంప్రదాయ మని, అందుచే వారు నన్నయాదులకంటె భిన్నమతము వారని ఒకవాద మున్నది. నన్నయాదులు కూడ లక్షణ విరుద్ధ ప్రయోగములు చేయుటకు దీక్ష పట్టినవారే అని ఒకవంక చెప్పుచు, వేరొకవంక పైవాదమునకు వంతపాడు పరిశోధకు లున్నారు. లక్షణము మహాకవి ప్రయోగమూలకమై ఉండగా, నన్నయ సోమనాది మహాకవులు లక్షణ విరుద్ధ ప్రయోగములు చేసిరనుట అవిచారమూలక మనక తీరదు. సోమనాథుడు వైరిపదాది దోషములు గల కృతులను ఈసడించి యున్నాడు. కవి కంఠో క్తముగా వక్కాణించుమాటలు తిరుగులేని ప్రమాణ ములని ఒప్పక తప్పదు. కవికంఠోక్తికి విరుద్ధముగా చెప్పినదేదియు గ్రాహ్యము కానేరదని అంగీకరించి తీరవలెను. అప్పుడుగాని పరిశోధన సక్రమముగా ఉండదు. ఇదిగో సోమనాథుని ఉద్ఘాటన.

"జల్లి పూరక మపశబ్ద మక్రమము
వైకల్య మత్యుక్తి వైరిపదంబు
ద్రాబ ఛందోవిరుద్ధం బాదియగు న
లాళ ప్రలాపోక్తి లాఘవం బనక
వసిగూర్చు కృతులునా వడ్లును బెరుగుఁ
బిసుకు చందపు బిలిబిలి కృతుల్ కృతులె?"

ఇప్పుడు, శివకవులు లక్షణవిరుద్ధ ప్రయోగ ములు చేయుటకే కంకణము కట్టుకొన్నారని, అదే శివకవి సంప్రదాయమని అనుటకు అర్థమేమి? వారి కృతులు వడ్లును పెరుగు పిసుకు చందపు బిలి బిలికృతులు, వారివి అలాళ ప్రలాపోక్తులు, వారు కుకవులు అన్నట్లే కదా! ఇది పరిశోధనమా? శివకవి ద్రోహమా? తలచుకొన్న గుండెలు జలద రించును. ఏవయిన పాఠములు లక్షణ విరుద్ధము లనిపించినపుడు పరిష్కర్తల కర్తవ్యమేమి? అవి యెట్లు లక్షణవంతములో పరిశీలింప వలదా? అపపాఠములయినచో సాధు పాఠ నిర్ణయమునకు యత్నింప వలదా? కవి కంఠోక్తిని బట్టి వైరిపదాది దోషము లుండరాదనియు అందుచే ఉపలబ్ధ పాఠ ములు విచార్యములని చెప్పుటయైనను ధర్మము కాదా? మన అపరిజ్ఞానమును కప్పిపుచ్చుకొనుటకు, కవి తప్పులువ్రాయుటకే దీక్ష పట్టినాడనుటయా? అది శివకవి సంప్రదాయమనుటయా? ఈపరిశోధ కులు అచ్చతెనుగు కావ్యములను పరిష్కరింపక పోవుట నిజముగా అదృష్టము. లేనిచో అచ్చతెనుగు కావ్యములు వ్రాయుదుమన్న కవులు విచ్చలవిడిగా సంస్కృతసమములు వాడిరని, అది ఆ అచ్చతెనుగు కావ్యకర్తల సంప్రదాయమని అనకమానుదురా? నిరసించినవాడు లక్షణ విరుద్ధ ప్రయోగములు చేయునా? అన్న ప్రశ్నకు నిరసించియు పనికట్టు కొని లక్షణ విరుద్ధ ప్రయోగములు చేయుటకే జీవితమును అంకితముచేసినాడన్నది సమాధానమా? వైరిపదాదులు చేటలో వెలగకాయలవలె కనబడు చున్నవట! ఇది కవి కంఠోక్తికి విరుద్ధమయ్యా! అనుట శతవాదమట!! ఋజుత్వము మాలిన పరి శోధన లిట్లుండును.

కాగా, శివకవుల భాషాచ్ఛందో విశేషములను గ్రహించునప్పుడు కొన్ని నియమములను పాటింప వలెను. (1) అపశబ్దములు, వైరిపదాదులు, శివ

కవుల కావ్యములలో ఎంతమాత్రము ఉండరాదని కవి కంఠోక్తిని బట్టి అంగీకరించి తీరవలెను. (2) ఉపలబ్ధ పాఠములు లక్షణవంతము లెట్లగునో పరిశీలింపవలెను. (3) అపపాఠములను శోధించి కవిప్రయుక్త పాఠములను నిర్ణయింపవలెను. తెలియనిచో కవి పాఠము విచార్య మనవలెను. (4) తెలుగు లక్షణమునకు సంబంధించినంతలో వారి ప్రయోగములు పరమ ప్రమాణములు అట్లని అపపాఠములు కవి ప్రయోగము లనరాదు. (5) సంస్కృత లక్షణమునకు భిన్నముగ కన్పట్టు ప్రయోగములను తప్పు పట్టరాదు. స్థితస్య గతిశ్చింతనీయా, అను పద్ధతి నవలంబింపవలెను. (6) యతి ప్రాసాది గత ప్రయోగములను ప్రమాణీకరింపవలెను. నిర్వాహక స్థలములలో లేని అపపాఠములను వీనిని బట్టి సరి చేయనగును. (7) ఉపలబ్ధ పాఠములనే కవిప్రయోగము లనుకొనరాదు. ఈ పక్షమున పరిష్కరణమను మాట కర్థము లేదు. (8) అర్వాచీన లక్షణములతోను నిఘంటువులతోను శివ కవి ప్రయోగములను కొలవరాదు. (9) లక్షణములు మహాకవి ప్రయోగప్రామాణ్యమున్నంతలోనే గ్రాహ్యములు. ఈ నియమములు నన్నయాదుల ప్రయోగముల విషయమునను వర్తించును.

ఇక శివకవుల భాషాచ్ఛందో విశేషములను గూర్చి తెలిసికొందము.

I శివకవుల కావ్యములలో కొన్ని శబ్దములు విలక్షణముగ ఉన్నట్లు కన్పట్టును. కుమార సంభవమునందలి శబ్దములు: వాల్మీకుడు- 1-17 రేయెండ (బాలాతపము) 3-18. మేఘడంబరములు (గొడుగులు) 3-57. ఉత్పలల్- 5-167. ప్రతాళి. 7-57. లక్షము (అక్షి) 8-11. జీవి(జీవము) 8-175; నిరుతి. 12-42 త్రిణము (తృణము) 6-103 ఇత్యాదులు. ఈ శబ్దములు నన్నయాది కవులెవ్వరును వాడినవికావు; వ్యాకరణసమ్మతములుకావు; ఈ కారణములచే శివకవుల భాష ఇతరకవులచేతను శబ్దరత్నాకరాదుల చేతను నిరాకృతము అని ఆక్షేపింతురు.

ఇందలి దోషములు: (1) ఇతరకవులు వాడని శబ్దజాలము నేకవియైన వాడినచో అతని భాష లక్షణ విరుద్ధమనుట అవిచారమూలకము. నన్నయవాడని శబ్దములు తిక్కనాదులు వాడిరి గనుక వారిభాషయు లక్షణవిరుద్ధమే కావలసివచ్చును. ఇంతకు, అందరు కవులు లక్షణ విరుద్ధభాషనే వాడిరను పరిశోధకులు, శివకవులు మాత్రమే లక్షణవిరుద్ధ భాష వాడిరనుట అసంబద్ధము (2) మనకు తెలియని శబ్దములు వ్యాకరణాసమ్మతములు కావనుట సాహసము. (3) శబ్దరత్నాకరకర్త ... నెరుగునో ఎరుగడో అవకాశము నాలోచింపలేదు. సూర్యరాయ నిఘంటువుదైనను గ్రహించిన పాపమున పోలేదు.

ఈశబ్దములను గూర్చి తెలిసినది. (1) వాల్మీకుడు "వాల్మీకిః. పుం. (వల్మీకే భవః వల్మీక + అణ్) రామాయణ కర్తా మునిః" శబ్దకల్పద్రుమము, (2) "రేయెండ. (రేయి + ఎండ)–బాలాతపము, రేఁతయెండ. ... రేయెండ ... కరమొప్పు ... భా. రా. ఆర 1-135 శు. సం. 6-670" సూ. ని. దీనికి ప్రయోగాంతరములును కలవు. "... బట్టు ... రేయెండ జోడు జోడు. ఉ.హ 4-181. బాలార్క బింబంబు ... రేయెండ, ... మాయ లేదు. ఉ. హ. 6-29. (3) మేఘడంబరములు. "మేఘడంబరమ్. న. సం. నీలచ్ఛత్రమ్. తె॥ రాజులకు పట్టెడు నల్లగొడుగు" సర్వశబ్దసంబోధిని. ఈశబ్దము సంస్కృతమున కలదని "సాహిత్యోపన్యాసములు." (5 భా). (4) ఉత్పలల్-ఉత్పలములు. ములోప మాత్రపదులకు మహాపరాధముగా కనబడినది. పవిత్రాదుల పట్టికలో లేదని కాబోలు వ్యాకరణ విరుద్ధమనుట. "ఇత్యాదులు పవిత్రాదులు" అన్న లక్షణము బోధపడలేదు. ప్రయోగములు పట్టుపడలేదు. పట్టుపడినను లక్షణవిరుద్ధములనుట యెట్లును ఉన్నదే. కొన్ని ప్రయోగములు:—ప్రయాగ ఆది 2-222. కాశీ 3-82. హరి.పు. 3-102.

ప్రభావ. సంసర్గ—ఆరణ్య 5-81; నృసింహ 2-16. నిశ్శంక- శాంతి 2-210. ప్రాస— కావ్యాలం. 8-24. అంతస్థ- ఆం.భా 16. ఊష్మ-హర 6-62 విమర్శ-భోజరా మధ్య-కవిక. అంశ-కాళిందీ. గండూష-కాశీ. 3-235; నృసింహ 5-24. మాంజిష్ఠ-హర 7-137 భిక్ష-ఆది 2-150, భీమ, హర. బీభత్స- విరాట 4-144. మూల ముక్తి వైరాగ్యైక మూల సూవె-శాంతి. 6-174దీనిని బట్టి సిద్ధసమాసాంతమునను మువర్ణకలోపము గ్రాహ్యమగును. (మూల-అను రూపము నెరుగని పరిశోధకులు 'మూలదుంప' వైరిపదమన్నారు ) ఆనందచిహ్న- అను ప్రయోగ మిట్టిదే. (5) ప్రభాతి. "భాతి. స్త్రీ. భా + క్తిన్. శోభాయాం. రాజని-వాచస్పత్యము. భాతిః శోభా ఇతిరాజనిర్ఘంటః యథా శ్రీమద్భాగవతే- యత్ర ద్వపుర్భాతి విభూషణా యుధైః" శబ్దకల్పద్రుమము "నెరసిన చిక్కని యురుచన్నుఁగవ చెన్ను పరి పూర్ణ కుంభ విభాతియనఁగ" నృసింహ 1-72. (6) అక్షము. "అక్ష. న. నేత్రే"- వాచస్పత్యము. "అక్షమ్=చక్షుః"- శబ్దకల్పద్రుమము. (7) జీవి. "జీమూతవాహను జీవి వాపిరి", శృ. నై. 7-81. ఏనోపన్ భవంబెడలి యుండఁగ జీవితోడన్- శ్రీ 1-10. ఈ ప్రయోగములను బట్టి శివకవుల ప్రభావము తిక్కన శ్రీనాథుల మీదగూడా కొంత పని చేసినది అందురు. తిక్కన శ్రీనాథులే శివకవి ప్రయోగములను శిరసావహించి నప్పుడు వారిని వెలివేయ జూచుట పిచ్చికాకమరేమి? (8) "నిరుతి. సం. నిర్‌ృతిః. క. నిరుతి" సూ.ని. (9) త్రిణము. "త్రిణం. క్లీ (తృణ + పృషోదరాదిత్వాత్ సాధుః.) తృణమ్, ఇతి శబ్దరత్నావళీ. ఉత్ క్షిప్త త్రిణ పత్ర పాంశు విహగః సౌమ్య స్వనః పూజితః- ఇతి వరాహః" శబ్దకల్పద్రుమము. అపశబ్దమును నిరసించు కవుల కావ్యములలో అపశబ్దములు సమ్మతింపబడెననుట, సంస్కృత నిఘంటువులు ప్రమాణములు కావనుట అసంగతము.

II. శివకవుల కావ్యములలో తమిళ కర్ణాటపదములు కలవు. తమిళపదములు :- నాయి=కుక్క. ముడి=కిరీటము, కన్నడపదములు :— కెలనము=వని. కెడ్డెరసు = అడ్డదిడ్డముగాపడు, కేనము = అసూయ ఇత్యాదులు, ఇవి కుమారసంభవము లోనివి. తెలుగులో అన్యదేశ్య మొకభాగముగ అంగీకరింపవలెను. అంతేకాని బాలవ్యాకరణమున లేదని ప్రౌఢవ్యాకరణమున లేదని ప్రయోగముల నాక్షేపింపరాదు. నన్నయ తిక్కనాదులును అన్య దేశ్యములు వాడినారు. కెడ్డెరసు-ద్రోణ 4-294; 5-193. శల్య 1-104. శృ. నై. 6-29. కాశీ 1-93. 'పురపోషము గెడ్డెరసయి' అని నన్నయయే వాడినట్లు చెప్పుదురు. (శ.ర-సవరణలు; వివరణలు) కెలసము - ఆరణ్యపర్వము. త్రాసు - శాంతి. 2-374. విజ్ఞానేశ్వరీయము, ప్రాయశ్చిత్త. 65 ప. తాయెతు-అథర్వణకారికలో భూషాశబ్దముచే ఉద్దిష్ట మనబడును. "అహేయ మన్యదేశీయం యత్ర దేవ ప్రయుజ్యతే" అథర్వణ వచనము. అన్యదేశ్యములు వందలకొలది తెనుగున ఉన్నవి.

III. తద్భవములు. సమస్త పద తద్భవములు శివకవుల కావ్యములలో కలవు. భక్త శబ్దభవములు= బగతుఁడు, బగుతు, బత్తుడు' ముగ్ధశబ్దభవములు= ముద్ద, ముగ్గ. కార్యశబ్దభవములు=కర్జము, కజ్జెము. వాల్మీకేశ శబ్దభవము=వాలుమీకేసుఁడు, శంభుఁడు =నంబుఁడు, ఉద్దేశించు=ఉద్దెసించు, ఉపాధ్యాయ శబ్దభవములు=ఉపాద్దెయుఁడు. ఒజ్జ. ఈశ్వర శబ్ద భవము=ఈసరుఁడు. భస్మ శబ్దభవము=బసుమము. విరూపాక్ష శబ్దభవము=విరుపాక్ఖుఁడు. ధర్మ శబ్ద భవములు=దర్మము, దమ్మము=(ప్రాకృతసమము ) ఉద్భటశబ్దభవము=ఉదుబటుడు, మజ్జనశబ్దభవము= మజ్జెనము. నిత్యశబ్దభవములు=నిత్తెము, నిత్యము, నిచ్చ( = ప్రాకృతభవము). కాలహస్తి = కాళత్తి. త్రయోదశ=తేరస-ప్రాకృతసమము, నిర్జీవి=నిజ్జీవి శరణార్థి=సరణార్తి. తపోరాజు=తవరాజే, తపో నిధి=తవనిది. ఇవి సోమనాథునివి. అర్హ శబ్ద భవము=అరుహుఁడు, బర్హి శబ్దభవము=బరిహి.

బ్రాహ్మణ శబ్దభవము = బ్రాహ్మఁడు. మంత్ర శబ్ద భవములు=మంతరము, మంత్రము – మంతర శబ్దమున అత్వలోపము కలిగి, మంత్రము-అగును. స్థానదీపిక=తానదీవియ. వనలక్ష్మి-వనలచ్చి,అమర రామ=అమరలేమ. వీరమర్దల=వీరమద్దెల, ప్రాణ కుట్టకము = ప్రాణగొడ్డము- తిక్కన కేతనాదులును దీనిని వాడిరి. కేతన వైరిపదములు దోషముగనే భావించెను. (ఆం. భా. భూ.) సమస్తపద తద్భవ మయినచో ప్రాణశబ్దమున రేఫ లోపింపదా ? అని కొందరందురు. కొన్నిచోట్ల రేఫలోపింపదు, లోపించుట కొన్నియెడల గ్రామ్యలక్షణ మగును. పాణ(న)ము-అనుట గ్రామ్యమన్నమాట. పేనము-అని గ్రామ్యజనుల పాటలలో ఉండునుగాని గ్రాంథిక భాషలో ఉండదు. రేఫ మొక్కొకచోఁ దొలంగ కయ యుండు-కవిసంశయ విచ్ఛేదము. ద్రౌపది= దోౖవది ఇత్యాదులలో రేఫ లోపింపలేదు. అట్లే ప్రాణశబ్దమున రేఫ లోపింపదు. చంపకపుష్పావళి= చనుపక పుస్పావళి. ఇవి నన్నెచోడునివి నన్నయాదుల కృతులయందును సమస్తపద తద్భవములు కలవు. అంతఃపురము=అంతిపురము, నాగస్వరము = నాగసారము. గంధపట్టిక = గందపట్టె. యోగపట్టిక=యోగపట్టె. గరుడస్తంభము=గరుడ కంబము. అంతరతామరసము = అంతర దామర. కర్పూరదీపము = కపురదీపము, కరదీపిక = కరదివ్వియ. ఉత్తరదోఃకరము = ఉత్తరదొక్కరము, అనేక భారములు=అనేక బారువులు. కపటమనుష్యుఁడు=కపట మానిసి–మొ.

IV. అచ్చిక సమాసములు శివకవుల కృతులలో కలవు. జవ్వనసిరి (జవ్వనము + సిరి). మంత్ర కాటుక (కు. సం.) మంత్రశబ్ద భవము= మంతరము (మంతరకాటుక-బసవ.) దీనిలో అత్వలోపముకలిగి, మంత్రము. అను తద్భవ రూపాంతరమేర్పడును. మంత్రకాటుకలోని మంత్రశబ్దము తద్భవమన్న మాట (మంత్రము + కాటుక). జగ మంత్రకాని యాటయుఁ బోలెన్ – అచ్చ తెనుగు రామాయణముఁ (శ. ర: సూ. ని.) మంత్రశబ్దము తద్భవమనుట కిది తార్కాణము. నిత్యనేమము – బసవ. నిత్యశబ్ద భవము నిత్తియము. దీనిలో ఇత్వలోపము జరిగి, నిత్యము – అను తద్భవ రూపాంతర మేర్పడెను దీనితో నేర్పడిన సమాసము నిత్యనేమము (నిత్యము + నేమము) నిత్తియము=నిత్తెము అనియు అయినది. సత్తైన దెల్ల ఉణికము, నిత్తెము గాచుంచి – వరాహపురాణము. నిచ్చనేమము – అనియు బసవపురాణమున కలదు. నిత్యశబ్దము ప్రాకృతమున 'ణిచ్చ' అయినది. నిచ్చ – అన్నది ప్రాకృతభవము. సర్వాంగ కచ్ఛదము–బసవ సర్వాంగ శబ్దభవము=సరువాంగము దీనిలో ఉత్వలోపముజరిగి సర్వాంగము– అను తద్భవ రూపాంతర మేర్పడెను. సర్వాంగము + కచ్ఛదము = సర్వాంగ కచ్ఛదము – అగును. ఇట్టివి అచ్చికసమాసమే. బన్నెపలము (బన్నెము + పలము) – కుంభిరా మత్తనము : బావి=మట్టెన బావి–బసవ.

V. మిశ్రసమాసములును శివకవుల కావ్యములందున్నవి. సోమన ప్రయోగములు ;– హాల కుట్టు=హాలయొక్క కుట్టు. బిల్వపత్రి=బిల్వముయొక్క పత్రి. రుద్రాక్ష పక్కెరవు రుద్రాక్షి=రుద్రాక్షము పెక్కడు బిగబడు పట్టు రుద్రాక్ష. ముక్కున దాల్చిన ముక్కు పేరులు – బసవ. మిశ్రద్వంద్వములు : విభూతి పచ్చడములు, త్రిపుండ్ర దీవనలు. మిశ్రరూపకము ;– పదహారు; షోడశపండుగ= షోడశ యనెడు పండుగ షోడశ సోమగణముల పండుగ. పదునారు రోజుల పండుగ అనుట తప్పు. "ఎలమి షోడశ గణముల నిరతముగ వెలయఁ జేరంబుల నిలుపఁడే మఱియు" అనుచు మిశ్రబహువ్రీహి – కలకరంచుఁడు. ప్రాచీన లాక్షణికులు మిశ్ర సమాసములను నిరసించుచు నన్నయాదులును మిశ్రసమాసములు వాడినారు. దేవిదేవరలు – శ్రీ. నై. 2. 86 అవనిప మక్కలలు – రామా. 2–9 త్రి. పే. సమాస 32 ఉమబోటి – కాశీ. 2–38: హర 4–97. కపిలమొదవు – అను 3–19. అగ్నిదేవర – కాశీ 5–302. కలకంఠుఁడు – అరణ్య 1–334 మొ.

VI. ఏకదేశాన్వయములు శివకవుల కృతులలో ఉన్నవి. ఆపర్వతాగ్ర హేమైక శృంగంబునా - కు. సం. 1-2. ముల్లోక వంద్య-బసవ. ఏకదేశాన్వయములు నన్నయాదులును వాడిరి. అతని కరతల ద్వయావమర్దితములై-అరణ్య. 2-197. ఆ నారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యమల జ్యోత్స్న- ఆది 3-21. (త్రి. శే. సమాస 35.)

పరిశోధకులు సమస్తపద తద్భవములను, ఆచ్ఛిక సమాసములను, మిశ్రసమాసములను, ఏకదేశాన్వయములను వైరిపదములుగ పరిగణించి శివకవుల కపకారముచేసినారు. అది కేవల మపచారము. వైరిపదములు లక్షణ విరుద్ధములే అని ఒకచోట, అవి దుష్టము లనువారు తెలుగు సంప్రదాయము నెరిగినవారు కారు అని ఒకచోట పరిశోధకులు వ్రాసినారు వైరిపదమును నిరసించిన కేతనాది లాక్షణికులకు, పూర్వకవులకు, విశేషించి వైరిపదమును నిరసించిన సోమనకు తెనుగు సంప్రదాయము తెలియదన్నమాట !! (శాంతం పాపమ్).

VII. సంధి కార్యములు :— అనుకరణమున తుదిపదము సంస్కృత సమముగ వాడుట. "సర్వస్య పూజార్హ ముత్తమాంగంబనంగ"- పండితా. "విను యథా శివమయో విష్ణుఃడన్ మాటలును" బసవ. ఇవి ప్రయోగ సమ్మతములే. కవయోవదంతి కావ్యంబని- కవిజనాశ్రయము. శీతాంశో రమృతార్పణంబనుక్రియన్-వసు నయనం ప్రధానమను- విరాట 2-35. ఇట, నయనం ప్రధానము + అను, అనియే పదచ్ఛేదము నెన్ననగును. దీనిని "పదాత్తుతవ్యదా" దీత్యాదిగా నున్న అథర్వణ కారికకు లక్ష్యమందురు. కాని యీకారిక ప్రత్యయముల మకారమునకే వైకల్పికముగ ద్విత్వమును విధించుననుట యుక్తము. కాన నయనం ప్రధానమ్ + అను=నయనం ప్రధానమను- అని చెప్పరాదని తోచును. నద్వైవంకేశవాత్పరంబటంచు- నిరంకు 2-109. వినవెయభ్యాగతఃస్వయంవిష్ణుఃదనుట- పాండు 4-156. (గౌతమీప్రతి). మొఅయిదు స్వాశ్రితావన సమో నహి ధర్మవటంచు వేదముల్. బై చ. వేం. పంచ 1-508. మొ॥. (2) షష్ఠిలో నుగాగమము రాకపోవుట. ఉదా. భావుకమోజు=భావుకముయొక్క ఓజు. ఇట్టివి తిక్కనాదులును వాడిరి. గొడుగీగి=గొడుగుయొక్క ఈగి. అను5-196 (త్రి. శే. సంధి 10 సూ.) భావుక + మోజు- అని పరిశోధకుల విరీత పదచ్ఛేదము. (3) షష్ఠిలో నిగాగమమునందలి అచ్చునకు లోపము :— మరుం బ్రసవాస్త్రహతిన్. కు. సం. మరున్=మరునియొక్క. త్రి. శే. సంధి 17. (4) అనుకరణమున విసర్గ లోపము ప్రాసాది గతముగ కలదు. "వాయారఁగా....న, రైయన" పండితా. ఇట నరైః + అన=నరై + అన = నరైయన- అని ప్రయుక్తము. దీనినిబట్టి అనుకరణమున విసర్గలోపించుటయే కబిసమ్మతమనుట స్పష్టము. నరైరన-వంటి ముద్రణములు నిర్మూలములు.(5)తత్సమాకారసంధులు, క్త్వార్థకసంధులు మున్నగునవి శివకవుల కావ్యములలో కలవు ఇతర కవులును వీనిని వాడియేయున్నారు.

VIII. శివకవుల కృతులలో పరిష్కరణలోపము మూలమున అపపాఠములు ముద్రింపబడినవి. అన్ని కావ్యములలోను అపపాఠములుండనే ఉన్నవి. కాని శివకవుల కృతులలోని అపపాఠములనే కవిపాఠములని అకాండతాండవము చేయుట మనవారికి పరిపాటి అయిపోయినది. అపపాఠములను శోధించి కవి ప్రయోగములను గ్రహించుట కర్తవ్యమైయున్నది. లేఖక దోషములే కవిపాఠములను వారు పరిష్కర్తలుగా బయలుదేరుట అసంగతము. వైరిపదాదులను వాడరాదని ఉద్ఘోషించిన కవి గ్రంథములలో కనబడు వైరిపదాదులు లేఖక దోషములు కాక కవి బుద్ధిపూర్వకముగా చేసిన దుష్టప్రయోగము లనుట వివేక మనిపించుకొనదు. (1) అధమపాలుులు-బసవ. ఇట, అఖవపాలుులు-కవిపాఠము. 'మటీనాముమేసియో మతిమాలినట్టి, యఖవపాలుల మాట లవనీశ వినకు'అను ద్విపదయే వీరికి జబాబుకాగలదు. "అఖవపాలుండు వ్రక్కలు

వీఱుగనగుచు" కు. సం. జన్నఫలంబు-కాదు. జన్నపలంబు - సాధువు. పలమిలసామీ - కలా 6-161. తపనిధి కాదు తపనిది-ఒప్పు. భ క్త కూటువలు-అపపాఠము. భక్తకూటువులు- సాధు పాఠము, ధర్మము, ధర్మువు- అను వానివంటివే కూటము, కూటువు- అన్నవి. ఇతరవేల్పులు- కాదు. ఇతరదేవులు- కవిపాఠము. దేవశబ్దమునకు బాల వ్యాకరణముచే బహువచనము కలుగదుగనుక ఇది సరికాదని పరిశోధకులందురు. దేవదేవులు - కర్ణ 3-254 నిర్మితకర్ముల నిర్దేవుల- పండితా. బ్రహ్మ దేవులమనువారు- హంస 1-190. ధర్మకవిలె- కాదు. దర్మకవిలె-సాధుపాఠము. (ధర్మము=దర మము=దర్మము) "అయ్యాయనఁగ నేమి యయ్యా యనుడు త,దియ్యనామంబు". తదీయ- అనుదానిని లేఖకులు తమలేఖన సంప్రదాయము చొప్పున తదియ్య-అని వ్రాసిరి. ఆలేఖనసంప్రదాయము తెలియక, అయ్యశబ్ద రూపాంతరమగు ఆయ శబ్దము కవిప్రయుక్తమని గ్రహింపక పరిశోధకులు విపరీతధోరణి పట్టిరి. 'ఆయా-తదీయ' అనియే ఉండవలెను. "వ్యతికర, చ్ఛాయాధిపుండు దొడ్డాయ నృపతి" (కాశీ 1-29) అనుచో 'ఆయ' శబ్దము కబడు. సోమనాధుని కృతులలోని అపపాఠములు కొన్ని నిర్దేశింపబడినవి. కుమారసంభవము నందలి కొన్నిఅపపాఠములు మచ్చునకు చూపబడును. అరదాశ్వభటతతి- కు. సం. 11-76. మొ॥ 1949 వావిళ్ళప్రతిలో అరథ-పాఠము కలదు. ఇట అరథ-కవిప్రయుక్తము. "అరథ-పుం. ఈ షద్రథః, ఏకాశ్వేన గమనసాధనే రథే- వాచస్ప త్యము. 'ఆ' శబ్దమునకున్న ఈషదర్థము 'అ' శబ్దమునకును గలదు. కనుక అరథ శబ్దము కవి ప్రయుక్తము. "అ-అవ్య. అల్పః" - శబ్దకల్ప ద్రుమము, అరద శబ్దము రథ శబ్ద భవము కాదు. రేఫ లకారములకు ముందు అకారము, ఇకారము చేరి తద్భవములగుట అరవ సంప్రదాయముగాని తెనుగు తద్భవముల సంప్రదాయము కాదు. కనుక అరద శబ్దము, ఈ 'అరథ' శబ్దభవమే అగును. హరుషాశ్రు- కు. సం. ఇట హరషాశ్రు- కవి పాఠము. "హరషః. పుం. హర్షః"- సర్వశబ్ద సంబోధిని. ఇట్లే శ్రీనాథుడు 'వరష' శబ్దమును వాడినాడు 'వరష ధారలచేత నుఱియకుండ'-కాశీ 7-40. వర్షధారల-అను ముద్రణ సరికాదు, ఉదక ధారల-అను సవరణమునుసరికాదు. చనుపక పుష్పా వళి-'అపపాఠము'చనుపక పుస్పావళి-సాధువు,

IX. సంస్కృత సమములపై తద్ధిత ప్రత్యయ ములు నిల్చుట శివకవి కృతులలో కనబడును. అభిమానకర్త - బసవ. శ్రీనాథాదులును ఇట్టివి వాడిరి. కోపకాఁడు- కాశీ 4-90, కోపకర్త-క్రీడా. గాలకాఁడు-అను తిక్కనప్రయోగమిట్టిదే అని వ్యా. సం స. గాలము - సంస్కృతసమమని వారి అభి ప్రాయము. (మా. మా ని.) ఇమి-ప్రత్యయమును సంస్కృత సమములపై నిల్పును దాక్షిణ్యబలిమి- శృం. నై. 2-80. ప్రయోగము లిట్లుండగా, బాలవ్యా. సమ్మతముకాదు, ప్రౌఢవ్యా. సమ్మతము కాదు. కనుక లక్షణ విరుద్ధ మనుట సాహసము. రామునితనము- బాలవ్యా. రా. పత్రియు, ఇమి ప్రత్యయములును సంస్కృతసమములపై నిల్చునని గ్రహింపవలెను.

X. ఉదాహృత లక్షణములతో కొలిచి శివకవులు ఛందోభంగములు చేయుదురను పరిశోధకుల వ్రాత అగ్రాహ్యము "ఛందో విరుద్ధంబాదియగు సలాభ ప్రలాపోక్తి" అను కవి వంతోక్తి ఛందోదోషయైనది. పాయక ప్రీతి రసాన భక్తస్య జిహ్వాగ్రే యని (బసవ.) ఇటగగను సూర్యగణముగ ప్రయుక్తము. నన్నయ యుక్కురిలలో నిట్టిగణములు కలవు. కవి జనాశ్రయ కావ్యాలంకార చూడామణి లక్షణములు పరిశోధకుల కర్థము చెప్పినను తెలియలేదు. (మా. భారతి 1969 మే. "తరువాతి లాక్షణికోక్తిని బట్టి సోమనాథాది శివకవులు ఛందో వ్యతిక్రమ మొనర్తురని సిద్ధాంతము చేయనక్కరలేదు." (తెలుగు ఛందోవికాసము 109 పు.) అను వాక్య మును పరిశోధకులు మధ్యపరచుట శోచనీయము.

శివకవి ప్రయోగములను గూర్చి వ్రాయుట వ్యాసములతో తేలునదికాదు ఒక ప్రత్యేకగ్రంథమే ఆవశ్యకమై ఉన్నది.

శ్రీ ముకరాల రామారెడ్డి

# ప్రజా (స్వామ్య) కవి

కండ్లలో నీళ్ళూరించే కవిత్వాన్ని రచించగలిగే వాళ్ళను వర్గీకరించి చూచుకొన్నప్పుడు నేటి తెలుగు దేశంలో అలాంటి రచయితలు మూడు వరుసల్లో కనిపిస్తున్నారు.

మూగహృదయాల వేదనాభారాన్ని నివేదించ డానికి కలంబట్టి ప్రాతినిధ్యం వహించి, వాటి స్థానే తాము స్పందించి కవిత్వాన్ని పలికించేవాళ్ళది ఒక వరుస.

అందరూ ఏడుస్తుంటే తాము నవ్వుతూ, అందరూ నవ్వే పరిస్థితుల్లో తాము ఏడుస్తుండే వాళ్ళది మరోవరుస.

ఇక తమఏడ్పు తమదే అన్నట్లు ఇంకోవరుస.

ఇందులో మొదటిరకం కవిత్వానికి సహృదయు లనూ, సానుభూతి పరులనూ వెతుక్కోనక్కర లేదు. సర్వసామాన్యమైన ఇబ్బంది వారి కవితా వస్తువు. అక్కడ, సమాజంలోని సామాన్యులూ, అసామాన్యులూ కదుల్తారు. ఆ కవిత్వాన్ని చదువు కొంటున్నప్పుడో, వింటున్నప్పుడో కండ్లనీళ్ళు వాటంతట అవే వస్తాయి.

రెండో రకం కవిత్వాన్ని వినే శ్రోతలందరినీ సహృదయుల పట్టికలో చేర్చడం కష్టమే. ఒకే ఒక పద్ధతిలో అందరినీ ఏడ్వమనే ఆ కవితా తత్వమే అందుకు కారణం అనవచ్చు. అలా ఏడ్చి ఏడ్చి తూడ్చిన కవులకే ఇపుడు కన్నీళ్ళు కారకుండా అయినాయి.

మూడోరకం కవులకు సానుభూతిపరులు దొర కడం మరీ సమస్య. వారి ఏడ్పువారిదే. ఏ ఒక్క తమ సొంత అభిరుచికోసమో, తప్పితే ఏ పచ్చని పైతోలు ప్రియురాలు కోసమో, తీరికసమయాల్లో వాళ్ళు తమ గృహారామాల్లో కవిత్వాన్ని ఏడ్పిస్తూ కూర్చుంటారు. ముదిరిన పిచ్చో, తెగబలిసిన కొవ్వో దానికి కారణమై ఉంటుంది.

ఎవరు దేనికోసమైనా ఏడ్వవచ్చు. కొన్నిటి కోసమో, కొందరికోసమో, ఏడ్చేవాళ్ళుగూడా ఉండ వచ్చు. కాని, తన ఆవేదనా హృదయాన్ని పలికిస్తూ సర్వసామాన్యంగా అందరి కండ్లకూ నీళ్ళు తెప్పిం చడం పుట్టుకతో జాలిగుండె కలిగిన వాళ్ళకే అబ్బిన విద్య. అలాంటి కవులను నేటి సమాజంలో పేర్కొ నాలంటే 'కాళోజీ' పేరే మొదట తోస్తుంది.

కవిత్వం కోసమే జీవితాన్ని వెచ్చించేవారిలో కాళోజీది ఒక ప్రత్యేకవ్యక్తిత్వం. ఆవేదన అతని కవితాత్మ. జీవితమంతా ఒక కవితోద్యమం. తమ తమ ప్రయోజనాల కోసం పరస్పరం తన్నుకొంటూ, సమాజాన్ని అడ్డాదిడ్డిగా నలగదొక్కడానికే అన్నట్టు వస్తూ పోతూ ఉన్న ఆయా మతా తత్వాలు సృష్టించే సంక్షోభకరమైన సంఘటనలూ, విప్లవ విషాద గాధలూ ఆయన కావ్య నిర్మాణానికి నరం జామాగా, సామగ్రిగా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

కొన్ని ప్రత్యేక ఉద్దేశాల ప్రచారంకోసం వ్రాసే వ్రాతలు తాటాకు మంటలు. కేవలం తన సంతృప్తి కోసమో, తానుమెచ్చినదానికోసమో, పోటీ బేరం కోసమో, మన్ననకోసమో ఆయన వ్రాయడంలేదు. మనిషికోసం వ్రాస్తున్నాడు.

జీవన వాదం, కళ మానవీయతకోసం అనే నినాదం, ఆయన కవితలో పదపదంలో పలుకు తూంది. సర్వోత్కృష్టజీవి అనిపించు కొన్న మాన వుడు సాటివాణ్ణి చంపడానికీ తానూ చావడానికి

చేస్తూన్న చేష్టలను చూచి ఆ దుఃఖాన్ని మోయలేక మొరపెడుతూ తన 'గొడవ'ను ప్రకటిస్తున్నాడు.

తెలుగులో స్వతంత్రయుగ కవిత్వానికి కాళోజీ నన్నయ్య వంటివాడు కాడనుకొన్నా, అన్నయ్య వంటివాడు మాత్రం ఖచ్చితంగా అవును. కొత్త కొత్త పద్ధతులతో కొత్తకొత్త స్ఫూర్తులను కలిగిస్తూ నేడు కవిత్వంలో పుట్టిపెరిగే వాళ్ళకందరికీ ఆయన అన్నయ్య. కవిత్వాన్ని ఆరాధించి, అనుభవించి, ఉపాసించి, దానితోనే ఉద్యమించి, దాన్నే ఉపన్యసిస్తున్నాడు.

ఒక కవికిగల స్వతంత్ర స్వాభావిక వ్యక్తిత్వాన్ని పరిశీలించవలసి వచ్చినప్పుడు నాలుగు ప్రక్కలా ఛాయాగ్రహణం చేసి చూచుకోవచ్చు. (1) ఇతివృత్తాన్ని తీసికోవడంలో (2) భాషా శైలిని అలవర్చుకోవడంలో (3) భావసామగ్రిని కూర్చుకోవడంలో (4) ప్రక్రియను ఎన్నుకోవడంలో పరీక్షించి ఫలితాన్ని తేల్చవచ్చు.

పై నాల్గింటికోసం కాళోజీ ఇటు సంస్కృతాన్ని యాచించినట్టు గానీ, అటు ఆంగ్లాన్నో, అన్య సాహిత్యాన్నో అడుక్కొన్నట్టుగానీ లేదు. న్యాయ సమ్మతంగా తాను సంపాదించుకొన్నవే అవి ఆయన సొంత ఆస్తి అయిపోయాయి. ఈ నాల్గింటినీ ఆయన సర్వతంత్ర స్వతంత్రంగా, బహు రంజకత్వంగా నిర్వహించి, లోకప్రియత్వాన్ని చూరగొని, కావ్య కర్మలో తానొక ప్రత్యేక నిపుణుడైన కిటుకును కొత్త తెలుసుకొనే అందుకు ప్రయత్నం సాగింరాం.

ఇతివృత్తంలేని కవిత్వం మృగ్యం. ఆత్మాశ్రయ కవిత్వాల్లో కూడా ఏదో ఒక సొంతకథ, సొంత వ్యథ ఉండితీరుతుంది. ఆత్మాశ్రయంగా చెప్పినా, పరాశ్రయంగా చెప్పినా ఆయన 'గొడవ' వాస్తవిక జగత్తునే ప్రతిబింబిస్తుంది. కాళోజీ చెప్పూయూ వస్తున్నకథ, కాలంప్రసవిస్తున్న వ్యథ. నాయకులు: దురోద్ధతులు, వక్రవర్తులు, 'చతురమతులు.' ఉప నాయకులు : (నాయికల గొడవ లేదు) పీడితులు, తాడితులు, 'దేబెమొగాలు.'

సమకాలిక సంఘటనలను పరామర్శించి, వ్యక్తులు సృష్టించే సమస్యలనూ, సమస్యలు సృష్టించే వ్యక్తులనూ బొమ్మకట్టించాడు కవి. అకృపలను తడవబోడు, ప్రకృతులను విడువబోడు. ప్రకృతులను బట్టి పాత్రలను ప్రవేశపెడతాడు. మనువులవలె, మాంధాతలవలె, ధృతరాష్ట్రులవలె, శకునులవలె, అక్బర్లవలె, ఆలంగీర్లవలె, నీరోలవలె, జైజర్లవలె, క్లైవులవలె, హిట్లరులవలె, మావోలవలె, ఈపాత్రలు కనిపిస్తాయి, ఇతివృత్తం చారిత్రక కొంచెమూ, నిర్వహించరాక కొంచెమూ చారిత్రక పాత్రలను చిక్కబట్టి నెత్తిమీద గొడుగెత్తి ఊరేగించాడు. పేర్లు చెప్పి ప్రయోజనం లేకపోవచ్చునేమో! కాని ఆయన సృజనచేయించేసి చదివినట్లైతే ఎన్నో చారిత్రక పాత్రల నామాలు మనకు స్ఫురిస్తాయి, భూత ప్రవృత్తులు ఆవేశించినా విజృంభించిన మానసిక స్థితి కవిలో కనిపించదు.

కాళోజీవస్తువు ప్రస్తుతాన్ని పలుకుతున్నట్టున్నా, మూడుకాలాలనూ తద్ధర్మాన్ని పలికే వాటితో. పాత లోనిప్రవృత్తినీ, భవిష్యత్తులోని ప్రస్తుతాన్నీ, ప్రస్తుతంలోని సరికొత్తదనాన్నీ, కొత్తలోని భావపరిణామ శీలాన్నీ, పరిణామంలోని సహజావర్తనమూ కలవరిస్తుంది, పలవరిస్తుంది, పలకరిస్తుంది ఆయన వస్తువు. అప్రస్తుతమైన విషయాన్ని అది వల్లించదు. "కాలమేదైతేమి? కాళన్న కాళన్నే".

ఏమి వ్రాయాలె? ఎందుకు వ్రాయాలె? అను కొంటూ సందిగ్ధంలో పడ్డ సామాన్య రచయితలకు జ్ఞానదానం చేస్తున్నాడు నన్నుసూచించ గలవా? మానుమతి? అని ఒకవంక వ్యంగ్యిస్తున్నట్టు కనిపిస్తూ మరోవంక సవాలు చేస్తున్నాడు.

తన భాషాశైలిలో ఈకవి వెయిగండనాన్ని, భాషీయాన్నీ, ప్రజాసామ్యానికి అర్థమయ్యే పలుకు బడినీ, అందులోనూ తెలంగాణా బడినీ బహుళార్థ సాధకంగా పలుకుతాడు. కూర్పులో సుడికారాలు బంతులు దీరి సరికొత్తగా కదిలిస్తాయి. వాక్యనిర్మా

ణంలో సంస్కృత బంధాన్ని చాలావరకు విడిపించాడు. తత్సమ తద్భవాలు, దేశి, విదేశి భేదం లేకుండా కలసిమెలసి సామాన్యార్థం భాషిస్తాయి. బహు నాజూకుగా శ్లేషిస్తాయి. విదేశీ తత్సమ తద్భవాల దిగుమతిని నిషేధించే వాళ్ళను చూచి 'మీకు పరిసర రాష్ట్రాలలో గూడా మంచి నీళ్ళు దొరకవు' అంటాడు. 'ఇది' ఏమిటి అంటే 'అది తద్భవానికి తద్భవం' అంటాడు. అట్లా అనగూడదంటే 'నీవు గూడా పిల్లలను కనగూడదు మరి' అంటాడు. ఆంధ్రాంగ్లం, తౌరక్యాంధ్రం హైబ్రీడు సమాసాలు జట్లు కడతాయి. ప్రశ్నించిన వానిదే పాపం. 'రైలుబండి' ఎక్కాం; 'కాంగ్రెస్ సభ్యత్వం' తీసుకొన్నాం; అన్నింటికీ 'హక్కుదార్ల' మన్నాం; 'కొత్త తరహా రివాజు' చేసుకొన్నాం; అంతర్జాతీయ వివాహాలను గూడా అంగీకరించాం. అలాగే అందరి సౌలభ్యంకోసం ఏర్పడ్డ ఈసమస్త పదజాలంలో మనకు గిట్టనిదేముంది? అంటాడు. ఆయనతో మాట్లాడడం కాస్త కష్టమే కావచ్చు. నష్టం మాత్రం కాదు.

ఆయన భావ-వేగాన్ని హైడ్రాలిక్ బ్రేక్స్ కూడా ఆపలేకుండా ఉన్నాయి. వ్యాకరణ సూత్రాలు ఎప్పుడు పుటుక్కుమన్నాయో? 'కవితకున్న లక్షణాలు కోటొక్కటి, అందులో వ్యాకరణం కూడా ఒక్కటి సరస్వతీ భక్తులైనవాళ్ళు (పంతులు) బ్రహ్మను(కవిని)వెక్కిరించడం అవినయం' అంటాడు, సాంఘికామోదం(Social sanction) లభించిన పదాన్ని మనఅవసరంకొద్దీ వాడుకుందాం. దాని చావు బ్రతుకులను మనం నిర్ణయించలేం. కాలమే ఆయుష్కర్త అంటాడు. విమర్శన పెరిగినాకొద్దీ వ్రేలెడెక్కువగా పెరుగుతుంది కాళోజీ కవిత్వభాష, ప్రయోగంలో దుబారా ఖర్చుచేయడు. పీనుగును ఏనుగును చేయడు. భాషనూ భావాన్నీ పొదుపుగా కుదుపుగా వాడడం బాగా అభ్యసించాడు. పరమౌషధం వైద్యు డాశించిన రోగనివారణమే కాకుండా విశేషగుణాన్ని కూడా ఇస్తుంది. కాళోజీ ప్రయోగించే పదాలూ, భావాలూ అదేపని చేస్తున్నాయి. అవి కల్పించి కండ్లకుకట్టించే చిత్రవిచిత్ర రూపధేయాలూ; విన్పించే ధ్వనులూ; మెరసే మెరపులూ; కురిసే అమృతధారలూ; సంతప్తులనూ శప్తులనూ సాదరించడం కోసం. ముక్తిలేని మూగజీవాల సందేశాలను మోసి, దయలేని ధనాధిపతుల గుండెల్లో దడదడలు పుట్టించి, ఆర్తులైన వారికి ఆనందైక్యం సంఘటించడంకోసం, విడివడ్డ జంటలను అరకడం కోసం.

"అన్నపురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
కళాప్రదర్శన మొకచోట
కళారాధకులు ఒకచోట,
తనువులు ఉండే దొకచోట,
దలపులు ఉండే దొకచోట,
అనుభవమంతా ఒకచోట
అధికారం బది ఒకచోట.

ఇలా ఆయన చెపుతూ పోతుంటే, సమాజంలో చిరవిరహంతో తపించే వ్యత్యాసాలకు ఐక్యసంఘటనను కూర్చే సత్వర యత్నం చేతాం, విప్లవం తెత్తాం, అనే ఆవేశం ప్రతి పాఠకుణ్ణి పట్టి ఊపుతుంది.

భావసామగ్రిని కూర్చుకోవడంలో స్వీయేంగితాన్నే పురమాయించా డీ కవి. ఉర్దూ మరాఠీ (తకల్లుస్‌నూ తాతల మాతృభాషనూ బట్టి కావచ్చు) సాహిత్యాలు కవిపై బాగా ప్రభావం వేశాయని కొందరంటారు, కాని విశ్లేషించి చూపగలిగే స్థితిలో ఆ ప్రభావాలు పడలే దనాలి. ప్రభావాలు ఎందరిపైననో పడతాయి. వాళ్ళంతా 'హిజ్ మాస్టర్స్ వాయిస్' అన్నట్టే ఉంటారు. ఆయనపై పడ్డ ప్రభావాలు అంత అగ్గువగా బయటికిరావు. కాని ఆధునిక తెలుగు కవిత్వంపై వేసిన ప్రభావం స్వయం సమృద్ధిలోనుండి వచ్చిన సంపద. పురాణ లక్షణాలతో పుచ్చిపోతూ, ఆధునికత పేరుతో అనుకరణల చాదస్తంలో తికమక పాలవుతున్న తెలుగు కవిత్వాన్ని పునరుజ్జీవింప జేశాడు కాళోజీ.

భావాలు కావలసినవారికి బదులిస్తాడు. కాని పుచ్చుకోడు. అంతా సొంతం కాకపోతే కవులనే కవ్వించే నేర్పు ఎందరికుంది ?

ఆయన భావప్రకటనా సామర్థ్యంలో ప్రస్ఫుటమయ్యే లక్షణాలు స్పష్టతా, విశిష్టతా, గుప్తతా, క్లుప్తతా, సుందరతా, స్వతంత్రతా, నవ్యతా, సార్వకాలీనతా ముఖ్యమైనవి. సమీక్షలో ఇలా పేర్కొన్నప్పుడు ఇవి పాత లక్షణాలుగానే తోచవచ్చు. కాని సహృదయులదృష్టికి అడుగడుగునా అన్నింటిలోనూ ఒక కొత్త మలుపే.

'ఓటును'ను గురించిన రచన (మంజరీ ద్విపద) స్పష్టతాగుణానికి మచ్చు తునక. స్పష్టంగా చెప్పడానికి ఎంత ఓర్పు అవసరమో, ఆ చెప్పిన దాన్ని విశిష్టంగా చెప్పడానికి అంత నేర్పు అవసరం చెలిమి కలిమిని గూర్చి ప్రసంగిస్తూ ;

"కులముతో పనిలేదు, గుణముతోడనులేదు
అందచందాలతో ఆవశ్యకములేదు
వయసుతో పనిలేదు, వరుసతోడను లేదు
కలిమి లేములు రెండు కలసి నయ్యాటాడు
నచ్చు జెప్పుటెకాని. రచ్చకీడ్చుట లేదు.
మానవత్వము మెరుగు, మర్త్యలోకపువెలుగు
సంపూర్ణ సహకార సంఘంబు మైత్రి."

ఇది నిజంగా దేవత లెరుగని 'దివ్యానుభవము'. మహోన్నతమైన మానసిక సంస్కారమే విశిష్టత. అది గలవారికే దేవత లెరుగని దివ్యానుభవము లభిస్తుంది. కవితా రచనకు మంచిమంచి లక్షణాలు ఎవరెవరో ఎన్నెన్నో చెప్పారు. కాని కవిలోని మంచి మనస్సు కవిత్వాని కొక విశిష్టలక్షణం అనే సంగతిని మనం నేటికైనా గుర్తించాలి.

రసానుకూలమైన ప్రక్రియను ఎన్నుకోవడంలో కూడా ఈ కవి సిద్ధహస్తుడు. రెండురకాల పద్యాలనే ఎక్కువ రాస్తాడు. (1) దేశీ ఛందస్సులు (మంజరీ ద్విపదలు, గేయాలు) (2) స్వచ్ఛందాలు (ముక్తఛందాలు లేదా వచనపద్యాలు). అవీ ఇవీ ఉర్దూ బాణీకి దగ్గరగా ఉంటాయి. అంతర్లయనూ; భావలయనూ అల్లుకొంటూ సాగుతాయి. అంత్యప్రాసలతో కొంటెగాలు వేస్తాడు. యమకంతో గమకిస్తాడు. పదాలతో గారడీచేయదలచినవాళ్ళు 'పరాభవం' చిత్తగించాలి. అలంకారాల కోసం, ఛందోవైవిధ్యంకోసం కవిత్వం వ్రాయడు. అవి వస్తే వద్దనడు. రాకుంటే లాగడు. ఆయన స్పందించిన అవసరమే 'కాలమే' ఛందం, అలంకారం.

భావనాబలంతో; రసవ్యంజనతో; శబ్దనిష్ఠతో; అర్థవ్యక్తితో; వాక్యం మలుపుతో; ఒకవాక్యార్థానికీ మరో వాక్యార్థానికీ అంత్య ప్రాసతో ముడివెట్టి; అన్వయ, వ్యతిరేకాన్వయ, సమన్వయాలతో; అర్థాంతర కల్పనలతో; పాఠకులను కలకల లాడించే భవ్యభావ సంచారకు డీ కవి

"శ్రీని బడయ ఏవైనను
చేయ సాహసింతునేను,
కైవల్యము శ్రీపదమున
కలదని భావింతు నేను."

"శాస్త్రకారులు శాసనకర్తలు
జనులకు తాకట్టని భర్తలు"

"వీలున్న ప్రతిచోట విజృంభిసుడు
అసలుహిట్లరౌతాను నే హిట్లరౌతాను
...............తలదన్ను వానికడ
గాంధి నౌతాను నే గాంధి నౌతాను"

"ఒక సిద్ధాంతం పూనినపుడు కసి
మరో దానిని చేస్తుంది మసి"

"భావానుగుణ్యం రూపం
శక్తినిబట్టి సాక్షాత్కారం"

"ఉన్నవంకల దిద్దిపోయేటిమిషతో
లేని వంకల తెచ్చి పెట్టేటి వయసు"

"రక్షణకు ఏర్పడ్డ బలగము
రక్కసుల పక్షంబు జేరిన
రాక్షసుల ఇష్టానుసారం
రాజ్యమును నడిపించినట్లే"

"ప్రపంచ చరిత్ర సాంతము
ప్రకటించును ఒక విషయము
మాంధాతల నాటినుండి
మార్పు లేదు ఈజగాన"

"రాయిరువ్వినా, రాకెటువిసరినా,
గిట్టని వానిని కొట్టుటకేకద"

పై పంక్తులను చదివి, అసంఖ్యాకంగా వెలువడుతున్న నేటి కవుల రచనలతో వాటిని పోల్చి చూచుకొన్న తర్వాత కాళోజీకి ఇవ్వవలసిన ప్రత్యేక స్థానాన్ని కేటాయించకుండా ఉండలేం. మన స్వతంత్రయుగ సాహిత్య చరిత్రలో ఒక ప్రకరణాన్నే ప్రారంభించవలసి ఉంది, ఆయన కవితా సామగ్రిని విడమరచి చూపడానికి.

ఆయన భావాలను మననం చేసుకొంటూపోతే దేశ కాలాతీతమైన ఒక మానసికస్థితి ఏర్పడుతుంది. అది సర్వసంగ పరిత్యాగుల ఆలోచనలకు భిన్నమై, భౌతిక స్వభావాన్ని బాహిరంచేసే లౌకిక సత్యం. "ఆకాశానికి మన్నై, పాతాళానికి మిన్నైన ఈ పుడమిమీద" నివసించే ఏమానవ సంఘంలోనైనా అది అనుభూతమై ఉంది. అదే ఆయన కవితలోని సార్వజనీనత. విశ్వవిపణిలో ఏ కొనుగోలుదారు ముందైనా దాని విలువ దాని కుంది.

"రాముని భక్తుడైన హనుమడు
కృష్ణుని ఆనవాలు పట్టడు
నస్యం చూస్తే ఏవగింపు
జర్దారూపంలో గిట్టును కంపు"

కవిభారతీయుడు. కాబట్టి భారతీయ పౌరాణిక ఐతిహాసిక చారిత్రక జీవితంలోంచి ఉదాహరణలు అక్కడక్కడ వచ్చి పడ్డాయి. అంతే. కాని వాటి ఆసరాతో సృష్టించిన జీవితపోరాటాల సత్యమే అంతటా ప్రతిబింబిస్తుంది. హిమాలయ శృంగాలకూ హిందూ మహాంబుధి తరంగాలకూ నడుమ మాత్రమే వినిపించే నాదంకాదు కాళోజీది. తెలుగు ప్రజలకు విశ్వమానవీయ తత్వాన్ని ప్రబోధించిన 'గురుజాడ' తర్వాత మరో మూలనుండి ధ్వనిస్తూ వచ్చాడు కాళోజీ.

కాళోజీ కవిత్వాన్ని చదువుతున్నపుడు, వింటున్నపుడు పెదవులు మౌనబంధాలను తెంచుకొని హాసమాత్రంగా విడిపోతుంటే, హృదయం మోషయాత్రలో పడిపోతుంది. భంగ్యంతర వైభవోల్లసితాలైన కరుణ హాస్యాల వింత సంయోగం అంతటా రసపట్టు. సాగినంత దూరం బీభత్సం, హాస్యం నీడలా వెన్నాడుతుంటాయి.

"చాపచింపు సామ్రాజ్యం...
కోడిగుడ్డు కోహినూరు...
బస్సుసీటు బ్రహ్మరథం....
సానికొంప సాధుమఠం....
చాకిరేవు శాసనసభ....

ఏదైతేం ?........
ఎచటైతేం ?.......
పోటీపడి కాటులాడ.

"నా చెల్లెని వెంటాడెడి రౌడీలకు సాలానై
రౌడీ తోబుట్టువులను వెంటాడుదు బావనౌచు
ఎవరిదేమి పోతున్నది ?"

మనం నవ్వక తప్పదు. నొవ్వక తప్పదు. బహిరంగంగా నవ్వేతామనుకొన్నవాళ్ళం హృదయంలోకే ముడుచుకపోతాం. మూల్గుతూ కూర్చుంటాం. అక్కడగూడా అపహాస్యం గెలిచిన దౌర్జన్యంవలె గేలిచేస్తుంది. ముఖగహ్వరాలకు బదులు హృదయకుహరాలే ప్రతిధ్వనిస్తుంటాయి. 'తప్పు దిద్దుకోలేక దారి చూచుకోలేక' కవితోపాటు మనంకూడా ఎందుకో హృదయంలో అన్ని ఆవేదనలను అనుభవిస్తాం.

"చాపచింపు" ఖండికలో కథకునికీ కవికీ ఉండే తేడాను సామాన్య పాఠకుడుగూడా చప్పున గ్రహి

స్తాడు. ఒక భావాన్ని, అనుభూతిని, నీతిని, చెప్ప డానికి పెద్దకథ రచిస్తాడు కథకుడు. చిన్నమాటలో పెద్దకథలు చెపుతాడు కవి. 'కోడిగుడ్డు' అనడం తోనే రష్యా చరిత్ర, 'కోహినూరు' పేరువినడం తోనే హిందూదేశచరిత్ర జిగేలున ప్రత్యక్షమవు తాయి.

"సర్వే జనాః సుఖినో భవంతు లక్ష్యం
స్వార్థం, స్పర్ధా, ఈర్ష్యా సర్వత్రా ప్రత్యక్షం"

కత్తిదికేవలం ఏడ్పించడమేవంతు. నవ్వించడం దానిచేత కాలేదు. కలంలోంచి రెండూ (ఏడ్పించినా, నవ్వించినా) ఉదాత్తంగా పుట్టుకొస్తాయి. కత్తికీ కలానికీ ఉండే తేడాను వేమన్న తర్వాత కాళోజీ ఒక్కడే బాగా చూపగలిగాడు.*

వినేవాని స్థాయినిబట్టి చెప్పేవాడు తనపద్ధతు లను మారుస్తాడు. సభ్యతా సంస్కారం ఉన్న వాళ్ళకు చెప్పే పద్ధతి వేరు. చిరునవ్వుల సైగలతో వారికి చిదచిద్రహాస్యాలను బోధించవచ్చు. ఇక సామాన్య ప్రపంచంలోకి వచ్చేసరికి చెప్పేరీతుల్లో ఎన్ని పద్ధతులనో అనుసరించవలసి ఉంటుంది, అదే అవసరం కవికికూడా ఉంది. పూర్వకవులు చెప్పే పద్ధతులలో వృత్తి, రీతి, సరళభావ ప్రక టనం, పరుషభావ ప్రకటనం వంటివి ఉండనే ఉన్నాయి. కాళోజీ చెప్పవచ్చేనాటికి సమాజస్థితి అంతా మారికూర్చున్నది. చెప్పితే వినేవాళ్ళతో ఎప్పుడూ చిక్కేలేదు. చెప్పినా, చెప్పిన విషయాన్నే మరీమరీ చెపుతున్నా, విననివాళ్ళతోనే చిక్కులన్నీ వస్తాయి. చెప్పింది అర్థమైకూడా శరించే వాళ్ళకోసం చెప్పే పద్ధతులలో చెంపపెట్లూ, కొట్లూ, తిట్లూ, అవసరమవుతాయి. అలాంటిచోట కవి వాక్రా గల్భ్యాన్ని మనం సకారణంగానే క్షమించవలసి వస్తుంది.

"వటసావిత్రీ వ్రతమును
వారకాంత చేస్తుందని,
ఎవరనుకొన్నారు ? ఇట్లవునని
ఎవరనుకొన్నారు ?

నిండిన గోదాములుండి
తిండిలేక చస్తారని;
ఖాకీధారులలోనే
కాంగ్రెసిజము చస్తుందని;
ఎవ రనుకొన్నారు ?
ఎవ రనుకొన్నారు ?"

"మారాలిక లేబిల్ ప్యాకింగ్
మారాలిక స్టేజుల సెట్టింగ్
ఏమి తిరిగిన పంచాంగాలు
చూపవు తిథివారాలు"

"నిజం మొగం దాస్తుంటె
ఇజం మొగ్గ వేస్తుంటె
ఓటు సీటు కేగుతుంటె
సీటు నోటు జేబులుంటె
బ్రతుకు చితికి పోతుంటె
శాంతి – శాంతట, శాంతి ?

గుండా చెలరేగుతుంటె
జండా ఊగులాడుతుంటె
జనం జపం చేస్తుంటె
శాంతి-శాంతట, శాంతి !"

"పగటి దోపిడుల ఆపగ లేని
ప్రభుత్వ మ్ముందే కెన్నాళ్ళు ?
ప్రతిష్ఠ పేరట తప్పులు దాచే
పాడు పద్ధతిం కెన్నాళ్ళు ?"

మర్మాలను చెరలాడిన ఈ వాక్యాలు నిద్ర-మబ్బు మొగాలనూ, కోతినీతి కొంటె బేరగాళ్ళనూ, తెలిసిన మూర్ఖులనూ, సత్తాలేని సన్యాసులయ్యే వాళ్ళనూ మందలించడం కోసమే.

* ఏడ్పించడమేకానీ, కత్తిచేతులవాళ్ళు చేస్తే కటికవృత్తి, కతివవృత్తి. కలంచేతులవాళ్ళు చేస్తే కరుణావృత్తి, కళావృత్తి. కలం సాయంలేకుండా కత్తి చేసిన పనికి 'హింస' పేరు వచ్చింది.

పరుల ప్రభావానికి లొంగి జీవించేది దుర్బల జాతి అని సమీపార్థంలో చెప్పడానికే "ఏభాషరా? నీది ఏమి వేషమురా ? ఈ భాష ఈ వేష మెవని కోసమురా?" వంటిగేయాలను రచించాడు. దేశ, వేష, భాషాభిమానాలను గురించి నొక్కి చెప్పినంత మాత్రాన విశ్వసోదర భావానికి లోటు రానవసరం లేదు. తల్లిని ఆదరించనివాడు పినతల్లి నేమి ఆద రిస్తాడు ; పినతల్లి ని ఆదరించి తల్లిని దూరంచేయడం మాత్రం ఏం చక్కదనం ?

మనం ప్రేమించే వాళ్ళు మనపై ద్వేషించి చంపడానికి వస్తున్నప్పుడు, ద్వేషం తప్ప మరోటి అర్థం కాని వాళ్ళు మనచుట్టూ మూగినప్పుడు, ద్వేషించి దెబ్బకొట్టి బలవంతంగా ప్రేమపాఠం నేర్పవలసి వస్తుంది. ద్వేషించినట్టు కనిపిస్తూ ప్రేమించే వ్యతిక్రమ పద్ధతిని కొన్నిచోట్ల వినిపిం చాడు. మతరాక్షసులు చెలరేగి మానవత్వాన్ని చెర బట్టిన రజాకార్ల దురుద్యమంలో కవిలోని కరుణ కసిని దరిసింది. కలం కత్తివలె మెరసింది. కన్నీళ్ళు కురిసింది. "మన స్త్రీల చెరచిన మానవా ధములను, మరచిపోకుండంగ గురుతుంచుకోవాలె, కాలమ్మ రాగానె కాటేసి తీరాలి." సాటివాడు సహ జీవనాన్ని కాలదన్ని చంపడానికి వచ్చినప్పుడు సహనం చచ్చింది. ప్రతిగ్రహించి నిలిచి, ప్రతీకా రాన్ని ఉద్బోధిస్తూ భీమ ప్రతిజ్ఞలు నేర్పిన ఈ ఘట్టాలు విమత పక్షాలను వీరలక్షణాలతో ఎదుర్కొ మనడమే. రామాయణ భారతాల సమరనీతి కాళోజీ సాహిత్యనీతి.

మంచిని పెంచుకోవడం కాళోజీకి మరొకడు నేర్పవలసిన అవసరం ఎన్నడూ లేదు. మంచి అంటే చెడ్డకులొంగి చావడం కాదని ఆయనచెప్పే సూటి అర్థం. కలసి బ్రతుకుదామనే వాళ్ళ కౌగి లింతలో ఆయన కండ్లు చెమ్మగిల్లుతాయి. కాట్లాడ వచ్చినవాణ్ణి గుద్ది బుద్ధిచెప్పడానికి ఎన్నడూ వెను దీయడు. శత్రువు చెలరేగినపుడు సాహసానికి సన్యాసమిచ్చి పరదాస్యంలో బ్రతుకుదెరువును చూచుకొనేందుకు రాజీపడడు. అచ్చం వీర జాతకుడు

రజాకార్ల దుండగాలనూ, చైనా దురాక్రమ ణాన్ని ఎదుర్కొంటూ ఒకే పద్ధతిని కలం నడిపిం చాడు. మహమ్మదు వారసులూ, మార్క్సు వారసులూ ఏకమై మనుషుల రక్తంతో వసంత మాడారు. తమచర్యలకు అనుకూలమైన భాష్యాలను చెప్పారు, కాళోజీయే కాదు. 'కలేజా' ఉన్న ప్రతి వ్యక్తి శోకించిన విషాద సంఘటనలు అవి. శాంతిపేర, క్రాంతిపేర ఎందరెన్ని జంబుకనీతులను వల్లిస్తున్నా, తోడివాళ్ళను చంపుదామనే తత్వాలు ఇప్పట్లో అర్థంకావు. ఎప్పటికీ ప్రశంసనీయంకావు.

కాళోజీని వేమన్నతో పోల్చి చూచుకొన్నారు కొందరు. కాస్తనయమే. కొందరైతే కాళోజీ కవితా పాదాలను మార్క్సిస్టు మీటరుతో కొలిచి చూచుకొని ఎటూలెక్కతేలక గుటకలు మ్రింగారు. ఏదైనా 'ఇజం' అనేది దాని పద్ధతిలో అది సాగు తుంది. అసలు కవి అయినవాడు ఒకే ఒకప్రత్యేక పద్ధతిలో ఆలోచించే రాజకీయ తత్వాల తతంగా లకు ఎన్నడూ దాసుడు కాడు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క ఇజానికి ధర బాగా పలుకుతుంది. నిన్నటి మతాల గతి ఏమైందో నేటి ఇజాల గతీ అంతే. అంగడి సరకుల ధరలలాగా విన్పించే ఇజాలు వేరు. నిజాలు వేరు.

"నానా ఇజాలకు చూడ
'నా' ఇజానిదే అడుగున జాడ"

"ఇకపై చెల్లవని శ్రీశ్రీ అనినంత,
మోసం దౌర్జన్యం తగ్గిన దెంత ?

'ఇంకానా ఇకపై చెల్లవు'
ఏమైనది ఎందుకు చెల్లవు ?"

ఆయనది మార్క్సిజం కాదు. మనిషిఇజం. వృత్తినీ, ప్రవృత్తినీ జోడించి కవిమూర్తి అయి నాడు. స్ఫూర్తిని పెంచుతున్నాడు. పంచుతున్నాడు.

సర్వస్వతంత్రుడైన ఆయనకు 'అంధపరదేశమూ' 'అగాధమౌ' జీవితమూ నచ్చలేదు. నిత్య సత్య గవేషణా, శాస్త్రదాస్యం సృష్టించే నూతన ఈతిబాధా ఆయన ఆలోచనలో, శబ్దంలో, రచనా శిల్పంలో కనిపిస్తాయి.

కవిత్వాన్ని వ్రాయడానికైనా వినడానికైనా రసికత్వమే కావాలి అంటూ వచ్చాం, వింటూ వచ్చాం, ఇందాక. అదికాదు, ధైర్యమే కావాలి. కవిత్వమొక కల్పనగా; విరామకాల వినియోగానికి వినోదకళగా; కల్పించుకొన్న వర్గనాగరికతా విలాసంగా భావింపబడిన రాజుల రోజుల్లోనే ఈ 'రసికత్వం' అనేమాట వాళ్ళ అవసరంకోసం పుట్టి ఉండవచ్చు. కవిత్వమంటే మరి కల్పన కాదుగదా! అననుభూతమైన విషయాన్ని హేతుబుద్ధి అవసరం లేకుండా ఏదో పదవాక్యం చాతుర్యంతో కలగాపులగంచేసి కూర్చే రచన కల్పన. అది అబద్ధానికి పర్యాయపదం. కల్పన కవిత్వాన్ని అంటుకొని రావచ్చు. అదొక 'అలంకరణ'. నిత్య సత్యాన్ని ప్రవచించే కవిత్వానికి అలంకరణగా వచ్చిన కల్పన సత్యకల్పన అయి నిలుస్తుంది. సత్యకల్పన, కల్పనాసత్యం. ఈమాటలను ఎటుతిప్పిచూపినా ఒకచే కర్రకు రెండు కొనల వంటివి.

కవిత్వం అంటే ఒక సత్యకల్పన అనుకొన్నంత మాత్రాన సరిగ్గా అర్థంకాదు. 'దర్శనం' బంగారం వంటిది. దాని ఆసరాతో చేసిన సొమ్ముల వంటిది కవిత్వం. సత్యదర్శనానికీ కవిత్వానికీ ఇంత దగ్గర సంబంధం ఉంది. అయితే సత్యాన్ని దర్శించే శక్తి ధైర్యం ఎందరి కుంది?

"చతుర మతులు, దేబెమొగాలు
జగతిలో రెండే రెండు రకాలు,
చతురవర్గం విలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు"

"ప్రజాస్వామ్యం గణరాజ్యం
చతుర నాయకమ్మన్యుల భోజ్యం
పాలితులపై జరిగే శోషణ
పాలకవర్గం చేసే పోషణ
నెత్తిన నోరుంచే చాలు
పెత్తనం లభిస్తుంది."

"ఎవరికి చేపని పండిన పన్నులు
రసవిహీనములు రాజకీయములు"

ఇలా దుర్వ్యాపారకట్టడం; దుష్టమంత్రులనూ దుశ్శాసనులనూ, ధృతరాష్ట్రులనూ నిప్పులు మొగాల మీద చెరుగుతూ, నినాలనువేసుకొని కొరడాల్లి ఇజాల సంచాలకులందరూ పొట్టచీల్చేలా ఫెడాఫెడా కొడుతూ, జనవాహినుల నిర్బంధించే కుటిల ఆనకట్టలను తెంచేస్తూ పోవడం కవికి సరాలవశ్యకు చేత నవునా?

మనం స్వతంత్రులమా! అస్వతంత్రులమా? అనే ప్రశ్న ప్రతిపాదించి దేశంలో ఆలోచనల్లో రాజ్యశ్రీ తన 'కలెక్టా'ను విప్పి, విడిచిపెట్టి, వేసారక చెవి నిల్లు కట్టుకొని చెబుతున్నారు. కనీసం విద్యావంతులైనా, అందులోనూ నిరంకుశాధికారం గల కష్టులైనా స్థైర్యంగా ప్రతిఘటిస్తున్నారా? వెనుకటి వాళ్ళే నయం. నిరంకుశ మనుషులను వాటేసి పనుగులతో పోల్చింది రాజుల రోజుల్లో కూడా "మనుజేశ్వరాధములను" ఎదిరించి ప్రతివాడు ఒక కవి. "వాలదీజనముల గ్రాసము, లింగిరి సంటని ఖర పత్తు లాంఛనములు" అంటూ అధమేశ్వరాధముల మర్మాలను విప్పించి మనిగరిగాడు మరోకవి. ఎవరే ఒక పంచాయతి ముందు కలహించి దుర్బోధ చేయంగా బ్రతకమను. మనలో ఎంత మందికి ఆధైర్యం ఉంది? కాబట్టి సత్యదర్శనమైన కవిత్వాన్ని గ్రహించే వాళ్ళకూ గ్రహించే వాళ్ళకూ రసికత్వం కంటె ధైర్యమే ముఖ్యంగా కావలసింది.

కాళోజీ రాజకీయాలోచనలను గురించి తడవడం తప్పనిసరి. ఆయన ఏం కావాలంటున్నాడు? దేన్ని వ్యతిరేకిస్తున్నాడు? ఎందుకు? అనే ప్రశ్నలకు సమాధానాలు సులభంగానే లభిస్తాయి.

రాజకీయ కుటిల రహస్యాలను ఆయన రచ్చ కీడుస్తున్న మాట వాస్తవం; చెప్పిందేచెప్పి వ్రాసిన దాన్నే తిప్పితిప్పి వ్రాస్తున్న మాటా వాస్తవమే. అప్పుడు వ్యంగ్యం దెబ్బతినే సంగతికూడా సంభవమే. కాబట్టే 'పరాభవం'లో ఋతువు కొక్కటి చొప్పున ప్రచురించిన సంపుటాలలో కొన్ని రచనలు నెల తక్కువ సంతానం లా కనిపిస్తాయి.

రాజకీయాలు ప్రజాజీవనానికి నిత్యావసరాలు. ఎవరూ వాటిని వ్యతిరేకించ నవసరంలేదు. రాజకీయాలలో చేరి వాటికి చెడ్డపేరు తెచ్చిన వ్యక్తులదే తప్పుగాని రాజకీయాలదే తప్పు అని కాళోజీ అనడంలేదు.

ఈమధ్య ఆయన కావ్యకర్తవలె చెప్పడంలేదు. ఆయన కవిత్వం ఉపన్యాసంవలె కనిపిస్తుంది. ప్రతిపక్ష రాజకీయ కార్యకర్తల 'అసంతృప్తి' ధోరణిని ఎక్కువగా వినిపిస్తుంది. విచార్యమే. చెప్పింది వినడం. అవసరమైన మార్పు తేవడం మన కర్తవ్యం.

ఆయన అంత స్వేచ్ఛగా కవితోపన్యా లివ్వ డానికి తగినన్ని కారణా లున్నాయి. (1) బాధ్యతలను విస్మరించని, విస్మరించవద్దని తోడివాళ్ళకు పదేపదే చెప్పే సత్పౌరుడు ఆయన. (గొడ్డలిపాట చదవండి) (2) ప్రజాస్వామ్యంలో ఉన్నాడు. తనకు వాక్స్వాతంత్ర్యం ఉన్నదనే ధీమా (3) మహాత్ముడు కలలుగన్న రాజకీయ, సామాజిక, ఆదర్శాలు ఆయన ఆత్మను ఆవరించి ఉన్నాయి. (4) పైగా ఆయన పుట్టుకవి. కాబట్టి మనసు సున్నితం, మాట సూనృతం. (5) ప్రస్తుత రాజ్యాంగాన్ని గురించి ఆయనకు అంతగా విరోధంలేదు. దాన్ని అమల్లో పెట్టబోయి అసమర్థులై, అవస్థపాలై, చెడుపరిణామాలను సృష్టిస్తున్న వాళ్ళమీదనే ఆయన తిరుగుబాటు ఉద్యమాన్ని నడిపించమంటున్నాడు. చాటుగా తిడుతున్నాడు. అదే వృత్తిపునరావృత్తి అవుతూ ఉంది. అంతేకాని మరేమీ కాదు. ఆయన పౌరుల పక్షం వహించిన ప్రజాకవి. ప్రజాస్వామ్యకవి. అధికార లుబ్ధుల చర్యలపై ఎప్పటికప్పుడూ తన అధిక్షేపణను తెల్పడం హక్కుగా భావిస్తున్నాడు.

ఎగతాళి, హేళన, వెక్కిరింత, వెటకారం, వికటత్వం, అపహాస్యం, మందలింపు, నింద మొదలైన లక్షణాలు అధిక్షేప కవితకు తొడుగులు. అధిక్షేపం ఉత్తమశ్రేణికి చెందిన రచన కాదని కొందరి అభిప్రాయమున్నా సహృదయుల ప్రశంసలను అది పొందుతూనే ఉంది. మన సాహిత్యంలో పుట్టుక వచ్చిన వ్యాజనింద, వ్యాజస్తుతులకూ, ఆంగ్ల సాహిత్యకులు మెచ్చిన సెటైర్, ప్యారడీ పద్ధతులకూ నాడూనేడూ మంచి చలామణీ లభించింది. కేవలం వ్యక్తిగత విషయాల పైకే దూకితే అధిక్షేప కావ్యమంత అధమమైంది ఉండదు. అదే సామాజిక ప్రయోజనాలకు ఉద్దేశించిందైతే దానికంటె ఉత్తమమైందిగూడా మరోటి ఉండదు. కాళోజీ తన వ్యక్తిగత సమస్యలను దృష్టిలో పెట్టుకొని అధిక్షేపించినట్టు ఎక్కడాలేదు. ఒక్కసారి నేటి ప్రపంచ పరిస్థితులను పారజూడగలిగితే ఆయన కలం అలా ఆడడానికి కారణం తెలిసిపోతుంది. చూతాం.

ప్రపంచనాయకుల స్థాయిలో కన్పిస్తున్నవాళ్ళే ఒకచోట బుజాలుబుజాలు రాచుకొంటూ మరోచోట ద్రోహాలతో ద్వేషాలతో పరస్పరం దుమ్ముదుమారం గుప్పుకొంటున్నారు, దెప్పుకొంటున్నారు. అధికారంకోసమే దురాక్రమణ చెలరేగుతూ ఉంది. పైకం మైకంలో పక్కవాణ్ణి మనిషిగా గుర్తించడం లేదు. మతాలు ముఠాలుగా మారాయి. మతాల స్థానంలో ఇజాలు మారణ హోమాలు చేస్తున్నాయి. సభ్యతా సంస్కృతులపేర మోసం వక్రభాష్యాలను ప్రచారం చేస్తుంది. మత వ్యాపార రాజకీయ తతంగాలు అంతర్జాతీయ స్థాయిలో పోటీలుపెంచుకొని, శాస్త్రాన్ని ఆయుధంగా ధరించి, హేతువాదాన్ని ఏకపక్షం చేసుకొని, ఆత్మవిమర్శను రోసి, సహజీవనానికి చిచ్చుపెడుతూ, మానవత్వం మొగాన మసిపూసి,నరలోకాన్ని నరకలోకంగా మారుస్తున్న ఈతరుణంలో ప్రజాస్వామ్య దేశంలోని పౌరుడైన

కాళోజీ కలంబట్టి అధిక్షేపిస్తున్నాడు. అభిశంసిస్తున్నాడు. ఇలాంటికవి నిజంగా ఎన్నుకోని శాసనకర్త.

ఒక్కొక్కచోట అధిక్షేపిస్తున్నాడో! అన్యాపదేశంగా పలుకుతున్నాడో! పొగడుతున్నాడో! పొడుస్తున్నాడో! అదీ ఇదీ అవును కాదనిపించే అవస్థలో పాఠకులను ముంచేస్తూ వ్రాస్తూ పోతుంటాడు. హాస్య రసాధిదేవత అయిన గణనాయకుని సంబోధిస్తూ 'అధినేతా! వినాయకా!' అనడంతోనే ప్రజాహితం మరచి విఘ్నాలకు నాయకత్వం వహించే ఛోటా బడా నాయకులందరూ అప్రత్యక్షంగా తోస్తారు. 'గణనాయకా' అని ఎత్తుకోవడంలోనే ముఠానాయకుని పేరుబెట్టిపిలిచినట్టుంటుంది.

"నీ బొజ్జను నింపనిదే
బాబూ మాపని సాగదు,
మొదలె నిన్ను మెప్పించక
మొదలే కా దేపనియును,
నీ అడ్డము రాకుండగ
నీతి నేర్పు చాలు మాకు"

ఇలా సాగదీస్తూ 'గణనాయకుల' ప్రకృతులను పట్టిచూపుతాడు. 'చేదుగొంతు అయ్యకన్న నీవన్ననె భయముమాకు.' విషవాక్కులు వినిపించే చోగా అయ్యలకన్న బొజ్జకదలకుండా కూర్చొని విఘ్నాలు కల్పించేవాడే అపాయకారి మరి.

"నీ పేరుతో టోపి నిత్యమైపోయింది
నీ మాట వెనకనే మామాట చెప్పాము
ఇంటింటిలో నిన్ను వ్రేలాడదీశాము
ఇంకేమి కావాలి?
ఇంకేమి కావాలి?

'ఓగాంధి' అని సంబోధిస్తూ వ్రాసిన గేయమిది. బాపూజీ తలంపులకు తలవంపులై కొత్త నైరాశ్యాలు తలయెత్తిన పరిస్థితులలో ముక్కుమొగం లేకుండా చాలామంది మొద్దుమొద్దుగా విమర్శించారు. నేడు గాంధిపైగల భక్తిని ఇంత ముద్దుముద్దుగా పరామర్శింప గలిగినవాడు కాళోజీ ఒక్కడే.

అధిక్షేప పద్ధతితో భావధ్వని, వాస్తవికత, వినోదం, ఉద్బోధ, జాతికి కావలసిన ఆత్మవిమర్శ, వగైరా వగైరా ఒకటివెన్క మరొకటి వడిశెలలవలె తగులుతుంటే ఎటూ తోచదు, ఏడ్పురాదు. ఏడ్వవలసిన పరిస్థితుల్లో నవ్వే నాగరికులమీద మరో రాయి విసరినట్టు 'కాళోజీమాటలకు కడుపుబ్బ నవ్వాము- ఇంకేమి కావాలి?' అంటాడు గేయం చివరలో.

సమకాలిక జీవిత పోరాటంలో అంతగా ఆరాటపడి ఆవేదనాత్మను పెంచుకొని, కన్నీట కలమద్ది కవిత్వాన్ని రచిస్తున్న కాళోజీలోని మానవుడు విరాగికాడు, నిరాశావాదీకాడు. అతడొక భావవిప్లవోద్యమానికి కార్యకర్త. అంతేకాదు. భావసంస్కర్త.

"ఉదయం కానేకాదనుకోవడం నిరాశ
ఉదయించి అస్తే ఉండాలనుకోవడం దురాశ"

ఈ రెండు పాదాలు ఆయనను ముందుముందు ఎన్ని తరాలవెంట నడిపిస్తాయో ఊహించడం కష్టం.

రావలసిన కొత్తను ఆహ్వానిస్తూ అభినందిస్తాడు. ఒక పంచాంగం మారి మరో పంచాంగం రానున్న మలుపులో ఈగేయాన్ని రచించాడు.

"పాతదేమొ ఉండి ఉండి
పట్టుదప్పి పోతున్నది.
కొత్తదేమొ సరికొత్తది
పట్టు దొరికిపోతున్నది.

ప్రకృతి బయటపడుతున్నది.
వికృతి మాయమవుతున్నది.
నవత నడచి వస్తున్నది
సవిత వెంట వస్తున్నది.
యువత ఈలవేస్తున్నది
కవిత భళా అంటున్నది.
కొత్త చీపురొస్తున్నది
చెత్త కేదుపోస్తున్నది.

ఇప్పటి ఆయన కలం చప్పుడులో విప్లవ ఝంఝలు హోరుహోరుగా వినిపిస్తున్నవి.

క్రీ. శ. 1954 వరకూ ఆయన రచించిన గేయసంపుటి 'నాగొడవ' అలంపురంలో జరిగిన ఆంధ్ర సారస్వతపరిషత్తు వార్షికోత్సవాలలో శ్రీశ్రీచే ఆవిష్కృతమైంది. ఇటీవల మరికొన్ని ఖండికలతో అది అచ్చయింది. అదే పేరుతో 'పరాభవ' సంవత్సరంలో ఋతువుకొక్కటి చొప్పున ప్రకటింపబడ్డాయి.

కాళోజీ కథలు రచించాడు. వ్యాసాలు రచించాడు. 'రచన' పేరుతో వెలువడ్డ ఇటీవలి వ్యాసంపుటిలో ఆయన వ్రాసిన వ్యాసం చాలా విలువైంది. ఒకే ఒక ఇజానికి తాకట్టుపడిపోతే రచయిత వ్యక్తిత్వం ఎలా దిగజారిపోతుందో ఆ వ్యాసంలో చక్కగా విశ్లేషించి చెప్పాడు ఖలీల్ జిబ్రాన్ రచించిన 'ది ప్రాఫెట్' అనేపుస్తకం జగద్విఖ్యాతమైంది. దాన్ని తెలుగులోకి దించాడు.

ఒక తరాన్ని కదలించే పట్టుదలతో కొన్నివేల పుటలను రచించిన కవిని 'యుగకవి' అన్నారు. పాకెటుసైజులో ఒకటి రెండు వందల పుటలే రచించినా కాలకాలాలనూ కదలింపగలిగే కాళోజీకి ఏస్థానం లభిస్తుందో భావిచరిత్రకే వదలాలి.

## జీవిత రచన

చిట్ట చివరకు చెప్పినా మొట్టమొదలే జ్ఞాపకం ఉంచుకోదగిన సంగతి ఒకటి.రచయిత వ్యక్తిత్వాలు రెండు రకాలు (1) నిత్య జీవితంలో కనిపించే వ్యక్తి (2) రచనలలో కనిపించే వ్యక్తి. మాయ మర్మాలూ, కల్లకపటాలూ నచ్చని కాళోజీ తన రచనలలో పాఠకులకు ఎలా కనిపిస్తాడో నిత్య జీవితంలో అలాగే ధీరహృదయాన్నీ నిజాయితీగల దినచర్యనూ చూపగలుగుతున్నాడు. అలాంటి వ్యక్తులున్న సమాజం ఏనాటికీ ఎవ్వనికీ తలవంచ వలసిన అవసరం రాదు.* ప్రతికవీ మనీషీ ఒక మహా తత్వానికి ప్రవక్త. మానవులదంతా ఒక కుటుంబం అని ఆయన ప్రగాఢ విశ్వాసం. మానవుని మనుగడకు అడ్డంవచ్చే మతాలపేరెత్తినా, ఇజాల పేరెత్తినా. విధానాల పేరెత్తినా ఆయన సహించడు. తోడిమానవుడు తండ్లాడుతూ బ్రతికే విధానాన్ని బహిరంగంగా వ్యతిరేకిస్తాడు. ఈ ఉద్దేశాలతోనే ఆయన ప్రజాస్వామ్య భారతంలో ప్రజాకవిగా నిలుస్తున్నాడు. 'ప్రజల చేతిలో రాజకీయాధికారం ఉండడం ఏనాటికైనా మంచిదే' అని అభిప్రాయపడ్డ 'రస్సెల్'భావాలతో ఆయన ఆలోచనలు కలుస్తాయి. ఆయన ఆశయాన్ని ఆదర్శభావవాదం కింద జమ కట్టి లోకంపోకడ లోకానిదే, కాళోజీగొడవ కాళోజీదే అని ముక్తసరిగా సరిపుచ్చుకొనేవాళ్ళు నిరంకుశ శక్తులు అధికారం మీదికి ఎక్కిపోతుంటే ఆపనూ లేరు, స్వతంత్రంగా నడవ నేర్చుకోనూ లేరు.

అవకాశం, ఆరోగ్యం, కలిసివస్తే కాళన్నను గురించి ఓ గ్రంథమే వ్రాయాలని నా ఆకాంక్ష.

మళ్ళీ ఉటంకిస్తున్నందుకు క్షమించండి.

"ఉదయం కానేకాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లే ఉండాలనుకోవడం దురాశ"

---

* కవిత్వం సమాజానికి అర్పితమయ్యేది. జీవితం సృష్టికర్తకు అర్పించుకోవలసింది. ఉదాత్తాశయాలతో జీవితాన్ని రచించుకొన్న కాళోజీ ఒక ఆదర్శమానవుడు.

శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి | 

# పంచరత్నములు

కలిగించు విన్నాణ మొలికించి పులకించు
పలుకులనేరుపుల్ స్వయము తాను
తలలోని నాల్కయై పలికించు స్వామిచే
నమల దీర్ఘాయురనామయములు
తన శీలమునఁ దనిసిన యత్తగారిచే
నిప్పించు భాగ్య మహానగతుల
ప్రాఁబల్కులను కిన్నెరల మీటి వినిచి ర
క్షణము గూరుచు మామగారిచేత

భారతీదేవి యాత్మసేవా ప్రవృత్త
వృత్తి నాశ్రయించిన గోలి ఈశ్వరయ్య
గారి యెడ సుప్రసన్నయై కూరిమిని స్వ
హస్త పరహస్తముల సత మాడుకొనుచు.

వ్యాపారమ్మౌ ప్రపంచ
వ్యాపారమ్మునకుఁ దాటియగుఁ పదగాథా
కూపారమ్మున మగ్నుఁడ
వై పారముఁ గంటి మౌక్తికాది ప్రాప్తిన్.

పుట్టువుం దొట్టి సంపద ల్వొదలుచున్న
కట్టడికిఁ దెల్వితేటలు కలుగు టరిది
తెలివి కలిగిన సంపదల్ కలుగు ననుట
నీవె తార్కాణ మగుదు గా కీశ్వరయ్య !

ఇతోధికశ్రీలు వరించుచుండఁగా
సతీసుతానంద విశాలశాలి వై
వితీర్ణభావం బతివేలమై తగన్
కృతార్థ భావాన సుఖింతు గావుతన్.

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

# వరంగలు జిల్లా : చరిత్ర - ప్రజలు

పూర్వము వరంగల్లు పెద్దజిల్లాగా ఉండేది. ఖమ్మంజిల్లా దానినుండి తరువాత విడదీయబడినది. ఇప్పుడు వరంగల్లు జిల్లా వైశాల్యము 4955 చ.మైళ్ళు. దీనిలో వరంగల్లు, పరకాల, ములుగు, నరసంపేట, మహబూబాబాదు, జనగామ అను ఆఱు తాలూకాలు గలవు ఈ జిల్లాలో 978 గ్రామాలు ఉన్నాయి. ఈ జిల్లాకు తూర్పున గోదావరినది చాల దూరము ప్రవహిస్తూ ఉంటుంది. దక్షిణాన ఈ జిల్లా కృష్ణానదిని సమీపిస్తూంది. హనుమకొండ చుట్టుపట్ల ప్రదేశము సముద్రపు మట్టమునకు 1700 అడుగుల ఎత్తున ఉన్నను, ఈ జిల్లా సగటుమీద సముద్రమట్టమునకు 870 అడుగులు ఎత్తున మాత్రమే ఉన్నది. అందుచేత పల్లములో ఉన్న జిల్లాయనియే చెప్పవలెను. ఈ జిల్లాలో పాకాలనుండి సింగరేణి మీదుగా వ్యాపించిన గుట్టలవరుస కలదు. కందికల్లు గుట్టలు ఈ జిల్లాలో మొదలుపెట్టి ఆదిలాబాదు జిల్లా చిన్నూరు వరకు వ్యాపించి ఉన్నవి. వరంగల్లుకు పశ్చిమమున 14 మైళ్ళమీద నున్న హసన్‌పర్తి గుట్టలలో ఇనుము దొరుకుచున్నది. కృష్ణాగోదావరి నదులు ఈ జిల్లా సరిహద్దులుగా ప్రవహిస్తున్నాయి. ఇవిగాక చిన్న చిన్న ఏరులు - మునేరు, పాలేరు, కిన్నెరసాని, వైరా, లక్నవరము - వంటివి కలవు. ఈ జిల్లాలో ప్రసిద్ధమైనది పాఖాల చెరువు. ఇది 13 చదరపు మైళ్ళస్థలము నాక్రమించి ఉన్నది. రామప్ప, ధర్మసాగరము, లక్నవరము మొదలైన సరస్సులును ఈ జిల్లాలో ఉన్నాయి.

వరంగల్లు ఒక జిల్లామాత్రము కాదు. ఇదియొక మహారాజ్యమునకు కేంద్ర స్థానము. అఖిలాంధ్రమునకు ఇది రాజధానియై రెండు శతాబ్దములు వెలిగింది. స్థానిక రాజ్యాలకు ముఖ్యపట్టణమై పెక్కుశతాబ్దాల నుండి వరంగల్లు ప్రసిద్ధిగాంచి యున్నది. ఇక్కడ వరంగల్లు అనగా అనుమకొండకూడా గ్రహించవలెను. ఈ రెండు ప్రాచీన నగరాలలో అనుమకొండయే ప్రాచీనతరమైనది. ఓరుగల్లు కాకతీయుల కాలమునుండి, అనగా క్రీ. శ. 12 వ శతాబ్దినడుమ నుండి వైభవమును పొందింది. అనుమకొండకు కాకతీయులకు ముందే 7, 8 వందల సంవత్సరముల చరిత్ర ఉన్నట్లు కనబడుతూంది. కాకతీయుల చరిత్ర ప్రసిద్ధమైనదే కనుక ఆ యధ్యాయమును విస్తరింపక, కాకతీయులకు ముందు, కాకతీయులకు పరమందు వరంగలు చరిత్ర అన్వేషించడానికి ప్రయత్నం చేద్దాము.

ఆంధ్రుల హృదయములలో కాకతీయ రాజన్యులు, ముఖ్యంగా గణపతిదేవుడు, రుద్రమాంబ, ప్రతాపరుద్రుడు అభ్యర్హిత స్థానం ఆక్రమిస్తూ ఉన్నప్పటికిని, ఈ గొప్పవంశమును గురించి హిందూదేశ చరిత్ర గ్రంథములలో నామమాత్రముగ కూడ వ్రాయబడకుండుట గమనార్హము. ఇట్టి యవజ్ఞత ఎందుకు జరుగుతూంది ? ప్రజాహిత కార్యజాతము నందు కాకతీయులు ఏరాజకుటుంబమునకును తీసిపోరు. వారు కట్టించిన జలాశయములు, వారు శిల్పించిన అద్భుత దేవాలయములు నేటికీ నిల్చియే ఉన్నాయి. ఇట్టి స్థితిలో హిందూదేశ చరిత్రకారులీ మహావంశమును ఏలఉపేక్షిస్తున్నారో తెలియదు. కానైతే వారు తమదేశము దాటి విజయములుచేసి, గ్రామనగరములను దహించి, జనుల రక్తనదులను పారించలేదు. ఇదియే వారియందలి లోపము.

ఆంధ్రులైన మన చరిత్రకారులు కూడ ఇట్టి మహా రాజ కుటుంబము మా చరిత్రలో కలదని వాటి చెప్పలేకపోవుట దురదృష్టము.

అనుమకొండ ప్రాచీన చరిత్రను సాధికారంగా నిర్మించుటకు ఆధారాలు తక్కువ ఈ దశయందు మనకు శాసనముల సాక్ష్యము లభించుట లేదు. ప్రతాప చరిత్ర, సిద్ధేశ్వర చరిత్ర వంటి గ్రంథములే మన కిక్కడ మార్గదర్శకములు. ఇవి పుక్కిటి పురాణములని త్రోసిపుచ్చుట అవివేకము. ప్రత్యక్షర సత్యములని భావించుటయు తగదు. వాటిలో అద్భుతవృత్తాంతములు, అతిశయోక్తులు మెండుగా ఉన్నమాట సత్యమైనను, నిపుణంగా పరిశీలిస్తే వాటియందు సత్యచరిత్రకు ఆధారము కాగల మూలాంశములు నిక్షిప్తమైఉన్నాయి. అట్టి చారిత్రక కథనములను గ్రహించి, సమకాలికమైన ఇతర చారిత్రక సన్నివేశాల్తో సమీకరించి సత్యమును తేల్చుటకు ప్రయత్నించాలి.

ఈ పూర్వ చారిత్రక లేఖనములు వర్ణిస్తూన్న అంశాన్ని బట్టి చూస్తే సోమదేవరాజు అనే రాజన్యుడు కలడు. అతని రాజ్యం కృష్ణానదీ తీరమున ఉన్నట్లు కనబడుతుంది. అతని ముఖ్యపట్టణము కందరపురము. అతనికి కటకము నేలే బల్లహుడను రాజుతో నిరంతర వైరం సాగింది. ఇచ్చట కటకమనగా ధాన్యకటక నగరమనియు, బల్లహుండనగా పల్లవ వంశీయు డనియు తెలుసుకోవాలి. ఇక్ష్వాకుల అనంతరం వీరు కృష్ణానదీ తీరాన్ని ఆక్రమించారు. ధాన్యకటకం వీరి అధీనమైంది. చివరియుద్ధంలో పరాక్రమశాలి యైనప్పటికి సోమదేవరాజు ఓడిపోయి మరణించాడు. ఆతని రాణి సిరియాలదేవి గర్భవతియై ఉన్నది. ఆమెకు పుట్టిన కుమారుడు తనను నిర్జిస్తాడనే జ్యోతిషం నమ్మి, బల్లహు డామెను చెరపెట్టించడానికి యత్నంచేశాడు. ఆవిషయం తెలిసి సిరియాలదేవి హనుమకొండకు పారిపోయి అక్కడ పరిపాలన చేస్తూన్న ఎఱుక దేవరాజనే నృపాలుణ్ణి శరణువేడింది. బల్లహుని ధాటికి వెరచి, ఎఱుకదేవరాజు ఆమెకు ఆశ్రయమివ్వడానికి ఒప్పుకోలేదు. కాని అనుమకొండలోని బ్రాహ్మణవర్యులు కొందరు సాహసంచేసి ఆమెకు శరణము ఇచ్చారు. మాధవశర్మ అనే విప్రోత్తముడు వీరికి నాయకుడు. బల్లహుని సేనలు వచ్చి అనుమకొండను ముట్టడించినవి. సిరియాలదేవి మాధవశర్మ కూతురేయని పట్టుదలతో వాదించి అనుమకొండ బ్రాహ్మణులామెను కాపాడిరి. ఈ కథ యందెన్నో వివరాలు ఉన్నాయి. వాటిని అట్లా ఉంచుదాము. కొంతకాలమునకు సిరియాలదేవి కుమారుని ప్రసవించినది. ఆ బాలునికి మాధవవర్మ అని పేరు పెట్టారు. ఇతడు మాధవశర్మ శిక్షణ క్రింద సమస్త విద్యలను నేర్చి పరాక్రమశాలియై, అనుమకొండ పద్మాక్షిదేవి అనుగ్రహం సంపాదించి సైన్యాలు కూర్చుకొని, అక్కడ రాజ్యంచేసే ఎఱుక దేవరాజును ఓడించి అనుమకొండ రాజ్యం కైవసం చేసుకున్నాడు. పద్మాక్షిదేవి మాధవవర్మ ధైర్యానికి మెచ్చుకొని అతనికి ఒక సింహఖడ్గము, దాలు ప్రసాదించి, అవి యీతని వంశంలో వెయ్యి సంవత్సరాలు మాత్రం ఉంటాయని వరము ఇచ్చిందట. ఈ వంశమే కాకతీయ వంశమని సిద్ధేశ్వర చరిత్ర మున్నగు గ్రంథాలు వర్ణిస్తున్నాయి. మాధవవర్మ రాజ్యస్థాపన కాలము శక 291 సంవత్సరమని ప్రతాపచరిత్ర సూచిస్తున్నది. ఇది క్రీ. శ. 368 అగుచున్నది. సిద్ధేశ్వర చరిత్ర ప్రకారమైతే శక 230 అనగా క్రీ. శ. 308. మాధవవర్మ రాజ్యస్థాపనకాలము క్రీ. శ. 314 సంవత్సరముగా చెప్పబడుచున్నదని (Imperial gazetteer of India, Hyderabad state 172 పుటలో) ఉట్టంకింప బడినది.

ఈ కథనమునందలి చారిత్రక మూలభూతాంశములను వింగడింతము. సోమదేవరాజు చారిత్రక పురుషులలో కనబడడు. కాని ఆతనిముఖ్య పట్టణమైన కందరపురము చరిత్రలో గణన కెక్కినదే. ఇది ప్రాచీన రాజవంశమైన ఆనందగోత్రీకుల రాజధాని. ఈ వంశమువారు క్రీ. శ. 4వ శతాబ్దమున

పరిపాలించినట్లు డాక్టరు డి. సి. సర్కారు, భావరాజు వేంకటకృష్ణారావు మున్నగు చారిత్రకులు నిర్ణయిస్తున్నారు. పద్మాక్షిదేవి మాధవ వర్మకు ఇచ్చిన వేయిసంవత్సరముల వరమునుబట్టి చూసినా మనము క్రీ. శ. నాల్గవ శతాబ్దంలోకే వస్తున్నాము. కాకతీయ సామ్రాజ్యము క్రీ. శ. 1323 లో పడి పోయినది. ప్రతాపరుద్రుడు పట్టుబడినాడు. ఇక్కడి నుండి వెయ్యి సంవత్సరాలు వెనక్కి వెడితే క్రీ. శ. 323 అనగా నాల్గవ శతాబ్దిలోనికే వస్తున్నాము. అందుచేత ప్రతాపచరిత్ర మున్నగు గ్రంథముల కథనములో కొంత అస్పష్ట సత్యము గర్భితమై ఉన్నదనుట నిరాకరింపరాని విషయము.

ఇట్లు మనము అనుమకొండ చరిత్రను క్రీ. శ. నాల్గవ శతాబ్దములోనికి గొనిపోవగల్గినాము. దీని నింకను కొంత వెనుకకు తీసుకొని పోవుటకు మన గ్రంథములు తోడ్పడుచున్నవి. మాధవవర్మచే రాజ్యచ్యుతిని పొందిన ఎఱుకుదేవరాజు వంశము వారు అనుమకొండను 186 సంవత్సరములు పాలించినట్లు సిద్ధేశ్వర చరిత్ర చెప్పుచున్నది. మాధవవర్మ రాజ్యస్థాపనకాలము క్రీ. శ. 393 అయినచో ఎఱుకదేవరాజు వంశమువారి రాజ్యారంభము క్రీ. శ. 137 అగుచున్నది. ఇది సాతవాహన రాజుల కాలము. గౌతమీపుత్ర శాతకర్ణి కుమారుడు పులోమావి క్రీ. శ. 102–130 ల నడుమ రాజ్యము చేశెను. అతని యనంతరము సామ్రాజ్యమునందు దుర్బలస్థితి యేర్పడెను. ఆ యదను గ్రహించి శ్రీశైలప్రాంత వాసియు వీరుడు నైన ఎఱుకదేవరాజు అనుమకొండలో తన రాజ్యము నెలకొల్పి యుండును. ఎఱుకదేవ రాజు శ్రీశైలప్రాంతవాసి యనుటకు ఒక నిదర్శనము కలదు. మాధవవర్మచే పదచ్యుతి నొందిన ఈ వంశీయులు అమరవాది రాజ్యమునకు వెళ్ళి పోయిరని కలదు. అమరవాది యనునది శ్రీశైలము వెళ్ళు దారిలోని అమ్రాబాదు తాలూకాయని మనము గ్రహింపవచ్చును.

మాధవవర్మ వంశము వారిలో చారిత్రక పురుషులుగా మనము గుర్తింపదగినవారు త్రిభువనమల్ల, భువనైకమల్ల బిరుదాంచితులు. ఇందులో త్రిభువన మల్లుడు కాకతి రెండవ బేతరాజు. ఇతడు క్రీ. శ. 1080-1115 నడుమ రాజ్యము చేసెను. ఇతని తండ్రి భువనైక మల్లుడు మొదటి ప్రోలరాజు కావలెను (క్రీ. శ. 1030–75). కాకతీయులు తమ రాజ్యారంభకాలమున పశ్చిమ చాళుక్యులకు మిత్రులు సామంతులునై వారి బిరుదములను ధరించుచుండిరి.

కాకతీయుల మూలపురుషుడు గుమ్మడితీగకు పుట్టెననుకథ అనితల్లి కలువచేరుశాసనము నందు కలదు. దీనికి ఆధారమైన వాస్తవికాంశము మన చరిత్ర కథానకములందు దొరుకుచున్నది. మాధవ వర్మ కుమారుడైన పద్మసేనుడను రాజు సంతానము నభిలషించి సిద్ధేశ్వరుని గుమ్మడికాయలతో ఆరాధించెను. తత్ఫలితముగ పద్మసేనునకు వెన్నమ రాజు పుట్టెను. ఈ వృత్తాంతమే తరువాత తరువాత అద్భుతాంశముగా మారిపోయి, కాకతీయులు గుమ్మడి తీగకు పుట్టిరను కథగా వ్యాపించెను. మాధవవర్మ వంశమువారే క్రీ. శ. నాల్గవశతాబ్దినుండి మనము గుర్తింపగలిగిన కాకతీయరాజులవరకును అనుమకొండను పాలించిరనుటకు ఆధారములు లేవు. కాకతీయుల చరిత్ర క్రీ. శ. 1000 సంవత్సరముల నుండి యని పరిశోధకులు పరిగణించు చున్నారు. నాల్గవశతాబ్దమునుండి 11వ శతాబ్ది ప్రారంభము వఱకును మాధవవర్మ వంశీయులు అనుమకొండ రాజ్యమునేలిరని చెప్పజాలము. అనుమకొండలోని యొకానొకశాసనమును బట్టి భీమర్సు అను వాడు రాష్ట్రకూటరాజగు అమోఘవర్షునికి సామంతుడై యక్కడ పాలన చేయుచున్నట్లు కలదు. అమోఘ వర్షుడు క్రీ. శ. 814-880 నడుమ రాష్ట్రకూట సామ్రాజ్యము నేలెను. రాష్ట్రకూటులకును తూర్పు చాళుక్య రాజవంశము వారికిని వైరము నడుచు చుండెను. నరేంద్ర మృగరాజు అనబడు రెండవ విజయాదిత్యునకు ప్రతిస్పర్ధిగా రాష్ట్రకూటులు

విజయాదిత్యుని సోదరుడైన భీమసల్కిని నిల్పిరి. వారియత్నము సాగలేదు. తమ కాశ్రితుడగు భీమసల్కికి వీరు అనుమకొండ రాజ్యము నిచ్చియుందురని ఊహించవలెను.

ఇట్లు కాకతీయులకు ముందు అనగా క్రీ. శ. 1000 సంవత్సరములకు పూర్వము అనుమకొండ రాజ్యమును కనీసము మూడు రాజవంశములైనా పరిపాలించాయని చెప్పవచ్చును. ఎఱుకదేవరాజు వంశము క్రీ. శ. 137 నుండి 323 వరకును, తూర్పు చాళుక్యదాయాదవంశము క్రీ. శ. 800 నుండి 975 వరకును పాలించినట్లు మనము స్థూలంగా చెప్పవచ్చును. అనుమకొండ పరిపాలకులు సాధారణముగా తమకు పశ్చిమాన ఉన్న పెద్ద సామ్రాజ్యములతో సామంతమైత్రిని పాటించవలసి వచ్చేదనికూడా ఊహించవచ్చును. ఎఱుకదేవరాజు వంశమువారు సాతవాహనులకూ ఇక్ష్వాకులకూ సమకాలికులుగా కనబడుతున్నారు. మాధవవర్మ వంశమువారు వాకాటకులకు సమకాలికులు. వాకాటకుల ప్రాభవము తెలంగాణంలో ఎంతవరకు వ్యాపించిందో ఇంకా అన్వేషించాలి. విష్ణుకుండినులకును వాకాటకులకును వివాహసంబంధములుకూడ ఉండెను. విష్ణుకుండినులకును మాధవవర్మ వంశీయులకును ఎట్టి సంబంధము లుండెడివో పరిశీలించవలెను. మా మిత్రులును పూర్వశిష్యులును అయిన శ్రీ బి. యన్. శాస్త్రిగారు విష్ణుకుండిన శాసనములు కొన్ని తెలంగాణంలో తమకు దొరికినట్లు చెప్పుచున్నారు. వీటివలన అనుమకొండ చరిత్రపై క్రొత్త వెలుతురు ప్రసరింపవచ్చును. బాదామి చాళుక్యులకును అనుమకొండ రాజ్యమునకును ఎట్టి సంబంధములున్నవో అన్వేషించాలి. ఈ విధంగా అనుమకొండ చరిత్రనుగూర్చి మనకు తెలిసినదానికన్న తెలియవలసినదే ఎక్కువగా ఉన్నట్లు కనబడుతూంది.

అది యట్లుంతము. అసలు కాకతీయులు తొల్లిటి మాధవవర్మ వంశీయులు కారమటకే ఎక్కువ సాక్ష్యము దొరుకుతూంది. పూర్వపు రాజులు తాము ప్రాచీన రాజవంశముల వారమని చెప్పుకొనుట ఆచారము. రాజరాజనరేంద్రుడు తాను పాండవ వంశమువాడనని చెప్పుకోలేదా ? కాకతీయులు తమ శాసనము లందెచ్చటను తాము పాండవవంశము వారమనిగాని, మాధవవర్మ వంశమువారమని కాని చెప్పుకొననేలేదు. తమది దుర్జయ వంశమని మాత్రము చెప్పుకొని యుండిరి. కాకతీయుల మూలపురుషుడు కాకర్త్యగుండ్యన అను సామంతుడని వారి త్రికులు భావిస్తున్నారు. ఇతడు తూర్పు చాళుక్యరాజు రెండవ అమ్మరాజునకు (క్రీ. శ. 945-70) సామంతుడై మాగల్లు శాసనమునందు వినవచ్చుచున్నాడు. కాకర్త్య గుండ్యనతండ్రి చిన్నరాష్ట్రకూటుడు. ఇట్లు సామాన్య ఉద్యోగియైన గుండ్యన కాకతీయరాజ్యము నెట్లు స్థాపించగలిగెను అనునది సమస్యగా ఉన్నది. దీనికి కొంత సమాధానము ప్రతాపచరిత్ర మున్నగు గ్రంథాల్లో లభిస్తూంది. మాధవవర్మ వంశంలో పెండ్లి గుండమరాజు కొడుకు ఎఱుకదేవరాజు. ఎఱుకదేవరాజు కొడుకు భువనైకమల్లుడు. భువనైకమల్లుని కొడుకు త్రిభువనమల్లుడు. ఈ కడపటి తండ్రి కొడుకులను కాకతి మొదటి ప్రోలరాజు, రెండవబేత రాజుగా మనము గుర్తించాము. అయినచో భువనైకమల్లుని తండ్రి కాకతి మొదటి బేతరాజు. ఇతని పేరు ఎఱుక దేవరాజని మన ఆఖ్యానములు చెప్పుతున్నాయి. నామభేదమును వేరుగా సమన్వయిద్దాము. ఈ మొదటి బేతరాజు లేక ఎఱుక దేవరాజు తండ్రియే పెండ్లి గుండమరాజు. ఈ యంశములను నేను సవిస్తరముగా సిద్ధేశ్వర చరిత్ర పీఠికలో చర్చించి ఉన్నాను. కాకర్త్యగుండ్యనయే పెండ్లి గుండమరాజని నేను వివరించాను. పెండ్లి గుండమ అనుపేరు అళియ రామరాజు వంటిది. ఈ గుండమరాజు అనుమకొండ ప్రాచీన వంశములోని రాజకన్యకను వివాహమాడి ఘనుడైనాడు. దాని నాధారముగా చేసుకొనియే ఆతడు రాజబంధువై క్రమముగా రాజ్యస్థాపన చేయగల్గినాడు.

కాకర్త్య గుండ్యన క్రీ. శ. 970-75 ప్రాంతమువాడని నిశ్చయింపవచ్చును. ఈ కాలమునకును మొదటి బేతరాజుతో క్రీ. శ. 1000 ఆరంభమయిన కాకతీయ రాజ్యమునకును నడుమ వ్యవధి చాల స్వల్పము. ఈ యంతరాన్ని కూడా మనము సిద్ధేశ్వర చరిత్ర మున్నగు గ్రంథములను గూడూరు శాసనముతో కలిపి చదివి సమన్వయించుకోవచ్చును. గూడూరు శాసన కాలము క్రీ. శ. 1000 అని చారిత్రకులు భావిస్తున్నారు. ఇది యొక అపూర్వమైన చిన్నశాసన లేఖనము. ఉత్పలమాల-చంపకమాలావృత్తాలలో వ్రాయబడిన ముచ్చటైన తెలుగు కవిత్వము. కాని చాలా భాగం అర్థం కావడం లేదు. దీనిలో దుర్జయ కులమునకు చెందిన విరియాల వంశపు వీరుల చరిత్ర వర్ణింపబడింది. బాలుడైన కాకతి మొదటి బేతరాజు రాజ్యమును శత్రువులనుండి కాపాడి కాకతీయులను నిలబెట్టిన విరియాల యెఱ్ఱనరేంద్రుడు - ఆతని వీరపత్ని కామమసానిగార్ల చరిత్రము గూడూరు శాసనంలో చెప్పబడింది. ఎఱ్ఱనరేంద్రుని ప్రశంస మన చరిత్ర కథనములలో లేదుగాని కామమసాని మాత్రము కుంతలదేవి అను పేరుతో కనబడుతూంది. పెండ్లి గుండమరాజు కొడుకు ఎఱుక దేవరాజు చిన్నవాడవడంచేత ఆతని మేనత్త కుంతలదేవి ఆతనికి సంరక్షకురాలై 19 ఏండ్లు రాజ్యపరిపాలన చేసిందని సిద్ధేశ్వర చరిత్ర చెప్పుతూంది. విరియాల కామసాని, కాకతి మొదటి బేతరాజుగార్ల వృత్తాంతం కూడా ఇదే. ఈ సామ్యాలనుబట్టి పెండ్లి గుండమరాజే కాకర్త్య గుండ్యన అనీ, ఆతని తోబుట్టువు కుంతలదేవియే కామమసాని అనీ నిర్ణయించడంలో ఆక్షేపణ ఉండకూడదు.

కాకతీయులనాటి సాంఘిక జీవనమును గూర్చి తెలుసుకొనుటకు ఇంతవరకు క్రీడాభిరామము ప్రధాన ఆధారంగా తీసుకోబడుతూంది. క్రీడాభిరామము వీథినాటకం అవడంచేత రూపకనియమాన్ని బట్టి దానిలో హాస్యము, నీచశృంగారం, విటవిదూషకాదులు ప్రాధాన్యం వహిస్తున్నాయి. ఉదాత్తశృంగారము. ఉదాత్తపాత్రలు దానియందు కొరవడి, ఏకశిలానగర మహోన్నత జీవితం మీద అదొక వక్రభాష్యంగా ఏర్పడింది. ఏకశిలానగరం అంటే విటులు, నటులు, వ్యభిచారిణులు అనే దురభిప్రాయం ఏర్పడే ప్రమాదంకూడా గలదు. ఆమహానగర ప్రాభవానికి వినుకొండవల్లభరాయడు తలవని తలంపుగా అపచారం చేశాడని చెప్పాలి. క్రీడాభిరామం ఒకమేలు మాత్రము చేసింది. సామాన్యజనుల నిరాడంబరజీవితము, వేషభాషలు, వినోదములు వీటికి మన ఉన్నత సాహిత్యంలో స్థానం దొరకలేదు అటువంటి ప్రజాజీవితాన్ని క్రీడాభిరామం కొంతవరకు వర్ణించి మేలే చేసింది, ఓరుగల్లునగరము కాకతీయుల కాలములో సర్వవిద్యలకును ఆకరముగా ఉండేది. సంస్కృతాంధ్రములందు గొప్పకవులును పండితులును ఉండేవారు. అన్యప్రాంతములనుండి విద్యార్థులు శాస్త్రాధ్యయనము కొఱకు ఏకశిలా నగరానికి వచ్చుచుండిరి. కాకతీయుల పరిపాలనా వ్యవస్థ ప్రత్యేకముగా ప్రశంసింపదగి ఉంది. అది ప్రాచీన భారతరాజశాస్త్ర సూత్రముల మేరకు తీర్చి దిద్దబడిన దనుట గమనార్హము. ప్రతాపరుద్రుని దినచర్యను మనము గమనించినచో అది యెంత అర్థవంతముగానున్నదో చూడగలము.

ఈనాడు మనము విశిష్టరాజనీతి సూత్రముగా చూచుకొనుచున్న 'గణాంక విధానము' న్ని (Government Statistics), ఆదాయవ్యయ అంచనా పద్ధతియు (Budgetary system) కాకతీయయుగపు రాజనీతిజ్ఞులకు సుపరిచితమని తెలుసుకొనుటకు మనకు ఎంతో ఆశ్చర్యము ఆనందమూ అవుతూంది. ప్రతాపచరిత్ర సిద్ధేశ్వరచరిత్ర వంటి గ్రంథములలో ఇవ్వబడిన గణాంకసంఖ్యలు. బడ్జెటు, కొంత అతిశయోక్తిగా తోచవచ్చును. కాని ఈ పద్ధతియొక్క మూల తత్వము వారెరిగి యుండిరనుట ముదావహము. మన చరిత్రాఖ్యానము

లిచ్చిన కొన్ని గణాంకసంఖ్యలు ఈ క్రింద చూపుచున్నాము, ఇవి ఏకశిలానగరమునకు సంబంధించిన వివరములు :

| | |
|---|---|
| 1 వేదపారగులగు విప్రులయిండ్లు | 18,000 |
| 2 మంత్రుల యిండ్లు | 2,000 |
| 5 క్షత్రియుల యిండ్లు | 2,000 |
| 4 సర్వవస్తు సంభరితములైన వైశ్యుల గృహములు | 30,000 |
| 5 వీరిలో లక్షాధికారులు కోటికి పడగెత్తినవారు | 420 |
| 6 పద్మనాయకుల ఇండ్లు | 77 |
| 7 మిగిలిన అష్టాదశ వర్ణముల వారి యిండ్లు | 1,50,000 |

ఇంకను 16 కులాల వారి యిండ్ల సంఖ్య తెలియ బడినవి.

దేవాలయములు :

| | |
|---|---|
| శివాలయములు | 5,500 |
| విష్ణ్వాలయములు | 1,300 |
| మైలారుదేవునిగుళ్ళు | 2,400 |
| ఈ దేవాలయములలో మ్రోయు పెద్ద దుందుభులు | 550 |
| శంఖములు మొదలైనవి | 15,500 |
| దేవాలయములలో దీపముల కగు నూనె | 25 పుట్లు |
| వీథిదీపముల కగు నూనె | 50 పుట్లు |

సైన్యవివరములు :

| | |
|---|---|
| పద్మనాయకులు | 77 |
| ఒక్కొక్క నాయకుని క్రింద నడుము భటులు | 1,500 |
| ఉత్తమాశ్వములు | 106 |
| శ్రేష్ఠగజములు | 10 |
| ధానుష్కులు | 9,00,000 |
| మొత్తము గుఱ్ఱముల సంఖ్య | 24,000 |
| మొత్తము ఏనుగులు | 2,500 |

ఆదాయవ్యయసంఖ్యలు :

మొత్తము సంవత్సరాదాయము 44 కోట్లు. దీనికి వ్యయము·

| | |
|---|---|
| 1 రాజప్రాసాదపు ఖర్చు; ఏకశిలా నగర దీపముల వ్యయము: అన్యప్రాంతములనుండి విద్యార్జనమునకై వచ్చు విద్యార్థుల కిచ్చు చెల్లుబడులు | 3,60,00,000 |
| 2 రక్షకభటాధికారి వేతనము, అతని సిబ్బంది వేతనములు | 88,20,000 |
| 3 100 సత్రములకు, ఒక్కొక్కదానికి 1000 నాణెముల చొప్పున, | |
| 4 సవలక్షధనుర్ధరులకు | 3,80,00,000 |
| 5 గజాశ్వదికములకు | 2,50,00,000 |
| 6 ఏకశిలానగర దేవాలయములకు | 1,00,00,000 |
| 7 రాజప్రాసాదములనిర్మించు స్థపతులు, శిల్పులకు | 1,00,00,000 |
| 8 అన్యప్రాంతములందలి దేవాలయములకు— వారణాసి, శ్రీశైలము, మొదలగు క్షేత్రములకు | 3,00,00,000 |

డా. కోరాడ మహాదేవశాస్త్రి

# ప్రాఙ్నన్నయ తెలుగుభాషలో వ్యావహారిక కావ్యశైలీ భేదములు

ప్రాఙ్నన్నయ యుగమునందలి తెలుగుభాషా స్థితినిగూర్చి సాహితీపరులలో కొన్ని అభిప్రాయములు రూఢములై యున్నవి. ఆనాటి భాషయంతయు 'అ_స్తవ్య_స్తము'గ, 'ద్రవరూపము'న నుండినదనీ, దానికొక నియమము ఏర్పడియుండ లేదనీ, అప్పటి సాహిత్యము దేశికవితారూపమున పామర/సామాన్య జనులలో ప్రచారముగాంచి యుండినట్లే కనబడుచున్నది గాని వేరుకాదని, నన్నయయే తన మహాభారతరచన మూలమున భాష కొక స్థిరరూపము కల్పించినాడనీ— ఇత్యాదులు. ఈ అభిప్రాయముల నొకపరి పరిశీలింతము.

నిజమునకు ఏకాలములోనైనను, ఏదేశములోనైనను వ్యవహారమునందలి పలుకుబడి యంతయు ద్రవస్థితియందే యుండును. ప్రాంతీయ భేదములు, వర్గభేదములు, వైయ_క్తికములైన ఉచ్చారణ భేదములు–ఇవన్నియు జీవద్భాషకు తప్పనిసరియగు లక్షణములు. కాగా నాగరికత పెంపొందిన జన సంఘములలో ఈ భాషాభేదములు ఉంటూండగా వాని మధ్యనే విద్యాధికులలో, సంస్కారవంతులలో, సామాన్యభాషా ప్రమాణ (Standard language) మనునదొకటి పెంపొందును. అట్టిది ఏదో ఒక ప్రాంతపు భాషపై ఆధారపడి యేర్పడును. ఏ ప్రాంతపు భాష ప్రామాణికభాష యగు ననునది దేశములోని రాజకీయ, సాంఘిక, లేదా వైజ్ఞానిక పరిస్థితులనుబట్టి యుండును.

తెలుగున పదకొండవ శతాబ్దమున రాజమహేంద్రవరము తూర్పుచాళుక్య రాజుల రాజధానియై ఆ రాజాస్థానము నన్నయ వంటి కవికి ఆశ్రయమిచ్చుటచే ఆ ప్రాంతపు శిష్టవ్యావహారికమునకు ప్రామాణికత్వము కలుగుట సంభవించినది. అదియే గ్రాంథిక భాషయైనది. సారస్వత లాక్షణిక సంప్రదాయములు బలమగుకొలది గ్రాంథికభాషయందు ప్రామాణ్యబుద్ధి హెచ్చగు చుండును. ఆ ప్రామాణ్యభావము మనకు తెలిసినంతవరకు భారతభాషయెడ నన్నయ భారతరచనతో ప్రారంభమైనది. ఆ మూడు కృతులలో సామాన్యుడు నుడువు తెలుగు లరసికొనియే తిక్కనసుధీమణి మొదలైన తొంటి తెనుగు కవీంద్రులు తమ రచనలు చేసినారు. తిక్కన రచనలో నెల్లూరు మండలము పలుకుబడి విశేషముగ ప్రవేశించినది. గ్రాంథికభాష సాధారణముగ ఏదో ఒక ప్రాంతీయ మాధారముగ బయలుదేరినను క్రమముగా నితర ప్రాంతీయుల మూలమున భిన్నమాండలిక విశేషలక్షణములను తనలో నిముడ్చు కొనుచు పెంపొందుచుండును.

భారతరచన పూర్తియైన తరువాత తరువాతి వారికి భారత భాషయే ఒరవడి యైనది. లక్షణకారులు భారత భాషను, ఆ మార్గము ననుసరించి వ్రాసిన మార్గకవితా పక్కిని మాత్రమే ప్రమాణముగా గ్రహించి లక్షణము చెప్పిరి. ఇట్లు క్రమముగ సారస్వత లాక్షణిక సంప్రదాయములు స్థిరపడి రాజాదరణము, పండితాదరణము గాంచగల్గుటకు కవులీ భాషనే చాలవర కనుసరించుట తటస్థించినది. ఈ గ్రంథములలోని భాషకే 'గ్రాంథిక భాష' యను బిరుదము వచ్చినది. వీనిలో కన్న కొంత వ్యావహారిక మెక్కువగా ప్రవేశించిన శివకవుల దేశిరచనలలోని భాషకు ఆమోదము కలుగలేదు. చూడుడు: నన్నయలో పదమధ్యాజ్లోపముతో కూడిన రూపములు – వ్యవహారవశమున నేర్పడినవి – లేక

పోలేదు.ఉదా. ఏండులు = ఏండ్లు; తొడుగు = తొడ్గు; మనుమండు = మన్మడ్డు; పలుకు = పల్కు; పొలితి = పొత్తి; ఉనికి = ఉన్కి. ఇట్టి రూపములే ఇంక నధికముగ పాల్కురికి సోమనాథుడు వాడినాడు. తివ్వు, కస్వు ఇత్యాదులు. 'పాండు నృపాలు పాలుగై కొంటయ చాలు' నని తిక్కన ఉద్యోగ పర్వములో 'కొంట' ప్రయోగించెను. అథర్వణాహో బలులు అంట, కొంట ఇత్యాదులను నన్నయలో గానరాకపోవుటచే నిషేధించిరి ఎంత గ్రాంథిక భాషయైనను వ్యవహారవశమున మారక మానదు. అది నన్నయనుండి చిన్నయవరకు మారక-ఒక్క రూపముననే యున్నదని - స్థూలదృష్టికట్లు తోచుటచే-కొందరందురు. పదకొండవ శతాబ్దమునుండి పందొమ్మిదవ శతాబ్దము వరకుగల భాషా పరిణామమును పరిశీలించి చూచినచో వ్యావహారికభాష గంతులిడుచు పరుగులిడుచుండగా, గ్రాంథిక భాషయు మందగతిని మారుచుండెననియు-ఈ గతిభేదము ననుసరించి కాలము గడచినకొలది గ్రాంథిక వ్యావహారికములకు మధ్య అంతరము హెచ్చుగుచు వచ్చినదనియు తెలియక పోదు.

ఇక నన్నయ కాలము నాటికి గ్రాంథిక వ్యావహారికభాషా భేదము లెట్లు ఎంతవరకుండెనో భారత భాషను సమకాలపుశాసనభాషతో పోల్చి పరిశీలించిన తెలియగలదు నన్నయ 'ఇచ్చితిని, చేసితిని' వంటి రూపములను వాడెనేగాని, ఇస్తిని చేస్తినివంటి రూపములను వాడలేదు. అతడు దీర్ఘము మీాద అనుస్వారమును తేల్చి పలికెనేగాని ఊది పలుక లేదు. శాసనములలో-స్త-కార యుక్త భూత కాలిక క్రియలు, దీర్ఘము పై అనుస్వారము నూది పలుకుటను నిరూపించు ప్రయోగములు కానవచ్చుచున్నవి. ఇవి రెండు ఉదాహరణములు మాత్రమే. ఇట్టి యంశము లింకను ఎన్నో గలవు. ఇవి ఆనాటి మాండలిక భేదములుగా గ్రహించవలెను. ఇప్పుడు తెలుగు దేశములో నొక ప్రాంతమునకు పరిమితము లైన 'ఇస్తిని - చేస్తిని, ఆండది, కోంతి' వంటి రూపములు నన్నయ కాలము నుండియు భాషలో ప్రచారములో నుండినవే యని స్పష్టమగుచున్నది. శాసనములలోని వ్రాతలను, పద స్వరూపమును చూచినచో వానిలో ఆనురూప్యము కనబడదు. ఒకే రూపము అనేక రీతులుగ భిన్నవర్ణక్రమముముతో వ్రాయబడి యుండుట గుర్తింపగలము. ఇందలి భాష ఆనాటి వ్యావహారిక భాషకు దర్పణమనవచ్చును. దీనిలో 'నియతి' కనబడదు. ఈ వ్రాతలలో మాండలిక భేదములు, వైయక్తికములైన ఉచ్చారణ, వర్ణక్రమ భేదములు వ్రాయసకాని దోషములు ఇవన్నియు కలిసి యుండును. వ్రాతతప్పులను పరిహరించి చూచినను, వ్యావహారిక భాష ఎప్పుడును అస్తవ్యస్తముగ, ద్రవరూపమున నుండినట్లే తెలిసికొనగలము.

తరువాతి కాలములోని కావ్యేతర భాష ఎట్లు అస్తవ్యస్తముగ నుండెనో అట్లే ప్రాఙ్నన్నయ యుగమునందలి భాషయు నుండెను. అది సహజమేకదా. పన్నస (ఒక విధమగు భూమి దానమును సూచించు) పదమునకు ఎన్ని రూపాంతరము లున్నవో చూడుడు; పనస, పన్నస్స, పన్నవీస, పన్నాస, పన్నశ, పన్నశా, పనాశ, పన్నెశళస (బహువచన రూపము), ఇట్లే 'వారణాసి' వారణాశి, వారణాసిగా వ్రాయబడినది. లభించిన శాసనభాష పరిమితమైన దగుటచే ప్రాఙ్నన్నయ భాషలోని మాండలికభేదము లెట్టివో స్పష్టముగ చెప్పలేకపోవు చున్నాము. తరువాతి కాలపు భాషా లక్షణము దృష్టియందుంచుకొని, ప్రాఙ్నన్నయ పచన శాసనములలోని ఎఱుంగు: ఎరుగు; కాంపు: కాపులు, ఏగ్గె: ఏగె- రూపములు ఆనాటి మాండలికోచ్చారణమును సూచించుచున్నవని నిరూపించవచ్చును. ఇంతకూ చెప్పవచ్చినది నన్నయకు తరువాతి భాషలో వ్యవహారమున కానవచ్చు వైవిధ్యమే నన్నయకు పూర్వమునను ఉన్నదనుట. ప్రాచీనభాషలో అనేకములగు నష్టరూపములు- పన్నస, మరుత్రు, ముటుళ్, తెఱల్ (చిఱుదెఱల్—

చిల్లరపన్నులు అనునర్థమున) వణంపరియారము, వెంబొడుచు. ప్రాచీనతా లక్షణములతో కూడినవి— ప్రవితుడ్లు, వగ్రబు వచ్చువరు సూర్జ్యగ్రహన-అచ్చు, క్రొచినవాస్తు, వక్రపల్కు, టంకాడు, ఇన్ను జోలు ఇత్యాదులు. మనకు పరిచితములు కాని శబ్దరూపములు- వ్యక్తిగ్రామ నామములు- వసన్తి పోఱి చోట మహాదేవుఱ, వారాణ్ణ పాఱు, విరావవ మహానభియుళ్, రేరియచాముణ్డియ, రక్కన గాముండు, మార్పిడుగు రట్టగుళ్ళు, ఇత్యాదులగు నీ రూపములు; మహారాజుళాకు, నళావిద్యది యొకొటి, ఇరుబాదిరెండు వంటి వైలక్షణ్యములు- ఇవన్నియు ప్రాఙ్నన్నయ భాషలో నియతిలేదను అభిప్రాయమును కలిగించుచున్నవి. మనకింతవరకు లభించిన తెలుగు శాసనములలో నతిప్రాచీనమైన ఎఱ్ఱగుడిపాడు శాసనపాఠము (ఎపిగ్రాఫికా ఇండికా 27వ సంపుటము, 225 పుట) చూడుడు.

"స్వస్తిశ్రీ ఎదికల్ ముత్తురాజుల్ల కుణ్డికాళ్ళ నివబుకాను ఇచ్చిన పన్నస; దుజయరాజుల ముత్తరాజులు నవప్రియ ముత్తురాజులు వల్లవదుకరజులు శక్షికాను ఇచ్చిన పన్నస్స; కొట్టంబున పాఱకు కుణ్డికాళ్లళ ఇచ్చిన పన్నస ఇరవదియాదినాల్కు మఱుత్తుఱు నేల". ఒక వాక్యములో చెప్పదగిన భావము రెండుమూడు చిన్నవాక్యములలో, పునరుక్తితో వ్రాయుట వ్యావహారిక భాషాలక్షణము. ఈ శాసనము సామాన్యుడగు ఏ రాజోద్యోగియో వ్రాసియుండును. ఇదే భాషలో సాధన చేసిన ఏ పండితుడో వ్రాసియుండినచో వాక్యాన్వయము మారియుండును:— కుణ్డివాళ్ళనివబుకాను,— వల్లి వదుకరజుల శక్షికాను, కొట్టంబున పాఱకు ఇచ్చిన పన్నస ఇరవదియాదినాల్కు మఱుత్తుఱు నేల"— అను రీతిని పైశాసనపాఠము కర్తకర్మక్రియలతో ఒక వాక్యములో కూడియుండ దగును.

ప్రాఙ్నన్నయ యుగము నందలి శాసనములు— మన కిప్పటికి లభించిన వానిలో ననేకము లిట్లు సామాన్యులు వ్రాసిన వ్రాతలేగాని పండితులు వ్రాసినవి ఎక్కువ గనబడవు. వానిలో పండరంగని అద్దంకి శాసనము, యుద్ధమల్లుని బెజవాడ శాసనము, మరికొన్ని పద్యశాసనములు ప్రసిద్ధమైనవి. కొన్ని కావ్యశైలిలో వ్రాయబడిన గద్యశాసనములును లభించినవి. 9వ శతాబ్దమునాటి ధర్మవరం శాసనము (భారతి. 5వ సంపుటము), 9–10వ శతాబ్దమునకు చెందిన కొఱవి శాసనము (తెలింగానా శాసనములు 163 పుట). ఇక విశేషమేమనగా ఇటీవలనే ప్రకటింపబడిన 7వ శతాబ్దపు తురిమెళ్ల శాసనమునుబట్టి ఈ కావ్యశైలి అప్పటికే తెలుగులో నేర్పడియుండెనని నిశ్చయించుటకు వీలగుచున్నది. ఈ శాసనము కర్నూలు జిల్లా తురిమెళ్ల గ్రామమున లభించినది. పశ్చిమ చాళుక్య రాజైన మొదటి విక్రమాదిత్యునికి సంబంధించినదని నిర్ణయింపబడినది: ఆశాసన పాఠము :

ఓం [।] స్వస్తి [।] శ్రీమత్ సత్యాశ్రయ శ్రీపిథివీ

వల్లభ మహారాజాధిరాజ విక్రమాదిత్య పరమే

శ్వరభటారులాకున్ శ్రీమదున్నత ప్రవర్ద్ధమాన విజయ

రాజ్యసమ్వత్సరంబుళ్ ఆచంద్రతార పురస్సరం

ద్వితీయ వర్షం ప్రవర్తమానం కాను [।]. గొగ్గిభటారళ దక్షిణ

భుజాయమానుమ్బుయిన ఆలకుమర ప్రియ తనయిం బయిన

ఉజేనీ పిశాచనామధేయిమ్బు తుఱుతటాక నామాభి

ధాన నగరధిష్ఠానుం బయి ఏఱువ విషయమ్బేళన్ తస్య

మాతా దత్తమ్ గోవృషాణ భట్టారహో శత పంచాశత్ క్షేత్రం [।]

పై శాసనములో నాకాలమునకు విహితమైన ధ్వని రీతులు, పదజాలమును తప్పించి చూచినచో

ఇందలి రచనాపద్ధతికిని, నన్నయాదుల మార్గకవితా ఫక్కికిని ఎక్కువభేదము లేదని గ్రహింపకపోము. దీనిలో ప్రధానముగా గానవచ్చు కావ్యశైలీ లక్షణము లేవనగా: నియతమగు సంధివిధానము, అన్వయసౌష్ఠవముతో కూడిన వాక్యరచన, తత్సమ పదబాహుళ్యము అనునవి. ఈలక్షణములు నియతముగా పద్యశాసనములలోను, కొన్ని గద్య శాసనములలోను ఉన్నవి. దీనిని బట్టి-ప్రాఙ్నన్నయ యుగమున తెలుగు శాసనములు లభించినంతవరకు- అతి ప్రాచీనకాలములోనే కావ్య శైలి యేర్పడి ప్రచారములో నుండెనని తెలియుచున్నది. అట్టి భాషలో రచింపబడిన కృతులు కాలవశమున నశించి పోయినవి. శాసనస్థములైన ఈ కొలది పంక్తులు మాత్రము - కావ్య శైలి యొక్క ప్రాచీనతను మనకు తెలుపుటకో యనునట్లు - నిలిచియున్నవి. కావున ప్రాఙ్నన్నయ భాష యంతయు నియమ రహితమని గాసట బీసటయని కొట్టివేయుట తగదు.

శ్రీమతి
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# ఆంధ్రకవయిత్రుల ప్రబంధరచనా ప్రాగల్భ్యము

మధురాతిమధురమైన ఆంధ్రవాఙ్మయము మాననీయలైన ఆంధ్రకవయిత్రుల మహనీయరచనా సౌభాగ్యముచేత మఱింత మధురమైనదిగా ప్రశస్తి కెక్కినది.

పూజ్యులైన కవిత్రయమువారి భారత రచనతో ధార్మిక స్రవంతిగా జీవనము సంతరించుకొనిన ఆంధ్ర సారస్వత వాహినిని, చిఱుతరంగములుగా, కమ్మని తేనెల పాయలుగా, అదభ్రశుభ్రరుచికరమగు ఊటలుగా రమణీ రమణీయ సారస్వత కృషి పెంపెసలారినది.

ఇట్టి ఈ మహిళాసారస్వతమున కావ్య ప్రబంధ శాఖగా పరిఢవిల్లిన సాహిత్యప్రక్రియ నొకింత పరికింతము.

మహిళా వాఙ్మయమున తొలికావ్యములు ప్రబంధములుగా నింతవఱకు పరిగణింపబడుచున్న కావ్యములు మొల్లరచించిన రామాయణ కావ్యమును, తాళ్ళపాక తిమ్మక్క రచించిన సుభద్రాపరిణయమునై యున్నవి.

## మొల్ల రామాయణము

మొల్ల ధర్మవిగ్రహుడును, కర్మనిగ్రహియునైన రఘురాముని చరితమును గోరుముద్దలుగా ఆంధ్రులకు ముద్దు మురిపెములు తీరునట్లు తినిపించిన మాతృమూర్తి! సామెతలతో ఆమెత లొనర్చి, తేనె సోక నోరు తియ్యనయగునట్లు తెలుగు జాతికి ధర్మవర్తనము తియ్యముగా నందించి, జాతిని తీర్చుటలో ఒజ్జయై వంద్యురాలైనది మొల్ల.

జానకీదేవియొక్క మహచ్చరితమును పౌలస్త్య వధకథనముగా మలచి, జగతికి వెలుగు బాపుటా తీర్చిన ఆదికవి వాల్మీకియొక్క పూనికలోని మెలకువను మొల్లగ్రహించినంతగా ఇంకే ఇతరసంగ్రహ రామాయణ కవియును గ్రహింపలేదేమో!

మత్తెక్కి. మాతృమూర్తిని మదన పరవశుడై యనుభవింపగోరిన ఏబాలిశుడును- తానెంత త్రిజగద్విజేతయయ్యును — అధోగతి నొందక తప్పదు. ఈ పరమ సత్యమును త్రికాలాబాధితమగు నగ్నసత్యముగా, ధర్మనృత్యముగా పతాకస్థాయి కెత్తి చూపినది మొల్ల!

కావుననే మొల్ల చిత్రించిన సీతమ్మ తన వీర్యశుల్కమైన శివధనువును రాఘవుడు దునిమినయంత ధరణీశ సూనులు తలలువంచి సిగ్గుపడగా తాను మేను పెంచి ధీరముగా తలయెత్తి నిల్చినది.

ధర్మవిగ్రహుడును, నరాధిప నందనుండును, పుంసాం మోహనరూపియునై ధర్మార్థ కామమోక్షరూపమగు చతుర్విధ పురుషార్థ సాధనకొఱకు భువి నవతరించిన శ్రీరామచంద్రుని ఇల్లాలైతినిగదాయను నానందమున ఆ సమయమున పరాశక్తి సీతాసాధ్వి అధర్మ నిగ్రహమునకై ధీరముగా మేనువెంచి ఒడ్డారించి నిలువబడుటలో ఎంతో యౌచిత్యమున్నది.

ఈ సనుయముననేకాదు రావణ వధానన్తరము రాఘవుడు

"కులసతిఁ జెఱఁగొనిపోయిన
యలశాత్రవు గెలువనోపడను పలుకులకున్
గెలిచితి బగచంపితి నిక
నెలతా! నీయిచ్ఛ జనుము, నే నిన్నొల్లన్"

అని పలికిన, అవి తన కర్ణములకు "వాడిగలుగు

నట్టి నారసములు సోకినయట్లు' కాగా సీతాసాధ్వి యా యాపత్సమయమునను

"నరవర నాదుచిత్తము మనంబున
నీవ యెఱింగియుండియున్
బరుషములాడ నేమిటికి.
బాపము నాయెడలేదు. కాదుపో
సురలు నుతింప మేటి
సొద జొచ్చెద మెచ్చుడు"

అని మేనువెంచి ధీరముగానే నిలిచి పలికినది.

ఈ పల్కు జగతీశాసనకంబమున నొక జయపతాక ! ఆంధ్రకావ్య యశోంబరమున చిరదీధితుల చిలుకరించు చిన్మయానంద ప్రతీక !

## సుభద్రాపరిణయము

పురవిజేతయై, మదనారియై పొగడు మిగిలిన పరమశివుని జయించిన మేటివిలుకాని వలపుధనము తన లజ్జా వినయ సౌందర్య శీల సంపదతో కొల్లగొట్టిన చిన్నారి సుభద్రయొక్క ప్రణయ, పరిణయ చరిత్రమును రసమూర్తులగు తెలుగు ప్రజల మనస్సులూరునట్లు రసవత్తర ద్విపద కావ్యముగా మనోజ్ఞ రీతిని మలచి మంతునకెక్కినది తిమ్మక్క.

తిమ్మక్క తీర్చిన కావ్యశిల్పమును వింగడించి చూచినవారు, ఔరా ! తిమ్మక్క మానసికసౌందర్య మెంతటిది? భావుకరాసౌభాగ్యమెంత ప్రశస్తమైనది? అని ముక్కున వ్రేలూనక మానరు !

సోయగములరాశియగు సుభద్రనుగూర్చి కవిత చెప్పెనా మనకండ్లయెదుట సుభద్రవచ్చి నిలిచినట్లె సంభావింప వలయును. అంతేకాదు, శ్రీకృష్ణునకు చిట్టిచెల్లెలు సుభద్రపై నెంత గొప్ప యపేక్షయో తెలుపవలెననిన, ఆ యపేక్షను శ్రీకృష్ణుడు సుభద్రను పిలుచుటయందె చూపింపగలదు.

"శిరసు వంచుకయున్న చెల్లెలిజూచి"
అ త్రైలోక్యపతి దయతో బిలిచిన తెలుగు నొప్పరిపింపుడు.

"అమ్మ రా, ముద్దులగుమ్మ రావమ్మ
కొమ్మ రా, సవకంపుబొమ్మ రావమ్మ
ముత్యాలసరమ రా, ముద్దరాలా రా
చిత్తజుబాణమా, చెలియ రావమ్మ
చిలుకలకొలికి రా, శృంగారకన్య రా
తొలకరి మెఱుప రా, తోయజగంధి...."

ఈ విధముగా నింకొక కొన్నిపంక్తులు సాగిన ఈ సంబోధనల పట్టికలోనుండి శ్రీకృష్ణునకు చెల్లెలిపై గల అపార ప్రేమాభిమాన స్రవంతి వెల్లువయై పైకుబికినది.

ఏదివర్ణించినను చక్కని, చిక్కని, సొగసైన గృహవాతావరణము సోయగముల నించుచు మన కండ్ల యెదుట నిలుచును.

సుభద్రయొక్క పొలుపైన రత్నాలబొమ్మరింటికి, తళుకైన పగడాల ద్వారబంధాలట, వాటికి పచ్చల తలుపులట, అచ్చపువంతాల బొమ్మలట, వాటి పెండ్లిచేయించు చున్నదట ! ఈ పదవాలమునుండి తొంగిచూచు మనోజ్ఞమైన సహజ సన్నివేశ కల్పనము మనలను నిజముగా సుభద్ర బొమ్మరింటి పెండ్లికి పేరంటాండ్రుగా గొనిపోవును.

ఆ బొమ్మల పెండ్లిండ్ల సందర్భమున కపటయతి అర్జునుడు కల్పించుకొని ఆడినాటకము, సుభద్రతో పల్కిన నర్మగర్భ సంభాషణము అన్నియు చవులూరించు సంఘటనములు.

ఇంత వింతయైన సొంత సంబారముతో తిమ్మక్క ఒక రమణీయ కథాకావ్య శిల్పమును కళాఖండికగా తయారించి ఆంధ్ర వాఙ్మయ నీల గగన వేదికపై సద్దానిని స్థిర సౌదామని నొనరించినది.

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

## మరీచీపరిణయము

మరీచీ పరిణయ ప్రబంధమును ఆంధ్ర భోజుడైన శ్రీకృష్ణ దేవరాయల కుమార్తెయని చెప్పబడుచున్న మోహనాంగి రచించినది. కావ్యము కానరాదు. ఆమె రచించినవని చెప్పబడు 2,3 పద్యములు మాత్రము లభ్యమగుచున్నవి.

అందొకటి, రెండు :

"అకలుష మాధురీ కలితమై
యలసాని కవీశుబోలె న
ల్లికబిగి, ముక్కుతిమ్మకవి
లీలను ముద్దగు బల్కు, పాండురం
గకవిగతిన్ బదక్రమముగల్గు
కవిత్వముతోడ, విష్ణుచి
త్తుకథ రచింతు మజ్జనకు
దోరపుబత్తి నుతించి మ్రొక్కెదన్"

ఈ పద్యము సమదర్శిని పత్రికయందు ప్రకటింపబడిన దని శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య గారు వ్రాసిరి.

పూర్వమునుండియు వాడుకలో నున్న పద్యము నీక్రింద చూపుచున్నాను :

"ఒత్తుకొని వచ్చు కటికుచోద్వృత్తి జూచి
తరుణి తనుమధ్య మెచటికో తలగిపోయె
నుండెనేనియు గనుపడ కున్నె యహహ !
యుద్ధతుల మధ్యమున పేదకుండ దరమె ?"

మోహనాంగి నిజనామము తిరుమలాంబ యని యొక యైతిహ్యము ! శ్రీకృష్ణ దేవరాయలకు మోహనాంగి యను తనయ కలదను గాథ సారస్వత ప్రపంచము ననే కలదు కాని చరిత్ర ప్రపంచమున గానరాదు కదా ! ఇందలి సత్యాసత్యము లెట్టివో !

## ఉషాపరిణయ మన్నారుదాసవిలాసములు

విజయరాఘవనాయకుని యాస్థాన కవయిత్రి, అష్టభాషా విశారద రంగాజీ ఉషాపరిణయ, మన్నారు దాసవిలాసములను విరచించినది.

ఈయమ సంస్కృత, ప్రాకృత, శౌరసేనీ, మాగధీ, చూళికా పభ్రంశ, పైశాచీ, ఆంధ్రభాషలలో కైతలు చెప్పజాలిన ప్రజ్ఞావైదుష్యములుకల విదగ్ధురాలు ! ఈమె పై గ్రంథములనేకాక మన్నారుదాస విలాసనాటక (యక్షగాన) మును, రామాయణ భారత భాగవత సంగ్రహములను రచించియున్నది ఈ రామాయణ భారత భాగవతాదు లగపడవు.

విజయరాఘవుని ఆస్థానమున జరుగు పండిత చర్చలలో నీమె పాల్గొనెడిది. అనేకభాషలలో సమస్యలను పూరించెడిది. అసామాన్య ప్రజ్ఞాధౌరంధర్యము కల ఈయమను విజయరాఘవుడు స్వర్ణాభిషేకము కావించి గౌరవించెను.

ఉషాపరిణయమున గొప్ప కవితాశిల్ప మగపడకున్నను, సులభమగు శైలియు, ధారావిశుద్ధమగు కవితారీతియు గానిపించు చున్నవి.

"ఇచ్చకములాడి, మిక్కిలి
విచ్చలవిడి గొల్లచెలుల వేడుకమీరన్
దచ్చనలగూడి తొణిగెడు
నచ్చుతునకు మనుమడనిన నడుగగనేలా"

నాయకరాజుల కాలమునాటి గ్రంథరచనమున సాగిన జాణవా తెల్గురచనమే యిందును గానిపించు చున్నది. ఇంకొక విశేషమును గమనింప వలసి యున్నది. ఛందో నిబంధనలు కొన్ని సడలింప బడినవి. ఆ ప్రభావమును రంగాజీ కవితలో మనము కాంచగలము.

మన్నారుదాస విలాసకావ్యము కాంతిమతీ విజయ రాఘవుల వివాహగాథ !

అందీమె రఘునాథ నాయకుని

"సారభుజాబలంబునను,
జక్కదనంబున, సద్గుణంబులన్
ధీరమతి ప్రభావముల,
దిక్కులమిక్కిలి నిండుకీర్తులన్

ధారుణి బ్రోచునేర్పున,
నుదారదయన్, గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథ భూమిప
ఫణీమణికిన్ సములే నృపాలకుల్ ?"

అని వర్ణించినది. కవిత్వమంతయునిట్లేయుండును. రంగాజి కావ్యగుణము వలెనే, శీల సద్గుణమును మిగుల ఎన్నదగినది. ఆమె విజయరాఘవుని ధర్మ పత్ని కాకున్నను, తన సరసగుణ సంపద్భల ములతో నాతని మనస్సు నాకర్షించి తను మనః ప్రాణముల నాతని కర్పించి, యాజీవితము నాతనిని సేవించిన సచ్ఛీల !

రంగాజీ విజయరాఘవుల సత్ప్రణయ గాథయే యొక యద్భుతప్రబంధ వస్తువు కాజాలిన రస వత్తర గాథ !

విజయరాఘవుని (తనభర్తను) తనకిచ్చి పతిభిక్ష పెట్టుమని తన్నువేడిన కాంతిమతి కీమె తిరిగి వ్రాసి పంపిన పద్యమె యిందులకు సాక్షి !

ఆ పద్యమే ఒక మనోహర ప్రబంధరాజము !

"ఏ వనితల్ మముందలప
నేమిపనో తమ రాడువారుగా
రో, వలపించు నేర్పెటుగరో,
తమ కౌగిలిలోన నుండగా
రా వది యేమిరా విజయ
రామయటం చిలుదాటి బల్మిమై
తీవరకత్తెనై పెనగి
తీసుకవచ్చితినా తలోదరీ !"

## రాధికా సాంత్వనము

తరువాత ప్రస్తావింపదగిన ప్రబంధము ముద్దు పళనిచే కూర్చబడిన రాధికాసాంత్వనము !

ఇది మోహశృంగార కావ్యము మహిళావాఙ్మయ మున కానిపించు ఏకైక మధురశృంగార ప్రబంధ మిదియే.

ఇది నాలుగాశ్వాసముల కావ్యము. ఈ కావ్యము నకు ఇళాదేవీయమను నామాంతరము కలదు.

ఈ కావ్యము భోజదేవుని శృంగార ప్రకాశికా లక్షణ గ్రంథమునకు సరియైన లక్ష్యగ్రంథము ! ఈ పద్ధతి ప్రబంధములలో నాంధ్రవాఙ్మయమునకే ఇది తలమానిక మనదగిన ప్రబంధమని పలువురు దీనిని ప్రశంసించిరి. చేమకూర వేంకటకవి మున్నగు వారు యత్నించియు సాధింపలేక పోయిన ఈ రీతి కావ్యరచనమున ముద్దుపళనికే యగ్రతాంబూల మిచ్చిరి. స్త్రీయగుటచే, అనుభవసహజముగ వర్ణింప గల్గినదేమో !

గోపాలకృష్ణుని పరమప్రేయసి రాధిక, ఇళా దేవిని చిన్ననాటనుండియు గారాబముగ పెంచి శ్రీకృష్ణుని కిచ్చి తన చేచేతుల పెండ్లి చేయించి, మరల తానే కృష్ణవిరహము నోర్వలేక ఇళ యెడ యీర్ష్యాయుతముగ వల వంతల వేగి క్రాగిపోయినది. చిలుకపోయి శ్రీకృష్ణు నకు రాధా విరహ వ్యథా గాథను పూసగ్రుచ్చినట్లు చెప్పినది— చిలిపికృష్ణయ్య రాధయింటికి వచ్చినాడు ! ఇంకేమున్నది ! రాధాదేవి యురస్సుపై గల తన యక్కసును వెడల గ్రక్కినది ! కొంటెక్రిష్ణయ్య యామెను ప్రసన్నురాలుగా నొనర్చుకొనుటకై మరల తన్నులు తినవలెనుగాని ! పాపమా మధుర భావుకునకు తలప్రాణము తోకకు వచ్చినది !

ఈ మనోహర ప్రబంధము నంపెలి మంజుల గాథ యిది !

ఈ కావ్య వస్తువునకు ప్రధానమైన మానినీ స్పర్థాభావమును సరిగా అచ్చొత్తిన యట్లు ప్రద ర్శించిన రాధ పలుకులను గమనింపుడు :

"సొమ్ము లియ్యవచ్చు సొమ్మంద మియవచ్చు
నియ్యరాని ప్రాణ మియ్య వచ్చు
తనదు విభుని వేరు తరుణిచేతికి నిచ్చి
తాళవశమె యెట్టి దానికైన"

ఇక రాధికా విరహవర్ణన మంజరి నిసర్గశోభ మిక్కిలి ప్రశంసనీయము !

ఉలుకును వెచ్చనూర్పు
గడునుస్సురనుఁ దలయూచులేచులో
గలగబడుఁ దిగుల్పడును
గాని పను ల్దలపోయు వేసరున్
గళవళమందు గన్గొను
వికావిక నవ్వు భయంబు నొందు గ
న్గొలకుల నీరునించు మఱి
కొంకు దలంకు వడంకునెంతయుఁ.

ఈ విరహవ్యథా బాధతో మనమిక తట్టుకొనఁ జాలము. ఆమెను కృష్ణున కప్పగించి మనమింకొక కావ్యవిమర్శకు గడంగుట మేల్తరమగునని!

పనిలో పనిగ నింకొక్క విషయము. ఈ కావ్య మతిమాత్రమైన మోహశృంగార కావ్యమే. అందు సందేహములేదు – కాని ముద్దుపళని యిందు కనబఱచిన లోకోక్తులు, జాతీయములు, తెలుగు నుడికార సంపద అతిమాత్రమైనది. జాఱువాఱసిండి కెనయగు తెలుగు భాషా సౌభాగ్య మిందు సొంపులు దీరి, సారస్వతమునకే ఇంపు గూర్చినది.

ద్రావిడమున ఆండాళ్ళు రచించిన పాశురము లను ముద్దుపళని యనువదించినది.

అదియు నొక మనోహర దివ్యగీతికా ప్రబంధము.

## వేంకటాచల మాహాత్మ్యము

శ్రీ వేంకటరమణుని ఆత్యంతిక భక్తురాలైన తఱికుండ వేంగమాంబ వేంకటాచల మాహాత్మ్య ప్రబంధమును రచించినది. ఇది కావ్యరీతిని అను సంధింపబడిన క్షేత్రమాహాత్మ్య మనవచ్చును.

తఱికుండ వేంగమాంబ రచించిన రాజయోగ సారద్విపద, యోగవాసిష్ఠమును మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవి. ద్విపదలో భారత భాగవతాదులను కూడ రచించినది. ఇవి కాక పెక్కు యక్షగానములను రచించినది. అందు చాలావఱకు ముద్రణభాగ్యము నందలేదు. ముక్తికాంతావిలాస మనునది ఒకటి ప్రాచీన ముద్రణ పక్కిలో ముద్రణనందిన దని చెప్పుదురు. ఇటీవల విష్ణుపారిజాత యక్షగాన మును ఆంధ్రరచయిత్రుల సలహాసంఘము వారి ఆధ్వర్యమున ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిరి. నిజమున కది యక్షగానమైనను మహారుచిరార్థ ప్రబంధము పోలిక ఇంపు గూర్చు నుత్తమ ప్రబంధము!

వేంకటాచల మాహాత్మ్యమున తిరుమలాధీశుడైన శ్రీమద్వేంకటరమణుని అవతారలీలా కథా కథనము, మహిమా వర్ణనమును ప్రధానవస్తువులు. ఇందలి రచన ఒక్కొకచో నిరుపమోజ్జ్వలమై కాంతిని నించినది. ఒక్కొకచో సామాన్యముగా నున్నది.

"మేఘంబుపై వెల్గు మెఱపు దీగలవలె
దగినబంగరు జన్నిదమ్ము మెఱయ"

గా శ్రీహరి విలసిల్లెనట.

ఘట్టము ననుసరించి యొకానొక చోట స్వభావ రమణీయముగా వర్ణింపబడిన సందర్భము లనేకములు కలవు.

వరాహావతారుడైన శ్రీమహావిష్ణువు భూదేవియందు బద్ధానురాగుడై వైకుంఠమునకు బోనొల్లక భూమి పైననే నిలిచిపోయెను. అయితే తనకు గల్గిన ఆవైకుంఠ విరక్తియు, శ్రీమహాలక్ష్మి యందలి తాత్కాలికమగు నుపేక్షయు వేంగమాంబ చిత్రముగ వర్ణించినది.

వరాహ మూర్తియగు శ్రీమహావిష్ణువు తనకు గల్గిన భూదేవి యందలి వ్యామోహ చాపల్యమును కప్పుకొనుచు గరుడునితో నేమనుచున్నాడో గాంచుడు!

ధరుణి నీటన్ మునిగిన
కారణమున దానినెత్తు కార్యంబున నీ
ఘోరాకారము దాల్చితి
నారూపము చూచి లక్ష్మి నగదె? ఖగేంద్రా!

ఆవైకుంఠ పురమ్మున
కేవిధముగ వత్తు? లక్ష్మి యెకసక్కెముగా
నీవెవడ వంచు నడిగిన
శ్రీవిష్ణం డనగ నాకు సిగ్గగు గరుడా!

తాను సత్తామాత్ర స్వరూపుడై సకల చరాచర ప్రపంచమును సంకల్ప మాత్రమున విచిత్ర చిత్ర రూపమున సృష్టించుచు, సర్వము తానెయై విహరించు చిద్విలాసునకు వరాహావతార ముజ్జగించి స్వవిష్ణురూపమును స్వీకరించుట అలవికాని పనియా? అది యొక లీలా సంవిధానముకాక! ఇట్టి మనోజ్ఞ సంఘటనలతో వెంగమాంబ వేంకటాచల మాహాత్మ్య ప్రబంధమును ప్రకృష్ట కావ్య బంధముగా రూపొందించినది.

విష్ణుపారిజాత యక్షగానము మిక్కిలి రసవత్తరమైన యక్షగాన ప్రబంధము!

సత్యభామా కృష్ణుల సంవాద ఘట్ట మీ కావ్యమున కొక సరసాభరణము!

సత్యభామ శ్రీకృష్ణుని మేలమాడుచు నీవు అసమర్థుడవు! అని ఎత్తిపలుకగా శ్రీకృష్ణుడు తన అద్వయత్వమును స్థాపించుచు చెప్పిన ప్రత్యుత్తరమును గమనింపుడు.

"అద్వయ బ్రహ్మమై నటువంటి నాకును
కులగోత్ర గణమితుల్ కొన్ని గలవె?
వస్త్వంతరము లేనివానికి మానావ
మానబుద్ధులు వేరె కానబడునె?
మొనసి మాయావినై ఘనతరాహంకార
ఖనిని నే గాకుంటె కలదె జగము?
బహురూపి నగుచు దబ్బరలాడి యింద్రజా
లముజేతు నదియె లీలావిభూతి
కలికి నీ వింత భావంబు దెలియలేక
నిందజేసితి వవి మంచి నిక్కమయ్యె
వింతయే మేలు నీచెంత కేను రాను
చాలు నిక పోవె నీప్రేమ! సత్యభామ!

ఇట్టిఘట్టము లీప్రబంధమున నెన్నో కలవు.

యక్షగాన ప్రధాన రచనాంగములైన చూర్ణికలు, కందార్థములు, గొబ్బిళ్లు, ఏలపాటలు, దరువులు, సువ్వాలలు, ధవళ శోభనములు, ద్విపదలు అన్నియు నిండై, కందగలిగి యుండుటచే దండిగలవియై, వెంగమాంబకు కల సంగీత సాహిత్య పరిజ్ఞానమునకు, రచనా కౌశలమునకు సజీవ సాక్ష్యములై యున్నవి.

## సంస్కృత కావ్య ప్రబంధములు

పైన పేర్కొనిన ఆంధ్రకావ్య ప్రబంధములు కాక ఆంధ్ర సీమంతినులై సంస్కృత కావ్య ప్రబంధములను రచించినవారు చాలామంది కలరు.

కాలక్రమానుసారము గమనించిన కంపరాయల పత్ని గంగాదేవి రచించిన మధురావిజయము లోకోత్తర మైనది.

వీరనాయక శ్రేష్ఠుడైన తన ప్రభుని మధురా విజయగాథయే యిందలి కావ్యవస్తువు.

కావ్యనాయకుడును, తన ప్రాణనాయకుడునైన కంపభూపాలుని వసంతదేవ పూజితుడైన సార్వభౌమునిగా వర్ణించిన యొక వర్ణన మందలి సౌందర్య శోభ నొకింత పరికింపుడు —

ఉపహరన్ కుసుమాని మహీరుహాం
కిసలయైః కలితాఞ్జలిబన్ధనః
మధుర కోకిల కూజిత భాషితో
మధు రథైన ముపాసిత మాసదత్ ॥

మహిళా విరచితములైన ప్రాచీన కావ్యప్రబంధముల ప్రసక్తి వచ్చినపుడు, సంస్కృతకావ్యములలో గంగాదేవిచే రచింపబడిన మధురా విజయమును గూర్చి పేర్కొనిన వెనుక విజయనగర సంస్థానమునకు చెందిన తిరుమలాంబచే రచింపబడిన వరదాంబికా పరిణయమును పేర్కొనక తప్పదు.

తరువాత ఏలేశ్వరోపాధ్యాయుల కొమరితయైన నాచిచే రచింపబడిన నాచీవిజయనాటకమును గూర్చి మనము పేరు వినుటయేకాని గ్రంథము కానరాదు.

చెందిన మనుష్యుల యొక్క వివిధ కాలములలోని, వివిధావస్థల యందలి సంఘ జీవనమును పరిశీలించుట. ఇట్టిసంస్కృతికి మానవు డెల్లప్పుడును శిశువే. కావున సంఘము యొక్క ప్రాబల్యము సంపూర్ణముగా కలిగిన ఏ కళా స్వరూపము నందైనను, ఆ జాతియొక్క సంస్కృతి ప్రతిబింబించుటయు తప్పనిసరి యగుచున్నది.

కళాస్వరూపములైన జానపద గాథలయందు ప్రతిఫలించుచున్న ప్రాచీన సంస్కృతి యొక్క స్వరూపమును, సంఘజీవన విధానమును పరిశీలించుట ఆసక్తికరమగు విషయము.

ప్రాఙ్మానవునియొక్క సాంస్కృతిక విషయ వివరణము చేయునది నృశాస్త్రము (Anthropology). కళారూపమగు సాహిత్యము, ప్రాచీన మానవజాతికి చెందిన నృశాస్త్ర విజ్ఞానముతో సంబంధము కలిగి యున్నదన్న సత్యము జానపద గాథలను పరిశీలించినచో స్పష్టమగును.

నిజమునకు నేడు లభించు చున్నంతలో తెలుగు జానపదగేయ గాథల కాలమును నిర్ణయింప బూను కొన్నచో, నేవియు, క్రీ.శ. 12వ శతాబ్ది అవలి కాలమునకు చెందినట్లుగా కానరావు. ఇంత అధునాతనములైన యీ గాథలు అతి ప్రాచీనములగు, ప్రాఙ్మానవుని కథ సాంఘికాంశములను పొందుపరచు కొని యున్నవనుట యెట్లు సమంజసము? అన్న ప్రశ్న కాస్కారము లేకపోలేదు. జానపదగేయ గాథలకు ప్రచారము శ్రీనాథునివంటి పండితుల ఆదరణమున అర్వాచీన కాలమున విద్యావంతులలో కలుగుట నిజమే. అంతమాత్రమున వాని పుట్టుక ఆకాలముననే చెందినదని నిర్ణయించుటకు వీలులేదు. అంతకుముందును పామర జనమధ్యమున నీగాథా ప్రచారము ముమ్మరముగా కలదు. అవి లిపిబద్ధములు కాకాపోవుట చేతను, మౌఖిక ప్రచారము మాత్రమే కలిగిన వగుటను, వానికాలమును ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదు. వీనియందు ప్రస్ఫుటమై జానపదులచే నభిమానింపబడిన కథాంశము, చారిత్రక ప్రాధాన్యము కలదిగా నెల్లయెడల కాన్పింపదు. ఇందలి కథాంశము (Story element) కొన్ని మూనలలో నిమడునట్లుగా నుండును. అట్టి కథాంశముల స్వరూపము, ప్రాక్తన దశయందు ఆదిమ మానవునకు లభించిన, పురాగాథా స్వరూపమే (Myth) యని చెప్పవచ్చును. కావున నా కథాంశము ప్రాచీనమైనదే యని చెప్పుటకు వీలున్నది.

పురాగాథాల స్వరూపము అతిప్రాచీన దశయందు సంక్లిష్టమును, సరళమును కాగా, పరిణామదశయందు చిక్కులతోడను, కల్పనలతోడను కూడుకొన్నదిగా కాన్పించుచున్నది. ఒకజాతి యొక్క నమ్మకములు, ఆచారములు ఆ జాతికి ప్రాచీన కాలమునుండియు పరంపరగా సంక్రమించుచున్న పురాగాథల వలన స్థిరపడును. అనగా నొకజాతి యొక్క పురాగాథల యందు మతవిషయకమగు ప్రాధాన్యమును, పవిత్రతయు నుండుటయేకాక, అవి ఆ జాతికి అనూచానముగ లభించు నమ్మకములకు, నడవడికలకు మూలస్థానములై రూపొందుచున్నవి. అంతమాత్రమున వీనిని సత్యాంశముల సమాహారమని గాని, లేదా, కేవల మభూత కల్పనలగని యని గాని చెప్పుటకు వీలులేదు. ఇవి కొన్ని యెడల సృష్టి పుట్టుకకు సంబంధించిన విషయములను తెలియజేయు గాథలుగను, కొన్నియెడల నాగరిక ప్రపంచమున స్థిరస్థానమును పొందిన పలుమత స్వరూపములయొక్క మౌలిక బీజములను సంతరించుకొన్న కథలుగను కాన్పించుచున్నవి. వీనియందు, అభిమానవాంశము యొక్క స్పష్టీకరణ, విశ్వోద్భవము, చరాచర వస్తుసంచయ నిర్మాణ క్రమము, మానవజననము, మతాచారవిధులు మొదలగున విన్నియు స్పష్టాస్పష్టముగ కాన్పించుచునే యుండును. కావున వీనిని ప్రాఙ్మానవునియొక్క కుతూహల పూర్ణములగు నాలోచనల యొక్క కల్పనాత్మక స్వరూపముగా నిర్ణయింపవచ్చును. అవి మనుష్యుని యాలోచనల కధీనములుగా రూపునొంది సృష్టికి ప్రతిసృష్టి యనదగినవిగా నున్నవి. వీనియందు ప్రతిబింబితమైన భూతకాలపు స్థితిగతులను గ్రహించుటవలన, నొక

జాతి తానాచరించు చున్న మత ప్రధాన కర్మకాండను (Ritual), తానవలంబించుచున్న నైతిక విధానము (Moral Action) సమర్థించుకొని, వానిని క్రమము తప్పకుండ పాటించుట కలవాటు పడును.

పురాగాథలలో నున్నవిగా, పైన పేర్కొనిన యంశములన్నియు జానపదగేయ గాథలయందు ప్రబలముగా కన్పట్టుచునే యున్నవి. అంతేకాక, గేయగాథలు చేపట్టిన వంశకర్తల కథనము, వీరారాధన, మాతృపూజ, దైవారాధన, జంతు ప్రాధాన్యము, మంత్ర తంత్రముల ప్రాబల్యము వంటి యనేకాంశములలో నీ పురాగాథాంశము (Mythical Element) చొరబారి, గేయగాథలను ప్రాచీన దశా వైభవ సముపేతములగు కళాఖండములుగా తీర్చి దిద్దుచున్నది. ఇట్లు జానపదగేయ గాథలయందు సంస్కృతి, సంఘస్వరూపము, మతము వంటి యంశములతో పరిపుష్టమైన నృశాస్త్ర విజ్ఞానము పలుముఖముల ప్రతిభాసించుచున్నది. అందు నిగూఢముగా నున్న పురాశాస్త్ర విజ్ఞాన గ్రహణమునకై, విమర్శకులును, పరిశోధనా చక్షువులు నైనవారు జానపదగేయ గాథలను పరీక్షింప వలసిన అగత్యము కలదు. పదకవితలనియు, పామర జన మల్లుకొను కల్లబొల్లి గాథలనియు, భాషాసౌష్ఠవము లేని తప్పుల కుప్పలనియు వీనిని చిన్నచూపు చూచుటకంటె అట్టి దోషములను సహృదయతతో నొప్పరికించుట పండితలోకము యొక్క హృదయ వైశాల్యమును చాటును. నృశాస్త్ర (Anthropology) సాంఘిక శాస్త్ర (Sociology) నరవర్గ (Ethnography) నరజాతి (Ethnology) శాస్త్ర, పురాశాస్త్ర (Mythology) విజ్ఞానముల వైపు వెలుగు బాటలను పరచు జానపద గాథా పరిశీలనము జిజ్ఞాసువుల కవశ్య కర్తవ్యము.

శ్రీ చాట్ల కొండయ్యా | ఆశీస్సులు

శ్రీ ధరాలింగమందు వేంచేసి యోగ
నిద్ర గూరిన పతి జూచి నెమ్మిమీర,
విసము మెసవంగ బర్విడు వితముకంటె
నిదియ మేలను దేవి నీ కిచ్చు శుభము.

వలయము ధాత్రీ చక్రము,
వలయము గగనమ్ము, రవియు వలయమ్మెయగుఁ,
వలయము సంసారమ్మౌ
వలయమె నీ యింటి పేర వర్ధిల్లు జుమీ.

పత్ర వ్యాపారము సుచ
రిత్రమగుఁ నీకు, మాకొ, లేఖనమే తా
పత్రయ మగు, నివ్విధిని, ప
విత్రాన్యోన్యానుబంధ విభవుల మయ్యా !

క్షామము కాగితమ్మునకు సంభవమాయె గణేశ వ్రాతకుఁ
రీములు గోరి రోయుచు జరిత్రకై మూషికరాజు లెల్లెడఁ
భూమిని, పత్రవర్తక విభుండవు నీవనియెంచి నీదుగో
దాముల కేకదంతుని ముదంబున దెత్తురటే కనుంగొనఁ.

నీవు నిశ్చలుడవును వినీతుడవును
సర్వమీశ్వరార్పణముగ, సర్వమీశ్వ
రాజ్ఞగా వర్తనముసేయు విజ్ఞుడవును,
నీకు గలుగును గావుత నిత్యసుఖము.

పరమేశ్వరి, శ్రీ కన్యా
పరమేశ్వరి, సర్వలోక పరమానందే
శ్వరి గోలి యీశ్వరయ్యకు
చిరాయు రారోగ్య భాగ్యసిద్ధి నొసగుతఁ.

డా. జి. వి. కృష్ణారావు

# ప్రాసలు - అనుప్రాసలు

నిరుపాదాన సంభార
మభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రమ్ నమ స్తస్మై
కలాశ్లాఘ్యాయ శూలినే.

అమరీ కబరీ భార
భ్రమరీ ముఖరీకృతమ్
దూరీకరోతు దురితమ్
గౌరీచరణ పంకజమ్.

ఇందుగల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి! వింటే.

ఈ పద్యాల వినికిలోనితేడాలు ప్రతిచెవికీ ప్రస్ఫుటమే. మొదటిదానిశ్రుతిలో విశేషంలేదు. మలిదానిలో రేఫము, తుదిదానిలో బిందుపూర్వక దకారము విశేషంగా వినిపిస్తున్నవి. అయితే మలిది అనుప్రాసమనీ, కడపటిది ప్రాసమనీ పెద్ద లంటారు.

రెండింటనూ వినిపిస్తున్నది బహుతరమైన వర్ణావృత్తే; ఒకటి అనుప్రాసం అనీ మరొకటి ప్రాసం అనీ ఎందుకంటున్నారు? ఈ ప్రాసాను ప్రాసలకు నిజంగా తేడా ఉన్నదా? ఉంటే అది ఎలా ఏర్పడుతున్నది?

ఈ ప్రశ్నలకు సమాధానం శబ్దాలంకార పరిశీలనతో కాని లంభించదు.

అలంకారం రెండు విధాలు. ఒకటి శాబ్దికం, రెండు ఆర్థికం. ఈ రెంటికీమూలం 'వైచిత్రి', లేదా సొగసు. ఈ వైచిత్రి లేక ఏ అలంకారమూ లేదు.

శబ్దాలంకారాన్ని ప్రాచీనులు తిరిగి రెండుగా విభజించారు. ఒకటి యమకం; రెండవది అనుప్రాసం. యౌగికార్థాలను ఆవల ఉంచి యమకం అంటే ఏమో చూదాము.

'అవ్యపేత వ్యపేతాత్మా
వ్యావృత్తి ర్వర్ణ సంహతేః
యమకం తచ్చ పాదానా
మాది మధ్యాంత గోచరమ్.'

అని దండి,

'పద మనేకార్థ మక్షరంచావృత్తం స్థాననియమే యమకమ్' అని వామనుడు,

'అర్థేసతి అర్థభిన్నానాం వర్ణానాం సా పునః శ్రుతిః యమకమ్' అని మమ్మటుడు,

'స్వర వ్యంజన సముదాయ పౌనరుక్త్యం యమకమ్' అని రుయ్యకుడు నిర్వచిస్తున్నారు.

ఈ ఆచార్యుల తాత్పర్యం ఇలా సంగ్రహించుకోవచ్చు:- (1) పదంకాని, అక్షరంకాని అనేకార్థం కావలె (2) అది ఆవృత్తంకావలె (3) అందును భిన్నార్థంలో (4) ఈ ఆవృత్తి శ్రుతిగోచరం కావలె. అది స్థాననియమ మున్నపుడే సాధ్యం.

కాలుగాలును కేలును గేలు మోవి
మోవియును దాల్చి భోగి సమూహ మమరె.

ఈ పాదాలలో పదావృత్తి ఉన్నా అర్థభేదం లేదు కనుక యమకం లేదు.

"నీవారము నీవిచ్చితి
నీ వారము గావు తండ్రి, "

"కురువీర! వసింపగనీ
కురు వీర,"

అన్నవి యమకానికి లక్ష్యాలు. యమకంలో ఎన్నో భేదాలు ఉన్నవి. అయితే

'దేవు డాతడు కుడిలిని దేవు నితడు'

ఇలాంటి వెక్కిరింతలకు, సరసాలకు, అధిక్షేపాలకు వినియోగపడినా, కరుణంలోను, విప్రలంభంలోను సాధారణంగా పనికిరాదు. అరణ్యానికి వెళ్ళిపోయిన శ్రీరామునిగూర్చి

కానక కన్న సంతానంబు గావున
కానక కన్న సంతాన మయ్యె

అంటూ దశరథుడు శోకించినట్లు అయ్యలరాజువారు అభివర్ణించారు. ఈ పాదం కొంత నయం. తరిమ్మాపాదాలు మరీ అన్యాయం అందుకనే ఈ కవిగారి దశరథుడు నిఘంటువు చూచి యేడుస్తున్నాడని కట్టమంచివా రన్నారు.

మొత్తము మీద కోశ మపేక్షించని సుబోధపదంతో నిర్వహింపబడిన యమకం రుచించినంతగా అన్యం రుచించదు.

రాజనందన రాజరాజాత్మజులు సాటి
తలప నల్లయ వేమ ధరణిపతికి

అన్న పద్యం కంటె

పారు జూచిన రిపుసేన పార జూచు
వింటి కొరగిన రిపురాజు వింటి కొరగు

అన్నపాదాలు హాయిగొల్పవా?

యమకంలో ఉన్న ఈ గుణావగుణాలను గ్రహించే

'ఆవృత్తిం వర్ణసంఘాత
గోచరాం యమకం విదుః
తత్తు నైకాంత మధుర
మతః పశ్చా ద్వివిధీయతే.

అని ఆచార్యదండి అన్నాడు.

ఇంత అనుప్రాస తత్వం చూచాము.

"వర్ణావృత్తి రనుప్రాసః పాదేషుచ పదేషుచ
పూర్వానుభవబోధినీ యద్యమాంతా"

అని కావ్యాదర్శమూ,

'వర్ణసామ్య మనుప్రాసః'

అని కావ్యప్రకాశమూ,

'వ్యంజన మాత్ర వానురుక్త్యమ్'

అని అలంకార సర్వస్వమూ పేర్కొంటున్నవి.

సంగ్రహంగా దీని తాత్పర్యం ఇది (1) వర్ణావృత్తి ఉండవలె (2) ఆవృత్తమగునది వ్యంజనం కావలె (3) ఆవృత్త వ్యంజనం ఏకైక పదగతం కారాదు (4) ఆ వృత్తిలో స్వరవైషమ్యం ఉన్నా పట్టింపు లేదు. (5) ఆ ఆవృత్తి అవ్యవహితం కారాదు. (6) ఇలాంటి ఆవృత్తి పూర్వానుభవ బోధినియై చమత్కారకారి కావలె.

'అడుగుడైన బ్రహ్మ' అన్నప్పుడు వర్ణావృత్తి లేదు కనుక ఇది అనుప్రాసకు లక్ష్యం కాదు.

ఘుమఘుమధ్వాన నింగి దాటించె బలుమూలు
సిరాళ్ళ గొంది కన్నీయ మెఱుంగు

అన్న పాదంలోని ఘుమఘుమధ్వాన అన్న పదంలో ఘకార ఆవృత్తి ఉన్నది. అలాగే హాలాహలము, కోలాహలము, లలవాలము అన్న పదాలలో లకారావృత్తి ఉన్నది. అయినా ఇవి అనుప్రాసానికి విషయాలు కావు. ఈ ఆవృత్తి శబ్దసిద్ధమేకాని కవి కల్పనా సిద్ధంకాదు.

అల వలలు మరి
ఇరులు

అన్నప్పుడు స్వరావృత్తి మాత్రమే కనుక అనుప్రాసం కాదు.

'గాండీవ గుణరవం బొంహొంగా చెలగంగ' అన్నప్పుడు ఆవృత్త దకారంలో స్వరభేదం ఉన్నా

అనుప్రాసం ఒనరిల్లటంలేదు. "గోపాలక చక్ర వర్తిఁ గొనిరానైతిన్" అన్నప్పుడు గకారావృత్తి లేక పోలేదు. అయినా ఇట్టిది వ్యవహితత్వంవల్ల అనుప్రాసం కాకపోతున్నది.

జలధివీచీ వాత్యఁ జేలిదాకెగా యని
అక్కున నందంద యలమి యలమి

చమత్కారం లేదుకదుక ఈపాదంలోని 'అందంద' 'అలమియలమి' అన్నవి అనుప్రాసకు లక్ష్యాలుకావు.

ఆలంకారికులు ఈ అనుప్రాసలో అయిదు భేదాలను చెప్పుకొన్నారు. (1) ఛేకము (2) వృత్తి (3) శ్రుతి (4) లాటము (5) అంత్యము.

ఛేకానుప్రాస లక్షణాన్ని
'సోఽనేకస్య సకృత్పూర్వః'

అని కావ్యప్రకాశమూ

'ఛేకో వ్యంజన సంఘస్య సకృత్సామ్యమనేకధా' అని సాహిత్యదర్పణమూ పేర్కొంటున్నవి.

అంటే అనేక వ్యంజనాలు ఒకసారి ఆవృత్తి పొందినపుడు ఛేక మౌతుంది.

గనయంబున్ గొనయంబు
నెన్నడుముతో గర్ణావతంసంబుతో
చనుదోయిం గనుదోయి
సాయకముతో సంధానహస్తంబుతో

చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
స్తబక పంక్తులతోడ సరసమాడి

ఇందు 'గనయంబు. గొనయంబు' "సంఫుల్ల మల్లిక' అన్నవి లక్ష్యాలు. స్వల్పమైన స్వరం మార్పుతో కూడిన ఈ వ్యంజనావృత్తి మరింత రంజకంగా ఉంటుంది.

మును చేసిన వైరంబును
ముని చేసిన వైరము

అన్న దానిని దృష్టాంతంగా తీసుకోవచ్చు అలాగే పూర్వపదంగాని తదంశంకాని, ఉత్తర పదంలో భాగంగా ఆవృత్తమైనప్పుడు చక్కని వైచిత్రి ఏర్పడుతుంది.

గంగాసంగమ మిచ్చగించునె
మదిన్ కావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే?

తిమ్మారెడ్డికి సరియె త
తిమ్మా రెండ్లెందరేని?

అన్నవి ఇచట ఉదాహరించ వచ్చును.

ఛేకానుప్రాసంనుంచి వేరుచేస్తూ 'ఏకస్యా ప్యసకృత్పరః' అని మమ్మటుడూ,

అనేకస్యైకథా సామ్య మసకృద్వా ప్యనేకధా
ఏకస్య సకృదప్యేష వృత్త్యనుప్రాస ఉచ్యతే

అని విశ్వనాథ కవిరాజూ వృత్త్యనుప్రాసాన్ని నిర్వచిస్తున్నారు.

అంటే అనేక వ్యంజనాలకు స్వరూపంతో ఏక వారావృత్తికాని అనేకవారావృత్తికాని, అనేక వ్యంజనాలకు అనేకధా అసకృత్సామ్యంగాని, ఏక వ్యంజనానికి సకృత్సామ్యంగాని. అసకృత్సామ్యం గాని వృత్త్యనుప్రాసం.

వీనికి క్రమంగా—

కరమున నిమిరెన్ రాకాసుధాకరు కరములట్లు

హరిదంత ద్విపదంత కుంత
శిఖరాహంకార నిశ్చింత ని
ర్జరరాజార్జిత వజ్ర
జర్జరితము,

ఆశావకాశంబులన్ అన్నవీ,

దూరాన నారాజు కేరాయి డానో
ఈరోజు నారాత లే రాలపాలో

అన్నవీ లక్ష్యాలు.

ఈ వృత్త్యనుప్రాసం వెర్రితలలు వేసినప్పుడు ఏకాక్షరాది పద్యాలుగా రూపొందుతవి. ఇలాంటివి పాండిత్యపు మూలుగులే కాని కచ్చపీ మూర్ఛనలు కావు.

పూర్వస్వరంతోగూడ వ్యంజనం యథాతథంగా పద్యాంతమునగాని పాదాంతమునగాని ఆవృత్తమైతే అంత్యానుప్రాసమని విశ్వనాథ కవిరాజు నిరుక్తి. అంత్యాక్షరానికి పూర్వాక్షరం మాత్రా నియతికమైనా సరిపోతుంది.

జగదవన వినోదా సత్యజాత ప్రమోదా

జయజయ కల్పిత సాగరతాపా
జయజయ ఖండిత శంకర చాపా

హత విమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ !

చిన్నారి కళ్ళలో కన్నీటి జల్లు
కన్నీరు చూపకే కరగు నెదదల్లు

అన్నవి లక్ష్యాలు. కాని

తడియొత్తు చీరతో దాదికౌగిట జేర్చి
చూపంగ కన్నార జూడనైతి
తడవియాడకమున్న తట్టాడుమని పట్టి
నడకంగ సెజ్జపై వ్రాల్పనైతి

అన్న పాదాలతో అంత్యప్రాస ఉన్నదని భ్రాంతి పడరాదు.

'తాత్పర్య భేదవత్తు లాటాను ప్రాసః' అని సర్వస్వం లక్షణం చెబుతున్నది — దీనికి, 'కమలాక్షు నర్చించు కరములు కరములు' అన్నది లక్ష్యము వేరుగా విశదీకరింప నక్కరలేదు. దిఙ్మాత్రంగా ఇదీ శబ్దాలంకార స్వరూపం.

ఇంక ప్రాసస్వరూపం చూదాము. పాద ద్వితీయాక్షరం ప్రాస. పాదాదిని గురు లఘువులలో ఏది ఉంటే దానినే తక్కిన పాదాదులందు నిలుపవలసి ఉంటుంది. ప్రాసాక్షరములో స్వరభేదం ఉండవచ్చునుగాని వ్యంజన వైషమ్యం తగదు. ప్రాసాక్షరానికి ముందు బిందువుగాని విసర్గగాని ఉంటే అదికూడ ఆవృత్తం కావలె. దీనిని సమప్రాసమంటారు. ఇదికాక సంయుతాసంయుత ప్రాసం, వికల్పప్రాసం, ఉభయప్రాసం, (నఖ) ప్రాసమైత్రిప్రాసం, స్వవర్గజప్రాసం, ఋప్రాసము, అభేదప్రాసం, సంధిగతప్రాసం అన్నవానిని గూడ ఛాందసీయులు పేర్కొన్నారు.

ఈప్రాస ప్రపంచాన్ని సుకరము, దుష్కరము, ద్వ్యక్షరము, త్ర్యక్షరము, చతురక్షరము, అంత్యప్రాసము, అనుప్రాసము అని తెలుగు లాక్షణికులు విభజించారు. వీటిని శబ్దాలంకార విశేషాలుగా అనంతుడు అప్పకవి పేర్కొన్నారు.

ఇప్పుడు ప్రాసానుప్రాసల తత్త్వమూ, పరస్పర సంబంధమూ పరిశీలించవచ్చును.

శబ్దాలంకారమైన యమకంగాని, అనుప్రాసంగాని నాతివ్యవహితం. అంతకు మించిన విపరీత నియతిలేదు. కనుక యమకమూ అనుప్రాసమూ ప్రాసం కావటానికి ఎట్టి నిరోధమూ కలుగదు.

లేమా ! దనుజుల గెలువగ లేమా ?
నాపాలి పారిజాతము
గోపాలక చక్రవర్తి గొనిరానైతిన్"

ఇలాటి పద్యాలు కోకొల్లలు లక్ష్యంగా ఉదాహరించవచ్చు.

మరి తెలుగుఛంధఃకర్తలు ప్రాసంగా పేర్కొంటున్నదంతా అనుప్రాసం అవుతుందా? అప్పకవీయం పేర్కొంటున్న సంయుతాసంయుత ప్రాసం, వికల్పప్రాసం, ప్రాసమైత్రి ప్రాసం, స్వవర్గజ ప్రాసం, అభేదప్రాసం వంటివి తక్క తక్కిన ప్రాసలన్నీ అనుప్రాసా లవుతవి. అయితే దీర్ఘవృత్తపాదాలలోనైతె సువ్యవహితం కారాదు. దీర్ఘవృత్తాలలో గూడ ఏపాదానికి ఆ పాదం తెగినా, లేక మహాప్రాణమో, అకోమలాక్షర సంయోగమో ప్రాసాక్షరంగా నిలిచినా ఆప్రాసం అనుప్రాసం అవుతుంది.

అభంగవృత్తితో నిర్వహింపబడుతున్న ప్రాసం పద్యం సగంలో కాని, ఏకపాదంలోకాని సభంగమైతే అనుప్రాసంకాదు. దీనికి భారతంలోని 'ధృతరాష్ట్రుండును' అన్న పద్యంలో కడపటి పాదమైన

'కాన తగం బొందుట కార్య మీ యుభయమున్ సంతుష్టిమై నునిక్కిన్" అన్నది దృష్టాంతం. వాస్తవానికి ఈవ్యత్యాసాలు పరిహృతమైతే ప్రాసం అనుప్రాసం అవుతుంది.

అయితే కొందరు విద్వాంసులు ఇలా వితర్కిస్తున్నారు. అనుప్రాసం శబ్దాలంకారం. ఇది గద్య పద్యోభయ సామాన్యం. ప్రాసం ఛందోలంకారం. ఇది పద్యంలోనే ఉండతగినది. అందువల్ల ప్రాసము ప్రాసమే, అనుప్రాసం అనుప్రాసమే అని భావిస్తున్నారు. కాని వీరు గద్యభేదం విస్మరిస్తున్నారు గద్యభేదాలలో వృత్తగంధి ఒకటి. దీనిలో పద్య పాదాలు ఉంటవి. వీటితో ప్రాసకూడ గద్యంలో ప్రవేశించక తప్పదు. కనుక ప్రాసం పద్యైకవర్తి అన్నవాదం యుక్తిసహం కాదు. అనుభవసిద్ధం అంతకంటెను కాదు.

ఈ సందర్భాన మరొక యుక్తివి గూడ పరిశీలించవలసి యున్నది, అనుప్రాసం శబ్దాలంకారమై ప్రాస ఛందోలంకారమై భిన్నా లవుతున్నప్పుడు వాటి సొగసులుగూడ భిన్నాలు కావాలి. మరి యీ భిన్నత గోచరిస్తున్నదా? ప్రాసానుప్రాసాలు కలిసి ఉన్న పద్యమే తీసికొందాము.

> అట చని కాంచె భూమిసురు
> డంబరచుంబి శిరస్సర జ్ఝరీ
> పటల ముహుర్ముహు ర్లుఠ
> దభంగ తరంగ మృదంగ నిస్వన
> స్ఫుట నటనానురూప పరి
> ఫుల్ల కలాప కలాపి జాలముఁ
> కటక చర త్కరేణుకర
> కంపిత సాలము శీతశైలముఁ.

ఈ పద్యంలో ప్రాస మున్నది. అనుప్రాసమూ ఉన్నది. రెండూ వేరువేరు సొగసులను విరజిమ్ముతున్నవా! లేదు. ప్రాస, అనుప్రాసంలో లీనమై అనుప్రాస సౌందర్యానికి సహకారి అవుతున్నది.

మరొక పద్యం చూదాము.

> సాగరసార వారిరుహ
> శౌక్తిక మౌక్తిక విద్రుమద్రుమై
> లాగురు చందనంబులు
> ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
> శ్రీగుణయుక్తమై పరగు
> సింహళ కేరళ చోళ పాండ్య దే
> శాగత రాజపుత్రులు
> మహాగుణశాలి కజాత వైరికిన్.

ఇందులోని అనుప్రాసం ముందు ప్రాసం వెలవెల పోతున్నదే కాని ప్రత్యేకమైన సొగసును వెలార్చటం లేదు.

కనుక అనంతాదులు పేర్కొంటున్నట్లు ప్రాసలు శబ్దాలంకారాలేకాని విభిన్నాలు కావు. అయితే పద్యరచనా సౌందర్య మారాధించేవారు ఛాందసీయులు పేర్కొన్న విపరీత ప్రాసలను పరిహరించవలసి ఉంటుంది.

శ్రీ ముదిగొండ
వీరభద్రమూర్తి

# ఐదు రత్నాలు

శ్రీ మాధుర్యవిహారనందనము లై శృంగారసారమ్ము లై
ప్రేమస్విన్నము లై పరస్పరతనూ శ్రీగంధలేపమ్ము లై
కామాటమ్మును బెంచు శంకరశివా కాటాక్షవీక్షల్ సతం
బోముఁగావుత మీశ్వరయ్యను శుభంయుఁ గోలివంశాగ్రణిఁ.

తనికమొ తద్దయో యతని దానము చెందని ధర్మకార్యముల్
కనుపడ వల్పహాస మధికమ్ము ఫల మ్మొనగూర్చు కాదులే
దనుపలుకుల్ తదీయరసనాగ్రము నంతగ నంట వీశ్వర
య్యను గొనియాడుటల్ సహజ మై తగు వైశ్యకులావతంసముఁ.

లెక్క లేని యోగి యొక్కపు డాగును
లెక్కగలది యోగ కొక్క తీరు
సాగును గుణుతించె నీ గుట్టు నీశ్వర
య్యకర ముద్దుబాస నగును 'నరము'.

అగుపడు నెంతయో పయికి నంతకు లోన దనర్చు రెండురె
ట్లు, గడనసేత న్యాయపువిదూరజరత్నమునందు మధ్య గీ
త, గినియ డాచియాచి మృదుతల్ దగ తూచియుతూచి పల్కు నం
చు గణనకెక్కు వేనిని గనుంగొన నీశ్వరయాఖ్య తోచెడిఁ.

చేయగవద్దు స్నేహమును చేసినచో నిటువంటివారితో
నే యనిపించు వారు గణనీయులు వ్రేళులమీద, వారిలో
నాయన యొక్క డీశ్వరయ, యాయన కాయనపేరిదైవమే
యీయవలెఁ సిరిఁ సుకవు లేయవలెం బరిసెఁ దరిద్రతఁ.

డా. అక్కిరాజు రమాపతిరావు

# తెలుగు కథ - వాస్తవికత

తెలుగు కథ పుట్టి ఇంకా అరవై ఏళ్ళన్నా కాలేదు. అంటే అంతకు పూర్వం మనకు కథాసాహిత్యమే లేదనికాదు. ఈ కథానిక ప్రకియ ఆధునికమైన దృష్టితోచూస్తే ఖండకావ్యం, నవల, నాటిక, పత్రికా వ్యాసం, సాహిత్య విమర్శలలాగా, చాలా ఇటీవలగా పుట్టిందనీ, ఇంగ్లీషు సాహిత్య ప్రభావంవల్లనే ఆదునిక ప్రక్రియ లన్నిటిలాగా, పరిపుష్టి చెందుతూ వచ్చిందని తెలుసుకోవచ్చు. సంస్కృత సాహిత్యంలో కథా సరిత్సాగరం, దశకుమార చరిత్రం మొదలైన కథాసాహిత్యం ఉన్నది కాని, ప్రపంచ భాషల్లో ఇప్పుడు ప్రాచుర్యం పొందినకథ శిల్పవిన్నాణానికి, సంస్కృతంలోని ఆపాతకథలకు పోలికలు లేవు. అయితే కథానిక ప్రక్రియ భారతీయులకు కొత్త కాదనీ, పంచతంత్రం కథలు మొదలైనవాటిలో కథానికా శిల్పం నిక్షిప్తంగా లేకపోలేదనీ చెప్పుకోవచ్చు.

ఏది ఏమైనా ఇప్పుడు చిన్నకథ, కథ, కథానిక అన్నపేర్లతో వ్యవహృతమవుతున్న సాహిత్య ప్రకియను, ఆధునికమైన దృష్టితో విశ్లేషించి చూసినప్పుడు, ఇంగ్లీషు ప్రభావమే దానిపైన ఎక్కువ అని, పాశ్చాత్యదేశాల్లో ఈ ప్రక్రియా సంబంధులుగా విలసిల్లిన, విలసిల్లుతున్న, శిల్పవిన్నాణాలూ, ప్రయోగాలూ, రూపురేఖావిలాసాలూ, అన్నీకూడా, దేశీయ భాషల్లోని కథమీద తమ ప్రభావాన్నిచూపుతూనే ఉన్నాయనీ స్పష్టపడుతున్నది. పారిశ్రామిక యుగ ప్రభావము, యాంత్రిక నాగరికత, ప్రపంచ భాషల్లో, సాహిత్యప్రక్రియల్లో కథానిక స్థానాన్ని ప్రముఖం చేశాయి. ప్రపంచ వ్యాప్తంగా చూసినా, ఆధునిక నాగరక భాషల నన్నిటినీ పరిశీలించినా, చిన్నకథకున్న ప్రాచుర్యం, మరే ఇతర ప్రక్రియకూ లేదేమో నని అనిపిస్తున్నది. గడచిన శతాబ్దాలలో మాదిరిగా కాకుండా మానవుడి కిప్పుడు విశ్రాంతి జీవనము, స్వేచ్ఛ, వైయక్తిక స్వాతంత్ర్యం, పరిమితమైపోతున్నాయి. సాహిత్యము, లలితకళలు మొదలైనవి మానవజీవితాన్ని అనుశాసనంచేసే పద్ధతుల్లోను, ప్రభావితంచేసే తీరుతెన్నుల్లోనుకూడా మార్పులు వచ్చాయి. మానసికమైన ఉల్లాసాన్ని కలిగించేందుకు ఆధునిక నాగరకతలో వినోద సాధనా లనేకం పుట్టాయి. సినిమా, సర్కస్, రేడియో, టెలివిజన్, వార్తాపత్రికలు మొదలైన వాటి నెన్నిటినో ఇవాల్టి మానవుడు ఆశ్రయించవచ్చు. అందువల్ల మానసికోద్వేగంనుండి విశ్రాంతిని కోరుకునేవ్యక్తి సాహిత్యాభిరుచి కలవాడైతే, ఆసాహిత్యానందాన్నికూడా అతడు వీలైనంత తక్కువ వ్యవధానంలో పొందాలనే వాంఛిస్తున్నాడు. అందువల్లమహాకావ్యాలను, బృహద్గ్రంథాలను చదివే ఓపిక, ఆసక్తికూడా తగ్గిపోతున్నది. తనకు లభించే విరామమే తక్కువ. ఆవిరామంలోకూడా, యంత్రయుగంతాలూకు ఉద్వేగప్రవృత్తి, సంచలనము మనస్సుని అంటుకొనే ఉంటాయి. ఎక్కడనో ప్రయాణం చేస్తునో, లేక ఏ నిరీక్షణల మధ్య ఇంచుకంత విరామాన్ని సృష్టించుకొనో, ఏదైనా చదువుకొని కాలక్షేపం చేసేవాళ్ళకు కథానికకన్నా చేరువయ్యే సాహిత్యప్రక్రియ ఇంకొకటి ఉండదు. అందుకని ఆకథకూడా యాంత్రిక నాగరికతతో, సంచలన శీలమైన ప్రాపంచిక ప్రవృత్తితో మారిపోతూ రోజురోజుకు కొత్తకొత్త శిల్పాలను ఆశ్రయిస్తున్నది. కొత్తరూపురేఖలను ఏర్పరచుకొంటున్నది. పాశ్చాత్య దేశాల్లో పుట్టిన చిన్న కథ నూరు నూటయాభై సంవత్సరాలనుంచీ, ఆకృతిని

దిద్దుకొంటూ వస్తున్నది కాబట్టి, ఒక లక్షణాన్ని రూపించుకొన్నదని చెప్పవచ్చునేమోగాని, తెలుగులో మాత్రం అరవై సంవత్సరాలన్నా నిండని ఈ ఆధునిక ప్రక్రియ ఇంతవరకూ ఒకనిర్దిష్టమైన ఆకృతిని ధరించలేదనే చెప్పాలి. అంటే తెలుగులో చిన్న కథకు, స్పష్టమైన లక్షణాన్ని నిరూపించడం కష్టమని దీని అర్థం.

ఆధునికమైన రూపురేఖలను దృష్టిలో పెట్టుకొని చూసినప్పుడు ఇప్పుడు చిన్నకథగా చెలామణి అవుతున్న దానిపూర్వరూపము 1912లో మొట్టమొదటి సారిగా వెలుగు చూసినట్లు సాహిత్యవిమర్శకులు నిర్ధరించారు. 1912లో బందరునుంచి వెలువడుతూ వచ్చిన ఆంధ్రభారతి అన్నపత్రికలో ఆధునికమైన రూపురేఖలతో ఆకథ వెలువడ్డది. భారతీయ భాషలలో మొట్టమొదట కథానిక వంగభాషలో వెలువడింది. అయితే ఆకథ వాస్తవానికి పంచతంత్రం కథలనే పోలిఉన్నది. ఒంటె, తోడేలు, ఎలుగుబంటి, గాడిద మొదలైన జంతువులన్నీ సృష్టికర్త వద్దకు పోయి, తమతమ అంగనిర్మాణ వైఖరిలోని లోటుపాట్లను విన్నవించుకొని పరితాపం పొందినట్లూ, ఆయాజంతువులన్నీ తమకు ఏయే అవయవాలు, ఎట్లెట్లా ఉండాలో కోరుకొన్నట్లూ, ఒకదానికి మిక్కిలి ప్రయోజనకరంగా కనిపించింది మరొక దానికి ఏవిధంగా బాధక హేతువైందో అవి తమంతతాముగా విన్నివించుకొన్న మాటల్లోనేబోధపడి, మరిమాట్లాడకుండా వెళ్ళిపోయినట్లూ, ఆ కథ కల్పించబడింది. అయితే వస్తువు పాతదే అయినప్పటికి, సంవిధానము కొత్తగా రూపించడంతో దానిని చిన్నకథగా వేత్తలు గుర్తించడం జరిగింది. ఆధునికమైన విలువలతోరూపురేఖలతో, తెలుగులో మొదటికథ గురజాడ అప్పారావుగారే వ్రాశారని విమర్శకులు స్థిరీకరించారు. 1914వ సంవత్సర ప్రాంతంలోనే తణుకునుంచి ఒక కథల సంపుటి మదరాసుకథలనే పేరుతో వెలువడినట్లుగా శివశంకర స్వామి వ్రాశారు. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు సంపాదకత్వం వహించిన త్రిలింగ పత్రికలోకూడా కథలను ప్రోత్సహించినట్లుగా తెలుస్తున్నది. అటుతరువాత సంవత్సరం ప్రత్యేకంగా కథలతోనే, కథలకే ప్రాధాన్యం ఇస్తూ ఒక మాస పత్రికను నిర్వహించాలన్న ప్రయత్నంకూడా జరిగింది కాని ఆ ప్రయత్నం నెరవేరలేదు. 1920వ సంవత్సరంలో సాహితీ సమితివారు సాహితిమాస పత్రికను స్థాపించినతరవాత తెలుగులో కథకు మంచి ప్రోత్సాహం లభించింది. 1922లో బందరు నుంచి శారద, 1923లో మదరాసునుంచి కళ, 1924లో మద్రాసునుంచే భారతి, 1926లో గుంటూరునుంచి సఖి మొదలై సాహిత్య మాస పత్రికలు బయలుదేరడంతో చిన్నకథ బాగా రూపురేఖలు దిద్దుకొంది. తొలిరోజుల్లో వచ్చిన చాలా కథల్లో, ఇతివృత్తంకాని, రచనావిన్యాసంకాని నవీనమైన ధోరణి నాశ్రయించలేదు. చారిత్రక, పురాణ, ఇతివృత్తాలను వచనంలో సంక్షేపంగాచెప్పి వాటిని కథలుగా సాధించడంకూడా కనపడుతుంది. వచనంలో చెప్పడము, సంక్షిప్తత మాత్రమే కథానిక ముఖ్యలక్షణాలుగా తొలిదశలో రచయితలు భావించినట్లుగా కనపడుతుంది. అందరూ వ్యావహారిక భాషలోనే రచిస్తున్నామని చెప్పినా, ఆభాషవ్యవహారానికి చేరువగా ఉన్నదని మాత్రమే చెప్పవచ్చునుగాని, పూర్తిగా వ్యావహారిక మనటానికి వీలులేదు

గురజాడఅప్పారావుగారు సంఘ సంస్కర్తలను గూర్చి, సమకాలీన సాంఘిక స్థితిగతులనుగూర్చి నాలుగైదు కథలు వ్రాశారు. మీపేరేమిటి, దిద్దుబాటు, సంస్కర్తహృదయం మొదలైనకథలు శిల్పదృష్ట్యా చూసినా నేటికీ మంచికథలుగానే నిలిచిపోతాయి. అయితే భాషమాత్రం ఇప్పటి దృష్టికి బాగా పాతగానే కనపడుతుంది. అటుతరువాత సాహితీ సమితి సభ్యులందరూకూడా, కథానికను సాహిత్యప్రక్రియగా శిల్పసమన్వితమైన దృష్టితో దిద్దితీర్చినవాళ్ళే. చింతాదీక్షితులు, నోరి నరసింహ శాస్త్రి, చలం, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన వాళ్ళంతా తెలుగుకథను తొలిదశలో రూపిస్తూ వచ్చారు. అటుతరువాత కొడవటిగంటి కుటుంబ

రావు, గోపీచంద్, బుచ్చిబాబు మొదలైన వాళ్ళంతా తెలుగుకథను సుసంపన్నం చేశారు. అయితే మొదటి నుంచీ కూడా తెలుగులో కథకులు వాస్తవికతపట్ల అంతగా దృష్టిని నిలిపినట్లుగా తోచదు. కథానిక కేవలం ఆధునిక సాహిత్యప్రక్రియ కాబట్టి, సామాజికమైన దృష్టికి అత్యధికమైన ప్రాధాన్యం ఇవ్వటం సబబు. ఇక్కడ సామాజికమైన దృష్టి అంటే, వాస్తవికత అనేభావం. ఉత్తమ కళాఖండంగానో, శిల్ప సౌందర్య పరమావధిగానో కథానికను రూపొందించే ప్రయత్నం చిత్రకళకు సంబంధించీ, కవిత్వానికి సంబంధించీ భాసించినంతగా, కథకు నప్పదు. కథనుచదివి ఆనందించే పాఠక వర్గం బాహుళ్యాన్ని బట్టిచూస్తే, కథ పాఠకులలో కలిగించవలసిన అనుభూతి అది వాస్తవికతకు దగ్గరగా ఉన్నప్పుడే ఎక్కువగా సాధించగలదేమోననిపిస్తున్నది. కవిత్వ దృష్టి, భావుకతా, పాండిత్య ప్రాగల్భ్యం చిన్నకథ కనవసరం. సూటిదనము, విస్పష్టత, సంక్షిప్తత, కథ మొదలుపెట్టినప్పటినుంచి చిట్టచివరవరకు, పెంపొందే ఉత్కంఠతా చిన్నకథకుముఖ్యం. అగ్నిపురాణంలో వచనకావ్యభేదాలను వివరిస్తూ, ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా, కథానికా అని పంచవిధాలైన గద్యకావ్యాలు పేర్కొనబడ్డాయి. ఇవన్నీ కూడా కథాసాహిత్యానికి సంబంధించినవే. కథానికలక్షణం అగ్నిపురాణంలోనే ఈ విధంగా నిర్వచించబడింది. 'భయానకం సుఖపరం గర్భే చ కరుణోరసః, అద్భుతోంతేసు క్లృప్తార్థోనోదాత్తా సా కథానికా.' దీన్నిబట్టిచూస్తే అతిదీర్ఘంగా ఉండగూడదు కథ. కథచివరలో అద్భుతమైన సంఘటన ఉండాలి. సుఖదుఃఖాలు రెండూ ఇతివృత్తంగా ఉండవచ్చు. కరుణనుకూడా చూపవచ్చు. అంటే 'పాథోస్' అన్నమాట. ఈ నిర్వచనాన్నిబట్టి చూస్తేకూడా చిన్నకథకు వాస్తవికత ప్రాణభూతమైన విషయం అనిస్పష్టం. సంగీతంలో శాస్త్రీయసంగీతానికి, లలిత సంగీతానికి మధ్య అంతర మెంతో సాహిత్యంలో ప్రౌఢప్రక్రియలకు, కథానికకు ఉండే అంతరం అంతఅని చెప్పవచ్చు. కథానిక లలితసంగీతంవంటి దన్నమాట. కథానిక ఎత్తుగడలో, నిర్వహణలో, శిల్పం చూపకూడదని కాదుకాని, అన్నిటా వాస్తవికత పర్యవసిస్తేనే అది తన ప్రయోజనాన్ని ఎక్కువగా సాధించగలుగుతుంది. వాస్తవికత అంటే కేవలం యథార్థమైన సంఘటనలు కొని, నూటికి నూరుపాళ్లు యథార్థాలుగా కనపడే సంఘటనలేకాని చిత్రించాలని కాదు. అట్లాకేవలం యాథార్థ్యాన్నేఆశ్రయిస్తే అవి దినచర్యా వృత్తాంతాలుగానో, మానవ జీవితంలో యాదృచ్ఛికంగానో అవగాహన కతీతంగానో సంభవించే సంఘటనల చిత్రీకరణంగానో రూపొందవచ్చు. కట్టుకథకన్నా కూడా ఒక్కొక్కసారి నిజజీవితంలోని యథార్థ సంఘటనలే విచిత్రంగానూ, విడ్డూరంగానూ కనపడవచ్చు. 'కల్పన కన్నా కూడా సత్యమే ఒక్కొక్కప్పుడు విభ్రాంతిని కలిగిస్తుంది' అన్న ఆంగ్ల సూక్తిలోని అంతరార్థం కూడా ఇదే. కాబట్టి వాస్తవికత అనగానే విధిగా యథార్థమైన, లేదా సత్యమైన సన్నివేశ నిరూపణమే కానక్కరలేదు. కథానికకూడా శిల్పకళారూపమే కాబట్టి, కల్పనకు, ఊహకు. భావుకత్వానికి సముచితమైన స్థానం ఉండకపోదు. ప్రకృతి దృశ్యాలనుకాని, మానవ మూర్తులనుకాని ఫోటోతీసేటప్పుడుకూడా, దానికి సంబంధించిన శిల్పము,నేర్పుచూపవలసే ఉంటుంది. పనితనం ఉంటుంది. కళాకారుని కౌశలానికే అక్కడ కూడా ప్రాధాన్యం ఎక్కువ. వాస్తవిక చిత్రణ అంటే అధిక సంఖ్యాకుల అనుభవానికి విరుద్ధంగానూ, అతీతంగానూ ఉండకపోవడమే. ఒకవేళ ప్రత్యేకమైన మనస్తత్వాన్నో, మానవస్వభావాన్నో, సన్నివేశప్రాబల్యాన్నో చిత్రించవలసి వచ్చినప్పుడు, ఆయా పరిస్థితుల్లో, ఆ ఉద్రేకాలు, చిత్తక్షోభం, మానసికావేశం, సర్వమానవ సామాన్యంగా, స్వాభావికంగా, అనుభవంలోకి వచ్చేవే అన్నవిషయం నిరూపించబడేట్టుగా రచన, పాత్రపోషణ ఉండాలి. అంతేకాని, మనస్తత్వ చిత్రీకరణంపేరుతోను, చైతన్యస్రవంతిపేరుతోను, అస్పష్టతతో నింపివేయ కూడదు. భావధోరణి ప్రతీకాత్మకంగా ఉన్నా, రచ

యిత తానుమాత్రమే వివరిస్తేతప్ప తెలియబడక పోతే, ఆ కళప్రయోజనం సరిగా సిద్ధించినట్లుకాదు. అందువల్ల శిల్పకళాదృష్టి ఎంతఉన్నా, వాస్తవిక దృష్టిని ప్రధానంగా పెట్టుకొంటే, ఏ ప్రయోజనాన్ని ఆశించి కళారూపాన్ని సృష్టిస్తామో ఆ ప్రయోజనానికి వైరుధ్యం కలగదు.

మొట్టమొదటినుంచీకూడా కల్పనకు, ప్రతీకాత్మకమైన ధోరణికి, సాంకేతికమైన విలువలకు, సిద్ధాంతాలకు ప్రాధాన్యం ఇచ్చినంతగా, తెలుగు కథకులు వాస్తవికతకు ప్రాధాన్యం ఇవ్వలేదేమోననిపిస్తుంది.

నోరి నరసింహశాస్త్రిగారు రచించిన 'మరువిషయం' మంచికథ, పేరులోనే విషయనిగరణం ఉన్నది. ఇందులో ప్రతిపాదితమైన తాత్త్వికసత్యం త్రైకాలికమైన విలువలుకలది. కథానకము అత్యుదాత్తమైనదని శివశంకరస్వాములవారభిప్రాయ పడ్డారు. ఇది నాది నాది అని వ్యక్తులు, జాతులు, దేశములు, పరమార్థం కానిదానికై పెనుగులాడి, నష్టపడి, కష్టపడి, పెద్దలైనవాళ్ళు బోధించినప్పుడు, వివేకోదయమైతే తామెంత అవివేకంగా కలహించారో, తెలుసుకోవటం స్థూలంగా ఇందులో ఇతివృత్తం. వెనక పురాణాలలో ఇతిహాసాలలో అర్థవాదానికై వ్రాసిన కథల్లాంటిదే ఈ కథ కూడా. అంగదేశము, విదేహదేశము ఇరుగుపొరుగు దేశాలు. చాలాకాలంగా బద్ధమత్సరులై ఈ దేశాధిపతులు ఒకరితో ఒకరు కలహిస్తూ ఉంటారు. ఈ రెండు దేశాలమధ్య పెద్ద ఎడారి ఉన్నది. ప్రధానంగా ఆఎడారిపైన ఆధిపత్యం ఎవరిదన్నదే కలహమాతృక వారి మధ్య. ఒట్టి మరుభూమి అది. అంతులేని ఎడారి. అయినా ఆ మరుభూమినిగూర్చిన వివాద ఏమిటన్న వివేకం ఆ రాజుల కెవరికిన్నీ కలగలేదు. ఒకసారి పెద్దయుద్ధం జరిగింది. అటు ఆరాజు, ఇటు యీ రాజు ఎడారిలో తమ చతురంగ బలాలతో మోహరించుకొని వచ్చారు. అంతులేని ఆ ఎడారిలో మధ్యప్రదేశంలో ఒక నందీశ్వర శిల్పమున్నది. ఆ ప్రాంతంమాత్రం కొంతలో కొంత తృణకాష్ఠ జలసమృద్ధంగా ఉంటుంది. అది స్థల మాహాత్మ్యం. అక్కడ విశ్వామిత్ర గోత్రంలోని విశ్వామిత్రుడనే పేరుగల గొప్ప మునీశ్వరుడు తపస్సు చేసుకొంటూ ఉన్నాడు. యుద్ధానికి తలపడి, అశేష సైనిక నష్టం అనుభవించారు రెండు పక్షాలు. ఒకరోజున యుద్ధవిరామంతో ఇద్దరు రాజులు విశ్వామిత్రర్షిని దర్శించటానికి వెళ్ళారు. అప్పటికే అక్కడ విశ్వామిత్ర మహర్షిని మధ్యవర్తిగా ఉంచుకొని అంగదేశం నుండి వచ్చిన పూర్వమీమాంసకుడు, విదేహం నుండి వచ్చిన ఉత్తర మీమాంసకుడు వివాద పడుతున్నారు. ఇంతలో ఇద్దరు పిల్లలు చాలా ఉద్రేకంతో కలహించుకొంటూ అక్కడికి వచ్చారు. వాళ్ళచేతుల్లో చినిగిన గుడ్డపేలికలాగా, పాతదైపోయిన రంగుకాగితం ముక్కలాంటిది ఒకటి ఉన్నది. ఆ నందీశ్వర ప్రతిమ నోటిలోంచి దాన్ని వాళ్ళు వెలికి తీశారు. ఆ కాగితాన్ని విశ్వామిత్రర్షి ఆ పండితులతో చదివించాడు. పూర్వమెప్పుడో తరతరాలనాడు, అంగదేశాధీశుడు, విదేహరాజ్య రఘూవల్లభుడు పంచభూతాల సాక్షిగా, మహర్షులు మధ్యవర్తులుగా వ్రాసుకొన్న సంధిపత్రం అది. అనందీశ్వరప్రతిమే తన చూపులతో రెండు రాజ్యాల సరిహద్దు నిర్ణయం చేస్తున్నదని అందులో ఒడంబడిక వ్రాసుకొన్నారు ఆరాజులు. ఈ ఒడంబడికకు వ్యతిక్రమం జరిగితే ఆప్రాంతమంతా ఎడారి అయిపోతుందన్న శాపం కూడా ఉన్నది అందులోనే. దాంతో రాజు లిద్దరూ పశ్చాత్తాపపడ్డారు. పండితులిద్దరూ కూడా ఒప్పందం కుదుర్చుకున్నారు. ఇంతటితో కథ ముగుస్తుంది. కథా ప్రారంభంలోనే ఒక అవాస్తవికమైన విషయం ఉన్నది. ఆఅవాస్తవికమైన సన్నివేశానికి తరవాత కథలో మళ్ళీమళ్ళీ ప్రసక్తి ప్రాబల్యం రావటం కూడా విపరీతమే అనిపిస్తున్నది. చారిత్రకమైన, పౌరాణికమైన సన్నివేశాలను ఇతివృత్తంగా స్వీకరించి నప్పటికీ, శిల్పదృష్ట్యాను, వస్తుదృష్ట్యాను అవాస్తవికతను పరిహరించవచ్చును. అసలు కథ

అంగరాజు ధర్మాసనం మీద కూర్చుని మహాధనికు లైన ఇద్దరన్నదమ్ముల పంపకాల సంబంధమైన విచారణచేస్తూ ఉండటంతో ప్రారంభ మవుతున్నది. చాలా రోజులనుంచీ ఈవిచారణ సాగుతున్నది అహోరాత్రులు. వారివారి ఆస్తిపాస్తుల నన్నిటిని స్వయంగా విచారించి పంపకాలు కుదురుస్తున్నాడు రాజు. మరువిషయంలో వారి కున్న భూముల గురించే ప్రధానమైన వివాదం పరిష్కరించబడ వలసి ఉంది, "మనుష్యులు ప్రవేశించుటకే కష్ట సాధ్యమగు మరువిషయములో ఆ సోదరులకున్న భూముల వివాదము లింకను వినుట తరువాయిగా ఉన్నది". తరతరాలుగా మరుభూమిగా ఉన్న ఆ ఎడారిలో వాళ్ళకు భూములు ఉండటం వింత. తర వాత అంగరాజు, విదేహరాజుపైకి యుద్ధానికి బయలుదేరినప్పుడు, ఆ శ్రేష్ఠి సోదరులు కూడా మరుభూమిలోని తమ తమ వివాద ప్రాంతాలను స్వయంగా చూపుతామని రాజుగారిని అనుసరించా రట. ఆట్లా రాజుగారిని అనుసరించి వస్తూ. 'ఈ ప్రదేశము నాది-కాదు నాది' అని చెప్పుచు వివ రించుచున్నారు" అని వర్ణించటం వాస్తవికతకు భంజకం. తరతరాలనుండి పాడుపడిపోయిన ఎడారి భూములను గూర్చిన వివాదం కాని, ఆ భూములను గూర్చిన యాజమాన్యం కాని సంభవం ఎట్లా అవుతాయి? అన్నది ఇక్కడ ప్రశ్న. అయితే కేవలం పనికిమాలిన, నిష్ప్రయోజనమైన వాటికోసం మానవులు వివేక హీనులై పోట్లాడుకొంటారు అన్న దానికి ఉపబలకంగా, భంగ్యంతరంగా అర్థవాదంగా ఈ ఉపకథ చోటు చేసుకొన్నదని చెప్పవచ్చు నేమో. కాని ప్రతీకాత్మకంగా వ్రాసినా, వాస్తవికతను దృష్టిలో పెట్టుకొంటే ఇంతకంటె జాగ్రత్త వహిం చడం అనవసరం. శ్రేష్ఠిసోదరుల అవాంతరకథ లేకపోయినా ప్రధానకథ కేమీ భంగం కలగదు. శ్రేష్ఠిసోదరుల వివాద విచారణతో కథ ప్రారంభ మైంది కాబట్టి, కథ ముగింపుదాకా వాళ్ళ ప్రసక్తి కొనసాగింది. అందు కొన్ని అవాస్తవికమైన సన్నివేశాలు కథలో చోటుచేసుకొన్నాయి.

కొడవటిగంటి కుటుంబరావుగారి 'అక్కపెళ్ళి' అన్నకథలో వారు చెప్పదలచిన దేమిటో తెలియదు. ఇది ఇతర భారతీయ భాషలలోకి అనూదితం చేయ బడటానికి ఎంపికైన కథ. కుటుంబరావుగారి కథ లన్నీ అర్థవాదాలే. వారి సామాజిక, రాజకీయ దృక్పథాల, సిద్ధాంతాల ఆవిష్కరణమే వారి కథల పరమార్థం. మానవ మనస్తత్వంలో వారికి సుపరి చితమైన విపరీతధోరణులను ఆయనగారు తన కథల్లో పాత్రలనుగా మలుస్తారు. ఈ దృక్పథం వాస్తవిక ధోరణికి విరుద్ధమైనటువంటిది. ఇందులో ఒక గృహస్థుకు ఇద్దరు కూతుళ్ళు. ఆ కూతుళ్ళకు వరాన్వేషణకు సంబంధించిన ప్రయ త్నాలు ఏవిధంగా పర్యవసానం పొందాయో ఇతి వృత్తం. తండ్రికి పెద్దకూతురంటే ఇష్టం లేకపోగా పై పెచ్చు ఒక విధమైన అయిష్టం కూడా ఉన్నట్లు, జుగుప్సతో కూడిన నిరాదరణ ఉన్నట్లు, భార్య భర్తను ఎత్తిపొడిచే మాటలనుబట్టి ధ్వనిస్తూ ఉంటుంది. చిన్నకూతురుపట్ల ప్రత్యేకమైన అభి మానం ఉన్నా పెద్దకూతురు తనఅభిరుచులకు, ఆశయాలకు, అనుగుణమైన ప్రవృత్తిని కనపరచక పోయినా, కన్నతండ్రి కడుపునబుట్టిన కూతురిని నిరసించటం విపరీతం. కథంతా చదివినా, పెద్ద కూతురిలోని లోపమేమిటో, చిన్న కూతురులోని వైలక్షణ్యం ఏమిటోకూడా బోధపడకపోవటం ఈ కథలోని లోపం. తండ్రి ఇద్దరు కూతుళ్ళను అభిమా నించే విషయంలో చూపే అంతరాలకు కథలో నిరూపణం లేదు. చిన్నపిల్ల చాలా చురుకైందనీ, పెద్దపిల్లఅంటే తండ్రి కిష్టం లేదని చెప్పినంత మాత్రాన అది మంచి కథ అయిపోలేదు. "ఒక ఇంట్లో ఒక కుటుంబంలో ఉన్న మనుషులు ఒకరి నొకరు పరీక్షకుపెట్టి మార్కులువేస్తూ కూచోవటం తోనే సరిపోతే, ఇక వాళ్ళుకలిసి జీవించే దెప్పుడు? ఒకరికొకరు సహాయపడే దెప్పుడు?" అంటారు రచయిత. ఇలాగా కుటుంబంలోని అందరు వ్యక్తులు చిత్రవిచిత్రమైన మనస్తత్వాలతో ప్రవర్తించటం చాలా అవాస్తవికమైన విషయం. ఇందులో యజ

మాని పేరు శ్వేతాంబరం చాలా విడ్డూరంగావుంది ఈ పేరు, చాలా అవాస్తవికంగా ఉంది

మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'ఆఖరిమాట' మంచి కథ. పార్థసారథినాయుడనే వ్యాపారస్థుడు, జీవితంలో చేసిన తప్పులన్నీ తలచుకొని తలచుకొని పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకోవటం ఇతివృత్తం అలాగా అంత ధనికుడు, వేరే చీకుచింత లేనివాడు అంతరాత్మ పెట్టే బాధకు వోర్చుకోలేక ఆత్మహత్య చేసుకోవడం వాస్తవికమైన చిత్రణ కాదని కొంద రంటారేమోకాని అతడు పడిన బాధను, అతడు చేసిన ఘోరమైన తప్పుడుపనులు అతడి మనస్సు పైన ఎంతగాఢంగా పనిచేశాయో కథలో చాలా బాగా వర్ణించారు. బీదిదగ్గర దిక్కులేని అసహాయు రాలై తననే నమ్ముకొని తనవెంట వచ్చిన ముద్ద రాలిని, దుష్టకాముకుడై పార్థసారథి ఏవిధంగా చంపేశాడో హృదయ విదారకంగా చిత్రించారు రచయిత. ఆపిల్ల కొత్తగా బంధువు లింటికి వచ్చింది. ముక్కోటి ఉత్సవంనాడు తప్పిపోయింది. రాత్రి చాలా పొద్దుపోయింది. ఆ ప్రాంతపు భాష ఆమెకు రాదు రౌడీలు ఆమెను నిలవేసి భయపెడుతున్నారు. ఇంతలో కారులో పార్థసారథినాయుడు ఆదారిని రావటం తటస్థించింది. ఆపిల్లను రక్షించాడు. మొదట ఆ అమ్మాయిని చూసినప్పుడు అతడికేమీ దురుద్దేశం లేదు. ఆ పిల్లను వాళ్ళయింటి దగ్గర దించివద్దామనే అనుకున్నాడు. నెమ్మదిగా, ఆమెకు నమ్మకం పుట్టేటుగా అభయమిచ్చాడు. కారు ఎక్కగానే అతడి మనస్సు మారిపోయింది. నిర్మానుష్య మైన ఆ రాత్రివేళ, ఆ పిల్లను బీచి వొడ్డుకు తీసికొని వెళ్ళి కారు ఆపి ఆమెను దిగమన్నాడు. విపరీతమైన భయాందోళలను వర్ణించాలంటే, పై ప్రాణాలు పైనే పోయాయని వర్ణిస్తారు మామూలుగా. ఆ పిల్ల కారు దిగడమే అట్లాదిగింది. అతడి దురుద్దేశం ఆ అమ్మా యికి అర్థమైపోయింది. ఇసుకలో కూలబడింతర్వాత అతడామెను స్పృశించగానే భయంగా వణికిపోతూ, అతడివేపు చూసింది. ఆ కళ్ళు పిచ్చిగా తనను చూడటం అర్థం చేసుకోలేక పోయినాడు పార్థసారథి. ఆ కళ్ళలోంచి ఆ పిల్లప్రాణం పోయింది. ఆ కళ్ళు అలానే పిచ్చిగా అతడివేపు చూస్తున్నాయి. అతడి జీవితంలో ఈఆఘాతం అతణ్ణి వెన్నంటి తరిమింది. ఒకసారి తమ ఇంట్లో గొప్పదోపిడి జరిగింది, దొంగలెవరో తెలియదు. ఇంటిముందు ప్రశాంతంగా చెట్టుకింద కాపరం చేసుకుంటున్న కుటుంబాన్ని పోలీసులు నానాబాధలు పెట్టినా, పార్థసారథి నాయుడు కల్పించుకోలేదు. పోలీసు లాబిచ్చగాణ్ణి చావచితకగొట్టి జైల్లో వేశారు. జైలునుంచి విడుదలై వచ్చి, ఘోరమైన జబ్బుపడి ఆ బిచ్చగాడు చనిపోయాడు నిజంగా అతడు దొంగకాదని తనకు తెలిసినా, దొంగే అని తనకు తెలియకపోయినా, ఆ అన్యాయానికి తాను సాక్షీభూతుడుగా చూస్తూ వున్నాడేకాని, చక్కదిద్ద లేకపోయినాడు, తన జీవితంలో తనకేమాత్రమూ మనశ్శాంతి లేకుండా చేసి పట్టిపాలారుస్తున్న ఈ సంఘటనలను కొడుక్కు తెలియజేస్తూ మానవత్వాన్ని ఎప్పుడూ కోలుపోవద్దని ఆఖరుమాటగా హెచ్చరిస్తూ, తండ్రి కొడుక్కు వ్రాసిన ఉత్తరం రూపంలో ఈ కథ ఉన్నది. ఈ కథ సమాజంలోని అన్యాయాలను, అక్రమాలను, తీవ్రంగా నిరసిస్తున్నది. హృదయాన్ని కదిలించివేసే శక్తితో సామాజిక ప్రయోజనాన్ని కూడా సాధిస్తున్నది. పొయెటిక్ జస్టిస్‌ను రచయిత ఈ కథలో సాధించారు.

చింతాదీక్షితులు వ్రాసిన 'శిలాప్రతిమ' కథ ఈ సమాజానికి, ఈ యుగానికి చెందింది కాదు. అద్భుతమైన కల్పనతో నిండిన కథ. రాజుగారు కోట కట్టడానికిగాను జరిగే నరబలిలో, తనను తాను త్యాగం చేసుకొన్న వీరుడికథగా రూప కల్పన చేశారు. ఆ వీరుడి ప్రియురాలు విషాదాన్ని భరించలేక శిలా ప్రతిమ అయిపోయింది, ఇందులో వాస్తవికత ప్రసక్తేలేదు. అతిమానుషములు, అమానుషములు, అద్భుతాలు అయిన సంఘటనలతో రూపొందిన కథలలో వాస్తవికతను ప్రమాణంగా చేసుకోలేము.

తెలుగులో చిన్నకథ తొలినాళ్ళలో రూపురేఖలు దిద్దుకొంటున్న తరుణంలో సాంఘిక దృక్పథం తక్కువగా ఉండేదని చెప్పడం వాళ్ళను చిన్న పుచ్చడ మేమీకాదు. ఆకృతి కూడా ఇదమిద్ధంగా ఏర్పడని ఆరోజుల్లో ఇతివృత్తము, శిల్పము, నిర్వహణ మొదలైన వాటిలోనే వాళ్ళు నిర్మగ్నులై ఉండేవాళ్ళు. సామాజిక దృక్పథము, వాస్తవికత అప్పడప్పుడే వాళ్ళను ఆకర్షిస్తూ ఉండేవి. కళలో వచ్చినకథానికలలో, సామాజిక జీవనంలోను, కట్టుబాట్లలోను రావలసిన భావవిప్లవాన్ని గూర్చిన కథలు కొన్ని ఆరోజుల్లో వెలువడక పోలేదు. ఎక్కువగా, మగవాడు వెలిచవులు మరిగిన్ని, తాగుబోతున్నూ అయి, సంసారంలో సృష్టించే ఘోరాలూ, స్త్రీ సహనము, శాంతము చూపి, వారిని చక్కదిద్దడము మొదలైన కథలే మొదటి రోజుల్లో ఎక్కువగా వెలువడేవి. అయితే వీటన్నిటా కొంత అతిధోరణి మాత్రం కనపడేది.

తొలిరోజుల్లోనే శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు గొప్పకథలు వ్రాశారు. వాస్తవికత, సామాజిక దృక్పథము వీరికథల్లో తలస్పర్శిగా కనపడతాయి. 'డిప్రెషన్-చెంబు' అన్నకథలో ఉన్న ఆస్తి పాస్తులను అమ్ముకొని, పెద్దపెద్ద చదువులు చదివి, తగిన ఉద్యోగాన్ని పొందలేకా, వచ్చిన ఉద్యోగం చేయలేక, ఆర్థికంగా నలిగిపోయిన మధ్యతరగతి కుటుంబాల మనస్తత్వాన్ని హృదయంగమంగా చిత్రించారు శివరామశాస్త్రిగారు, శాస్త్రిగారు ఆధునిక భావాలు, దృక్పథము, గొప్పవ్యుత్పత్తి ఉన్నవారు కావటంచేత, విద్యాధికుల సమస్యలను, సున్నితమైన సాంఘికసమస్యలను చక్కగా అర్థంచేసుకోగలిగారు ఆరోజుల్లో డిప్రెషన్ వచ్చి ధరలన్నీ పడిపోయినయ్. రూపాయి పుట్టడమే కష్టమైపోయింది. రామారావనే యువకుడు ఆనర్స్ ప్యాసై అతడికి నచ్చిన ఉద్యోగం దొరకక నిరుద్యోగిగా కాలం గడపటమూ అతడికోసం కుటుంబ సభ్యులందరూ చేసే త్యాగము, ఆ విషయాన్ని అతడు గ్రహించ లేక, నిర్బాధకంగా తప్పించుకొని తిరగడము, చివరకు, తనభార్యే కర్తవ్యోపదేశం చేయడమూ జాలి పుట్టేట్లు వర్ణించారు రచయిత. తెలుగులో వచ్చిన చాలాతక్కువ గొప్పకథల్లో యీ 'డిప్రెషన్-చెంబు' ఒకటనటంలో సందేహం ఉండకూడదు. అయితే శివరామశాస్త్రిగారు వ్యావహారికంలోనే రచనచేసినా ఆభాష ఇప్పటి కథానికభాషగా కనపడదు. ఇప్పటి వ్యవహారానికి, అప్పటి వ్యవహారానికి కూడా చాలా అంతరం ఉన్నట్లుగా, అప్పటి కథలను ఇప్పటి కథలను పోల్చిచూస్తే తెలుస్తుంది.

విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన 'సప్తాశ్వం' లాంటి కథలు అర్థంగావు. ప్రతీకాత్మకమైన ధోరణి ఎక్కువ ఆయన కథల్లో. కాని 'ఏమి సంబంధం' వంటి చక్కని కథలనుకూడా సత్యనారాయణగారు వ్రాశారు. సత్యనారాయణగారు గొప్ప కవితావేశము, భావుకతా ఉన్నవారు కనక, ఆయనగారికి కథల్లో, ఆయన నమ్మిన సిద్ధాంతాలు, తాత్త్వికచింతన కూడా చోటుచేసుకోవటం చూడవచ్చు. అటువంటప్పుడు, కథాసన్నివేశప్రాబల్యంకన్నా రచయితలు తాము నమ్మిన సిద్ధాంతాల ప్రచారాన్నే కథాకథనంలో ప్రధాన ధ్యేయంగా భావించవచ్చు. ఆసమయాలలో కథా సాహిత్యంలో వాస్తవికత దెబ్బతింటుంది. ఇప్పుడు ఆధునికులెందరో వ్రాసే కథల్లో యీలోపం కనతుంది. సంఘంలోని ఒక వర్గంవారి సమస్యను మాత్రమే చిత్రించటం వల్ల, వాస్తవికతా దృష్టి ఈకథల్లో పరిమితమైపోతున్నది. ధనవంతులు దరిద్రులను కాల్చుకు తినడం, ఈ వర్గం కథకుల అభిమాన వస్తువు. బలవంతులు, బలహీనులను అణగద్రొక్కడం లేదనీ సంఘంలో నీతి, న్యాయం, సమానత్వం, పొంగిపొరలుతున్నాయని ఎవరూ అనరు, అనకూడదు. ఎందుకంటే అది అవాస్తవికమైన ధోరణికనుక. అయితే కరుణకన్నా కార్పణ్యం ప్రధానస్థానం వహించకూడదు. ఇట్లా అంటే అత్యంతాధునిక దృక్పథం ఉన్నవాళ్ళు ప్రత్యాఖ్యానం చేస్తున్నారు. కరుణామార్గం మార్గమే

కాదనీ మనిషి మనసును ప్రభావితంచేసికానీ, తద్వారా ఏసంస్కరణమూ సాధించలేమని వారంటున్నారు. అందువల్ల సాంఘిక సమానతలను సాధించటానికి హింస ఒక్కటేమార్గం. ఆ మార్గం సుకరమూ సుగమమూ కాకపోయినా, సాంఘిక శ్రేయస్సాధనకు అవశ్యమూ ఉపాదేయమని వారి ప్రతిపాదన.

సాహిత్యం మనుషుల్లో సాంఘిక దురన్యాయాల పట్ల దృష్టిని ప్రసరింపజేసి, ఉన్నవారిలో మనఃపరివర్తనాన్ని తెచ్చి, లేనివారి కష్టాలను పంచుకొనేట్లుగా చేయజాలదని, అట్లా ఎవరైనా విశ్వసిస్తే అది వారి అజ్ఞానమనీ ఆధునికుల అభిప్రాయంగా కనబడుతుంది. ఆవిధంగా సాహిత్యానికా ప్రభావమే ఉండేట్లయితే ఇన్నివేల సంవత్సరాలుగా వెలువడిన ప్రబోధసాహిత్యం ఏం సంపాదించగలిగిందని వారు ప్రశ్నిస్తారు. కాబట్టి సాయుధమైన విప్లవమే సాంఘిక శ్రేయస్సాధనకు మార్గంగా కొత్తగా పుట్టిన రచయితల వర్గంవారు భావిస్తూ అట్టి సాహిత్యం రచించడమే తమ ధ్యేయంగానూ అటువంటిదే ఉత్తమసాహిత్యం కాగలుగుతుందనీ ప్రచారం చేస్తున్నారు. అంతే కాని, మనిషియొక్క మనఃప్రవృత్తిని, ధర్మపన్నాలవల్లను, నయబోధవల్లను మార్చలేమనీ అలా మార్చవచ్చునన్న ప్రచారమూ నమ్మకమూ శాశ్వతంగా దగాపడినవారిని మోసగించడమే ననిన్నీ సిద్ధాంతీకరిస్తున్నారు. సాహిత్యం ద్వారా మానవ మనఃప్రవృత్తిలో మార్పును తీసుకొని రాలేమని చెపుతూ తమ సిద్ధాంతప్రచార సాధనంగా సాహిత్యాన్నే ఆశ్రయించడం స్వవచన వ్యాఘాతంగా కనిపిస్తున్నది. ఇది వాస్తవికమైన ధోరణికాదు. సాహిత్యం కూడా సంఘాన్ని ప్రభావితం చేయగలదన్న నమ్మకం ఉండబట్టే, తమ నమ్మకాలను, సిద్ధాంతాలను కథానికారూపంగానూ కవిత్వరూపంగానూ ఆధునికరచయితలు ప్రచురపరుస్తున్నారు. అతి నవ్య ధోరణి నాశ్రయించిన కథకులు కొందరి కథల్లో సంఘంలో ఒకవర్గంవారు సాగిస్తున్న దోపిడీవిధానానికి బక్కవాళ్ళు ఎలా బలి అయిపోతున్నారో చూపటమే ప్రధానేతివృత్తంగా ఉంటున్నది. అవినీతి, స్వార్థపరత్వం, అతికాముకత్వం, హింసాత్మకప్రవృత్తి, సంఘంలో ఏవిధంగా చెలామణి అవుతున్నాయో, సాంఘికంగాగాని, రాజకీయంగాకాని అటువంటి దుష్టశక్తులనునిగ్రహించే ప్రయత్నాలు కూడా ఏవిధంగా లేకుండా పోతున్నాయో చూపే కథలు వ్రాస్తున్నారు. ప్రధానంగా వీళ్ళు వ్రాసే కథలలో వీళ్ళు నమ్మిన రాజకీయ సిద్ధాంత ప్రాబల్యం కానవస్తుంది. ఇంకా కొందరు చైతన్య స్రవంతి అనబడే ధోరణిలో శిల్పప్రాధాన్యంగా కథలు వ్రాస్తున్నారు. ఈ కథల్లో వాస్తవికతను నిరూపించే ప్రయత్నం ఫలితాన్ని ఇవ్వలేదు. ఎందుకంటే వాస్తవికత అనే లక్షణం, ఆత్మాశ్రయమైన అనుభవాన్నో, అనుభూతినో, ఆధారం చేసుకొని ఉంటుందా కథల్లో. అనంతమైన ప్రకృతులున్న, విశాలరంగస్థలమైన ఈ ప్రపంచంలో దేనినీ అవాస్తవికమనే అవకాశం కూడా ఉండదు. అయితే ఏదైనా సన్నివేశాన్ని గాని, సంఘటనను గాని, సంఘర్షణను గాని కథా వస్తువుగా స్వీకరించినప్పుడు శిల్పదృష్ట్యా కాని, ఇతివృత్తం దృష్ట్యా కాని అధికసంఖ్యాకుల అనుభూతికి అది చేరువగా ఉన్నప్పుడు వాస్తవికత ఎక్కువగా ఉంటుంది.

ఇప్పుడు ఔత్సాహికులు వ్రాసే కథల్లో బొత్తిగా వాస్తవికత ఉండటంలేదు. కల్పనకు ప్రాధాన్యాన్ని ఇచ్చి, యాదార్థ్యాన్ని పట్టించుకోవటంలేదు. అభూత కల్పనలు, హఠాత్సంభవాలు, కొసమెరుపు కథలు, ఎక్కువగా వ్రాస్తున్నారు. ఆధునిక కాలంలోమనం ఎదుర్కొంటున్న సాంఘిక సమస్యలుగాని, రాజకీయ సమస్యల పరిజ్ఞానంగాని కొత్తగావ్రాసే కథకులదృష్టిని ఆకర్షించటంలేదు. తరుణ వయస్కుల ప్రేమవృత్తాంతాలు, నిరాశలు, ఉద్రేకాలు, వారపత్రికల్లో వెలువడుతున్న కథల్లో నూటికి ఎనభై వంతుల్లో చోటుచేసుకొంటున్నాయి. సామాజిక సమస్యల స్వరూపం లాగా అవగతమైతే తప్ప, కథల్లో వాస్తవికదృష్టి బాగా చోటుచేసుకొనేందుకు అవకాశం ఉండదు.

డా. పాటిబండ మాధవశర్మ

# ఆదికావ్యావిర్భావము

"వేదవేద్యే పరే పుంసి
జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్
సాక్షా ద్రామాయణాత్మనా"

వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడై యవతరింపగా వేదము వాల్మీకి ముఖమున రామాయణరూపమున ఆవిర్భవించెను.

వేదము అనాది కావ్యము. అనాదికవియైన చతుర్ముఖ బ్రహ్మవదనమునుండి యావిర్భవించినది. పరమపురుషుడైన శ్రీమన్నారాయణుని యనంత కళ్యాణగుణములను అది కీర్తించును.

శ్రీమద్రామాయణము ఆదికావ్యము. అది ఆదికవియైన వాల్మీకి మహర్షి వదనమునుండి యావిర్భవించినది. పూర్ణపురుషుడైన శ్రీరామచంద్రుని కళ్యాణగుణములను అది కీర్తించును.

శ్రీరాముడు దశరథునివలన అవతరించుటకును, శ్రీమద్రామాయణము వాల్మీకి వలన అవతరించుటకుడు బ్రహ్మయే కారణము. శ్రీరాముని అవతారమునకువలెనే శ్రీరామ కథావతరణమునకును ధర్మ ప్రతిష్ఠయే పరమార్థము. ఒక మహాపురుషుని యవతరణమునకును, ఆతని లోకోత్తరచరిత్రమును నిబంధించు మహాకావ్యము యొక్క అవతరణమునకును బ్రహ్మప్రయత్నము అవసరమని నిరూపించుటకు వలసిన సామగ్రి శ్రీమద్రామాయణమునందే కలదు. ఆ సామగ్రిని నిరూపించు యత్నమే యీ వ్యాసము.

రావణుడు జన్మించినప్పుడే శ్రీరాము డవతరింపవలసిన యవసర మేర్పడినది. వాడు జన్మించిన పరిస్థితు లట్టివి. రావణుడు కైకసి కొడుకు. అది సుమాలి కూతురు. విష్ణువుచే పరాభూతుడై భీతుడై పాతాలమున దాగియుండిన సుమాలి యొకనాడు భూలోకమునకు వచ్చెను. ఆసమయమున కుబేరుడు తనతండ్రియైన విశ్రవోబ్రహ్మకు మొక్క వచ్చెను. వైశ్రవణుని వైభవమునుచూచి సుమాలికి కన్నుకుట్టెను. వానికన్ను విశ్రవోబ్రహ్మపై బడెను. కుబేరునివంటి తేజశ్శాలి తమ వంశమున జన్మింపవలెనన్నచో విశ్రవోబ్రహ్మ వీర్యమును సంగ్రహించుటకు దగిన క్షేత్రము అవసరము. వానికి కైకసి గుర్తువచ్చెను. అది గొప్ప అందగత్తె. విశ్రవసుని హృదయమును హరింపగలదు.

తండ్రి యుపదేశముచే కైకసి విశ్రవసుని యెదుట సవిలాసముగ నిలువబడెను. అది పుత్రాభిలాషిణియై వచ్చినదని ఆయన గుర్తించి దారుణమైన వేళయందు వచ్చితివి గనుక నీకు దారుణులైన పుత్రులు జన్మింతు రని చెప్పి దానికి సంతానము ప్రసాదించెను. ఆ సంతానమున మొదటివాడు రావణుడు. వాడు పెరిగి యాతతాయిగా తిరుగుచుండ ఒకనాడు కుబేరుడు మరల తండ్రికి మ్రొక్కవచ్చెను. అప్పుడు కైకసి రావణునకు ఆతనిని జూపి –

"పుత్ర వైశ్రవణం పశ్య
భ్రాతరం తేజసావృతమ్
భ్రాతృభావే సమే చాపి
పశ్యాత్మానం త్వ మీదృశమ్.

దశగ్రీవ తథా యత్నం
కురు ష్వామితవిక్రమ
యథా త్వ మపి మే పుత్ర
భవ వైశ్రవణోపమః"

అనీ పుత్రుని ప్రేరేచినది. రావణునకు పౌరుషము పొడుచుకొని వచ్చెను. వాడిట్లు ప్రతిజ్ఞ చేసెను.

"సత్యం తే ప్రతిజానామి
భ్రాతృతుల్యో ఽధికోఽపివా
భవిష్యా మ్యోజసా చైవ
సంతాపం త్యజ హృద్గతమ్."

ఇట్లు ప్రతిజ్ఞ చేసి 'ప్రాప్స్యామి తపసా కామమ్' అని వాడు సానుజుడై బ్రహ్మనుగూర్చి తపస్సు చేసెను. వేయేండ్ల కొకశిరస్సు చొప్పున తొమ్మిది శిరస్సులు అగ్నిలో వ్రేల్చెను. పదవ శిరస్సు వ్రేల్వబోవగా బ్రహ్మ ప్రత్యక్షమై ఇట్లనెను.

"శీఘ్రం వరయ ధర్మజ్ఞ
వరో య స్తేఽభికాంక్షితః
తం తే కామం కరో మ్యద్య
న వృథా తే పరిశ్రమః" ఉ..కా. X : 14

రావణుని తపః పరిశ్రమను వృథా చేయుట బ్రహ్మకును శక్యముగాదు. తపస్సు యొక్క శక్తి యట్టిది. దానికి సర్వదేవతలును వశులు కావలసినదే. కనుక ధర్మమును బుద్ధియం దిడుకొని వరమడుగుమని బ్రహ్మ పలికెను. రావణుడు హర్ష గద్గద కంఠుడై యిట్లు పలికెను.

"అమరత్వ మహం వృణే" ఉ.కా. X:16

కుబేరుని మించుటయే కాక, తన తాతయైన సుమాలిని పరాభవించిన విష్ణువును గూడ నిర్జించుట రావణుని యాశయము. కావున వానికి అమరత్వము అవసరము. బ్రహ్మ యీ వరము ప్రసాదించి యుండెడివాడే. కాని ఆయనకు తాను పూర్వము పడిన తొందరపాటు గుర్తువచ్చెను. పూర్వము మాల్యవదాదులు తపస్సు చేసిరి. ప్రత్యక్షమైన బ్రహ్మను ఈ విధముగా వేడిరి.

"అజేయా శ్శత్రుహంతార స్తథై వ చిరజీవినః
ప్రభవిష్ణ్వో (?) భవామ........"

బ్రహ్మ 'బ్రాహ్మణవత్సలుడు' కనుక అట్లే యిచ్చితి ననెను. బ్రహ్మ యిచ్చిన వరమువల్ల దర్పించిన మాల్యవదాదులను విష్ణువు స్వయముగా శిక్షింప వలసివచ్చెను. చిరంజీవిత్వ మున్నదే కాని అమరత్వము లేదు గనుక వారి నెప్పుడైన, ఎట్లయిన చంపవచ్చును. మాల్యవంతుడు విష్ణువుచే చావనే చచ్చినాడు. కనుకనే రావణుడు అమరత్వమును వేడెను. బ్రహ్మయు తన బ్రాహ్మణ వత్సలత్వము నటుంచి —

"నాస్తి సర్వామరత్వం తే
వర మన్యం వృణీష్వ మే." X-17

అని పలుకక తప్పలేదు. రావణుడు 'సుపర్ణ నాగ యక్ష దైత్య దానవ రక్షో దేవతలకునేను అవధ్యుడను కావలెను. తృణప్రాయులైన మానుషాదిప్రాణుల విషయమున నాకు చింతలేదు'అనెను బ్రహ్మ యీ వరము ప్రసాదించెను. అడిగిన అమరత్వమీయ నందుకు జాలి కలిగెను కాబోలు. అడుగకున్నను పదితలలు యథాప్రకారము ఉండుటయు, కామరూపగమనాది శక్తి కలుగుటయు కూడ ప్రసాదించెను. తరువాత బ్రహ్మ విభీషణునకు ప్రత్యక్షమై వరమడుగు మనెను. అతడు

'పరమాపద్గత స్యాపి
ధర్మే మే మతిర్భవేత్ (?)
అశిక్షితం చ బ్రహ్మాస్త్రం
భగవ న్ప్రతిభాతు మే"

అని కోరగా బ్రహ్మ ఆవరములిచ్చి అడుగకున్నను

'నాధర్మే జాయతే బుద్ధి
రమరత్వం దదామి తే"

అని విభీషణునకు అమరత్వము కూడ ప్రసాదించెను. కుంభకర్ణునకు గూడ బ్రహ్మ వరమీయబోయెను. వాడు రావణుని మించిన దుష్టుడు. 'యద్యేష వరలబ్ధస్స్యాత్ భక్షయేత్ భువనత్రయమ్, వరవ్యాజేన మోహోఽస్మై దీయతామ్" అని దేవతలు గోలపెట్టిరి. వీడును అమరత్వమును గోరవచ్చును. అదికాదు, వేరువరము కోరుమని తా నన

వలసి వచ్చును. కనుక బ్రహ్మ సరస్వతిని ధ్యానించెను. ఆమె వచ్చి పార్శ్వమున నిలువగా 'వాణి త్వం రాక్షసేంద్రాస్యే భవ యా దేవతేప్సితా" అని బ్రహ్మ యాదేశించెను. సరస్వతి కుంభకర్ణు నావేశించెను. వాడు "స్వప్తుం వర్షా ణ్యనేకాని దేవదేవ మమేప్సితమ్' అని కోరగా బ్రహ్మ అట్లే అగుగాక యని అంతర్హితు డయ్యెను. సరస్వతియు తన మాయ నుపసంహరించెను.

రావణునకు సర్వామరత్వము సిద్ధించినంత యానందము కలిగెను: అట్టి విశ్వాసము తోడనే చేయవలసినన్ని దురంతములు చేసెను. దేవజాతులకు అవధ్యుడగుటచే వానియాటలు సాగుచుండెను. ఆ యాటలు కట్టవలసిన సమయమాసన్నమాయెను. అనగా శ్రీరాము డవతరింపవలసి యున్నది.

చిరకాలము అనపత్యుడై యుండిన దశరథుడు పుత్రార్థియై యశ్వమేధయాగాంగముగా పుత్రకామేష్టి తలపెట్టెను. ఋశ్యశృంగుడు ఆయనకు నలుగురు కొడుకులు పుట్టగలరని చెప్పెను. ఆ ప్రకారము వేదములను స్మరించి యథర్వ శిరోమంత్రములచే ఇష్టిచేయింప దొడగెను. యాగభాగములు స్వీకరించుటకు దేవతలు స్వయముగా వచ్చిరి. వారిలో బ్రహ్మయు నుండెను. అప్పుడు రావణుని ప్రసంగము వచ్చెను. దేవతలు బ్రహ్మతో నిట్లనిరి.

"భగవం స్త్వత్ప్రసాదేన
రావణో నామ రాక్షసః
సర్వా న్నో బాధతే వీర్యాత్
శాసితుం తం న శక్నుమః
త్వయా తస్మై వరో దత్తః
ప్రీతేన భగవన్ పురా
మానయంతశ్చ తం నిత్యం
సర్వం తస్య క్షమామహే. బాల XV 6-7

రావణుడు స్వయముగా నెంత బలవంతుడైనను దేవతలకు వానిని సంహరించుట కేవలము అసాధ్యముకాదు. తలచుకొన్నచో విష్ణువుచేతనైనను చంపింపగలరు. మాల్యవదాదులను విష్ణువు సంహరించెనుగదా. కాని బ్రహ్మవరమును మన్నించి దేవతలు రావణుని దుండగములు సహింపవలసి వచ్చెను కనుక

'వధార్థం తస్య భగవన్
ఉపాయం కర్తు మర్హసి' - బాల. XV-11

అని వారు బ్రహ్మను వేడుకొనిరి. ఆయన క్షణమాలోచించి —

'హంతాయం విదిత స్తస్య
వధోపాయో దురాత్మనః.

రావణునకు తానిచ్చిన వరమునందే వాని వధోపాయము దాగియున్నదని బ్రహ్మ గ్రహించెను.

"నా కీర్తయ దవజ్ఞానాత్
తద్రక్షో మానుషాం స్తదా
తస్మాత్ స మానుషా ద్వధ్యో
మృత్యు ర్నాన్యోఽస్య విద్యతే." XV-14

'మానవాత్' అనక 'మానుషాత్' అనుటవల్ల ఏ దేవుడో మానవ రూపమున నవతరించి రావణుని వధింపవలెనని సూచింపబడినది. ఈ సంభాషణ నడుచుచుండగా విష్ణువే అచటికి శంఖ చక్ర గదా పాణియై వచ్చెను. ఇకేమి? దేవతలందరు ఆదేవుని చుట్టుముట్టిరి, నమస్కరించి స్తుతించి యిట్లనిరి. 'ఓ విష్ణుదేవా! మేము లోకహితకాంక్షచే నిన్ను నియోగించుచున్నాము. నీవు ధర్మజ్ఞుడు,వదాన్యుడు, మహర్షి సమతేజుడు నైన దశరథునకు పుత్రుడవు కమ్ము. అట్లు మానుషరూపుడవై లోకకంటకుడు దేవతలకు అవధ్యుడు నైన రావణుని సంహరింపుము.'

విష్ణువు పుత్రరూపమున నవతరించి సేవించుటకు యోగ్యుడు దశరథుడు. యాగభాగములచే తమ్ము తృప్తిపొందించినట్టియు, అసురులతోడి యుద్ధముల దమకు దోడ్పడినట్టియు దశరథునకు దేవతలీశుభము కలిగింపదలచిరి. యజ్ఞపురుషనే ఆయనగర్భమున

జన్మింపుమని కోరిరి. బ్రహ్మ యేమియు పలుకలేదు. ఆయన రావణునకిచ్చిన వరము మాటయు దేవతలు ఎత్తలేదు.

విష్ణువు దేవతల ప్రార్థన నంగీకరించి సపుత్ర పౌత్రుని, సామాత్యుని, సమిత్రజ్ఞాతి బాంధవుని రావణుని సంహరింతు నని దేవతలకు మాటయిచ్చి అంతర్హితు డయ్యెను. రావణుని సంహరింపుమని దేవతలుకోరగా వానివంశమునే నిర్మూలింతునని విష్ణువు పలికెను. బ్రహ్మపై నిప్పుడు ఇంకొకభారము పడినది. త్రిలోకభీకరుడగు రావణుని సంహరించుటకై మానుషరూపమున నవతరింపబోవు విష్ణువునకు దోడ్పడుటకై దేవతలను ఋక్షవానరాదిజాతు లందవతరింపుడని బ్రహ్మ యాదేశింపవలసి వచ్చెను. ఇందువల్ల రావణవధ వృత్తాంతము సముద్రమంత కథయగు పరిస్థితి యేర్పడెను.

విష్ణుదేవుని యర్ధాంశమున శ్రీరామచంద్రుడు జన్మించెను. సీతాపహరణ మిషచే రావణాదులను సంహరించెను. అవతార ప్రయోజనమును నెరవేరెను, రాక్షససంహారార్థము విష్ణువు మత్స్యాద్యవతారములు ఇదివఱకు ధరించెను. కాని వానియందింత సన్నాహములేదు. వానికింత చరిత్రలేదు. శ్రీరామునివలె అవి పూర్ణపురుషరూపములుకావు. సత్య పరాక్రముడైన శ్రీరామచంద్రుడు సర్వగుణోపేతుడు. మానవ జాతికి ఆదర్శప్రాయుడు. అధర్మపరులను శిక్షించుట. ధర్మపరులను రక్షించుట మాత్రమేకాక ధర్మమును అస్ఖలితముగ ఆచరించి పురుషోత్తముని స్వరూపమును నిరూపించెను.

ఇట్టి శ్రీరామావతారమునకు మూలకారణము బ్రహ్మ. ఈ అవతారకథ అలోకసామాన్యమైనట్టిది. 'ఇదం పవిత్రం పాపఘ్నం, పుణ్యం వేదైశ్చ సమ్మితమ్'. ఈ యుదారచరిత్రము లోకమున చిరస్థాయికావలెనని భావించి బ్రహ్మ ఆ ప్రయత్నమున ప్రవృత్తుడయ్యెను.

వేదవేద్యుడైన పరమ పురుషుడు దశరథాత్మజుడై యవతరించెను. ఇంక వేదము రామాయణ రూపమున సాక్షాత్కరింపవలసి యున్నది.

'వేదః రామాయణాత్మనా సాక్షాదాసీత్'

సాక్షాదాసీత్ అనగా ప్రత్యక్షజ్ఞాన విషయమయ్యెనని యర్థము. వేదమున పరమపురుషుడు పరోక్ష జ్ఞాన విషయము. ధర్మమును అట్టిదే. ఆ పురుషుడు శ్రీరాముడై, ఆ ధర్మము శ్రీమద్రామాయణమై ప్రత్యక్షజ్ఞాన విషయము లయ్యెను.

వేదవేద్యుడైన పరమపురుషుడు మహావీరుడైన శ్రీరాముడుగా అవతరించుటకు రాజర్షియైన దశరథుడు ఎన్నికచేయబడెను. వేదము మహాకావ్యమైన శ్రీమద్రామాయణముగా అవతరించుటకు బ్రహ్మర్షియైన వాల్మీకి ఎన్నిక చేయబడెను.

ఒకనాడు నారదుడు వాల్మీకి యాశ్రమమునకు వచ్చెను. ఎటనుండివచ్చెనో? ఏలవచ్చెనో? రావలసిన సమయమున, రావలసినచోటికి వచ్చెను. వాల్మీకి చిత్తమున ఒకానొక ఇచ్ఛా విశేషము తీవ్రముగా స్పందించుచున్న ముహూర్తమది. సృష్ట్యున్ముఖమైన బ్రహ్మమునందు 'సో౽కామయత బహుస్యాం ప్రజాయేయ' అను రీతిన నుత్పన్నమైన స్పందనమువంటిది. వచ్చిన నారదుని వాల్మీకి పరిప్రశ్న చేసెను. నారదుడు తపఃస్వాధ్యాయ నిరతుడు. ఆయన తపస్సు సాత్త్వికము, జ్ఞానమయము. ఆయన స్వాధ్యాయమునకు మోక్షప్రదమగు జ్ఞానమే ఫలము. స్వర్గాదిప్రదమగు యాగాది కర్మకాదు. ఆయన వేదవేద్యుడైన నారాయణుని సుష్ఠుగా నెఱుగును. వాల్మీకియు నిట్టివాడే. నారాయణుని స్వరూపము ఆయన హృదయమున వెలుగుచునేయున్నది. తన హృదయమునందున్న నారాయణుని లక్షణములు గల నరుడులోకమున నెవ్వడైన కలడా యని వాల్మీకి జిజ్ఞాస. 'పరిప్రపచ్ఛ' యనగా లక్షణము తెలిసియుండి లక్ష్యమును తెలిసికొనగోరి పృచ్ఛచేసెనని యర్థము. వేదవేద్యుడైన పరమపురుషుని లక్షణములు వాల్మీకికి ఎఱుకయే. ఆ లక్షణములకు లక్ష్యభూతుడైన నరుని గూర్చియే యాయన ప్రశ్న.

వాల్మీకి ఋషికదా! ఆర్షదృష్టితో చూచి యట్టి నరుని తెలిసికొనజాలడా? అన్నచో తెలిసికొన జాలడు. ఋషిదృష్టిగాని, యోగిదృష్టిగాని నిరాలంబ ముగ ప్రసరింప జాలదు. నారదుడు త్రిలోకజ్ఞుడు గనుక వాల్మీకి—

'కో న్వస్మిన్ సాంప్రతం లోకే
గుణవాన్ కశ్చ వీర్యవాన్'

ఇత్యాదిగా పదునారు మహాపురుష లక్షణములను పేర్కొని 'ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హిమే! మహర్షే!త్వంసమర్థోఽసి జ్ఞాతుమేవం విధం నరం' అని నారదుని అడిగెను. "ఇప్పుడు ఈలోకమున ఈ గుణములుగల నరుడెవ్వడు? ఇది వినవలెనని నాకు పరమకుతూహలముగా నున్నది' అని వాల్మీకిమాట. ఈ కౌతూహలము విధిప్రేరితము. అది పరిప్రశ్నకు ప్రేరకము. పరిప్రశ్న కేవల జిజ్ఞాసారూపము కాదు. ప్రత్యభిజిజ్ఞాసా రూపము. అనగా సామాన్యరూపమున జ్ఞాతమైన వస్తువును విశేష రూపమున దెలిసికొనవలెననెడి కోరిక. అట్లు తెలిసినవాడు నారదుడు. వాల్మీకి పదునారు గుణములు పేర్కొనగా నారదుడు అరువదినాలుగు గుణములను పేర్కొని ఆ గుణములుగల నరుడు ఇక్ష్వాకువంశ ప్రభువుడైన శ్రీరాచంద్రుడని తెలిపి ఆయన కథను సంగ్రహముగా చెప్పెను. ఆ శ్రీరామ చంద్రుడు వీర్యమున విష్ణుసదృశుడనియు చెప్పెను. శ్రీరామచంద్రుడు ఒక మహాపురుషుడైన నరమాత్రుడు కాడనియు శ్రీమన్నారాయణుని యంశమున నరలోకమున జన్మించిన అవతారపురుషుడనియు నారదుడు సూచించినట్లయినది.

'ఇదం పవిత్రం పాపఘ్నం
పుణ్యం వేదైశ్చ సమ్మితమ్
యః పఠే ద్రామచరితం
సర్వపాపైః ప్రముచ్యతే."

అని రామకథకు ఫలశ్రుతికూడచెప్పి వాల్మీకిచే పూజలందుకొని నారదుడు విహాయసమునకేగెను.వాల్మీకి యడుగగా నారదుడు 'ప్రహృష్టుడై' ఈ కథ చెప్పుటయు, చెప్పి వెంటనే స్వర్గమునకు వెడలి పోవుటయు చూడగా ఆయన వాల్మీకికి ఈకథచెప్పుటకే పనికట్టుకొనివచ్చినట్లు తెల్లమగును. 'యఃపఠేత్ రామచరితం' అని ఫలశ్రుతిలో 'పఠేత్' అనుట వలన రామకథను వాల్మీకి వ్రాయవలెనన్న యభిప్రాయము నారదుని మనస్సునందున్నట్లు తెల్లమగుచున్నది. 'ఏతదాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం' అని నారదుడు తాను చెప్పిన ఆఖ్యానమునకు 'రామాయణమ్'అని నామకరణముకూడ చేసినట్లయినది.

నారదుడు స్వర్గమున కరిగిన క్షణమందే వాల్మీకి తమసాతీరమునకు స్నానార్థము బయలుదేరెను. రామాయణము ఆయన హృదయము నిండియుండెను. రామకథా చక్రమునకు నాభిస్థానమై సీతారాముల వియోగఘట్టమును ఆయన చర్వణ చేయుచుండెను గావలయు. రామకథా భావనావశమున ఆయన చిత్తము సత్యప్రతిష్ఠ పొందియుండెను. ఆయన తమసాతీరము చేరెను. నిత్యము తాను స్నానమాడుచున్న తీర్థమే యది. కాని నేడది యేమో వింతగా నున్నది. ఆయన తన ప్రక్కనేయున్న భరద్వాజునితో నిట్లనెను.

'అకర్దమ మిదం తీర్థం
భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు
సన్మనుష్య మనో యథా,'

ఓహో! ఏమి రమణీయమైన వర్ణన. అకర్దమము, ప్రసన్నాంబువు అయిన తమసా తీర్థము సన్మనుష్యుని మనస్సువలె రమణీయముగా నున్నదట. తన హృదయమువలెనే ఉన్నది కాబోలు! తన హృదయమున నిండియున్న శ్రీరామచంద్రుని హృదయమువలె నున్నది కాబోలు!

వాల్మీకి కేవలము ఋషి కాడు. ఆయనలో కవి యున్నాఁడు. ఆకవి యిప్పుడు మేల్కొనుచున్నాడు.

కనుకనే ఆయన రామకథా కావ్య నిర్మాణమునకు విధిచే వరియింప బడినాడు. తమసాతీర్థము ప్రసన్నముగా నున్నదని ఋషిచెప్పగలడు. రమణీయముగా నున్నదని సహృదయుడు చెప్పగలఁడు. సన్మనుష్యుని హృదయమువలె నున్నదని కవి మాత్రమే చెప్పగలడు. సత్యమును సత్యముగా దర్శించువాడు ఋషి. దానిని సుందరముగా దర్శించువాడు కవి. వాల్మీకి కవి యగుచున్నాడు. సౌందర్య దర్శనలోలు డగుచున్నాడు. ఆయన తమసా నదీ తీర్థమున అవగాహనమునకు బూనుకొనక విపులమైన అచటి వనమున సంచరింప సాగినాడు. చిరపరిచితమైన ఆవనమున ఆనాడు ఆయనకు క్రొత్తసౌందర్యము భాసించె గావలయు!

ఆర్షమైన వాల్మీకి ప్రజ్ఞ యిప్పుడు నవనవోన్మేష శాలిని యైన ప్రతిభ యగుచున్నది. వన సౌందర్యదర్శనలాలసుడై సంచరించుచున్న ఆయనకు చేరువనే జతగూడి చారు నిస్వనము చేయుచున్న క్రౌంచమిథునము కనబడెను. ఆజంట సీతా రాములవలె, ఆ చారు నిస్వనము వారి శృంగార మధురాలాపములవలె ఆయన హృదయమున భాసించుచుండె గాబోలు! స్వగత సుఖదుఃఖ రహితుడైన ఆ నియతేంద్రియుడు, ఆ భగవానుడు పరగత సుఖదుఃఖాది భావనాపరతంత్రు డగుచున్నాడు. భావితాంతఃకరణుడై రసీభవనోన్ముఖు డగుచున్నాడు. కానిచో నామహితాత్ముని చిత్తము రతి క్రీడాసక్తమైయున్న క్రౌంచమిథునమున లగ్నమగుట యేమి? అకర్దమ తమసా తీర్థమువలె ప్రసన్నమైన ఆయన హృదయము క్రౌంచమిథున చారునిస్వనముచే మాధుర్యమయ మగుచున్నది. అంతరంగమున సీతారాములు, బహిరంగమున క్రౌంచమిథునము ఏకాలంబనమై ఆయన చిత్తమున శృంగార రసోదయమగుచున్నది. ఆయన రససమాధి నందుచున్నారు. ఆకస్మికముగా రససమాధి భంగమైనది. కారణము ఆలంబన భంగము.

'తస్మాత్తు మిథునా దేకం
పుమాంసం పాపనిశ్చయః
జఘాన వైరనిలయో
నిషాద స్తస్య పశ్యతః,

తం శోణిత పరీతాంగం
చేష్టమానం మహీతలే
భార్యాతు నిహతం దృష్ట్వా
రురావ కరుణాం గిరమ్.

*  *  *  *

తథా విధం ద్విజం దృష్ట్వా
నిషాదేన నిపాతితం
ఋషే ర్ధర్మాత్మన స్తస్య
కారుణ్యం సమపద్యత.

తతః కరుణవేదిత్వా
దధర్మోఽయ మితి ద్విజః
నిశామ్య రుదతీం క్రౌంచీ
మిదం వచన మబ్రవీత్.'

శోణితపరీతాంగమై నేలపై గిలగిల తన్నుకొనుచున్న క్రౌంచమును వాల్మీకి చూచెను. ధర్మాత్ముడైన ఆయనకు కారుణ్యము కలిగెను. ఆయన యందలి ఋషి 'ఇది యధర్మము' అనెను, వాల్మీకి క్రౌంచీరోదనమును వినెను. ఆయన యందలి కవి యిట్లనెను —

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామ మోహితమ్."

వాల్మీకి యీ వాక్యము పలికెను. పలుకవలెనని పలుక లేదు. క్రౌంచీరోదన చోదితుడై పలికెను. అసలు ఆయన పలుకలేదు. అది ఆయనచే పలుకబడెను. ఆ వాక్యము యొక్క అంతరంగమైన యర్థముగాని, బహిరంగమైన యక్షర విన్యాసముగాని ఆయన కృతములు కావు. ఆయన యత్పరతంత్రుడో తత్కృతములు. పరమార్థమున అది

క్రౌంచీ వాక్యము. వాల్మీకి వదనమునుండి అప్రయత్నముగా వెలువడినది దాని యనువాదము.

"ఓరి నిషాదుడా! నీవు చిరకాలము బ్రతికి యుండవు. మా జంటలో కామమోహితమైన యొక దానిని చంపితివిగదా!"

క్రౌంచి రోదనము యొక్క స్వరూప మిది. ఇదియే సంస్కృత భాషా రూపమున వాల్మీకి వదనమునుండి నిర్గమించినది. బాణవిద్ధమై క్రౌంచము నేలపైబడుట క్రౌంచి చూచినది. వాల్మీకియు చూచెను. క్రౌంచి కంఠమునుండి రోదనము వెడలినది. వాల్మీకి కంఠమునుండి వాక్యము వెడలినది. వాల్మీకికి క్రౌంచమునుగూర్చి శోకము లేదు, నిషాదుని గూర్చి క్రోధములేదు. ఈ రెండు భావములును క్రౌంచివి. అవియే దాని రోదనమునందున్నవి. ఆ రోదనమున కనువాదమైన వాల్మీకి వాక్యము నందును అవియే యున్నవి.

"తస్యైవం బ్రువత శ్చింతా
బభూవ హృది వీక్షతః
శోకార్తే నాస్య శకునేః
కిమిదం వ్యాహృతం మయా ?"

'మానిషాద' వాక్యమును పలుకుచు వాల్మీకి తన హృదయమున వీక్షించెను. ఆయనకు చింతకలిగెను– 'ఈ శకుని యొక్క శోకముచే ఆర్తుడనైన నాచే పలుకబడిన యిది యేమి?' ఈ విధముగా చింతించుచు ప్రాజ్ఞుడు, మతిమంతుడునైన ఆయన యిట్లు నిశ్చయించెను. ఈ నిశ్చయము వాక్యబహిరంగమైన యక్షర విన్యాసమునకు సంబంధించినది.

"పాదబద్ధోఽక్షరసమః
తంత్రీ లయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే
శ్లోకో భవతు నాన్యథా"

శోకార్తుడనైన నా వాగ్వృత్తి పాదబద్ధము, అక్షరసమము, తంత్రీలయ సమన్వితమునై శ్లోకమే యగునుగాని వేఱుకాదు. తానుచ్చరించిన వాక్యము తన శ్రుతికి రమణీయముగా నుండుటకు కారణములైన తద్గత లక్షణములను వాల్మీకి నిశ్చయించెను.

'శ్లోకః శృణోతేః' అను యాస్కముని నిరుక్తిననుసరించి శ్లోకశబ్దమునకు శ్రోతవ్యము, శ్రవ్యము అని యర్థము. తానుచ్చరించిన వాక్యము శ్రవ్యమై యుండుట వాల్మీకి గుర్తించెను. ఆ శ్రవ్యతకు హేతువు లన్వేషించి నిశ్చయించెను. ఆ వాక్యము పాదబద్ధము, అక్షరసమము. ఇది శ్రవ్యమైన పదబంధ లక్షణము–ఛందము. వేదవాక్యములు ఛందోమయములు. ఇప్పుడు వాల్మీకి పలికిన వాక్యము కూడ ఛందోమయము. లోకమున ఛందము అవతరించినది. ఛందోమయమైన వాల్మీకి వాక్యమును విని ప్రక్కనేయున్న భరద్వాజుడు సంహృష్టుడై దానిని వెంటనే కంఠస్థము చేసినాడు.

"న్యస్యతాం కలశ స్తాత
దీయతాం వల్కలం మమ
ఇద మేవావగాహిష్యే
తమసాతీర్థ ముత్తమమ్"

ఇదిగో స్నానము చేయుదును అని తనవద్దనున్న వల్కలమును దీసికొనియు స్నానమాడక, వనమున సంచరింప దొడగిన వాల్మీకి అన్యమనస్కత భరద్వాజుడు కనిపెట్టెను. నేడు మునివర్తనము చిత్రముగా నున్నది. భరద్వాజుని దృష్టి యంతయు మునిమీదనే లగ్నమై యుండెను. ఆయన నోటవెలువడిన శ్రవ్యవాక్యబంధము నాతడు వెంటనే పట్టివైచెను.

"సమాక్షరై శ్చతుర్భి ర్యః
పాదై ర్గీతో మహర్షిణా
సోఽనువ్యాహరణా ద్భూయః
శోకః శ్లోకత్వ మాగతః"

సమాక్షరములైన నాల్గుపాదములతో మునిచే గీతమైన శ్లోకము అనువ్యాహరణము వలన శ్రుతి రమణీయత్వము పొందినదట. మానిషా దేత్యాది వాక్యమును వాల్మీకి ఊరక పలుకలేదు. 'మయా

వ్యాహృతం' అని మునియు, 'మహర్షిణా గీతః' అని భరద్వాజుడును ఆ యుచ్చారణ లక్షణమును వర్ణించుచున్నారు. 'వ్యాహృతం'అనుటవల్ల మునికి తనవాక్యము వేదమంత్రోచ్చారణమునవలె వినవచ్చిన దనియు, 'గీతః' అనుటవల్ల భరద్వాజునకు అది సామగానమువలె వినవచ్చినదనియు గ్రహింపవల యును. అనగా క్రౌంచీ శోక సమాహిత చిత్తుడైన వాల్మీకి నోట వెలువడిన వాక్యము ఛందోమయమై వేదమంత్ర సదృశమై యున్నదని యర్థము. వేదము రామాయణ రూపముగ సాక్షాత్కరింప వలసి యున్నదిగదా! కనుక అట్టి సాక్షాత్కారము నకు అనువైన వాక్యము వాల్మీకి ముఖమునుండి ఆవిర్భవింపవలసి యున్నది, ఆవిర్భవించినది.

వాక్యము యొక్క బహిరంగము నిశ్చితమైనది. అంతరంగము చూడగా శాపోక్తిగా నున్నది. వాల్మీకి మిగుల చింతపడెను. ఇట్టి ఉక్తి తననోట నేల వెలువడెను? ఇట్లు చింతించుచునే ఆయన స్నానమాడి యాశ్రమమునకు మరలి పోయెను. ఆ వాక్యమును ధ్యానించుచునే శిష్యులతో అవియివి సంభాషించుచుండెను.

అప్పుడు బ్రహ్మ యామునిపుంగవుని చూచుటకు అచ్చటికి వచ్చెను. ఆయనను గాంచి వాల్మీకి పరమ విస్మితుడయ్యెను. త్రిలోక సంచారియైన నారదుడు వచ్చుట వేఱు. లోకకర్త, స్వయం ప్రభువు నైన బ్రహ్మ తన యాశ్రమమునకు వచ్చుటయేమి? వాల్మీకి ఆశ్చర్యపడి ఆయనకు ఆసనాది సత్క్రి యలు గావించినాడు. కాని వెంటనే ధ్యానములో మునిగిపోయినాడు. తన యెదుట బ్రహ్మ యంతటి వాడు వేంచేసియున్నాడు. అయినను వాల్మీకి మనస్సు ఆయనపై లేదు. క్రౌంచీ వృత్తాంతము మరల ఆయన మనస్సును క్రమ్ముకొని వచ్చినది.

"చారు నిస్వనమైన యా క్రౌంచమును అకార ణముగా చంపి వైరగ్రహణ బుద్ధియైన ఆపాపాత్ము డెంత ఘోరము చేసెను"— ఇట్లు చింతించుచు, క్రౌంచిని భావించి శోకించుచు, అంతర్గత మన స్కుడై ఆయన ఆ శ్లోకమును మరల గానము చేసెను. శోకపరాయణుడైన వాల్మీకిని గాంచి బ్రహ్మ నవ్వి యిట్లనెను —

"శ్లోక ఏవా స్త్వయం బద్ధః
నాత్ర కార్యా విచారణా
మచ్ఛందా దేవ తే బ్రహ్మన్
ప్రవృత్తేయం సరస్వతీ"

బద్ధమైన యీ వాక్యము శ్లోకమే యగును. ఇందు విచారింపవలసిన దేమియులేదు. నా ఛందము వల్లనే నీ యీ సరస్వతి యిట్లు ప్రవర్తిల్లినది — అని బ్రహ్మ నవ్వుచు పలికెను.

కుంభకర్ణునినోట ఈ విధముగా ప్రసరింపుము అని వెనుక సరస్వతిని ఆదేశించెను. ఇప్పుడు వాల్మీకినోట ఈవిధముగా ప్రసరింపుమని బ్రహ్మయే సర్వస్వతి నాదేశించెను. ఇది తెలియక వాల్మీకి చింతించుటచూచి బ్రహ్మకు నవ్వువచ్చెను. అకృతక మధురమైన ఛందోమయ సరస్వతి వదనమునుండి ఆవిర్భవించుటచే వాల్మీకి యిప్పుడు బ్రహ్మయంతటి వాడయ్యెను — ఆదికవి యయ్యెను.

వాల్మీకి రామకథ వినెను. దానిని భావించుచు తమసాతీరమునకు బోయెను అచ్చట క్రౌంచ మిథున వృత్తాంతమును చూచెను. తన్మయు డయ్యెను. శ్రుతమైన యర్థము యొక్క సారము దృష్టమై వాల్మీకిని తనమయము గావించుకొన్నది. దాని ప్రభావము అతిప్రగాఢమైనది, బ్రహ్మయంతటి వాడు ఎదుటనున్నను వాల్మీకి దాని ప్రభావమును తొలగద్రోయజాలక పోయెను. కవియగువానికి ఇట్టి ప్రగాఢమైన వస్తు భావన యుండవలయును. వాల్మీకి యందు అది నెలకొన్నది. క్రౌంచద్వంద్వ వియో గోత్థమైన శోకతన్మయీభావ సంస్కారముతో వాల్మీకి సీతాచరితమైన రామాయణమును భావించును, దానిని రసమయము చేయును.

"వృత్తం కథయ వీరస్య
యథా తే నారదా చ్ఛ్రుతమ్"

అని బ్రహ్మ యాదేశించెను. వాల్మీకియొక్క ప్రజ్ఞ నవనవోన్మేష శాలినియైనది. అపూర్వవస్తు నిర్మాణ క్షమ యైనది. కావ్యఘటనానుకూల శబ్దార్థోపస్థితి యైనది. ఇంక కావ్యము ఆవిర్భవింప వలసి యున్నది.

'యథా తే నారదాత్ శ్రుతమ్'అని బ్రహ్మ యెట్లనెను ? నారదుడు వచ్చి వాల్మీకికి రామకథ చెప్పి వెళ్ళినట్లు బ్రహ్మకు తెలియునా ? తెలియును. వాల్మీకి చిత్తమున ప్రత్యభిజిజ్ఞాసా రూపమైన స్పందము పుట్టించి, ఆయన పరిప్రశ్నకు సమాధానముగా రామకథ చెప్పి రమ్మని నారదుని పంపినది బ్రహ్మయే. కనుకనే వాల్మీకి యడిగినంతనే నారదుడు 'ప్రహృష్టుడై' రామకథ చెప్పెను: క్రౌంచీ శోకార్తుడై యున్న యవస్థలో వాల్మీకి వదనము నుండి ఛందస్సుందరమైన రసవద్వాక్యరూపమున నిర్గమింపుమని సరస్వతిని పంపినవాడును బ్రహ్మయే, ఇప్పుడు చింతాపరాయణుడై యున్న వాల్మీకికి నారదునివలన విన్న తీరున రామచరితమును చెప్పుము అని ఆయనయే స్వయముగా వచ్చి ఆదేశించెను.

నారదుడు చెప్పిన రామకథ రేఖామాత్రము. దానిని నానావర్ణ శబలమైన సుందర చిత్రముగా రూపొందించు భారము వాల్మీకిపై నున్నది. ఆర్షమైన ప్రజ్ఞా చక్షువు కావ్యమైన ప్రాతిభ చక్షువుగా పరిణమించినది. దానికి గోచరముగావి యంశము ఉండదు.

"రహస్యంచ ప్రకాశం చ
యద్వృత్తం తస్య ధీమతః
రామస్య సహ సౌమిత్రేః
రాక్షసానాం చ సర్వశః
వైదేహ్యాశ్చ యద్వృత్తం (?)
ప్రకాశం యది వా రహః
యచ్చాప్యవిదితం సర్వం
విదితం తే భవిష్యతి."

రామకథ యందలి సర్వవ్యక్తుల యొక్క సర్వ ప్రవర్తనలు–రహస్యములు, ప్రకాశములు–వాల్మీకి ప్రతిభా చక్షువునకు గోచరములగును. ఆ యంశములతో వర్ణితమై రేఖామాత్రమైన రామకథ సంపూర్ణ చిత్రముగా రూపొందును.

"న తే వా గనృతా కాచి
దత్ర కావ్యే భవిష్యతి
కురు రామకథాం పుణ్యాం
శ్లోకబద్ధాం మనోరమామ్"

ఈ కావ్యమున నీ వాక్యమొక్కటియు అనృతము కాబోదు. పుణ్యమైన రామకథను శ్లోకబద్ధము మనోరమము చేయుము. ప్రాతిభమైన జ్ఞానముతో చెప్పిన వాక్యము అసత్యము కాకుండుటేకాదు, అసందర్భమును కాదు; కనుక అది జగన్మంగళకరము, జగదానందకరము నగును.

వేదసమ్మితమైన రామకథ, ప్రాతిభమైన దర్శనము, ఛందోమయమైన వాక్యము ఆదికావ్య నిర్మాణముకొఱకే బ్రహ్మచే వాల్మీకి మహర్షికి ప్రసాదింప బడినవి. 'కురు రామకథాం' అని యాదేశించి —

'యావత్ స్థాస్యంతి గిరయః
సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణ కథా
లోకేషు ప్రచరిష్యతి'

అని యాశీర్వదించి బ్రహ్మ యచ్చటనే అంతర్హితుడయ్యెను. మునియు, శిష్యులును విస్మయపడిరి. శిష్యులందరును 'మా నిషాద' శ్లోకమును మరల మరల గానము చేయుచు ప్రీతులు, విస్మితులు నగుచుండిరి. శ్రీరామచంద్రుని యవతారమువలె ఛందోమయ వాక్యము యొక్క అవతారమును విస్మయానంద జనకము. శిష్యులు శ్లోకమును మరల మరల గానముచేసి యానందించుచుండగా భావితాత్ముడైన వాల్మీకికి ఈ నిశ్చయము కలిగెను—

"కృత్స్నం రామాయణం కావ్య
మీదృశైః కరవా ణ్యహమ్"

నారదుడు చెప్పిన రామాయణము కేవలము కథ. వాల్మీకి చేయబోవు రామాయణము కావ్యము. నారదుడు చెప్పిన రామాయణము ఆయన చూచిన సత్యము. వాల్మీకి చేయబోవు రామాయణము ఆయన భావించిన సత్యము. రెండును సత్యములే. రెండవది సుందరమైన సత్యము. ఛందోబద్ధములైన వాక్యములచే శ్రుతిరమణీయము, ప్రత్యక్షకల్ప సంవేదనోదయముచే మనోరమణీయము నగు తీరున వాల్మీకి రామకథను కావ్యముగా నిర్మింప బూనుకొనెను.

ఆయన ఉదకమునుపస్పృశించి, కృతాంజలియై, ప్రాచీనాగ్రములైన దర్భలయందు గూర్చుండి ధర్మవీర్యముచే శ్రీరామాదుల హసితము, భాషితము, గతి, చేష్టితము – సర్వము పాణియందు ఆమలకమును చూచినట్లు చూచెను. చూచినది చూచినట్లు సూటియైన తేటమాటలతో చెప్పెను. ఇట్లు ఉదారవృత్తార్థపదములు, మనోహరములు నైన సమాక్షర శ్లోకశతములతో ఉదారబుద్ధియైన వాల్మీకి మహర్షి అభిరాముడైన శ్రీరాముని చరితమును యశస్కరమైన కావ్యముగా నిర్మించెను. బ్రహ్మ ప్రయత్నము ఫలించినది. ఆది కావ్యము ఆవిర్భవించినది.

యావత్ స్థాస్యంతి గిరయః
సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణ కథా
లోకేషు ప్రచరిష్యతి.

ఇతి శివమ్

శ్రీ నిడుదవోలు
సుందరేశ్వరరావు

# ద్వితింత్రిణి సీతారామకవి

ద్వితింత్రిణి సీతారామకవి అథర్వణాచార్య విరచితమైన వికృతివివేకమను వ్యాకరణమునకు టీకాకర్త. వికృతి వివేకమునకే 'అథర్వణకారి కావళి'[1] యని వ్యవహారనామము. సీతారామకవి తన టీకకు 'కవిజన మండన'మని నామకరణము చేసెను. సంజ్ఞా, సంధి, అజన్త, హలన్త, క్రియా పరిచ్ఛేదములుగా విభజింపబడిన అథర్వణ కారికావళి సంస్కృతభాషలో తెలుగుభాషకు వ్రాయబడిన వ్యాకరణగ్రంథమనియు, నిది నన్నయ కృతాంధ్ర శబ్దచింతామణికి పరిశిష్ట మనియు, నన్నయ ప్రథమాచార్య డనియు, నథర్వణుడు ద్వితీయాచార్యుడనియు- మొదలగు విషయములు విద్వల్లోక మెరింగినవే.

సీతారామకవినిగూర్చి మాత్రము విశేషముగా కాకపోయినను కించిత్తయినను దెలియకపోవుటచే నీవ్యాసద్వారమున నాకు దెలిసిన యంశములను ప్రకాశము చేయుచున్నాను. ప్రతిపరిచ్ఛేదాంతమున గల గద్యయందు సీతారామకవి తన స్వవిషయమును కొంత తెలియబర్చినాడు.

"ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ, ద్వితింత్రిణీవంశ పయః పారావార సుధాకర వసిష్ఠ పుత్రుండగు సీతారామకవిచే రచియింపబడిన కవిజన మండనాఖ్యయగు వికృతివివేక టీక".

దీనినిబట్టి సీతారామకవి యింటిపేరు రెంటచింతల వారనియు, తండ్రివసిష్ఠుడనియు, నితనికి కవిత్వము శ్రీరామచంద్రుని కరుణాకటాక్షముచే నబ్బినదనియు గ్రహింపవచ్చును. ఇతడు కేవలము టీకాకర్తగా గాక కవిగాగూడ తెలియుట మరొకవిశేషము.

హలన్తపరిచ్ఛేదమున 17వ సూత్రమునకు గల టీకలో

"ధరఁబుట్టనివాఁడును, యమ
పురమున నివసించినట్టి పురుషుండును, గో
డ రచించిన వాఁడును ము
గ్గురు ద్రవిడులలోన సాధుగుణయుతు లరయన్

అని ద్వితింత్రిణీ రామకవి చాటుధార" (పుట 140) అని కలదు.

ఈ రామకవి సీతారామకవి కేమగునో తెలియదు. గ్రంథాంతమున గల

క. వికృతి వివేకంబునకున్
సుకవులు మెచ్చంగ రామసూరి రచించెన్
వికృత పదాంచిత టీక జ
నకధరణీధవసుతాధినాథుని కరుణన్.

అను పద్యమునుబట్టి సీతారామకవికి రామసూరి యను హ్రస్వనామ ముండెడిదనియు, పైచాటు వీతనిదేయనియు చెప్పుట కవకాశము గలదు. సీతారామకవి నీమము దప్పక నిత్యము రాముని పూజించెడివాడు, తనకీ టీక వ్రాయుశక్తి ఆ రాముని కరుణ వలననే గలిగెనని కవిజనమండనములోని అవతారికాపద్యములు చెప్పుచున్నవి.

మనకు కవిజనమండన టీకవలన సీతారామకవి చరిత్ర మింతమట్టుకే తెలియును.

ఇతడేకాలమువాడో తెలియదు. ఈ గ్రంథమునకు తిలకాయమానముగ 66 పుటల సటీకాథర్వణ కారికావళీ విమర్శనము వ్రాసిన కళాప్రపూర్ణవఝుల

1. వావిళ్ళ. మదరాసు. 1921 (నేనీ ప్రతినే వాడితిని. ఇందలి సూత్ర, పుట సంఖ్య లీ ముద్రిత ప్రతిలోనివే.)

చిన సీతారామశాస్త్రిగారు సీతారామకవిని గూర్చియు, కాలమునుగూర్చియు నిట్లువ్రాసిరి.[2]

"కారికావళికి(డీకను వ్రాసిన యీ ద్వితింత్రిణి సీతారామ కవిగా రేకాలమువారో వీరి చరిత్రాదిక మేమో స్పష్టముగాఁ దెలుపుటకుఁ దగిన యాధార ములు నాకు లభింపలేదు. వ్యాఖ్యాన ప్రారంభమున వారుచెప్పిన విషయములను బట్టియు నట్టివిషయము లెవ్వియుఁ దేటపడకున్నయవి." (పుట. 43)

"ద్వితింత్రిణి సీతారామకవిగా రహోబలపతికిఁ దరువాతివారును బాలవ్యాకరణకర్త యగు చిన్నయ సూరి గారికిఁ బూర్వులును నని గ్రహింపవలసి యున్నది. కాబట్టి యాతఁడు పదునెనిమిదవ శతాబ్దము తుదివాఁడుగాని పందొమ్మిదవ శతాబ్దము మొదటి భాగములోనివాఁడుగాని యయియుండు నని యెన్న వలయును." (పుట. 47).

శాస్త్రుల వారిట్టి నిర్ణయమును జేయుటకు కార ణము 'ఈ టీకాగ్రంథమును బాలవ్యాకరణ గ్రంథ మించుక నవరించుచున్న ట్లగపడుచుండుటచే బాల వ్యాకరణమీ టీకాగ్రంథమునకుఁ దర్వాతిదనియుఁ జెప్పనగునని' వారు సెలవిచ్చుటయే (పుట.47).

గురువుగారితో నేకీభవింపక వారి శిష్యులైన దుప్వూరి వేంకటరమణశాస్త్రిగారు తమ రమణీయ ములో[3] (పుటలు. 351, 352) కారకపరిచ్ఛేదము 28వ సూత్రమును వివరించుపట్టున "కావున సీతా రామకవి బాలవ్యాకరణము నుండియే యీ యుదా హరణము గ్రహించినటుల తేలుచున్నది" అని వ్రాసిరి. (విశేష వివరములకాయా పుటలను జూచు నది). ప్రకృతము మనకు కావలసినది శ్రీవేంకట రమణ శాస్త్రిగారి యభిప్రాయము మాత్రమే. వీరి అభిప్రాయములో సీతారామకవి చిన్నయసూరికి దర్వాతివాడనియే గదా!

ఈ చర్చ యింతటితో ముగియలేదు. డా. బొడ్డు పల్లి పురుషోత్తంగారు 'తమ' తెనుఁగు వ్యాకరణ వికాసములో—

"ద్వితింత్రిణి సీతారామకవి చిన్నయసూరికి పూర్వుడని శ్రీ శాస్త్రిగారి[4] యభిప్రాయము. చరిత్రా దుల విషయమునను, దూతశబ్దమునకమహత్త్వంబున స్త్రీత్వంబు విధించుపట్లను, దర్భాదులకు స్త్రీత్వంబు నిత్యం బనుటలోను ద్వి. సీ. కవి స్వోపజ్ఞతను జూపెనని, చి.సూ. ఆతని నిర్ణయములనే స్వల్ప ముగా సవరించి యుపయోగించుకొనెనని శ్రీ శాస్త్రి గారి యభిప్రాయము. శ్రీ దుప్వూరి వేంకటరమణ శాస్త్రిగారు దీనికి వ్యతిరేకముగు నభిప్రాయమును వేరొక సందర్భమున నుద్ఘాటించిరి. సీతారామకవి కాలనిర్దేశమున కెన్నిప్రయత్నములు కావించినను సఫలము కాలేదు."[5] వీరు వేంకటరమణశాస్త్రిగారితో నేకీభవింపరైరి.

ఈ విద్వాంసుల ముప్వురి యభిప్రాయములు మూడుదారులయినవి. ఈ సమస్యను కొంత చక్క బరచుట కించుక ప్రయత్నించెదను.

బాల సరస్వత్యప్పక వ్యహోబలపతులను సీతా రామకవి తనటీకయందు స్మరించుటచే నీతడు వారికి తర్వాతివాడనుట స్పష్టము (అనగా క్రీ.శ. 1700 తర్వాత). కూచి మంచి తిమ్మకవికృత నీలా సుందరీ పరిణయము (2.30) నుండి యొకపద్యమును సీతారామకవి కవిజన మండనమందు (అజన్త. 89 సూ. పుట. 111) లక్ష్యముగా గ్రహించుటచే నీతడు[6] క్రీ. శ. 1726 కు తర్వాతివాడగును.

2. పీఠిక తేది. 30–6–1918

3. రమణీయము - బాలవ్యాకరణ సమీక్ష. (1964)

4. వఝల చినసీతారామశాస్త్రిగారు.

5. తెనుఁగు వ్యాకరణ వికాసము. ప్రథమ సంపుటి. పుట. 284 (1969) మరియు అదే పుట. చూ. అథోజ్ఞాపిక 4వ సంఖ్య.

6. ఆంధ్రకవుల చరిత్ర - తృతీయ భాగము. ఆధునిక కవులు. కందుకూరి వీరేశలింగము పంతులు గారు. పుట. 46. (ముద్రణ. 1950)

చిన్నయసూరి జీవితకాలము 1806-1862 కావున సీతారామకవి, కూచిమంచి తిమ్మకవికి చిన్నయ సూరికిని మధ్య అనగా క్రీ. శ. 1726-1800 మధ్యనైన నుండి యుండవలెను; లేదా చిన్నయసూరి మరణానంతరము క్రీ. శ. 1862 తర్వాత జీవించియుండియుండవలెను.

శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండ[7]మను గ్రంథమునురచించిన మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు తమకీ సీతారామకవి గురువని వారి నిట్లు స్తుతియించిరి.

తే. తనదు భరత చరిత్ర గద్వాల రామ
మహిపతి కొసంగి సన్మాన మహిమఁ బొంగి
వెలయు మద్గురు రెండు చింతల వసిష్ఠ
పుత్రుఁ గొలుతు సీతారామ బుధకవీంద్రు
(1. 17)

కవిజనమండన టీకాకర్తయు, వసిష్ఠపుత్రుడు నగు ద్వితింత్రిణి సీతారామకవియు అప్పారావు గారి గురువైన వసిష్ఠపుత్రుడును భరతచరిత్ర కర్తయనగు రెంటచింతల సీతారామకవియు నొక్కరే యని నా యభిప్రాయము.

నందగిరి వేంకటప్పారావుగారిది కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరుగ్రామము. మరి మన సీతారామకవి భరత చరిత్రనువ్రాసి ఆనాడు నిజాము రాష్ట్రముననున్న గద్వాల రామభూపాలున కంకిత మొసంగెనట. సీతారామకవి యే ప్రాంతమువాడు? గద్వాలపట్టణము గల మహబూబునగర మండలము వాడా ? లేదా కృష్ణాప్రాంతమువాడా? ఈ ప్రశ్నలకు సమాధానము కావలసియున్నది.

అప్పారావుగారును, అడవి సాంబశివరావు[8] అను వేరొక కవి గారును కలిసి శివవేంకట కవులను పేర జగన్నాథీయ[9]మను గ్రంథమును రచియించిరి. కావ్యవస్తువు వడాలి క్షేత్రమాహాత్మ్యము. ఈ గ్రంథ పీఠికయందు జంటకవులలో నొకరైన నం. వేం. అప్పారావుగారిని గూర్చి యిట్లు వ్రాయబడినది.

"నందగిరి వేంకట అప్పారావు. ఈ కవిమాధ్వ బ్రాహ్మణుడు. విశ్వామిత్ర గోత్రుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు ఋక్ శాఖాధ్యాయి. ద్వైతి. తండ్రి వేంకట నరసింహ పండితులు. తల్లి శేషమాంబ. కృష్ణా మండలము గుడివాడ తాలూకా అంగలూరు కరణికపువృత్తి. ఈ కవి చూడామణి క్రీ.శ.1868వ సంవత్సరమున జననమొందెను. చిన్నతనమునందు రెండు చింతల సీతారామ కవిగారి యొద్ద ఛందో లక్షణాదుల నభ్యసింప దొడగెను. కాని అచిర కాలముననే ఆ కవిగారు గద్వాల రాజాశ్రయము వలన అచ్చటి కేగుటచే నంతరాయము కలిగెను. ఈ కవి తన 13వ యేడు నిండని బాల్యము నుండియుఁ గవిత్వరచన కారంభించెను. తొలు

7. ముఖపత్రము. శ్రీమద్రామయణాద్భుతోత్తర కాండము. ఇది గుడివాడ తాలూకా అంగలూరి వాస్తవ్యులగు మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావుగారిచే నాంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడియె. దుగ్గిరాల ప్రబోధినీ ముద్రాక్షరశాలయందు బ్ర. వ. నిరంజన శాస్త్రిగారిచే ముద్రింపఁబడియె. 1911.

8. అడవి సాంబశివరావు - వీరిజీవిత విశేషములకు, చూ. సారస్వత సర్వస్వము. సం. 1. సంచికలు 11.12. రక్తాక్షి – ఆషాఢ శ్రావణ మాసములు. వ్యాసకర్త పెనుమచ్చ సత్యనారాయణరాజు. పుటలు. 83–87.

9. జగన్నాథీయము (వడాలిక్షేత్రమాహాత్మ్యము) - శివవేంకట కవులు. (అడవి సాంబశివరావు, నందగిరి వేంకట అప్పారావు). కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యుడగు నందగిరి వేంకటప్పారావుగారిచే బ్రకటితము. సేతు ముద్రాక్షరశాల. మచిలీ పట్టణము - 1915.

దొ_ల్ల హనుమద్విజయము, మైరావణ నాటకము రచించెను.''10

పై 'కవిజీవిత' వాక్యములనుబట్టి రెంట చింతల సీతారామ కవి కృష్ణా జిల్లా వా_స్తవ్యుడనియు, గద్వాలకు బోయి రాజాశ్రయమును బొందెననియు గ్రహింపనగును.

అప్పారావుగారు తమ గురువుగారైన సీతారామ శాస్త్రిగారు భరత చరిత్ర వ్రాసెనని యద్దానిని గద్వాల రాజున కంకితమిచ్చె ననియు చెప్పి యున్నారుగదా! భరత చరిత్ర నాకు లభ్యము కాలేదు. కాని కవిజనమండన టీకయందీ క్రింది పద్యము భరత చరిత్రలోనిదిగా సీతారామ కవిచే నుల్లేఖింపబడినది.

సుగంధి : నీరదాళినీలకాయ నిర్జితాసురేశ్వరా
సారసాయుధాయుతాభ సద్విలాస సంపదా
తారవాదమౌళి మౌళితార కాంతియు_క్త ప
త్సారసార్ఘ్యపీఠభాగ సత్ర్పభావ కేశవా.
(అజ_న్త పరిచ్ఛేదము. 97వ సూత్రటీక. పుట118)

ఇందలి 'కేశవా' యనునది గద్వాల చెన్నకేశవ స్వామిపేరుగా కాన్పించుచున్నది. భరత చరిత్రగాక గంగాధర భారతీ చరిత్ర యను వేరొక గ్రంథమీ టీకయం దుదాహృతమైనది. అది యెవ్వరి కృతమో తెలియదు.

మ. కమలం గాంచిరి దవ్వుదవ్వులనె
యా గద్వాల ను_త్తుంగ కాం
చన సౌధాంతరభాగ ఖేలన లస
చ్చాతోదరీ కైశ్య పు
ష్ప నవామోద విశేష మోదిత
మరుత్పాళోన్మిళ ద్గంధమా
దనికాయంబు హసద్వధూ నివహ
దంత ప్రస్ఫురజ్జాలమున్.
(అజ_న్త. ప.సూ. 44 పుట 79)

ఇందలి గద్వాల సీతారామ కవి గాంచిన గద్వాలయేగదా! ఈ కృతిగూడ సీతారామ కవిదో? ఇంకెవరిదో?

ద్వితింత్రిణి సీతారామ కవియే రెంట చింతల సీతారామ కవి యనియు, నందగిరి వేంకటప్పారావు గారి గురువనియు, కవిజనమండన టీకయే గాక భరతచరిత్ర మను కావ్యమును జేసి గద్వాల రామ భూపాలున కంకితమిచ్చి సన్మానమునుబొందెననియు పై చర్చవలన తేలిన సారాంశములు. ఇక తేల వలసిన విషయము సీతారామ కవి ఎప్పటివాడు? అనునది.

క్రీ. శ. 1868 వ సంవత్సరమున జననమొందిన నందగిరి వేంకటప్పారావుగారికి సీతారామకవి గారు గురువర్యులుగదా! గురుపు నొద్ద చిన్నప్పుడే ఛందోవ్యాకరణాది లక్షణముల నభ్యసింప అప్పారావుగారు దొరకొనినట్లును సీతారామకవి గారు గద్వాలకు పోవుటచే అప్పారావుగారికి విద్యల నభ్యసింప నంతరాయము కలినట్లునుకురుగంటివారు చెప్పిరి కాని అప్పారావుగారేదోకొంత శిష్యరికము చేయనిదే గురుస్తుతిలో సీతారామ కవిగారిని చేర్చుదురా? అప్పారావుగారు సీతారామకవిగారి వద్ద కొంత విద్యనభ్యసించిరనియే గ్రహింతము. అప్పారావుగారి తొలి రచన మైరావణ చరిత్ర యక్షగానము. దీనిని వారు 1886 లో రచించినట్లు శ్రీ రా. ఉత్తరకాండమునకు 'కవిజీవితమును'11

10. కవి జీవితకర్త. కురుగంటి సూర్యనారాయణశాస్త్రి. విశాఖపట్టణము. గవర్నమెంటు క్వీన్ మేరీస్ ఇండియన్ గరల్స్ హైస్కూలు. సంస్కృతాంధ్ర పండితులు. తేదీ ఏప్రియల్ 1914.

శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము, జగన్నాధీయమును కవియైన నం. వే. అ.గారే స్వయముగా ప్రకటించుటయేగాక పీఠికలను గూడ వ్రాసిరి. తమ జీవిత విశేషములను మాత్రము వారి సన్నిహితులచే వ్రాయించిరి. కనుకనే కవి జీవితము, పీఠిక అని రెండు శీర్షికలు గ్రంథప్రారంభములందు గలవు. శ్రీ. రా. కా. నందు నం. వే. అ. గారి పూర్తి జీవిత చరిత్ర గలదు.

11. కవి జీవితము - అడవి సాంబశివకవి. త్రిపురనేని గోపాలకృష్ణయ్యకవి. తేదీ. 24-12-10. ఈ గ్రంథమునకు అప్పారావుగారు గూడ నొక పీఠికను వ్రాసిరి. దాని తేదీ. 20-10-10

వ్రాసినవారు తెల్పిరి. అనగా క్రీ. శ. 1868 లో బుట్టిన అప్పారావుగారు తమ 18 వ యేటనే మైరావణచరిత్రమును వ్రాసి రన్నమాట.

ఈకవి తన పదమూడవయేడు నిండని బాల్యము నుండియు కవన మల్లుట నారంభించినను 18 వ యేటనే పూర్తి గ్రంథమైన మైరావణచరిత్ర రచించి యుండును. తన 16 వ యేట రెంట చింతల సీతా రామశాస్త్రిగారివద్ద విద్యనభ్యసించినట్లైన ఆకాలము 1884 అగుచున్నది· అప్పటికి గద్వాలయందు రాణీ వెంకట లక్ష్మమ్మగారి దత్తపుత్రుడైన రాజా రామభూపాలుడు పాలన సాగించుచుండెను. ఈయన క్రీ. శ. 1843 లో జననమొంది 1865 లో సంస్థానాధిపతియై క్రీ. శ. 1901 లో మరణిం చెను[13]. కావున సీతారామ కవిగారు క్రీ.శ.1884 లోనో తరువాతనో గద్వాల చేరి రామభూపాలా శ్రయమును, సన్మానమును పొందియుండును. సీతా రామ కవికి 1884 నాటికి 40 సం. ప్రాయమని యనుకొన్నను జననము 1844 అగుచున్నది. 1858 లో బాలవ్యాకరణము వెలువడిన నాటికీతని వయస్సు 14 సంవత్సరములు మాత్రమే. ఆ వయ స్సున సీతారామకవి అథర్వణ కారికలకు టీక వ్రాయుటయు, నద్దానిని నేబదియేండ్లు పైబడిన చిన్నయ సూరివంటి పండిత దిగ్గజము చదివి, బాలవ్యాకరణమున గతిలేక 'మక్కికి మక్కి'గా నెక్కించుకొనెనని చెప్పుటయు సాహసమే గాక మహాపరాధమని చెప్పవచ్చును. బాలవ్యాకరణము నిర్ణీత పాఠ్యగ్రంథమైన తరువాత రెంటచింతల సీతారామ కవి యేపాఠశాలయందో పండితుడుగా బహువారములు పఠించుటచే గాబోలు తన కవిజన మండన టీకయందు బాలవ్యాకరణ వాక్యములనే ప్రదర్శించుచు వచ్చెను. కవిజనమండన గ్రంథ ప్రకాశక విజ్ఞప్తియందు వావిళ్ళ వేంకటేశ్వరులు గారిట్లు వ్రాసిరి.

"ఈ ఉత్కృష్ట గ్రంథరత్నము సమగ్రముగ అస్మజ్జనకులగు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారిచే సంగృహీతమై పదిలపరుపబడి యుండినది" ఈ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు క్రీ. శ. 1832 మొదలు 1899 వరకు జీవించి ఆంధ్ర భాషాభివృద్ధికి తోడ్పడిన గొప్ప సంస్థలలో నొకటియైన వావిళ్ల సంస్థను నెలకొల్పినవారు. వీరనేక పండితులచే సంస్కృతాంధ్ర గ్రంథములకు టీకాతాత్పర్యములు వ్రాయించిరి. అందులో నీ వికృతివివేకటీక యొకటియని యూహించుచున్నాను. సీతారామకవి గ్రంథమును జూచి చిన్నయసూరి తన బాలవ్యాకరణమును కొన్నిచోట్ల సవరించుకొనె నని వఝులవారు చెప్పినమాట కంటె, బాలవ్యాకర ణమును చూచియే సీతారామకవి కొన్ని పట్టుల గ్రహించి యుండునని చెప్పిన దువ్వూరి మాటయే సమంజసముగా నున్నటుల నాకనిపించు చున్నది.

## ఉపయుక్త గ్రంథ సూచి


అథర్వణ కారికావళి–వికృతివివేకము ;
వావిళ్ళ, మదరాసు (1921).

ఆంధ్ర కవుల చరిత్ర–3 భాగములు :
*కందుకూరి వీరేశలింగం పంతులు*
రాజమండ్రి (1917, 1949,1950).

ఆంధ్ర సంస్థానాధీశ్వరులు–సాహిత్యపోషణ :
*ఆచార్య తూమాటి దొణప్ప*, వాల్తేరు(1969).

జగన్నాథీయము :
*శివ వేంకట కవులు*, మచిలీపట్టణం (1915).

తెలుగు వ్యాకరణ వికాసము–2 సంపుటములు :
డా. *బొడ్డుపల్లి పురుషోత్తము*,
గుంటూరు (1969).


12. చూడుడు. గద్వాల చరిత్రము. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము. 3వ సంపుటము.

రమణీయము-బాలవ్యాకరణ సమీక్ష :
*దువ్వూరి వేంకట రమణశాస్త్రి*,
విశాఖపట్టణము (1964).

శ్రీమద్రామాయణాద్భుతో త్తరకాండము :
*నందగిరి వేంకటప్పారావు*, దుగ్గిరాల(1911).

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము-3 :
సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి,
హైదరాబాదు-7.

సారస్వత సర్వస్వము :
సం. 1, సంచి. 11, 12

శ్రీ మూలంపల్లి
చంద్రశేఖరశర్మ

# శుభాశంసనము

శ్రీ గోలి యీశ్వరాఖ్యుని
యీగురు పత్రోచ్చ విపణి యిద్ధర రజత
శ్రీగిరుల భరతదేశ
శ్రీగురు గౌరప్రభాలి సిరి వెదజల్లున్.

ఆది శిలాతతి నఖిల లేఖామృత
స్రవము సంస్తుత మౌచు జాలువార
మును భూర్జపత్రాళి ముగ్ధ దివ్యాంగనా
రాగరంజిత ధాతురాగ మొలుక
తామరాకుల పైన తమిదీర కవిరాజు
కాళిదాసుని రస్య కవిత యొలుక
ఉత్తాల తాలైక పత్రోప్త బీజాక్ష
రాల సంస్కృతపు సర్వస్వ మొలుక

నేటి రాష్ట్రీయ విజ్ఞాన పాటవాన
పత్రనిర్మాణ ప్రావీణ్య పటిమ వెలయ
గోలి యీశ్వరు పత్రోచ్చ గురుతరాఢ్య
విపణి రజతోత్సవమ్మున వెలసె నేడు.

పత్రము విశ్వరూపమయి ప్రాకట యీశ్వరు పుణ్యపణ్య సు
క్షేత్రఫలమ్మె విద్వదనుచింతనమాన్య మనః ప్రవృత్తి సత్
పాత్ర కవీశ కోశ పరివర్ధిత వైభవ రాజతోత్సవ
శ్రీ త్రితయైక నిత్యసుఖశేవధి, నీకగు నిత్యభాగ్యముల్.

ఇందిరావాస కమలమై యీశ్వరయ్య
విపణి శతపత్ర దళశత విమలపత్ర
ములను పుష్పింప జేయుచు వెలయుగాత
పద్మపదపద్మముల నిత్య పద్మ మగుచు.

శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రి

# శు భా శీ స్సు లు

శ్రీవేంకటాద్రీశు శీతలాపాంగంబు
విజయేందిరకు వశ్యవిద్యగాగ
శ్రీశైలనాథుని స్నిగ్ధదయాదృష్టి
యణిమాది సిద్ధుల నలరజేయ
భద్రాద్రిరాముని భవ్యకృపాదృష్టి
విశ్వసౌభ్రాత్రంబు వెలయజేయ
లేంబాలవాటీశు లీలావలోకన
మతిలోక శివదమై హాయిగూర్ప

అమలగుణధామ ! గోలివంశాబ్ధిసోమ !
సర్వజనగణ్య సజ్జనసఖ్యసౌఖ్య
ఈశ్వరాభిధ నీకివే హితమితమ్ము
లాశిషము లిత్తు నందుకొ మ్మాదరమున.

జలజాతభవు డొసంగుత
విలసిత సుశ్రీకమగుచు విశ్వహితమ్మై
ఫలియించి యెసగు నాయువు
కుల భూషణ యీశ్వరాఖ్య కోవిదవినుతా !

పట్టినదెల్లను బంగరు
ముట్టిన దది యెల్ల నీకు ముత్యమ్మనుగా
గట్టి క్రియాసిద్ధిం గను
మట్టిట్టనరాక యితరు లగ్గింపంగన్.

విద్యా ప్రచార మొనరిచి
సద్యశమును గూర్పజాలు సాధన మగుటన్
సద్యఃఫలదమ్మగు నీ
యుద్యోగ మ్మీశ్వరయ్య ! యొప్పుత మెపుడున్.

శ్రీ తిగుళ్ళ వేంకటేశ్వరశర్మ | శ్రీ శుభాశాసన ముద్రాకరము

## శ్రీ శుభాశాసన ముద్రాకరము

శ్రీ తిగుళ్ళ వేంకటేశ్వరశర్మ

శ్రీదేవి తానె పైచేయి గావలె నంచు
        తన మేను వేయియింతలుగ బెంచ
శ్రీవత్స లాంఛన మ్మేవంకయును దానె
        కనిపించ వలెనంచు బెనగులాడ
కౌస్తుభమణి తానె గద్దె యెక్కఁగ నెంచి
        కాంతులు విరజిమ్మి గంతులిడగ
వనమాలయును తన పాలె యెక్కువగాగ
        పుష్పాదుల్ వెదజల్లి పొలుపుమీర
ఏమి యీ స్పర్ధయంచు మహేంద్ర నీల
భాసురమ్మైన సువిశాల వక్షమింక
ద్విగుణముగ బెంచినట్టి యా విష్ణుమూర్తి
గోలి యీశ్వరయ్యను సత మేలుగాక.

పైకి కలమేమి యెత్తక భారతమ్ము
వ్రాసి పత్రాలు నింపుచు వ్యాసమునికి
మోదమును గూర్చినట్టి యా మోదకాశి
యెపుడు రక్షించు నీ గోలి యీశ్వరయను.

తీరు తీరైన యెన్నొ వ్యాపారములను
చేయువారుండవచ్చు విశేష మేమి ?
సార్థవాహ నామముగదా సార్థకమ్ము
గోలి యీశ్వరయ్య యెడ పత్రాలవలన.

పత్రి పుష్ప ఫలాదులే పరమ హితము
దేవదేవున కనుమాట తెల్లమేని
పుత్రపౌత్రాభివృద్ధిగా "పత్రహితుని"
గోలి యీశ్వరయ్యను నాత డేలుగాత.

శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రి | మధూక మాలిక

శ్రీ నిగమార్థతత్త్వ పరసేవధియై వెలుగొందువాఁడు స
న్మౌని హృదంతరంబు లను మాళిగలందు వసించువాడు భ
ద్రాననమూర్తియై గిరిజ కర్ధశరీర మొసంగినట్టి యా
జ్ఞాన మహేశుఁ డీశుఁ డిట సాదర వీక్షణ నీశుఁ బ్రోచుతన్.

ఎవ్వాని గృహమున నిందిరా సుందరి
యోర్పున విహరించు నేర్పు గనియె
సురలోక గణముల సుస్థిర మహిమను
నెవ్వాని పూజన మెఱుక పరచె
న్యాయసమ్మతమైన యర్థార్జనంబెగా
సకలార్థదంబంచు చాటగలిగె
పండితామోదమౌ ప్రాభవ మొప్పార
పురుషార్థఫలముల పుష్టిఁగాంచె

అట్టి గుణమణి గోలివంశాబ్దిసోము
నీశ్వరయ్యను సరగున నీశ్వరుండు
భోగభాగ్యాల సుఖముల మోదమంది
వరలు నట్లుగఁ జేయుత పరమకృపను.

ప్రియవచనంబుల దానము
దయ నిండిన హృదయసీమ తత్త్వజ్ఞతయున్
నియమాచార నిరూఢత
మెయిమెయి సాధించినట్టి మేటి యితండౌ.

ధనముఁ గూర్చెడి వేళల దానధర్మ
కార్యజాలంబు లందున ఘనుఁ డితండె
యనుచు నార్యులు వాకొన నధిక దీప్తి
వెలుగు దినకరు విధమున పేరుగాంచె.

శ్రీ ముదిగొండ శివప్రసాద్

# మంగళాశాసనమ్

దైవ భక్తి ధర్మ రక్తి
దర్పణ సదృశ ప్రవృత్తి
అన్నా నీ సహృదయ
మ్మది 'తెల్లనికాగితము'.

సిరులకు, చదువుల తల్లికి
సహజ వైర మను నానుడి
త్రిప్పి వ్రాయవలసి వచ్చె
నిప్పట్టున నిను జూచి.

ఈశ్వర పాదార్చకుండు
ఐశ్వర్య సమన్వితుండు
గోలి ఈశ్వర ప్రమథుని
పాలించెడుగాత శివుడు.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు | శుభమ్

ఉమతో సుధాంశు మౌళియు,
రమతో వనమాలియును, సరస్వతితోడన్
కమలాసను డోముదు రన
యము చల్లగ గోలియీశ్వరయ్య శ్రేష్ఠిన్.

చిట్టెడు గింజలు చల్లిన
బుట్టెడు ధాన్యంబు పండు పోల్కిని, నీచే
పట్టినది కలసి వచ్చుత
ఎట్టి యెడమడుగులు లేక ఈశ్వరగుప్తా!

నీదు గృహము దోసపాదట్లు పచ్చగా
పూచి పొలిచి పండ్లు కాచుగాత,
దానధర్మములను తనిసి దేవతలు నీ
యిష్ట సిద్ధి నిత్తు రీశ్వరయ్య!

# సారస్వత వ్యాకరణం

ఈ వ్యాసంలో సూత్రాల ఎదుట ఇచ్చిన పాణినీయ సూత్ర సంఖ్యలలో కొన్ని అనివార్యంగా తారుమారయినవి. వాటికి సవరణలు దిగువ ఇచ్చినాము. పాఠకులకు కలిగే అసౌకర్యానికి క్షంతవ్యులము.

—*సంపాదకులు.*

| పుట | సారస్వత సూత్రం సంఖ్య | పాణినీయం ఉండవలసినది |
|---|---|---|
| 64 | 2-19 | 6-1-125 |
| ,, | 2-22 | 6-1-125 |
| ,, | 2-38 | 8-4-47 |
| ,, | 2-39 | 8-4-46 |
| 65 | 2-48 | 8-3-19 |
| ,, | 3-11 | 8-4-42 |
| ,, | 3-17 | 7-3-102 |
| ,, | 3-30 | 7-3-114 |
| 66 | 3-56 | 7-1-89 |
| ,, | 3-57 | 7-1-70 |
| ,, | 3-58 | 7-1-80 |
| ,, | 3-59 | 7-1-81 |
| ,, | 3-65 | 6-4-12, 13 |
| ,, | 3-66 | 6-4-134, 137 |
| ,, | 3-68 | 6-4-138, 6-3-138 |
| ,, | 3-69 | 6-3-93, 94, 95 |
| ,, | 3-85 | 6-4-131 |
| 67 | 4-17, 18,19 | 6-1-112 |
| ,, | 4-21 | 7-3-44 |
| ,, | 4-22 | 7-4-15 |

| పుట | సారస్వత సూత్రం సంఖ్య | పాణినీయం ఉండవలసినది |
|---|---|---|
| 67 | 4-40 | 8-2-72 |
| ,, | 4-48 | 8-2-66, 8-3-15 |
| ,, | 4-52 | 8-2-74 |
| 68 | 4-75 | 2-4-18 |
| ,, | 5-5 | 1-4-49, 2-3-2, 1-4-54... |
| ,, | 6-9 | 5-3-96 మొ. |
| ,, | 6-10 | 5-1-115 |
| 69 | 6-13 | 5-2-115 |
| ,, | 6-16 | 4-1-115 |
| ,, | 6-24 | 7-2-115 |
| 71 | 9-45 | 8-2-27 |
| ,, | 9-47 | 8-2-26 |
| ,, | 9-53 | 7-3-101 |
| ,, | 9-65 | 7-4-50 |
| ,, | 9-68 | 3-4-108 |
| ,, | 9-69 | 3-4-109, 110 |
| 72 | 9-131 | 1-2-12 |
| ,, | 9-153 | 6-3-66, 67 |
| 74 | 10-49 | 3-3-117 |
| ,, | 10-73 | 6-1-58, 59 |